శ్రీ ర స్తు

# రాఘవపాండవీయము.

కవిభావప్రకాశికాఖ్య వ్యాఖ్యాన

స మే త ము

వ్యా ఖ్యా త:

విద్వాన్. ఈ - భాష్యకాచార్యులు

రెండవ కూర్పు

ప్రకాశకులు :

ఆర్. వేంకటేశ్వర్ అండు కంపెనీ

ఆనంద ముద్రణాలయము

మద్రాస్

# రాఘవపాండవీయము.

టీకాతాత్పర్యసహితము.

శ్రీవేంకటేశాయ నమః.

# ఉపోద్ఘాతము.

—•••—✱—•••—

ఆన్ధ్రభాషాయోషకా కల్పకల్పంబులయిన కావ్యరత్నంబులయం దీరాఘవపాండవీయం బొక్కండగు. కర్నూలుమండలములోని యాకువీడు పురాధినాథుండగు పెదవేఙ్కటాద్రిభూపుఁడు పింగళి సూరనార్యునిఁ దన యాస్థానంబునకు రావించి ;

ఉ. భీమనతొల్లి చెప్పెననుఁ బెద్దలమాటయె కాని యందు నొం
డేమియు నేయెడన్నిలుచుఁ బెవ్వరుగాన రటుండనిమ్ము నా
నామహితప్రబంధరచనా ఘనవిశ్రుతి కెక్కుఁగల్గుటన్
నామదిఁ దద్వ్యయార్థకృతినైపుణియుం గలదంచు నెంచెదన్.

అని సన్మానపూర్వకంబుగాఁ బ్రేరేచి యీద్వ్యర్థికావ్యమును రచియింపించెను.

ఈ పింగళి సూరనార్యుఁడు విజయనగర సామ్రాజ్యమునశించి దేశమంతయును చిన్న చిన్న మాండలిక ప్రభువుల కధీనమయియున్న కాలమున, నంద్యాల ఆకువీడు మొదలుగాఁగల సంస్థానాధపతుల నాశ్రయించి గ్రంథముల రచించుచునుండె.

ఇతని రచితమగు ప్రభావతీప్రద్యుమ్నములోని.—

మ. జనముల్మెచ్చఁగ మున్ రచించితి సదంచద్వైఖరిం గారుడం
బును శ్రీరాఘవపాండవీయముఁ గళాపూర్ణోదయంబున్ మఱిం
దెనుఁగుం గబ్బములెన్నియేనియును మత్పిత్రాదివంశాభివ
ర్ణన లేమిం బరితుష్టి నాకవి యొనర్పంజాల వత్యంతమున్.

పద్యము చేత నితఁడు గారుడపురాణము, రాఘవపాండవీయము, కళాపూర్ణోదయము, ప్రభావతీ ప్రద్యుమ్నము, మఱికొన్ని గ్రంథములు నురచియించి యున్నాఁడని తెలియవచ్చుచున్నది. గారుడ మితనిచే రచింపఁబడిన ప్రథమప్రబంధము గా నగును గాని, యయ్యది రాఘవపాండవీయమునఁ జెప్పఁబడినది గాదు. ప్రభువు తన్నుఁ గూర్చి "నానామహితప్రబంధరచనాఘనవిశ్రుతి నీకుఁగల్గుటన్" అని యుగ్గడించినట్లు కవియే చెప్పికొనియుండుటంబట్టి, యీద్వ్యర్థి కావ్యంబునకు ముందుగా నితఁడు ప్రబంధరచనగలవాఁడనియుఁ దత్ప్రబంధము పైపద్యము ప్రకారమునకు మొంపటిదగు గారుడమనియు వృథముగాఁదలపోయవగును. మఱియు నా గారుడ మిప్పుడు లభించుటలేదు. పైపద్యము క్రమము ననుసరించి రెండవదిగా రచియింపఁబడిన దీ రాఘవపాండవీయమును దీనికి వెనుకటిది కళాపూర్ణోదయమును గడపటిది ప్రభావతీ ప్రద్యుమ్నము నగును. ఈ వెనుకటి కావ్యములు రెండును అనఁగా కళాపూర్ణోదయ ప్రభావతీప్రద్యుమ్నములు రెండును గథాచమత్కృతుల కనువులయిన లలితపదగుంభనములను రసప్రౌఢిమను జెంది వినువారి వీనులకు విందులుగొలుపు ప్రౌఢకావ్యములు.

ఈ రాఘవపాండవీయమన్ననో: యిరువదినాల్గువేల గ్రంథసంఖ్యనుగల రామాయణముయొక్కయు, లక్ష యిరువదైదువేల గ్రంథసంఖ్యనుగల భారతముయొక్కయు ముఖ్య గాథలనుమాత్రము ఆఱువందలుగల గ్రంథసంఖ్యయం దిముడించి వ్రాసిన ద్వ్యర్థికావ్యము. ఇందలి రామాయణభారతంబుల యందుఁగల యనేక యుపకథలను వదలిపెట్టుటయేకాక, రామాయణంబునందుత్తరకాండను భారతంబున సౌప్తికాది పర్వంబులను వొలఁగించి సంక్షేపముగా వ్రాయఁబడెను. ఈ గ్రంథమునందు కవియొక్క ప్రతిజ్ఞాదికములోని.

"కం. ఒకకథ వినియెడి తఱి వే
ఱొకకథపై దృష్టియిడిన నొకయర్థము దోఁ
పక పోవుఁగాన నేకా
ర్థకావ్యమెట్లట్ల వినఁగఁదగు నొకటొకటిన్.

అనిన పద్యానుసారము రామాయణ పరముగానో భారతము పరముగానో

నన్వయించుకొని చదువునప్పుడు కథ సంక్షేపరామాయణముగానో సంక్షేపభారతముగానో, యేర్పడును. ఈ పద్ధతి ననుసరించియే యేనును గ్రమముగా మొదటి వ్యాఖ్యానము రామాయణ పరముగాను రెండవది భారత పరముగాను నుండునట్లు నిర్వహించినాఁడను.

"రామాయణ భారతములు సంక్షేపింపఁ బడెను." అనిన యపవాదము కథాసందర్భముల ననుసరించినదేగాని, ఇది యుదారము లయినకావ్యధర్మములకుఁబుట్టినిల్లు. ఇట్టియపవాదమునుండి యాంధ్రికవీంద్రుల యందొక్కఁడేనియుఁ దప్పినవాఁడు ప్రాచీనుఁడులేఁడు. సందర్భశుద్ధింగూర్చి యిక్కవి చంద్రమునిఁ దిక్కకవినాథునకుఁ దీటుగా జెప్పనగును. ఆంధ్రగ్రంథములను జక్కఁగాఁబరిశోధించిన పండితవర్యులలో-ఈరాఘవపాండవీయకవింగూర్చి.

బ్రహ్మశ్రీ-బ. సీతారామాచార్యులు - తనయాంధ్రశబ్దరత్నాకరమునందు.-

"ఇతఁడు మిగుల దొడ్డకవి. వెన్నెలగంటి సూరన యీయనకు ముంగలి వాఁడుగనుక యీయనకుఁ బింగళిసూరన అనిపేరుగలిగినది. ఇతఁడు క్రమముగా గరుడపురాణమును, రాఘవపాండవీయమును, కళాపూర్ణోదయమును, ప్రభావతీప్రద్యుమ్నమును, మఱికొన్ని కావ్యములను రచించినవాఁడు. ఇందు రెండవది రాఘవపాండవులచరిత్రములను శ్లేషభంగిందెలుపుచు సులభశైలిచే శోభిల్లుచున్నది.........భాషాశ్లేషగాఁ గావ్యము చెప్పువిధమునకు నితఁడు మార్గదర్శిగానున్నాఁడు. వెనుకటికవులలోపల నితఁడు సర్వతోముఖచాతుర్యుఁడని చెప్పనొప్పును."

అనిపరిగణించి గ్రంథకర్తల తరగతులలో నితనిరెండవ తరగతిలోని వానినిగా గ్రహించెను.

బ్రహ్మశ్రీ-రాయబహద్దరు - కం-వీరేశలింగము పంతులవారు తమ కవిజీవితములో—

"రాఘవపాండవీయము క్లిష్టాన్వయములులేకుండ మృదుమధుర సులభపదములతో రామాయణభారతార్థములు వచ్చునట్లుగా, రచియింపఁబడిన శ్లేష

కావ్యము ఇంతటి సులభశైలితో సంపూర్ణశ్లేషకావ్యమును రచియించుట మఱొకరికి సాధ్యముగాదు.”

“తిక్కనసోమయాజికి తరువాత నింతప్రౌఢముగాఁ గవిత్వముచెప్పిన తెనుఁగు కవి మఱియొకఁడులేఁడు.”

అని తమయభిప్రాయమును వెల్లడిచేసిరి. ఇందు మొదటఁ జేర్కొన్న యాచార్యులవారు చేసిన పరిశోధనము నైఘంటికములకు నేగాని పంతులవారి వలె జీవిత విమర్శకులకుఁగాదు. కాఁబట్టి,సూరకవిని రెండవతెగలోఁ బడఁద్రోచ్చినయాచార్యులయభిమతముకంటెను సోమయాజికి వెనుకతత్తుల్యునిగా సూరనార్యుని భావింపవలయు ననుపంతులవారి యభిమతమే శ్లాఘాపాత్ర మగును.

సూరపరాజీగ్రంథమునం దవలంబించిన ప్రౌఢము లగుచమత్కారధర్మములలో మిగులగణనీయమగునది, తత్తత్కథాసందర్భములయందుఁ బోడసూపు కథానాయకులను దుల్యబలవిక్రమపౌరుషాదుల నుద్దీపించువాంఛనే మిగుల జాగరూకతతోఁ బర్యాలోచించి ఘటించుట. రామాయణమునందలి యయోధ్యకును భారతమునందలి వారణపురికిని, రామాయణమునందలి దశరథునకును భారతమునందలి పాండురాజునకును, రామాయణమునందలి నీలునకును భారతమునందలి ధృష్టద్యుమ్నునకును, రామాయణమునందలి సుగ్రీవునకును భారతమునందలి కర్ణునకును, రామాయణమునందలి యాంజనేయునకును భారతమునందలి భీమునకును, ఇట్లే యన్నిచోట్ల నీనియమమవిచ్ఛిన్నముగా గోచరింపఁగలదు. ఈద్వ్యర్థికావ్యమునకు వెనుకటికాలములయందు రచియించిన హరిశ్చంద్రనలోపాఖ్యానము, యాదవరాఘవపాండవీయము, ధరాత్మజాపరిణయ మిత్యాదిశ్లేషకావ్యము లనేకధర్మములయం దిద్దానికి వెనుకటివేయగును.

“వెన్నెలగంటి సూరనకు వెనుకటివాఁడగుటచే నితని పింగళిసూరన - (వెనుకటి - సూరన)యందురు.” అనెడిప్రతీతిసహేతుకముగాదు. పింగళియను నదికృష్ణజిల్లాలోని యొకగ్రామము. ఇతని పెద్దలందఱచ్చోట నుండినవారు.

కాఁబట్టి, యితనియింటిపేరు 'పింగళివారు' అనివ్యవహరింపనయ్యె. ఇతఁడు తనప్రభావతీ ప్రద్యుమ్నములో తనవంశమునకు మూలపురుషుండయిన గోంకనామాత్యుని "గోంకనామాత్యుఁడుస| ద్భోగక్షేత్రస్వామ్యస | మాగతపింగళిపురాంకుఁడైయతఁడొప్పెన్" అని చెప్పికొని యుండం బట్టి 'పింగళి' యన్నదితనిగృహనామమే యగును.

ఈ రాఘవపాండవీయకృతికిఁ గృతిపతి యగునార్వీటిపెదవేంకటాద్రిధరణీధవుని తాత యిమ్మావనీశుఁడు గజపతిసేనలతోఁ బోరాడి రాజమహేంద్రవరమును జయించిన ట్లీక్రిందిపద్యమువలనఁ దెలియవచ్చుచున్నది.

కం. రాజమహేంద్రవరాధిపు
రీజైత్రవిచిత్రములఁ బరిభ్రాజితుఁడై
యాజిఘనుండాయిమ్మమ
హీజాని ప్రసిద్ధిఁగాంచె నెంతయుమహిమన్.

ఈ విజయము కృష్ణదేవరాయలు రాజమహేంద్రవరమును దాడిపెట్టినపుడతనిసహాయులలో నొక్కండగు నీయిమ్మమహీజానివలననయి యుండవచ్చును. ఈయంశమునుగూర్చినసత్యమును కృష్ణరాజవిజయమను గ్రంథములోని

"సీ. కోటలుదుర్గముల్ఁ గొనుచుదోఃపటుబల
ధాటిచేమించునార్వీటివారు
గీ. ప్రతిదినంబును ఘోరమౌరణమొనర్ప
నిలిచిపోరాడె గజపతిఁబలములపుడు."

అనుపద్యముస్థాపించుచున్నది కాఁబట్టియిమ్మభూమిపుఁడు కృష్ణదేవరాయలకు సమకాలికుఁడు. కృష్ణదేవరాయలకీవిజయనగర విజయము క్రీస్తుశకము. 1515వ సంవత్సరమునందుఁ గలిగెను. ఈ కాలంబునందలి యిమ్మరాజునకు నితనిమనుమనికిమధ్య 40 సం॥ గళితములయి యున్నను, పెదవేంకటాద్రిరాజు తప్పక క్రీస్తుశకము 1555వ సంవత్సర ప్రాంతముననున్నవాఁడుగా భావింపవచ్చును. గనుక పింగళి సూరపరాజును ఆకాలమునందలివాఁడే యనఁదగును.

ఇదివరకు ముద్రితమయియున్న రాఘవపాండవీయగ్రంథమును చూచినవారందఱి పాదోత్పన్నములను బదభ్రంశములను నక్షరవ్యత్యయంబులను గాంచి యిట్టియుద్గ్రంథమున కీయవస్థ తటస్థించెగా! యనివగపుపాల్పడకుండరు. ఆయ్యదిపండితులే తముల నేచాలినంతశ్రమంపఱచుచుండును. అందలి యసమగ్రమగు వ్యాఖ్యయునంత ప్రయోజనవంతముగఁ జూపట్టదయ్యె. కావుటంజేసి చూచువాండ్ర కానందము సంధిలునట్లు మూలమును జక్కఁగా సంస్కరించినాఁడను. మఱియును వ్యాఖ్యయంగిట్టిప్రౌఢగ్రంథములకు లక్షణలక్ష్యములతో బ్రదర్శింపవలయునంతరు లనేకములుగలవు. అట్టివివైదుష్యవిభూషితులగు విబుధవర్యుల కానందదములగును గాని వారు విద్వద్వర్యులగుటచే నివలని ప్రయోజనము నిరీక్షింపరు. మఱియునట్టివివరణము సామాన్యులకెంతయు వలసినదిగాదు. ఇంతేగాక, కవియొక్క ముఖ్యాశయము రామాయణభారతార్థములకు రెంటికీగ్రంథము విషయముగావలయునని యేర్పడుటంబట్టియు, పండితజనైకవేద్యంబగు నీప్రౌఢగ్రంథము సామాన్యజన సముదాయంబునకును బ్రయోజనంపడుటకును బర్యాలోచించి ప్రతిపదార్థతాత్పర్యములను సమగ్రములుగ తేటమాటలతో వ్రాసినాను. అత్యంతావశ్యకములని తోచినచోట్ల లక్షణంబులను వివరించి లక్ష్యములను సైతము దెలిపియున్నాను. అన్నివిధంబులను దీనిపరిష్కృతాకృతింగూర్చి బాగోగుల నిర్ణయించుపనిచదువరులదగుటంబట్టి యీగ్రంథరాజముంగూర్చినప్రశంసనన్నుసరించినదిగాదు.

ధీమంతులకే ప్రమాదంపాటు సహజంబనుచో నావంటివానికది సర్వసాధారణము. కాఁబట్టి మన్మిత్రులు సదయహృదయులు ఇందలిలోపములందెలిపినచో కృతజ్ఞతాపూర్వకముగా నంగీకరించి వీలుగలిగినప్పుడుపయోగపఱచికొనెద.

ఇట్లువిజనవిధేయుఁడు,

ఎ. వి. నరసింహాంపంతులు.

# వి ష య సూ చి క.



శ్రీ ర స్తు.

# రాఘవపాండవీయము.

కవిభావప్రకాశికాఖ్య వ్యాఖ్యాన సహితము.

## పీఠిక.

---

శా॥ శ్రీతోఁ బుట్టి సుధామధుద్రవముతోఁ గ్రొజ్జేనొందు పుష్పంబు
భాతారుణ్యమెలర్పఁ గాముడుచుపంపాహేమకూటాశ్రయప్రో
ఖ్యాతబ్రహ్మము ప్రోచుఁ గావుత విరూపాక్షాహ్వయంబాకువీ
టీతిమ్మప్రభువేఙ్కటాద్రిహృదయాంకటీకంబు లోకంబులన్ ॥

### వ్యాఖ్యాన పీఠిక.

శ్రీపుండరీక వీరుచ్ఛంపావిద్యోతమానతనురేషః ।
గోవిందకాలమేఘశ్శమయతు తాపం కటాక్షధారాభిః ॥

నిగూఢం సూరనార్యస్యసూక్తేర్భావం ప్రకాశయన్ ।
కరోతి భాష్యకారాఖ్యః కవిభావప్రకాశికామ్ ॥

అవతారిక. పూజ్యుఁడగు పింగళి సూరనార్యకవివర్యుఁడు రాఘవపాండవీయమను ద్వ్యర్థికావ్యము, ఆకువీటి తిమ్మప్రభున కంకితముగా రచించువాఁడై 'మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని శాస్త్రాణి ప్రథీయన్తే' అను శిష్టాచారముంబట్టియు, నిర్విఘ్నముగా గ్రంథము కొన సాఁగఁగలందులకును గ్రంథాదియందు మంగళమాచరింపఁబూని, యదియు;

నాశీర్నమస్క్రియా వస్తునిర్దేశరూపమున ము త్తెఱంగగుటనందుఁ బ్రథమో పాత్తమగు నాశీరూపమంగళ మాచరించుచున్నాఁడు.

అర్థము. శ్రీతోన్ = లక్ష్మీదేవితో, పుట్టి = జనించి, సుధామ ధుద్రవములోన్ = అమృతమనెడి మకరందరసముతో, చెన్నొందు పుష్పం బు = ప్రకాశించునట్టి పూవును [చంద్రుని] శోభాతారుణ్యము = కాంతి యొక్క వయోభావము, ఎలర్పఁగాన్ = ఒప్పఁగా, ముడుచు = శిరమున ధరించునట్టియు, ఆకువీటి తిమ్మప్రభు వేంకటాద్రి = ఆకువీటి తిమ్మ రాజకుమారుఁడగు వేంకటాద్రియొక్క, హృదయాటికంబు = మనస్సున వర్తించునట్టిదియు, విరూపాక్షాహ్వయంబు = విరూపాక్షుఁడను పేరుగల, పంపాహేమకూటాశ్రయ = పంపాతీరమందలి హేమకూట పర్వతము స్థానముగాఁగల, ఖ్యాతబ్రహ్మము = ప్రసిద్ధమగు పరబ్రహ్మము, లోకం బులన్ = లోకులను, ప్రోచున్, కావుతన్ = రక్షించునుగాక.

తాత్పర్యము. చంద్రునిశిరమునఁ దాల్చినట్టియు, ఆకువీటి వేఙ్కటాద్రి రాజుచే సదాధ్యానింపఁబడు చుండునట్టియు పంపాహేమకూటమునఁగల విరూపాక్షుఁడను పరమశివుఁడు లోకుల రక్షించుఁగాక.

ఇటఁ బుష్పశబ్ద స్వారస్యమునఁ జంద్రుఁడనుట సూచింపఁ బడెను. పుష్పము వికాసముగలది. పుష్పవంతులు, వికాసముగలవారు, సూర్యచంద్రులు. కాఁబట్టి పూవునకును జంద్రునకును సమానార్థము నిచ్చు పుష్పశబ్దము ప్రయోగింపఁబడెను.

శ్రీతోఁబుట్టియనుటచే సౌందర్యమును, సుధామధుద్రవముతోఁ జె న్నొందు ననుటచే నాహ్లాదకరత్వమును జంద్రునకుఁ గలవని వ్యంజితము.

ఖ్యాతబ్రహ్మము - చతుర్ముఖ ఋత్విగ్విప్రవాచకంబగునపుడు పుంలిం గమును, తత్త్వతపోవేద యోగవాచకమగునేని ముపర్ణకాంతమునగును.

కావ్యాదిని శ్రీకారము సర్వదోషములఁ బోనడంచి సర్వశుభం బుల నిచ్చును. "పదపడి శ్రీకారము కృతి, మొదలనిలచి దోషపుంజము

నడంచిశుభం, బొదవిందుఁ బరుస మినుకును, గదిసి సువర్ణంబు సేయుఁ గరణిఁ ధరణిఁ."

కావ్యాదిని మగణము శుభప్రదము. "మోభూమి స్త్రిగురుశ్శుభం వితను తే" కేదారుఁడు. "అథర్వవేదముఖంబగు మగణంబు వసుమతీదేవ తాకంబుగాన శుభప్రదంబు" అప్పకవి.

శార్దూల విక్రీడితవృత్తము.

"సారాచార విశారదా యినయతిఁ శార్దూల విక్రీడితాకారంబై మసజమ్ముల్ లిమ్ముగ సతాగ ప్రాప్తమై చెల్వగుఁ" అనిలక్షణము. సులక్షణ సారము

శా. శ్రీచన్గొండలు రెండునండఁగొనివాశిసింబేర్చుచుఁ భక్తి సా
మీచీన్యామల పెద్ద వేఙ్కటనృపోశ్నీలన్మనశ్చాతక
వ్యాచిక్రింసకుఁ గైవసంబయి సదోదంచత్కృపావృష్టిస
ధ్రీచీనంబగు కృష్ణమేఘము జగత్ప్రీతిం గడుం జేయుతన్. 2

అ. శ్రీ = లక్ష్మీదేవియొక్క, చన్గొండలఁ = చన్నులను నట్టికొండలను, రెండుఁ = రెంటిని, అండఁ, కొని = ఆశ్రయముగా గ్రహించి, వాసిఁ = గొప్ప తనముచే, పేర్చుచుఁ = అతిశయించుచు, భక్తి = భక్తియొక్క, సామీచీన్య = యుక్తతచే, అమల = నిర్మలుఁడైన, పెద్దవేఙ్కటనృప= పెద్దవేంకటరాజుయొక్క, ఉన్మీలత్ = వికాసముచెందుచున్న, మనః, చాతక = మనస్సనునట్టి చాతకపక్షియొక్క, వ్యాచిక్రింసకుఁ = గమనేచ్ఛకు, కైవసంబయి = లోఁబడి, సదా = ఎల్లప్పుడు, ఉదంచత్ = ఒప్పుచుండు, కృపావృష్టి = కరుణారసమనెడి వర్షముతో, సధ్రీచీనంబగు = కూడియుండునట్టి, కృష్ణమేఘము = కృష్ణుఁడనెడి నల్లని మేఘము, కడుఁ = మిక్కిలి, జగత్ప్రీతిఁ = లోకములకుఁ బ్రియమును, చేయుతఁ = చేయునుగాక.

తా. శ్రీకృష్ణుఁడనెడి కృష్ణమేఘము తనదయారసవర్షముతో నీలోకములకుఁ బ్రియము సేయుఁగాక.

అండఁగొని యనుటచేఁ భగవంతునకు లక్ష్మీవక్షోజము లాధారభూతములని తెలియవచ్చుచున్నది. కాఁబట్టి లక్ష్మీపురుష కారత్వము గార్యప్రదమగు ననుట సూచితము.

కృష్ణమేఘమనుటలోఁ గృష్ణపదస్వారస్యముచేఁ గృష్ణుఁడను నట్టి కృష్ణమేఘమను శ్లిష్టరూపకమెంతయు సమంజసము.

వ్యాచిక్రింసకుఁ = 'క్రముపాదవిన్యాసే' యనుధాతువువలన, క్రమితుం + ఇచ్ఛా = చిక్రింసా అనియు, వి+ఆఙ్ + అను నుపసర్గలుచేరుటచే వ్యాచిక్రింసాయను రూపము నిష్పన్నమయ్యెను.

అలం - రూపకము.

శా. లోకత్రాణరతిం దదాదిమమహీలోకప్రవేశోత్కభా
షాక్లృప్తప్రథమద్వితీయపదగుంజన్మంజుమంజీరగ
ర్జాకల్పామలరామభారతకథాసర్గంబుల మించువా
ల్మీకివ్యాసులఁ గొల్చెదం దదుభయశ్లేషార్థసంసిద్ధికిఁ. 3

అ. లోకత్రాణరతిఁ = లోకములయొక్క రక్షించుటయందలి యాసక్తిచేత, తదాదిమ..... సర్గంబులఁ — తత్ = ఆసరస్వతియొక్క, ఆదిమ = మొదటిదగు, మహీలోకప్రవేశ = భూలోకప్రవేశమునందు, ఉత్క=ఉత్సాహవతియైన, భాషా=సరస్వతీదేవిచే, క్లృప్త=ఏర్పఱుపఁబడిన, ప్రథమ, ద్వితీయ, పద=(ఆమెయొక్క) మొదటి, రెండవపాదముల యందు, గుంజత్=అవ్యక్తమధురముగా ధ్వనించుచున్న, మంజు = మనోహరమైన, మంజీర = అందెలయొక్క, గర్జా = ధ్వనితో, కల్ప=సమానమైన [ఈషదసమాప్త్యర్థమునఁ గల్పప్రత్యయమువచ్చెను.] అమల = కసటులేని, రామభారత కథాసర్గంబులఁ = రామకథయొక్కయు, భారతకథయొక్కయు సృష్టులచే, మించు = అతిశయించు, వాల్మీకివ్యాసులఁ =

వాల్మీకిమహర్షిని, వ్యాసమహర్షిని, తదుభయ...సంసిద్ధికిన్ - తత్ = ఆరామాయణ భారతములనునట్టి, ఉభయ=రెంటియొక్క, శ్లేషార్థసంసిద్ధికిన్ = శ్లేషార్థములు సిద్ధించుటకై, కొల్చెదన్ = సేవించెదను.

తా. సరస్వతి భూలోకమునకువచ్చుటచే నామెపాదములయందలి యందెల చప్పుడా యను లాగుననుండు రామాయణ భారతకథలను జెప్పిన వాల్మీకివ్యాసుల నారెండుకథల శ్లేషార్థము సిద్ధించుటకొఱకు సేవించెదను.

ప్రథమద్వితీయపద అనుచోట మొట్టమొదటఁగుడికాలిడుట శుభప్రదమగుటచేఁ గుడియెడమ కాళ్లని గ్రహించునది.

మంజీర-మంజు రుచ్యం ఈరయితీతి మంజీరః, అనివ్యుత్పత్తి. మంజు+ఈరయతి అనునప్పుడు 'ఇకోయణచి' అనుసూత్రము చొప్పున 'వ' కారము రావలసియుండినను, నిది శకంధ్వాదులయందుఁ జేరుటచే, "శకంధ్వాదిషు పరరూపంవాచ్యం" అనుచొప్పునఁ బరరూపసంధి గల్గెనుగాఁబట్టి ఉకార స్థానమునఁ బరరూపమగునట్టి ఈకారము వచ్చెను.

భాషాక్లప్త యను స్థలమున సంయుక్తముగాను, కకార ఱకారములగుట నది యేకాక్షరముగానే పరిగణింపనగును. మఱియు నానందరంగ రాట్ఛందమున దీనినే ప్రాసమైత్రి కుదాహరించెను.

ఉ. ఏయెడ నర్థగౌరవసమృద్ధియు శబ్దవిశుద్ధియుం దిరం
బై యనవద్యతం బరఁగ నాంధ్రవచస్థితి భారతంబు రా
మాయణము న్రచించిన మహాత్ములనాత్మఁదలంచెదన్ జగ
ద్గేయులనన్న పార్యునిని దిక్కసుధీమణి నెఱ్ఱసత్కవిన్. 4

అ. ఏయెడన్ = ఏపట్టునందును, అర్థగౌరవ సమృద్ధియున్ = అర్థముయొక్క గౌరవాతిశయమును, శబ్దవిశుద్ధియున్ = శబ్దముయొక్క సౌష్ఠవమును, తిరంబై = స్థిరమై, అనవద్యతన్ = దోషరాహిత్యముచే, పరఁగు = ఒప్పుచుండు, ఆంధ్రవచస్థితిన్ = తెలుఁగుమాటల యునికిచేత, భారతంబు, రామాయణంబు = భారతమును రామాయణమును, మున్ =

పూర్వము, రచించిన = చేసిన, మహాత్ములన్ = పెద్దలగు, జగత్, గేయు లన్ = లోకములచేఁ బొగడఁదగువారలను, నన్నపార్యునిన్ = నన్న యను, తిక్కసుధీమణిన్ = తిక్కన సోమయాజిని, ఎఱ్ఱసత్కవిన్ = ఎఱ్ఱనను, ఆత్మన్ = మనస్సునందు, తలంచెదన్ = ధ్యానించెదను.

తా. అర్థగాంభీర్యమును శబ్దసౌష్ఠవమును గలుగు లాగున నాంధ్ర భాషలో భారత . రామాయణములు రచించిన కవిత్రయము వారిని మానస మున ధ్యానించెదను.

పరఁగు+ఆంధ్ర = పరఁగునాంధ్ర—ఇట పరఁగు అనునదియు దంత తద్ధర్మార్థక విశేషణమగుటచే దీని కచ్చుపరము కాఁగా నుగాగమ మయ్యెను.

నన్నపార్యుని-కర్మధారయమునందుఁ గొన్ని యెడల న, ప, మ,య లగును గాఁబట్టి ఈ రూపము వచ్చెను.

ఇట "నన్నపార్యునినిఁ దిక్కన నెఱ్ఱన భాస్కరాహ్వయున్." అని యొకపాఠముగలదు కాని యది యంతరస వంతమగునదికాదు. రామా యణ గ్రంథకర్తయగు భాస్కరకవి తిక్కన తాతయగుటచే నాతనిం గడపటఁ జేర్కొనుట క్రమభంగము.

ఈకవి భారతరామాయణముల రెంటిని శ్లేషార్థకల్పనచే నొకటే గ్రం థముగా రచింపఁ బూనుటచే భారత రామాయణముల రెంటిని రచించినకవు లనే స్తుతించి యుండును. కవిత్రయమువారు భారతమును రచించిరనుట సుప్రసిద్ధము. ఇంక నన్నపార్యుఁడు రాఘవాభ్యుదయము రచించెనను ప్రతీతిగలదు. తిక్కన నిర్వచనోత్తరరామాయణము రచించెను. ఎఱ్ఱన రామాయణము రచించినలాగున హరివంశమున "చేతోమోద మెలర్ప రామ కథ మున్జెప్పించి" యని వేమారెడ్డి కవినుద్దేశించి యున్నట్లున్నది. కాఁబట్టి యుభయ కావ్యకర్తలగు వీరిందలంచెదననుటయే సమంజసమగు పాఠము.

ఉత్పలమాలికా వృత్తము. లక్షణము, "పన్నిపదాయతిన్ భరనభారవ సంజ్ఞ గణాలినుండియు, త్ర్యన్నతపృత్తితోఁ దనరు నుత్పలమాలిక రంగధారుణీ." అని 'ఆనందరంగ రాట్ఛందము'

క. ఈవిధి నభీష్టసిద్ధికి
దైవతకవి నుతి యొనర్చి తప్పొప్పు మదిన్,
భావించి దిద్దకుండను
దేవానాంప్రియుల మ్రొక్కి తెలతుఁ గుకవులన్. 5

అ. ఈ విధిన్ = ఈలాగున, అభీష్టసిద్ధికిన్ = కోర్కెలుపూర్తియగుట కొఱకు, దైవతకవి నుతి ఒనర్చి=ఇష్టదైవమును గవులను స్తుతించి, తప్పొప్పు= ఇచ్చటి యొప్పును దప్పని తలఁచి దానికిఁ దా మొనర్చిన తప్పు మాఱొప్పుగా, మదిన్=మనస్సున, భావించి=తలఁచి, దిద్దకుండను = దిద్దకుండు లాగున, దేవానాంప్రియులన్=మూర్ఖులగువారిని, మ్రొక్కి=నమస్కరించి, కుకవులన్ = కుత్సితకవులను, తెలతున్=నమస్కరింతును.

తా. ఇట్లు ఇష్టదైవమును సత్కవులను స్తుతించి నాకవనము దిద్దకుండఁ గలందులకై మూర్ఖులకును, గుకవులకును నమస్కారము చేసెదను. "కుకవి" "కుగతి ప్రాదయః" పాణిని.

దేవానాం ప్రియులన్ "దేవానాంప్రియ ఇతిమూర్ఖే" అనివరరుచికారిక. "అభీష్టసిద్ధికిన్" చతుర్థీస్థానమునషష్ఠి. "అన్యస్యాపిక్వచిద్భవేచ్ఛాన్యా." ఆంధ్రశబ్ద చింతామణి.

ఇట దేవస్తుతికనుగుణముగా దేవానాంప్రియులకు నమస్కారము చేసెను. కవిస్తుతికనుగుణముగాఁ గుకవి నమస్కృతి యొనర్చెను.

"తప్పొప్పు" అనుచోట ముద్దరాజురామన్న దోషమును, గుణమును అని యర్థముగావించెను గాని యది సంగతముగా నుండలేదు. తప్పుండి దానిం దిద్దినయెడలఁ దానంగీకరింపవలయుఁగాని వలదనవచ్చునే! ఇంకఁ "గొందఱిందలి తప్పునొప్పుగా భావించి" యని యభిప్రాయపడవచ్చునుగాని

అదియు ననసంగతము, సూరనార్యునంతటి కవితల్లజుండు దోషరహితముగా గ్రంథమును రచించుఁగాని దుష్టముగా వ్రాయఁడు. కాఁబట్టి యిటదోష ముండు నను శంకయు నాతనికిఁ గల్గనవసరము లేదు. అట్లుండనిఁక'' నిందలి దోషములనని చెప్పుట యెట్లు సంగతము ? కావున ; నిందలి యొప్పులఁ దప్పుగాఁదలఁచి దామొనర్చిన తప్పు మార్పులొప్పులనిభావించి గ్రంథస్థమగు వానిం దిద్దకుండఁ గలందులకై' యనుటయే కవియొక్క యాశయమగు నని తోఁచెడిని.

ఇందు మూర్ఖులు కవిభావమెఱుఁగక యొప్పును దప్పని భావింతురు, కుకవులు జ్ఞానలవదుర్విదగ్ధు లగుటచేఁ దాముదిద్దునదే సరియగునని భావింతురు.

కందలక్షణము. "కందము త్రిశరగణంబుల, నందముగా భజసనలము లటవడిమూఁటఁన్, బొందును నలజలనాజిట నొందుందుద గురువుజగణముం డదు బేసిన్." సులక్షణసారము.

వ. అని, కుకవు లొకనిమిత్తంబునం బ్రార్థనీయు లగుటం జేసి, త
త్ప్రార్థనంబునుం గొంత నడపినవాఁడ నై, యెద్దియేనియు
నొక్కభవ్యకావ్యంబు నవ్యప్రకారంబున రచియించుటకు
నుదంచితకుతూహలుండ నై, యుండుసమయంబున. 6

అ. అని=ఇట్లని, కుకవులు=కుత్సితకవులు, ఒకనిమిత్తంబునన్ = ఒక కారణముచేత, ప్రార్థనీయులగుటంజేసి = కొని యాడఁదగినవారగుటచే, తత్ప్రార్థనంబునున్ = ఆకుకవుల వేఁడికోలును, కొంత = ఇంచుక, నడపినవాఁడనై = ఒనర్చినవాఁడనై, ఎద్దియేనియున్ = ఏదేని, ఒకభవ్య కావ్యంబు = ఒకమనోజ్ఞమైన ప్రబంధమును, నవ్యప్రకారంబునన్ = వింతయగురీతిని, రచియించుటకున్ = ఒనర్చుటకై, ఉదంచితకుతూహలుండనై = ఉత్సాహయుక్తుఁడనై, ఉండుసమయంబునన్ = ఉన్న తఱుణమున 'ప్రియముసంధిలంగనన్నుఁ బిలిపించి'' యని మీఁద దీని కన్వయముగలదు.

తా. కుత్సితకవులు నొకవిధమున స్తోత్రార్హులగుటచే వారింగూడఁ బ్రార్థించి లోకోత్తరమగు నద్దెనొక కావ్యమును నూత్నమార్గమున రచింపఁ దలఁచి యుండుతరుణమున.

గుణగ్రహణదక్షులగు సుకవుల భూషింపకుండినను గవికి నష్టములేదు కాని, యొప్పులఁదప్పుగా భావించి తోఁచినట్లెల్లఁ దిద్దికవియాశయమును బాడుసేయునట్టి కుకవులు దామెంతయుం బ్రార్థనీయులగుటంజేసి యిటఁ బ్రార్థనీయులని యుండినను బ్రార్థనీయతములనియే యాతనిభావము.

“భవ్యకావ్యంబు.” మంగళకరమగు కావ్యము. ‘భవ్యంతుభావుకం భద్ర’మ్మని యమరము. మంగళకరమగు నదనఁగా దోషరహితమని భావము. గుణగణ మండితముగాకున్నను దోష లేశమేనిలేకుండిన నట్టికావ్యంబే శోభావహంబు. కాఁబట్టియే “తదల్పమపినోపేక్ష్యం కావ్యే దుష్టం కథంచన” యని దండియనెను.

“నవ్యప్రకారంబునన్”. ఒరులుద్రొక్కనిబాటందానేఁగుట కీర్తికరము కాఁబట్టి యాంధ్రమునవింతకుము న్నెవరిచేతనురచింపఁబడని యీద్వ్యర్థి కావ్యరూపమున నవ్యశబ్దము “ణుస్తుతౌ” అను ధాతువునుండి కల్గుటచేఁ గొనియాడఁదగిన రీతిననియు భావముగానచ్చును. శ్లేషకావ్యము నిర్బంధ బహుళమగుటచే నుత్తమముకాదనువారి యభిప్రాయమును నిరాకరించుచు నాంధ్రములో లేని యీనూత్నపద్ధతి సకలజనస్తుతిపాత్రమగు నవనాశయ మున నే కవి యిట నవ్యశబ్దము ప్రయోగించెను.

సీ. ఏమహీవరుతాత శ్రీయిమ్మభూవరుఁడు స
త్కీర్తి గంగాజన్మ శ్రీకృతిమహాద్రి
యేవిభుతండ్రి నాగనావిధ పౌరుష
స్థిరవృత్తి మీసాల శ్రీతిమ్మశౌరి

యేనృపోత్తముతల్లి సన్మానిత పరమసా
ధ్వీగుణంబులప్రోకఁ దిమ్మమాంబ
యేధీరు ననుజన్ము లిద్ధదానక్షాత్ర
భద్రుండు చినవేఙ్కటాద్రినృపుఁడు
గీ. ఘనులు వేఙ్కటరాయవేఙ్కటవరదుఁడు
ననఁ బ్రసిద్ధులు ముగు రట్టి యాకువీటి
పురవరాంకుండు త్రిభువనపూర్ణకీర్తి
యతులతేజుండు పెదవేఙ్కటాద్రివిభుఁడు. 7

అ. సత్కీర్తిగంగాజన్మకృతి = మంచికీర్తి యనెడి గంగానదియొక్క పుట్టుక యనెడి కార్యమునకు, మహాద్రి=గొప్పపర్వతము, హిమవంతుఁడు, అగు, ఇమ్మభూపతి=ఇమ్మరాజు, ఏమహీవరుతాత = ఏ రాజుయొక్క తాత యో, నానావిధ=పెక్కుతీరులగు, పౌరుష=పరాక్రమములకు, స్థిరవృత్తి= నిలుకడగన్న యునికియగు, మీసాలతిమ్మశౌరి=మీసాలతిమ్మరాజు, ఏవిభు తండ్రి=ఏరాజుయొక్క తండ్రియో, మానిత=గౌరవింపఁబడిన, పరమ = గొప్పదగు, సాధ్వీగుణముల=పతివ్రతా గుణములయొక్క, ప్రోఁక=సమూహ మగు, తిమ్మమాంబ, ఏనృపోత్తముతల్లి = ఏరాజశ్రేష్ఠుని తల్లియో, ఇద్ధ = శ్రేష్ఠమగు, దాన=ఈవిచేతను, క్షాత్ర = పరాక్రమముచేతను, భద్రుండు= మంగళకరుఁడగు, చినవేంకటాద్రినృపుఁడు = చినవేంకటాద్రిరాజును, ఘనులు = గొప్పవారగు, వేంకటరాయ, వేఁకటవరదులు, అనఁగా, ప్రసి ద్ధులు=వేంకటరాయలు, వేంకటవరదుఁడు అని,ప్రసిద్ధులగువారు, ముగురు= మూవురు, [పైనఁజెప్పినవారు] ఏధీరుఁ ననుజన్ములు = ఏధైర్యవంతుని తమ్ములో, అట్టి=ఆలాటి, ఆకువీటిపుర అంకుఁడు=ఆకువీడనెడు, నగరము నకు, రాజనెడు, చిహ్నముగల వాఁడు, త్రిభువనపూర్ణకీర్తి=మూఁడులోక ములందు నిండిన కీర్తిగలవాఁడు, అతులతేజుఁడు=సాటిలేని తేజస్సుగల వాఁడు, పెదవేంకటాద్రి విభుఁడు = పెదవేంకటాద్రిరాజు.

తా. ఎవని తాతయగు నిమ్మభూపతి కీర్తిమంతుఁడో, ఎవని తండ్రియగు మీసాల తిమ్మరాజు స్థిర పరాక్రమవంతుఁడో, ఎవనితల్లియగు తిమ్మమాంబ పతివ్రతా గుణములరాశియో, ఎవని తమ్ములు చిన్నవేంకటాద్రి వేంకటరాయ వేంకటవరదులను వారలో, అట్టి యాకువీటిరాజగు పెద వేంకటాద్రిరాజు.

ఇది పై పద్యముతో నన్వయించును.

ఇటఁ బెద్ద వేంకటాద్రి, చిన్న వేంకటాద్రి, తిమ్మన్న, అనియూదఁబడక ప్రయోగింపఁ బడుటకుదాహరణము; "మహి నయోధ్యకురాజు రామయ్య యనంగ, నతని పట్టపుదేవి సీతమ్మయనంగ." అనంతునిచ్ఛందము.

నృప+ఉత్తమ, గుణసంధి, "అదేఙ్ గుణః" పాణిని.

ఈ పద్యమునందలి తొలిమూఁడు పాదములచేఁ గృతి ప్రేరకునియొక్క మహాకులీనత్వమును, నాకువీటిపుర వరాంకుఁడనుటచే మహాభాగ్యము, సతులతేజుండనుటచేఁ దేజస్విత్వమును సూచితములు.

విరూపాక్ష నామధేయుఁడే కృతిపతియనియు, వేంకటాద్రి విభుఁడు కృతి ప్రేరకుఁడు మాత్రమ యగుననియు, ముందు విస్పష్టముగాఁ గలదు.

సీస పద్యలక్షణము- "ఇంద్రగణములాఱు, నినగణంబులు రెండు, పాద పాదమునను బరఁగుచుండు, నాటవెలఁదియైనఁ దేటగీతియునైనఁ, జెప్పవలయు మీఁద సీసమునకు." సులక్షణసారము.

వ. నిజాస్థానంబున సంగీత సాహిత్యాది వివిధవిద్యా ప్రసంగం
　　బులం బ్రవర్తిల్లుచు.　　　8

అ. సుగమము.

సీ. శోభితాపస్తంబసూత్రు గౌతమగోత్రు
　　　సుచరిత్రుఁ బింగళిసూర సుకవి
　　పౌత్రుతునన్నపరతి భావనదౌహిత్రు
　　　నమరధీమణికి నబ్బమకుఁ బుత్రు

ననుజన్ములైనట్టి యమలన యెఱనార్యు
లతిభక్తి సేయంగ నలరువాని
సత్కావ్యరచనావిశారదుం డగువాని
సూరననామ విశ్రుతుని నన్నుఁ

గీ. బ్రియము సంధిలంగఁ బిలిపించి బహువస్త్ర
భూషణాదిదానములఁ గరంబు
సంతసంబొనర్చి యెంతయుగౌరవ
మెసఁగ మధురఫణితి నిట్టు లనియె. 9

అ. శోభిత=ప్రకాశించుచున్న, ఆపస్తంబసూత్రుఁ=ఆపస్తంబసూత్రముగలవానిని, గౌతమగోత్రుఁ = గౌతమముని గోత్రమున జనించినవానిని, సుచరిత్రుఁ = మంచి నడవడికగలవానిని, పింగళిసూరసుకవిపౌత్రుఁ = పింగళిసూరనకు మనుమఁడగువానిని, నన్నపరతిభావన = నన్నపరతిభావనకు, దౌహిత్రుఁ = కూఁతు కొడుకైనవానిని, అమరధీమణికిఁ = అమరయకవికి, అబ్బమకుఁ = అబ్బమ్మకు, పుత్రుఁ = కుమారుఁడైనవానిని, అనుజన్ములైనట్టి=తమ్ములైన, అమలన, యెఱనార్యులు=అమలన, ఎఱ్ఱనయనుకవులు, భక్తిఁ, సేవింపఁ=భక్తితోఁ గొలుచుచుండ, అలరువానిఁ = సంతోషించువానిని, సత్కావ్య=మంచికావ్యముల యొక్క, రచనా=రచియించుటయందు, విశారదుఁడగువానిఁ = సమర్థుఁడగువానిని, సూరననామ = సూరనయను పేరితో, విశ్రుతునిఁ=ప్రసిద్ధుఁడగువానిని, నన్నుఁ, ప్రియము, సంధిలంగఁ=అట్టి నన్ను ప్రేమయొనఁగూడఁగా, పిలిపించి = పిలుపనంపి, బహు......దానములు-బహు=అనేకములగు, వస్త్ర=బట్టలు, భూషణ = నగలు, ఆది=మొదలగువాని యొక్క, దానములను = ఇచ్చుటలచేత, కరంబు = మిక్కిలి, సంతసంబొనర్చి = సంతోషపెట్టి, ఎంతయుఁ = మిక్కిలి, గారవము = గౌరవము, ఎసఁగఁ = అభివృద్ధిసెం

దఁగా, మధురఫణితిన్ = తీయని పలుకులచే. ఇట్లులసిరయ్యెన్ = ఈలాగు నఁజెప్పెను.

తా. ఆపస్తంబసూత్రుఁడును, గౌతమగోత్రుఁడును, సచ్చరిత్రుఁడునునై, పింగళిసూరన పౌత్రుఁడునై, నన్నయరతిభావనల దౌహిత్రుఁడునై, యమరయ కవికి నబ్బమకును గుమారుఁడునై తమ్ములైన యమలన యెఱ్ఱనలుగొలుచుచుండ సంతోషించువానిని సూరనయనువాని నన్నుఁ బిలిపించి బహువస్త్రభూషణాదులనిచ్చి మిక్కిలి గౌరవముతో నిట్లనియెను.

"అంధ్రుఁడు." ఇట నందురను నప్పటి దకారమునకు డకారమువచ్చుటకు, "క్షితిని నుత్తమపురుషంబు చెప్పుచోట, నందమైయుండ కుండు మారొక్కండుననఁగ, నుండుమార్తురనేని మారొక్కండుననఁగ, భుజగకేయూరకాళికా పురవిహార," కవిసంశయవిచ్ఛేదము.

ఉకారలోపమునకు, "సేవింతురనెడి చోటను, సేవింత్రనియొక్కచోటఁ జెప్పినఁ జెప్పంగావచ్చును గబ్బంబుల," అడిదము సూరకవి. "తగిలిరుజయు జరయుదైవ వశంబున, నయ్యేనేని వాని ననుభవింత్రు". అని నన్నయప్రయోగించెను.

"సత్కావ్యరచనా విశారదుఁడగువాని," కావ్యలక్షణము. తదదోషౌశబ్దార్థౌ సగుణావనలంకృతీ పునఃక్వాపి." కావ్యప్రకాశము. ఇటఁగావ్యప్రకాశికావ్యాఖ్యానమగు బుధమనోరంజనియం దిట్లు చెప్పఁబడియెను. "అదోషావిత్యాదౌగ్రహణం సత్యపిగుణాలంకారబాహుళ్యే దోషలేశేపి కావ్యం పరిత్యాజ్యమితి ప్రదర్శయితుం, క్వచిత్ స్ఫుటాలంకారరాహిత్యేపి రసాభివ్యంజకశబ్దార్థయుగళస్య న కావ్యత్వహానిః" అని. కాఁబట్టియే రసాత్మకం కావ్యమ్మని వాడుక. దోషలేశమును లేక గుణయుక్తమై రసగుంభితమగునదియే సత్కావ్యమని పిండితార్థము.

శా. రెండర్థంబులపద్య మొక్కటియు నిర్మింపంగ శక్యంబు గా
కుండుం; దద్గతిఁ గావ్యమెల్లనగు నేకానోహా యనం జేయదే

పాండిత్యంబున? నందునుం దెనుఁగుఁ గైతం బద్భుతం బండ్రు ద
క్షుం డెవ్వం డిల రామభారతకథ ల్జోడింప భాషాకృతిన్. 10

అ. రెండర్థంబులన్ = రెండువిధములగు నర్థములచేత, పద్యము, ఒక్కటియున్ = ఒక్కపద్యమేని, నిర్మింపంగన్ = రచించుటకు, శక్యంబు, కాకుండున్ = సాధ్యము కాకుండును, పాండిత్యంబునన్, కావ్యము, ఎల్లన్ = పాండిత్యముచేతఁ గావ్యమంతయును, తద్గతిన్ = ఆవిధముగా, అగునేన్ = అయినయెడల, [రెండర్థములతోఁ జేయఁబడినచో] ఓహో, అనన్, చేయదే = ఆశ్చర్యమనిపింపదే, అందునన్ = అట్లు రెండర్థములు గలకావ్యము చేయుటయందును, తెలుఁగుకబ్బంబు = తెలుఁగు కవిత్వము, అద్భుతంబండ్రు = ఆశ్చర్యమందురు. ఇలన్ = భూమియందు, భాషాకృతిన్ = కావ్యరూపముగా, రామభారతకథల్ = రామాయణ భారతకథలు, జోడింపన్ = జతపఱచుటకు, దక్షుండు, ఎవ్వండు = ఎవ్వఁడు సమర్థుఁడు.

తా. రెండర్థములుగల్గు లాగున నొకపద్యమేని నిర్మించుట యసాధ్యమగుచుండఁ బాండిత్యముచే గ్రంథమంతయు నాలాగున నిర్మించుట వింత యగునుగదా? అందును దెలుఁగుబాసనట్లు రచించుట యెంతయు నాశ్చర్యము జనింపఁజేయును. కాఁబట్టి యట్లర్థద్వయమున రామాయణ భారతార్థములు జోడింప నీవుదక్క నింకెవ్వఁడు సమర్థుఁడగును?

"అంద్రు," అనుధాతువునకుఁ బ్రథమపురుష బహువచన వివక్షయందు దుగాగమము, రువర్ణకమునురాఁగ, అను+దు+రు, అని యాయెను, నుస్థానమున బిందువురాఁగ, అం+దు+రు అనియై బిందువుమీఁది దకారమునకు డకారము వైకల్పికముగ రాఁగ, అం+డు+రు అనియాయెను. రువర్ణకంబు పరంబగుటచే సున్నమీఁది డకారములోని యుత్వమునకు వైకల్పికముగ లోపమురాఁగ "అండ్రు" అనురూపము నిష్పన్నమయ్యెను.

ఉ. భీమన తొల్లి చెప్పెననుపెద్దలమాటయె కాని యందునొం
డేమియు నేయెడ న్నిలుచుటెవ్వరు గాన రటుండనిమ్ము; నా
నామహిత ప్రబంధరచనాఘనవిశ్రుతి నీకుఁ గల్గుటన్
నామదిఁ దద్ద్వ్యర్థకృతినైపుణియుం గలదంచు నెంచెదన్.

అ. తొల్లి = పూర్వము, భీమన, వేములవాడ భీమకవి, చెప్పెను, అను మాట = చెప్పెననుపలుకు, పెద్దలమాటయకాని = పెద్దవారాడికొను మాటయేకాని, అందున్ = ఆకావ్యమునందు, ఒండు, ఏమియున్, ఏయెడన్, నిలచుట కానరు. = స్వల్పభాగమేని నెచ్చటనుండుటయు నెవ్వరు నెఱుఁగరు, అటు, ఉండనిమ్ము = అదియట్లుండనిమ్ము, నానా......విశ్రుతి- నానా = అనేక విధములగు, మహిత = పూజ్యములగు, ప్రబంధ = కావ్యములయొక్క, రచనా = రచించుటచేత, ఘన = గొప్పదగు, విశ్రుతి = ప్రసిద్ధి, నీకున్, కల్గుటన్ = నీకుండుటచేత, తద్ద్వ్యర్థ...నైపుణియున్- తత్ = ఆ, ద్వ్యర్థ = ద్వ్యర్థి కావ్యముయొక్క, కృతి = రచించుటయందలి, నైపుణియున్ = సామర్థ్యము, నీకున్, కలదు = నీకున్నది, అంచున్ = అనుచు, నామదిన్ = నామనస్సునందు, ఎంచెదన్ = తలఁచెదను.

తా. పూర్వము భీమన రాఘవపాండవీయమను ద్వ్యర్థి కావ్యమును రచించెనని పెద్దలాడుకొనుటయేకాని యాకావ్యమున నించుకయు నెచ్చటను నున్నట్లెవ్వరికిని దెలియదు. అది యటుండ నిమ్ము. నీవు పెక్కువిధములగు కావ్యముల రచింపఁగల సామర్థ్యముగలవాఁడ వగుటంజేసి యీద్వ్యర్థి కావ్యమురచింపఁ గలవని నేను దలఁచెదను.

"ఒండు." ఇది ఒకశబ్దమునకుఁ బర్యాయము. ఒక యనుట యల్పార్థమున వ్యవహరింపఁబడు చుండుటంజేసి యీయొండు నిట నల్పార్థకమే యగును. "ఒక కొన్నిపయనంబు లొయ్యనొయ్యనఁబోయి" ధూర్జటికవి.

"ప్రబంధ." "ప్రబంధఃకల్పనాకథా" అని అమరము.

"అంచున్," "అను+చున్, చువర్ణకంబు పరంబగుటచే నిటను స్థానంబున బిందువయ్యెను.

ఉత్పలమాలిక "శ్రీరమణీముఖాంబురుహ సేవన షట్పదనాథయంచుశ్భం, గారరమేశయంచు ధృతకౌస్తుభయంచు భరేఫసంబులన్, భారలగంబులుం గదియఁ బల్కుచు నుత్పలమాలికాకృతిన్, గారవమొప్పఁజెప్పుదురు కావ్యవిదుల్ యతితొమ్మిదింటఁగాన్" ఛందోదర్పణము.

క. చాటుప్రబంధరచనా
పాటవకలితుఁడవు శబ్దపరిచితియందున్
మేటివి దీనిం దెనుఁగునఁ
బాటించి రచింపనీవ ప్రౌఢుఁడ వరయన్. 12

అ. చాటు ... కలితుఁడవు- చాటుప్రబంధ = ముక్తకాదిచాటు ప్రబంధములయొక్క, రచనా = నిర్మాణమునందలి, పాటవ = నైపుణ్యముతో, కలితుఁడవు = కూడినవాఁడవు, శబ్దపరిచితియందున్ = శబ్దపరిజ్ఞానమునందును, మేటివి = గొప్పవాఁడవు, దీనిన్ = ఈరెండర్థముల కావ్యమును, తెలుఁగునన్ = ఆంధ్రమున, పాటించి = ఆదరించి, రచింపన్ = నిర్మించుటకు, అరయన్ = విచారింపఁగా, నీవ = నీవే; ప్రౌఢుఁడవు = జాణవు.

తా. చాటుకావ్యముల రచించుసామర్థ్యము గలవాఁడవు సాహిత్యజ్ఞానము గలవాఁడవు కాఁబట్టి యీకావ్యము నాంధ్రమునరచించుట కీవే సమర్థుఁడవు.

ఇట "శబ్దపరిచితియందున్" అనుటచే శబ్దశాస్త్రమునందలి పరిచితి యని యర్థముసేయరాదు, సాహిత్యమునందలి పరిజ్ఞానమనియే యర్థము సేయవలయును, కావుననే "కావ్యాలంకరణ జ్ఞ మేవ కవితా కన్యావృణీతేస్వయ"మ్మని బిల్హణుఁడునుడివెను. దీనంగవికి సర్వతోముఖ పాండిత్యముండవలయుఁగాని కేవలశాస్త్ర పరిజ్ఞాన ముపయోగకారికాదనుట నిరూపితము.

ఉ. దక్షత యింత కల్మి విశదంబుగఁ గాంచియు నీమదిన్ ఫలా
పేక్షఘనంబు గామి నిది యిట్టని కొంకెద, నీకు నోలలా
టేక్షణభక్తిశీల! రచియించుట యిష్టము కాదె శ్రీవిరూ
పాక్షునకంకితంబుగ శుభార్థము రాఘవపాండవీయమున్. 13

అ. దక్షత = సామర్థ్యము, ఇంతకల్మి = ఇంతయుండుట, విశదంబుగన్ = స్పష్టముగా, కాంచియున్ = తెలిసియు, నీమదిన్ = నీమనస్సునందు, ఫలాపేక్ష = ప్రయోజనాపేక్ష, ఘనంబు కామిన్ = గొప్పది కాకుండుటచేత, ఇది, ఇట్టు, అనన్ = ఇది యీలాగునఁ జేయుమనుటకు, కొంకెదను = సంకోచించెదను, ఓ లలాటేక్షణ భక్తిశీల = పరమశివుని యందలి భక్తియే స్వభావముగాఁ గలవాఁడా, శ్రీవిరూపాక్షునకున్ = శ్రీవిరూపాక్షస్వామికి, అంకితంబుగన్ = పేరొక్కొనఁబడినదిగా, శుభార్థము = మంగళములకొఱకు, రాఘవపాండవీయమున్ = రాఘవపాండవీయమను గ్రంథమును, రచించుట = నిర్మించుట, నీకున్ = ఇష్టము, కాదే = నీకు నిష్టమేకదా.

తా. నీకింతజ్ఞానముండియు ఫలాపేక్ష లేనివాఁడవగుటచే నిన్నీలాగునఁ జేయుమని చెప్పసాహసింప లేకున్నాను. నీవు శివభక్తుఁడవగుటచే విరూపాక్షదేవునకంకితముగా నీగ్రంథము రచించి లోకులకు శుభముగలిగించుట కిష్టపడెదవని తలఁచెదను.

ఇట 'లలాటేక్షణ భక్త'యను విశేషణము, హేతుగర్భమగునది. విరూపాక్షభక్తుఁడగుటచేఁ దదంకితముగా గ్రంథమురచించుట యిష్టమగునను ట సూచితమగుచున్నది. అలం. పరికరము, "అలంకారః పరికరస్సాభిప్రాయే విశేషణే" చంద్రాలోకము.

వ. అన్న వినయభక్తికంబులగు మధురభాషణంబుల నిజాభిలాషంబు తెలియంగ తెలిగించిన, నేనుమ కవీయుంబులగు నతి

మాత్రగౌరవసంభావనాదివిశేషంబులచేతం బ్రీతచేతస్కుం
డనై యునికింజేసి శక్యాశక్యవిచారంబు లేక, యంగీకార
భంగీతరంగితంబగు నంతరంగంబుతో నతని నభివీక్షించి. 14

అ. అని = ఇట్లుచెప్పి, సవినయ = అడఁకువతోఁగూడిన, భక్తికంబులగు = భక్తిగలిగిన, మధురభాషణంబులన్ = తియ్యనిమాటలచేత, నిజాభిప్రాయంబు తెఱంగు = తనకోర్కెయొక్కరీతిని, ఎఱింగించినన్ = తెలుపఁగా, తదీయ = వానికిసంబంధించిన, అతిమాత్రగౌరవ = మిక్కుటమగు గౌరవముతోఁగూడిన, సంభావనా విశేషంబులచేతన్ = వింతలగు మన్ననలచేత, ప్రీతచేతస్కుండనై=సంతోషించిన మనస్సుగలవాఁడనై, ఉనికిం జేసి = ఉండుటచేత, శక్యాశక్యవిచారంబులేక=ఇదిసాధ్యమా యసాధ్యమా యను నాలోచనలేక, అంగీకార = ఒప్పికొనుటయొక్క, భంగీ=విధముచే, తరంగితంబగు=అభివృద్ధిగావింపఁబడిన, అంతరంగంబుతోన్=మనస్సుతో, అతనిన్ = ఆవేంకటాద్రీశ్వరుని, అభివీక్షించి = చూచి.

తా. సవినయభక్తికముగా నాతఁడారాధించుటంజేసి సంతసించి యిది సాధ్యమా యసాధ్యమాయనుటయు విచారింపక యంగీకరించి, యాతనిం గాంచి.

ఇట సవినయభయ భక్తికంబులగు అనుచోట "ఉరః ప్రభృతిభ్యః కప్" అనుపాణిని సూత్రముచే బహువ్రీహ ర్థమున, కప్ప్రత్యయము.

ప్రీతచేతస్కుండనై యనుచోట "శేషాద్విభాషా" అను పాణినిసూత్రముచే వికల్పకముగా కప్, ప్రత్యయము.

"తదీయ" తస్యేదం తదీయం. ఇటషష్ఠి సంబంధార్థకము.

ఉ. రాఘవపాండవీయకథ కీరమ్యముగా నొక కావ్యసృష్టి నా
హా! ఘటియింపఁగా వశమె యేయాంధ్రకవీంద్రులకైనఁదావక
శ్లాఘనపూర్వకోక్తి యవిలంఘ్యము గావునఁగోవిద్వానుకం
పాఘనబుద్ధిఁజూపెదఁజకిమత్కృతిమత్కృతిమత్కృతిత్వమున్

అ. ఆంధ్రకవీంద్రులకున్ = ఆంధ్రకవిశ్రేష్ఠులకు, రాఘవపాండవీయ కథ = రామాయణభారతకథలు, రమ్యముగాన్ = మనోజ్ఞముగా, ఒక కావ్యసృష్టిన్ = ఒకే ప్రబంధముగా నిర్మించుటచేత, అహో = ఔరా, [ఇది యాశ్చర్యార్థకము] ఘటియింపఁగాన్ = కూర్పఁగా, వశమే = శక్యమా ? ఐనన్ = అట్లైనను, తావక = నీదగు, శ్లాఘనపూర్వక = పొగడ్తనుముందుఁగల, ఉక్తి = మాట, అవిలంఘ్యము = దాఁటఁదగనిది, [అవశ్యాచరణీయమనుట] కావునన్ = కాఁబట్టి, కోవిద = సర్వజ్ఞులయొక్క, అనుకంపా = దయచేత, కల్గిన, ఘన = గొప్పదగు, బుద్ధిన్ = బుద్ధిచేత, చమత్కృతిమత్ = చమత్కారముగల, కృతిన్ = కావ్య రచనయందు, మత్కృతిత్వమున్ = నాకౌశలమును, చూపెదన్ = చూపువాఁడను.

తా. రామాయణభారతార్థముల రెంటి నొకేపద్యమున ఘటించి రచించుట యాంధ్రకవి శ్రేష్ఠులకు దుస్సాధము. అయినను నీగౌరవపూరితమగు నాజ్ఞ మీఱఁదగినదికాదు. కాఁబట్టి గొప్పవారిదయచేఁగల్గిన గొప్పబుద్ధిచే నీకావ్యరచనయందు నాకౌశలము చూపెదను. నీకావ్యము సభంగశ్లేష బహుళముగ రచించుట యాంధ్రకవీంద్రుల కసాధ్యమేయైనను మహాత్ముల యనుగ్రహమున సర్వతోముఖ పాండిత్యముగల్గుటచే దుస్సాధమగు దాని సుసాధము గావించెదనని కవియాశయము.

వ. అని మఱియు నతనిచేత ననేకవిధసత్కారసంభావనాసంభృతసమ్మదుండనై. 16

అ. అనేకవిధ = నానావిధములగు, సత్కార = సన్మానములచేత. సంభావనా = మన్ననలచేత, సంభృత = వహింపఁబడిన, సమ్మదుండనై = సంతోషముగలవాఁడనై.

తా. పెక్కువిధములుగా నన్నుసత్కరించుటచే మిక్కిలి యానందము గలవాఁడనై ;

సీ. ఆంధ్రభాషా సంస్కృతాభిభాషాశ్లేష
యొకకొక్కచోట ; నొకకొక్కచోట
నుచితశబ్దశ్లేష ; యొకకొక్కచోట న
ర్థశ్లేష ; యొకకొక్కకతతిని ముఖ్య
గౌణావృత్తిశ్లేష ఘటన ; యొకకొక్కకతతి
సర్వాన్వయము వేఱె యగుచునునికి ;
[illegible] సంగతి నొకకొక్క
[illegible] ; నివి యొకకొక్క తతిని రెండు

గీ. మూ[illegible] [illegible]యు, మఱి సకముజ్జ్వలముగ
నా[illegible] ద[illegible] గతిఁ బెక్కుపోక లమర
[illegible]ఘలు పర్యాయదృష్టిఁ
[illegible] కేర్పడ నాచరింతు. 17

[illegible] సంస్కృతిమత్కృతిక్’ అని పూర్వముచెప్పిన లాగునఁ [illegible] [illegible]గ్రంథమునఁ జూపువిధము నీపద్యము మూలమునఁ గవి వివరించుచు[illegible]డు.

అ. ఒకకొక్కచోటక్ = ఒకకొక్కప్రదేశమున, ఆంధ్రభాషా సంస్కృతాభిభాషాశ్లేష = ఆంధ్రగీర్వాణముల కూడికయు, అర్థభేదము [illegible] సంస్కృతముగాను దెలుఁగుగాను గ్రహించుట. “విని [illegible]ట, విని + అలేనిక్ + తన యనిపదములు విఱిచినచోఁ దెలుఁగగు[illegible]. వినియత + నింపన యనినచో సంస్కృతమగుచున్నది.

ఒకకొక్క[illegible] = ఒకకొక్కస్థలమున, ఉచిత = తగిన, శబ్దశ్లేష = శబ్ద[illegible]యు, విఱుపుచే భిన్నార్థగ్రహణము. “మహాగోదావరీ తీర స[illegible]” ఇట, మహా + గోదావరీ + తీర+సత్ + రక్షా + ఉపా[illegible], అనియు; మహత్ + అగః + దావ + రీతీ+రసత్+ రక్షః+ [illegible], అనియు పదములవిఱుపుచే శబ్దశ్లేష యగుచున్నది.

ఒకొ్కక్కచోటఁ + ఒకొ్కకచోటున, అర్థశ్లేష = అర్థములకూడి కయు, ఒక్కటేపదము విఱుపులేక యర్థభేదమునందుట, "విగ్రహాజృంభణమునఁ" అనుచోట యుద్ధాతిశయముచే ననియు, శరీరముయొక్క విఱుపుచేననియు నర్థశ్లేషము.

ఒకొ్కకతఱిని, ముఖ్య, గౌణవృత్తిశ్లేషఘటన = ఒకొ్కక్కయెడ ప్రధానా ప్రధానములగు వృత్తులచేరికయొక్కకూర్పు, "విడువుము జనసమ్మతమ విదేహాజననామయ ముందనయు దితకీర్తి" ఇట, విదేహాజఁ + విడువుము + జనసమ్మతము+అనామయముఁ+తనయుందితకీర్తిని, అనియు; జనసమ్మతమతివి + దేహాజననామయముఁ + తనయుఁ + దితకీర్తిఁ + విడువుము, అనియుఁ బదములువిఱిచినప్పుడు, దేహాజననామయముఁ అనుటలో దేహమునజనించిన యామయమువంటి వానిని యనునప్పు డామయముగాని వాని నామయమనుట పొసఁగదు కాఁబట్టి యాశ్రయమాపణ శ్రమాపాదనాది గుణముల నిమిత్తము గావించికొని దుర్యోధను నందామయత్వ మారోపించుటచే నిదిగౌణవృత్తి. అనామయమనునప్పు డామయశబ్దమునకు ఒకొ్కకతఱిఁ, రోగమను ముఖ్యార్థము గ్రహించుటచే ముఖ్యవృత్తి. అర్థాన్వయము = అర్థములచేరిక, వేఱయగుచుఁ = భిన్నమగుచు, ఉనికిఁ = ఉండుట, 'దివిమోచియున్నయద్రిని' అగస్త్య పరమయినప్పు డాకసము నొరయునట్టి వింధ్యముననియు, శివపరమయినప్పుడు స్వర్గమును వహించిన మేరువనియు శబ్దార్థశ్లేషలు లేకయే యర్థాన్వయభేదము.

ఒకొ్కక్కతఱి, శబ్దాన్వయ విభేదసంగతి = శబ్దముల చేరికయొక్క వేఱుపాటును, "వ్యథలెల్లఁ దీఱదేవర మహామహిమవిలోకింపఁ గంటినస్తోక గుణతఁ, బరఁగుభూమిజనాధిపతన యాయకలంక నున్నది శాంతద్వేషన్నికాయ; ఇట, దేవరమహిమఁ+వ్యథలెల్లఁదీఱఁ+అస్తోకగుణతఁ బరఁగుభూమిజఁ+విలోకింపఁగంటిఁ+అధి + పతన+ఆయక + లంకను, ఇట హనూమద్వాక్యముగను; వ్యథలెల్లఁ+తీఱఁ+ దేవరమహిమఁ + విలోకిం

పఁగంటిని+అస్తోకగుణతఁ బరఁగు భూమిజనాధిపతనయా+యని గవాధ్యక్షుని వాక్యముగను బదముల కర్థభేదము లేకున్ననుశబ్దముల యన్వయ భేదమునఁ గర్మాది భేదకల్పనమున నర్థద్వయ మిమిడింపఁ బడియెను.

ఒక్కొక తెఱని, ఇవి, రెండు మూఁడు గూడుటన్ = పైనఁ జెప్పి యున్నవి ప్రత్యేక ప్రత్యేకములుగాక రెండు మూఁడు చేరియుండుటచేను, "వెలయు నఖిలభువనములలోన వారణ, నగరిపురమ తల్లినాఁడనర్చి,రాజ్యలక్ష్మి మిగులఁ బ్రబల నయోధ్యనా రాజ వినుతిగవిన రాజధాని." ఇట, అవారణ+నగరిపు+రమ+తల్లినాన్ అని రామాయణ పరముగను, వారణనగరి+పురమతల్లినాన్+అని భారతపర్యాయముగను, నన్వయించునపుడు సంస్కృతాంధ్రభాషా శబ్దశ్లేషయు; రాజ్యలక్ష్మి+మిగులన్ + ప్రబలన్ + అయోధ్యనాన్, అని రామాయణ పర్యాయముగను, రాజ్యలక్ష్మి+అయోధ్యనాన్+మిగులన్+ప్రబలన్, అని భారతపర్యాయముగను, నన్వయించి నచో శబ్దాన్వయభేదసంగతియు; మఱియున్, సముజ్జ్వలముగాఁగన్ = మిక్కిలి యొప్పులాగున, నాకున్, తోఁచినగతిన్ = నాకు స్ఫురించిన లాగున, పెక్కుపోకలు = అనేకమార్గములు, అమరన్ = ఒప్పునట్లు, రామభారతకథలు = రామాయణ భారతకథలు, పర్యాయదృష్టిన్=పర్యాయక్రమముతో, చూచుసుమతులకున్ = పరికించునట్టి బుద్ధిమంతులకు, ఏర్పడన్ = వేఱువేఱుగాఁ దెలియులాగున, ఆచరింతున్ = చేసెదను.

తా. ఈ కావ్యమును జూచునట్టి బుద్ధిమంతులకు ; రామాయణ భారతార్థములు రెండు నేర్పడుట కొఱకు సంస్కృతాంధ్రభాషాశ్లేషయు, శబ్దార్థశ్లేషయును, ముఖ్య గౌణ వృత్తిశ్లేషయు, శబ్దాన్వయార్థాన్వయశ్లేషలును నిట్లు పెక్కు రీతుల నాకుఁదోఁచినరీతిగా వ్రాసెదను.

"ముఖ్యగౌణ వృత్తిశ్లేష" ముఖ్యవృత్తి, యభిధ; గౌణవృత్తి,లక్షణా భేదమయగును. లక్షణము."అభిధ సతతసంకేతితార్థగోచరసు శబ్దధామమై యోగరూఢిభేదములఁ జెలంగు. ఇంక లక్షణ వివరింతు నిందు గౌణవృ

త్రియు నభిన్నమైపాల్పు నెట్టటన్న,క్షోణీసురుఁడగ్నియను నెడ శుచిగుణం
బు వాచ్యవిభవాభిధాయిగ్గొ వరలుకతన" వరసభూపాలీయము.

ఇట "మూఁడు గూడుట యన సముజ్జ్వలముగాఁగన్" అనియు "మూఁడుగూడుట మఱియు సముజ్జ్వలముగ యనియు రెండు విధములుగాఁ బాఠములు గలవు. ఇటఁ బ్రాదియతి యగుటచేత సముజ్జ్వలయను దాని లోని మకారముగాని; ఉకారముగాని యతిచెల్లును. తక్కిన పాఠమున నుత్తను నుపసర్గపైని చకారపకారములు మకారమునకు యతిగావచ్చుట యయుక్తము. కాఁబట్టి "మఱియుస, ముజ్జ్వలముగ" నను పాఠమేయుక్త తరము.

ప్రాదియతికి లక్ష్యమిట్లు చూపఁబడియున్నది. "అబ్జయోని రజోగుణ ప్రాప్తిఁ దనరుఁ, బద్మనాభుఁడు సాత్త్విక ప్రాప్తిఁదనరు, రజతగిరిమందిరుఁడు తమః ప్రాప్తిఁదనరు, ననఁగనిబ్బంగి ప్రాదులనమరు యతులు" తాతంభట్టు.

క. ఒకకథ వినియెడి తఱి, వే
 ఱొకకథపై దృష్టి యిడిన నొకయర్థము దోఁ
 పకపోవుఁ గాన, నేకా
 ర్థకావ్యమె ట్లట్ల వినఁగఁ దగు నొక టొకటిన్. 18

అ. ఒక కథన్, వినియెడితఱిన్ = రామాయణ భారతములలో నేదే నొక కథవినుచుండునపుడు వేఱొక కథపై, దృష్టి, ఇడినన్=మఱియొక్క కథపైదృష్టియుంచినయెడల, ఒక యర్థమున్, తోఁపక, పోవునుగానన్ = ఏయర్థమును స్ఫురింపకుండును గావున, ఏకార్థ వాక్యమెట్లు = ఒకే యర్థముగల • వాక్యమెట్లో, అట్ల = అదేలాగుననే, ఒకటొకటిన్ = ఒకదాని వెంబడి వేఱొకటిగా, వినఁగన్, తగున్ = వినవలెను.

తా. ఒక కథ!వినుచుండ వేఱొక కథయందు మనస్సు ప్రసరించిననే యర్థమును గోచరింపకపోవును. కాఁబట్టి యేకార్థ కావ్యమువలెఁ దలఁచుచు నొకదాని వెంబడి నొకటిగా వినవలయును.

ఇట విని యెడితత్రీ, వినగఁ దగునను స్థలములు చదివెడితత్రీ, చదువఁగఁ దగుననుటకునుపలక్షకములని గ్రహించునది.

గీ. ప్రభువు సత్కార ఋణమిందుఁ దీఱె ననియు
శ్రీవిరూపాక్ష సేవా విశేషమనియు
సుజను లిందు గుణాంశంబె చూతురనియుఁ
జలిపితి నసాధ్యకృతి కిట్లు సాహసంబు. 19

అ. ఇందుక్ = ఈకావ్యరచనయందు, ప్రభువు సత్కారఋణము = పెదవేంకటాద్రిరాజు యొక్క సమ్మానమనెడియప్పు, పాయును, అనియుక్ = తీఱుననియు, శ్రీవిరూపాక్ష = శ్రీవిరూపాక్ష దేవునియొక్క, సేవావిశేషము, అనియుక్ = శ్రేష్ఠవిధమగు సేవయనియు, సుజనులు = సత్పురుషులు, ఇందుక్ = ఈ గ్రంథమునందు, గుణాంశంబ = గుణభాగమునే, చూతురు, అనియుక్ = కాంతురనియు, ఇట్లు = ఈలాగున, అసాధ్యకృతికిక్ = సాధింపవీలుగాని యీగ్రంథరచనకు, సాహసంబు, సలిపితిక్ = తెగువచేసితిని.

తా. ఈ గ్రంథరచనచేఁ బ్రభువు నను సత్కరించుటచేఁ గల్గిన ఋణము దీఱుననియు, అనఁగా ఋణవిముక్తికి గ్రంథరచనామూలమునఁ బ్రభువును సంతోషపెట్టుటయే హేతువగునని భావము. మఱియునిది విరూపాక్ష సేవా విశేషముగను నున్నదనియు, 'ఏకక్రియాద్వ్యర్థకరీ', యనులాగున నీగ్రంథరచనచే స్వామికార్యమును స్వకార్యమును బూర్తియగుచున్న దనుట. స్వామికార్యము పెదవేంకటాద్రి విభుని సంతసింపఁజేయుట, స్వకార్యము విరూపాక్షసేవ; సత్పురుషులిందు గుణభాగమునే చూతురనియు, అనఁగా సర్వతోముఖపాండిత్యముగల్గి రచింపఁబడిన దగుటచే

సుజనులకుఁ జూచినపట్లెల్ల గుణభాగమే కన్పట్టుచుండు ననుట. కాఁబట్టియే యట్టియసాధ్యకృతిని రచింపఁబూనితిని. అసాధ్యమనఁగా నన్యులచే నసాధ్యమనుట, ఇది యనన్య సాధ్యనుగునది కదాయని యాలోచింపక పెద్దల యనుగ్రహము గల్గుటయే ప్రధానమని దృఢవిశ్వాసము గల్గి రచింపఁబూనునట్టి సాహసమున నుపక్రమించితినని భావము.

"ఇందుఁ, బ్రభువు సత్కార ఋణము తీఱుఁ"—ఇట, "ఇందుఁ" అనుట పంచమ్యర్థమున సప్తమి.

ఇట ముద్దరాజు రామన్న "సలిపితి,అను నీక్రియాపద మీరాఘవపాండవీయ ప్రాచీన లిఖితప్రతుల యందంతటఁ జాదిగా వ్రాయఁబడియున్నది గాని తదాది యని నిర్ధారణసేయుట కాకరములేదు. ఇప్పటి వాడుక సాదిగాఁ గనఁబడుచున్నది" యనెను. కొందఱిది చాదియేయనియుఁ బ్రథమ మీఁద సవర్ణాదేశము పొడచూపుననియుఁ నభిప్రాయపడెదరు. కాని ఇది చాదిగను సాదిగను నిట్లుభయ విధములుగను నున్నయది.

తేటగీతి, లక్షణము. "ఇనగణత్రయంబు నింద్రద్వయంబును, హంస పంచకంబు నాటవెలఁది" సులక్షణసారము.

వ. అనియిట్లుకృతోత్సాహుండనగుచు, నేతత్ప్రబంధనిబంధ
నారంభంబునకుఁ బ్రేరకుండైన సకలాంతర్యామి సోమ
కూటాధ్యక్షుండు శ్రీవిరూపాక్షుండ నిర్విఘ్నపరిసమాప్తి
ప్రచయగమనంబులకుం దాన కలండతనిసంకల్పానుసారం
బుననెట్లు గావలయు నట్లగుఁగాక నాకు భారంబేమి? యను
తలంపున నిశ్చింతుండనై కడంగి, దీనికిఁ బ్రత్యక్షనియామ
కుండైన పెదవేఙ్కటాద్రి మహీవల్లభువంశక్రమం బభి
వర్ణించెద. 20

అ. ● అనియిట్లు = అని యీలాగున, కృతోత్సాహుండ నగుచుఁ = చేయఁబడిన యుత్సాహము గలవాఁడనగుచు, ఏతత్ప్రబంధ = ఈకావ్యము

యొక్క, నిబంధన = నిర్మాణముయొక్క, ప్రారంభంబునకున్ = మొదలు పెట్టుటకు, ప్రేరకుండైన = పురికొల్పువాఁడైన, సకల = అందఱియొక్క, అంతర్యామి = హృదయాంతర్వర్తియైన, హేమకూట అధ్యక్షుండు = హేమకూటపర్వతాధిపతి, శ్రీవిరూపాక్షుండు, అ = శ్రీవిరూపాక్ష స్వామియే, నిర్విఘ్న పరిసమాప్తి = విఘ్నము లేకుండ ముగియుట కొఱకును, ప్రచయగమనంబులకున్ = వ్యాప్తినందుట కొఱకును, తాన్, అ = తానే, కలండు = ఉన్నాఁడు. అతని సంకల్పాను సారంబుగన్ = అతనియిచ్ఛాను సారముగా, ఎట్లు, కావలయున్, అట్లు, అగున్, కాక = ఏదియేలాగునఁ గావలయునో యది యాలాగుననే యగుఁగాక, నాకున్, భారంబు, = బరువు, ఏమి యను తలంపునన్ = ఏమున్నదను తలంపుతో, నిశ్చింతుండనై = చింతలేనివాఁడనై, కడఁగి = యత్నించి, దీనికిన్ = ఈ కావ్య నిర్మాణమునకు, ప్రత్యక్షనియామకుఁడైన = ఎదుట నుండునట్టి యాజ్ఞాపకుఁడైన, పెదవేంకటాద్రి, మహీవల్లభు = రాజుయొక్క, వంశ = కులముయొక్క, క్రమంబును = వరుసను, అభివర్ణించెదన్ = ఉగ్గడించెదను.

తా. ఈలాగున నుత్సాహముగలవాఁడనై, గ్రంథనిర్మాణమునకై నను బ్రేరేపించిన హేమకూటాశ్రయుండగు విరూపాక్షస్వామి విఘ్నములఁ బోనడంచి దీనిని వ్యాపింపఁజేయనుండ నాకాభారమేల యనితలఁచి, నిశ్చింతుఁడనై దీనికిఁ బ్రత్యక్షప్రేరకుఁడగు పెదవేంకటాద్రి విభుని వంశక్రమ మభివర్ణించెదను.

శా. శ్రీశోభాఘనుఁ డిమ్మభూవరుఁడు లక్ష్మీనాథకల్పద్రుదు బా
హాశాఖాఫలమైనవంశమున మూర్తామోదముంబోలె స
ర్వాశాపూరిత కీర్తివాసనలతో నావిర్భవించెన్ ధరి
త్రీశోత్తంసితభవ్యశాసనకళాహేతుప్రతాపాఢ్యుఁడై. 21

అ. శ్రీ = సంపదయొక్క, శోభా = విలాసముచేత, ఘనుఁడు = అధికుఁడైన, ఇమ్మభూవరుఁడు = ఇమ్మరాజు, లక్ష్మీనాథ ... వంశమున- లక్ష్మీ

నాథ = లక్ష్మికి భర్తయయిన నారాయణుఁ డనెడు, కల్పద్రు = కల్ప వృక్షముయొక్క, బాహా = భుజములనెడు, శాఖా = కొమ్మలయందలి, ఫలమైన = పండయిన, వంశమునన్ = కులంబున, ధరిత్రీశ...ప్రతాపాఢ్యుఁడై- ధరిత్రీశ = రాజులచే, ఉత్తంసిత = శిరోభూషణముగాఁ జేయఁబడినదై, భవ్య = శుభకరమైన, శాసనకళా = శిక్షావిధికి, హేతు = కారణమగు, ప్రతాప = పరాక్రమముచే, ఆఢ్యుఁడై = సంపన్నుఁడై, మూర్త = మూర్తిమంతమైన, ఆమోదముం బోలెన్ = వాసనవలె, సర్వాశా...వాసనలతో- సర్వాశా = దిక్కులం దంతటను, పూరిత = నిండింపఁబడిన, కీర్తివాసనలతోన్ = కీర్తియనెడి పరిమళముతో, ఆవిర్భవించెన్ = ఉదయించెను.

తా. తనప్రతాపమునకు వెఱచి రాజులందఱు దనకు లోఁబడియుండ, నిమ్మరాజు నారాయణుని బాహువులనెడి కల్పవృక్షమునకు శాఖాఫలమగు క్షత్రియవంశమున జనించి కీర్తియనువాసనలతో నన్నిదిక్కులు నిండించెను. కల్పవృక్షముయొక్క ఫలమునుండి జనించుటచే పరిమళము గలదని భావము.

కల్పద్రు:—"పలాశీ ద్రుద్రుమాగమాః" అని అమరము.

లక్ష్మినాథ...వంశమున. "బాహూరాజన్యః కృతః" అనిశ్రుతి ప్రమాణమున క్షత్రియులు పురుషోత్తముని బాహాసంజనితు లనుట స్పష్టము. "అస్మాభిర్నిజదోఃప్రసూతిమధునా ధన్యామజో మన్యతే" అని విద్యానాథుఁడును బ్రయోగించియున్నాఁడు.

అలంకారము. రూపకము, ఉత్ప్రేక్ష. లక్షణము, "ప్రకటమగు నట్టి విషయంబునకు విషయ్య, భేదతాద్రూప్య రంజనంబేదియదియ, రూపకంబు" అడిదము సూరకవి.

"అలవడశబ్దార్థములకుఁ, జెలువంబగునన్యవస్తుప్తి సృజియించి సము, జ్జ్వల దుత్ప్రేక్షావ్యంజన, ములచే నుత్ప్రేక్షయనఁగ మొనయుంగృతులన్." విన్నకోట పెద్దన.

గీ॥ ఆకువీటిపురీశాసనాంకుఁ డగుచు
సకలసంగ్రామకేళి నిశ్శంకుఁ డగుచు
ననిశపూజితశేష పర్యంకుఁ డగుచు
నతఁడు సొంపొందు యువతిమీనాంకుఁ డగుచు. 22

అ. ఆకువీటిపురీశాసన=ఆకువటిపురమునకు రాజనెడు, అంకుఁడగుచున్ = చిహ్నముగలవాఁడగుచు, పేరుగలవాఁడనుట- సకల. ...నిశ్శంకుఁడగుచు. సకల = సమస్తమైన, సంగ్రామకేళి = రణవిహారములందు, నిశ్శంకుఁ డగుచున్ = జంకులేనివాఁడగుచు, అనిశ...పర్యంకుఁడగుచున్. అనిశ = ఎల్లప్పుడును, పూజిత = పూజింపఁబడిన, శేషపర్యంకుఁడగుచున్ = ఆది శేషునిశయ్యగాఁగల విష్ణునిఁగలవాఁడగుచు, యువతి మీనాంకుఁడగుచున్ = యౌవనవతుల పాలిటి మన్మథుఁడగుచు, వారిచేఁ బ్రేమింపఁబడిన వాఁడ నుట. అతఁడు=అయిమ్మరాజు, సొంపొందున్ = రంజిల్లును.

తా. అయిమ్మరాజాకువీటిపురపు రాజను పేరు గలవాఁడగుచు, నెట్టి యుద్ధమునే నెట్టి శత్రువుతో నేని వెనుదీయని వాడగుచు, సర్వదా నారాయ ణునిబూజించు వాడఁగుచు, యువతుల పాలిటి మన్మథుఁడగుచు, రంజిల్లు చుండెను.

ఆకువీటి-ఇట వీడునకుటివర్ణ మాపవిభక్తికమగు నాదేశము.

అలంకార. ఉల్లేఖము. లక్షణము. "బహుజనులచేత నొకనికి బహువిధ ముగఁ, దనరనుల్లేఖ ముల్లేఖమనఁగనొప్పు-" అలంకార చంద్రిక.

క. కౌండిన్యగోత్రజలధివి
ధుం డాతఁడు గాంచె వరసుతుడున్ భావమహీ
మండలపతిఁ గదనబలో
ద్దండుని, లక్ష్మాంబ యనెడుసతనసతియందున్. 23

అ. కౌండిన్య...విధుండు- కౌండిన్యగోత్రజలధి = కౌండిన్య గోత్ర మనెడు సముద్రమునకు, విధుండు = చంద్రుఁడు, అతండు=అయిమ్మరాజు,

లక్ష్మాంబయనెడు, తనసతియందున్ = లక్ష్మాంబయను నట్టి తన భార్యయందు, కదనబలోద్దండునిన్=యుద్ధమునందు బలముచే భయంకరుఁడగువానిని, భావమహీమండలపతిన్ = భావరాజును, ఆపేరుగలవాఁడనుట. వరసుతున్ = పుత్రశ్రేష్ఠుని, కాంచెన్ = కనెను.

తా. కౌండిన్యగోత్రమునఁ గల్గినయాయిమ్మరాజు తన భార్యయగులక్ష్మాంబయందు యుద్ధరంగమునఁ దనబలముచే శత్రువులకు భయంకరుఁడుగానుండు భావరాజను వానిఁగాంచెను.

అలంకార. రూపకము.

స్రగ్ధర. ఆలక్ష్మాంబాకుమారుం డమలయశుఁడు భా
వావనీశుండు సాధ్వీం
బోలాంబం బెండ్లియై యొప్పఁగ నెనియె సుతుల్
భూపరీరంభలీలా
శీలస్థూలంభవిష్ణు స్థిర భుజబలల
క్ష్మీవిశేషప్రయుక్తో
ద్వేలాశా దంతి శుండావిలసనలఘిమా
వేశు నిమ్మక్షితీశున్. 24

అ. ఆ లక్ష్మాంబా కుమారుఁడు = ఆలక్ష్మమపుత్త్రుఁడగు అమలయశుఁడు = నిర్మలకీర్తిగలవాఁడు, భావావనీశుండు = భావరాజు, సాధ్వీన్ = పతివ్రతయైన, పోలమన్ = పోలమను, పెండ్లియై = వివాహమాడి, ఒప్పఁగన్ = తగులాగున, భూపరీరంభ...ఆవేశున్. భూపరీరంభ = భూమియొక్క యాలింగనంబు నందుఁగల,భూవహనముననుట. లీలా=వేడుకయే, శీల = స్వభావముగాఁగల, స్థూలంభవిష్ణు = వృద్ధిపొందుచున్న, స్థిర = నిలుకడగల, భుజబల = బాహుబలముయొక్క, [భూపరీరంభ లీలాశీల, స్థూలంభవిష్ణు, స్థిర, అనునవి భుజశబ్దములకు విశేషణములు.] లక్ష్మీవిశేష= సంపద్విశేషముచే, ప్రయుక్త = ప్రయోగింపఁబడిన, కలుగఁజేయఁ

బడినదనుట, ఉద్వేలాశా = దిగంతము లందలి, దంతి=ఏనుఁగులయొక్క, శుండా = తొండముల యొక్క, విలసన = విలాసముకొఱకయిన, లఘిమా= చులకదనముయొక్క, ఆవేశః = ప్రవేశము గలవానిని, ఇమ్మక్షితీశః= ఇమ్మరాజును, సుతః, కనిష్ఠః = కుమారునిఁ గనెను.

తా. భావరాజు పోలమాంబను వివాహమాడి భూభరము దాల్చుచున్న భుజబలముచే దిగ్గజముల తొండములకు విలాసముకొఱకు లఘుత్వమిచ్చుచున్నట్టి యిమ్మరాజును గాంచెను.

"ఉద్వేలాశాదంతి" యనుచోటను ద్వేలశబ్దము నాశాదంతియను దానికి విశేషణమని భావింపవచ్చును గాని దిగంతముల యందలి యను నర్థమువచ్చులాగున నుద్వేలాశాయనుటయే కవియొక్క యాశయమగును.

అలంకారము. అసంబంధే సంబంధాతిశయోక్తి. లక్షణము. "ఉపమేయ మింతపడవక, యుపమానమెనుడువ నతిశయోక్తి కవిమహా, నిపుణోక్తిమూలమైతగు, నపరిమిత ప్రౌఢినదియు నైదువిధములై. పరఁగ సంబంధమం దసంబంధమనఁగ, మఱి యసంబంధమందు సంబంధమనఁగ, భేదమందున భేదమభేదభేద, భావమును గార్యహేతు విపర్యయమన," కావ్యాలంకార సంగ్రహము.

స్రగ్ధరాలక్షణము. "శ్రీమన్మార్తి మకారాశ్రితక, భరన,య,'యా నేత్రమై సానుమద్వి శ్రామంబుః సానుమ ద్విశ్రమము నమరఁగా స్రగ్ధరావృత్తమయ్యెః" తాతంభట్టు.

క. రాజమహేంద్రవరాధిపు
రీజైత్రవిచిత్రములఁ బరిభ్రాజితుఁడై
యాజిఘనుం డాయిమ్మన
హీజాని ప్రసిద్ధిఁగాంచె నెంతయు మహిమన్. 35

అ. రాజమహేంద్రవర,......విచిత్రములన్ - రాజమహేంద్రవర, అధి పురీ = రాజమహేంద్రవరమనెడి నగరశ్రేష్ఠము యొక్క, జైత్ర

విచిత్రములన్ = జయశీలములైన వింతలచే, వింతపనులచేననుట. పరిభ్రాజితుఁడై = ప్రకాశించువాఁడై, ఆజిఘనుండు = యుద్ధము లందు గొప్పవాఁడు, రణశూరుఁడనుట. ఆయిమ్మమహీజాని = ఆయిమ్మ రాజు, ఎంతయున్ = మిక్కిలి, మహిమన్ = ప్రసిద్ధిని, కాంచెన్ = పొందెను.

తా. ఇమ్మరాజు రాజమహేంద్రపురమును జయించి యుద్ధవీరుఁడై యొప్పుచుండెను.

"మహీజాని" ఇట జాయాంతమగు బహువ్రీహికి నిజాదేశము "జాయాయానిఙ్" పాణిని.

గీ. ఆమహీలోకవిభునియర్ధాంగలక్ష్మి
యైన కసవమ్మ యనసూయ ♦ యగుట నార్య
యగుట సుప్రసిద్ధమ వేఱె ♦ యడుగనేల
వినుతి కెక్కుపాతివ్రత్య ♦ విలసనంబు. 26

అ. ఆమహీలోకవిభుని = అరాజుయొక్క, అర్ధాంగలక్ష్మి యయిన= భార్యయయిన, కసవమ్మ = కసవాంబ, అనసూయయగుటన్ = అనసూయాదేవియగుటచే, అసూయలేని దగుటచే, ఆర్యయగుటన్ = పార్వతి యగుటచే, కులీనయగుటచే, సుప్రసిద్ధమ= తేట తెల్లముగనే, వినుతికెక్కు= పొగడ్తగన్న, పాతివ్రత్యవిలసనంబు = పతివ్రతామహిమ, వేఱె, అడుగనేల = వేఱుగా నడుగవలయునా.

తా. ఇమ్మభూపతిభార్య కసవమ్మ యనసూయయు నార్యయునగుటచే నామెపాతివ్రత్య విషయమై యడుగవలయునా ?

అలంకార, శ్లేష.

క. ఆయిమ్మడి ధాత్రీతల
నాయకునకుఁ గసవమకును ♦ నందను లధిక

శ్రీయుతు లిద్దఱు సుజనవి
ధేయులు బొమ్మప్రభుండు తిమ్మవిభుండున్. 27

అ. అయమ్మడిధాత్రీతల నాయకునకున్=అయిమ్మడిరాజునకు, కసవమకును = కసవాంబకును, అధికశ్రీయుతుల్ = మిక్కుటమగు సంపదతోఁ గూడినవారును, సుజనవిధేయులు = సజ్జనులకడఁగినవారు, బొమ్మప్రభుండు = బొమ్మరాజు, తిమ్మవిభుండున్ = తిమ్మరాజును, అని, ఇద్దఱు, నందనులు = అని యిర్వురుకుమారులు, కలిగిరని శేషము.

తా. అయిమ్మరాజునకుఁ గసవమకును సంపద్యుక్తులును సజ్జనులునగు బొమ్మరాజు, తిమ్మరాజు అని యిర్వురుపుత్రు లుదయించిరి.

వ. వారిలోన. 28

ఉ. పావనమూర్తియై విజయభైరవసద్బిరుదాంకుఁడై, దశా
శావనితా లలాటతటచందన చిత్రక భావభాగ్యశ
శ్శ్రీవిభవాభిరాముఁడయి జృంభితదానవిహారుఁడై, ధరి
త్రీవలయంబునన్ వెలసెఁదిమ్మనృపాలుఁడు ధర్మశీలుఁడై.

అ. పావనమూర్తియై = పవిత్రశరీరుఁడై, సౌందర్యవంతుఁడైయనుట. కామినీ జనకామనీయ మగు రూపముగలవాఁడని భావము. విజయభైరవసద్బిరు దాంకుఁడై = విజయభైరవుఁడను మేటి బిరుదుగలవాఁడై, దశ, ఆశా, వనితా = పదిదిక్కులనెడు స్త్రీలయొక్క, లలాటతట = నొసటిప్రదేశముల, చందనచిత్రక భావభాక్ = గంధపుబొట్టగుటను బొందిన, యశశ్శ్రీవిభవ = కీర్తియనెడి సంపదయొక్క వైభవముచేత, అభిరాముఁడై = మనోహరుఁడై, జృంభిత=విజృంభించుచున్న, దానవిహారుఁడై = దానపరుఁడై, తిమ్మనృపాలుఁడు = తిమ్మరాజు, ధరిత్రీవలయంబునన్ = భూమండలమునందు, వెలసెన్ = ఒప్పెను.

తా. తిమ్మరాజు విజయభైరవ బిరుదాంకుఁడై, దశదిశావ్యాప్త కీర్తియై దానధర్మపరుఁడై యొప్పుచుండెను.

ఇట్లు దిమ్మభూపతియందు నాయకస్వరూప నిరూపణము సేయఁబడెను. నాయకలక్షణము, "యశఃప్రతాపసుభగో ధర్మకామార్థతత్పరః। ధురంధరో గుణాఢ్యశ్చ నాయకః పరికీర్తితః" ప్రతాపరుద్రీయము. "యశశ్శ్రీ విభవాభిరాముఁడు" విజయభైరవ సద్బిరుదాంకుఁడు." అను విశేషణములచే యశః ప్రతాప సుభగత్వము సూచితము. "ధర్మశీలుఁడై," "పావనమూర్తియై" జృంభితదాన విహారుఁడై" అనువిశేషణములచే ధర్మకామార్థతత్పరత్వము సూచింపఁబడియెను."విజయభైరవ సద్బిరుదాంకుఁడై తిమ్మనృపాలుఁడు ధరిత్రీవల యంబునన్ వెలసె" ననుటచే ధురంధరత్వము సూచితము. పైనఁజెప్పినవెల్ల నాతనిసద్గుణములే యగుటచే గుణాఢ్యత్వమును సూచింపఁబడియెను.

క. ఉభయకులసిద్ధిఁ దనరెడు
నభినవగుణములఁ బ్రసిద్ధ యగుతిమ్మాంబన్
విభవమునఁ బెండ్లియాడెను
ద్రిభువనవిభుఁ డాకువీటితిమ్మవిభుఁ డొగిన్. 30

అ. త్రిభువనవిభుఁడు = ముల్లోకములయందును గొప్పవాఁడు, ఆకువీటి తిమ్మవిభుఁడు = ఆకువీటిరాజగు తిమ్మరాజు, ఒగిన్ = క్రమముగా, ఉభయకులసిద్ధిన్ = పుట్టినింటియొక్కయుఁ, జొచ్చినయింటియొక్కయు, నిలుకడచేత, తనరెడు = ఒప్పునట్టి, అభినవగుణములన్ = నూతనగుణములచే, ప్రసిద్ధయగు = ప్రఖ్యాతయగు, తిమ్మాంబన్ = తిమ్మాంబికను, విభవమునన్ = వైభవముతోడ, పెండ్లియాడెను = వివాహముచేసికొనెను.

తా. ముల్లోకములయందు వ్యాపించినప్రతాపముగల తిమ్మరాజు పాతివ్రత్యాది గుణములచే నుభయకుల పవిత్రయగు తిమ్మాంబను బెండ్లియాడెను.

చ. పటుబలశాలి తిమ్మనరపాలుఁడు పుత్త్రులఁ గాంచె విక్రమో
ద్భటుఁ బెదవేంకటాద్రిఁ బ్రతిపక్షహరున్ జినవేంకటున్నరు

ద్విటపిసమానదానఘనుఁ డౌవేంకటరాయని భవ్యతేజు వేం
కటవరదుఁ బుధప్రణుతిఁ గాంచినతిమ్మమయందుఁ బెంపుగన్.

అ. పటుబలశాలి = గట్టిబలిమినిగల, తిమ్మనరపాలుఁడు = తిమ్మ రాజు, బుధప్రణుతిఁ, కాంచిన = పండితుల పొగడికోలునందిన, తిమ్మ మయందుఁ = తిమ్మాంబయందు, పెంపుగన్ = వృద్ధిగా, విక్రమ = పరా క్రమమునందు, ఉద్భటుఁ = ఉద్దండుఁడయిన, పెదవేంకటాద్రిఁ = పెద్దవేంకటాద్రిరాజును, ప్రతిపక్షహరుఁ = శత్రువినాశకుఁడైన, చినవేం కటుఁ = చినవేంకటాద్రి రాజును, మరుద్విటపి = ...ఘనుఁ-మరుద్వి టపి = కల్పవృక్షముతో, సమాన = సరియయిన, దాన=ఈవిచే, ఘనుఁ = గొప్పవాఁడయిన, వేంకటరాయనిఁ = వేంకటరాజును, భవ్యతేజుఁ = మనోహరమైనకాంతిగల, వేంకటవరదుఁ = వేంకటవరదరాజును, పుత్త్రి లఁ = ఈనల్వురుపుత్త్రిలను, కాంచెఁ = పొందెను.

తా. తిమ్మరాజు తిమ్మాంబయందు, పరాక్రమవంతుఁడగు పెదవేంక టాద్రి, శత్రునాశకుఁడగు చిన వేంకటాద్రిరాజు, కల్పవృక్షముం బోలెదాన శీలుఁడగు వేంకటరాయఁడు మనోహరమగుకాంతిగల వేంకటవరదుఁడు అను నల్వురఁ గుమారులఁగాంచెను.

చంపకమాలా లక్షణము. "న, జ, భ, జ, జల్, జ, రేఫలఁ బె నంగి దిశాయతితోడఁగూడినన్, ద్రిజగదభీష్టదాబుధనిధీవిను చంపకమాలయై చనున్." తాతంభట్టు.

వ. అందు. 32

గీ. అమరవరభూమిభృన్మస్తకములఁ గ్రిందు
వఱచునిజపాదకటకసకృత్ప్రౌఢిచేత
విమలధృతిఁ గేశవప్రాయకీణమున వెలయు
వేంకటాద్రియ యనఁబినకవేంకటాద్రి. 33

అవతారిక. ఈపద్యమునఁగవి వేంకటాద్రియను నామైక్యమాధారము గావించుకొని చిన వేంకటాద్రిరాజునకును వేంకటాచలమునకును సామ్యము దెల్పుచున్నాఁడు.

అ. అమరవర ... మస్తకములన్-అమరవరభూమిభృత్ = దేవతల పర్వతమగు మేరువుయొక్క, మస్తకములన్ = శిఖరములను, క్రిందుపఱచు = చులకనఁగాఁజేయు, నిజ...ప్రౌఢిచేతన్ - నిజ = తనయొక్క, పాదకటక = నితంబప్రదేశముయొక్క, సత్ప్రౌఢిచేన్ = గొప్పతనముచే, ఔన్నత్యముచేతననుట. ఇది వేంకటాచలపర్యాయమగు నర్థము. అమరన్ = ఒప్పఁగా, వరభూమిభృత్ = రాజశ్రేష్ఠులయొక్క, మస్తకముల్ = శిరస్సులను, క్రిందుపఱచు = వంగులాగునఁజేయు, నిజ = తనయొక్క, పాద = చరణములయందలి, కటక = నూపురములచేనైన, సత్ప్రౌఢి చేతన్ = ఎక్కుడగు చప్పుడుచేత, ఇది చినవేంకటాద్రిరాజు పర్యాయము. రాజుయొక్క కాలియందె చప్పుడువిని యన్యరాజులు తలలవంచెదరనుట. విమలధృతిన్ = నిర్మలమగు ధైర్యముచేతను, కేశవ = వేంకటేశ్వరునికి, ప్రాయణమునన్ = ఉనికియగుటచేతను, అర్థముభయత్ర సమానము. వేంకటాద్రియ = వేంకటాచలమే, అనన్ = అనులాగున, చిన వేంకటాద్రి = చిన వేంకటాద్రిరాజు, వెలయున్ = ప్రకాశించుచున్నాఁడు.

తా. చినవేంకటాద్రిరాజు వేంకటాచలమే యనులాగునఁ బ్రకాశించు చుండెను. వేంకటాచలము మేరుపర్వత శిఖరములఁ గ్రిందుపఱచు నితంబ ప్రదేశము గల్గియున్నది. అట్లేరాజు శత్రురాజులఁ దలలఁగ్రిందుపఱచు పాదకటకము గల్గియున్నాఁడు. ధైర్యముభయత్రసమానముగనే యున్నది. వేంకటాచలము దేవునకుస్థానమగుచున్నది. రాజు దానెల్లప్పుడు ధ్యానము సేయుచుండుటచే దేవునకు స్థానముగుచున్నాఁడు. కాఁబట్టియే వేంకటాచలముతో వేంకటాద్రిరాజున కిట సామ్యము చెప్పఁబడియెను.

[1] "కటక" "కటకో స్త్రీనితంబోద్రేః," 'కటకంవలయోఽస్త్రీయాం' అని అమరము.

అలంకారము, శ్లేషానుప్రాణితముగు నుత్ప్రేక్ష.

చ. క్షమయు నమోఘవిక్రమముఁ సద్వినయంబు ప్రతాపముం సురూ
పము నవికారభావమునుఁ బ్రాభవశక్తియు నిత్యదానశీ
లముఁ దగ నొక్కటొక్కటికిఁ నలంకృతిఁ జేయఁగఁ దాల్చి శోభిలు
న్విమలత నాకు వీటిపురఁ వేంకటరాయఁ డతిప్రసిద్ధుఁడై. 34

అ. క్షమయున్ = ఓర్పును, అమోఘవిక్రమము=వ్యర్థముగాని పరాక్రమమును, సద్వినయంబు = మంచి యడఁకువయును, ప్రతాపమున్ = తపింపఁజేయుటయును, సురూపమున్ = మంచియందమును, అవికార భావము = పరిణామములేని మనస్సు గల్గియుండుట, అవ్యవస్థిత, చిత్తుఁడుగాకుండుటయనుట. ప్రాభవశక్తియున్ = ప్రభుత్వశక్తియు, నిత్యదానశీలమున్ = ఎడతెగని దానస్వభావము గల్గియుండుట, తగన్ = తగునట్లు, ఒక్కటి = ఒకగుణము, ఒక్కటికిన్ = వేఱొకగుణమునకు, అలంకృతిచేయఁగన్ = అందమునీయఁగా, ఒకదానిచేనొకటి ప్రకాశింపఁగాననుట. తాల్చి = పైనఁజెప్పినగుణముల ధరించి, అతిప్రసిద్ధుఁడై = మిక్కిలి ప్రఖ్యాతుఁడై, ఇట్టిసద్గుణములు గల్గుటచేతనే మిక్కిలి ప్రసిద్ధుఁడగుచున్నాఁడనుట. ఆకువీటిపుర వేంకటరాయఁడు = ఆకువీటిరాజగు వేంకటరాయఁడు, విమలతన్ = నిర్మలత్వముచే=, శోభిలున్ = ప్రకాశించుచున్నాఁడు.

తా. ఓర్పు, పరాక్రమము, అడఁకువ, మున్నగు గుణము లొక దానికొకటి యలంకారమై వెలయఁగా ప్రసిద్ధుఁడై యాకువీటి వేంకటరాయఁడు శుద్ధుఁడై ప్రకాశించుచున్నాఁడు.

క్షమయున్, అమోఘ విక్రమమున్; క్షమావంతుఁడగుటచే 'మృదుర్హి పరిభూయతే' యనులాగునఁ గాక విక్రమయుక్తత యాక్షాంతియుక్తతకు మెఱుఁగిడుచున్నది. అమోఘవిక్రమము, సద్వినయంబు; అమోఘ విక్రముఁడగుటచే దుష్ప్రధర్ష్యుఁడుగాక యడఁకువ గల్గియుండుట యా విక్రమము

ను వెలయించుచున్నది. సద్వినయంబు, ప్రతాపముక్, అడఁకువ గల్గుటచే నెల్లరకు లౌంగక శాత్రవులకు దుర్జయుఁడుగా నుండులాగునఁ బ్రతాపము గల్గియుండుట యీ యడఁకువ గల్గియుండుట కలంకార మగుచున్నది. ప్రతాపము, సురూపము; ప్రతాపవంతుఁడగుటచే, 'అభితః పావకోపమః' అనులాగుననుండక, సురూప సంపద దానికిఁ గాంతి యొసఁగుచున్నది. సురూపమును, అవికార భావమును; సురూపుఁడగుటచే భజనీయుఁడైనను 'అవ్యవస్థిత చిత్తస్య ప్రసాదోపి భయంకరః' అనునట్లు చంచల చిత్తుఁడుగాక స్థిరచిత్తుఁడుగా నుండుట యీరూపయుక్తినిఁ దేజోవంతముగాఁ జేయుచున్నది. అవికారభావమును, ప్రాభవశక్తియు; స్థిరచిత్తుఁడగుటచే నుద్ధతుఁడుగాక జనానురంజకుఁడుగాఁ బ్రభుత్వము చేయు శక్తి గల్గియుండుట యద్దానిందీపింపఁ జేయుచున్నది. ప్రాభవశక్తియు, నిత్య దానశీలమును; ప్రభుత్వమున నార్జించిన ధనము స్వప్రయోజనము గావించుకొనక దానపరుఁడగుట ప్రాభవశక్తిని బ్రకాశింపజేయుచున్నది.

క. వేంకటవరదుఁడు వెలయు ని
రంకుశవితరణనిరూఢశప్రజ్ఞను రణని
శ్శంకితప్రాభవమున, నక
లంకితకీర్తిప్రతాపకలక్ష్ములమహిమన్. 35

అ. వెంకటవరదుఁడు = వేంకటవరదరాజు, నిరంకుశ... ప్రజ్ఞను నిరంకుశ = అడ్డులేని, వితరణ = ఈవిచే, నిరూఢ = రూఢమగు, ప్రజ్ఞను = బుద్ధిచేత, రణ...ప్రాభవమునన్ - రణ = యుద్ధరంగమున, నిశ్శంకిత = జంకులేనట్లుగాఁ జేయఁబడిన, ప్రాభవమునన్ = ప్రభుత్వముచేత, అకలంకిత...మహిమన్ - అకలంకిత = కలంకరహితముగాఁ జేయఁబడిన, కీర్తి = యశస్సుయొక్క, ప్రతాప = పరాక్రమముయొక్క, లక్ష్ముల = సంపదలయొక్క, మహిమన్ = గొప్పదనముచే, వెలయున్ = ప్రకాశించుచున్నాఁడు.

తా. వేంకట వరదరాజీవిచే గీర్తిమంతుఁడై, శౌర్యమునఁ బ్రతాపవంతుఁడై, ప్రాభవమున సంపన్నుఁడై వెలయుచుండెను.

ఇట రణనిశ్శంకితయను పదము విశేషణమైనను దనూన్మూలమునఁ బ్రతాపమును, ప్రాభవ మను దాన సంపదను దెల్పుటయే కవి యాశయము.

అలంకారము, యథాసంఖ్యము. లక్షణము. "సమముగనే వరుసఁబదార్థములుద్దిష్టంబులయ్యెఁ దగనా పర్యాయమున ననూద్దిష్టములై యమర యథాసంఖ్యమయ్యె". కావ్యాలంకార సంగ్రహము.

గీ. ఇట్టియన్వయపరిశుద్ధి యింపు మీఱ
శ్రీవిరూపాక్ష భక్తివిశేషవిమల
హృదయుఁ డగుచు సంగీతసాహిత్యనిత్య
సరసగోష్ఠీవినోదైకనిరతుఁ డగుచు. 36.

అ. ఇట్టి=పూర్వోక్తములైన, అన్వయపరిశుద్ధి=వంశపరిశుద్ధి, ఇంపు మీఱన్ = ఒప్పుచుండఁగా, శ్రీవిరూపాక్ష .. హృదయుఁడు - శ్రీవిరూపాక్షభక్తివిశేష = శ్రీవిరూపాక్షస్వామియందలి భక్త్యతిశయముచే, విమలహృదయుఁడు, అగుచున్ = నిర్మలచిత్తుఁడగుచు, సంగీత...నిరతుఁడు- సంగీతసాహిత్య = సంగీతశాస్త్రమునందును, సాహిత్యమునను, నిత్యసరస= ఎడతెగనిరసాను భవముసేయువారి తోడనగు, గోష్ఠీవినోద = సల్లాపము నందైనవేడుకయందే, ఏక = ఒక్కటిగా, ముఖ్యముగా ననుట. నిరతుఁడు, అగుచున్ = ఆసక్తుఁడగుచు, ఇందలి కర్తృక్రియలు పై పద్యమునఁగలవు.

తా. పూర్వోక్తాన్వయపరిశుద్ధి గలవాఁడై, విరూపాక్షభక్తుఁడై, సంగీతసాహిత్య విధులతో గోష్ఠీ వినోదములు సేయుచుండ.

క. వడిఁగలతనాన నీగిని
విడిముడిపసఁ బ్రాభవమున విజయనగరిలో

గడు నెన్న నేర్పఁ గలమే
ల్నడకలఁ బెదవేంకటాద్రినరవరుఁ డొప్పున్. 37

అ. వడిగలతనానన్ = శౌర్యవంతత్వముచేత, ఈగిని = దాతృత్వముచే, విడిముడిపసన్ = ధనసంపత్తిచే, ప్రాభవమునన్ = ప్రభుత్వముచే, విజయనగరిలోన్=విజయనగరమునందు, కడున్=మిక్కిలి, ఎన్నన్ ఏర్పన్, కల = గణించుటకును, ఏర్పుటకును దగిన, మేల్నడకలన్ = గొప్పనర్తనలచే, పెద్దవెంకటాద్రిరాజు, ఒప్పున్ = ప్రకాశించును.

తా. విజయనగరమున శౌర్యాది గుణములలో నెన్నిక గన్న పెద్దవేంకటాద్రి రాజుండెను.

చ. విడువక యాకువీటిపెదవేంకటభూపతి సత్ప్రతాపమున్
గడుఁదెలుపైనకీర్తియు జగంబులనన్నిటి ముంచి మించిన
న్జడధిశయుండు సంతసిలునాదువిరాణ్మయమూర్తి కబ్బె ని
ప్పుడునవకుంకుమంబు తెలిపూవులపూజయునంచునాత్మలోన్.

అ. విడువక = వదలక, ఆకువీటి పెదవేంకటభూపతి = ఆకు వీటి రాజగు పెదవేంకటరాజుయొక్క, సత్ప్రతాపమున్ = పరాక్రమమును, కడున్, తెలుపైన, కీర్తియున్ = మిక్కిలి తెల్లదగు కీర్తియును, జగంబులన్, అన్నిటిన్=సర్వలోకములను, మించి = అతిశయించి, ముంచినన్= ముంపఁగా, కీర్తిప్రతాపములు లోకములు నిండెననుట. జడధిశయుండు = సముద్రశాయియగు నారాయణుఁడు, ఇప్పుడు = ఈవేళ, నాదువిరాణ్మయమూర్తికిన్ = నాయొక్క విరాడ్రూపమైన దేహమునకు, [ప్రళయసమయమున నారాయణుఁడు విరాడ్రూపియై సముద్రమధ్యమున శయనించుట శాస్త్రప్రసిద్ధము.] నవ = నూతనమైన, కుంకుమంబు = కుంకుమపుఁబూఁతయు, తెలిపూవులపూజయున్ = తెల్లనగుపువ్వులచే నయిన పూజయు, అబ్బెనంచున్ = కల్గెనను, ఆత్మలోన్ = మనస్సులో, సంతసించున్ = సంతోషించును.

తా. పెద వేంకటాద్రిరాజుయొక్క ప్రతాపము కీర్తియు లోకముల నిండఁగా విరాట్పురుషుఁడు తనకుఁ గుంకుమము పూఁతయుఁ దెల్లనిపూవుల పూజయు వచ్చెనని సంతసించుచుండెను.

'నామువిరాణ్మయమూర్తికిన్' 'యుష్మదస్మదాత్మార్థకములకు త్తర పదంబు పరంబగు నపుడు దుగాగమంబు వైకల్పికము.'' బాలవ్యాకరణము.

జడధియనియూఁడవపాదమున డకారము ప్రాసార్థము గల్పితమైనను, లడలకభేదమగుటచే నిదిసాధు సమ్మతము. జడము నఁగాఁ జల్లనినస్తువని యర్థము. "బలఘ్, అవదారయతీతి జడః లడయోరభేదాత్, జల అవదారణే.'' అని గురుబాలప్రభోధిక. జడ శబ్దవ్యుత్పత్తి జలధాతువునుండి కల్గుటచే నీప్రయోగము సాధువనుట నిర్వివాదాంశము.

అలంకారము. యథాసంఖ్యము. అసంబంధే సంబంధ రూపాతిశయోక్తి.

ఉ. చేకొని యాకువీటివిభుఁ డ్రీపెదవేంకటుఁ జెంది, యాత్మలో
నేకలసద్గుణంబు మహి యెన్నద నేకలసద్గుణాప్తిచేఁ
జైకొని శేషభోగములఁ గల్మి దలంప దశేష భోగలీ
లాకలనంబుచేతఁ గరుఁ గల్గిరుల నమ్మెచెప్ప నేటికిన్. 39

అ. మహి = భూదేవి, ఆకువీటివిభు = ఆకువీటిరాజగు, శ్రీపెదవేంకటున్ = శ్రీపెదవేంకటాద్రిరాజును, చేకొని = గ్రహించి, పరిణయించి యనుట. చెంది = కూడి, పాలింపఁబడినదై యనుట. ఆత్మలోన్ = మనస్సునందు, అనేకల = ఏకలముగాని వానియొక్క సద్గుణ = మంచిగుణములయొక్క, ఆప్తిచేన్ = ప్రాప్తిచేత, ఇదిహేతువు. ఏకల = వరాహముయొక్క, సద్గుణంబు = మంచిగుణమును, ఎన్నదు = గణింపదు, [అనేకల. వరాహము కాని వానియొక్క యనుటచే, రసికశ్రేష్ఠుఁడగు పెదవేంకటాద్రి రాజుయొక్క గుణములందు మరిగినది కాఁబట్టి మృగముయొక్క గుణమును మెచ్చుట లేదని భావము.]

అనేక, లసత్, గుణాప్తిచేఁ = పెక్కులగు ప్రకాశించుచున్న గుణములు గలవారి యొక్క ప్రాప్తిచేత, ఒక = ఒక్కటియగు, లసత్ = ప్రకాశించుచున్న, గుణంబు = గుణమును, కేవలసత్వగుణంబును - ఎన్నదు = గణింపదు, అని యర్థాంతరము.] స్త్రీలు బహుగుణులం దభిమానించువారు కాఁబట్టియే బహుగుణవంతుఁడు జిక్కనే నేకగుణు నాదరింపరనుట.]

అశేషభోగ = శేషభోగము కానివానియొక్క, అశేష = శేషముకాని యితరాను భూతశేషము కాని యనియు నర్థము. లీలాకలనంబు చేతఁ = విలాసానుభవముల చేత, ఇదియును హేతువు. శేష=ఆదిశేషునియొక్క, భోగముల = పడగలయొక్క, కల్మి = విలాస సంపదను, తలంపదు = స్మరింపదు.

[ఇతరానుభూతములై పరిశిష్టములగుటచే రసహీనములుగాక యభినవములై యభినవభోజ్యంబులగు సుఖములఁ బెదవేంకటాద్రివలనఁ బొందుటచే, సర్వక్రీడను మెచ్చుకున్నదని భావము.]

అశేష = సమస్తమైన, లీలాకలనంబు చేఁ = విలాసానుభవము చేత, శేష = కొద్దియయిన, భోగములకల్మిని = సుఖములయొక్క యనుభవమును, తలంపదు = స్మరింపదు. అని యర్థాంతరము. [సర్వ సుఖములుండు స్థలము వీడి కొద్దిసుఖములుండు ప్రదేశమునఁ బ్రీతి గావింపదని భావము.]

మఱి = ఇంక, కరులఁ = దిగ్గజములను, గిరులఁ = కులపర్వతములను, చెప్పనేల = ఏమని చెప్పవలయును, [భగవదంశ సంభూతులగు వరాహాదిశేషులనే మెచ్చన దిప్పుడు తక్కినవాని విషయము చెప్పనేల యని భావము.]

తా. భూమి యాకువీటి పురాధీశ్వరుఁడగు పెద వేంకటరాజును జెంది యాదివరాహునిగాని, శేషునిగాని తలఁపకుండెను. ఏలన ? వరాహముయొక్క గుణము, ఏకల సద్గుణము. అనగానే కలము పంది. దాని గుణము. లేక యేక + లసత్ + గుణము, ఒక్కటియే యగుసద్గుణము.

ఇట వేంకటాద్రిగుణము. అనేకలసద్గుణము, అనగా, అనేకల + సద్గుణము. పంది కాని దానియొక్క గుణము. లేక అనేక+లసత్+గుణము. పెక్కు ప్రకాశించుచున్న గుణములు మృగరూపియయ్యు నానేకగుణము గల్గుటచే నట్టివరాహమును వీడి, రసికుఁడై పెక్కుగుణములుగల రాజునాశ్రయించెను. మఱియు నిదివఱకు శేషభోగ సుఖములనను భవించుచుండెను. అనఁగాఁ బరిభుక్తశేషమగు భోగసుఖమనియు, శేషునియొక్క పడగయందు వసించుటచేఁ గల్గినసుఖమనియునగును. అట్టి దానికిప్పుడు వేంకటాద్రివలన నశేషభోగసుఖములు అనఁగా సర్వభోగములనియు నాదిశేషుఁడుకాని వానియొక్క భోగములనియు, నన్యభుక్తపరిశిష్టముగాని భోగమనియు భావము. వేంకటపతిరాజువలన నూత్నభోగములు లభించుటచే సర్వము వలని పరిశిష్టభోగము నపేక్షింపలేదనుట. ఇట్లు దేవాంశసంభూతులనే లక్ష్యముచేయ నపుడింత సామాన్యములగు గిరులు కరులు నివియొక లెక్కలోనివియా ? భూమి వేంకటాద్రిరాజు నాశ్రయించినపిదప వరాహశేషదిగ్గజ, కులపర్వతములఁ బ్రేమించుట లేదనిభావము.

"భోగ." "భోగస్తు భోజనే విత్తే, నిర్వేశే పాలనే సుఖే వనితాదిభృతౌ రాజ్యే, సర్వస్యఫణకాయయోః." అని నానార్థరత్నమాల.

కరులన్. "ఐరావతః పుండరీకో వామనః కుముదోంజనః । పుష్పదంతస్సార్వభౌమ స్సుప్రతీకశ్చదిగ్గజాః." అని అమరము.

గిరులన్. "మహేంద్రోమలయ స్సహ్యః, శుక్తిమాన్ హిమపర్వతః, వింధ్యశ్చపారియాత్రశ్చ, సప్తైతేకుల పర్వతాః," అనిఅమరము.

అలంకారము. వ్యతిరేకము. కావ్యార్థాపత్తి. శ్లిష్టము.

భూదేవి ప్రేమించుటకు హేతువును దెల్పువ్యాజమున వరాహాదిశేషులకంటె వేంకటాద్రియందాధిక్యము దెల్పుటచే వ్యతిరేకము.

చెప్పనేలయని కైముతికన్యాయమున నర్థసిద్ధి కల్గుటచేఁ గావ్యార్థాపత్తి.

అనేకల+సద్గుణయనునప్పుడును. అనేక+లసద్గుణయనియు అశేష+భోగ+లీలాయనునప్పుడును శ్లిష్టము.

క్రమముగ వీనిలక్షణములు.

"మానుగవిషయ విషయులలోన నొక్కఁడధికముగఁ జెప్పఁబడి రేక మనఁగఁబరఁగు" ఆంధ్రచంద్రాలోకము.

"తగఁ గావ్యార్థాపత్తిని, నగుఁ గైముత్తికముచేత నర్థమున." అలంకార చంద్రిక.

"ఏకార్థోక్తంబయ్యును, నేకార్థము చిలుకుచుండు నెయ్యదియదిపో, లోకమున శ్లిష్టమనఁగాఁ, గైకొనఁదగుపద విచిత్రకల్పన విభులన్."
కావ్యాలంకార చూడామణి.

తే. ఈకరణి ధాత్రి వెలసిన శ్రీ యాకుపీటి
తిమ్మరాజుపుత్త్రతనయుఁ డుత్తీర్ణకీర్తి
పరుఁడు పెదవేంకటాద్రిభూవరుఁడు సేయు
సేవ లింపుగఁ గైకొను శ్రీ దైవమునకు. 40

అ. ఈకరణిన్, ధాత్రిన్, వెలసిన = ఈలాగునభూమియందొప్పిన, ఆకుపీటి తిమ్మరాజుపుత్త్ర తనయుఁడు = ఆకుపీటి తిమ్మరాజుయొక్క కుమారుఁడు, ఉత్తీర్ణకీర్తిపరుఁడు = లోకాతీతమగు యశమునందాసక్తుఁడు, పెద వేంకటాద్రిభూవరుఁడు = పెద వేంకటాద్రిరాజు, చేయు, సేవలు = చేయునట్టి, సేవలు=నందనములు, ఇంపుగన్, కైకొని = సంతోషముతో గ్రహించి, దైవమునకున్ = నా యిష్టదేవతకు, ఇదిమొదలెనిమిదిపద్యములు షష్ఠ్యంతములగుటచే నావలవచ్చు "సభక్తికసమర్పితంబుగా" నను దానితో వీనికన్వయము.

తా. ఈలాగున తిమ్మరాజు కుమారుఁడు కీర్తిపరుఁడు పెద వేంకటాద్రిరాజుచేయు గౌరవముల నందికొని.

## షష్ఠ్యంతములు.

క॥ లోకైకస్తుత్యునకు ని
రాకృత నతజనజనుర్జరామృత్యునకున్
త్రైకాల్యసత్యునకుఁ బా
ణౌకృతగిరిరాడపత్యునకు నిత్యునకున్. 41

అ. లోక = జనులచేత, ఏక = ముఖ్యముగ, స్తుత్యునకున్ = పొగడఁదగినవానికి, నిరాకృత...మృత్యువునకున్ - నిరాకృత=పోఁగొట్టఁబడిన, ఇది జనుర్జరామరణములకు విశేషణము. నతజన = నమస్కరించు జనులయొక్క, భక్త జనులయొక్కయనుట, జనుర్జరామృత్యువునకున్ = పుట్టుక, ముసలిదనము, మరణముగలవానికి, త్రైకాల్య = మూఁడుకాలములందును, భూతభవిష్యద్వర్తమానకాలములయందనుట. సత్యునకున్ = సత్యస్వరూపునకు, పాణౌ...అపత్యునకున్ - పాణౌకృత = వివాహమాడఁబడిన, గిరిరాడపత్యునకున్ = పార్వతిగలవానికి, నిత్యునకున్ = ఎల్లప్పుడుండువానికి.

తా. లోకస్తుత్యుఁడును, భక్తుల జననమరణాదిక్లేశ విమోచకుఁడును, సత్యస్వరూపుఁడును, పార్వతీపతియు, నిత్యుఁడునగువానికి.

"పాణౌకృతం" "నిత్యంహస్తేపాణా వుపయమనే" పాణిని.

క. అధ్యాత్మతత్త్వవిద్యా
సాధ్యునకు సమస్తయోగిజనహృత్కమలా
రాధ్యునకుఁ గాలదిగనవ
రోధ్యున కధ్యుషితతిగ్మరుచిమధ్యునకున్. 42

అ. అధ్యాత్మ..సాధ్యునకున్ - అధ్యాత్మతత్త్వవిద్యా = బ్రహ్మవిద్యచేత, సాధ్యునకున్ = ఎఱుఁగఁదగినవానికి, తక్కువవిద్యలచే నాతనిస్వరూపము గనుఁగొనుట యసాధ్యమని భావము. సమస్త...ఆరాధ్యు

నకున్-సమస్తయోగిజన, ఎల్లయోగిజనులయొక్క, హృత్కమల = కమలమువంటి హృదయముచే, ఆరాధ్యునకున్ = ఆరాధింపఁదగినవానికి, కాల, దిక్, అనవరోధ్యునకున్ = కాలముచేతను, దిక్కుచేతను, అడ్డగింపఁ బడఁదగనివానికి, అధ్యుషిత...మధ్యునకున్ - అధ్యుషిత = వాసముగాఁ జేయఁబడిన, తిగ్మరుచి = వేఁడివెలుఁగుయొక్క, సూర్యునియొక్కయనుట. మధ్యునకున్ = మధ్యప్రదేశము గలవానికి,

తా. ఆత్మవిద్యచే సాధింపఁదగినవాఁడును, యోగిజనులచే ధ్యానింపఁబడువాఁడును, కాలాదులచే నపరుద్ధుఁడుగాని వాఁడును, సూర్యమండలాంతర్వర్తియునగు వానికి.

"అధ్యుషిత తిగ్మరుచిమధ్యునకున్" త్రిమూర్తులును సూర్యమండలమధ్య వర్తులనుట వేదప్రసిద్ధము.

క. శంకారుజాపహృత్యగ
దంకారున కచలితామృతప్రియముఖస
త్యంకారభక్తియుక్త్య క
లంకారచితార్యనుత్యలంకారునకున్. 48

అ. శంకా... అగదంకారునకున్ - శంకారుజా = భయమనెడి వ్యాధియొక్క, అపహృతి = నాశముగావించుటయందు, అగదంకారునకున్ = వైద్యునకు, ఆశ్రితులకు జననాదులవలని భయమును బోఁగొట్టువాఁడనుట. అచలిత...అలంకారునకున్-అచలిత = చలింపఁబడని, ఎడఁబాయనియనుట. అమృతప్రియ=అమృతము వలెనింపైన, ముఖ=మోముగల, సత్యంకార = నిశ్చయమైన, నిశ్చలమైనయనుట. భక్తియుక్తి = భక్తియొక్క కూడికచే, అకలంక = కల్మషరహితమగునట్లుగా, ఆరచిత = చేయఁబడిన, ఆర్యనుతి, అలంకారునకున్ = గొప్పవారియొక్క స్తోత్రములే భూషణములు గాఁగలవానికి,

తా. భయమనువ్యాధిని బోఁగొట్టువానికి, భక్తులస్తోత్రములే భూషణములుగాఁ గలవానికి,

"అమృతప్రియముఖ." ఇట ముఖ శబ్దములక్షణ, "ముఖ్యార్థబాధే తద్యోగే, రూఢితోవా ప్రయోజనాత్,. అన్యోర్థో లక్ష్యతేయత్సా, లక్షణారోపితక్రియా." కావ్యప్రకాశిక.

క. ప్రార్థనపరసురసార్థ హి
తార్థకృతత్రిపురదైత్యహాతికిఁ వేదాం
తార్థావన లీలాచరి
తార్థీకృతబహుమహర్షి హర్షితమతికిన్. 44

అ. ప్రార్థనపర...దైత్యహాతికిఁ - ప్రార్థనపర = ప్రార్థించుట యందాసక్తులైన, సురసార్థ = దేవతలసమూహముయొక్క, హితార్థ = మేలను ప్రయోజనముకొఱకు, కృత = చేయఁబడిన, త్రిపురదైత్యహాతికిఁ = త్రిపురాసురుల సంహారముగలవానికి, వేదాంతార్థ...హర్షితమతికిఁ - వేదాంతార్థ = ఉపనిషదర్థములయొక్క, అవన = రక్షణమున, లీలా = విలాసముచేత, చరితార్థీకృత = సార్థకముగాఁ జేయఁబడిన, బహు మహర్షి = గొప్పఋషులయొక్క, హర్షితమతికిఁ = సంతుష్టమగు మనస్సును గలవానికి.

తా. దేవతలప్రార్థన చేఁ ద్రిపురాసురుల సంహరించినవానికి, వేదాంతార్థాను సరణముగాఁదాను నటించి మహర్షుల యెన్నికలను సఫలమొనర్చిన వానికి.

క. దక్షమఖధ్వంసునకుఁ
జక్షూభవదనలకుముద సఖహంసునకుఁ
భిక్షాపరిరంభునకుఁ
వీక్షాసఫలితమనోజవిజిఘాంసునకున్. 45

అ. దక్షమఖధ్వంసికిన్ = దక్షయజ్ఞము పాడుచేసినవానికి, చక్షూభవత్......హంసునకున్ - చక్షూభవత్ = కన్నులగుచున్న, అనల, కుముదసఖ, హంసునకున్ = అగ్నిని, చంద్రుని, సూర్యునిం గలవానికి, భిక్షాపరిరంసునకున్ = భిక్షమునం గ్రీడింపనిచ్ఛగలవానికి, భిక్షాటనమూర్తి కనుట. వీక్షా......విజిఘాంసునకున్ - వీక్షా = చూపుచే, సఫలిత = సఫలీకృతమైన, మనోజ = మన్మథునియొక్క, విజిఘాంసునకున్ = చంపనిచ్ఛగలవానికి.

తా. దక్షయజ్ఞ ధ్వంసికి, అగ్నిని, జంద్రుని, సూర్యుని నేత్రములుగాం గలవానికి, భిక్షాటనమూర్తికిం, జూచుటమాత్రముననే మన్మథుని సంహరించినవానికి.

క. పశ్యత్ఫాలున కతిదృక్
దృశ్యద్రష్ట్రాదిభేదకృద్ధీజాలునకున్
వశ్యావిద్యునకు శమా
వశ్యాసాధ్యునకు నిత్యవైశద్యునకున్. **46**

అ. పశ్యత్ఫాలునకున్ = చూచుచున్న నుదురు గలవానికి, ఫాలనేత్రునకనుట. అతిదృక్...ధీజాలునకున్ - అతిదృక్ = చూపుల కతిక్రమించినవాఁడు, దృశ్య = చూడఁదగినవాఁడు, ద్రష్ట = చూచువాఁడు, ఆది = ఇవి మొదలుగాఁగల, భేదధీజాలునకున్ = భిన్నమగు బుద్ధియొక్క సమూహముగలవానికి, వశ్య, అవిద్యునకున్ = స్వవశముగావించి కొనంబడిన మాయగలవానికి, శమ = ఓర్పుచేత, ఇది దమాదులకు నుపలక్షణము. అవశ్య = ముఖ్యముగ, అసాధ్యునకున్ = సాధింపఁ దగనివానికి, నిత్యవైశద్యునకున్ = నిత్యమైన నిర్మలత్వము గలవానికి, నిష్కళంకునకనుట.

తా. ఫాలనేత్రునకు, బుద్ధిమంతులచేఁ; జూడసాధ్యము గానివాఁడు, చూడఁదగినవాఁడు, చూచువాఁడని భిన్నభావముల నిరూపింపఁబడువానికి,

లోకమోహాకరమగు మాయను మోహింపఁజేయు వానికి, శమదమాది గుణములకుఁగూడ నసాధ్యుఁడగువానికి, నిష్కళంకునకు.

"శమావశ్యాసాధ్యునకున్," ఇట ముద్దరాజు రామన్న "శమదమాదిగుణములు గలవారికే లభ్యుఁడని భావ" మనెను గాని యతని యనుగ్రహ మొకటి దక్క శమ దమాది గుణముల నాధారము గావించికొని యతనిని సాధింపఁగోరువారి కసాధ్యుఁడనుటయే కవి యాశయమగును.

క. దేవాసురనరతిర్య
క్స్థావరబహుజంతుపూర్ణ సంఖ్యాతిగ రా
జీవభవాండ ఫలావి
ర్భావాకరవపురుదుంబరక్ష్మాజునకున్. 47

ఆ. దేవాసుర......క్ష్మాజునకున్ - దేవాసుర = దేవతలు, రాక్షసులు, నర = మనుష్యులు, తిర్యక్ = అడ్డముగా నడుచు చుండువానికిని పశ్వాదులకనుట. [ఇంత వఱకుఁ జెప్పినవి జంగమములలోఁ జేరినవి.] స్థావర= స్థిరముగానుండునవి యనెడి, నడువనివనుట. బహుజంతు = పెక్కుజంతువులచే, పూర్ణ = నిండిన, సంఖ్యాతిగ = లెక్కకుమీఱిన, రాజీవభవాండ= బ్రహ్మాండమనెడి. ఫల = పండుయొక్క, ఆవిర్భావ = పుట్టుకకు, ఆకర= స్థానమైన, వపుః = శరీరమనెడి, ఉదుంబరక్ష్మాజునకున్ = మేడిచెట్టుగలవానికి;

తా. దేవాదిభేదములచే నసంఖ్యాకములైన జంతు సంతానములతో నిండియుండు బ్రహ్మాండములనెడి ఫలములు గల్గుట కాధారమగు శరీరమనెడి మేడిచెట్టుగలవానికి.

ముద్దరాజు రామన్న వ్రాసిన వ్యాఖ్యయందు; ఉదుంబర శబ్దమునకు మఱ్ఱిమ్రానని యర్థముగాన్వించుచున్నది. అది ప్రమాద జనితమగును.

"ఉదుంబరో జంతుఫలో యజ్ఞాంగో హేమదుగ్ధకః" అని అమరము.

అలంకారము, రూపకము.

క. దీపితరాగ శివాత
న్వీ పుండ్రేక్షునకు, నాకువీటిపురాంక
శ్రీపెదవేంకటనృపధీ
రూపాంబకలక్షునకు విరూపాక్షునకున్. 48

అ. దీపిత... పుండ్రేక్షునకున్-దీపితరాగ = ప్రకాశించుచున్న యనురాగముగల, శివాతన్వీ = పార్వతి యనెడి స్త్రీకి, పుండ్రేక్షులకున్ = మన్మథుండైనవానికి, ఆకువీటి...లక్షునకున్ - ఆకువీటిపురాంక = ఆకువీటి పురపురాజగు, పెదవేంకటనృప= పెదవేంకటాద్రిరాజుయొక్క, ధీరూప = బుద్ధిస్వరూపమగు, అంబక = నేత్రమునకు, లక్షునకున్ = విషయమైనవాని కి, విరూపాక్షునకున్ = శ్రీ విరుపాక్షస్వామికి.

తా. పార్వతీ మనోహరునకు, పెదవేంకటాద్రి రాజుచే ధ్యానింపఁ బడు వానికి, శ్రీ విరూపాక్షునకు.

వ. సభక్తికసమర్పితంబుగా, నాయొనర్పం బూనిన రాఘవ పాండవీయంబునకుఁ గథాప్రారంభం బెట్టి దనిన. 9

అ. సభక్తిక = భక్తితోఁ గూడినట్లు, సమర్పితంబుగాన్ = ఒసఁ గఁబడినదిగా, నాయొనర్పంబూనిన = రాఘవపాండవీయ మునకున్ నేను చేయఁబూనిన రాఘవపాండవీయ మను గ్రంథమునకు, కథా ప్రారంభంబు, ఎట్టిది, అనినన్ = కథాప్రారంభ మెట్టిదనిన.

తా. పైనఁ జెప్పిన విరూపాక్షస్వామికి భక్తితోఁ గృతియిచ్చిన, నాచే రచింపఁబడిన యీ రాఘవపాండవీయ మనుగ్రంథమునకుఁ గథా ప్రారంభ మెట్టిదనిన ?

"నాయొనర్పం బూనిన" "ధాతుజవిశేషణ భావార్థకపూర్వ కన్యవ హితావ్యవహిత కర్తృపద ప్రథమకు షష్ఠియగు" ప్రౌఢ వ్యాకరణము.

శ్రీః

# రాఘవపాండవీయము.

## ప్రథమాశ్వాసము.



కథాప్రారంభము.

లయు నఖిలభువనములలోనవారణ
నగరిపుర మతల్లి నాఁ దనర్చి
రాజ్యలక్ష్మి మిగులఁ బ్రబల నయోధ్య నా
రాజ వినుతిఁ గనిన రాజధాని. 1

రామాయణ. అఖిలభువనములలోన్ = అన్ని లోకములయందును, అవారణ = అడ్డులేని. నగరిపు = ఇంద్రునియొక్క, రమ = సంపదకు, తల్లి = మాత, పోషించునదనుట. నాన్ = అనులాగున, తనర్చి = ఒప్పి, రాజ్యలక్ష్మి = రాజ్యశ్రీ, మిగులన్ = మిక్కిలి, ప్రబలన్ = వృద్ధిపొందఁగా, అయోధ్యనాన్ = అయోధ్యయని, రాజవినుతిగన్న, రాజధాని = రాజులపొగడికోలు నందినరాజధాని, వెలయున్ = ప్రకాశించును.

తా. ఇంద్రుని యైశ్వర్యమునకు జనని యనులాగున నొప్పుచు, రాజ్యలక్ష్మి మిక్కిలి ప్రబలులాగుననుండు నయోధ్యయను రాజధాని ప్రకాశించుచుండును.

"భువన" "విష్ఠరం భువనం జగత్" అమరము.

"రమతల్లి." ఇట సంబంధషష్ఠిపైఁ బ్రథమ. లక్షణము. "క్షమన
కారాంతరూప ప్రకాశితంబు, లైనపుంలింగములు దక్కనన్నిటికిని,
బరఁగసంబంధ షష్ఠిపైఁ బ్రథమయగును, దంతికన్నులు రమవల్క
తరువుకొమ్మ." ఆంధ్రభాషాభూషణము.

భారతము. అఖిలభువనములలోన్ = అన్నిలోకములలోన. వార
ణనగరి = హస్తినాపురి, పురమతల్లి = పురశ్రేష్ఠము, నాన్ = అనునట్లు,
తనర్చి = ఒప్పి, రాజ్యలక్ష్మి, మిగులన్, ప్రబలన్ = రాజ్యశ్రీ మిక్కిలి
ప్రకాశింపఁగా, అయోధ్య = యుద్ధముసేయ నశక్యమైనది, నాన్ = అను
నట్లు, రాజవినుతిగన్న = తద్దేశవాసులగు రాజులపొగడ్తలుపొందిన, రాజ
ధాని = సింహాసనస్థలము, వెలయున్ + ప్రకాశించుచున్నది.

తా. హస్తిన యన్నిపురములలో మేటియని ప్రసిద్ధిగాంచి రాజ్యశ్రీ
మిక్కిలి ప్రకాశింపఁగా శత్రువులచే జయింప శక్యముగాని దని ప్రసిద్ధి
గాంచి వెలుఁగుచున్నది.

ఇటమ తల్లియనుపదము మతల్లికాయను దాని రూపాంతరము. ఇది
ప్రశస్తవాచకము. "మతల్లికా మచర్చికా ప్రకాండ ముద్ఘతల్లజౌ ప్రశ
స్తవాచకాన్యమూని." అని అమరము.

"వారణనగరి+పురమతల్లి" ఇన్నచోటఁ బ్రథమ మీఁదిపకారము
నకు వకారాదేశము రామింగసడదవా దేశవిధి నిత్యముకాదనియే యీకవి
యాశయముకాని ముద్దరాజు రామన్న యభిప్రాయపడినట్లు ప్రథమాంతము
మీఁది పకారమునకు మాత్రము వకారాదేశము రాకుండునని కాదు. కావు
ననే యీకవి, "మనుజేశ్వరుండు తచ్ఛాసనమున," "దార్భాగ్యశీలు
గోత్రమ్ము త్రమ్ము," అని యిట్లు పలుచోటుల గసడదవాదేశ విధి నిత్యము
గాదనుటను సూచించెను. మఱియు; "ఈ చందమ్మునఁ దమ్మిచూలికథ
గారీశుండుచెప్పంగ," ధూర్జటికవి. "దేవతలు కమలగర్భుని," కూపస్
క్షేప్యంబులు చేయునవిగా," మడికి సింగన. కమలాక్షునర్చించు కరములు
కరములు." "కమలేశుఁగానని కన్నులు కన్నులే," "సురక్షకునిఁ జూచ

చూడ్కులు చూడ్కులు" పోతన. "శ్రీరమ్యాభరణుండు చంద్రుడు." బేతాళ పంచవింశతి. "తమము చెందె ద్విజప్రతానము చెలంగె." కూచిమంచి తిమ్మన. ఇట్లనేకులు ప్రయోగించి యున్నారు.

"రాజ్యలక్ష్మి మిగులన్, ప్రబలన్." ఇటనలంకారము. అత్యుక్తి. లక్షణము. "తనరు నత్యుక్తి యద్భుత తథ్యశౌర్య, వితరణాదికవర్ణనాన్వితమగుచు ;" అడిదము సూరకవి.

ఇట రెండర్థములయందును వస్తునిర్దేశరూపమంగళ మాచరింపఁబడి యున్నది. ఆదియందు వెలయునను శుభపదప్రయోగము గావింపఁబడియెను. వకార మమృతబీజము. నగణము కృత్యాదినుండుట ధనప్రదము. "శుభ, సుఖ, రుక్, శ్రమ, ధన, కనక, భ యైశ్వర్యములఁ జేయుఁగవులకు, సర్వప్రభులకుఁ గృతులకు మొదలిన్న, భ, జ, గ, న, య, ర, తగణాళి యుల్లియరేచా." కవిజనాశ్రయము.

క. ఆపట్టన మేలెడి పృథి
వీపాలుఁడు భ్రుకుటిమాత్రవిముఖిత సముదా
టోపారి పఙ్క్తిరథుఁడు
ద్దీపించు నుదారనీతి ధృతరాష్ట్రుఁడనన్. 2

రామాయణ. ఆపట్టణమేలెడి = అయోధ్యాపట్టణమేలుచున్న, పృథివీపాలుఁడు = రాజు, భృకుటి...అరి - భృకుటిమాత్ర = బొమముడిపాటుచేతనే, విముఖిత = పరాఙ్ముఖముగాఁ జేయఁబడిన, సముదాటోప = గర్వాతిశయముతోఁగూడిన, అరి = శత్రువులనుగల్గిన, పంక్తిరథుఁడు = దశరథుఁడు, ఉదారనీతిన్ = గొప్పనీతిచే, ధృతరాష్ట్రుఁడనన్ = ధరింపఁబడిన రాజ్యముగలవాఁడని, ఉద్దీపించున్ = ప్రకాశించుచుండును.

తా. అయోధ్యాపురమేలెడి రాజును బొమముడిపాటుచేతనే శత్రువులభీతులఁ గావించు వాఁడునగు దశరథుఁడు నీతిచే రాజ్యము పాలించుచు వెలయుచుండెను.

"భృకుటిమాత్ర." "మాత్రకార్త్స్న్యేవధారణే." అని అమరము.

"విముఖిత." 'తత్కరోతీతి ణ్యంతాత్కర్మణి క్తః' అని క్త ప్రత్యయాంతము.

సమద+ఆటోప సవర్ణ దీర్ఘసంధి. "అకస్సవర్ణే దీర్ఘః." పాణిని.

"పంక్తిరథుఁడు." పంక్తి = పది, పదిదిక్కులయందును, అప్రతిహతమగు రథగమనము గలవాఁడనుట. "పంక్తిస్స్యాద్దశమ చ్ఛందో దశసంఖ్యావళీషుచ." అని విశ్వము.

భారత. ఆపట్టణము = ఆహస్తినాపురము, ఏలెడి పృథివీపాలుఁడు= రాజు, భృకుటిమాత్ర, విముఖిత, సమదాటోప = గర్వాతిశయముతోఁ గూడిన, అరిపంక్తి, రథుఁడు = శత్రుశ్రేణులయొక్క రథముగలవాఁడు, ధృతరాష్ట్రుఁడనఁ = ధృతరాష్ట్రుఁడను పేరితో, ఉదారనీతిఁ, ఉద్దీపించుఁ = ప్రకాశించుచుండును.

తా. హస్తినాపురము నేలెడి రాజు బొమముడిపాటు చేతనే భీతులై మరలిన శత్రువుల రథము గలవాఁడునగుచు ధృతరాష్ట్రుఁడను పేరితో గొప్పనీతిగల్గి ప్రకాశించుచుండెను.

ఇట, సుద్దరాజురామన్న ఉదారనీతియను దాని విశేషణముగాఁ గావించెనుగాని యంతకంటె, నీతిఁ అని సహార్థమున నుపయోగించుటయే సమంజసము.

చ. తెలివి నతిప్రగల్భుఁడనసదృగ్బలుఁ డాతఁడు భీష్మచాప కౌ
శలమె సహాయమై యమర శత్రులనేఁ పడఁప న్వలంతియై
నిలుకడ నేలె విశ్వధరణిం దనమిత్రకులంబువై భవ ప్రో
జ్జ్వలతఁ దలిర్పఁ బౌరవసుసంతతి రాజులకెల్ల హెచ్చుగన్.

రామాయణ. అతఁడు=ఆదశరథుఁడు, తెలివిఁ, అతిప్రగల్భుఁడు= బుద్ధిని మిక్కిలిప్రౌఢుఁడును, అసదృక్, బలుఁడు = సాటిలేనిబలముగల

వాఁడు, భీష్మ = భయంకరమైన, చాపకౌశలమె = ధనుర్విద్యయందలి నేర్పే, [ఇట చాపశబ్దము లక్షణ.] సహాయమై = తోడై, సహాయముగాఁ గలవాఁడైయనుట. అమరశత్రులన్ = రాక్షసులను, ఏఁపు, అడంచుటకున్, వలంతియై = గర్వమునణఁచుటకు సమర్థుఁడై, తనమిత్రుకులంబు = సూర్యకులము, వైభవ, ఉజ్జ్వలతన్, తలిర్పన్ = వైభవాతిశయముచేఁ బ్రకాశింపఁగా, పౌర = పురజనులయొక్క, వసు = ధనముయొక్క, సంతతి = సమూహము, రాజులకెల్లన్ = రాజులదఱకంటెను, హెచ్చు, కన్ = అధికముకాఁగా, విశ్వధరణిన్ = భూమినంతటిని, నిలుకడన్ = శాశ్వతముగా, ఏలెన్ = పాలించెను.

తా. దశరథుఁడు విద్యాధికుఁడై, యసమానబలుఁడై, ధనుర్విద్యాకుశలుఁడై, తత్సహాయమున నసురులజయించి, వంశోద్దీపకుఁడై పురజనులధిక ధనవంతులుగనుండ రాజ్యమేలుచుండెను.

"వసు." "వసురత్నే ధనేపిచ." అని యమరము.

"విశ్వధరణిన్." "విశ్వంకృత్స్నమశేషం." అని యమరము.

"రాజులకెల్లన్ హెచ్చుగన్." రాజులందఱకంటెనని పంచమ్యర్థమునషష్ఠి. "షష్ఠీస్థానికంబగు కువర్ణకము ద్వితీయాది విభక్తులయందగు." ప్రౌఢవ్యాకరణము.

ఇటముద్దరాజురామన్న పౌరులసంపదయే యతిశయించుచున్న దనుటచే రాజులసంపద యనుక్తసిద్ధ మని, దానినాధారము గావించుకొని కావ్యార్థాపత్త్యలంకారమనెనుగాని యిదివస్తు నాలంకారధ్వనియే యగుచున్నది.

భారత. అతఁడు = ఆధృతరాష్ట్రుఁడు, తెలివిన్, అతిప్రగల్భుఁడు' అ, సదృక్బలుఁడు = దృష్టిబలసహితుఁడుగాని వాఁడు, ['దృశోర్బలం, దృగ్బలం. దృగ్బలేనసహవర్తత యితిసదృగ్బలః, న, సదృగ్బలః' అని విగ్రహము. పైరెండువిశేషణములచే బాహ్యచక్షుస్సు లేకుండినను జ్ఞాన

చక్షుర్బలము విశేషముగాఁ గలవాఁడనుట సూచితము.] భీష్మ = భీష్ముని యొక్క, చాపకౌశలమె, సహాయమై, అమరన్ = ధనుర్విద్యయందలి నేర్పే సహాయమైయొప్పఁగా, శత్రువులన్, ఏఁపు, అడఁపన్, వలంతియై = శత్రువుల గర్వభంగముగావింప సమర్థుఁడై, తనమిత్రకులంబు = తన హితుల సమూహము, వైభవ, ఉజ్జ్వలతన్, తలిర్పన్ = వైభవాతిశయముచేఁ బ్రకాశింపఁగా, పౌరవ = పూరునిసంబంధమైన, సుసంతతి = సత్కులజాతులగు, రాజులకెల్లన్ = రాజులందఱకంటెను, హెచ్చగన్, విశ్వధరణిన్, ఏలెన్. మిన్నయై భూమినంతయు శాశ్వతముగ నేలెను.

తా. ధృతరాష్ట్రుఁడు బాహ్యచక్షుస్సులేకున్నను జ్ఞానచక్షుస్సు విశేషముగాఁగలవాఁడై, భీష్మునిధనుర్విద్యాసహాయమున శత్రువుల గర్వభంగముగావింపుచు, హితకోటిని సంతసింపఁజేయుచు, పూరువంశరాజులందఱకంటె మిన్నయై రాజ్యమేలుచుండె.

“మిత్రకుల.” “మిత్రంసుహృదినారవౌ.” అని నానార్థ రత్నమాల.

“సంతతి.” “సంతతిర్గోత్ర జననకులాని” అని అమరము.

క. సుబలతనయగుణమహిమం
బ్రబలి తనకుదారధర్మపాలనలీలన్
సొబగొంది వన్నెఁదేఁగా
విబుధస్తుతుఁ డవ్విభుండు వెలసెన్ ధరణిన్. 4

రామాయణ. సుబలత = బలిమిగల్గియుండుట, నయగుణమహిమన్, ప్రబలి = నీతియొక్కయు, గుణముయొక్కయు మహిమచేత వృద్ధిపొందుచుండఁగా, ఉదార...లీలన్ - ఉదార = గొప్పదగు, ధర్మ = ధర్మములతోడి, దుష్టశిక్షణ, శిష్టరక్షణాది ధర్మములతోడ ననుట. పాలనలీలన్ = పరిపాలనాతిశయముచే, సొబగొంది, తనయన్ = దశరథు

నకనుట, వన్నెఁదేఁగాన్ = [ఇట సుబలత యనునది కర్త. ఇది బహు వ్రీహిమీఁది త్రల్ప్రత్యయాంతము.] సుబలతన్ = మంచిబలము గల్గుట చేత, అయగుణమహిమన్ = భాగ్యలక్షణములయొక్క మహిమచేతను, ప్రబలి, ఉదారధర్మపాలన, ఇదికర్తృపదము. లీలన్ = విలాసమున, సొబగొంది తనకున్, వన్నెఁదేఁగాన్, అనియు, సుబలత = బలముగల్గి యుండుట, నయ = న్యాయముయొక్కయు, గుణ = అల్లెత్రాటియొక్క యు, మహిమన్ = ప్రభావముచే, ప్రబలి, తనకున్, ఉదార, ధర్మ = ధనస్సుతోడి, పాలనలీలన్, సొబగొంది వన్నెఁదేఁగాన్, అనియు నర్థాం తరములు. విబుధస్తుతుఁడు = దేవతలచే స్తుతింపఁబడినవాఁడు, అవ్వి భుండు = ఆదశరథుఁడు, ధరణిన్ = భూమియందు, వెలసెన్ = ప్రకా శించెను.

తా. గొప్పబలముతోడను మంచిగుణములతోడను ప్రబలి ధర్మపరి పాలనము దనకు వన్నెఁదేఁగా, దేవతలచే స్తుతింపఁబడుచు దశరథుఁడు వెలయుచుండెను.

“అయః” అయశ్శుభావహోవిధిః” అని అమరము.

“విబుధ.” విబుధః పండితే దేవే.” అని విశ్వము.

“ఉదారధర్మపాలన.” అనుస్థలమునఁ బాలనశబ్దము స్త్రీలింగము. “దీర్ఘాణాం హ్రస్వస్స్యత్” అను చింతామణీ సూత్రమున నిది హ్రస్వాం తమయ్యెను. “పాండవసైన్య సంఘపరిపాలనసేయు నితండయంచు” నని సోమయాజి ప్రయోగము గలదు.

భారత. సుబలతనయ = సుబలుని పుత్త్రికయగు గాంధారి, గుణ మహిమన్ = పాతివ్రత్యాది గుణమహిమచే, ప్రబలి = ప్రసిద్ధిగాంచి, దారధర్మ భార్యాధర్మముయొక్క, పతివ్రతాచారములయొక్క యనుట. పాలనలీలన్ = పరిపాలనావైభవముచే, సొబగొంది = ఒప్పిదము నొంది, తనకున్ = ధృతరాష్ట్రునకనుట. వన్నెఁదేఁగాన్ = ఖ్యాతినిదేఁగా, విబుధ

స్తుతుఁడు = పండితులచేఁ బొగడఁబడినవాఁడు, అవ్విభుండు = ఆధృతరాష్ట్రుఁడు, ధరణిన్ = భూమియందు, వెలసెన్ = ప్రకాశించెను.

తా. గుణవతియగు గాంధారి పతివ్రతాచారములచేతఁ బ్రబలి తనకు వన్నెఁదేఁగా ధృతరాష్ట్రుఁడు ప్రకాశించుచుండెను.

పతివ్రతాధర్మము. "ఆర్తార్తే ముదితే హృష్టా, ప్రోషితే మలినా కృశా, మృతే మ్రియేత యా నారీ, సా స్త్రీ జ్ఞేయా పతివ్రతా" అని స్మృతి వచనము. ఈ కారణముననే కులవధువుల కనువ్రతలను పేరుగల్గెను.

క. అని నీడు లేనికడిమిం
దనరారు నతిప్రతాపి యై తదనుజుఁ డతఁ డు
ర్విని గలనృపతుల నందఱఁ
దనకరిగాఁపులుగఁ జేసెఁ దర్పస్ఫురణన్. 5

రామాయణ. అనిన్ = యుద్ధమునందు, ఈడులేని = సాటిలేని, కడిమిన్ = పరాక్రమముచేత, తనరారు = ప్రకాశించునట్టి, అతిప్రతాపిత = మిక్కిలి తపింపఁజేయఁబడిన, దనుజుండు = అసురులను గలవాఁడు, అతఁడు = ఆదశరథుఁడు, దర్పస్ఫురణన్ = గర్వాతిశయముచేత, ఉర్విన్, కల, నృపతులన్, అందఱన్ = భూమిలోనుండు రాజులనందఱను, తనకున్, అరిగాఁపులుగన్, చేసెన్ = తనకుఁగప్పము గట్టువారగు నట్లొనర్చికొనెను.

తా. దశరథుఁడు యుద్ధమునన సురులఁ గెల్చి భూమిలోని రాజులనందఱను దనకుఁ గప్పము చెల్లించువారలగునట్లు చేసికొనెను.

భారత. అనిన్, ఈడులేనికడిమిన్, తనరారు, అతిప్రతాపి = అధికప్రతాపముగల, [ఇది అనుజశబ్దమునకు విశేషణము.] తదనుజుఁడు = వాని తమ్ముఁడు, అతఁడు = ఆపాండురాజు, ఉర్వినిఁగల నృపతులనందఱన్, దర్పస్ఫురణన్, తనకున్, అరిగాపులుగాఁజేసెన్ = కప్పముచెల్లించువారగునట్లు చేసికొనెను.

తా. ఆధృతరాష్ట్రుని తమ్ముఁడగు పాండురాజు తనగర్వాతిశయము చేత భూమిలోని రాజులనందఱను దనకుఁగప్పము చెల్లించువారలగు నట్లొనర్చికొనెను.

క. తానన్నమాట యింద్రున
కైన నలంఘ్యమయి పేర్చు నట్లుగ నెంతేఁ
బూనికఁ జెల్లింపుచు జగ
తీనుతవిక్రముఁ డొనర్చె దిగ్విజయంబున్. 6

**రామాయణ.** తాన్, అన్నమాట = తానాడినమాట. ఇంద్రునకైనన్, అలంఘ్యమయి = ఇంద్రునకేనిదాఁటుట కశక్యమై, పేర్చునట్లుగన్ = అతిశయించులాగున, ఎంతేన్, పూనికన్, చెల్లింపుచున్ = ఎంతోపూనికతో నెఱవేర్చుచు, జగతీనుతవిక్రముఁడు = లోకములచేఁ బొగడఁబడిన పరాక్రమము గలవాఁడగు దశరథుఁడు, దిగ్విజయంబున్, ఒనర్చెన్ = దిగ్విజయము గావించెను.

తా. తనమాట యింద్రుఁడేనియు జవదాఁటకుండులాగున నొనర్చుచు దశరథుఁడు దిగ్విజయము గావించెను.

"అన్నమాట." పద్యాదుల సవర్ణకంబున కత్వంబును గడహల్లునకు ద్విత్వంబునగు." బాలవ్యాకరణము.

భారత. తాన్, అన్నమాట = ధృతరాష్ట్రునిమాట, ఇంద్రునకైనన్ అలంఘ్యమయి, పేర్చునట్లుగన్, ఎంతేన్, పూనికన్, చెల్లింపుచున్ = నెఱవేర్చుచు, జగతీనుత విక్రముండు = పాండురాజు, దిగ్విజయంబున్, ఒనర్చెన్ = కావించెను.

తా. తనయన్నయగు ధృతరాష్ట్రునిమాట దేవేంద్రుఁడును జవదాఁటకుండులాగునఁ జేయుచుఁ బాండురాజు దిగ్విజయము గావించెను.

సీ. ధృతిఁ గుంతి మద్రభూపతుల నెయ్యపుఁ గన్య
కలనన వాలుఁ దూపుల జయించి,
యలరారు నతనుజయశ్రీల వరియించె
యవన సౌరాష్ట్రభూధవులఁ గెలిచె,
ద్రవిడకళింగసాల్వవిదర్భవసుధాధి
పతుల నోడించి కప్పములఁ గొనియెఁ
జోళనేపాళపాంచాలకేరళమత్స్య
వత్సభూపతుల గర్వం బడంచె,
గీ. శకయుగంధరఘూర్జరాశ్మంతసింధు
లాటభూపాలముఖ్యుల నోటువఱచె
జగతిఁ గోసలకేకయ మగధులతన
యలవరించినయాజ్ఞలో మెలఁగఁ జేసె. 7

రామాయణ. ధృతిన్ = ధైర్యముచే, కుంతిమద్ర భూపతులన్ = రాజులను, నెయ్యపుఁ గన్యకలనన = ఇంపైన యప్రౌఢ యుద్ధములు సేయుటచే, ప్రౌఢయుద్ధము గావింపవలసినంత యావశ్యకము లేదనుట. వాలుఁ దూపులన్ = తీక్ష్ణములగు బాణములచేత, జయించి, అలరారు, అతను = దశరథుఁడు, జయశ్రీలన్, వరియించెన్ = జయలక్ష్ముల వరించెను. యవన, సౌరాష్ట్ర, భూధవులను = రాజులను, గెలిచెన్ = జయించెను, ద్రవిడ, కళింగ, సాల్వ, విదర్భ, వసుధాధిపతులన్ = రాజులను, ఓడించి, కప్పములు, కొనియెన్ = గ్రహించెను. చోళ, నేపాళ, పాంచాల, కేరళ, మత్స్య, వత్స, భూపతుల = రాజులయొక్క, గర్వంబున్ = పరాక్రమమును, అడంచెన్ = అణఁగించెను. శక, యుగంధర, ఘూర్జర, అశ్మంత, లాట, భూపాలముఖ్యులన్ = రాజశ్రేష్ఠులను, ఓటు పఱచెన్ = ఓడించెను. జగతిన్ = లోకమున, కోసల కేకయ మగధుల తనయలన్ =

బిడ్డలను, వరించి = కోరి, వివాహమాడియనుట. నయాజ్ఞ, లోన్ = నీతితోఁగూడిన యాజ్ఞలో, మెలఁగన్, చేసెన్ = మెలఁగునట్లొనర్చెను.

తా. దశరథుఁడు ధైర్యమునఁ గుంతి మద్రదేశపురాజులఁ దన బాణనైపుణ్యమున నవలీలగాజయించి, జయలక్ష్మిం బొందెను. యవనాదుల గెల్చెను. ద్రవిడాదులనోడించి కప్పముగైకొనెను. చోళాదులగర్వమడంచెను. శకాదులనోటు పఱచెను. కౌసల్యాదులవివాహమాడి తనయాజ్ఞలో నుండున ట్లొనర్చికొనెను.

"కన్యకలనన్." ఇటఁగన్యయనునది తద్భవమగును. కవిలోక చింతామణీకారునిమతమున, "వర్ణికకుఁజెల్లు వన్నియవన్నెవన్య" యని యగుటచేఁ, గన్నె, కన్నియ, కన్య, యని యగుచున్నది.

కన్య యనినఁ బడుచని యిటభావముగాదు. ఆప్రౌఢయుద్ధమనుట. "కన్నియ, కన్నె, కన్య. అతఏవ రాఘవపాండవీయే. 'నెయ్యంపుఁ గన్యకలనన ఇత్యుక్తం. తత్రపాండవపక్షే, కన్యకలన్. ఇత్యేకపదం. రాఘవపక్షేతు కర్మధారయసమాసః. కన్యకలనన, ఆ ప్రౌఢయుద్ధ ఏవే త్యర్థః. కన్యశబ్దస్యాత్ర లాక్షణికత్వం. "క్వచిదాద్యస్యశబ్దస్యవికారే త్వన్యవాన్యతా" ఇత్యుక్త్యా విన్నాణాది శబ్దానామివాస్యాప్యన్యార్థ బోధకతాసంభవాదితిజ్ఞేయం" కవిశిరోభూషణము.

"వాలుఁదూపులన్." "నెయ్యపుఁగన్య." సమాసంబులను దంతంబులగు స్త్రీసమంబులకుం బుంపులకుం బరుషసరళంబులు పరంబులగునపుడు నుగాగమంబగు. బాలవాక్యకరణము. కాఁబట్టియే, "అచటఁ బుట్టినచిగురుఁగొమ్మైనఁజేవ." అని పెద్దనార్యుఁడు ప్రయోగించెను.

భారతము. ధృతిన్=సంతసమున, కుంతి, మద్రభూపతుల=రాజుల యొక్క, నెయ్యపుఁగన్యకలన్ = ప్రీతిపాత్రలగునట్టికన్యకలను, ననవాలుఁ దూపులన్ = పుష్పబాణములచే, జయించి, అలరారు=ఒప్పుచున్న, అతను జయశ్రీలన్ = మన్మథునిజయలక్ష్ములగు వారిని, కుంతీమాద్రులననుట.

పరియించెన్ = వివాహమాడెను. యవన, సౌరాష్ట్ర, భూపతులన్, గెలిచెన్ = జయించెను. ద్రవిడ, కళింగ, విదర్భ, వసుధాధిపతులన్, ఓడించి, కప్పములు, కొనియెన్ = గ్రహించెను, చోళ, నేపాళ, పాంచాల, కేరళ, మత్స్య, వత్స, భూపతుల, గర్వంబు, అడంచెన్ = అణఁగించెను. శక, యుగంధర, ఘూర్జర, అశ్మంత, సింధు, లాట, భూపాల ముఖ్యులన్, ఓటుపఱచెన్ = ఓడించెను, జగతిన్, కోసల, కేకయ, మగధులు + అ. •తన యలవరించిన = విస్తారమయిన, ఆజ్ఞలోన్, మెలఁగన్, చేసెన్ = కావించెను.

తా. పాండురాజు కుంతీ మాద్రులవివాహమాడి రాజులజయించి, తనయాజ్ఞలో నుండులాగునఁ జేసికొనెను.

"ధృతిన్." "ధృతిర్యోగాంతరే ధైర్యే ధారణే ప్రీతిసౌఖ్యయోః" అని నానార్థమాల.

ముద్దరాజురామన్న "కోసల కేకయ మగధులన్" అని ద్వితీయాంతముగాఁ వించెను. అట్లేని "మగధులఁ దనయలవరించిన యాజ్ఞలో" నని యుండవలయును. అప్పుడు రామాయణార్థము పొసఁగదు. కాఁబట్టి "మగధులు+అ+తనయాజ్ఞలోన్" అని యవధారణార్థకముగా నుండుట సమంజసము. అప్పుడు కోసల కేకయ మగుధులేవచ్చి యీతని యాజ్ఞలో మెలఁగెదమని చెప్పులాగునఁ బాండురాజు కావించెననుట మిపుల రస వంతముగా నుండుటచే నిట మగధులు+అ అని యవధారణార్థకమే కవి యాశయము.

సీ. కొందఱు తనవార్త కొనసోఁకినంతన
కొందఱువృత్తాంత గురుతకతనఁ,
గొందఱు భేరినిర్ఘోషంబు లాలించి
కొందఱు పదరజోబృంద మఱసి,

కొందఱు నాసీర ♦ కోలాహలంబునఁ
గొందఱు మణికేతు♦కోటివీక్షఁ,
గొందఱు కోదండ♦గుణటంకృతులు విని
కొందఱు హుంక్రియా♦కులతఁ జెంది,

గీ. కొందఱొకటిరెండేటుల♦కోలఁదిఁ గలిగి
వివిధదిగ్దేశనృపతులు ♦ విఱిగిపాఱ
నవనియందు నుయుద్ధవి♦హారమునకు
మాఱు లేకయ విహరించె ♦ మనుజవిభుఁడు. 8

రామాయణ భారతార్థములు సమానములు. కొందఱు, తన వార్త కొనసోఁకినంతన = కొందఱితనిమాట యొక్కతుది యక్షరము చెవిసోఁకినంతనే, కొందఱు, వృత్తాంతగురుతకతనన్ = వార్తయందలి గౌరవమనెడికారణముచేతనే, కొందఱు, భేరినిర్ఘోషబు లాలించి = భేరీధ్వనివిని, [భేరినిర్ఘోషము. ఇది సాధ్యసమాసము.] కొందఱు, బలరజోబృందము = సేనలయందలి పరాగసమూహము, అఱసి = విచారించి, కొందఱు, నాసీరకోలాహలంబునన్ = సేనాగ్రమునందలి కలకలముచే, కొందఱు, మణికేతుకోటి = రత్నములు పొదుగఁబడినటెక్కెము యొక్కయంచు యొక్క, వీక్షన్ = చూచుటచే, కొందఱు, కోదండగుణ టంకృతులు = వింటినారిచప్పుడు, విని=ఆలకించి, కొందఱు, హుంక్రియాకులతన్, చెంది= హుంకారముచే కలఁతఁజెంది, కొందఱు, ఒకటి రెండేటుల కోలఁది, కలిగి = ఒకటిరెండు బాణములతాఁకున కోర్చుకొనునంతపాటి శక్తిగల్గి, వివిధదిగ్దేశనృపతులు = అనేక దేశపురాజులు, విఱిగి, పాఱన్ = విచ్చిపరుగెత్తఁగా, అవనియందును, భూమియందు, యుద్ధవిహారమునకున్ = రణక్రీడకు, మాఱులేక = ఎదురులేక, మనుజవిభుఁడు = రాజు, [రా. దశరథుఁడు. భా. పాండురాజు.] విహరించెన్ = సంచరించెను.

తా. తనమాట చెవిసోఁకినంతనే పాఱువారును, మాటచెప్పిపంపినంతన పాఱువారును, రణభేరీధ్వనివిని పర్వెత్తెడివారును, సేనలపరాగము చూచి పర్వెత్తెడివారును, సేనాగ్రమునందలి కోలాహలమువినిన పిదపన పాఱెడివారు, నతని రథమునందలి టెక్కెముచూచికాని పాఱనివారు, నెదుట పచ్చిధనుష్టంకారముచేసినఁగాని పలాయనమొనర్పని వారును, హుంకారము నేసి యదలించుపఱకు నిలుచువారు, నొకటి రెండు దెబ్బలు దవ్వులుపఱకును వెనుదీయక నిలుచువారు నిట్లు రాజలోకముల నానావిధముల నడఁచుచునా రాజు [రా. దశరథుఁడు. భా. పాండురాజు] యుద్ధవిహారమునలిపెను.

ఈ పద్యమున నుత్తరోత్తర ముత్కర్షముదెలుపుటచే సారాలంకారము. లక్షణము. "సారమను పేరుగల యలంకారముత్త, రోత్తరోత్కర్షగతి నొప్పుచుండుఁగృతుల." అడిదము సూరకవి.

మ. తలఁపంజొప్పడి యొప్పునప్పుడుతదుద్యజ్జైత్రయాత్రాసము
త్కలికారింఖదసంఖ్యసంఖ్యజయవత్కంఖాణరింఖావిశృం
ఖలసంఘాతధరాపరాగపటలాక్రాంతంబుమిన్నేరన
గ్గళభేరీరవ నిర్గళద్గగన రేఖాలేప పంకాకృతిన్. 9

రామాయణ భారతార్థములు సమానములు. తత్...ఆక్రాంతంబు - తత్ = ఆరాజుయొక్క [రా. దశరథుని యొక్క, భా. పాండురాజుయొక్క,] ఉద్యత్ = ప్రకాశించుచున్న, జైత్రయాత్ర = యుద్ధయాత్రయందు, సముత్కలికా = ఉత్కంఠాతిశయముచే, రింఖత్ = సంచరించుచున్న, అసంఖ్య = లెక్కలేని, సంఖ్య = యుద్ధములందు, జయవత్ = జయముగల్గిన, కంఖాణ = అశ్వవిశేషములయొక్క, రింఖా = గిట్టలచే, విశృంఖల = అడ్డులేనట్లు, యథేచ్ఛముగాననుట. సంఘాత = త్రొక్కఁబడిన, ధరా = భూమియందలి, పరాగ = దుమ్ముయొక్క,

పటల = సమూహముచేత, ఆక్రాంతంబు=ఆక్రమింపఁబడినది, మిన్నేరు = ఆకాశగంగ, అనర్గళ...ఆకృతిన్ - అనర్గళ = అడ్డులేని, భేరీరవ = భేరీధ్వనులచే, నిర్దళత్ = చీలుచున్న, గగన = ఆకాశమునందలి, రేఖా = చీలికలకు, లేప = పూఁతకొఱకు, అగునట్టి, పంక = బురదయొక్క, ఆకృతిన్ = ఆకారముచేత, తలఁపన్ = తలఁచుటకు, చొప్పడి = యుక్తమై, ఒప్పెను.

తా. ఇతని యుద్ధయాత్రలయందలి గుఱ్ఱపుగిట్టల త్రొక్కిడిచేఁ గల్గిన ధరాపరాగ సమాక్రాంతమగు మిన్నేఱు భేరీనినాదమున నాకసమునఁ బీటలువాఱిన రేఖయన నొప్పుచుండెను.

"ఉత్కలికా" ఉత్కంఠోత్కలికే సమే." అని అమరము.

సంఖ్యం. "మృధమాస్కంధనం సంఖ్యం" అని యమరము.

ఇట నలంకారము సంబంధాతిశయోక్తి. లక్షణము. "ఇంబడరఁగా న్వయములయో, గంబోరవకయుండ యోగకల్పనమైనన్. ఆంధ్రచంద్రాలోకము.

చ. తురగఖురాహతక్షితిజధూళిచయస్థగితాంబరంబుతో
నొరయుచుఁ దచ్చమూగజసముత్కరమప్పుడుచూడనొప్పె;ది
క్కరివరయూథమత్సరవిగాఢతఁ జేసి సమస్త మొనయి
ద్ధరఁ దనపైకినెత్తుకొనితాల్చెడినో యనుచుండఁజూపఱుల్.

రామాయణ భారతార్థములు సమములు. తురగ...అంబరంబుతోన్ - తురగ = గుఱ్ఱములయొక్క, ఖుర = గిట్టలచేత, ఆహత = కొట్టఁబడిన, క్షితి, జ = భూమినుండికలిగిన, ధూళి = దుమ్ముయొక్క, చయ = సమూహముచేత, స్థగిత = పొదగఁబడిన, అంబరంబుతోన్ = ఆకాశముతో, ఒరయుచున్ = ఒరసికొనుచు, తత్ = ఆరాజుయొక్క, [రా. దశరథుని యొక్క, భా. పాండురాజుయొక్క.] చమూ = సేనలయందలి, గజ = ఏనుఁగులయొక్క, సముత్కరము = గుమి, దిక్కరి......విగా

ఢతన్, చేసి-దిక్కరి = దిగ్గజములయొక్క, వర = శ్రేష్ఠమైన, యూథ = సమూహముతో, మత్సర = ద్వేషముయొక్క, విగాఢతన్, చేసి=దట్టమగుటచేత, సమస్తమైన, ఇద్ధరన్ = ఈభూమియంతయును, తనపైకిన్, ఎత్తికొని = తనమీఁదికెత్తికొని, తాల్చెడినో = ధరించుచున్నదో, అనుచుండన్ = అనిచెప్పుచుండఁగా, అప్పుడు, మాడన్, ఒప్పెన్.

తా. వారిసేనాగజములు గుజ్జుపుగిట్టల తాఁకునఁ బైకెగిసినదుమ్ముచే మూయఁబడిన యాకసముతో నొరయునంతటి యౌన్నత్యములుగలవై దిగ్గజములతో మత్సరించి, భూమినంతయుఁ దాముమోయుచున్నవో యనునట్లుండెను."

"చమూ." "ధ్వజినీ వాహినీచమూః" అని యమరము.

"విగాఢతఁజేసి." "కేచిత్తు నైకృతాశ్శబ్దా విభక్త్యర్థాభిదాయకాః" అనునధర్వణుని మతమున నిటఁ జేతవిభక్త్యర్థమునఁ జేసియను ప్రయుక్తమయ్యెను.

"ఇద్ధర." "ద్విరుక్తంబగు హల్లుపరంబగునపు డాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు." "త్రికంబుమీఁది యసంయుక్త హల్లునకు ద్విత్వంబు బహుళంబుగానగు." బాలవ్యాకరణము. "బాహుళకముచే నూష్మరేఫంబులకు ద్విత్వంబుగలుగదు." బాలవ్యాకరణ గుప్తార్థ ప్రకాశిక.

"ఎత్తికొని." ఎత్తియనుదానిలోని యిత్వముత్వముగా మాఱవచ్చును. లక్షణము. "పెనచికొని కూడుకొని యిడి, కొని యనుశబ్దములఁ గృతులఁ గూరుచువేళం, గొనిశబ్దపూర్వవర్ణం, బునకిత్వోత్వములు వచ్చు." కవిసంశయ విచ్ఛేదము.

అలంకారము. ఉత్ప్రేక్ష. అతిశయోక్తి.

మత్తేభవిక్రీడితము. లక్షణము. "నలువొందన్ స, భ, రల్; న, మల్ ; య, వ, లతో నంగూడి మత్తేభమిం, పలరారున్ పదునాలుగావిరతిచే నానందరం గాధిపా." ఆనందరంగరాట్ఛందము.

మ. జవవద్ఘోటకపాటితక్షితిరజస్సంక్రాంతిచేనింకుసిం
ధువులం గ్రమ్మఱ నుర్వికిందివికిఁ దోడ్తోనించెఁ దన్నాగముల్
నవనిర్యన్మదనిర్ఝరౌఘమున శుండాశీకరోర్ధ్వప్రవ
ర్షవిధిం దానను జేసిసింధురము లన్ప్రఖ్యాతిగాంచెన్గరుల్.

రామాయణ భారతార్థములు సమము. జవవత్......సంక్రాంతిచేన్-జవవత్=వేగములతోఁగూడిన, ఘోటక = గుఱ్ఱములచేత, పాటిత = విఱుగఁగొట్టఁబడిన, క్షితి = భూమియందలి, రజః = పరాగముయొక్క, సంక్రాంతిచేన్=కూడికచేత, ఇంకు=నీరువట్టిపోయిన, సింధువులన్ = సముద్రముల, ఆకాశగంగను, [గుఱ్ఱపుగిట్టల త్రొక్కుడుచేఁ బైకిలేచినదుమ్ము ఆకాశగంగయందును, సముద్రమునను బడుటచే నచ్చటి పల్లములుపూడి పోవుటచేత, వానియందలి నీరింకి పోయెనని భావము.]తత్=ఆరాజుయొక్క [రా. దశరథునియొక్క, భా. పాండురాజుయొక్క.] నాగముల్ = ఏనుఁగులు, క్రమ్మఱన్ = మరల, తన, నిర్యత్ = ఉదయించిన, మదనిర్ఝర, ఓఘమునన్ = మదజలప్రవాహముయొక్క సమూహముచేత, శుండా...విధిన్-శుండా = తొండములయందలి, శీకర = జలకణములయొక్క, ఊర్ధ్వప్రవర్షవిధిన్ = ఎత్తుగాఁ జిమ్ముటచేతను, ఉర్వికిన్, దివికిన్ = భూమికి నాకాశమునకును, క్రమ్మఱన్ = మరల, తోడ్తోన్ = వెంటనే, నించెన్ = నిండించెను; దానను జేసి = కాఁబట్టియే, కరుల్ = ఏనుఁగులు; సింధురములు, అన్ = అనెడి, ప్రఖ్యాతిన్, కాంచెన్ = ప్రసిద్ధినిబొందినవి.

తా. ఆరాజుయొక్క [రా. దశరథునియొక్క. భా. పాండురాజుయొక్క] సేనలయందలి గుఱ్ఱపు గిట్టల తాఁకుచేఁగల్గిన దుమ్ము సముద్రమునను పైకెగిసి యాకాశ గంగయందును బడి నీటినింకింపఁగా నచ్చటి యేనుఁగులు దమమద జలముచే సముద్రములను, దొండముల యందలి జలకణములు పైకిఁజల్లుటచే నాకాశగంగను జలపూర్ణముగాఁ జేసినవి. కావుననే వానికి సింధురములను పేరుగల్గినది.

"నిర్ఝర." "ప్రవాహోనిర్ఝరోఝరః" అని యమరము.

"శుండా." "శుండాతు బలహస్తిన్యాంమదిరా కరిహస్తయోః" అని విశ్వము.

"సింధువులన్." "సింధుస్తు వారిధౌ, దేశే నదే గజమదే, వాన ద్యాంతు స్త్రి యా మయం." నానార్థ రత్నమాల.

"దివికిన్." "ద్యోశబ్దమునకు దివియును, భూశబ్దంబునకుభువియు" తాతంభట్టు.

"నిర్ఝరౌఘము." వృద్ధి సంధి - వృద్ధిరాదైచ్. "పాణిని.

"నాగములు నిండించె" ననుటకు లక్షణము. "స్థావరతిర్యక్ప్రభృతుల, కీవెరవునఁ గ్రియలు దలఁప నేకవచనముల్, దేవమనుష్యాది క్రియ, భావింపఁగ నేకవచన బహువచనంబౌ." కేతన.

"బలవత్ ...... ..... ఇంక సింధువులన్." అతిశయోక్త్యలంకారము.

"ఉర్వికిన్, దివికిన్, మదనిర్ఝరౌఘమునన్, శుండా కరోర్ధ్వ ప్రపర్షవిధిన్ నించెన్" యథాసంఖ్యాలంకారము.

"దాననుఁ జేసి......కరుల్." నిరుక్త్యలంకారము. లక్షణము.

"అధికయోగమువలన నన్వర్థఘటననామములకైనను నిరుక్తి నానెసంగు." ఆంధ్ర చంద్రాలోకము.

సీ. గంభీరవేదిల క్షణలక్షితంబులై
తనరారు భద్రదం తావళములు,
నారట్ట సింధుగాం ధారాదిభవములై
కొఱలు శ్రీవృక్షకీ ఘోటకములు,
పదునాల్గుజాతులం ద్రిదశకాంతల మీఱు
పద్మినీజాతి సౌ భాగ్యవతులు,

కడునద్భుతము లైన కనకరత్నాంశుక
చందనాది సువస్తు సంపదలును,
గీ. నఖిలదిగ్దేశ భూప సమర్పితంబు
లగుచు నరణంబుగతిఁ దోన యరుగుదేరఁ
దను వరించుజయశ్రీలఁ గొనుచుఁ తఁడు
పురికిఁ జనుసొంపు వాగగో చరతఁ బఱఁగె. 12

రామాయణ భారతార్థములు సమము. గంభీరవేది లక్షణ లక్షితంబులై = గంభీర వేదియను గజము యొక్క లక్షణములతో గుర్తింపఁ దగినవై, తనరారు భద్రదంతావళములు = ఒప్పు చుండునట్టి భద్రజాతి గజములు, ఆరట్ట, సింధు, గాంధారాది భవములై = ఆరట్టాది దేశములందు జనించినవై, కొఱలు = చెలరేఁగుచున్న, శ్రీవృక్షకీ ఘోటకములు = శ్రీవృక్షకి యనెడి గుఱ్ఱములు, పదునాల్గు జాతులన్ = బ్రహ్మ, క్షత్ర, వైశ్య, శూద్ర, వ్యావహారిక, గోరక్షక, శిల్పక, పంచాహణ, కుంభకార, తంతువాయ, క్షౌరక, రజక, వస్త్రచ్ఛేదక, చర్మకర, తిలఘాతక, లుబ్ధక, చండాల, మాతంగులను పదునెనిమిది జాతులలోఁ బ్రథమంబగు బ్రాహ్మణజాతియుఁ, గడపగులుబ్ధక, చండాల, మాతంగ జాతులును దక్కఁ, దక్కిన పదునాల్గు జాతులలో, త్రిదశకాంతలన్, మీఱు = అప్సరసల నతిశయించు, పద్మినీజాతి సౌభాగ్యవతులు = పద్మినీజాతి స్త్రీలు, కడున్ = మిక్కిలి, అద్భుతములైన = ఆశ్చర్యకరములైన, కనక ......... .. సంపదలును- కనక=బంగారు, రత్న, అంశుక=రత్నములు, వస్త్రములు,చందన=గందము, ఆది = మొదలుగాఁగల, సువస్తు = మంచివస్తువు లనెడి, సంపదలును = ఐశ్వర్యములును; కనక రత్నాంశుక=బంగారు జలతారుతోఁ నేయఁబడిన, ముత్యములు మున్నగు రత్నములతోఁ గూర్పఁబడిన యనియు నర్థాంతరము చెప్పవచ్చును. అఖిల దిగ్దేశభూప = అన్నిదేశపు రాజులచేత, సమర్పి

తంబులు, అగుచుఁ=ఇయ్యఁబడినవగుచు, అరణంబులగతిఁ = వివాహకాలమునందు వధువుతోడఁ దండ్రియిచ్చు వస్తువులవలె, తోన, అరుగుదేరఁ = తనతోడ వచ్చుచుండఁగా, తనుఁ = తన్ను, వరించు = కోరు, జయశ్రీలఁ = జయలక్ష్ములను, కొనుచుఁ = గ్రహించుచు, అతఁడు= ఆ రాజు. [రా. దశరథుఁడు భా. పాండురాజు.] పురికిఁ, చను, సొంపు = పట్టణమునకువచ్చునట్టి యందము; వాక్, అగోచరతఁ, పరఁగెఁ=వాచామగోచరమై యొప్పెను.

తా. నానావిధ భద్రజాతి గజములును బెక్కుదేశములఁ గల్గిన గుఱ్ఱములును, రూపవతులగు పెక్కండ్రు వనితలును, స్వర్ణాదివస్తుజాతమును పలుదేశపురాజు లియ్యఁగా వానిం గ్రహించి జయలక్ష్మితోడఁ బురికి, వచ్చునట్టి యావైభవము వాచామగోచరమై యొప్పెను.

"గంభీరవేది." లక్షణము. త్వగ్భేదాచ్ఛోణితస్రావా, న్మాంసస్య దళనాదపి, ఆత్మానం యోనజానాతి, తస్య గంభీరవేదితా." మృగచర్మీయము. మఱియు, "చిరకాలే నయోవేత్తి, శిక్షాంపరిచితామపి, గంభీరవేద ర్విజ్ఞేయ, స్సగజోగజవేదిభిః" రాజపుత్త్రీయము. "యంతా గంభీర వేదినః" అని కాళిదాస ప్రయోగము.

"శ్రీవృక్షకీఘోటకములు." లక్షణము. "వక్షోభవావర్త చతుష్టయంచ, కంఠేభవేద్యస్యచరోమకూపః, శ్రీవృక్షకీనామ హయస్సభర్తుః, పుత్త్రప్రపౌత్త్రాభివివృద్ధయేస్యాత్." హయలీలావతి.

"పద్మినీజాతి సౌభాగ్యవతులు" లక్షణము. "భవతి కమలనేత్రా నాసికాక్షుద్రరంధ్రా । అవిరళకుచ యుగ్మాచారుకేశీ కృశాంగీ । మృదువచన సుశీలాగీత వాద్యానురక్తా । సకలతను సువేషా పద్మినీపద్మగంధా॥" రతిమంజరి.

"అరణంబుగతి." ఇది హరణశబ్దముయొక్క వైకృతము. "హ్రీయతేస్త్రి యాస్వాతంత్ర్యే ణేతిహరణం" గురుబాలప్రబోధిక. "యౌతకాదితు యద్దేయం సుదాయో హరణంచతత్," అని యమరము.

" దంతావళములు. " దంతశిఖాత్సంజ్ఞాయాం, " దన్తవలోహస్తీ " సిద్ధాంత కౌముది.

"తోనవచ్చు" ఇటఁబ్రత్యయమే శబ్దము వలె స్వతంత్రముగా నిలిచెను. తోడమాటాడకునికి" ఇత్యాదులు పూర్వ ప్రయోగములు పెక్కులు గలవు.

"భద్ర దంతావళములు." ఇట ముద్దరాజు రామన్న భద్రశబ్దమునకు మంగళమనియర్థము గావించి, పట్టపు టేనుఁగులనెను గాని, దంతావళములు అను బహువచన స్వారస్యముచే భద్రజాతి గజములనుటయే సమంజసము. "భద్రైర్మన్ద్రైర్మృగైర్భద్రమన్ద్రమృగైరపి." రామాయణము.

క. తనపాండుసమాఖ్యజగం
బున వెలయఁగ నిట్లు సకలభూనాథుల నా
త్మనిదేశవర్తనులు గా
నొనరించె నితాంతవైభవోజ్జ్వలుఁడగుచున్. 13

**రామాయణ.** తన, పాండు = శుభ్రమైన, సమాఖ్యా=కీర్తి, జగంబునన్ = లోకమున, వెలయన్ = ప్రకాశింపఁగా, నితాంత, వైభవ = మిక్కిలి వైభవముతో, ఉజ్జ్వలుఁడు, అగుచున్ = ప్రకాశించువాఁడగుచు, ఇట్లు, సకలభూనాథులన్=రాజులనందఱను, ఆత్మ=తనయొక్క, నిదేశ = ఆజ్ఞలో, వర్తనులుగాన్ = అనుసరించు వారినిఁగా, ఒనరించెన్ = చేసెను.

తా. దశరథుఁడు రాజులనందఱను దనయాజ్ఞానువర్తులగు లాగున నొనర్చికొనెను.

"పాండు." హరిణః పాండురః పాండు" అని యమరము.

" సమాఖ్య." "యశఃకీర్తి స్సమాఖ్యాచ." అని యమరము.

భారత. తన, పాండుసమాఖ్య = పాండురాజు అనునామము, జగం బునన్, వెలయన్, నితాంత వైభవోజ్జ్వలుఁడు, అగుచున్ = అత్యంత వైభవముతోఁ బ్రకాశించుచు, ఇట్లు, సకలభూనాథులన్, ఆత్మనిదేశ. వర్తనులుగాన్, ఒనరించెన్ = చేసెను.

తా. పాండురాజు, అనుతన నామమెల్లెడల వ్యాపింపఁగా, రాజు లందఱుఁ దనయాజ్ఞలో నిడికొనియెను.

“సమాఖ్య” “ఆఖ్యాహ్వే అభిధానంచ.” అని యమరము.

వ. ఇట్లు యథేష్టభోగంబులఁ బ్రవర్తిల్లుచు నొక్కనాఁడు తన మనంబున. 14

భారతరామాయణార్థములు సమము.

చ. శ్రమముడుగుం దనూజడిమ § జాఱుఁ జలాచలలక్ష్యభేదన
క్రమము లెఱుంగవచ్చు మదిఁ § గానఁబడుం బరజాతిభీతికో
పముల విచేష్టితంబులివి § భావమునం దలపోయ, నన్నిచం
దములఁ బ్రియంబెయంచు నర § నాథుఁడు వేఁటకునుద్యతాత్ముఁడై.

అవతారిక. వేఁటయందలి సుగుణము లీపద్యమువలనఁ దెల్పఁబడు చున్నవి.

రామాయణభారతార్థములు సమము. శ్రమము, ఉడుగున్ = ఆయాసము తీఱును. [మానసక్లేశ జనితశ్రమ మేదేనుండిన వేఁటవలనఁ గల్గిన సంతసము మూలమున నాశ్రమము వాయుననుట] తనూజడిమ, మానున్ = శరీరమునందలి జడభావము మానును. [వేఁటయొక వ్యాయామవిశేషమగుటచే శరీరమునందలి జడత్వము మానుననుట.] చల, అచల లక్ష్యభేదనక్రమము, ఎఱుంగన్, వచ్చున్ = కదలునట్టి వానినిఁ, గదలనట్టి వానినీ గుఱిపెట్టి భేదించువిధము దెలియ వచ్చును, పరజాతి, భీతి, కోపముల విచేష్టితములు, మదిన్, కానంబడున్ = సజాతీయములు గాని

వానియొక్క భయమువలనను, గోపమువలనను గల్గినచర్యలు మనసునఁ దెలియవచ్చును. ఇవి, భావమునన్, తలపోయఁ = ఇవి మనసునందలఁ పఁగా, అన్ని చందములన్ = అన్ని విధములచేతను, ప్రియంబె, అంచున్ = ప్రియమేయనుచు, నరనాథుఁడు = రాజు, [రా. దశరథుఁడు. భా. పాండురాజు.] వేఁటకున్, ఉద్యతాత్ముఁడై = వేఁటాడుటకుఁ బ్రయత్నించు నెన్నిక గలవాఁడై.

తా. వేఁటశ్రమము వాపును, జడత్వమును మాన్పును, లక్ష్యభేదన కౌశలము నొసఁగును, విజాతీయముల యొక్క, భీతికోపాదులు దెల్పును, ఇట్లన్ని విధముల నుత్కృష్టమగుటచే నారాజు వేఁటాడఁ దలఁచినవాఁడై.

కాళిదాసుఁడు వేఁటనుగుఱించి యిట్లేచెప్పెను, "మేదచ్ఛేదకృశోదరం లఘుభవత్యుత్థాన యోగ్యం వపుస్సత్త్వానామపిలక్ష్యతే వికృతిమచ్చిత్తం భయక్రోధయోః, ఉత్కర్షస్సచధన్వినాంయ దిషవస్సిధ్యన్తి లక్ష్యే చలే,మిథ్యాహి వ్యసనంవదన్తి మృగయామీ దృగ్వినోదఃకుతః." అభిజ్ఞాన శాకుంతలము.

ఈ పద్యము నాల్గవపాదమున ననుస్వారయతి. లక్షణము. "భువి ననుస్వారయతి బిందుపూర్వకముగ, ణాకునిట నాల్గు చెల్లుఁ బాండవ సహాయ, నాకునిటనాల్గు చెల్లు కందర్పజనక, మాకునిట నాల్గుచెల్లు సంపదలరాజ." అనంతుని ఛందము. దీనినే యప్పకవి బిందుయతి యనెను.

క. అతివినయాన్వితకుంతియు
ధృతమహిమాద్రియునగుచు నకతిప్రీతితరం
గితమతులై తను, గొలువఁగఁ
జతురమ్మృగయు లేఁగుదేరఁ దజనియె న్వనికిన్. 16

**రామాయణ.**—అతివినయాన్విత = మిక్కిలి యడఁకువగల, కుంతియున్ = ఈటెలఁ దాల్చియుండు భటులఁ గలవాఁడును. ధృతిమహిమన్ = ధైర్య మహిమను, అద్రియున్ = పర్వతమగు వాఁడును,

పర్వతముతో సాటియగువాఁడనుట. అగుచున్, అతి ప్రీతి తరంగిత మతులై = మిక్కుటమగు ప్రీతిచేపరంపరితమైన మనస్సుగలవారై, చతుర = సమర్థులగు, మృగయులు = వేఁటగాండ్రు, తనున్ = తన్ను, కొలువంగన్, ఏఁగుదేరన్ = కొలుచుట కొఱకు వచ్చుచుండఁగా, వనికిన్, చనియెన్ = అడవికి వెళ్లెను.

తా. ఈరీతి మున్నగు నాయుధములు ధరించిన సైనికులఁ గల దశరథుఁడు వేఁటగాండ్రు దనతో వచ్చుచుండ నడవి కరిగెను.

"కున్తి" "ప్రాసస్తు కుంతః" అని యమరము.

ఇట్లు, అతివినయాన్వితకుంతి; యనునప్పుడు 'కుంతాః యేషాంసంతీతి కుంతినః' అనుమతు బర్థకముపై బహువ్రీహివచ్చెను.

భారత.—అతివినయాన్విత = మిక్కిలి యడఁకువగల, కుంతియు, ధృతిమహి = ధైర్యమునకు స్థానమైన, మాద్రియును, నగుచున్ = నవ్వుచు, అతిప్రీతి తరంగితమతులై, తనున్, కొలువంగన్ = సేవించుచుండఁగా, చతుర మృగయులు, ఏఁగుదేరన్ =వచ్చుచుండఁగా, వనికిన్, చనియెన్ = వెడలెను.

తా. కుంతీమాద్రులు దన్నుఁ గొలుచుచుండఁగా మృగయులు దనతో వచ్చుచుండఁగాఁ బాండురాజడవికి వేఁటకై యేఁగెను.

"కుంతియు," "మాద్రియును;' ఇటనివి దీర్ఘాంతములు గామికి సూత్రము. "దీర్ఘాణాం హ్రస్వస్స్యాత్" ఆంధ్రశబ్ద చింతామణి.

'ఏఁగుదేరన్;' "తేతేరులు తెచ్చునకగు." బాలవ్యాకరణము.

వ. ఇట్లు చనిచని వివిధమృగంబులన్ వేఁటాడుచుండిటఁగి. 17

రామాయణ భారతార్థములు సమము.—

క. నటిఁగొనియె వేఁటతమి న

బ్బలియుఁడు శిశిర నగ రుచిర శ్రీ పరిసర మహీవుం

గల తమస తీర సికతా
విలసనములు డెందమునకు $ విందొనరింపన్. 18

రామాయణ.—అబ్బలియుఁడు = బలవంతుఁడగు నాదశరథుఁడు శిశిరనగ......మహిమన్ - శిశిరనగ = చల్లని చెట్లచేత, రుచిర = అందమగు, పరిసర = ప్రాంతభూములయొక్క, మహిమన్, కల = మాహాత్మ్యముగల, తమస తీర = తమసానదియొక్క గట్టున [ఇది సాధ్య సమాసము.] సికతా విలసనములు = ఇసుకదిబ్బల యొప్పిదములు, డెందమునకున్ = మనస్సునకు, విందొనరింపన్ = సంతోషము గల్గింపఁగా, వేఁటతమియందున్ = వేఁటయందలి యుత్సాహమునందు, నెలకొనియెన్ = స్థిరుఁడాయెను.

తా. దశరథుఁడు చల్లని చెట్లచే నందమగు ప్రాంత ప్రదేశము గల తమసా తీరమున వేఁటయం దుత్సాహముతో నుండెను.

"పరిసర" "పర్యంతభూః పరిసరః." అని యమరము.

"సికతా" "సికతా వాలు కాయాంచ సైకతే స్యా మయాంతరే" అని విశ్వము.

భారత.—అబ్బలియుఁడు = పాండురాజు, శిశిరనగ = హిమవత్పర్వతముయొక్క, రుచిర, పరిసర మహిన్ = ప్రాంతభూములయందు, మంగల తమ = మిక్కిలి శుభములగు, సతీరసికతా విలసనములు = భార్యలయొక్క, రసికత్వముచేఁ గల్గు విలాసములు, డెందమునకున్, విందు, ఒనరింపన్ = కల్గింపఁగా, వేఁటతమిన్, నెలకొనియెన్ = స్థిరుఁడాయెను.

తా. పాండురాజు హిమాలయ ప్రాంత భూములయందుఁ దనభార్యలరసికత్వ విలాసములు దనకు వేడ్కనిచ్చుచుండఁగా వేఁటయందాసక్తుఁడయియుండెను.

"నగ" "అగో నగశ్చ భుజగే నాభౌ భూరుహ భూధరే" నానార్థ రత్నమాల.

ఉ. హారిమృగవ్యనవ్యవిహితాదరుఁడాధరణీతలేశుఁడ
ధ్వారచితశ్రమాకలితుఁడై, కడుమెచ్చెసురాపగాజలా
సారసమాగమార్హతమసారసనారససారసౌరభో
దీరణకారణంబు నతిధీరసమీరకిశోరవారముల్॥ 19

రామాయణ.—— హారి = హారములుగలవాఁడును, [ఇది భిన్న పదము.] మృగవ్య...ఆదరుఁడు - మృగవ్య = వేఁటయందలి, నవ్య = నూతనముగా, విహిత = చేయఁబడిన, అదరుఁడు = ప్రీతిగలవాఁడు, ఆధరణీతలేశుఁడు = దశరథుఁడు, అధ్వ...ఆకలితుఁడై-అధ్వ = మార్గమందలి, ఆరచిత = చేయఁబడిన, శ్రమ = అయాసముతో, ఆకలితుఁడై = కూడినవాఁడై, [వేఁటాడుటచేఁ గల్గిన శ్రమచే నలసినవాఁడై యని భావము.] సురాపగా....కారణంబు - సురాపగా జలాసార = గంగానదీ ప్రవాహముతో, సమ = సాటిదగు, ఆగమార్హ = శ్రుతిస్మృతులవలన శ్రేష్ఠమగు, [పురాణ ప్రసిద్ధమగునదనుట] యాత్రా యోగ్యమనియు నర్థాంతరము చెప్పవచ్చును. తమసారస = తమసానదీ జలమునందలి, సారస = తామరలయొక్క, సార = శ్రేష్ఠములగు, సౌరభ = వాసనలయొక్క, ఉదీరణ = వ్యాపనమునకు, కారణంబు = హేతువైన. అతి ..వారముల్ - అతిధీర = మిక్కిలి దిట్టమయిన, సమీరకిశోర = మందమారుతముయొక్క, వారముల్ = సమూహమును, కడుఁ, మెచ్చెన్ = చక్కఁగా మెచ్చుకొనెను.

తా. దశరథుఁ డిట్లు వేఁటాడి యలసినవాఁడై గంగానదీ ప్రవాహముతో సాటిదగు తమసానదియందలి తామరల వాసనతో వచ్చు మందమారుతము తాఁకున శ్రమాపనోదన మగుటచే దానినెంతయు మెచ్చుకొనెను.

"మృగవ్య." "ఆచ్ఛోదనం మృగవ్యం స్యాదాఖేటో మృగయా స్త్రియాం." అని యమరము.

"సురాపగా" "అపాంసమూహః, ఆపః. తేరగచ్ఛతీ త్యాపగా" అని వ్యుత్పత్తి.

"ఆసార." "ధారా సంపాత ఆసారః" అని యమరము.

"తమసతీర" సమాసమధ్యమునహ్రస్వము వచ్చుటకు లక్షణము "అగునుస్త్రీలింగ శబ్దంబు హ్రస్వమునస, మాసమధ్యంబుననుు రంగమనుజ విభుని, కీర్తిహారజటా జూట సంకీర్ణ దివ్య, గంగజలముల మితిమీఱు గరి మననఁగ." ఆనందరంగరాట్ఛందము.

"రాకసుధాంశుమండలము" శృంగారనైషధము.

ఇటఁ దమ సారస యనుటచే శైత్యమును, సారస సౌరభయనుటచే సౌగంధ్యమును, కిశోరయనుటచే మాంద్యమును దెల్పఁబడియెను.

ప్రవాహమునఁ దామరలున్న లాగున వర్ణించుట కవి సమయ సిద్ధము.

భా॰రత.___హారి = మనోహరమైన, మృగవ్య, నవ్య విహిత, ఆదరుఁడు = ప్రీతిగలవాఁడు. ఆధరణీ తలేశుఁడు = పాండురాజు, అధ్వ, ఆరచిత, శ్రమ, ఆకలితుఁడై = కూడినవాఁడై, సురాపగా, జలాసార = ప్రవాహములయందు, సమాగమ = పరస్పర సాంగత్యమునకు, అర్హాతమ= మిక్కిలి తగిన, సారస = బెగ్గురు పక్షులుగల ['సమాగమార్హాతమ, సారస' అనునది సారసశబ్ద విశేషణము.] సారస = తామరలయొక్క, సార, సౌరభ, ఉదీరణ, కారణంబు = హేతువైన, అతిధీర, సమీరకిశోర, వారముఁ=సమూహమును, కడుఁ=మిక్కిలి, మెచ్చెఁ=మెచ్చుకొనెను.

తా. పాండురాజు వేఁటాడి యలసినవాఁడై యచ్చటి తామరల వాసనలతోఁగూడిన చల్లని పిల్లగాలులచే నపగతశ్రముఁడై యావాతపోతములను మెచ్చుకొనెను.

"సారస సారస" "అథసారసం। పద్మేవాతు ఖగే చంద్రే." అని నానార్థ రత్నమాల.

సీ. పుడమిఱేఁడీరీతిఁ గడఁగి డెందము మృగ
వ్యాపారఖేలన మభిలషింపఁ,
గానలోఁ దారు మృగంబులకై వడిఁ
గైకొని యసమాస్త్రకర్మకలనఁ,
దనరుచుఁ దొక్క పురాణముని దంపతులు దమ
కంబులు దేర నెయ్యంబు మీఱ,
ననిచినఁ దత్ప్రియతనయుండు వారిత
కారుణ్యుఁడై పూని కలశమంబు,
గీ. మగ్నముగఁ జేయుచప్పుడు భుగ్నహృదయుఁ
డగుచు వినిశితశరవిశేషాభిహతిని
ద్రెళ్లనేసె నాఘనులసద్దృష్టి నియతి
బ్రుంగఁ గేవల సారంగబుద్ధిఁ జేసి. 20

రామాయణ. పుడమిఱేఁడు = దశరథుఁడు, ఈరీతిన్=ఈలాగున, పూర్వోక్త ప్రకారముగాననుట. కడఁగి = ప్రయత్నించి, డెందము = మనస్సు, మృగస్య = వేఁటయందు, అపారఖేలనము = అధికవిహారము, అభిలషింపన్ = కోరఁగా, కానలోన్ = అడవిలో, [ఇదికాననశబ్దము నుండి, వర్ణలోపమువలనఁ గల్గిన వైకృత రూపము.] తారు = సంచరించు, మృగంబులకై,వడిన్, కైకొని = మృగములకై వేగముఁ బూని, అసమ = సాటిలేని, అస్త్రకర్మకలనన్=బాణప్రయోగముచే, తనరుచున్=ఒప్పుచు, [ఈ పదము చప్పుడువిని, యనుదానితో నన్వయించును.] ఒక్కపురాణము నిదంపతుల్లు = ఒక్కవృద్ధముని దంపతులు, తమకున్, అంబులు = నీళ్లు, తేరన్ = తెచ్చుటకు, నెయ్యంబు = స్నేహము, పుత్త్రస్నేహమనుట.

"మృగవ్య." "ఆచ్ఛోదనం మృగవ్యం స్యాదాఖేటో మృగయా స్త్రియాం." అని యమరము.

"సురాపగా" "అపాంసమూహః, ఆపః. తేనగచ్ఛతీ త్యాపగా" అని వ్యుత్పత్తి.

"ఆసార." "ధారా సంపాత ఆసారః" అని యమరము.

"తమసతీర" సమాసమధ్యమునహ్రస్వము వచ్చుటకు లక్షణము "అగునుస్త్రీలింగ శబ్దంబు హ్రస్వమునస, మాసమధ్యంబునను రంగమనుజ విభుని, కీర్తిహారజటా జూట సంకీర్ణ దివ్య, గంగజలముల మిత్రిమాఱు గరిమననఁగ." ఆనందరంగరాట్ఛందము.

"రాకసుధాంశుమండలము" శృంగారనైషధము.

ఇటఁ దమ సారస యనుటచే శైత్యమును, సారస సౌరభయనుటచే సౌగంధ్యమును, కిశోరయనుటచే మాంద్యమును చెప్పఁబడియెను.

ప్రవాహమునఁ దామరలున్న లాగున వర్ణించుట కవి సమయసిద్ధము.

భారత.——హారి = మనోహరమైన, మృగవ్య, నవ్య విహిత, ఆదరుఁడు = ప్రీతిగలవాఁడు. ఆధరణీ తలేశుఁడు = పాండురాజు, అధ్వ, అరచిత, శ్రమ, అకలితుఁడై = కూడినవాఁడై, సురాపగా, జలాసార = ప్రవాహములయందు, సమాగమ = పరస్పర సాంగత్యమునకు, అర్హతమ= మిక్కిలి తగిన, సారస = బెగ్గురు పక్షులుగల ['సమాగమార్హతమ, సారస' అనునది సారసశబ్ద విశేషణము.] సారస = తామరలయొక్క, సార, సౌరభ, ఉదీరణ, కారణంబు = హేతువైన, అతిధీర, సమీరకిశోర, వారమున్ =సమూహమును, కడున్ =మిక్కిలి, మెచ్చెన్ =మెచ్చుకొనెను.

తా. పాండురాజు వేఁటాడి యలసినవాఁడై యచ్చటి తామరల వాసనలతోఁగూడిన చల్లని పిల్లగాలులచే నపగతశ్రముఁడై యావాతపోతములను మెచ్చుకొనెను.

"సారస సారస" "అథసారసం। పద్మేవాతు ఖగే చంద్రే." అని నానార్థ రత్నమాల.

సీ. పుడమిఱేఁడీరీతిఁ గడఁగి డెందము మృగ
వ్యాపారఖేలన మభిలషింపఁ,
గానలోఁ దారు మృగంబులకై వడిఁ
గైకొనియసమాస్త్రకర్మకలనఁ,
దనరుచొక్కపురాణముని దంపతులు దమ
కంబులు దేర నెయ్యంబు మీఱ,
ననిచినఁ దత్ప్రియతనయుండు వారిత
కారుణ్యుఁడై పూని కలశమంబు,

గీ. మగ్నముగఁ జేయుచప్పుడు భుగ్నహృదయుఁ
డగుచు వినిశితశరవిశేషాభిహతిని
ద్రెళ్లనేసె నాఘనులసద్దృష్టి నియతి
బ్రుంగఁ గేవల సారంగబుద్ధిఁ జేసి. 20

రామాయణ. పుడమిఱేఁడు = దశరథుఁడు, ఈరీతిన్=ఈలాగున, పూర్వోక్త ప్రకారముగాననుట. కడఁగి = ప్రయత్నించి, డెందము = మనస్సు, మృగవ్య = వేఁటయందు, అపారఖేలనము = అధికవిహారము, అభిలషింపన్ = కోరఁగా, కానలోన్ = అడవిలో, [ఇదికాననశబ్దమునుండి, వర్ణలోపమువలనఁ గల్గిన వైకృత రూపము.] తారు = సంచరించు, మృగంబులకై, వడిన్, కైకొని = మృగములకై వేగముఁ బూని, అసమ = సాటిలేని, అస్త్రకర్మకలనన్ =బాణప్రయోగముచే, తనరుచున్=ఒప్పుచు, [ఈ పదము చప్పుడువిని, యనుదానితో నన్వయించును.] ఒక్కపురాణముని దంపతులు = ఒక్కవృద్ధముని దంపతులు, తమకున్, అంబులు = నీళ్లు, తేరన్ = తెచ్చుటకు, నెయ్యంబు = స్నేహము, పుత్త్రస్నేహమనుట.

మీఱన్ = అతిశయింపఁగా, అనిచినన్ = అంపఁగా, తత్ప్రియతనయుండు = ఆదంపతులకుఁ బ్రీతిపాత్రుఁడగు కుమారుఁడు, అవారిత, కారుణ్యుఁడై పూని = అడ్డగింపఁబడని దయగలవాఁడై, యాకార్యమునకుఁ బూని, [మిక్కిలి కనికరముతో నీరు దెచ్చుటకుఁ బూని యనిభావము.] కలశము, అంబు నిమగ్నముగన్ = జలకుండిక నీటిలోమునుఁగునట్లు, చేయు, చప్పుడు = చేయునట్టి శబ్దము, [కుండనీటిలో ముంచునప్పటి ధ్వనియనుట.] భుగ్న హృదయుఁడగుచున్ = కుటిల హృదయుఁడగుచు, విని = ఆలకించి, లసత్, దృష్టి = ప్రకాశించెడిచూపు, అంతర్దృష్టియగు జ్ఞానమనుట. నియతిన్ = విధిచేత, భ్రంగన్ = నశింపఁగా, కేవలసారంగబుద్ధిఁజేసి = ఏనుఁగయే యను బుద్ధిచే, ఆఘనున్ = ఆగొప్పవానిని = మునికుమారుననుట. శిత = వాఁడియైన, శరవిశేష = శబ్దఘాతియను బాణ విశేషముయొక్క, అభిహతిన్ = వ్రేటుచేత, త్రెళ్లన్, ఏసెన్ = చావఁగొట్టెను.

తా. దశరథుఁడు వేఁటయందాసక్తుఁడగుచు నడవిలో సంచరించు మృగములపై బాణప్రయోగము సేయుచుండె. అప్పుడచ్చటి వృద్ధముని దంపతులువచ్చియుండి వారు దమకునీరుఁదేరఁ దమకుమారు నంపఁగా నతఁడు తనచేతికలశము నీటముంపఁగా నప్పటిశబ్దమువిని యది యేనుఁగు నీరుద్రావు చప్పుడని తలఁచి దశరథుఁడు దైవదుర్విపాకమున శబ్దఘాతి యను బాణముచే నామునికుమారునేసెను.

"పుడమి," ఇది పృథివీశబ్దతద్భవము. "గుణములు గొనములు కులము కొలనన్నగు, బృందంబు బిందంబు పృథివిపుడమి." సర్వలక్షణసార సంగ్రహము.

"డెందము." "ఎదయన డెందంబనఁగా, మదియనఁగా నెడఁద నంగమఱ యుల్లమునా, హృదయమునకు నివియెసఁగును, విదితంబుగ నాహ్వయములు." ఆంధ్రనామసంగ్రహము.

"అపారఖేలనము." ఇటద్వితీయార్థమునఁ బ్రథమ. "తస్యాః ప్రథమాచజడపదానాంస్యాత్" ఆంధ్రశబ్దచింతామణి.

"పురాణమువి దంపతులు." పురాణప్రతనప్రత్న పురాతనచిరంతనాః" అనియు, "దంపతీజంపతీ భార్యాపతీ జాయాపతీచతౌ." అనియు నమరము.

"దంపతులు" "దంపతీ, జంపతీ, జాయాపతీ. జాయాశబ్దస్య జంభావో దంభావశ్చవాని పాత్యతే." వరరుచివార్తికము.

"భుగ్నహృదయుఁడు." ఆవిద్ధంకుటిలం భుగ్నంవేల్లితంవక్రమిత్యపి." అని యమరము.

"నియతి." దైవం దిష్టంభాగధేయం భాగ్యంస్త్రీనియతిర్విధిః" అని యమరము.

"కేవల సారంగబుద్ధిఁజేసి" ఇట 'కేవల' యను పదము నిర్ణయార్థమున వచ్చుటచే నపుంసకలింగమైనను మకారాంతావ్యయమైననగును. "నిర్ణీతేకేవలమితి త్రిలింగంత్వేక కృత్స్నయోః" అని యమరము.

"సారంగ." సజాతీయైస్సహ అరం అత్యర్థంగచ్ఛతీతి సారంగః" అని వ్యుత్పత్తి.

"సార + అంగ" సవర్ణదీర్ఘసంధి కావలసి యుండినను "శకంధ్వాదిషు పరరూపంవాచ్యం" అనువాప్యునఁ బరరూప సంధి గలెను.

"కానలోఁదారు"—ఇటఁ గొందఱు 'తారు' అనునది యలఘురేఫమనియు, శ్లేషార్థసంఘటనమునకై రేఫద్వయమేళనము చేసెననియు నభిప్రాయ పడెదరుకాని యిచ్చటి తారు లఘురేఫమేయగును. అలఘురేఫమునకుఁ దిరోహితమని యర్థము గాని సంచరించునని యర్థముకాదు.

భారత. పుడమిఱేఁడు = పాండురాజు, ఈరీతిగా, కడఁగి=పూని, మునిదంపతులు, డెందము = మనస్సు, మృగ = మృగదంపతులయొక్క, వ్యాపార = రతివ్యాపారమువంటి, ఖేలన = విహారమును, అభిలషింపగా,

కానలోన్, తారు = తాము, మృగంబులకైవడిన్ = మృగముల రీతిని, కైకొని = గ్రహించి, మృగరూపధారులై యనుట. తమకంబులు, తేరన్ = తమిపుట్టఁగా, నెయ్యంబు, మీఱన్ = అతిశయింపఁగా, అసమాస్త్రకర్మకలనన్ = మన్మథవ్యాపారమునందలియాసక్తిచే, [అసమ, సరికాని, అనఁగా బేసియగు, పంచబాణుఁడనుట.] తనరు = ఒప్పుచున్న, చొక్కపురాణ = మంచి యనురాగము, ననిచినన్ = పల్లవింపఁగా, మిక్కిలి యనురాగము గల్గఁగా నని భావము. తత్ప్రియతన ఆవిహారమునందలి ప్రీతిచేతనే, ఉండన్ = ర్తింపఁగా, వారితకారుణ్యుఁడై = అడ్డుపెట్టఁబడిన దయగలవాఁడై, దయాశూన్యుఁడై యనుట. ప్రాని, కలశమంబు=శాంతము, నిమగ్నముగన్, చేయుచున్ = నశింపఁజేయుచు, భగ్నహృదయుఁడగుచున్, సద్దృష్టి = మంచి చూపు, నియతిన్, బ్రుంగన్, కేవల సారంగ, బుద్ధిఁజేసి, జింకయే యనుబుద్ధిచేత, వినిశిత = మిక్కిలి వాఁడియైన, శరవిశేషాభి హతిని, అఘునులన్ = ఆగొప్పవారిని, గ్రేల్లన్, ఏసెను= వేసెను.

తా. పాండురాజు వేఁటాడుచు నాయడవిని మృగములలాగున రతి క్రీడ సేయఁదలఁచి మునిదంపతులు మృగరూపధారులై విహరించుచుండ, దైవగతి విపరీతమగుటచే నావిషయ మెఱుఁగక కేవల మృగములేయని తలఁచి వారిపై బాణప్రయోగము చేసెను.

"మృగ దంపతులు." "మృగీచ మృగశ్చమృగౌ" ఏకశేషవృత్తి. ఇట స్త్రీలింగశబ్దము చేరుటచేఁ బుంలింగశబ్దముమాత్రము శేషించినది. "పుమాన్ స్త్రియాం." పాణిని.

"చొక్కపురాణ" "కర్మధారయమున ముఁపగ్గమునకుఁ బుంపులగును." బాలవ్యాకరణము.

"రాణ." రాగశబ్దమునకు రాణ యనునది మాగధీరూపము.

సారంగ" "అథ చాతకే। భృంగే కురంగ మాతంగే సారంగశ్శబలే త్రిషు." నానార్థరత్నమాల.

వ. ఇట్లేసినన్. 21

క. వాలంప తాఁకునకు ధృతి
ప్రీలఁగ హా! తాత యనుచు వెలువడు తన్మ
ర్త్యాలాపమునకు నాజన
పాలకులోత్తంసుగుండె భగ్గునఁ గలఁగెన్. 22

రామాయణ భారతార్థములు సమము. వాలు=వాఁడియగు, అంప తాఁకునకున్ = బాణములు తగులుటచే, [ఇటఁ దృతీయార్థమున షష్ఠి.] ధృతి = ధైర్యము, ప్రీలఁగన్ = చెడఁగా, హా, తాత, అనుచున్, వెలువడు = నోటినుండి. వెలువడుచున్న, తన్మర్త్యాలాపములకున్ = ఆమనుజునిమాటలఁ బోలుమాటలకు, ఆజనపాలకులోత్తంసు = ఆరాజశ్రేష్ఠుని, [రా. దశరథుని. భా. పాండురాజుయొక్క.] గుండె = గుండియ, భగ్గునన్, కలఁగెన్ = భగ్గుమని కలఁత నొందెను.

తా. వాఁడిబాణములతాఁకున 'హాతాత' యని వెలువడిన మర్త్యాలాపముల విన్నరాజుయొక్క [రా. దశరథుని. భా. పాండురాజుయొక్క.] గుండెకలఁగెను.

తాతశబ్ద మాంధ్రమునఁ బితామహుఁడను నర్థమిచ్చినను సంస్కృతమునఁ దండ్రి యని యర్థమగుచున్నది.

"అంపతాఁకు." అమ్ము + తాఁకు. "కొండొకచో సమాసంబులందు నమ్వాదికను మ్వాదుల మువర్ణంబులు పఞ్వర్ణకంబులగు." బాలవ్యాకరణము.

క. అధరణీపాలుఁడు తమ
సాధునియతికొమరు నేఁడు ౖ సమసెనె యిట్లా
హా ! ధాత్రవ్రాఁత యని శర
బాధంగలఁగఁగను వారి ౖ పజ్జకుఁ జనియెన్. 23

రామాయణ. అధరణీపాలుఁడు = ఆదశరథుఁడు, తమసాధునిన్ = తమసానదిలో, యతికొమరు నేఁడు = మునిపుత్త్రి నేండ్లు, ఆయువనుట. [ఏఁడనుట యిటజాత్యేకవచనము.] ఇట్లు, సమసెనే = ఈ లాగున నశించెనే, ఆహా, ధాత్రవ్రాఁత = బ్రహ్మయొక్క చైదము, అని, శర బాధన్, కలఁగఁగను, బాణము గ్రుచ్చి కొనుటవలనఁ గల్గినబాధవలనఁ గలఁత నెందుచుండఁగా, వారిపజ్జకున్ = తమసాజల సమీపమునకు, చనియెన్ = వెళ్లెను.

తా. ముని బాలునకుఁ దమసానదిగట్టుననే నేటితో నాయువునిండెఁ గదా! ఆహా ! బ్రహ్మచైదమని చింతించుచు బాణబాధచేఁ గలఁతపడు నాబాలునిజూడ దశరథుఁడు నీటిచెంతకు వెళ్లెను.

"వ్రాఁత" యాంతధాతువగుటచే దీని కృదంత రూపమునందలి తకారము బిందుసంయుతముగనే యుండును. "తజ్వర్ణకంబు చేయ్వ్యాదుల కగు." బాలవ్యాకరణము.

"ధుని." "తటినీహ్రాదినీధునీ." అని యమరము.

"పజ్జ" 'పశ్చాత్.' అనుదానివికృతి. "పజ్జ. వెనుక, సమీపము. పశ్చాత్." వైకృతిదీపిక.

"ఏఁడు." ఇట నర్ధానుస్వారమువచ్చుటకు ; "పదమూఁడేఁడు లరణ్యావాసమున" ననిసోమయాజి ప్రయోగము.

భారత. తమసాధునియతి, కొమరు = తమయొక్క లెస్సైన భాగ్య వైభవము, నేఁడు, ఇట్లు, సమసెనే = నేఁడీలాగున నశించెనుగదా, ఆహా,

ధాత్రవాఁత, అని, శరబాధఁ, కలఁగఁగను, ఆధరణీపాలుఁడు = పాండురాజు, వారిపజ్జకున్ = ఆమునిదంపతుల సమీపమునకు, చనియెన్ = పోయెను.

తా. మునిదంపతులు నేఁడు దమభాగ్యవైభవ మీలాగునవాయెను గదాయని చింతించుచు బాణబాధచేఁ గలఁతనెందుచుండఁ బాండురాజు వారిని సమీపించెను.

క. చనితన్ముఖమునఁ దద్వృ
 త్తనవిధ మంతయునువిని ధరారమణుఁడు ద
 త్తను శరవేదనఁ గ్రమ్మఱి
 తనుఁ బొదవిన యట్లతి వ్యథావిహ్వలుఁ డై. 24

రామాయణ భారతార్థములు సమము. ధరారమణుఁడు=రాజు [రా. దశరథుఁడు. భా. పాండురాజు,] చని, తన్ముఖమునన్ = వానిమాట చేత, లేక, వారిమాటచేత,తద్వృత్తనవిధమంతయును, విని=ఆచరిత్రమంతయు నాలకించి, తత్,తనుశర,వేదన=శరీరమున బాణముగ్రుచ్చికొనుటవలనఁగల్గిన బాధ. క్రమ్మఱి, తిరిగి, తనున్, పొదవినయట్లు = తన్ను గ్రుచ్చినలాగున, అతివ్యథా = మిక్కిలి బాధచే, విహ్వలుఁడై = అశక్తుఁడై.

తా. ఆరాజు తన్ముఖమున నాచరిత్రమువిని బాణముగ్రుచ్చికొనుటచేఁ గల్గిన యావేదన, తిరిగి తననుఁజెందినలాగున బాధచెందినవాఁడై.

"వ్యథా." దీనిచేతజనులు భయపడుదురు లేక చలింతురు కాఁబట్టి వ్యథయని బాధకుపేరుగల్గెను. "విధ్యంతే అనయేతివ్యథా. వ్యథభయచల నయోః" గురుబాలప్రబోధిక.

"విహ్వల." విక్లబో విహ్వలః" అని యమరము.

క. ఏనుఁగు గని కర మరయక
 బూనితిఁగా కిట్టి యెడలఁ బొనఁగునె యేయం

గానమె కాలనియమగతి
తోఁ నావేఁట మునియుగముఁ ద్రుంగించెఁ దుదిన్. 25

రామాయణ. ఇది దశరథుని వాక్యము. ఏనుంగు, అని = గజమని, కరము, అరయక = మిక్కిలి విచారింపక, పూనితిన్, కాక = ఇట్టి యకార్య మాచరింపఁబూనితిఁగాని, ఇట్టి యెడన్ = ఇట్టిస్థానములందు, ఇట్టి యాశ్రమప్రదేశములందనుట. ఏయన్, పాసఁగునె = బాణము వేయఁ దగునా, యుక్తముకాదనుట. ఇది కాకుస్వరము. కానమె = తెలియమా, కాలనియమగతితోన్ = విధి ప్రేరణతోఁగూడి, ["లలాట లేఖానపునః ప్రయాతి." అని న్యాయము.] నావేఁట, మునియుగమున్ = ఋషి కుమారుని యాయువును, తుదిన్ = కడన, ద్రుంగించెన్ = నశింపఁజేసెను.

తా. గజమని తలఁచి చక్కఁగా నారయక యిట్టి యకార్యము నాచరింపఁ బూసితినిగాని యిది యాశ్రమ ప్రాంతమగుటచే నిటఁగల జంతువు లన్యబాధాకరములు గావు. కాఁబట్టివాని సంహరింపఁ గూడదనుట తెలియనా? నా యీవేఁట మునికుమారుని యాయువు నంత మందించుటతో నంతమందెనుగదా ?

"ఏనుంగని" హ్రస్వమగుటచే నిటనర్ధబిందు పూర్ణబిందువులు రెండు నగును. "హ్రస్వాత్పూర్ణోపిభవేత్" అంధ్రశబ్ద చింతామణి. "ఏనుంగు నెక్కి పెక్కేనుంగు లిరుగడరాఁ బురవీథులఁ గ్రాలఁగలదె." అని సోమయాజి ప్రయోగించెను.

"ఏయన్." "పూనె నెగసెఁబొసఁగెఁ బొనరెఁ బొందెనటన్న, పలుకులందు మొదలఁ గలుగునట్టి, వ్యంజనంబులఁడగి వానిపైస్వరములు, నిలుచు వలసినపుడు నీరజాక్ష." అని యప్పకవిచెప్పిన చొప్పుననట్టివానిలో పాల్లోపమున నీ రూపమువచ్చెను. "ఓ సరిలిపఱచు మృగములఁ జేనియు' నని నన్నయ యజాదిగాఁ బ్రయోగించెను.

భారత. ఇది పాండురాజు వాక్యము. ఏనుక = నేనును, కని = చూచియు, ప్రత్యక్షముగాఁజూచియు ననుట. కరము, అరయక = చక్కఁగా విచారింపక, కనికరము, అరయక = దయలేకయనియు నర్థాంతరము. లేక, కరము = చేయి, అరయక = సంకోచింపక. అనియుఁ జెప్పవచ్చును. పూనితిఁగాక, ఇట్టియెడక = ఇట్టి క్రీడా సమయములయందు, ఏయక పోసఁగునె = తగునా, కానమెకాలు, అని = అడవిలోని సాధారణ మృగములు అని, యమగతితోక = యమునిప్రేరణచేఁగూడిన, నావేఁట, ముని యుగము = మునులజంటను, తుదిక, ద్రుంగించెక = నశింపఁజేసెను.

తా. దయాహీనుఁడనై యిట్టి యకార్యము దెలియమింజేసితినిగాక. ఇట్లు రత్యాసక్తులకు భంగముగల్గింపరాదనుట దెలియనా? అడవియందలి మృగములని తలఁచి యమునిప్రేరణచే నావేఁట యీదంపతులఁ జంపెను.

ఏనుక-ఇచ్చటి సముచ్చయముచే, భీష్మాది సహవాసముచే విజ్ఞుఁడనగు నాయట్టివాఁడు ననుట సూచితము.

ఏనుక + కనికరము. ఇటఁబూర్ణబిందువువచ్చుటకు; "పరుషా ద్రుత ప్రకృతి కాస్సరళాస్స్యుస్తద్గ్రితంచ బిందుస్స్యాత్" ఆంధ్రశబ్ద చింతామణి.

"మెకాలు" "మెగమనఁగమెక మనంగను, మృగమునకు నభిఖ్యలయ్యె" ఆంధ్రనామశేషము.

"మెకాలు." ఇటమకారలోపము దదాది హల్లునకు దీర్ఘమువచ్చుటకును; "వికృతౌక్వచిన్మలోపో మోర్దీర్ఘశ్చాత ఆదిమస్యభవేత్." ఆంధ్ర శబ్దచింతామణి.

"యుగ" "యుగం యుగ్మకృతాదిషు." అని యమరము.

వ. అని చింతించుచుండఁడన్. 26

చ. ఘనశరవేదనల్ బలియఁగా వనకుంభిని వ్రాలియున్నయ
మ్మునియు గళంబు దొట్రుపడ ముంచితి నా తలిదండ్రులన్ మహా
ఘనది; నిఁకేమనన్ నెఱయఁగానని కన్నులవారి వృద్ధులం
దనరఁగ దదంఘ్రి చేర్పు మను ధార్మికుఁ డాయన నమ్రవక్త్రుఁడై.

**రామాయణ.** ఘన, శరవేదనల్ = గొప్పవగు **బాణములు నాఁటుటచేఁ** గల్గిన **బాధలు**, బలియఁగాన్ = అతిశయింపఁగా, వనకుంభినిన్ = జలకుండికపై, వ్రాలియున్న = పడియున్న, అమ్మునియు = ఆముని**బాలకుఁడు**ను, గళంబు = కంఠము, తొట్రుపడన్ = రాలుపడఁగా, ఇది మొదలు ముని**బాలకుని** మాటలు. నెఱయన్ = మిక్కిలి, కానని కన్నులవారిన్ = దృష్టివిహీనులగువారిని, వృద్ధులన్ = ముసలివారిని, నాతలిదండ్రులన్ = నా జననీ జనకుల, మహా, అఘ, నదిన్, ముంచితిన్ = అధిక దుఃఖమనెడి నదియందు, ముంచితిన్, ఇఁకన్, ఏన్, మనన్ = ఇంక నేను జీవింపను, ధార్మికుఁడా = ఓ ధర్మాత్ముఁడా, విల్లుగలవాఁడా యనియుఁ జెప్పవచ్చును. తనరన్ = ఒప్పఁగా, ననున్, తదంఘ్రిన్ = వారి పాదములను గుఱించి, చేర్పు = చేర్పుము, అనన్ = అనఁగానే, వినమ్రవక్త్రుఁడై = వంచిన తలగలవాఁడై, ముందటి పద్యముతో నన్వయము.

తా. ఆమునికుమారుఁడు బాణబాధ యెక్కుడు కాఁగా జలకుండికపైఁ బడి యెలుఁగు రాలుపడ కన్నులుగానని ముదుసళుల నాతలిదండ్రుల దుఃఖమనెడి నదిలో ముంచితిని. ఇంక నే జీవింపను. ఓధర్మాత్ముఁడా నన్నువారి చెంతకుఁ జేర్పుమనఁగా దశరథుఁడు దలవంచినవాఁడై.

"వనకుంభినిన్." "వనేసలిలకాననే." అని యమరము.

"కుంభిని" కుంభిశబ్దము యొక్క రూపాంతరమే కుంభిని. కుంభిశబ్దమునకు. "ఉదన్యకుంభీరథ శాతకుంభజాః." అని నైషధ ప్రయోగము గలదు.

"తలిదండ్రులన్." ఇటద్వంద్వములోని పరుషములకు గసడదవాదేశము. "స్యుర్ద్విన్నా దేవతస్మాత్తే వినాద్వంద్వం వాకేర్మతే." అధర్వణకారికావళి,

"ముంచితి నాతలిదండ్రులన్." ఇటనకారలోపమునకు; "భూతార్థే ఇత్వవిశిష్టయోర్ద్వయో ర్వర్ణకయోః ప్రయోగవికల్పోప్యాచార్యైః ప్రేతయేవ. ఏలనిప్ర చెప్పె తీవుగావున." అహోబలపండితీయము.

"ధన్వాత్ముఁడా," విల్లుగలవాఁడాయను నర్థమున, విల్లుండుటకెట్టి చేఁతయూ చేయఁదగినదనుట వ్యంగ్యము. కాళిదాసుఁడును, "ఆర్త్రాణాయ వశ్శస్త్రంనప్రహర్తుమనాగసి." అనియే చెప్పియున్నాఁడు.

ప్రా॰ప్రత. ఘనశరవేదనల్, బలియఁగాన్, వనకుంభినిన్=అరణ్యభూమియందు, వ్రాలియున్న, అమ్మునియుగళంబు = ఆమునిదంపతులు, తొట్రుపడన్ = తడఁబడఁగా, ఆ తలిదండ్రులన్ = ఆమహాత్ములను, [ఇచ్చట, తలిదండ్రులననుట పూజావాచకము.] మహో, అఘనదిన్, సెలయంగాన్ =పూర్ణముగా, ముంచితిన్, ఇంకేమనన్ = ఇంక నేమి చెప్పుదును, అని, కన్నులన్, వారి, వృద్ధులన్, తనరన్ = కన్నీరువృద్ధి పొందుచుండఁగా, తదంఘ్రిచేరువనను = వారి పాదముల చెంతను, ధార్మికుఁడు, ఆయన = పాండురాజు, నమ్రవక్త్రుఁడై = తలవంచినవాఁడై.

తా. బాణవేదనచే నడవినిఁబడియుండి తడఁబడుచున్న యాముని దంపతులనుజూచి, వీరిని గొప్పదుఃఖమనెడి నదిలోఁ ద్రోసితినిగదా! ఇంకేమిసేయుదునని దుఃఖించుచు వారి సమీపమునకేఁగి నమ్రవదనుఁడై.

"కుంభిని." గౌరి లాకుంభినీక్షమా." అని యమరము.

"తదంఘ్రిచేరువనను. ఇదిమిశ్రసమాసము. "సంస్కృత వైకృతశబ్దైర్మిశ్రసమాసస్స యేవవిజ్ఞేయః." ఆంధ్రశబ్దచింతామణి.

"ధార్మికుఁడాయన నమ్రవక్త్రుఁడై." ధర్మమెఱిఁగినవాఁడయ్యు నిట్టి యకార్య మాచరించినందులకు లజ్జచేతను, అధర్మములో దిగుటవలని భీతిచేతను, దుష్టశిక్షణ శిష్టరక్షణములు స్వధర్మములయి యుండ వానిని వీడుటవలని దుఃఖముచేతను దలవంచెనని కవియాశయము.

క. విని యతనిం దనపై నిడు
  కొని యేఁగినియమికిఁ దగని ఘోరార్తి యొన
  ర్చినవాఁడ మీకు దండ్యుఁడ
  నని తనుఁ దెలుపుచును వారి కప్పనసేసెన్. 28

**రామాయణ.** విని = వానిమాట లాలకించి, అతనిన్ = ఆముని కుమారుని, తనపైన్, ఇడికొని = తనపైనఁ బెట్టికొని, మోఁచికొనియనుట. ఏఁగి = వెళ్లి, నియమికిన్, తగని = మునికిఁదగని, మునీశ్వరులవిషయమునఁ జేయరానిదనుట. ఘోర, ఆర్తిని = పీడను, ఒనర్చినవాఁడన్ = చేసినవాఁడను, మీకు, దండ్యుఁడను = మీచే దండింపఁదగినవాఁడను. [ఇటఁ దృతీయార్థమునషష్ఠి.] అని, వారికిన్, తనున్, తెలుపుచును = తానట్టివాఁడని తెలుపుచు, అప్పనచేసెన్ = అబాలునర్పించెను.

తా. మునికుమారునిమాటలువిని దశరథుఁడాబాలుని మోఁచికొనివెళ్లి యావృద్ధ దంపతులయొద్దకరిగి, తాను మహాపరాధము చేసినలాగునుఁజెప్పి, తానిట్టివాఁడనుట యెఱిఁగించి వారికాబాలు నర్పించెను.

భారత. వినియత, నిందన=మిక్కిలి నియతమైన నింద, పైన్, ఇడికొని, = తనపై నునిచికొని, ఏన్, కినియమికిన్, తగనట్టి = కోపింప కుండుటకుఁ దగనట్టి, క్షమింపవీలుగాని యనుట. ఘోరార్తి, మీకున్, ఒనర్చినాఁడన్, దండ్యుఁడన్, అని, తనున్, తెలుపుచును, వారికిన్, అప్పన, చేసెన్ = తన్నర్పించెను.

తా. స్థిరముగ నిలిచినట్టి నింద తనపైనిడికొని దశరథుండు "మీకు క్షమింప వీలుగానట్టి గొప్పబాధ చేసినాఁడ"నని తన్నువారి కర్పించెను.

సీ. చేసి మనుజేశ్వరుండు తక్ఛాసనమున
నాత్మశరసముత్పాటనక్ మాచరించెఁ
దానఁబట్టి, ప్రాణంబు లెంతయుఁ జలింప
నసుతతోగ్రార్తి కోర్వక యతివరుండు. 29

రామాయణ. చేసి = ఆబాలునర్పించి, మనుజేశ్వరుండు = దశరథుఁడు, తచ్ఛాసనమునన్ = వారి యాజ్ఞచే, ఆత్మశరస ముత్పాటనమున్, ఆచరించెన్ = తనబాణమును దీసివైచెను, దానన్ = ఆకారణమున, పట్టి ప్రాణంబుల్ = కుమారుని ప్రాణములు, ఎంతయున్, చలింపన్ = పోఁగా, అసుతత = కుమారుఁడులేకుండుటచేనైన, ఉగ్ర = ఘోరమైన, ఆర్తికిన్ = బాధకు, ఓర్వక = తాళఁజాలక, యతివరుండు = మునిశ్రేష్ఠుఁడు. ముందటిపద్యముతో నన్వయము.

తా. వారియాజ్ఞచే నాబాలుని శరీరమున గ్రుచ్చికొనిన తనబాణమును దీసివేయఁగానే యాతఁడు మృతినందెను. అంత నాపుత్రశోకము నోర్వఁజాలక యతిశ్రేష్ఠుఁడు.

భారత. చేసి, మనుజేశ్వరుండు = పాండురాజు, తచ్ఛాసనమునన్, ఆత్మశరసముత్పాటనము, ఆచరించెన్ = చేసెను, దానంబట్టి = దానివలన, ప్రాణంబుల్, ఎంతయున్, చలింపన్ = తొట్రుపడఁగా, అసు, ప్రాణముల యొక్క, తత = విస్తృతమైన, ఉగ్ర, ఆర్తికిన్, ఓర్వక, యతివరుండు = ఆమృగదంపతులలోని పురుషుఁడు.

తా. పాండురాజు దన్నర్పించి వారి యాజ్ఞచొప్పునఁ దనబాణము దీసివేయఁగా దానిచేఁ బ్రాణములు కొట్టుపడఁగా నాబాధకోర్వలేక యామృగములలోఁ బురుషుఁడు.

"శాసన." "నిదేశశ్శాసనంచసః." అని యమరము.

గీ. కాంతతోడఁ గూడఁ గానన నిట్టటు చన
లేనియీయవస్థఁ బూనియున్న
మాకుమారుప్రాపుఁ బోకార్చె నేఁడు నీ
దైనప్రౌఢిమహిమ భానుకులుఁడ. 30

రామాయణ. భానుకులుఁడ=సూర్యవంశపు రాజయిన దశరథుఁడా, నీదైన ప్రౌఢిమహిమ=నీచాతుర్యమహిమ, పోకార్చెను క్రియకుఁగ కర్త, కాంతతోడన్, కూడన్=భార్యతోఁగూడ, కానన్=చూడఁజాలను, ఇట్టు, అటుచనలేని, యవస్థన్, పూనియున్న = గ్రుడ్డితనముచే నిటునటు గదలలేని యీవార్ధకావస్థను, పూనియున్న, మాకుమారు ప్రాపున్ = మాకుమారు నాశ్రయను, నేఁడు, పోకార్చెను = ఈదినము పోఁగొట్టెను.

తా. దశరథుఁడా! గ్రుడ్డితనముచే నిటునటు గదలలేని యీవార్ధకావస్థనున్న మాకు నీబాణచాతుర్యమహిమ కుమారుని నాశ్రయమును నశింపఁజేసెను.

భారత. హిమ భానుకులుఁడు=చంద్రవంశమునఁ జనించిన పాండురాజా, కానన్ = అడవియందు, కాంతతోడన్, కూడన్, ఇట్టు అటు. చనలేని యీయవస్థన్, పూనియున్న = రత్యాసక్తులయియున్న. మాకున్, మారుప్రాపు = మన్మథసౌఖ్యమును, నీదైన ప్రౌఢిమ=నీయొక్క సామర్థ్యము, పోకార్చెను = పోఁగొట్టెను.

తా. ఓ పాండురాజా ఈ యడవియందు రత్యాసక్తులయియున్న మాకు నీబాణ చాతుర్యము రతిసౌఖ్య భంగకారియయ్యెను.

అలంకారము. వ్యాజనింద. లక్షణము. "నిందచే నిందవిన్యాప్తి నెగడెనేని, వ్యాజనిందయనఁగఁ బ్రఖ్యాతికెక్కు, నేమియున పలెవిధని ముస్నేకశిరము, నలియఁజేసిన హరుననవలయుఁగాక." ఆంధ్ర చంద్రాలోకము.

ఆ. ఎందు వేఁట రారొ ? యితరు లేమనసుతో
దారసంగసుఖముఁ దప్పఁద్రోచి
అకట ! పాండురాజ ! యశమెన్నవైతివి
క్రూరదశరఘేశ ! కులముఁ రోయ. 31

రామాయణ. అతిక్రూర, మిక్కిలిక్రూరుఁడా, దశరఘేశ = దశరఘుఁడా, ఇతరులు = నీయట్టినారన్యులు, వేఁటరారొ = వేఁటకైవచ్చుచుండుటలేదా ? ఏమనన్ = ఏమిచెప్పవచ్చును, సుత, ఉదారత = గొప్పదగు, సంగ=చేరికచేఁ గల్గిన, సుఖము, తప్పఁద్రోచితివి = తప్పులాగునఁద్రోచితివి, అకట=అయ్యో, కులము, రోయన్=నీకులము రోఁతచెందులాగున, పాండుర = తెల్లనయిన, అజయశము = అజమహారాజుయొక్క కీర్తిని, ఎన్నవైతివి = తలంపవైతివిగా !

తా. దశరథా ! నిన్నేమనఁగలను ? రాజులెందఱు వేఁటకు వచ్చుట లేదు. వారెల్ల నీవలె నిట్లు సంహరించుచున్నారా ! అయ్యో ! నీజనకుఁడగు నజమహారాజుయొక్క కీర్తినిఁగూడఁ దలఁపవైతివిగా !

భారత. పాండురాజ, సంబుద్ధి. ఇతరులు, ఎందున్, వేఁటరారె = వేఁటాడ వచ్చుట లేదా, ఏమనసుతోన్, దారసంగసుఖము = భార్యతోఁగూడుట వలనిసుఖమును, తప్పఁద్రోచితివి, అకట, క్రూరదశన్ = క్రౌర్యముచే, రఘేశకులము = రఘుకులయొక్క కులము, రోయన్ = రోఁతనొందఁగా, యశము, ఎన్నవైతివి = తలఁపవైతివి.

తా. పాండురాజా! ఎందఱు వేఁటాడుటకు వచ్చుట లేదు. వారెల్లరు నీవలెనొరులకు భార్యా సంగసుఖమును బోఁగొట్టుచున్నవారె! అతి రఘుకులసమూహమ్మునరోయ నీచేసిన యీ క్రూరత్వమున యశముగూడఁ దలఁపకుంటివికదా ! ( కీర్తి నశించుననియుఁ దలంపలేదుగదాయని భావము.)

"మనసులో" ఊదఁబలుకమికి; "ఒగిహాలంతంబు లోకకొన్ని యోఁదుచోటఁ దేల్చిపలుకంగ వచ్చును దెల్లముగను." కవిసంశయ విచ్ఛేదము.

"పాండురాజ యశము" ఇట రామాయణార్థమున "రాజ" యని తాలవ్యముగను, భారతార్థమున "రాజ" అని దంత్యముగను నున్నది.

వ. అని యమ్మునీశ్వరుండు. 32

గీ. నిజశరీర మెట్లట్లయానృపుని మేను
నాత్మజాయాసమాగమం బైనయపుడ
ప్రాణములు వాయునట్లుగాఁ బరమశోక
వశత శపియించి మృతి నొందె వనితతోడ. 32

రామాయణ. పూర్వపుఁ బద్యమునందలి మునీశ్వరుండనునదికర్త, నిజశరీరము, ఎట్లు, అట్ల = అలాగున, ఆనృపుని మేను = ఆ దశరథుని శరీరము, ఆత్మజ = కుమారుని వలని, ఆయాసము = సంకటము, అగమంబు, అయిన యపుడ=వచ్చినప్పుడే, ప్రాణములు, పాయునట్లుగాన్ =ప్రాణములు పోవులాగున,పరమశోకవశతన్=మిక్కిలి వ్యసనమునకు వశమగుటచే శపియించి = శాపమువెట్టి, వనితతోడన్=భార్యతో, మృతిన్,ఒందెన్ = మరణించెను.

తా. తనవలెఁబుత్రాయాసముగల్గినప్పుడే మరణించును గాక యని దశరథుని శపించి యాముని భార్యతోడ మరణించెను.

భారత. నిజశరీరము, ఎట్లు, అట్ల, ఆనృపుని మేను = ఆపాండురాజు శరీరము, ఆత్మ...సమాగమంబు, ఆత్మ=తనయొక్క, జాయా=భార్యతో, సమాగమంబు=చేరిక, ఐనయపుడ, ప్రాణములు, పాయునట్లుగాన్, పరమశోక వశతన్, శపియించి = శాపముపెట్టి, వనితతోడన్ = భార్యతో, మృతినందెన్.

తా. తనవలె భార్యాసంగమ మయినచో వెంటనే మరణించులాగున నామునిపాండురాజును శపించి తనభార్యతోడ మరణించెను.

మ. యతియెంతేఁదనయార్తిఁజేడ్పడినవాఁడై యాత్మజాయాసమా
గతమైనప్పుడ మేనుఁబాయుమని యల్కన్నన్నుశాపించె నం
తతిలేకుండెడిచోఁదదాశమిగులంగాఁ బోవు టెట్లనియుఁ
ధృతిమైనోర్వఁగవచ్చునామదికిఁ జింతింపంగ నంచెన్నుచున్.

రామాయణ. యతి, ఎంతేన్, తనయార్తిన్ = కుమారునివలని దుఃఖముచే, చేడ్పడినవాఁడై=చేటుపొందినవాఁడై, ఆత్మజ, ఆయాసము, ఆగతమైనప్పుడ, మేనున్, పాయుము, అని, కుమారుని మూలమున సంకటముదయించి నపుడేమరణింపుమని, అల్కన్, నన్నున్, శాపించెన్. కోపమున నన్ను శపించెను. సంతతి లేకుండెడిచోన్ = సంతానము లేనప్పుడు, తదాశ =అసంతానము నందలియపేక్ష. మిగులన్, కాన్ =పూర్ణముకాఁగా, సంతానము కల్గినచోననుట. నామదికిన్, చింతింపన్, కన్, తాన్ = తాను, నేననుట, పోవుట = మృతిచెందుట. ఎట్లనియున్, ధృతిమైన్ = ధైర్యముతో, ఓర్వఁగవచ్చున్, అంచున్, ఎన్నుచున్ = తలఁచుచు.

తా. సంతతిలేదని చింతించునాకు సంతతి గల్గినచో నావలమరణము చెందులాగున మునియిచ్చిన శాపమున కోర్వవచ్చును. అప్పుడు ధైర్యముతో మరణము పొందవచ్చునని చింతించుచు.

"యతియెంతేన్" ఏనిలోనియిత్వమునకు, "అపిశబ్దార్థస్యైతః" ఆంధ్రశబ్ద చింతామణి.

"ధృతిమైన్" సహార్థమున మెయిమైలగు." ప్రౌఢవ్యాకరణము.

భారత. యతి, ఎంతేన్, తనయార్తిచేన్ = తనబాధచే, చేడ్పడిన వాఁడై, ఆత్మ. జాయా, సమాగతమైనప్పుడ = భార్యతోఁ గూడినప్పుడే, మేను, పాయుము, అని, అల్కన్, నన్నున్, శాపించెన్ = శపించెను,

సంతతి లేకుండెడిచోన్ = సంతానము లేనప్పుడు, తదాశన్ = ఆ సమాగమాపేక్షచే, తాన్, పోవుట = మరణించుట, మిగులన్, మదికిన్, చింతింపంగన్ = తలఁపఁగా, ఎట్లేనియున్, ధృతిమైన్, ఓర్వఁగ వచ్చునా = సంతానము లేనప్పుడు భార్యాసంగమమున మరణము గల్గునేయని యోర్వ వచ్చునా, అంచున్, ఎన్నుచున్ =తలఁచుచు.

తా. భార్యా సమాగమముగల్గఁగనే మరణించులాగున మునిశపించెను గదా ! సంతానము లేనపుడాశాపమునకు భయపడి యూరకుండ వచ్చునా యని చింతించుచు.

"జాయా" "జాయతే స్యాంపతిః పుత్రరూపేణేతి జాయా. జనీప్రాదుర్భావే." అని గురుబాల ప్రబోధిక.

క. జనపతి దాన నతివ్యథ
మనస్కుఁడై యిట్టి దయ్యె నీ మత్సుచరితవా
సన యిఁక నేమని నిజపురి
కిని జనియెఁ జనుచు నాత్మకిల్బిషశంకన్. 35

రామాయణ. జనపతి = దశరథుఁడు, తాన్ = తాను, అనతివ్యథమనస్కుఁడై = అధికముగాని దుఃఖముగల మనస్సుగలవాఁడై, [సంతతి కల్గనున్నది కదా యనుసంతసముచే మునిశాపము వలని భీతితగ్గినవాఁడై యని భావము.] మత్, సుచరితవాసన = నాయొక్క పూర్వజన్మకృత సుకృత సంస్కారము, ఇట్టిదయ్యెన్ = ఈలాగున నయ్యెను, [పూర్వజన్మ సుకృత పరిపాకమే యీలాగున శాపరూపమయ్యె నని భావము.] ఇఁక నేమి అని = ఇంక విచారింప నేలయని, నిజపురికిన్ = అయోధ్యకు, చని = వెడలి, ఎదన్ = మనసునందు, ననుచు = చిగురుచునట్టి, ఆత్మకిల్బిష శంకన్ = తనపాపభీతిచేత—లేక; ఇంకన్, నేన్, మని = ధన్యుఁడనై, నిజపురికిన్, చనియెదననుచున్ = అయోధ్యకు వెళ్లెదననుచు, అత్మకిల్బిష శంకన్, అనియు నర్థము చెప్పవచ్చును.

తా. దశరథుఁడు దనపూర్వ జన్మసుకృత పరిపాకమే యీలాగున శాప రూపముగా నయ్యెనని సంతోషించుచు నయోధ్యకువెళ్లి తానాచరించినది మునిబాలక హింసారూపమగునకార్యమగుటఁ బాపభీతిగలవాఁడై.

దశరథుఁడు మునిశాపమునకుసంతోషించెననుటకు; "శాపోప్యదృష్టతనయానన పద్మశోభే, సానుగ్రహో భగవతా మయిపాతితోయం। కృష్యాం దహన్నపికిలక్షితి మింధనేద్ధో, ర్బీజప్రరోహజననీం దహనః కరోతి." అని కువలయానందమున విషమాలంకారోదాహరణమునఁ జెప్పఁబడి యున్నది.

"అనతివ్యథ" నకారము వచ్చుటకు లక్షణము. "ప్రతిషేధాకారోత్తర, గతశబ్దాద్యచ్చులవి నకారములగునా, శ్రితులకుఁ బంకజనేత్రుఁడ, నతిదూరుండనఁగ నతఁడనాద్యంతుఁడనన్." అనంతుని ఛందము.

"మనస్కుఁడై" "ఉరః ప్రభృతిభ్యః కప్." పాణిని.

భారత. జనపతి = పాండురాజు, దానన్ = ఆయెన్నికచేత, అతివ్యథ మనస్కుఁడై = మిక్కిలి దుఃఖముగల మనస్సుగలవాఁడై, మత్సుచరిత వాసన, ఇట్టిదయ్యెన్ = నాసుకృత సంస్కారము తుదకీలాగున నయ్యెఁగా, నిజపురికిన్ = హస్తినకు, ఇంకన్, ఏమనిచనియెదన్ = ఏలాగునఁ బోవుదును, అనుచున్, ఆత్మకిల్బిష, శంకన్ = సందేహముచే.

తా. నాసుకృత పరిపాక మీలాగున నయ్యెనుగదా! ఇంక నేనేమని హస్తినకరుగుదు నని తనయకార్యాచరణము వలనిపాపభీతి గలవాఁడై.

క. గణనాతీతము లగుగో
గణములు వేదండఘోటకస్తోమములున్
మణులు ధనధాన్యములు బ్రా
హ్మణులకు దానంబు సేసె నాతఁడు మఱియున్. 36

రామాయణ భారతార్థములు సమము. గణనాతీతములగు = లెక్కకు మిక్కుటములగు, గోగణములు = పశుసమూహములు, వేదండ ఘోటక, స్తోమములున్ = ఏనుఁగులయొక్కయు, గుఱ్ఱముల యొక్కయు సమూహములు, మణులు = రత్నములు, ధనధాన్యములున్ = బ్రాహ్మణులకున్, ఆతండు = రాజు, [రా. దశరథుఁడు భా. పాండురాజు.] దానము చేసెన్, మఱియున్.

తా. ఆరాజు. [రా. దశరథుఁడు; భా. పాండురాజు.] లెక్కలేని యాలమందలు గుఱ్ఱములు నేనుఁగులు రత్నములు ధనధాన్యములును బ్రాహ్మణులకు దానము సేసెను.

"ఘోటక." "ఘోటకేపీతి తురగ తురంగాశ్వ తురంగమాః" అని యమరము.

సీ. తనకుఁ గలభూషణాదిసద్వస్తుజాల
మగ్రజాయత్తముగఁ జేసి ◌ యంచితనయ
బలలసద్వర్తనలవనీస్థలిని జూడఁ
జాల నని వారితోదయాశ్రయత మెఱయ. 37

రామాయణ. తనకున్, కల, భూషణాది సద్వస్తుజాలము = మంచి వస్తువుల సమూహము, అగ్రజాయత్తముగన్, చేసి = బ్రాహ్మణాధీనము చేసి, దానముచేసి యనుట. అంచిత = ఒప్పిదమైన, నయ = నీతిచేతను, బల = పరాక్రమముచేతను, లసత్ = ప్రకాశించుచున్న. వర్తనలు = నడవడికలు, అనివారిత = అడ్డగింపఁబడని, ఉదయ = అభ్యుదయము యొక్క, ఆశ్రయతన్ = ఆశ్రయించుటచే, చూడన్ = చూడఁగా, అవనీస్థలిన్ = భూమండలమున, చాలన్ = మిక్కిలి, మెఱయన్ = మెఱ

తా. తనకుఁగల భూషణాదులు బ్రాహ్మణులకు దానముచేసి నీతిబలము లడ్డగింపరాని యభ్యుదయముల కాశ్రయమగుటచే భూమండలమంతయుఁ బ్రకాశింపఁగా.

**భారత.** తనకుఁ, కల, భూషణాది సద్వస్తుజాలము, అగ్రజాయత్తముగఁ, చేసి=అన్నయగు ధృతరాష్ట్రు నధీనముగాచేసి, అంచి = అనిపి, లసత్ వర్తనలఁ = ప్రకాశించుచున్న నడవడికగలవారిని, తనయబలలఁ = కుంతీమాద్రులను, వనీస్థలిని = అడవియందు, చూడఁ, చాలనని = చూడనేరనని, వారితో = ఆ కుంతీమాద్రులతో, నయాశ్రయత, మెఱయఁ = ప్రకాశింపఁగా,

తా. తనకుఁగల భూషణాదులు ధృతరాష్ట్రున కర్పించి, మంచినడవడికలుగల తనభార్యల నడవిలోనునిచికొని చూడఁజాలనని దయాళువై.

గీ. మనవియుక్తి తెఱంగు మీకెనినదడవి
నవయ నేటికి? మనకరి నగరమునకు
నరుగుఁడని పెదముసళ్లు ననుఁగులాడ
వెరవరుల్ గనికరములోఁ బెరసి కొలువ. 38

**రామాయణ.** మనవి = విజ్ఞాపనము, ఉక్తి తెఱంగు = మాటలాడు విధము, యుక్తితెఱంగు = ఉపాయముయొక్క విధము అనియు నర్థము చెప్పవచ్చును. మీకెనినద = మీకుఁ దెలిసినదియే, మనకుఁ, అడవిఁ, నవయ నేటికి=మనమడవిలో నేలకష్టపడవలయును, అరినగరమునకుఁ=శత్రువైన దశరథునిపట్టణమునకు, అరుగుఁడని = వెళ్లుఁడని, పెదముసళ్లు = అనుఁగులుఁ, ఆడఁ = పెద్దలగు వృద్ధులు మిత్రులును జెప్పఁగా, అరులు = శత్రురాజులు, వెరవు, కని = ఆయుపాయమును దెలిసికొని, కరములోఁ = కానుకలతో, పెరసి = వ్యాపించి, కొలువఁ = సేవింపఁగా,

తా. వృద్ధులు మిత్రులు శత్రురాజులంగాంచి "మీరేలయడవినిఁగష్టపడవలయును? శత్రువగు దశరథుని పట్టణమున కరుగుఁడని" యాడ శత్రురాజులు కాన్కలతోఁడవచ్చి దశరథునిం గొలుచుచుండఁగా.

ఈ యర్థము కేవలము శ్లేషార్థసంఘటనమునకై తెచ్చికొని నదియే కాని యిందుఁ గథాంశమున కించుకయు సంబంధము లేదు.

"కరము." "భాగధేయః కరో బలిః" అని యమరము.

భారత. మన, వియుక్తి, తెలుంగు = మనయెడబాటువిధము, శాపక్రమమనుట. మీకనిఁదియు, అడవిన్, నవయనేటికి = మీరేల యడవిని గష్టపడవలయును, మనకరినగరమునకున్ = హస్తినాపట్టణమునకు, అరుగుఁడు, ఆడన్ = అచ్చట, పెరసరులు=సమర్థులు, ముదుసళ్లు, అనుఁగులు= చెలులు, కనికరముతోన్ = దయతో, పెరసి, కొలువన్, అనిపెదన్ = పంపెదను.

తా. మనకుఁగల్గిన శాపకారణము మీరెఱిఁగినదియే కదా! వృథగా నాతో మీరడవినేల కష్టపడవలయును. కరినగరమునకు బొండు. అటసమర్థులగు వృద్ధులు చెలులు మిమ్ముంగొలుచును మీవ్యసనమును బోఁగొట్టులాగున మిమ్ముఁబంపెదను.

"ఆడన్." "ఆడనాడ నేడ నచ్చోనిచ్చోన్." అని యాంధ్రభాషాభూషణమునందిది గ్రామ్యమని చెప్పఁబడినను, "గన్యనివేడ రణరంగ గమనమేడ" యన్నగు ప్రయోగము లుండుటచేత నిది సాధువే యగును.

క. మానవతులారహితస
త్త్వానుగతిన్ శాంతిఁ దనరి రయతినై ఘన్యా
త్రనెరయ నాత్మనామా
జ్ఞానుభవము పూనెనియజనావళి మెచ్చన్. 39

రామాయణ. మానవ, తులా రహిత = మనుష్యులలో పోటిలేని, సత్వ = బలముయొక్క, అనుగతిన్ = చేరికతో, శాంతిన్, తనరి =

శాంతతతో నొప్పి, అతినైపుణ్యశ్రీ = మిక్కిలి సామర్థ్యమనెడి సంపద, నెరయన్ = ప్రకాశింపఁగా, ఘనున్, కృపచే, జనావళి, మెచ్చన్ = జనుల సమూహము మెచ్చులాగున, ఆత్మ = తనయొక్క, సామ్రాజ్యము, పూనెన్ = రాజ్యపాలనము చేసెను.

తా. సాటిలేని బలముతోఁగూడినవాఁడై, శాంతితోడను, మిక్కిలి సామర్థ్యముతోడను, జనులుమెచ్చులాగున రాజ్యమేలెను.

"సత్త్వ" "సత్త్వంద్రవ్యే ఽశాచాపే. వ్యవసాయ స్వభావయోః। గుణప్రాణబలస్వాంత, సత్త్వాస్వస్త్రీనపుంసకం." అని నానార్థరత్నమాల.

భారత. మానవతులార=కుంతీమాత్రులార, హితా, సత్త్వ=సత్త్వగుణము యొక్క, అనుగతిన్ = పొందికచే, శాంతిన్ = శాంతిగుణముచే, తనరి = ఒప్పి, యతినైపుణ్యశ్రీ, నెరయన్ = సన్న్యాసి యొక్క సామర్థ్యము నిండఁగా, ఇది సన్న్యాసాశ్రమమున కుపలక్షణము. ఆత్మసామ్రాజ్యానుభవము, పూనెదన్ = బ్రహ్మానుభవమనెడి సామ్రాజ్యమును పూనెదను, యజనావళిన్, మెచ్చన్ = యజ్ఞముల సమూహములను మెచ్చను.

తా. కుంతీమాత్రులారా, సత్త్వగుణముతో నొప్పి శాంతిగుణము గలవాఁడనై సన్న్యాసాశ్రమమునుండి నివృత్తి రూపమగు పరబ్రహ్మానుభవము చేసెదను. ప్రవృత్తిరూపమగు యజ్ఞాది కర్మల నేనొల్లను.

"నెరయన్." దీనికి లఘురేఫ రూపమును గలదు.

"శ్రీ." దీనికి దీర్ఘమే యగును. "సదైకవర్ణే." ఆంధ్రశబ్ద చింతామణి.

క. అనిభృతదాక్షిణ్యుండై
తనయాలోకనవిదూర తకుఁగుందునిజాం
గనలంగూడియు వని నా
ఘనుఁడునడచెఁ బెంపుమీఱఁ గానునిచర్యల్. 40

రామాయణ. అనిభృత = గూఢము కాని, దాక్షిణ్యాఢ్యుఁడై = దక్షిణ నాయకత్వము గలవాఁడై, తనయ = కుమారునియొక్క, ఆలోకన = చూచుటయొక్క, విదూరతకున్ = దూరమగుటకు, ఇంకను గుమారుఁడు గల్గకుండుటకనుట. కుందు = దుఃఖించు, నిజాంగనలన్ = తనభార్యలతోఁ, గూడి = చేరి, అవనిన్ = భూమిమీఁద, పెంపుమీఱన్ = వృద్ధియతిశయించులాగున, కామునిచర్యల్ = మన్మథక్రీడలు, నడపెన్.

తా. దక్షిణ నాయకుఁడగు దశరథుఁడు దమకింకను గుమారుఁడు జనింపలేదని దుఃఖించు నిజభార్యలతోఁగూడి మన్మథక్రీడ లాచరించుచుండెను.

“దాక్షిణ్యాఢ్యుఁడై.” “తుల్యోనేకత్ర దక్షిణః,” ప్రతాపరుద్రీయము.

“కుందు” అలజడి నెంజాలి పిమ్మట, నలుగు తలపాటు నంత నేగి సెగల్ గొం, దలమలమట డరుగోడు, మ్మాలిక నవట గుందు నా నమరు దుశ్ఖాఖ్యల్.” ఆంధ్రనామశేషము.

భారత. అని, ఇట్లు, భృత = దాఁగిన, దాక్షిణ్యాఢ్యుఁడై = మొగమోటమి గలవాఁడై, తన, ఆలోకనవిదూరతకున్ = తన్నుఁ జూచుట దూరమగుటకు, కుందు, నిజాంగనలన్, కూడియ = చేరియే, వనిన్ = అడవియందు, అఘనుఁడు = గొప్పవాఁడు, పాండురాజనుట. పెంపు మీఱఁగాన్, మునిచర్యల్, నడపెన్.

తా. తనభార్యలు దన్ను విడువలేక దుఃఖించుచుండ వారితోఁగూడియే తపస్సు నడపెను.

చ. అకలుషయౌవనస్థదశ యంతయుఁ దానడపెన్ బ్రలోకపా
లకుఁడు శతాంతరంగరిపుశీలన్ నెఱయం బొలియింపుచున్ సమా
ధికరహితాత్మవర్తనశతిస్థితుఁడై ప్రణిధిప్రయుక్తిఁ భా
యక యెపుడుం బ్రధానపురుషాంతరవర్తన నాకలింపుచున్.

**రామాయణ.** నృలోకపాలకుఁడు = దశరథుఁడు, శర...... రిపుల౯ - శర = నిగ్రహమునకురానట్టి, అంతరంగరిపుల౯ = హృదయము వలననైన శత్రువులను, సప్తవ్యసనరూపములగు వానిననుట. నెఱయ౯, పాలించుచు౯ = పెరుఁగకుండఁ జేయుచు, సమ.....వర్తన౯ - సమ, అధిక, రహిత = సములతోఁగాని, యధికులతోఁగాని రహితములగు, [శక్తిత్రయములచే నందఱను లోఁబఱచికొని సర్వాతిశాయియై యని భావము.] ఆత్మ = తనయొక్క, వర్తనల౯ = నడవడికలయందు, అతి స్థిరుఁడై, ప్రణిధిప్రయుక్తి౯ = గూఢచారులనంపుటను, పాయక = విడువక, ఎప్పుడు౯ = ఎల్లప్పుడు, ప్రధానపురుషాంతరవర్తన౯ = పురోహితామాత్యులయొక్క యంతరంగవృత్తులను, ఆకలింపుచు౯ = తెలిసికొనుచు, అకలుష...... దశ- అకలుష = దోషరహితమగు, యౌవనస్థదశ, అంతియు౯, కాక౯, నడపె౯ = యౌవనదశయందుఁ జేయఁదగిన ధర్మార్థకామాదులఁ జేయుచుండెను.

తా. దశరథుఁడు సప్తవ్యసనములకు లోఁబడక సమాధిక రహితములగు నడవడికలయందు స్థిరుఁడై, గూఢచారుల నుపయోగించుకొనుచు, పురోహితామాత్యుల మాటలవినుచు యౌవనమునందుఁ జేయఁదగిన ధర్మార్థకామమోక్షములను గుఱించిన కార్యములనెల్ల నడపుచుండెను. సప్తవ్యసనములు, “ వెలఁది జూదంబు పానంబు వేఁట పలుకు, ప్రల్లదంబును దండంబు పరుసఁదనము, సొమ్మునిష్ప్రయోజనముగ వమ్ము సేఁత, యనెడు సప్తవ్యసనములఁ జనదుతగుల.” అని సోమయాజి తెల్పెను.

“ప్రణిధిప్రయుక్తి” గూఢచారుల నుపయోగించుటకు; “విచారదృక్చారదృగప్యవర్తత.” అని నైషధమునఁ జెప్పఁబడెను.

**భారత.** నృలోకపాలుఁడు = పాండురాజు, శర = కంటకములగు అంతరంగరిపుల౯ = కామక్రోధలోభమోహమదమాత్సర్యములనెడి యరిషడ్వర్గముల, నెఱయ౯, పాలింపుచు౯, సమాధికర = ఏకాగ్రచిత్త

తత్తోధ్యానము చేయుచున్నదైన, హిత, ఆత్మ, వర్తనలన్ = ఇంపైన మనో వ్యాపారములయందు, అతిస్థిరుండై, ప్రణిధి = ప్రార్థనారూపములగు దేవతాస్తోత్రములయొక్క, ప్రయుక్తిన్ = ఉపయోగించుటను, పాయక, ఎపుడున్, ప్రధాన = ప్రకృతియొక్క, పురుష = పరమాత్మయొక్క, అంతరవర్తనన్ = భిన్నమైనయునికిని, ఆకలింపుచున్ = గ్రహించుచు, అకలుషయా = పరిశుద్ధమయిన, సమస్థ సశయుంతయున్ = వానప్రస్థాశ్రమ మంతయు, కాన్, నడపెన్.

తా. పాండురాజరిషడ్వర్గములకు లోఁబడక సమాధినిష్ఠుఁడై, దేవతాస్తుతులాచరింపుచుఁ, బ్రకృతిపురుషభేదము దెలిసికొనినవాఁడై పరిశుద్ధమగు వానప్రస్థాశ్రమమునడపెను.

"శఠ." "శఠతీతి శఠః కైతవే." గురుబాలప్రబోధిక.

"సమాధి." "సమాధి ర్నియమే ధ్యానే, విపాకేచసమర్థనే" అని విశ్వము.

"ప్రణిధి." "ప్రణిధిఃప్రార్థనేచరే." అని యమరము.

"ప్రధాన." "ప్రధానంప్రకృతిస్త్రియాం." అని యమరము.

వ. ప్రవర్తిల్లువాఁడెందునపత్యులకు గతి లేదని మహామునుల వలనవినుచుండుంగావున, నక్కొఱంతఁ దీర్చికొనలేమికిం జింతాక్రాంతుండై యొక్కనాఁ డమ్మహీకాంతుండు దన యగ్రభాగంబున. 42

రామాయణ భారతార్థములు సమము. ప్రవర్తిల్లువాఁడు = ఇట్లు నడపుచుండువాఁడు, ఎందున్, అనపత్యులకున్, గతిలేదని = ఎచ్చటను నపత్యరహితులకు గతిలేదని, మహామునులవలనన్, వినుచుండున్, కావునన్ = మహర్షులవలన వినుచుండునుగాఁబట్టి, అక్కొఱంతన్ తీర్చుకొనలేమికిన్ = ఆకొఱఁత దీర్చుకొనలేనందులకు, చింతాక్రాంతుండై

ఒక్కనాఁడు, అమ్మహీకాంతుఁడు = రాజు, [రా. దశరథుఁడు. భా. పాండురాజు,] తనయగ్రభాగంబునన్ = తనముందఱ. పై పద్యములతో నన్వయము.

తా. అనపత్యులకు గతులులేవని మహామునులవలన నాలకించిన రాజు చింతాక్రాంతుఁడై, తనముందఱ.

"అనపత్యులకుగతిలేదని." యనుటకు, "అపుత్రస్య గతిర్నాస్తి." యనియు, "ప్రజయాహిమనుష్యాః పూర్ణాః" అనియు, "జాతఃపుత్రః కృష్ణకేశోఽగ్నీనాదధీత." యనియు, పెక్కుశ్రుతిస్మృతి ప్రమాణములు గలవు. భారత చంపువునందు ననంతభట్టు "ప్రజయాహి మనుష్య యిత్యసౌప్రథతేహి శ్రుతిపర్ణపద్ధతిః" అని నుడివెను.

చ. తనరునిజామ్నాయగురుఁధర్మపవృత్తి నరుంధతీసువా
సినివరుసన్నుతుల్బుధవిశిష్టసభంగనునట్టిసద్గుణై
కనిధినిజాగ్రదారహితుఁ గార్యభరాత్మత నుండఁ జూచి, యి
ట్లనియెదనూడహీనతకునాత్మఁగరంబుభరంబునొందఁగన్.

రామాయణ తనరు......గురున్ — తనరు = ఒప్పెడి, నిజ = తనయొక్క, ఆమ్నాయ = వంశమునకు, గురున్ = ఆచార్యుని, ధర్మప్రవృత్తిన్ = ధర్మోపదేశము సేయుటయందుగలవానిని, అరుంధతీసువాసినివరున్ = అరుంధతియను పతివ్రతాభర్తయగు వానిని, బుధవిశిష్టసభన్ = దేవతలుండియుండుసభను, సన్నుతుల్, కనునట్టి = స్తోత్రము లందునట్టి, సద్గుణైకనిధిన్ = సుగుణములకు ముఖ్యమగునిధియగువానిని, వసిష్ఠునను. జాగ్రత్......ఆత్మున్ .. జాగ్రత్ = ప్రకాశించుచున్న, ఆరహిత = ఎక్కుడుగానిడుముఁబడిన, కార్యభర = ఇతరకార్యభారములు గల, ఆత్మున్ = బుద్ధిగలవాఁడగుటచే, ఉండన్, చూచి, తనూజహీనతకున్ = కుమారులు లేనందులకు, ఆత్మ = తాను, కరంబు = మిక్కిలి

భరంబుఁ, బొందఁగఁ = భారమునందఁగా, ఇట్లనెఁ = ఈలాగునఁ జెప్పెను.

తా. తనకులగురువు నరుంధతీపతియు, దేవసభం బ్రసిద్ధుఁడునగు వసిష్ఠుఁడు అన్యకార్యవ్యగ్రుఁడు గాకుండుట చూచి, పుత్రహీనతకుఁ గుందుచు దశరథుఁ డి ట్లనియెను.

"అన్వవాయ" వంశోన్వవాయ స్సంతానః". అని యమరము.

"సువాసిని." "స్వస్థవసతీతి సువాసినీ, వసనివాసే." అని గురుబాల ప్రబోధిక.

"సువాసినిపతిఁ" ఇది లక్ష్మీవల్లభుఁడు మున్నగువానివలె సాధ్య సమాసము.

"సద్గుణైకనిధి." ఇచ్చటి వృద్ధిసంధికి. "ఐలగునే యైలో ఔ, ఔలగునాద్యంతమునకు నఖిలైకవిభుం, డాలలితైశ్వర్యుఁడున, త్యాలాపాదనుఁడు భవమహౌషధమనఁగ." ఛందోదర్పణము.

భారత. తనరు, నిజాన్వవాయ, గురు = అధికమగు, ధర్మద = ధర్మమునిచ్చునట్టి, వృత్తిఁ = వర్తనముగలదానిని, అరుంధతీ, సువాసిని, వరుసఁ = సామ్యమున, బుధవిశిష్టసభఁ = గొప్పవారిసభలో, నన్నుతుల్, = పొగడ్తలు, కనునట్టి, సద్గుణైకనిధిఁ, నిజ, అగ్రదారఁ = తనప్రథమభార్యను, కుంతిననుట. హితకార్య, భర, ఆప్తతఁ, ఉండఁ = హితకరములగు వ్రతాదికార్యములయందు బుద్ధిని బ్రవేశింపఁజేసి యుండఁగా, చూచి, తనూజహీనతకుఁ, ఆత్మ, కరంబు, భరంబుఁ, అందఁగఁ., ఇట్లనియెఁ = ఈలాగునఁ జెప్పెను.

తా. తనవంశమునకు ధర్మాపాదనియై, యరుంధతితో సాటియగున దైన; కుంతి తనకుహితకరములగు వ్రతములాచరించుచుండఁజూచి పాండురాజు పుత్రులులేమికిఁ జింతించి యిట్లనియెను.

చ. పొదలితి రాజ్యభోగములఁ బూనితి దిగ్విజయోన్నతిం గడున్
వదలక దానధర్మముఖవర్తనలుం దగునట్లు సల్పితిం
దుదినవి యేమి సెప్పఁ? నతిదుఃఖకరంబుగ నిట్లుపుత్రసం
పద కెడనైతి, నీదయసమగ్రతయాపరిపాటి నేమనన్.

రామాయణ. నీదయసమగ్రతన్ = నీదయయొక్క పూర్ణత్వముచే, ఆపరిపాటిన్ = అవరుసచే, ఏన్, మనన్ = నేను జీవించియుండఁగా, రాజ్యభోగములన్ = రాజ్య సౌఖ్యానుభవములచే, పొదలితిన్ = వృద్ధి పొందితిని, దిగ్విజయోన్నతిన్ = దిగ్విజయములవలనఁ గలిగిన గొప్పతనమును, కడున్, పూనితిన్ = మిక్కిలివహించితిని, వదలక = విడువక, దానధర్మముల వర్తనలున్ = దానముయొక్కయు, ధర్మముయొక్కయు ననుకులను, తగునట్లు = తగులాగున, సల్పితిన్ = చేసితిని, తుదిన్ = కడపట, అవి, ఏమిసెప్పన్ = వానినిగుఱించి యేమనిచెప్పుదును, అతిదుఃఖకరంబుగన్ = మిక్కిలి దుఃఖకరముగా, ఇట్లు పుత్రసంపదకున్, ఎడయైతిన్ = పుత్రభాగ్యమునకు దూరుఁడనైతిని.

తా. నీదయాపరిపూర్ణతచే రాజ్యసౌఖ్యము లనుభవించితిని, దిగ్విజయములఁగాంచితిని, దానధర్మాదులఁ జేసితిని, కడకేమిచెప్పను, అతిదుఃఖకరమగు పుత్రసంపదకు దూరమైతిని గదా.

ఇట ముద్దరాజు రామన్న "పుత్రసంపద" యని తకార ద్విత్వరూప మంగీకరించెను గాని "వాహతజగ్ధయోః" అను సూత్రముచొప్పునఁ, 'బుత్త్రిహతీ, పుత్త్రిజగ్ధీ' యని యటమాత్రము వైకల్పికముగా నగును. "నాదిన్యాక్రోశేపుత్రస్య" యను సూత్రముచొప్పున నాదిని రాకున్నను "బుత్ర పుత్త్రాది నీత్వమసి పాపే" యను స్థలమున రావచ్చును. తక్కిన యెడఁ బుత్రశబ్దమునకు ద్విత్వము రాదనుట నిర్ధారితము కాఁబట్టి పుత్రశబ్దము ద్విత్వరహితమయగు.

భారత. నీదు=నీయొక్క, అయసమగ్రతక్ = భాగ్యముయొక్క పూర్ణతచే, కడమయే కార్థము.

నీదు+అయసమగ్రత. "తన నానీయను పలుకుల కెనయం గహాలాదు లదుకు నెడదుణ్ణునగుక్, తనదుధనము నాదుగుణం, బననీదుయశంబు నాఁగ నమ్మె యునికిఁ. ఆంధ్రభాషాభూషణము.

క. చెలువమరుధర్మమునఁబు
పుత్రలలామముఁబడయు లేమిఁ, దాపసనాథా
కులహృద్వర్తన మగునా
కలుషపుజీవనముకంటెఁ గష్టముగలదే ? 45

రామాయణ. తాపసనాథా = వసిష్ఠుఁడా, చెలువు, అమరు = ఒప్పిదమగు, ధర్మమునక్ = ధర్మకార్యముచే, పుత్రలలామునుక్, పడయలేమిక్ = కుమారుఁబొందలేమిని, కులహృత్ = వంశమునునాశము చేయఁజాలు, వర్తనమగు = ఉనికినిగల, నా = నాయొక్క, కలుషపు జీవనముకంటెక్ = పాపపుబ్రదుకునకంటె, కష్టము, కలదే = వేఱుకష్టము కలదా.

తా. ఎన్నధర్మకార్యము లాచరించియుఁ బుత్రసంతానము పొందలేమిని కులనాశకమగు నునికిని గల నాబ్రదుకునకంటె వేఱొక కష్టము కలదా ?

"పుత్రలలామ." ఇటనపుంసకలింగముపచ్చుటకు లక్షణము. "త్రిషు లింగేషు రమ్యస్సాస్యమ్నభ్య సామర్థ్యలక్ష్మను." అధర్మణకారి కాపలి.

"కలుషపుజీవనము." ధీనిధిగుణపదములపై, మానుగ పొల్లున్నసంధిమములగు నులకుక్, బూనిపునాదేశంబగు," ఆంధ్రభాషాభూషణము.

భారతము. చెలువ. సంబుద్ధి. మరుధర్మమునన్ = మన్మథవ్యాపారముచే, పుత్రలలామంబున్, పడయలేమిన్, తాప, సనాథ = తాపముతోఁగూడిన, ఆకుల, హృద్వృత్తమగు=వ్యాకులమగు మానసవృత్తిగల, నా, కలుషపుజీవనమునకంటెన్, కష్టము, కలదే = ఉన్నదా.

తా. రతిచేఁ బుత్రులఁబడయలేకుండుటచేఁ, దాపమునొంది, తన్మూలమున వ్యాకులమగు హృదయముగల నాబ్రదుకునకంటె వేఱుకష్టము గలదా?

సీ. కులవర్ధనుండగుకొడుకుఁ గాననియట్టి
లాఘవాస్పదునిదౌకాలయము లయము,
సిరులకుఁదోడవై సకలసుతుఁ బడయని
ఘనకలుషాత్మజీవనము వనము,
పితరులఋణముఁ దీర్పఁ పుత్రునఁ జెందని
దౌర్భాగ్యశీలుగోత్రమ్ము త్రమ్ము,
రహి నిహపరసుఖప్రదుఁ బుత్రునెత్తని
వరపుణ్యహీనుభవమ్ము వమ్ము,
గీ. పలుపలుకు లేల? నిఖిలమ్ము ఖిలము సూవె;
యాత్మజులు లేనివారి కో యతివరమణి!
తరమె! యనపత్యునై వర్ణ్యధనుఁడయ్యు సతిని
యఖిలమును నిర్మలసుఖవర్గహానిఁ జెంద, 46

రామాయణ భారతార్థములు సమము. [రా. ఓయతివరమణి = మునిశ్రేష్ఠుఁడా, భా. ఓయతివ, రమణీ = కుంతీ.] కులవర్ధనుండగు = కులమును వృద్ధిసేయు నట్టివాఁడగు, కొడుకున్, కానని యట్టి = బిడ్డను గనినట్టి, లాఘవాస్పదుని = చులుకదనము గలవాని, ఆలయము, లయము = ఇల్లు ప్రళయమగును. [ప్రళయ తుల్యమగునని భావము.] సిరు

లకుఁ, తోడనైన = కలుములకు భూషణమైన, పరసుతుఁ, పడయని = శ్రేష్ఠుఁడైన కుమారునిఁబొందని, ఘనకలుషాత్ముఁ = మహాపాపాత్ముఁడగు వాని, జీవనము, వనము = బ్రదుకడవి యగును, అడవితో సమానమనుట. పితరుల ఋణముతీర్చెడు = పితౄణము దీర్చునట్టి, సూనుఁ, చెందని = కుమారునిఁ బొందనట్టి, దౌర్భాగ్యశీలు = అదృష్టహీనుని, గోత్రమున్, త్రమున్ = దుమ్మగును, రహిఁ = ప్రీతితో, ఇహపరసుఖప్రదుఁ = ఉభయ లోకములందును సుఖము నిచ్చునట్టి, పుత్రుఁ, ఎత్తని = కుమారు నెత్తుకొనని, వరపుణ్యహీను=గొప్పపుణ్య హీనుని యొక్క, భవమున్, వమున్ = పుట్టుకవ్యర్థము, పలువలుకులేల = అనేకవచనములేల, ఆత్మజులు లేనివారికిఁ = కుమారులు లేనివారికి, నిఖిలము, ఖిలము, చూవె = సర్వము క్షీణమైనదే సుమా, అతని = అపుత్రహీనుని, అఖిలమును = అన్నియును, ఇట్లు = ఈలాగున, ముఖవర్ణహానిఁ, చెందఁ = మోమునందలి కాంతి తగ్గఁగా, లేకముంగలి యక్షరము తగ్గఁగా, అనపత్య, వైవర్ణ్యము = అపత్యహీనుని వివర్ణత, అరయఁ, తరమే = విచారింపఁ దరమగునా.

తా. సంతానహీనుని యిల్లు ప్రళయముతో సమానము. వాని బ్రదుకడవితో సాటిదగును. వానిగోత్రము దుమ్ముతో సరియగును. వాని పుట్టుక వ్యర్థమగునది. పలుమాటలేల ? వానికిఁ గలవన్నియును నశించినవియే యగును. ఇట్లుముఖము వర్ణహానిం జెందఁగా, విచారింపఁదరమే? ఆలయము, జీవనము, గోత్రమున్, భవమున్, నిఖిలము అనుపదములలోని ముంగలియక్షరములు లోపింపఁగా, లయము, వనము, త్రమున్, వమున్, ఖిలము అని యగునని భావము.

"త్రమున్ త్రమున్." అనుటచే నితనికి గసడదవాదేశవిధి నిత్యము గాదనియే యభిప్రాయమనుట విస్పష్టము.

"ముఖవర్ణహానిఁజెంద." అనుస్థలమున నలంకారము. శ్లేష.

ఇటఁ బాదాంతములందు ఛేకానుప్రాసము. లక్షణము. "ఛేకానుప్రాసంబన, నాకర్ణితమగుచు నొప్పువర్ణము వేఱై, చేకొన్నవ్రాల యెప్పటి చేకొనఁ బడునేనిఁ గృతుల సిరులకు నెలవై" కావ్యాలంకార చూడామణి.

"సిరులకుఁ దొడవైన, వరసుతు."—ఇటవర శబ్దము ప్రాసయతి కొఱకుఁ దెచ్చికొనిన దగును.

శా. వేయుంజెప్పెడిదేమి? మౌనివర సద్వృత్తంబుచే నేమిటం
జేయన్ రాదు; పితౄణమోక్షము సుతశ్రీదక్కఁ దత్ప్రాప్తికి
న్ధీయుక్తింగననొండుత్రోవగలదేని న్వేఁడెదన్ దేవర
న్యాయంబొప్పఘటింపునాకురుకులంబవ్యాహతిన్వర్తిలన్.

రామాయణ. వేయుం జెప్పెడిదేమి = వేయిచెప్పవలయునా, మౌని వర = మునిశ్రేష్ఠా, సంబుద్ధి. సద్వృత్తంబుచేన్, ఏమిటన్ = ఏమంచి కార్యములచేతను, పితౄణ మోక్షము = పితరుల ఋణమువలని విముక్తి, సుతశ్రీదక్కన్ = పుత్ర లాభముదక్క, చేయన్, రాదు = చేయవీలు గాదు, తత్ప్రాప్తికిన్ = ఆసంతానము పొందుటకు, ధీయుక్తిన్, కనన్, ఒండుత్రోవ, కలదేనిన్ = ఒకమార్గముండిన యెడల, దేవరన్ = మిమ్ము, వేఁడెదన్ = ప్రార్థించెదను, న్యాయంబు, ఒప్పన్, ఉరు కులంబు = గొప్పకులము, అవ్యాహతిన్ = భంగములేకుండుటచే, వర్తిలన్, ఘటింపుము = కూడునట్లు చేయుము.

తా. వేయిమాటలేల? పుత్రలాభమునఁగాని వేఱొక్క గొప్పసత్కార్యముల చేతను బితరుల ఋణవిముక్తి గల్గనేరదు. అందులకుందగు మార్గముండిన నాలోచించి చెప్పుము. నావంశము హాని సెందకుండు లాగొనర్పుము.

"పితౄణము." సవర్ణ దీర్ఘ సంధి. "ధర అ ఇ ఉ ఋ లు సవర్ణము, పరమగు చో దీర్ఘమగు సువర్ణాద్రియనన్, శరధీంద్రుఁడన బహూదక, సరసియనఁ బితౄణములు వెసం దీర్ఘమనన్." అనంతుని ఛందము.

భారత. వేయుఁ, చెప్పెడిదేమి, మానివరసద్వృత్తంబుచేఁ, ఏమిటఁ = ఏలాటియునివృత్తిచేనైనను, పిత్రృణమోక్షము, సుతశ్రీదకృఁ, చేయుఁ, రాదు = చేయవీలుగాదు, తత్ప్రాప్తికిఁ, ధీయుక్తిఁ, కనఁ, ఒండు, శ్రోవ, కలదు = ఉన్నది, ఏఁ, నిఁ, వేఁడెదఁ = నేనునిన్ను వేఁడుకొనియెదను, దేవరన్యాయంబు, ఒప్పఁ= దేవరన్యాయమువంటి న్యాయము, ఒప్పునట్లుగా, [పుత్రార్థము భర్తతోడఁ బుట్టినవారిని సేవించి వారివలనఁ బుత్రులఁబడయుట, దేవరన్యాయము.] నాకురుకులంబు = నాయొక్క కురుకులము, అవ్యాహతిఁ, ఘటింపుము = ఘటింపఁజేయుము.

తా. పలుపలుకులేల ? పుత్రలాభమునఁ గాని పితరుల ఋణము దీర్పలేను. కాఁబట్టి దేవరన్యాయమునఁగాని దానివంటి దేదేనిమఱి యొక న్యాయముచేతనైనను బుత్రులఁగని నాకురుకులము నాశముగాకుండఁ జేయుము.

"దేవరన్యాయము." రామాయణార్థమున ద్విత్వయుతముగాను భారతపర్యాయమున ద్విత్వరహితముగాను నుండినను, శ్లేషార్థసంఘటనము నకై కవియిట్లు ద్విత్వరహిత రూపమును గ్రహించెను.

క. అనవగతోనతయై పెం
పునఁదనరు భవత్కృపావిభూతిఁగనిన యేఁ
దనయాపేక్షాదీనత
ననఘ యితరునట్లు పొందు టర్హమె యకటా ? 48

రామాయణ. అనఘా = పాపరహితుఁడా, అనవగత = తెలి, యని, ఊనతియై = తక్కువపాటుకలదై, పెంపునఁ, గొప్పతనముచేత తనరు = ఒప్పునట్టి, భవత్ = నీయొక్క, కృపావిభూతిఁ = దయ యనునట్టి యైశ్వర్యమును, కనిన = పొందిన, ఏఁ = నేను, ఇతరునట్లు = అన్యునివలె, తనయాపేక్షా = కుమారునియందలి యపేక్షచే, దీనతఁ =

దైన్యమును, పొందన్, అర్హమె = పొందుటకగునా? కటా = అయ్యో,

తా. ఇంతకయు లోటులేక, మీదయకుఁ బాత్రుఁడనగు నేను సుతులు లేదని పరితపించుటకగునా?

"అనవగతో నతన్గా." గుణసంధి.

"పొందుటర్హమే." ఇటసంధిగల్గుటకు; "అత్తునకు సంధిబహుళంబుగానగు." బాలవ్యాకరణము.

భారత. అనన్ = అనిచెప్పఁగా, వగన్ = దుఃఖముతో, నతనై = వంగినదై, కుంతియనుట. అనఘా, పెంపునన్, తనరు, భవత్కృపా విభూతిన్, కనిన, ఏన్ = నేను, తనయాపేక్షాదీనతన్, ఇతరుల్ = మఱియొకనిని, అట్లు, పొందన్, అర్హమె = చెందఁదగునా, అకటా.

తా. పాండురాజిట్లనఁగాఁ గుంతిదుఃఖముచేవంగినదై మీదయకుఁబాత్రురాలనగు నేను గుమారులకొఱకన్యుని జెందవచ్చునే. ఇది తగునేయనెను.

మ. ఎనయన్ లోకగురుప్రశస్తిగలనీ యిల్లాలనై కాంతవ
ర్తనలంబర్వుచు నుర్విమానవతులన్ ధన్యస్థితిన్మించి యొ
ప్పిననన్నర్హమెయిట్లనందనుల యాభీలార్తిపాల్సేఁత, పా
వనమౌనీశ్వర యింతకంటెనయశోకవాదంబు లేదెన్నఁగన్.

రామాయణ. పావన, మౌనీశ్వర = పవిత్రుఁడవగు ఋషిశ్రేష్ఠుఁడా, ఎనయన్ = వ్యాపించులాగున, లోకగురు ప్రశస్తిగల = లోకాచార్యుఁడను ప్రసిద్ధిగల, నీ, ఇల్లాలనై, కాంతవర్తనలన్ = నీయొక్క యిల్లాలనునే ముఖ్యముగాఁగలయునికిచేత, పర్వుచున్ = గౌరవమందుచున్, ఉర్విన్ = భూమియందు, మానవతులన్ = మనుష్యులసామ్యమును, ధన్యస్థితిన్ = కృతార్థమానునికిచే, మించి = అతిశయించి, ఒప్పిన, నన్ను, ఇట్లు = ఈలాగున, అనందనుల = కుమారులులేనివారియొక్క, ఆభీల = భయంకరమైన, ఆర్తి = దుఃఖమునకు, పాల్సేఁత = పాలు

గావించుట, అర్హమె = తగునా, ఎన్నఁగన్ = తలఁపఁగా, ఇంత కంటెన్, అయశోవాదంబు = అపకీర్తి, లేదు.

తా. ఓమునీంద్రా! లోకాచార్యుఁడవగు నీలాలనచే, మనుష్య సామ్యమునతిశయించుచున్న నన్నీలాగునఁ బుత్రశోకమునఁ బడవేయుట దగునా? ఇంతకంటె వేఱపకీర్తి గలదా?

"లాలనై కాంత" "తీవ్రై కాంత నితాంతాని" అని యమరము.

"లాలనై కాంత". వృద్ధిసంధి.

భారత. ఎనయన్, లోక = జగత్తునందు గురు = గొప్పదగు, ప్రశస్తిగల = ప్రసిద్ధిగల, నీ=నీయొక్క, ఇల్లాలనై = భార్యనై, కాంత= మనోజ్ఞమగు, వర్తనలన్ = నడవడికలచే, పర్వుచున్, ఉర్విన్, మాన వతులన్ = స్త్రీలను, ధన్యస్థితిన్, మించి, ఒప్పిన, నన్ను, ఇట్లు = ఈలా గున [అన్యుని మూలమునఁ బుత్రుంబడయుమని.] అనన్, అర్హమె = అనఁదగునా, తను = శరీరముయొక్క, లయ = నాశమువలని, ఆఖిల, ఆర్తిపాల్సేఁత, అర్హమె, = తగునా, పావనమా, ఈశ్వర = పవిత్రమగు నాథా, ఇది పాండురాజును సంబోధించుట. ఇంతకంటెన్, అయశోవా దంబు, లేదు.

తా. గౌరవవతినై, నీభార్యనై, స్త్రీలలో ధన్యురాలనగు నన్నన్యుని వలన సంతానముగనుమనుట తగునా? ఇంతకంటెఁ బ్రాణములు దీయుట మేలు. ఇట్లాడుటకంటె నపకీర్తి వేఱుగలదా?

చ. అననతఁడిట్లనుంగలఁకనొందఁగ నేటికిఁ దొల్లి యాక్రమం
బుననపత్యులౌన్నృపులు పుత్రులఁగానరె? యెందఱేనిబెం
పెనయ సుతేష్టిఁజేసి, నినునే నియమించుచునున్నవాఁడ నె
మ్మనమునజింతదక్కి-సునమాహితవృత్తి నొనర్పు మవ్విధిన్

**రామాయణ.** అనన్ = దశరథుఁడిట్లని చెప్పఁగా, అతఁడు, ఇట్లు అనున్ = వసిష్ఠుఁడు ఇట్లుబదులుచెప్పును, కలఁకనందఁగనేటికి = ఏల కలఁత నెందవలయును, తొల్లి = పూర్వము, అనపత్యులౌ నృపులు = పుత్రులు లేనట్టిరాజులు, ఎందఱేనిన్ = ఎందఱో, పెంపు = గొప్పతనము, ఎనయన్ = వ్యాపించులాగున, సుతేష్టిన్ = పుత్రకామేష్టిని, చేసి, ఈక్రమంబునన్ = పైనఁజెప్పిన విధముగా, పుత్రులన్ = కుమారులను, కాంచరె = పొందరా, నినున్, నేన్, నియమించువాఁడన్ = ఆజ్ఞాపించుచున్నాను, నెమ్మనమునన్, చింత, తక్కి = మనస్సునఁ జింతవీడి, సుసమాహితవృత్తిన్ = సమాధాన మగుమనికితో, అవ్విధిన్ = ఆయిష్టిని, ఒనర్పుము = చేయుము.

తా. వసిష్ఠుఁడనుచున్నాఁడు. పూర్వము పుత్రకామేష్టి యొనర్చి రాజులు పెక్కురఁ బుత్రులంబడసిరి. నేనాజ్ఞాపించుచున్నాఁడను. నీవీ కార్యమొనర్పుము.

ఇటఁ బుత్రులన్ ఎందఱేనిన్, అనికొందఱ అన్వయముచేసెదరు. అట్లనుటకంటెను నృపులెందఱేనిన్, అని యన్వయించుట సమంజసము.

భారత = అనన్ = కుంతియాలాగునఁ జెప్పఁగా, అతఁడు = పాండురాజు, ఇట్లనున్, కలఁకనందఁగనేటికి; తొల్లి, అనపత్యులౌనృపులు, ఎందఱేనిన్, సుతేష్టిఁజేసి = పుత్రవాంఛచే, పెంపు, ఎనయన్, ఈక్రమంబునన్ = ఈదేవర న్యాయముచొప్పున, పుత్రులన్, కాంచరే, నిన్ను, నేన్, నియమించువాఁడన్, నెమ్మనమునన్, చింత, తక్కి, సుసమాహితవృత్తిన్, అవ్విధిన్, ఒనర్పుము = దేవరన్యాయము వంటి న్యాయములో సంతతినందు నట్టి కార్యము చేయుము

తా. ఈమాత్రమునకై వగవనేల ? పూర్వమెందఱో పుత్రహీనులగు రాజులు పుత్రవాంఛచే నీన్యాయముచొప్పున నాచరించిరి. నేనాజ్ఞాపించు చున్నాఁడను గాన నీవుఁనిప్పక యిట్లాచరించునది.

"సుతేష్టిః." "ఇష్టిర్యాగేచ్ఛయోః" అని యమరము.

క. అవినింద్యమతివసుమతీ
ధవగుర్వాదేశమునను ♪ దానెద్దానిన్
సవరించిన నది యిష్టము
నవిలంబత నొసఁగు సంది ♪ యము వలదెందున్. 51

రామాయణ. అవినింద్యమతి= దూషింపఁదగనిమనస్సుగల, వసుమతీ ధవ = రాజా, దశరథుఁడాయనుట. గురు, ఆదేశమునను=గురువు యొక్క యాజ్ఞచేత, తాన్, ఎద్దానిన్, సవరించినన్ = తానేదిచేసినను, అది = ఆకార్యము, అవిలంబతన్ = ఆలస్యములేక, ఇష్టము, ఒసఁగున్ = ఇష్టము నిచ్చును, ఎందున్ = ఏవిషయమునను, సందియము, వలదు = సందేహము వలదు.

తా. రాజా ! గుర్వాజ్ఞచే నేకార్యమాచరించినను నది యతిశీఘ్రము న ఫలమునిచ్చును. దీనసందియ పడ నక్కఱలేదు.

"గుర్వాదేశమునను." యణాదేశసంధి. "ఇకోయణచి." పాణిని.

భారత. అతివ = స్త్రీ, సుమతీ = బుద్ధిమంతురాలా, ధవ = భర్త యొక్క, గుర్వాదేశమునను = గొప్పయాజ్ఞచే, తాన్, ఎద్దానిన్, ఆచరించినన్, అది, అవినింద్యము = దూష్యముగానేరదు, ఇష్టమున్, అవిలంబతన్, ఒసఁగున్, ఎందున్, సందియము, వలదు = ఏపట్టునను సంశయము వలదు.

తా. భర్తయాజ్ఞచే నేకార్యముచేసినను నది దూష్యముగానేరదు. ఫలమునుగూడ శీఘ్రమునన యిచ్చును. సంశయింపకుము.

"గురు." అజ్ఞానమను నంధకారమును దొలఁగించువాఁడు. "గుశబ్ద స్త్వంధకారేస్యా, ద్రుశబ్ద స్తన్నిరోధకః, అంధకార నిరోధిత్వా, ద్గురు రిత్యభిధీయతే." అని ప్రమాణము.

వ. అదియు. 52

సీ. అలఘుపావనగుణోజ్జ్వలదృశ్యశృంగార
చితమై సుపుత్రసంసిద్ధిఁ జేయుఁ
గావునఁ దత్కర్మకలనకు వరియింప
వలయు నాతనిఁ దెచ్చువైపుఁ జూడు
మనుడుఁ బూర్వమున నేఁ గనినసుమంత్రోప
దేశ మొక్కటి యిప్డు దీనికొనరి
యున్నది-మీతలంపొకటి, పొల్లగునె పు
త్రేష్టికి వేల్పుల నే నిచటికి
గీ. దానఁ దెత్తునో? యనఘ! నా తండ్రియాజ్ఞ
యతిశయమున సాక్షాదీశ్వరాంశమవు త
పస్వివరు నిను మాధవుం బలెభజించి
కంటి నీమంత్రశక్తిని గరిమ మెఱయ. 53

**రామాయణ.** అదియు = ఆయజ్ఞమును, అలఘు = చులకనగాని, పావన = పవిత్రములైన, గుణ, ఉత్, జ్వలత్ = గుణములచే మిక్కిలి ప్రకాశించుచున్న, ఋశ్యశృంగ, ఆరచితమై = ఋశ్యశృంగునిచేతఁ జేయఁబడినదై, సుపుత్ర వరసిద్ధిన్ = సత్పుత్రుఁడు గల్గుటను, చేయున్, కావునన్ = కాఁబట్టి, తత్కర్మకలనకున్ = ఆకార్య మాచరించుటకు, ఆతనిన్, వరియింపవలయున్ = ఆమహాత్ముని వరింపవలయును, తెచ్చువైపు చూడుము, అనుడున్ = అతనిం దెచ్చువిధము చూడుమనఁగ, ఇది మొదలు దశరథుని మాటలు. అనఘ = పాపరహితుఁడా, నాతండ్రి [గురువు జనక

ఋష్యశృంగుఁడగుటచే నిట్లు చెప్పఁబడియెను.] పూర్వమునన్ = తొల్లి, నేన్, కనిన, సుమంత్రోపదేశము = సుమంత్రుని యుపదేశము, ఒకటి, ఇప్డు, దీనికిన్, ఒనరియున్నది = తగియున్నది, మీ తలంపు = మీయిష్టము, ఒకటి, పొల్లగునే = తప్పిపోవునా, ఆజ్ఞయతిశయమునన్ = మీయాజ్ఞాతిశయముచే, పుత్రేష్టికిన్ = పుత్రకామేష్టికిన్, వేల్పులనేన్ = దేవతలనైనను, ఇచటికిన్, తెత్తున్ = ఇచ్చటికిఁ దేఁగలను, దానన్ = దానిచే, సాక్షాత్, ఈశ్వరాంశమవు = రుద్రాంశుఁడవగు, తపస్వివరున్, నినున్, మాధవుఁబలెన్ = విష్ణునివలె, భజించి = ఆశ్రయించి, నీమంత్రశక్తిన్ = నీయాలోచనాశక్తిని, నీగరిమన్ = నీగొప్పతనమును, కంటిన్ = చూచితిని.

తా. సద్గుణసంపన్నుఁడగు నాఋశ్యశృంగుని రావించి యాతని మూలమునఁ బుత్రకామేష్టి గావింపుమని వసిష్ఠుఁడన, దశరథుఁడు నేనీ విషయ మీవఱకే సుమంత్రునివలన వినియున్నాను. నీతలంపు వ్యర్థమగునే? నీవాజ్ఞయిచ్చినఁజాలును. దేవతలనైన నీయజ్ఞమునకు రావింపఁగలను. సాక్షాదీశ్వరాంశజుఁడవగు నిన్ను విష్ణునివలె నారాధించి నీయాలోచనాశక్తిని, గౌరవమును జూడఁగల్గితిని.

ముద్దరాజు రామన్న, "వరియింపవలయునాతనిన్ = వరియింపవలసిన ఋశ్యశృంగుని?' అని యర్థము గావించెనుగాని, యంతకంటె, "నాతనిన్, వరియింపవలయును." అనుట యెంతయు సమంజసము.

"సుమంత్రోపదేశము." "ఋశ్యశృంగం ద్విజశ్రేష్ఠం వర యిష్యతి ధర్మవిత్, యజ్ఞార్థంప్రసవార్థంచ" అని సనత్కుమార వాక్యముగా సుమంత్రుఁడనెనని రామాయణమునఁగలదు.

"అనుద్రుక్" ఆనంతర్యంబున డువర్ణకంబు ద్రుతాంతంబగు." బాల వ్యాకరణము.

భారత. అదియున్ = నేఁజెప్పిన దేవరన్యాయము, అలఘు, పావన, గుణ, ఉజ్జ్వల = ప్రకాశించుదాన, సంబుద్ధి. దృశ్య = చూపునకు, శృంగార = శృంగారరసజనకమగులాగున, చిత్రమై = చేయఁబడినదై, సుప్ర

త్రసంసిద్ధికై, చేయుఁగా, కావునన్, తత్కార్యకలనకున్, వరియింపవలయు
నాతని = వరింపవలసిన యాతనిని, తెచ్చువైపున్, చూడుము, అనుచున్,
ఇది మొదలు కుంతిమాటలు. పూర్వమునన్, ఏన్, కనిన సుమంత్రోపదేశము,
ఒక్కటి = మంచిమంత్రముయొక్క యుపదేశమొక్కటి, ఇపుడు, దీనికిన్,
ఒనరియున్నది, మీతలంపొక్కటి, పొల్లగునె = తప్పునె, దానన్ = ఆమం
త్రశక్తిచే, పుత్రేప్సకిన్ = పుత్రేచ్ఛకయి,! వేల్పులన్, ఏన్, ఇచటికిన్,
తెత్తున్ = దేవతలను నే నిచ్చటికిఁ దెచ్చెదను, ఓయనఘ, నాతండ్రియాజ్ఞ
యతిశయమునన్ = నాతండ్రియొక్క యాజ్ఞాతిశయముచే, ఈశ్వరాంశ
మవు, తపస్వివరునిన్ = దూర్వాసుని, ఉమాధవుఁబలెన్, భజించి = శివు
నివలె నారాధించి, ఈమంత్రశక్తిన్, కంటిన్ = ఈమంత్రశక్తిని బొంది
తిని, ఈగరిమన్, మెఱయన్, కంటిన్ = ఈగౌరవము ప్రకాశించు
లాగునఁ బొందితిని.

తా. చూపుల కింపగులాగున శృంగారింపఁబడిన కాంత సత్పుత్ర
లాభమును బడయును, నీవాపుత్రలాభకార్యమున కంగీకరించి తగువానిం దే
నుపాయ మాలోచించునదని పాండురాజన నంతఁ గుంతి, "నేనొకమంత్ర
శక్తింగాంచియున్నాను. అది సంతానోత్పత్తి కెంతయుఁ దోడ్పడఁగలదు
మీయిష్టమెన్నఁడును దప్పదు. ఆమంత్రశక్తిచే దేవతల నిటకుఁ దెప్పింప
గలను. నాతండ్రియింటనుండ నాతనియాజ్ఞచే దూర్వాసు నారాధించి
యామంత్రము నందితిని. గౌరవమునందఁ గల్గితిని."

వ. కావున. 54

క. అవితథసంకల్పధరా
దివిజులలో నెట్టివారిఁ దెచ్చి వరింతున్
వివరింపవలయుఁ బుత్రే
ప్సావిధికి రప్పింతు మీరు చెప్పినయతనిన్. 55

రామాయణ. అవితథసంకల్ప = వ్యర్థముగాని సంకల్పముగల వాఁడా, ధరాదివిజులలోన్ = బ్రాహ్మణులలోన, ఎట్టివారిన్ = ఏలాటి వారిని, పుత్రేష్టివిధికిన్ = పుత్రకామేష్టియనెడి కార్యమునకు, తెచ్చి, వరింతున్ = కొనివచ్చి వరింపవలయును, వివరింపవలయున్ = తెలుపవల యును, మీరుచెప్పినయతనిన్ = మీరానతిచ్చిన ఋశ్యశృంగుని, రప్పిం తున్ = రావింతును.

తా. బ్రాహ్మణులలో నీయాగమునకై యింకనెవరెవరిని రావింప వలయును. మీరానతిచ్చిన ఋశ్యశృంగుం గూడ రప్పింతును.

భారత. అవితథ, సంకల్ప = కోర్కెలను, ధరా = ధరించినవాఁడా, పాండురాజాయనుట. దివిజులలోన్ = దేవతలలో, ఎట్టివారిన్, పుత్రేష్టి విధికిన్ = పుత్రులఁబడయు నీకార్యమునకు, తెచ్చి, వరింతున్, వివరింప వలయున్ = తెలుపవలయును, మీరు, చెప్పినయతనిన్ = మీరెవరిని రావింపుమని చెప్పుదురో యతనిని, రప్పింతున్.

తా. పుత్రులఁ బడయ దేవతలలో నేరిని దెప్పింపవలయు ననుట మీరు తెల్పుఁడు. మీరానతిచ్చినవారిం బిలిపింతును.

చ. అనయముఁద త్త్వబోధమున కంచితధర్మనిరూఢియందు స
త్యనియతిఁ బెద్దయంద్రు విబుధావళిలోపలనమ్మహాత్ముఁ బా
వనగుణశాంతితో రుచిరవర్ణ్యనిసర్గమునఁ బ్రసాదుఁ డై
తనరెఁడువానిమంత్రవిధిదక్షుమతిన్భజియించి తేఁదగున్. 56

రామాయణ. అనయము = సర్వదా, తత్త్వబోధమునన్ = బ్రహ్మ మును బోధించుటయందును, అంచితధర్మ నిరూఢియందున్ = ఒప్పుచున్న ధర్మముయొక్క ప్రసిద్ధియందును, సత్యనియతిన్ = సత్యనిష్ఠయందును, విబుధావళిలోపలన్ = పండితుల సమూహములో, అమ్మహాత్మున్ = ఆ ఋశ్యశృంగుని, పెద్దయంద్రు = పెద్దవాఁడని యందురు, [లోకులని

యధ్యాహార్యము.] రుచిర ... ప్రసాదుఁడై-రుచిర = అందమగు, వర్ణ్య= పొగడఁదగు, నిసర్గ = పూర్ణమైన, మనః = మనస్సునందలి, ప్రసాదుఁడై= అనుగ్రహముగల్గినవాఁడై, తనరెడువానిన్ = ప్రసిద్ధుఁడగువానిని, మంత్ర, విధి=మంత్రములయందును, వానినాచరించుప్రక్రియయందును, దక్ష=సమర్థమైన, మతిన్ = బుద్ధిగలవానిని, ఋశ్యశృంగుననుట. భజియించి = ఆశ్రయించి, పావనగుణ = పవిత్రమైన గుణములుగల, శాంతతోన్ = శాంతాదేవితోఁగూడ, తేఁదగున్ = తేవలయునది.

తా. బ్రహ్మజ్ఞానమునందును, ధర్మాచరణమునందును సత్యనిష్ఠయందును, నెవ్వఁడు గొప్పవాఁడని పెద్దలందురో, అనుగ్రహ పూర్ణుఁడై, మంత్రతంత్రములలోఁ బ్రసిద్ధుఁడయిన యాఋశ్యశృంగుని భార్యతోడఁ బిలిపించునది.

"పావనగుణకాంతతో" నని కొన్ని ప్రతులలోఁ బాఠముగలదు కాని, "శాంతతో" నను పాఠమే ప్రాచీనప్రతులయందున్నది.

భారత. అనన్ = అనిచెప్పఁగా, ఇది మొదలు పాండురాజు మాటలు. యమున్ = యముని, తత్త్వబోధమునన్, అంచిత, ధర్మనిరూఢియందున్, సత్యనియతిన్, విబుధావళిలోపలన్ = దేవతా సమూహములలో, పెద్దయంద్రు, అమ్మహాత్మున్, పావన, గుణ = పవిత్రములైన గుణములతోఁ గూడిన, శాంతతా = శాంతత్వముతోఁగూడిన, ఉరు = మిక్కిలి, చిరవర్ణ్య= చాలకాలము పొగడఁదగిన, నిసర్గ = స్వభావసిద్ధమయిన, మనః = మనస్సునందలి, ప్రసాదుఁడై = అనుగ్రహముగలవాఁడై, తనరెడువానిన్, మంత్రవిధి = మంత్రము, తదాచరణము, వీనియందు, దక్ష = సమర్థమైన, మతిన్ = బుద్ధిచే, భజియించి = ఆశ్రయించి, తేఁదగున్ = తీసికొనిరావలయును.

తా. కుంతి యిట్లాడఁగాఁ, బాండురాజు, "తత్త్వజ్ఞానము నందును, సత్యధర్మముల యందును, దేవతలలో యముఁడు గొప్పవాఁడనియందురు

గదా! సద్గుణయుక్తుఁడై, శాంతతగల్గి, యనుగ్రహపరిపూర్ణుఁడైనయట్టి యాతని నాశ్రయించితేఁదగును.

'విబుధః—విబుధశ్శపండితేదేవే.' అని యమరము.

క. అని నృపుఁడు భార్యతో నా
యనఁ దడయక తెచ్చి యాగకృ మాచారముతోఁ
దనకుఁ దనూభవలాభం
బొనరం జేయుటకుఁ గడుఁబ్రియోక్తులు వలికెన్. 57

రామాయణ. అని = ఇట్లు చెప్పి, [వసిష్ఠుఁడీలాగునఁ జెప్పఁగా వావలయని భావము.] నృపుఁడు = దశరథుఁడు, భార్యతోన్ = శాంత తోడ, ఆయనన్ = ఆఋశ్యశృంగుని, తడయక = ఆలసింపక, తెచ్చి, తనకున్, తనూజలాభంబు = పుత్రలాభము, ఒదవన్ = కలుగుటకొఱకు, ఆచార ముతోన్ = అనుష్ఠానముతో, యాగము, చేయుటకున్ = పుత్రకామేష్టి చేయుటకై, కడున్ = మిక్కిలి, ప్రియోక్తులు = ప్రియమైన మాటలు, పలికెన్.

తా. దశరథుఁడు శాంతతో ఋశ్యశృంగుని రావించి తనకు సంతానము గల్గుటకొఱకై యాచారముతోఁ బుత్ర కామేష్టి జరుపుటకై మిక్కిలి ప్రియముగా నాతనితో మాటలాడెను.

భారత. అని, నృపుఁడు = పాండురాజు, భార్యతోన్ = కుంతితో, అయనన్ = ఆ యముని, తడయక, తెచ్చి, ఆగమాచారముతోన్ = వేదోక్తాచారముతో, తనకున్, తనూజలాభంబు, ఒనరన్, చేయుటకున్, కడున్, ప్రియోక్తులు, పలికెన్.

తా. పాండురాజు కుంతితో యముని రావించి తనకు సంతానలాభము గలుగఁజేయుమని ప్రియోక్తులు పలికెను.

వ. ఇట్లు నియమించి. 58

తే. ప్రతిపదంబును నిజపురో హితమతాను
శీలనమున సదీక్షావి శేషుఁడగుచు
ననఘమతు లైన మునులతో నాత్మయాగ
మొకటికొదలేకయుండఁ జే యుచును వేడ్క. 59

రామాయణ. ప్రతిపదంబును = అన్ని ప్రయోజనములందును, నిజ, పురోహిత = పురోహితుఁడగువసిష్ఠుని యొక్క, మత, అనుశీలనమునన్ = అభిప్రాయము ననువర్తించుటతో, సదీక్షావిశేషుఁడు, అగుచున్ = దీక్షావిశేషముతోఁగూడిన వాఁడగుచు, అనఘమతులైన = నిష్పక్షపాత బుద్ధులైన, మునులతోన్ = మహర్షులతో, ఆత్మ = తనయొక్క, యాగము = పుత్రకామేష్టి, ఒక్కటియున్, కొదలేకయుండఁగ = కొఱఁత లేకుండునట్లుగా, చేయుచును, వేడ్కన్.

తా. ప్రతికార్యమునందును దనపురోహితుఁడగు వసిష్ఠునానతి చొప్పున ననుసరించు దశరథుఁడు పాపరహితులగు మునులతోఁగూడి యజ్ఞముచేయుచు వేడ్కతో. ధరణిపుఁడుండెనను ముందరి పద్యముతో నన్వయము.

భారత. ప్రతిపదంబును=పలుమాఱు, నిజ, పురః=ముందు, హితమత= మేలగుబుద్ధియొక్క, లేక, పురా = మున్ను, ఊహిత = ఊహింపఁబడిన, మత = యోగాచరణ సంకల్పము యొక్కయనియు నర్థమగును. అనుశీలనమునన్ = పరిచితిచేత, సత్ = చక్కఁగా, ఈక్షా విశేషుఁడు, అగుచున్ =జ్ఞానవిశేషముగలవాఁడగుచు, అనఘమతులైన = నిష్పాపబుద్ధులయిన, మునులతోన్ = మహర్షులతో, ఆత్మయాగము = బ్రహ్మను భవము, ఒక్కటి, కొదలేక యుండఁగ = కొంచెమేనియుఁ గొఱఁత లేకుండఁగా, చేయుచున్, వేడ్కన్.

తా. అడుగడుగున మేలునకుఁ గారణమగు బ్రహ్మజ్ఞానమున మనస్సు గలవాఁడై మహర్షులతోఁగూడి యోగమాచరించుచుండువాఁడై.

చ. ధరణిపుఁడుండెనంత బహుధాముని సన్నను హూయమానుఁడై
పరమసమృద్ధిఁ బర్వెడు విభావసు నందనురూప కాంతిని
ర్భరుఁ గొదలెల్ల దూరముగఁ బాయ సభాజనగౌరవానమ
త్కరుఁ ఘనునొక్కని బ్రమదగౌరవ మొప్పఁగఁ గాంచి సన్నిధిన్.

**రామాయణ.** ధరణిపుఁడు, ఉండెను = దశరథుఁడుండెను, అంతన్ = అవల, బహుధా = అనేకవిధములుగా, ముని = ఋశ్యశృంగుని యొక్క, సన్నను = గొప్పమంత్రముచేత, హూయమానుఁడై = వేల్వఁబడు చున్నవాఁడై, పరమసమృద్ధిన్ = మిక్కిలి వికివిగా, పర్వెడు = వ్యాపించుచున్న, విభావసునందున్ = అగ్నియందు, అనురూప = తగిన, కాంతి = ప్రకాశముచేత, నిర్భరున్ = భారరహితుఁడగువాని, కొదలు, ఎల్లన్ = కొఱఁతలన్నియును, దూరము, కన్ = దూరము కాఁగా, పాయసభాజన = పాయసపాత్రయొక్క, గౌరవ = బరువుచే, ఆనమత్ = మిక్కిలి వంగియున్న, కరున్ = చేయిగలవానిని, ఘనున్ = గొప్ప వానిని, ఒకనిన్ = ఒక దివ్యపురుషుని, ప్రమద = సంతోషమువలని, గౌరవము = గారవము, ఒప్పఁగన్, సన్నిధిన్ = సమీపమున, కాంచి= చూచి.

తా. రాజీలాగుననుండెను. అవల ఋశ్యశృంగుఁడు మంత్రములచే వ్రేల్చుచుండుటంబట్టి జ్వలించుచున్న యగ్నినుండి కాంతిగల, యొక దివ్య పురుషుఁడు పాయసపాత్రము చేత ధరించి, సమీపమున రాఁగఁజూచి.

**భారత.** ధరణిపుఁడు=పాండురాజు, ఉండెను. అంతన్=అవల, బహుధామునిన్ = మిక్కిలి తేజస్సుగలవానిని, సన్నను, హూయమానుఁడై = పిలువఁబడిన వాఁడై, పరమసమృద్ధిన్ = మిక్కిలివృద్ధితో, పర్వెడు, విభావసునందనున్ = సూర్యపుత్రుఁడగు యముని, రూపకాంతి నిర్భరున్ = సౌందర్యముచేతను, తేజముచేతను, నధికుఁడగువానిని, కొదలు, ఎల్లన్, దూరముగన్, పాయన్ = దూరముగాఁ బోవులాగున, సభాజన = సం

తోష పెట్టుటయొక్క, గౌరవ = అతిశయముచే, ఆనమత్ = వంగుచున్న, త్రిప్పఁబడుచున్న యనుట. కరుణ్, ఘనుణ్, ఒకనిణ్ = ఒంటరియై వచ్చిన వానిని, [ఇవి యమునకు విశేషణములు.] ప్రమద = స్త్రీ, కుంతియనుట. గౌరవమొప్పన్, సన్నిధిన్, కాంచి = చూచి.

తా. పాండురాజిట్లుండెను, కుంతి జపించిన మంత్రముచేఁ బిలువఁ బడినవాఁడై, రూపకాంతి యుక్తుఁడై, యావిడయొక్క కోఁఱతలెల్లఁ దీఱు లాగున నొంటరియై యటకువచ్చి ప్రీతితోనామెను గరసంజ్ఞతోఁ బిలుచు చున్న యమునిం గాంచి.

"విభావసు." "అగ్నావర్కే విభావసుః." నానార్థరత్నమాల.

"సభాజన." బాంధవాదులఁ గుశలప్రశ్నాదులచే సంతోషపెట్టుట యనుటకు. "సభాజనాయోపసృతాన్మునీంద్రాన్." అని రఘువంశము.

"సన్నిధిన్." "సన్నిధిస్సన్నిధానేచ, భవేదింద్రియ గోచరే" అని విశ్వము.

ఇట, 'ధరణిపుఁడుండె' ననుట పూర్వపుదానితో నన్వయించును. 'సన్నిధిన్ కాంచి' యనుట ముందన్వయించును.

తే. అప్పుడాయార్యసభయాత । తాద్భుతప్ర
మోదమందాక్షవృత్తిఁ గేలొమ్మొగిచి యుండె
నంత రారమ్ము మనుజప । యజ్ఞఫలము
నొసఁగెదఁ గొనుమని విభావ । సూద్భవుండు. 61

రామాయణ. అప్పుడు = ఆసమయమున, ఆయార్యసభ = ఆగొప్ప వారితోఁగూడిన సభ, ఆతత...వృత్తిన్- ఆతత = విస్తారమైన, అద్భుత = ఆశ్చర్యముచేతను, ప్రమోద = సంతోషముచేతను గల్గిన, మంద = స్తిమిత మైన, అక్షవృత్తిన్ = ఇంద్రియవ్యాపారముచేత, కేల్, మొగిచి, ఉండెన్ = చేతులుజోడించి యుండెను, అంతన్, విభావసూద్భవుండు = అగ్నినుండి

కల్గిన, ప్రాజాపత్య పురుషుఁడనుట. మనుజప = రాజా, రారమ్ము, యజ్ఞ ఫలమ్ముఁ = పుత్రకామేష్టి వలని ఫలము, ఒసఁగెదఁ, కొనుము = గ్రహింపుము, అని.

తా. ప్రాజాపత్య పురుషునిఁ జూచి యచ్చట సభయాశ్చర్య సంతోషములచే నిశ్చలమై చేతులు జోడించి యుండెను. ఆ దివ్యపురుషుఁడు రాజుంగాంచి, రారమ్ము యజ్ఞ ఫలమిచ్చెదను, గ్రహింపుమని.

"అక్ష." అక్షో రథస్యావయవే పాచికే వ్యక్షమింద్రియ" మ్మని విశ్వము.

భారత. అప్పుడు, ఆయార్య = పూజ్యురాలగు నాకుంతి, సభయ = భయముతోఁ గూడుటచేత, ఆతత, అద్భుత, ప్రమోద, మందాక్ష = లజ్జచేతను, కలిగిన, వృత్తిఁ = చేష్టలతో, కేల్, మొగిచి యుండెఁ, అంతఁ, విభావసూద్భవుండు = సూర్యనందనుఁడగు యముఁడు, రారమ్ము, మనుజప, యజ్ఞఫలము = మంత్రము జపించుట యనెడి యజ్ఞము యొక్క ఫలము [సంతానప్రాప్తి ననుట.] ఒసఁగెదఁ, కొనుము, అని.

తా. అప్పుడు కుంతీదేవి భయముతోఁగూడిన యాశ్చర్య సంతోష లజ్జాయుక్త యగుచుఁ, జేతులుమోడ్చి యుండెను. యముఁడామెం గాంచి నీమంత్ర జపముయొక్క ఫలమగు సంతానము నొసఁగెదను గ్రహింపుమని.

"మందాక్ష.""మందాక్ష మందాక్షర మందముక్త్వా." అని నైషధప్రయోగము.

ఇట రామాయణార్థమున సభకద్భుత ప్రమోదములు గల్గుటకు; తలఁచనితలంపుగా నొకదివ్య పురుషుఁడు గల్గుటచే నద్భుతము, దశరథునకు సంతానము గల్గును గదాయనుటచే ప్రమోదమును గల్గినవి. భారత పర్యాయమున సభయాద్భుత ప్రమోదములు గల్గుటకు; ఒకఁడయాఁడుది స్వతంత్రించి యంత వానిం బిలిపించుటచేభయమును,నట్టిరూపదర్శనముచే నద్భుతమును, సంతానము గల్గనున్నది కదాయని ప్రమోదమును గల్గినవని భావము.

“రారమ్మ.” ఇట మొదటి రేఫము ప్రియత్వార్థమున వచ్చెను గాని హీనత్వార్థమునఁ గాదు. “రేఫో౽య మసహా౽యస్సహా సౌవాహీనత్వార్థేము వర్ణకార్థేవర్తతే. ప్రియత్వార్థే ప్రార్థనార్థకను వర్ణకార్థే చవర్తతే.” అహో బలపండి తీయము.

మ. నిరతింబార్థివగేహినీజనులకు న్సేవింప నిమ్మిందువం
శరమాస్ఫూర్తికిఁ బట్టుఁగొమ్మ సకల క్ష్మాభారధుర్యంబన
న్స్థిరమైమించుతనూజలాభ మొదవున్నీకంచునిచ్చెంగృపన్
వరముంబాయసమస్తకల్మషముదివ్యశ్రేష్ఠుఁడత్యాదృతిన్.

రామాయణ. పార్థివ = ఓదశరథా, నిరతిన్ = ఆసక్తితో, గేహినీజనులకున్ = భార్యలకు, (కౌసల్యా కైకేయీ సుమిత్రల కనుట.) సేవింపన్, ఇమ్ము = భుజించుటకై యిమ్ము, ఇందున్ = ఈపాయస భక్షణమునందు, వంశరమా స్ఫూర్తికిన్ = వంశలక్ష్మియొక్క ప్రకాశమునకు, పట్టుఁగొమ్మ = ఆధారమగునట్టి, సకల, క్ష్మాభార = సమస్త భూభారమునకు, ధుర్యంబు = భారవాహి యగునట్టిదియు, అనన్ = అనులాగున, స్థిరమై = శాశ్వతమై, మించు = అతిశయించు నట్టి, తనూజలాభము = పుత్ర లాభము, నీకున్, ఒదవున్, అంచున్ = నీకుఁ గల్గుననుచు, వరమున్ = శ్రేష్ఠమైన, అస్తకల్మషము = పాపములఁ బోఁగొట్టునదియునైన, పాయసమున్, దివ్యశ్రేష్ఠుఁడు = ప్రాజాపత్య పురుషుఁడు, కృపన్ = దయతోడను, అత్యాదృతిన్ = మిక్కిలి ప్రీతితోడను, ఇచ్చెన్.

తా. దశరథా! ఈపాయసము నీ భార్యలకిమ్ము. దీనవంశవృద్ధి కాధారమగు నట్టియు భూభారము వహించునట్టియు, పుత్రలాభము గల్గుననుచు. శ్రేష్ఠమైనదియుఁ బాపములఁ బోఁగొట్టు నదియునైన పాయసము ప్రాజాత్య పురుషుఁడు దయతో నిచ్చెను.

“పట్టుఁగొమ్మ” “నుమ్యోతః” అనునాంధ్ర శబ్ద చింతామణీ సూత్రమున నుగాగమము గల్గి, “పరుషాద్రుతి ప్రకృతికా స్సరళాస్స్యస్త

ద్రుతంచబిందుస్స్యాత్." అను సూత్రముచే బిందుత్వముగల్గెను. కాఁబట్టియే మనుచరిత్రమున; "అచటఁ బుట్టిన చిగురుఁ గొమ్మైనఁజేవ." అని యున్నది. ఇట్లే చిగురుఁగైదువు. గండుఁగోయిలలు, మున్నగు ననేక ప్రయోగములు గలవు.

భారత. పార్థివగేహినీ = కుంతీ, నిరతిన్ = ఆసక్తితో, జనులకున్, సేవింపన్ = సేవించుటకు, ఇమ్ము = స్థానమగునది. ఇందువంశ రమాస్ఫూర్తికిన్ = చంద్రకుల లక్ష్మియొక్క ప్రకాశమునకు, పట్టుఁ గొమ్మ = అధారమగునదియుం, సకలక్ష్మా భారధుర్యంబు, అనన్, స్థిరమై, మించు, తనూజలాభము, నీకున్, ఒదవున్, అంచున్ = అని చెప్పుచు, దివ్యశ్రేష్ఠుఁడు = దేవశ్రేష్ఠుఁడగు యముఁడు, సమస్తకల్మషము = సర్వపాపమును, పాయన్ = పోవులాగున, కృపన్, అత్యాదృతిన్, వరమున్, ఇచ్చెన్ = వరమిచ్చెను.

తా. లోకులు సేవించుటకు స్థానమగునట్టియుఁ, జంద్రవంశ సంపదకాధారమగునట్టిదియు, భూభారము వహింపఁదగినట్టిదియునగు పుత్రలాభము గల్గునని యముఁడా బిడకుఁ బ్రీతితో వర మొసఁగెను.

సీ. అట్లిచ్చియతఁడు దా నంతర్హితుండయ్యె
నదియెల్ల విని గాఢ హర్షుఁడగుచు
జనవరుండు నిజాగ్రసతికి సౌభాగ్యంపు
నడకల కేకయ నందనకుఁగ
రంబు గౌరవమహిమంబంచి తానంత
భావంబునంబర్వఁ బరమనియతి
మనుసుమిత్రకు లసన్మానవతికి భవ్య
దాహ్లాదోదయనిమిత్తంబులైన

గీ. యాసగములలోన § నరయరయవ్యగ్ర
బుద్ధి గోర్కులెల్లఁ § బూరితముగ
నొసఁగఁ బంచెనెంతయును దత్పరిగ్రహ
జనుల, వారునట్లు § సలిపి రెలమి. 68

రామాయణ. అట్టిచ్చి = ఆలాగునఁ బాయసమిచ్చి, అతఁడు = ఆ ప్రాజాపత్యపురుషుఁడు, తాన్, అంతర్హితుండయ్యెన్ = తాను మఱఁగెను, జనవరుండు = దశరథుఁడు, అవియెల్లన్, విని = అతని మాటలెల్లవిని, గాఢహర్షుఁడగుచున్ = పూర్ణానందము గలవాఁడగుచు; నిజ=తనయొక్క, అగ్రసతికిన్ = పెద్దభార్యకు, కౌసల్యకనుట. సౌభాగ్యంపు నడకల = మంగళకరమగు నడవడికగల, కేకయ నందనకున్ = కైకేయికి, కరంబు= మిక్కిలి, గౌరవమహిమన్ = గౌరవాతిశయముతో, పంచి = భాగించి, అంత = ఆవల, తాన్ = తాను, భావంబునన్, పర్వన్ = మనస్సునందుఁ దగులఁగా, పరమని యతిన్, మను = గొప్పనిర్ణయముతో నొప్పుచున్న, సుమిత్రకున్, లసన్మానవతికిన్ = స్త్రీశ్రేష్ఠురాలగు దానికి, భవ్య...... నిమిత్తంబులైన - భవ్య = శుభకరములగు, దౌహృదోదయ = చూలుగల్గుటకు, నిమిత్తంబులైన = కారణములైన, ఆసగములలోనన్ = కౌసల్యాకేకయ నందనలకిచ్చిన యా రెండు సగములలోనన్, అర, అర = సగము సగము, అవ్యగ్రబుద్ధిన్ =ఆకులముగాని బుద్ధితో, కోర్కులెల్లన్ = అపేక్షలన్నియును, ఎంతయున్, పూరితము, కన్ = మిక్కిలి పూర్ణమగులాగున, తత్పరిగ్రహజనులన్ =అతనిభార్యలను, కోసల, కేకయనందలను, ఒసఁగన్, పంచెన్ = ఇమ్మని యాజ్ఞాపించెను. వారున్, ఎలమిన్ = ప్రీతితో, అట్లు, చలిపిరి = అట్లే చేసిరి.

తా. ప్రాజాపత్యపురుషుఁడు పాయసమిచ్చి యంతర్హితుఁడయ్యెను. అంత వానిమాటలెల్ల విని దశరథుఁడు సంతసించినవాఁడై, యా పాయసము రెండుభాగములు గావించినవాఁడై, కౌసల్యకును, కైకేయికిని

నొక్కొక్క భాగమిచ్చెను. అవల స్త్రీశ్రేష్ఠురాలగు సుమిత్రతలఁపునకు రాఁగనామెకును గర్భోదయమునకుఁ గారణమగు తక్కినవారి రెండు పాళ్లలో సగముసగమిమ్మని యాజ్ఞచేసెను. వారు నట్లే యిచ్చిరి.

"నడకల" అడుగడుగనిట్లే ప్రయోగించుటచే గసడదవాదేశవిధి వైకల్పిక మని యీకవి యాశయమనుట విస్పష్టము.

ఇటఁగవి భోజుని యభిప్రాయమునను సరించెను. "కౌసల్యాయై ప్రథమమదిశద్భూపతిః పాయసార్ధం। ప్రాదాదర్ధం ప్రణయమధురం కేకయేంద్రస్యపుత్ర్యై। ఏతేదేవ్యౌతరళమనసః పత్యురాలోచ్యభావం। స్వార్ధాంశాభ్యాం స్వయమకురుతాం పూర్ణకామాం సుమిత్రాం॥" చంపూరామాయణము.

అర్థశబ్దార్థమగునట్టి, 'అర' లఘురేఫమేకాని యలఘువుగాదు.

"అరసాము సగము సవము నాఁగనర్థాహ్వయంబులౌ." ఆంధ్రనామసంగ్రహము.

"పరిగ్రహాజనులన్." పత్నీపరిజనాదాన మూలశాపాఃపరిగ్రహాః॥ అని యమరము. "పరిగ్రహబహుత్వేపి ద్వేప్రతిష్ఠేకులస్యమే." అని కాళిదాస ప్రయోగము.

భారత. అట్లిచ్చి, అతఁడు, తాన్, అంతర్హితుండయ్యెన్ = అట్లు వరమిచ్చి, యముఁడు తానుమఱుఁగుపడెను, జనవరుండు = పాండురాజు, అది యెల్లన్ = ఆపరప్రకారమంతయును, విని, గాఢహర్షుఁడగుచున్, సౌభాగ్యంపునడకలకున్ = మంగళకరములగు నడకలకు, ఏకయనన్ = ముఖ్యమగునదనుచు, తనకున్ = కుంతికి, కరంబు, గౌరవమహిమంబు = గొప్ప ప్రభావము, అంచిత = ఒప్పుచున్న, అనంతభావంబునన్ = బాహుళ్యముచేత, పర్వన్, పరమనియతిన్, మను, సుమిత్రకుల = మిత్రకోటిలో, సన్మానవతికిన్ = గౌరవముకలదానికి, నిజాగ్రసతికిన్ = తనపెద్దభార్య

కు, కుంతికనుట. భవ్య, దౌహృదోదయ నిమిత్తంబులైన, ఆసగములన్ = ఆసలసమూహమును, లోనన్, అరయన్ = లోలోపలఁ దెలియులాగున, రయము = వేగమునందు, వ్యగ్ర = తొందరపడుచున్న, బుద్ధిన్, కోర్కెలెల్లన్, ఎంతయున్, పూరితముగన్ = పూర్ణముగునట్లు, ఒసఁగన్ = ఇచ్చుటకు, తత్పరిగ్రహజనులన్ = ఆమెయొక్క పరిచారికా జనులను, పంచెన్ = ఆజ్ఞాపించెను, వారున్ = ఆపరిచారికా జనులును, ఎలమిన్, అట్లు, చలిపిరి.

తా. యముఁడు వరమిచ్చివెళ్ళినంత నీవృత్తాంతమెల్ల విని పాండురాజు మిక్కిలి సంతోషించెను. మంచినడవడిక గల్గుటచే నత్యంతగౌరవము సర్వత్ర వ్యాపించి యున్నదానికి, బంధుమిత్రాదులలో గౌరవమందుచున్నదానికిఁ దన పెద్దభార్యయగు కుంతికి గర్భచిహ్నములైన యాసలెల్లఁ బూర్తిచేయుటకుఁ దగిన పరిచారికల నియమించెను. వారునట్లే చేసిరి.

"అష్టాంగ యోగానవతోస్యరాజ్ఞో, మృష్టాన్నమానీ న్నఏదుకందమూలం। గర్భోభవనస్యాజనికేలి సౌధో, దర్భోపి సింహాసనతాం జగాహే." అని యనంతభట్టు నుడివినలాగున నడవిని దపముచేయుచుండు నీరాజుచేఁ గుంతీశుశ్రూషకై యీకవి పరిచారికల నియమింపఁజేయుట శ్లేషార్థ సంఘటనకై కల్పించుకొనిన దగును.

"అంచి" "చువర్ణకంబు పరంబగు నపుడన్వాదుల కుత్వలోపంబేని నుస్థానంబున బిందువేని విభాషనగు." బాలవ్యాకరణము. "పూంచి రథంబున మణిమయ పంచాన నకేతువెత్తె." నని సోమయాజి ప్రయోగము గలదు.

క. భరియించె నపుడు విబుధో
త్కరసంప్రార్థనమొనర్చు కడఁకదలిర్పన్
హరిమధ్యమభువనముఁబ్రో
చురతిందద్గర్భభావ శోభనలీలన్. 64

రామాయణ. అపుడు, హరి = విష్ణువు, విబుధ...ప్రార్థనము- విబుధ, ఉత్కర = దేవకోటియొక్క, సంప్రార్థనము = కోరిక, ఒనర్చు కడఁక = చేయవలయు నను ప్రయత్నము, తలిర్పన్ = ఒప్పఁగా, మధ్యమ భువనమున్ = భూలోకమును, ప్రోచురతిన్ = రక్షించు నాసక్తిచేత, తత్.........లీలన్ - తత్ = వారలయొక్క, కౌసల్యయొక్కయుఁ గైకేయి యొక్కయు, సుమిత్రయొక్కయు ననుట. గర్భభావ = గర్భత్వ మనెడి, శోభనలీలన్ = శుభకరమగు లీలను, భరియించెన్ = వహించెను.

తా. విష్ణువు దేవతలు తన్ను బ్రార్థింపఁగా వారి యిష్టము పూర్తి చేయుకడఁకతో భూరక్షణార్థమై దశరథునిభార్యల గర్భమనెడి లీలను భరించెను.

భారత. అపుడు, హరిమధ్యమ = సింహముయొక్క నడుమువంటి నడుముగలది, కుంతియనుట. తత్...లీలన్-తత్ గర్భ = ఆగర్భమునఁనుండెడి వానియొక్క, భావ = అభిప్రాయముయొక్క, శోభనలీలన్, విబుధ = పండితులయొక్క, ఉత్కర = సమూహముయొక్క, సంప్రార్థనము = వాంఛలు, ఒనర్చుకడఁక, తలిర్పన్, భువనమున్ = లోకములను, ప్రోచు రతిన్ = రక్షించునాసక్తిని, భరియించెన్ = వహించెను.

తా. కుంతీదేవి, గర్భస్థ శిశువుయొక్క యభిప్రాయాను సారముగాఁ బండితుల కోర్కెలు దీర్పవలయుననియు, లోకరక్షణము సేయవలయు ననియు వేడ్కఁబూనెను.

"హరిమధ్యమ." ఇది యుపమాన బహువ్రీహి.

ఉ. దీనులఁ బ్రోవఁగోరుదు రకీతిక్రమసత్కరుణన్ విపక్షసం
తానము ద్రుంపఁగోరుదు రుకీదాహరణీయ రణైకశిక్ష నం
భోనిధిమధ్యభూభరముఁ కీబూనఁగఁగోరుదురత్యయోన్నతిన్
మానవనాథకాంత లసకీమానగుణాద్భుత గర్భసంగతిన్. 65

**రామాయణ.** మానవనాథుని కాంతల్ = దశరథునిభార్యలు, అస మాన......సంగతిన్ - అసమాన = సాటిలేని, గుణ = గుణములచే, అద్భుత = ఆశ్చర్యమైన, గర్భ = చూలుయొక్క, సంగతిన్ = సాంగత్య ముచే, అతిక్రమ=క్రమమును మీఱిన, అతిశయించినదనుట. సత్కరుణన్ = దయచేత, దీనులన్ = దరిద్రులను, ప్రోవన్, కోరుదురు = రక్షింపఁ గోరుదురు, ఉదాహరణీయరణ, ఏకశిక్షన్ = వర్ణింపఁదగిన యుద్ధము నందలి ముఖ్యమగు శిక్షచే, విపక్షసంతానమున్ = శత్రుసమూహమును, త్రుంపన్, కోరుదురు = త్రుంచివేయుటకు వాంఛింతురు, అత్యయ = మిక్కుటమగు భాగ్యముయొక్క, ఉన్నతిన్ = గొప్పతనమున, అంభోనిధి మధ్య భూభరమున్ = చతుస్సముద్ర ముద్రితమగు భూమండలముయొక్క భారమును, పూనఁగన్, కోరుదురు = ధరింపనభిలషింతురు.

తా. దశరథపత్నులు గర్భస్థ శిశువుల సాంగత్యముచే దయతో దరిద్రులఁ గాపాడఁ దలంతురు. యుద్ధములశత్రుల జయింప నెంతురు. భాగ్యముతో నీభూమండలముఁ బాలింపఁ గోరుదురు.

"అత్యయ." యణాదేశ సంధి. "ఇకోయణచి." పాణిని. "దీనులన్." దీయతయితిదీనః. దీఙ్ క్షయే." గురుబాలప్రబోధిక,

"రణై కశిక్ష." వృద్ధిసంధి.

ఇట భగవదంశ గర్భమునఁనుంట భగవదవ తారకార్యములు వీరు చేయఁ దలఁచిరనుట సూచితము. 'దీనులఁబ్రోవఁ గోరుదు' రనుటచే సాధుపరిత్రాణమును, 'విపక్షసంతానము ద్రుంపఁగోరుదు''రనుటచే దుష్కృ తుల వినాశమును, అత్యయోన్నతిన్ భూభరము పూనఁగఁ గోరుదు' రను టచే ధర్మసంస్థాపనము దెల్పఁబడెను.

**భారత.** మానవనాథకాంత = కుంతి, లసమాన = ప్రకాశించుచున్న, గుణాద్భుత, గర్భసంగతిన్, దురతిక్రమ = దాఁటఁదగని, సత్కరుణన్, దీనులన్, ప్రోవన్, కోరున్ = వాంఛించును, దురుదాహరణీయ =

వర్ణింప సాధ్యముగాని, రక్షైకశిక్షన్, విపక్షసంతానమున్, త్రుంపన్, కోరున్ = అభిలషించును, దురత్యయ = అతిక్రమింపరాని, ఉన్నతిన్, అంభోనిధిమధ్య భూభరమున్, పూనఁగన్, కోరున్ = ఇచ్చించును

తా. కుంతీదేవి రూపప్పిదములగు గుణములచేఁ బ్రకాశించు గర్భము యొక్క సాంగత్యమున, దీనుల రక్షింపను, శత్రుల సంహరింపను, భూభరము దాల్పను గోరును.

క. విభు నగ్రమహిషికయ్యెడఁ
త్రిభువనముల యందజాత రిపునామకుఁడై
యభినుతిఁ గాంచుకుమారుఁడు
ప్రభవించె మహాయశోభి రాముఁడనంగన్. 66

రామాయణ. విభునగ్రమహిషికిన్ = దశరథుని ప్రథమభార్యకు, కౌసల్యకనుట. అయ్యెడన్ = ఆసమయమున, త్రిభువనములయందున్ = ముల్లోకములయందును, అజాత = పుట్టని, రిపు = శత్రువుయొక్క, నామకుఁడై = పేరుగలవాఁడై, అభినుతిన్ = పొగడికను, కాంచు = పొందిన, మహా, అయ, శోభి = గొప్పభాగ్యముచేఁ బ్రకాశించుచున్న వాఁడు, రాముఁడనంగన్ = రాముఁడనుచు, కుమారుఁడు = పుత్రుఁడు, ప్రభవించెన్ = జనించెను.

తా. కౌసల్యకు, ముల్లోకములయందును శత్రువను పేరులేనివాఁడని ప్రసిద్ధిగాంచినవాఁడును, గొప్పభాగ్యముచేఁ బ్రకాశించువాఁడు నగు రాముఁడను కుమారుఁడు జనించెను.

"మహిషీ.—" "కృతాభిషేకామహిషీ." అని యమరము.

"త్రిభువనములయందున్—" సంఖ్యాపూర్వకమగుటచే నిది ద్విగుసమాసము.

భారత. విభునగ్రమహిషికిన్ = కుంతికి, అయ్యెడన్, త్రిభువనముల యందున్, మహాయశః, అభిరాముఁడు, అనంగన్ = మిక్కుటమగు

కీర్తిలో మనోహరుఁడగువాఁడని, అభినుతిఁ, కాంచు, కుమారుఁడు, అజాత శత్రువను పేరుగలవాఁడై, ప్రభవించెఁ.

తా. కుంతీదేవికి ముల్లోకములందును గీర్తిగలవాఁడని పొగడ్తగన్న యజాతశత్రువను కుమారుఁడు గల్గెను.

క. సురలెంతయు నలరిరి భా
సురతఁ దెసలెసఁగెఁ బ్రబలె శుభవిభవంబుల్
ధరణిజనంబుల కపుడా
సరణి నుదయమంది ధర్మసంతతి పెరుఁగన్. 67

రామాయణ. ఆసరణిఁ = ఆపద్ధతిని, రాముఁడుదయించిన లాగు ననుట. అపుడు = ఆసమయమున, ధర్మసంతతి = ధర్మముల సమూహము, ఉదయించి = జనించి, పెరుఁగఁ = వృద్ధిపొందుచుండఁగా, సురలు = దేవతలు, ఎంతయుఁ = మిక్కిలి, అలరిరి = సంతోషించిరి, భాసురతఁ, దెసల్ = దిక్కులు, ఎసఁగెఁ = ప్రకాశించెను, ధరణిజనంబులకుఁ = భూలోకమునందలి జనులకు, శుభవిభవంబుల్ = శుభకరములగు నుత్సవములు, ప్రబలెఁ = వృద్ధిపొందెను.

"సురలు" "సురశబ్దంబు నిత్యంబుగా నసురశబ్దంబు వైకల్పికముగా స్త్రీతుల్యంబులగు" బాలవ్యాకరణము.

తా. రాముని జననమువలె ధర్మములును జనించి వృద్ధిపొందుచుండుటచేత, దేవతలు సంతోషించిరి. దిక్కులు తెలివొందెను. భూజనుల కుత్సాహము ప్రబలెను.

భారత. ఆసరణిఁ, ఉదయమంది, ధర్మసంతతి = యముని యొక్కసంతానము, అజాతశత్రువనుట. పెరుఁగఁ ; తక్కినవి సమము.

తా. ధర్మజుఁడు వృద్ధిపొందుచుండఁగా దేవతలు సంతోషించిరి. దిక్కులు తెలివొందెను. భూజనుల కుత్సాహము ప్రబలెను.

వ. మఱియును. 68

క. అమితోన్నతిఁ గనియె నృప
ప్రమదమనుగుణప్రసన్న పవనునివలనం
గొమరుమిగుల బలియు సుగం
ధముగలవిరిసోన సురపథంబునఁ దొరఁగన్. 69

**రామాయణ.** నృప = దశరథునియొక్క, ప్రమదము = సంతోషము, అనుగుణ...వలనన్ - అనుగుణ = తగిన, ప్రసన్నపవను నివలనన్ = మందమారుతముచే, కొమరు = అందము, మిగులన్ = అతిశయింపఁగా, బలియు = వృద్ధిబొందుచుండు, సుగంధము = మంచివాసన, కల, విరిసోన = పుష్పవృష్టి, సురపథంబునన్ = ఆకాశమున, తొరఁగన్ = కురియఁగా, అమిత, ఉన్నతిన్ = మిక్కిలి గొప్పతనమును, కనియెన్ = పొందెను.

తా. దశరథుని సంతోషము అనుగుణ మందమారుతము వీచుటచే, దట్టమగు పుష్పవర్ష మాకసమునుండి కురియుటచే, మిక్కిలి యౌన్నత్యమును బొందెను.

**భారత.** నృపప్రమద = పాండురాజుభార్య, కుంతి, మనుగుణ = మంత్రజపముచే, ప్రసన్న = అనుగ్రహించిన, పవనునివలనన్ = వాయుదేవునివలన, మిగులన్ = మిక్కిలి, బలియున్ = బలముగలవానిని, కొమరున్ = కుమారుని, సుగంధముగల విరిసోన, సురపథంబునన్, తొరఁగన్ = కురియఁగా, అమితోన్నతిన్, కనియెన్ = కనెను.

తా. కుంతి మంత్రమహిమచే ననుగ్రహించిన వాయువువలన నాకసమునుండి పుష్పవర్షము గురియుచుండఁగా బలవంతుఁడగు కుమారునిఁ గనెను.

"మనుగుణ." "గుణస్త్వావృత్తి శబ్దాదిజ్యేంద్రియాముఖ్యతంతుషు."

క. "అరిభీమనాముఁ డీతఁడు
కరమరుదుగఁగొనునృపాళిఁ గడునోడిచి మహా
సురులవధించున నేకుల,
దురమున నను విబుధసన్నుతులు వినఁబడియెన్." 70

**రామాయణ.** అరిభీమనాముఁడు = శత్రువులకు భయంకరమగు పేరుగలవాఁడు, ఈతఁడు = ఈరాముఁడు, నృపాళిన్ = రాజులసమూహమును, కడున్ = మిక్కిలి, ఒడిచి = జయించి, కరము = కప్పము, అరుదుగన్, కొనున్ = అరుదుగాఁ గైకొనును, దురమునన్ = యుద్ధమునందు, మహాసురులన్, అనేకులన్ = గొప్పయసురులం బెక్కుర, వధించున్ = సంహరించును, అని, విబుధసన్నుతులు = గొప్పవారి పొగడ్తలు, వినఁబడియెన్ = వినవచ్చెను.

తా. శత్రుభీకరుఁడగు నీరాముఁడు పెక్కురరాజులజయించి కప్పములు గొనఁగలవాఁడనియు, యుద్ధమున నసురులఁ బెక్కురఁ జంపఁగలవాఁడనియు గొప్పవారిచేఁ బొగడఁబడుచుండెను.

"ఒడిచి—" ఇది ఓడ్చు అనుదాని రూపాంతరము.

"దురము—" "అని చివ్వయేత్తెఱ యాలమువవరము, పోట్లాట పెనఁకువ పోరుకలను, కయ్యము దురముజగడమన యుద్ధాఖ్య, లమరున్." సాంబనిఘంటువు.

**భారత.** భీమనాముఁడు, భీముఁడనుపేరుగల, ఈతఁడు, కరము = మిక్కిలి, అరుదుగన్, నృపాళిన్, కడున్, ఒడిచి, అరిన్ = కప్పమును, కొనును. దురమునన్, అనేకులన్, మహాసురులన్, వధించును, అను, విబుధసన్నుతులు = దేవతల పొగడ్తలు, వినఁబడియెన్.

తా. భీముఁడనుపేరుగల యీతఁడు పెక్కురరాజులజయించి కప్పము గొనును, యుద్ధమున నసురులనేకుల జయించునని దేవతల పొగడ్తలు వినఁబడెను.

"అరి." "అరియనఁ గప్పంబనఁగాఁగరమునకుం బేళ్లు." ఆంధ్ర నామశేషము.

ఇట "అరి" యనుశబ్దమునకు సంస్కృతాంధ్రములంగల యర్థభేద మాధారము గావించికొని కవియుభయార్థ సంఘటన మొనర్చెను.

క. అమరనగరమున నపుడు
త్తమనీతివిచిత్రవీర్యకృతనయ జ్యేష్ఠ
త్వమునఁ దనరారు నృపస
త్తముని యతివ శతసుతాప్తిఁ దద్దయువెలసెన్. 71

రామాయణ. అమరనగరమునన్ = స్వర్గమునందు, అపుడు, ఉత్తమనీతిన్ = గొప్పనీతిచేతను, విచిత్రవీర్యతన్ = ఆశ్చర్యకరమగు పరాక్రమము గల్గియుండుటచేతను, అయజ్యేష్ఠత్వమునన్ = భాగ్యముచేనైన గొప్పతనముచేతను, తనరారు = ఒప్పుచుండు, నృపసత్తము = దశరథుని, నియతివశత, అదృష్టప్రాప్తి, సుతాప్తిన్ = కుమారుం బొందుటయందు, తద్దయున్ = మిక్కిలి, వెలసెన్.

తా. గొప్పనీతియుఁ బరాక్రమముగల్గి మహాభాగ్యవంతుఁడగు నా దశరథునకు సత్సంతానము గల్గుటచే దేవలోకమున దేవత లీతని ప్రతాపాదులఁ బొగడుచుండిరి.

భారత. అమరన్ = ఒప్పునట్లు, నగరమునన్ = హస్తినాపురమందు, అపుడు, ఉత్తమనీతిగల, (ఇదిగాంధారికి విశేషణము) విచిత్రవీర్యతనయ = విచిత్రవీర్యుని కుమారులలో, జ్యేష్ఠత్వమునన్ = పెద్దవాఁడగుటచే, తనరారు = నృపసత్తముని = ధృతరాష్ట్రుని యొక్క, అతివ = భార్య=గాంధారి, శతసుతాప్తిన్ = నూర్గురఁ బుత్రులఁ బడయుటచే, తద్దయున్ = వెలసెన్ = మిక్కిలి ప్రకాశించెను.

తా. అట హస్తినాపురమున గాంధారి నూర్గురుఁబుత్రులఁ బడయుటచే మిక్కిలి ప్రకాశించెను.

సీ. దుర్యోధనుండన ♦ దుశ్శాసనుండన
దుర్ధర్షణుండన ♦ దుర్ముఖుఁడన
నమరు వీరాదిగా ♦ నారూఢగాఢశౌ
ర్యప్రదీప్తులఘూక ♦ రణవిషణ్ణ
నానావిబుధనింద్య ♦ మానోదయులసద్వి
చారవివర్జితా ♦ చారు మతుల
విగణింపరాని దు ♦ ర్వృత్తి నధర్మపు
దశలపను లయూస్ప ♦ దంబు గాఁగఁ

గీ. జలుపఁగల వీతని యతుల ♦ సాహసాతి
శయసమున్నతు లనిశ్చిత ♦ శ్లాఘులగుచు
నార్య లబ్బాలు రసితభా ♦ వ్యర్థదృష్టి
నరసిమదిలోన నుర్ఘిుత వ్యసను లైరి. 72

**రామాయణ.** ఈతని యతుల సాహసాతిశయ సమున్నతులు = ఈ రాముని యొక్క సాటిలేని సాహసాతిశయములవలని గొప్పతనములు, దుర్యోధనుండనన్ = యుద్ధముచేయ శక్యముగాని వాఁడనియుం, దుశ్శాసనుండనన్ = దుష్టమైన యాజ్ఞ గలవాఁడనియు, దుర్ధర్షణుండనన్ = ఎదిరింపరానివాఁడనియు, దుర్ముఖుఁడనన్ = వదురుబోతనియు, అమరు = ఒప్పుచున్న, వీరాదిగాన్ = వీరినే మొదలుగాఁగల, ఆరూఢ = పొందినట్టి, గాఢ=దట్టమైన శౌర్య = పరాక్రమముచేత, ప్రదీప్తున్ = ప్రకాశించువానిని, లఘూకరణ= చులకనగాఁ జేయఁబడుటచే, విషణ్ణ = వ్యసనముచెందిన, నానావిబుధ = పెక్కుదేవతలచే, నింద్యమాన = దూషింపఁబడుచుండు, ఉదయున్ = పుట్టుకగలవానిని, లసత్ =ప్రకాశించుచుండు, విచార=ఆలోచనచే, వివర్జిత=

విడువఁబడిన, ఆచారున్ = ఆచారము గలవానిని, దురాచారుననుట. మతు లన్ = బుద్ధులచే, విగణింపరాని = ఎన్నఁదగని, దుర్వృత్తిన్ = దుర్వ ర్తనము గలవానిని, అధర్మపు=అధర్మములాచరించునట్టి, దశలపనున్ = దశముఖుని, రావణుననుట. లయాస్పదంబుగాఁగన్ = నాశమునకు స్థాన మగువానినిఁగా, చలుపఁగలవు = చేయఁగలవు, రావణుం జంపుననుట. అని, కృత = చేయఁబడిన, శ్లాఘులగుచున్ = స్తోత్రముగలవారగుచు, ఆర్యులు = గొప్పవారు, అబ్బాలునిన్ = ఆబాలుని, రాముననుట. రసిత= రసవంతముగాఁ జేయఁబడిన, భావ్యర్థదృష్టిన్ = భవిష్యదర్థమునందలి జ్ఞానమనెడు దీర్ఘదర్శిత్వముచేననుట. అరసి = తెలిసికొని, మదిలోనన్ = మనస్సులోన, ఉజ్ఝితవ్యసనులైరి, విడువఁబడిన వ్యసనముగలవారలైరి.

తా. ఈరాముని పరాక్రమము; యుద్ధముసేయ నశక్యమగునట్టియు, దుష్టశాసనముగల యట్టియు, నెదిరింపరానట్టియు, వదరుబోతగునట్టియు, వీరుల నాదిగాఁగల్గి, దట్టమగు పరాక్రమముచేఁ బ్రకాశించువానిని, దనచేఁ దృణీకృతులగు దేవతలచే నిందింపఁబడిన యుదయముగలవానిని, అనాచార వంతుని, తలఁపఁదగని చెడునడవడికలు గలవానిని, అధర్మమును బాలించు వానిని రావణునిఁ జంపఁగలఁడని యార్యులీతని భావికాల మెఱిఁగిస్తుతించుచు వ్యసనముదక్కిరి.

“ దశలపనున్.” ద్విగుబహు వ్రీహి.

“ లపనున్ — ” ‘ వక్త్రాస్యేవదనంతుండ, మాననంలపనంముఖం.’ అని యమరము.

భారత. దుర్యోధనుండనన్, దుశ్శాసనుండనన్, దుర్ధర్షణుండనన్, దుర్ముఖుండనన్, అమరు, వీరాదిగాన్=వీరలు మొదలుగా, ఆరూఢగాఢ శౌర్యప్రదీప్తులన్ = పొందినట్టి దట్టమగు పరాక్రమముచేఁ బ్రకాశించునట్టి వారిని, ఘూక, రణ = గుడ్లగూఁబల ధ్వనులచేత, విషణ్ణ=వ్యసనముచెందిన,

నానావిబుధ = పెక్కురు విద్వాంసుల చేత, నింద్యమానోదయులన్ = దూషింపఁబడుచున్న పుట్టువుగలవారిని, సద్విచార = మంచి వివేకము తోడ, వివర్జిత = విడువఁబడిన, ఆచారు = ఒప్పిదముగాని, మతులన్ = బుద్ధులుకలవారిని, విగణింపరాని, దుర్వృత్తిన్ = దుష్ప్రవర్తనమున, అధర్మప్రదశల, పనుల = పాపదశలను జెందినకార్యములకు, ఆస్పదంబు గాఁగన్ = ఆధారమగునట్లుగా, చలుపఁగల = చేయఁదగిన, వీత = వీడిన నియతులన్ = నియమనుుగలవారిని, సాహస = తెగువపనులయొక్క, అతిశయ = ఆధిక్యముచే, సమున్నతులన్ = గొప్పతినము చెందినవారిని, అబ్బాలురన్ = దుర్యోధనాదులగు నాబాలురను, ఆర్యులు = గొప్ప వారు, దైవజ్ఞులనుట. సిత = శుద్ధమైన, భావ్యర్థదృష్టిని, అరసి = రాఁబోవు దశలంగూర్చి జాతకములుచూచి, నికృతశ్లాఘులగుచున్ = దూషించుచు, మదిలోన్ = మనస్సులో, అనుత = విడువఁబడని, వ్యసనులైరి = దుఃఖము గలవారైరి.

తా. దుర్యోధన దుశ్శాసన దుర్ధర్షణ దుర్ముఖాదులగు శౌర్య ప్రదీప్తులు జనింపఁగనే గుడ్లగూఁబలు మున్నగువవి ధ్వనించుటచేఁబండితులు మున్నగువారు దూషించిరి. జ్ఞానహీనులై, దుర్వృత్తిచే నధర్మకార్యముల కునికిపట్టగు నట్టిపనులఁజేయఁగల నీతిరహితులై, తెగువపనులు చేయఁగల యీ దుర్యోధనాది బాలుర జాతకములుచూచి దైవజ్ఞులుదూషించుచు మనసులోననే దుఃఖించిరి.

"చలుపఁగలవు" ఈ కవియిట్లే తఱుచుగాఁ బ్రయోగించుటచే, 'సలుపు, చలుపు' అను రెండువిధములలో నీతనికి "చలుపు" అను ప్రయోగ మునందే ప్రీతి యధికమనుట విశదమగుచున్నది.

"ఘూకరణ."—"రణఃకోణక్వణాదిషు." విశ్వము.

క. వెండియుఁ బతికోర్కి పొదల
రెండవసతి యనవరగుణ రేఖఁ దనరుచున్
గండెసఁగెడు సుతరత్నము
పాండురమణి శుక్తిపోలెఁ బడసె హరికృపన్. 72

**రామాయణ.** వెండియున్ = మఱియును, పతికోర్కి, భర్త యొక్క యపేక్ష, పుత్రవాంఛయనుట, పొదలన్ = ఫలించులాగున, రెండవసతి = కైకేయి, అనవర, గుణరేఖన్ = తగనట్టి గుణపరంపరచే, తనరుచున్=ఒప్పుచు, గండేసఁగెడు = మగఁటిమిచేఁ బ్రకాశించెడు, సుత రత్నమున్=పుత్రశ్రేష్ఠుని, పాండు రమణిన్ = ముత్తెమును, శుక్తిపోలెన్= ముత్తెపుచిప్పయట్లు, హరికృపన్=విష్ణునను గ్రహమున, పడసెన్=పొందెను.

తా. దశరథుని మనస్సు సంతసించులాగునఁ గైకేయి సద్గుణ పరంపరచే నొప్పుచు, శుక్తిముత్తెమునువలె భగవంతుని దయచేనిందు మగఁటిమి గల కుమారుం బొందెను.

ఈ యర్థమున "అనవరగుణ" అనఁగా; "పరానభవతీత్యపరా, అపరానభవ తీత్యనవరా. అనవరాచసాగుణ రేఖాచ," నఞ్ ద్వితయముఁగల్గు చున్నది.

అలంకారము. ఉపమానము. "పాండుర మణి శుక్తిపోలెన్" ఇది యుపమాన వాక్యము.

భారత.—వెండియున్, పతికోర్కి, పొదలన్, రెండవసతియనన్= రెండవగారి యాయనులాగున, వరగుణరేఖన్, తనరుమన్, పాండురమణి= పాండురాజుభార్య, కుంతియనుట. సుతరత్నమున్, హరికృపన్ = ఇంద్రు నను గ్రహముచే, శుక్తిపోలెన్ = పడసెన్.

తా. భర్తకు సంతోషము గల్గులాగునఁగుంతి యింద్రుని దయచే ముత్తెపు చిప్పవలె నొకపుత్రశ్రేష్ఠుని గనియెను.

"రెండియున్" క్రమమ్మనుమతి, మగుడ రెండియుఁ బలుమఱు" సాంబనిఘంటువు.

అలంకారము. ఉత్ప్రేక్ష, "రెండవ సతియనన్."

క. భూకాంతుమన్ననలు గడుఁ
జేకుఱ నాముదితబుధరచితనుతి భరతుం
గైక మహావీరత్వా
స్తోకునినర్జునసమాఖ్యుఁ సుతుఁగనియలరెన్. 73

రామాయణ. కైక = కైకేయి, భూకాంతు మన్ననలు = దశరథునివలని గౌరవములు, కడున్ = మిక్కిలి, చేకుఱన్ = కలుగఁగా, ఆముదిత = మిక్కిలి సంతోషించిన, బుధ = పండితులచే, రచిత = చేయఁబడిన, నుతిన్ = స్తోత్రముగల్గిన, భరతున్=భరతుఁడను పేరుగలవానిని, మహావీరత్వ = గొప్పవీరుఁడగుటచే, అస్తోకునిన్=గొప్పవాని, అర్జున= శుభ్రమైన, సమాఖ్యున్ = కీర్తిగలవానిని, సుతున్, కని, అలరెన్ = సంతోషించెను.

తా. కైకేయి, పండితులచేఁ గొనియాడఁబడి బలశాలియై కీర్తిమంతుఁడగువాని భరతుఁడను కుమారునిం గనెను.

భారత. ఆముదిత=ఆస్త్రీ, కుంతియనుట. భూకాంతుమన్ననలు, కడున్, చేకుఱన్, బుధరచిత = పండితులచేఁ జేయఁబడిన, నుతిభర = స్తోత్రాతిశయముచేత, తుంగ = ఘనమై, ఏక = ముఖ్యమగు, మహావీరత్వ, అస్తోకుని, అర్జునసమాఖ్యున్ = అర్జునుఁడను పేరుగలవానిని, సుతున్, కని, అలరెన్ = సంతోషించెను.

తా. కుంతి పండితులచే నుతింపఁబడుటచే ఘనమగు మహావీరత్వమున గొప్ప వాఁడగు నర్జునుఁడను పుత్రునిఁ గాంచిసంతసించెను.

సీ. ఇవ్విధంబునఁ గాంచి | హృదయేశు మన్ననఁ
బెనుచుచునుండ న | బ్జసరుహాక్షి
కౌండోకసవతియుఁ | గురుతరధర్మర
క్షణశీలత న్మను | గుణవిధేయ
రక్షోరివైద్యవ | రప్రాప్తరూపుల
లక్ష్మణశత్రుఘ్ను | లనుగరంబు
వినయసౌభ్రాత్రాది | ఘనతరసుగుణరే
ఖను మించు తనయులఁ | గవలఁ గనియె

గీ. నొప్పమీఱ నాసత్యవీ | ర్యోదయులగు
నట్టి చతురాత్మజులు సురూ | పాభిరాము
లై నకులసహదేవప | దాతివిశ్రు
తాత్మవర్తనులై మించి | రవనిలోన. 74

**రామాయణ.** ఇవ్విధంబునన్ = ఈ లాగున, కాంచి = పుత్రుని బొంది, హృదయేశుమన్ననను = దశరథుని గౌరవమును, పెనుచుచునుండన్ = పెంచుచుండఁగా, అబ్జసరుహాక్షి = ఆతామరవంటి కన్నులుగల కైకేయి యొక్క, కౌండోక = వేఱొక, సవతియు, సుమిత్రయు, గురుతర = మిక్కిలి గొప్పదగు, ధర్మరక్షణశీలతన్ = ధర్మమును రక్షించునట్టి స్వభావముచేత, మను = ఒప్పుచున్న, గుణ = గుణములకు, విధేయ = వశురాలు, రక్షోరివైద్య = దేవవైద్యులగు నశ్వినీదేవతల కంటె, పర = శ్రేష్ఠమానట్లుగా, ప్రాప్తరూపులన్ = సౌందర్యముగల వారిని, లక్ష్మణశత్రుఘ్నులు, అను, కరంబు = మిక్కిలి, వినయ... రేఖను - వినయ = అడఁకువయు, సౌభ్రాత్ర = మంచి భ్రాతృభావమును, ఆది= మొదలుగాఁగల, ఘనతర = మిక్కిలి గొప్పవగు, సుగుణ = మంచి గుణముల యొక్క, రేఖను= పరంపరచే, మించు = అతిశయించు, తనయులన్ = కుమారులను,

కవలన్ = అమడలను, కనియెన్ = కనెను, ఒప్పుమీఱన్, అసత్య = మిక్కుటమగుసత్యమునకును, వీర్య=పరాక్రమమునకును,ఉదయులు, అగునట్టి=స్థానములగునట్టి, చతురాత్మజులు = నల్గురు కుమారులును, సురూప = మంచి రూపముచే, అభిరాములు = అందమైన వారు, ఇనకుల = సూర్యకులము నకు, సహ = తగిన, దేవపద = స్వర్గము వఱకును, అతివిశ్రుత = మిక్కిలి ఖ్యాతిగాంచిన, ఆత్మ=తమయొక్క, వర్తనులై = నడవడిక గలవారై, అవనిలోనన్ = భూమియందు, మించిరి = అతిశయించిరి.

తా. కైకేయి దశరథునియొక్క ప్రేమయతిశయించు చుండఁగా, నామెయొక్క సపత్నియైన సుమిత్ర, యశ్వినీ దేవతలకంటె శ్రేష్ఠమగు రూపముగల వారిని, లక్ష్మణశత్రుఘ్నులను నట్టి, అడఁకువ, భ్రాతృభావము మున్నగు గుణములతోఁ గూడినకవలను గనియెను. మిక్కిలి సత్యము నకును శౌర్యమునకును స్థానమగునట్టి యానల్వురు కుమారులును మంచి రూపముగలవారై, సూర్యకులమునకుఁ దగినట్లు స్వర్గమువఱకు వ్యాపించిన మంచి గుణములు గలవారై మించి యుండిరి.

"ప్రాప్తరూప." "ప్రాప్తరూప సురూపాభి రూపా బుధమనోజ్ఞయోః" అని యమరము.

భారత. ఇవ్విధంబునన్, కాంచి, హృదయేశుమన్ననన్, పెనుచు చుండు, అబ్జసరుహాక్షి = ఆ తామరవంటికన్నులుగల కుంతియొక్క, ఒండొక సవతియు = మాద్రియు, గురుతర = మిక్కిలి గొప్పదగు, ధర్మ రక్షణశీల = ధర్మరక్షణమను స్వభావముగల, తత్, ఆ, మనుగుణ=మంత్ర జపమునకు, విధేయ=పరవశులగు,రక్షోరివైద్య=ఆశ్వినీ దేవతలయొక్క, వర, ప్రాప్తరూపులన్ = వరముచేఁ బొందఁబడిన రూపముగల వారిని,లక్ష్మణ= లక్ష్మి యుక్తులగు వారిని, శత్రుఘ్నులను = శత్రువుల సంహారించు వారిని, వినయ, సౌభ్రాత్రాది ఘనతరగుణరేఖను, మించు శ నయులన్, కవలన్= అమడలను, కనియెన్, ఒప్పు మీఱన్, నాసత్య ఆశ్వినీ దేవతలయొక్క,

వీర్యోదయు లగునట్టి = అంశచేనుదయించినట్టి, చతుర=సమర్థులైన, ఆత్మ జులు = కుమారులు, సురూపాభిరాములై, నకుల, సహదేవ, పద = నకులుఁడు, సహదేవుఁడు, అనుపదములచే, అతివిశ్రుత = మిక్కిలి ఖ్యాతిని బొందిన, ఆత్మవర్తనులై, అవనిలోనఁ, మించిరి.

తా. ఈలాగునఁ బుత్రులఁగని పాండురాజుమనస్సు సంతోషపెట్టుచుండిన కుంతియొక్క వేఱొక సవతిమాద్రి, యామంత్రజపమున వశులైన యశ్వినీ దేవతల వరముచేఁ గల్గినట్టివారును, మంచిరూపము శత్రుసంహారము సేయుట మున్నగు సద్గుణములు గలవారునునై, వినయాది గుణములచే నొప్పుచునున్న కవలఁగనియెను. అశ్వినీదేవతల యనుగ్రహమునఁ బుట్టినవీరు నకుల సహదేవనామములు గలవారై, భూమిలో మించి యుండిరి.

"బిస—" "బిస్యంతే భక్షణసమయే తంతవోఽత్రబిసం." అనివ్యుత్పత్తి "బిస ఉత్సర్గే" అను ధాతువు వలనఁగలైను.

బిసరుహాక్షి = ఉపమాన బహువ్రీహి.

"నాసత్యా—" "నాసత్యావశ్వినౌ దస్రౌ." అని యమరము.

శా. ప్రాలేయాంశువతంససన్నిహితపంపావాతశైత్యౌచితీ
లీలాగూఢనిగాఢరూఢ పులకా శ్లీహేతుహార్దోదయ
స్థూలంభావుక శైలరాజతనయా దోర్దండనిష్పీడనో
ద్వేలోర్ధ్వస్రుతచిత్తరాగలహరీ ధిక్కృజ్జటామండలా. 75

అవతారిక. ఈపద్యమునను ముందుపద్యమునను నీగ్రంథమునందలి కృతిపతియగు విరూపాక్షస్వామిని గవివర్ణించు చున్నాఁడు.

అ. ప్రాలేయ, అంశు, వతంస = చంద్రుని శిరోభూషణముగాఁ జేసికొనినవాఁడా, సన్నిహిత...మండలా - సన్నిహిత = సమీపించియున్న, పంపావాత = పంపానదియందలి గాలియొక్క, శైత్య = చల్లతనము యొక్క, ఔచితీ = ఉచితత్వముచే, లీలా = విహారమందు, గూఢ =

గుప్తమాలాగున, నిగాఢ, రూఢ = మిక్కుటముగాఁ బుట్టిన, పులకాళీ= పులకాంకురసమూహమే, హేతు = కారణముగాఁగల, హార్ద, ఉదయ= ప్రేమయొక్క, పుట్టుకచే, స్థూలంభావుక = ఉప్పొంగుచున్న, శైలరాజ తనయా = పార్వతీదేవియొక్క, దోర్దండనిష్పీడన = గాఢాలింగనము వలన, ఉద్వేల = అతిశయించిన, ఊర్ధ్వప్రసృత = పొడవుగానిగిడిన, చిత్త = హృదయమునందుఁగల, రాగలహరీ = అనురాగప్రవాహమనెడి, ధీకృత్ = బుద్ధినిఁగలుగఁజేయుచున్న, జటామండలా.

తా. చంద్రశేఖరుఁడా, పంపావాతములే కారణములుగా నుద యించిన రోమాంచముకతన నతిశయితప్రేమయగు పార్వతిచేఁ గౌఁగిలించు కొనఁబడుటవలనఁ బైకినిగిడినయనురాగ ప్రవాహమాయనఁ దోఁపించు జటల సమూహము గలవాఁడా.

"హార్ద"—"ప్రేమానాప్రియతా హార్దం." అని యమరము.

అలంకారము—ఉత్ప్రేక్ష.

క. మూర్తిత్రయధృతి లీలా
వర్తిత నానాజగద్భ వస్థితి లయ ని
ర్వర్తన, సజ్జనసుకృతవి
వర్తాయిత దివ్యదేహ వారితమోహా. 76

అ. మూర్తిత్రయ...నిర్వర్తన - మూర్తిత్రయ = త్రిమూర్తిరూపము యొక్క, ధృతి = ధరించుట యనెడి, లీలా = విలాసముచేత, వర్తిత = చేయఁబడిన, నానాజగత్ = పెక్కుజగములయొక్క, భవ, స్థితి, లయ=పుట్టుకయొక్కయు, నునికియొక్కయు, నాశముయొక్కయు, నిర్వ ర్తన=ప్రచారముగలవాఁడా, సజ్జన ...... దివ్యదేహ - సజ్జన=సత్పురుషుల యొక్క, సుకృత = పుణ్యముయొక్క, వివర్తాయిత = వినిమయరూప మగుచున్న, దివ్యదేహ = రమ్యస్వరూపముగలవాఁడా, [పుణ్యవంతులకు

సారూప్య మొసఁగు వాఁడాయనిభావము.] వారిత = పోఁగొట్టఁబడిన మోహా =భక్తుల యజ్ఞానముగలవాఁడా.

తా. త్రిమూర్తిస్వరూపుఁడవై లోకములయొక్క సృష్టి స్థితి సంహారములు చేయువాఁడా, సత్పురుషుల సుకృతముయొక్క విని మయరూపమైన దివ్యస్వరూపముగలవాఁడా, భక్తులమోహమును బోఁగొట్టువాఁడా.

మాలిని. ప్రథమతమవచోఽంత ప్రస్ఫుట బ్రహ్మవిద్యా
పథపథికవిపశ్చి ద్భావవిశ్రామసీమా
పృథుచిదమృతధారా భీక్ష్ణసిక్తాకువీటి
ప్రథితతిరుమలక్ష్మా పత్యపత్యాగ్రజన్మా. 77

గద్యము. ఇది నిఖిలసూరి లోకాంగీకార కవిత్వవైభవ,
యమరనార్య తనూభవ, సౌజన్యజేయ, సూరయ
నామధేయ ప్రణీతంబైన, రాఘవపాండ
వీయంబునందుఁ బ్రథమాశ్వాసము.

అవతారిక. ఈ పద్యముచేఁ బ్రత్యక్షనియామకుఁడగు పెదవేంకటాద్రి ప్రభువునుగూడఁ జేర్చుచు విరూపాక్షుని వర్ణించుచున్నాఁడు.

అ. ప్రథమ .........సీమా—ప్రథమతమవచోంత=వేదాంతములయందు, ప్రస్ఫుట = చక్కఁగాఁ దెలియఁబడిన, బ్రహ్మవిద్యాపథ = బ్రహ్మజ్ఞానమార్గమునకు, పథిక=బాటసారియైన, విపశ్చిత్ = జ్ఞానవంతులయొక్క, భావ = మానసమును, విశ్రామసీమా = విశ్రమప్రదేశముగానునిచికొనినవాఁడా, పృథు = అధికమైన, చిత్ = జ్ఞానమనెడి, అమృతధారా = అమృతధారచే, అభీక్ష్ణ = నిరంతరమును, సిక్త = అభిషిక్తుఁడైన, అకువీటిప్రథిత తిరుమలక్ష్మాపతి = అకువీటి తిరుమలరాజుయొక్క, అపత్యాగ్రజన్మా = పెద్దకుమారుఁడైన పెదవేంకటాద్రిని గలవాఁడా.

తా. వేదాంతమార్గములఁ జనుచున్న విద్వాంసుల భావములను విశ్రమస్థానముగాఁ గలవాఁడా, జ్ఞానామృతధారలచే నభిషిక్తుఁడగు నాకువీటి పెదవేంకటాద్రిని గలవాఁడా.

"విపశ్చిత్" "విద్వాన్విపశ్చిద్దోషజ్ఞః" అని యమరము.

"విశ్రామ" ఇట "మితాంహ్రస్వః" అను సూత్రము చొప్పున హ్రస్వముగాఁగా విశ్రమమని యుండవలయునని కొందఱభిప్రాయపడెదరు కాని,విశ్రామయనుటకు; "తమృషిం మనుష్యలోక విశ్రామశాఖినం." అని మురారియు; "విశ్రామంలభతామిదంచ శిథిలజ్యాబంధ మస్మద్ధనుః" అని కాళిదాసుఁడును బ్రయోగించియున్నారు. కాఁబట్టి యిదిసాధురూపమే యగును.

పై మూఁడు పద్యములును నాశ్వాసాంతరూపములు. వీనికి గ్రంథముతో నేలాటి సంబంధమునులేదు. మాలినీలక్షణము. "న, న, మ,య,య. యుతేయం మాలినీభోగిలోకే." వృత్తరత్నాకరము.

గద్యము. ఇది శ్రీహయగ్రీవకరుణాపలబ్ధసారస్వతసారో, భయ
భాషాకవిత్వ తత్త్వజ్ఞ, చెన్నపురీ విశ్వవిద్యాలయ సమా
సాదిత విద్వద్బిరుదాంచిత, కవికులతిలక,భారద్వాజ
గోత్రపవిత్ర, శ్రీ శ్రీనివాసార్యతనూజ, మంగ
మాంబాగర్భశుక్తి ముక్తాఫల, భాష్యకార
కవివిరచితంబైన, కవిభావ ప్రకాశికాస
మాఖ్యంబగు రాఘవపాండవీయవ్యాఖ్య
యందుఁ బ్రథమాశ్వాసము.

శ్రీ ర స్తు.

# రాఘవపాండవీయము.

## ద్వితీయాశ్వాసము.



శ్రీపంపాసరసక్రీ
డా పండిత ! పెద్దవేఙ్కటక్ష్మాపతిచి
త్తోపాసితపద ! ప్రత్య
గ్రూప! విరూపాక్ష! హేమకూటాధ్యక్షా. 1

అ. శ్రీ ... పండిత - శ్రీ = సంపత్కరమైన, పంపా = పంపానది యందు, సరసక్రీడా = సరసమగు, జలవిహారమునందు, పండిత = పాండిత్యముగలవాఁడా, పెద్ద...పద - పెద్దవేంకట క్ష్మాపతి = పెద్దవేంకటరాజుయొక్క చిత్తోపాసితపద = మనస్సుచే ధ్యానముసేయఁబడిన పాదములు గలవాఁడా, ప్రత్యగ్రూప = తనకొఱకుఁ దానేప్రకాశించువాఁడా, హేమకూటాధ్యక్షా=హేమకూటపర్వతమున కధిపతియగువాఁడా, విరూపాక్షా = విరూపాక్షస్వామీ, అవధరింపుమని యధ్యాహార్యము.

"పంపాసరసక్రీడా"—ఇటరసయుక్తమగు క్రీడయగుటచేఁ బార్వతితో నాతఁడు జలవిహార మొనర్చుచుండుననుట సూచితము.

"పండిత"—"పండతే జానాతీతిపండితః. సర్వేగత్యర్థాః జ్ఞానార్థాః. పండా ధీరస్య సంజాతావాపండితః" గురు బాల ప్రబోధిక.

"ప్రత్యగ్రూప" ... "స్వస్మై స్వయం భాసమానత్వం ప్రత్యక్త్వం పరస్మై స్వయం భాసమానత్వం పరాక్త్వ" మ్మని వేదాంత సంప్రదాయము.

క. దేవాంశభవులఁ బుత్రుల
 నీవిధమునఁ బడసి ముదితహృదయుఁడగుచు ధా
 త్రీవరుఁడు పెనుచుచుండె య
 థావిధి సంస్క్రియలు మునికదంబము నడుపన్. 2

రామాయణ.——దేవ ... సంభవులన్ - దేవ=విష్ణువుయొక్క అంశ సంభవులన్=అంశచే జనించినవారలను, పుత్రులన్=కుమారులను, రామ భరతలక్ష్మణ శత్రుఘ్నులననుట. ఈ విధమునన్, పడసి = పొంది, ముని=ఋషులయొక్క, కదంబము = సమూహము, యథావిధిన్ = శాస్త్రప్రకారముగా, సంస్క్రియలు = జాతకర్మాదిసంస్కారవిశేషములు, నడుపన్, ముదితహృదయుఁడు, అగుచున్ = సంతుష్ట మనస్కుఁడగుచు, ధాత్రీవరుఁడు = రాజు, దశరథుఁ డనుట. ఆబాలకులు నలువురను, పెనుచుచుండెన్ = పెంచుచుండెను.

తా. విష్ణునంశచే జనించిన రామ భరత లక్ష్మణ శత్రుఘ్నులకు వసిష్ఠాది మహర్షులు జాతకర్మాది సంస్కారములు చేయుచుండ నత్యంత సంతుష్టుఁడై దశరథుఁడుండెను.

రామభరతలక్ష్మణశత్రుఘ్నులు విష్ణ్వంశనుదయించిరనుటకు రామాయణమున "తతః పద్మపలాశాక్షః, కృత్వాత్మానంచతుర్విధం। పితరం రోచయామాస, తదాదశరథం నృపం" అని ప్రమాణము గలదు.

"కదంబ" — "అదంతః, క్లీబే, సమూహః" శబ్దార్థకల్పతరువు.

• భారత.——దేవ = యమ వాయు దేవేంద్రాశ్వినేయుల, అంశభవులన్, పుత్రులన్=కుమారులను, ధర్మజ భీమార్జున నకులసహదేవుల

ననుట. ఈవిధమునన్, పడసి, మునికదంబము = అచ్చటఁగల మహర్షుల సమూహము, యథావిధి, సంస్క్రియలు, నడుపన్ = చేయఁగా, ముదిత హృదయుఁడై, ధాత్రీవరుఁడు = రాజు, పాండురాజనుట. ఆబాలకుల నేవు రను, పెనుచుచుండెను.

తా. యమాదుల యంశచేఁ గల్గిన ధర్మజాదుల కచ్చటి మహర్షులు జాతకర్మాది సంస్కారములు చేయఁబాండు రాజత్యంత సంతుష్టుఁడై పెల యుచుండెను.

సీ. నానాఁటి కుప్పొంగుకినవకంపుఁ గళల పెం
పునఁ జిన్ని క్రొన్నెలకిబోద లనఁగ
నుత్తరోత్తరవృద్ధి కినొప్పు తేజోరేఖ
పసఁగోమలార్కబింకిబంబు లనఁగఁ
గ్రొత్తక్రొత్తగఁ బొదల్ కి గొమరునెమ్మేనుల
బలుపుష్టిఁ గరికలకిభంబు లనఁగ
నంతకంతకు మించుకివింతమగంటిమి
యుదుటున సింగంపుఁకిగొదమ లనఁగ

గీ. వెలసి రిలను ధర్మజభీమకివిజయు లనఁగఁ
గ్రాలునృపనుతుల్ దమలోనఁ కి గవలుగూడి
మనసుమైత్రిచే రామలకిక్ష్మణచరితము
ననయ భరతశత్రుఘ్న ఖేకిలనము మెఱయ. 8

ఈ పద్యమున ముందు నాలుగుపాదములలోను రామాయణ భార తార్థములు సమము.

అ. నానాఁటికిన్ = దినదినమునకు, ఉప్పొంగు = అతిశయించు, నవకంపు = మృదువైన, కళల = కాంతివిశేషములయొక్క, పెంపునన్ = అభివృద్ధిచే, చిన్ని = అందమగు, క్రొన్నెల బోదలు = నూత్నబాలచం

ద్రులు, అనఁగన్, ఉత్తరోత్తరవృద్ధిన్ = పైపై నభివృద్ధియగుటచే, ఒప్పు, తేజోరేఖ, పసన్ = సమృద్ధిచే, కోమల = సుకుమారములగు, అర్కబింబంబులనఁగన్ = సూర్యబింబములు అనులాగున, క్రొత్తక్రొత్తగన్, పొదల్ = ప్రకాశించునట్టి, కొమరు = అందమైన, నెమ్మేనుల, బలుపుష్టిన్ = శరీరముల పుష్టిచేత, కరికలభంబులు = ఏనుఁగు గున్నలు, అనఁగన్, అంతకంతకున్, మించు = అతిశయించు, వింత = ఆశ్చర్యమగు, మగంటిమి = పరాక్రమముయొక్క, ఉదుటునన్ = దృఢత్వముచే, సింగంపుఁగొదమలు = బాలసింహములు, అనఁగన్.

తా. నానాఁటికి వృద్ధినందు మృదువగు కాంతివిశేషమున బాలచంద్రులన లాగునఁదోఁచుచు, అప్పటప్పటి కభివృద్ధమగు తేజోవిశేషముచే బాలసూర్యులా యనులాగున గోచరించుచు, నూత్ననూత్నముగాఁ బ్రవృద్ధమగు శరీరపుష్టిచే నేనుఁగు గున్నలా యనులాగున స్ఫురించుచు, నంతకంతకతిశయించు పరాక్రమాతిశయమున సింహకిశోరములా యనులాగునఁదోఁచుచు; నా బాలురు వెలసిరని పై యెత్తుగీతితో నన్వయము.

"కళ" "అంశమాత్రే మూలవృద్ధౌ సుషుమావిద్యయోస్తథా" అని యమరశేషము.

"చిన్ని" యనుటకు "మన యశోద చిన్నిమగవానిఁ గనెనఁట" యని పోతనామాత్యుని ప్రయోగముగలదు.

"ఉదుటునన్" "చేగయూఁట యుదుటుచేవ యుఱవులిగువన దృఢత్వముపేరులు" సాంబనిఘంటువు.

"సింగంపుఁగొదములు" కర్మధారయము నందలి ముపర్ణమునకే కాకషష్ఠీసమాసము నందలి ముపర్ణమునకును బుంపులగు ననుటకిది ప్రబలోదాహరణము.

ఇంతవఱకును నొక్కొకపాదమునందునుత్ప్రేక్షాలంకారము. మఱియు నిందుల్లేఖాలంకారమును జమత్కారముగఁ గూర్పఁబడెను. "బహుభిర్బహుధోల్లేఖా దుల్లేఖాలంకారః" కువలయానందము.

*    *    *    *

ఇంక నేత్రగీతిలో రామాయణ భారతార్థములు ప్రత్యేకము.

రామాయణ.—ఇలను = భూమియందు, ధర్మజ = వింటివలనఁబుట్టిన, భీమ = భయంకరములైన, విజయులు = జయముగలవారు, అనఁగన్, క్రాలు = ప్రకాశించు, నృపసుతుల్=రాజపుత్రులు, రామభరతలక్ష్మణ శత్రుఘ్నులనుట. తమలోనన్, కవలుకూడి = జోడుగూడికొని, మనన్ = సుమైత్రిచేన్ = మిక్కిలి స్నేహముచే, రామలక్ష్మణ, చరితము= నడవడిక, సనయ = నీతితోఁగూడిన, భరతశత్రుఘ్న, ఖేలనముల్ = విహారములును, మెఱయన్, వెలసిరి = ప్రకాశించిరి.

తా. ధనుర్ధామలకమగు భీకరవిజయము గలవారయి యారాజకుమారులు నల్వురుండ వారిలో స్నేహాతిశయమున రామలక్ష్మణులును, భరతశత్రుఘ్నులు నొకటిగఁజేరి యుండిరి.

"ధర్మ" ధర్మఃపుణ్యే యమే న్యాయే స్వభావాచారయోః క్రతౌ।
ఉపమాయా మహింసాయాం చాపేచోప నిషద్యపి" విశ్వము.

ఇట ముద్దరాజు రామన్న "మనసుమైత్రిచే=మనసుయొక్క మైత్రిచే" వని యర్థముగావించెనుగాని యిట్టి మిశ్రమునకంటె, మనన్, సుమైత్రిచే ననుట యెంతయు సమంజసము.

భారత.—ఇలను, ధర్మజ = భీమ, విజయులు, అనఁగన్ = ధర్మపుత్ర భీమార్జునులను నట్లు క్రాలు, నృపసుతుల్=రాజపుత్రులు, కౌంతేయులగు పైమూవురును, తమలోనన్, కవలు = అమడలు = మాద్రేయులగు నకులసహదేవులు, కూడి, సుమైత్రిచేన్=అత్యంతస్నేహముచే, మనన్, రామ=మనోహరమైన, లక్ష్మణ = లక్ష్మియుక్తమైన, చరితముల్ = చరిత్రమును, సనయభరతన్ = నీత్యతిశయముతోఁగూడిన వారగుటచే, శత్రుఘ్న ఖేలనము = శత్రుసంహారరూప విహారము, మెఱయన్, వెలసిరి.

తా. ధర్మపుత్రభీమార్జునులు నకుల సహదేవులతోఁగూడి యత్యంత స్నేహముగల్గి, సచ్చరితులగుచు, నీతిసంయుక్తులగుచు, శత్రుసంహారరూప విహారమునఁ బ్రకాశించుచుండిరి.

ఉ. అంత వసంత మొప్పెఁ; జరమాగ్రిమభాగచరాఖిలర్తుసా
మంతమనంతజాలకసమంజసరంజితకుంజకుంజరో
ద్భ్రాంతనితాంతసాంద్రమధుదానవిజృంభితబంభరస్వనా
త్యంతనిరంతరీకృత దిగంతమతాంత లతాంతకుంతమై. 4

రామాయణ భారతార్థములు సమము.

అ. అంతక = ఆవల, చరమ, అగ్రిమ, భాగ = పశ్చిమ, పూర్వ, దిగ్భాగములయందు, చర = వర్తించుచున్న, అఖిలర్తు = సర్వర్తువులను, సామంతము = సరిహొరలుగాఁగలది, సర్వర్తు సౌభాగ్యముగలదనుట. అనంత......దిగంతము-అనంత = కడలేని. ఎక్కుడగుననుట. జాలక = మొగ్గలచే, సమంజస = యుక్తమగునట్లుగా, రంజిత = ఒప్పిన, కుంజ = పొదలనెడి, కుంజర = ఏనుఁగులనుండి, ఉద్భ్రాంత = వెడలివచ్చుచుండు, నితాంతసాంద్ర = మిక్కిలిదట్టమైన, మధు = మకరందమనెడి, దాన = మదజలముచే, విజృంభిత = గర్వించిన, బంభర = తుమ్మెదలయొక్క, స్వన = ధ్వనిచే, అత్యంత = మిక్కిలి, నిరంతరీకృత = దట్టముగాఁజేయఁబడిన, దిగంతము = దిక్కులకొనలుగలది, అతాంత...కుంతమై-అతాంత = అలయికలేని, లతాంతకుంతమై = పుష్పబాణుని (మన్మథుని) గలదై, వసంతము = వసంతర్తువు, ఒప్పెక.

తా. పూర్వాపర దిగ్భాగములలోనుండు సమస్తర్తువులను సామంతరాజులుగాఁగలదియుఁ, బెక్కుమొగ్గలుగల పొదరిండ్లనెడి యేనుఁగులవలన నుండి వెలివచ్చుచున్న మకరందమనెడి మదజలము గ్రోలుటచే గర్వించిన తుమ్మెదల ధ్వనులచే నెల్లప్పుడు దట్టముగాఁ జేయఁబడిన దిక్కులుకలదగుచు, నలయికలేని మన్మథునిగలదియునగుచు వసంతర్తు వొప్పెను.

"జాలక" "క్షారకోజాలకంక్లీబే" అనియమరము.

"మధు" "మధుమద్యే పుష్పరసే" అనియమరము.

"దాన" "దానం గజమదేత్యాగే శుద్ధిఖండనయోరపి" నానార్థ రత్నమాల.

"బంభర" "ఇందిందిరశ్చంచరీకో రోలంబోబంభరశ్చసః." అని యమరము,

"కుంజరోద్వాంత." ఇటవాంతశబ్దము; "నిష్ఠ్యూతోద్గీర్ణ వాంతాది, గౌణవృత్తివ్యపాశ్రయం, అతి సుందరమన్యత్ర, గ్రామ్యకక్షాం విగాహతే." అని దండిమతమున గ్రామ్యమేయైనను బలువురిట్టి ప్రయోగము లంగీక రించుటచే నిది సాధువయగును.

"నిష్ఠ్యూతశ్చరణో పభోగసులభోలాక్షారసః; కేనచిత్" అని కాళి దాస ప్రయోగము.

"కుంజకుంజర...... బంభరము." అనునంతవఱకు యథాసంఖ్యాను ప్రాణితమగు రూపకాలంకారము.

సీ. అచ్ఛంపులేఁజిగుర్రాకు జొంపముకెంపు
మేలిచెందిరపుఁగెంర్ధూళి గాఁగ
గ్రుచ్చినట్లుగఁ బొదుర్కొన్న మొగ్గలగుంపు
ప్రకటపాటలబిందుర్పాళి గాఁగ
విచ్చిన పరువంపుర్విరులతండము వెంపు
శోభితభూతిరింర్భోళి గాఁగ
నిచ్చలం బైన తేర్నియవానజడిసొంపు
లాలితదానధార్రాళి గాఁగ

గీ. సుమపరాగము కేళిపాంర్సువునుగాఁగ
భ్రమరపఙ్క్తులు పైసరర్పణులు గాఁగఁ

బుడమి నెల్లెడ వాహ్యాళిఁ వెడలుమదను
మదపుటేనుఁగుఁబోలెనాఁకమని దనర్చె. 5

అవతారిక. ఈపద్యమున వసంతమును మదపుటేనుఁగుతో సరి పోల్చి వసంతర్తుధర్మములను గజశృంగారములుగా వర్ణించెను.

రామాయణ భారతార్థములు సమము. అ. అచ్ఛంపు.

కెంపు-అచ్ఛంపు=స్వచ్ఛమైన, లేఁజిగురాకు = లేఁత చిగురుటాకులయొక్క, జొంపము = గుత్తియొక్క, కెంపు = ఎఱ్ఱదనము, మేలి.....కెంధూళి-మేలి = మేలైన, చందిరపు = సింధూరముయొక్క, కెంధూళి = ఎఱ్ఱ దుమ్ము, కాఁగన్, గ్రుచ్చినట్లుగన్, పాదుకొన్న = వ్యాపించిన, మొగ్గల, గుంపు = మొత్తము, ప్రకట...పాళి—ప్రకట = ప్రసిద్ధమైన, పాటల = తెలుపును, ఎఱుపునుగూడిన వన్నెగల, బిందు = పద్మకముల [ఏనుఁగులకు యౌవనమునందు దేహమునఁబుట్టిన బొట్టుల] యొక్క, పాళి = గుంపు, కాఁగన్, విచ్చిన....తండము-విచ్చిన = వికసించిన, పరువంపువిరుల = పరిపక్వమైన పుష్పములయొక్క, తండము = సమూహముయొక్క, పెంపు = అతిశయము, శోభిత....రింఛోళి - శోభిత = ప్రకాశించుచున్న, భూతి = గజశృంగారముయొక్క, రింఛోళి = పంక్తి, కాఁగ, నిచ్చలంబైన = చలింపని, తేనియవానజడి = మకరందరూపమగు జడివాన యొక్క, సొంపు = అందము, లాలిత...ధారాళి-లాలిత = మనోహరమగు, దానధారాళి = మదజలసమూహము, కాఁగన్, సుమపరాగముల్ = పుష్పొడులు, కేళిపాంసువులు = ఆటలకైపైనఁ జల్లుకొను దుమ్ములుగాను, కాఁగ, భ్రమరపంక్తులు = తుమ్మెదలమొత్తము, [మదవాసనకై తుమ్మెదలువచ్చుచున్నవని భావము] పైసరపణులు = పై నలంకరించుకొను గొలుసులు, [సరిపెణియొక్క రూపాంతరమే యిటసరపణియాయెను] కాఁగన్, పుడమిన్ = భూమిపై, ఎల్లెడన్ = అంతటను, వాహ్యాళివెడలు = విహార

మునకు బయలువెడలు, మదను, మదపుటేనుఁగున్, పోలెన్ = మన్మథుని మదపుటేనుఁగువలె, ఆమని = వసంతర్తువు, తనర్చెన్ = ఒప్పెను.

తా. చిగురుటాకుల జొంపములమెలఁగుసిందూరము దుమ్ముకాఁగాఁ, జెట్లలో గ్రుచ్చినట్లుగ నలమికొనినమొగ్గలగుంపు పద్మకమనెడి బిందువు కాఁగా, వికసించిన పుష్పములసమూహము గజశృంగార విశేషము కాఁగా, నిశ్చలముగాఁ బ్రవహించు మకరందరసము మదజల సమూహము కాఁగాఁ, బుప్పొడి విలాసార్థమై పైనఁజల్లుకొను దుమ్ముకాఁగా, మదజల వాసనకై వచ్చు తుమ్మెదమొత్తములు పైననలంకారార్థము ధరించు గొలుసులు కాఁగ, భూమియంతయు, వయాళివెడలు మదనుని మదపుటేనుఁగు వలె వసంతర్తువు దోఁచెను.

ఈ పద్యమునగవి సోమయాజియొక్క శైలి నెంతయు ననుకరించెను.

"సీ. అభినవ జలధరశ్యామంబులగు నెడ
లాకుజొంపంబుల ననుకరింప
సాంధ్యరాగోప మచ్ఛాయంబులగుపట్లు
కిసలయోత్కరములఁ గ్రేణిసేయు
రాజమరాళగౌరములగు చోటులు
దలుచుఁబూఁ బొదలచందంబునొంద
హారిద్రరుచి సమానాకృతులగు తావుఁ
లదరెడుపుప్పొడులట్లు మెఱయఁ
తే. గలయ నెగసి ధరాధూళి లలితవనము
దివికినలిఁగాఁపువ్రాయెడు తెఱఁగుదాల్ప
గోగణము ముంగలిగ నేల గోషివడఁగ
నడచు కౌరవరాజ సైన్యంబుగనిమె."

అను విరాటపర్వమునందలి యీ పద్యమునందు నభిమానము చేతనే యీకవి పైపద్యరచన గావించెననుట సుస్పష్టము.

ఇటనలంకారము సమస్తవస్తువిషయసావయవరూపకానుప్రాణితోత్ప్రేక్ష. "అవయవియు నవయవంబును వివరింప సమస్తవస్తువిషయంబిలలో" అనిలక్షణము. నరసభూపాలీయము.

ఉత్ప్రేక్షాలక్షణము. "ఉపమేయమునకుఁగల్గిన, యుపమానగుణక్రియాదియోగముచే నా, యుపమానమేయని తలఁచిన, నపుడది యుత్ప్రేక్షయయ్యె" నరసభూపాలీయము.

"బిందు" వనుటకుఁ బద్మకమను నర్థమునకు "న్యస్తాక్షరాధాతురసేన యత్రభూర్జత్వచః కుంజరబిందుశోణాః" అని కాళిదాస ప్రయోగము గలదు.

"పాటల" శ్వేతరక్తస్తు పాటలః" అని యమరము.

"భూతి" భూతిర్మాతంగశృంగారే" అని విశ్వము.

"రింఛోళి" రింఛోళిశ్శ్రేణికా స్త్రియాం" అని యాదవనిఘంటువు.

"మదపుటేనుఁగు." కర్మధారయమున మువర్ణమునకుఁ బుంపులయి కర్మధారయమున నుత్తునకచ్చుపరమగుటచే టుగాగమప్రాప్తిగల్గుటచే మదపు+ఏనుఁగు = మదుపుటేఁనుగు, అని రూపము నిష్పన్నమయ్యెను.

"కొన్ని ముద్రణప్రతులలో "సుమపరాగముల్ కేళి పాంసువులు గాఁగ," అనియు నొక ముద్రణప్రతియందు "సుమపరాగంబు శయ్యలై సొంపుగుల్క" ననియుఁ, బాఠాంతరములు గనఁబట్టుచున్నవి, కాని యస్మత్పరిశోధితములగు తాళపత్రప్రతుల "సుమపరాగముకేళి పాంసువునుగాఁగ" యనియేయున్నది. "పరాగముల్" అని ముద్రణమునందలి స్ఖాలిత్యముగానుండును. "శయ్యలై సొంపు గుల్క" ననుపాఠమును బాగుగనేయున్నది కాని తాళపత్రప్రతులలో "కేళి పాంసువులుగాఁగ" అను పాఠము

గాన వచ్చుటచేఁ బ్రాచీనపాఠము నుగ్రహించుట సమంజస మనియట్లొ నర్చితిని.

రగడ. పొలిచె మధులక్ష్మి నుర ౹ పొన్నలను బొన్నలను,
దెలివిపడి పుష్పాదుల ౹ తిన్నెలను జిన్నెలను
రంగుగఁ దనర్చు నా౹రంగముల సంగములఁ,
బింగళత చెందె మద౹భృంగముల యంగములఁ
గొఱలెఁ జిగురెల మావి౹గున్నలను జిన్నెలను,
బఱచె మరుఁడురులముది౹పన్నలను బిన్నలను
లలిఁ జిక్కెఁ గరువలిబ౹లంగము లవంగముల,
లులితమై లవలీకు౹డుంగముల లుంగముల
వెలయుకురువింద పూ౹విరువులును ముగువులును,
దెలిపె మదనునకుఁ బని ౹ తెరువులును హరువులును
బెరయుచుఁ బలాశతరు౹బృందముల నందముల,
విరిమొగ్గ లమరెఁ గురు౹విందముల చందముల
నెన్నికగవాసించె ౹నిరువులును బొరువులును,
జిన్నిచెందొవలచేఁ ౹ జెరువులును దొరువులును
వీలుగొలుపమరె నర౹విందములఁ గుందముల,
లీలఁ దళుకొత్తఁగ మి౹ళిందముల డెందముల
మెదలె మలయాచలస౹మీరములు సారములు,
కొద విరహికయ్యె నతి౹ఘోరములు క్రూరములు
జడిగొను మధూళికా౹సారముల పూరముల,
వడిఁదనరె నవసింధు౹వారముల యీరముల

వదరెఁ గడుఁ గ్రొవ్వి పికవారములుఁ గీరములు,
గదిరె నళులందు ఝంకారములు బీరములు
గలఁగి పాంథులు కర్ణికారముల వేరములఁ,
దొలఁగిరిల ఘంటలకు దూరముల దూరములఁ
బొదలెఁ సంపెఁగలందుఁ బూవులును దావులును,
గుదిగొనఁ దనర్చెఁ గడుఁ గ్రోవులును మోవులును
సారెకడతాఁకు సంచారికల చేరికలఁ,
జారులు చరించి రభిసారికల కోరికల
నిగురుఁబోండ్లెన్నరై రీవులును గీవులును,
దిగజాఱవిడిచి రటు తీవులును వావులును
దదనంగతంత్రావ తారికల కారికల,
చదువంటెఁ గేలివన శారికలఁ గీరికల
మితి లేక పరఁగె రతి మెలపులును వలపులును,
నతివలెంతయును మఱచి రలపులును సొలపులును
బోణిమిగ వకుళకుజ పూగములఁ బూగముల,
రాణ దనరారెను బరాగముల రాగములఁ
బరఁగె మధుమదనులకు బలుపులును గెలుపులును,
పెరిఁగె యువ యువతులకుఁ బిలుపులును బొలుపులును
రంజిలిరి గాణలను రాగముల రాగములఁ,
బుంజితశ్రీఁ దనరు భోగములఁ జాగముల
నలముకొని వెంటిచెర లాటములుఁ గూటములుఁ,
జలిపె నహిపతిమృగ ఘాటములుఁ గీటములు
సొరిధి మధువృష్టి వంజులకములఁ దిలకములఁ
గురిసెఁ జెదరుచుఁ దేంట్ల కులకములు జలకముల

గయికొనియె. ననువుపన గాటములువాటములు
నయితరు లతలపెనఁగు లాటములు నోటములుఁ
బొరసె విరహిణులకురు పులకములఁ దిలకములఁ
బరుసఁదనముకపోల ఫలకముల నలకముల

సరగ నానాలతా జాలములు సాలములు
చరదళుల నయ్యో, వా చాలములు నీలములుఁ
దళు కెనఁగఁ బల్లవవి తానముల సూనముల
బులియుపిక మధుపముల బోనములఁ బానములఁ

జవిఁగొనిరిగరువలుపి సాళములు మేళములు
మివులఁ దపసికి నించె మేళములుఁ దాళములుఁ
దగమసలు భసలసం తానముల గానముల
మగువలెగఁ జోఁపి రభి మానముల మానముల

వడిఁ ద్రిప్పి మరుఁడు జయ వంతములు గుంతములు
సడలించె మునిజన స్వాంతముల శాంతముల
మందిరారామవన మాలికల డోలికలఁ
బందెములు జరిగెఁ గుల పాలికల కేలికల

సతతమును గంధపువ సంతములుఁ బంతములు
వ్రతులకును నయ్యో రస వంతములు కాంతములు
మఱేఁగి యెపుడును గంత మాలికల పోలికలఁ
బఱఁగ మగ లిడిరంక పాలికల బాలికల. 6

రామాయణ భారతార్థములు సమానము.—సురపొన్నలను, పొన్నలను, పుష్పాదుల, తిన్నెలను = దిబ్బలయందును, చిన్నెలన్ = విలాసములచే, తెలివిపడి = ప్రకాశించి, మధులక్ష్మి = వసంతర్తువైభవము,

పొలిచెన్ = అతిశయించెను, రంగుగన్ = కాంతితోఁ, తనర్చు = ఒప్పు చుండు, నారంగముల = నారింజలయొక్క, సంగములన్ = కూడికలచే, మదభృంగముల = మదించిన తుమ్మెదల, అంగములన్ = అవయవములను, పింగళత = ఎఱుపుమీఱిన పసుపువన్నె [గోరోచనముయొక్క రంగు] చెందెన్ = పొందెను, ఎలమావిగున్నలను = బాలరసాలములయందు, చిగురు, చిన్నెలను = హొయలచే, కొఱలెన్ = ఒప్పెను, మరుఁడు = మన్మథుఁడు, [ఇది స్మరశబ్దము యొక్క వికృతి.] ఉరులన్ = వలయందు, ముదిపన్నలను = అతివృద్ధులను, పిన్నలను = చిన్నవారిని, పఱచెన్ = భంగ పఱచెను, కరువలి = వాయువుయొక్క, బలంగము = బలము, లవంగ ములన్ = లవంగములందు, ఉలితమై = సుడివడినదై, లవలీకుడుంగములన్ = లవలీలతలపొదరిండ్లయందు, లుంగములన్ = మాదీఫలములయందును, లలిన్ = క్రమముగా, చిక్కన్, వెలయు = ప్రకాశించుచుండు, కురువిం దపూ = నిడుముస్తెపూలయొక్క, విరువులును, ఆధిక్యములును, మురువు లును = ముచ్చటలును, మదనునకున్ = కామునకు, పనితెరువులును = ఉద్యోగధర్మములును, హరువులును = మనోహరత్వములును, తెలిపెన్ = నేర్పెను, పెరయుచున్ = వ్యాపించుచు, పలాశతరుబృందములన్ = మోదుగుచెట్ల గుంపులయందు, అందముల విరిమొగ్గలు=సొగసుఁ దనముతోఁ గూడిన పూలమొగ్గలు, కురువిందముల చందములన్ = కెంపులలాగున, అమ రెన్ = ఒప్పెను, చిన్ని = అందమగు, చెంబొవలచేన్ = ఎఱ్ఱకలువలచే, చెఱువులును, దొరువులును = జలాశయములును, ఇరువులును, పొరువులును= ఇరుగుపొరుగులును, ఎన్నిక, కన్ = ఎన్నఁగలుగునట్లు, వాసించెన్ = పరిమళించెను, మిళిందములడెందములన్ = తుమ్మెదల మనస్సులందు, అరవిందములన్ = ఎఱ్ఱదామరలంగూర్చియు, కుందములన్ = మొగ్గలను గూర్చియు, లీల = వేడ్క, తఱుకొత్తఁగన్ = అతిశయింపఁగ, వీలుగో లుపు = ఉపయోగించు కొనుటయందలి యుత్సాహము, అమరెన్, సారములు, ఘోరములు, క్రూరములు=భయంకరములును క్రూరములును,అగు

మలయాచలసమీరములు = మలయపర్వతమునందలివాయువులు, దక్షిణమారుతములనుట. మెదలెన్ = సంచరించెను, (దాన) విరహికిన్ = వియోగముగలవానికి, కొద, అయ్యెన్ = కొఱఁతకలిగెను, జడిగొను = దట్టమైన, మధూళికా = పుష్పాదులతోడి, ఆసారముల = (పూదేనియ) ధారలయొక్క, పూరములన్ = ప్రవాహములచే, నవ = క్రొత్తవగు, సింధువారముల యూరములన్ = వావిలిపొదలలో, పడి = వేగము, తనరెన్ = ఒప్పెను, పికవారములు = కోకిలలసమూహములును, కీరములు = చిలుకలును, కడున్, క్రొవ్వి = మిక్కుటముగా మదించి, వదరెన్ = ధ్వనించెను, అళులందున్ = తుమ్మెదలయందు, బీరములు = వీరత్వయుక్తములగు, గొప్పవగునవనుట. ఝంకారములు, కదిరెన్ = పొందెను, పాంథులు = వియోగిజనులు, కర్ణికారములవేరములన్ = కొండగోఁగుల విరోధముచే, ఇలన్ = భూమియందు. ఘంటలకున్ = గంటలకొలఁది, దూరముల దూరములన్, = దూరదూరముగా, తొలఁగిరి = తొలఁగియుండిరి, సంపెఁగలందున్ = సంపెంగలయందు, పూవులును = పుష్పములును, తావులును = పరిమళములును, పొదలెన్ = అతిశయించెను, క్రొవ్వులన్ = కురపకములును, మోవులున్ = మోవిచెట్లును, కడున్, గుదిగొనన్, తనర్చెన్ = అతిశయించుచుండెను, పుష్పగుచ్ఛములతో నొప్పుచుండెననుట. సారెకడ తాఁకు = అడుగడుగనసమీపించు, సంచారికల = కుంటెనగత్తెల, చేరికలన్ = సాంగత్యముచే, అభిసారికలకోరికలన్ = జారిణులయందలి కోర్కులతో, జారులు = విటులు, చరించిరి, ఇగురుబోండ్లు = చిగురువంటి మెత్తనిశరీరముగలవారు, స్త్రీలు [ఇగురుబోణులను పదముయొక్క రూపాంతరమే ఇది.] ఈవులును, గీవులును, దానములు, గీనములును, [ఇట గీవులు నిందార్థమునఁ బ్రయోగింపఁబడెను.] ఎన్నరైరి = లెక్కసేయరైరి, అటున్ = అట్లు, ఠీవులు = అందములును, వావులు = వరుసలును, దిగజాఱన్, విడిచిరి = విడిచిపెట్టిరి, [కామాతిశయమున స్త్రీలు త్రిమయందమునుజాఁచి గర్వించి నాయకాన్వేషణమునకుఁ బ్రవర్తింపకుండుటం దిగ

జాఱవిడిచిరి. కామోద్రిక్తలగుట చేతనే పరుసలుకూడ సరకు సేయరైరి యని భావము.] తత్ = ఆ, అనంగతంత్ర = మన్మథాగమముయొక్క, అవతారికల = పీఠికలయొక్క, కారికల = సూత్రములయొక్క, చదువు= విద్య, కేళివనశారికలఁ = విహారవనమునందలి గోరువంకలను, కీరికలఁ = చిలుకలను, అంటెఁ = పట్టువడెను, రతిమెలపులును = రతియందలి మెలఁకువలును, వలపులును = మోహములును, మితిలేక = అమితముగా, పరఁగెఁ = వ్యాపించెను, అతివలు = స్త్రీలు, అలపులును = అలయికలును, సొలపులును = సొలయికలును, ఎంతయుఁ = మిక్కిలి, మఱచిరి, పోణిమిగఁ = ఒప్పిదముగా, వకుళకుజ = పొగడచెట్లయొక్క, పూగములఁ = సమూహములందు, పూగములఁ = పోకచెట్లయందును, పరాగములఁ = పుప్పొడులచేతను, రాగములఁ = ఎఱ్ఱఁదనములచేతను, రాణ = వికాసము, తనరారెఁ = ఒప్పెను, మధుమదనులకుఁ = వసంతమునకును, మన్మథునకును, బలుపులును, గెలుపులును = పుష్టియు, విజయములును, పరఁగెఁ, [వసంతమభివృద్ధియగు కొలఁదిని మన్మథునికి విజయమతిశయించుచుండెనని భావము.] యువయువతులకుఁ = యువజనులకును, యువతులకును, పిలుపులును = ఆహ్వానములును, పొలుపులును = అందములును, పెరిఁగెఁ = అభివృద్ధియయ్యెను, గాణలు = పాటకత్తెలు, అనురాగములఁ = ప్రీతులచేతను, రాగములఁ = సంగీతములచేతను, రంజిలిరి = ఆనందించిరి, భోగములఁ = సుఖములందును, చాగములను = త్యాగములను, పుంజితశ్రీ = గుమిగొన్నసంపద = తనరుఁ = ఒప్పును, అహి, పక్షి, మృగ, ఘాటములు = సర్పములయొక్కయు, పక్షులయొక్కయు, మృగములయొక్కయు, సమూహములును, కీటములును = పురువులును, [కీటక శబ్దముయొక్క రూపాంతరమేయిది] అలమికొని = పట్టుకొని, పెంటి చెరలాటములుఁ = స్త్రీస్వభావమగు క్రీడలును, కూటములు = చేరికలును, చలిపెఁ = చేసెను, సారిది = క్రమముగా. వంజులకములఁ = అశోకములందును, తిలకములఁ = బొట్టుగుచెట్లయఁ

మధువృష్టి = పూదేనెల వాన, కురిసెన్, తేంట్లకులకములు = తుమ్మెదల సమూహములు [కులములు అనుదాని రూపాంతరమేయిది] చెదరుచున్, జలకములన్, కైకొనియెన్ = స్నానముచేసెను, [ఆమకరందవృష్టియందు మధుపములు స్నానముచేసెనని భావము.] అనువుపసన్ = ప్రావీణ్యాతిశయముచే, గాటములు = గాఢములగు, వాటములు, అయి = పొందికలు నయి, తరులతల పెనఁగులాటములున్ = చెట్లకును దీవెలకును బరస్పరము పెనఁకువలును, ఓటములున్ = వెనుదీయుటలును, పొరసెన్ = కలిగెను, [వసంతర్తు ధర్మమునఁ జెట్లును దీవెలునొండొంటితోఁ జేరుచు వెనుదీయుచు నుండెనని భావము.] విరహిణులకున్ = వియోగినులకు, ఉరుపులకములన్ = నిబిడములగు పులకాంకురములచేతను, తిలకములన్ = చుక్కలచేతను, కపోలఫలకములన్ = పలకలవంటి చెక్కిళ్లయందును, అలకములన్ = ముంగురులయందును, పరుసఁదనము=కాఠిన్యము, పొరసెన్ = [ఇటఁ బొరసెనన్క్రియ పూర్వోత్తరవాక్యములందును నీవాక్యమునందును నన్వయించుచున్నది.] సరగన్ = శీఘ్రముగా, నానాలతాజాలములు = పెక్కువిధములగు తీవెల సమూహమును, సాలములు = వృక్షములును, చరదళులన్ = వానియందు సంచరించెడి తుమ్మెదలచే, వాచాలములు = వదరునవిగాను, నీలములు = నల్లనివిగాను, అయ్యెన్, [తీవలయందును జెట్లయందును దట్టముగాఁ దుమ్మెదలు క్రమ్మి ధ్వనించుచుండుటచేఁ దీవెలును జెట్లును నఱచుచుండునవిగాఁ దోఁచెనని భావము.] తళుకెసఁగన్ = అందమభివృద్ధి పొందఁగా, పల్లవవితానములన్ = చిగుళ్ల సమూహములయందును, సూనములన్ = పుష్పములయందును, పిక, మధుపములు = కోకిలలు, తుమ్మెదలును, బోనములన్ = ఆహారములచేతను, [ఇది భోజన శబ్దముయొక్క వికృతి. ఇది వర్ణలోపమునఁ గల్గినది.] పానములన్ = త్రావుటలచేతను, బలియున్ = సుఖించును, గరువలు = శృంగారగర్వముగలవారు, పిసాళములు = వికాసములును, మేలములు = పరిహాసములును, చవిగొనిరి = రుచిగనిరి, తపసికిన్ = తపోవంతునకు, మేళములు = కూడిక,

తాళములు = బంధములు, మివులన్, మిక్కిలిగా, నించెన్ = కలిగెను, తగన్, మసలు = సంచరించు, భసలసంతానముల = తుమ్మెదలగుంపుల యొక్క, గానములన్ = పాటలచే, మగువలు = స్త్రీలు, అభిమానములన్ = తమ్మునుతక్కువ్లుగాఁ దలఁచుటలను, అహంకారములననుట. మానములన్ = తన్నుఁ బూజింపఁజేసికొనుట లను, [నమస్కారయోగ్యుల విషయమున స్వోన్నతికథనము ననిభావము.] ఎగఁజోపిరి = ఎగఁద్రోలిరి, విడిచిరనుట. మరుఁడు = మన్మథుఁడు, జయవంతములు, కుంతములు = జయశీలములగు బాణములు, [పుష్ప రూపబాణములు] వడిన్, త్రిప్పి = వేగముగాఁ ద్రిప్పి, (ఆబాణములచే) శాంతములన్ = శాంతియుక్తములగు, మునిజనస్వాంతములన్ = మహర్షి జనమానసములను, సడలించెను = శిథిలములుగావించెను. [మహర్షుల మానసములును గామార్తములైనవని భావము] మందిరారామ వనమాలికలన్ = ఇండ్లతోఁజేరిన యుపవనసమూహములందు, డోలికలన్ = తూఁగుటుయ్యాలలయందు, కులపాలకల కేలికలన్ = కుల స్త్రీలతోడి విహారములందు, పందెములు, జరిగెన్ = స్త్రీపురుషులకుఁ బరస్పరము పంతములు జరిగెను, సతతమును = ఎల్లప్పుడును, గందపు వసంతములున్ = చందన ద్రవముతోడి వసంతము లాడుకొనుటలును, పంతములున్ = పందెములు వేసికొనుటలును, వ్రతులకును = నియమవంతులకును, రసవంతములు, రసముగలవిగాను, కాంతములు = మనోహరమైనవిగాను, అయ్యెన్, ఎపుడును, కంఠమాలికలపోలికలన్, మరిగి = కంఠహారముల పోలికల నలవాటుపడి, పరఁగన్, బాలికలన్ = పడుచులను, అంకపాలికలన్ = ఒడులయందు, మగలు = భర్తలు, ఇడిరి = ఉనిచికొనిరి.

తా. స్పష్టము.

“మధూళికా” “ఆకారాన్త స్త్రియాం. సుమనోరజసి.” శబ్దార్థకల్పతరువు.

"అభిసారికా." "కాంతార్థినీతుయాయాతి సంకేతం సాభిసారికా" అని యమరము. "కాంతాభి సరణోద్యుక్తాస్మరార్తా సాభిసారికా." ప్రతాపరుద్రీయము.

"పోణిమి" యనిణకారమువచ్చుటకు, "భోగిశయనపరఁగుఁ బోణిమి పోడిమి." 'అనంతు నిఘంటువు. "పోణిమిఁ జెలుపవాబుధులు నటింప" రామాయణద్విపద.

"బులియు" ననుటకు సుఖించుననునర్థమున కీకవియే తనకళాపూర్ణోదయమున, "అలరఁజేయు నచ్చరపిండు ముత్తికన్యలను బెండ్లియాడి బులియుచున్న" యని ప్రయోగించెను.

"అభిమానముల మానములన్" — "ఆత్మానముత్కృష్టం మానయతీత్యభిమానః. "మన అవబోధనే" ఆత్మానంమానయతీతిమానః - మానపూజాయాం" అని గురుబాలప్రబోధికలో నీరెంటికిని భేదము సూచింపఁబడియున్నది.

"లలితమగు లవలీకుడుంగములలుంగముల" ననుచోట నభేదయతి యగుటచే ల, డలకు యతిచెల్లెను.

"రహిగ లళలకు లడలకుఁ, బ్రాసయతు లొనరుపనవి యభేదప్రాసవిరతులగును." ఆనందరంగ రాట్ఛందము.

మ. త్రిజగన్మోహనతన్వసంతఋతువీరీతిం బ్రకాశింపఁగా
యజమానత్వర సప్రకర్ష మహిమవ్యాప్తిన్విజృంభించె; ది
వ్యజనుత్రైచ్ఛనతాంత సంయమిత విశ్వామిత్ర మానీశబు
ద్ధిజయప్రౌఢిని మించు మెంతయుధరిత్రిం దేఁట తెల్లంబుగన్.

రామాయణ. త్రిజగన్మోహనతన్ = మూఁడు లోకములకు రమ్యమగుటచే, వసంత ఋతువు, ఈ రీతిన్ = ఈ లాగున, ప్రకాశింపఁగాన్, విశ్వామిత్రమానీశబుద్ధి = విశ్వామిత్ర మహర్షి యొక్కబుద్ధి, యజ

మాన... వ్యాప్తిన్ — యజమానత్వ=సోమయాజి భావమునందలి,రసప్రకర్ష= రాగాతిశయముయొక్క, మహిమ = మాహాత్మ్యముయొక్క, వ్యాప్తిన్ = వ్యాపనముచే, దివ్యజనుల్ = దేవతలు, మెచ్చన్ = మెచ్చుకొను లాగున, నితాంతసంయమితన్=గొప్పదగుయతిత్వముచే, జయప్రౌఢిని, మించుట = అతిశయించుట, [నిజతపోవ్యయము లేకయే తపోవిఘ్న కారులగు రాక్షసుల జయించి యజ్ఞము సేయట యని భావము.] ధరిత్రిన్ = భూమియందు, ఎంతయున్, తేటతెల్లంబు, కన్ = విశదమగులాగున, విజృంభించెన్.

తా. వసంతర్తు వీలాగునఁ త్రైలోక్య మోహనముగా వ్యాపించి యుండ సోమయాజిత్వము నందలి రసాతిశయముచే దేవతలు మెచ్చునట్లు విశ్వామిత్రునిబుద్ధి తపోవ్యయములేకయే రాక్షసుల జయించి యజ్ఞము సేయ వలయునను తలంపుతో విజృంభించెను.

భారత. త్రిజగన్మోహనతన్, వసవంతఋతువు, ఈరీతిన్, ప్రకాశింపన్, దివ్య జనల్, మెచ్చన్, నితాంత = మిక్కిలి, సంయమిత = దండింపఁబడిన, విశ్వ = భూమియందలి, అమిత్రమా = శత్రువులను గల, అరిషడ్వర్గముల జయించిన వాఁడనుట. ఈశ = పాండు రాజుయొక్క బుద్ధిన్, కాయజ=మన్మథుని యొక్క, మానత్వర = గర్వవేగముయొక్క, సప్రకర్షమహిమ=గొప్పతనముతోఁ గూడిన ప్రభావముయొక్క, వ్యాప్తిన్, జయప్రౌఢిని, మించుట = జయాతిశయముచే మీఱుట, [మన్మథోద్రేకమునకు లోఁబడుట యనిభావము] ధరిత్రిన్, ఎంతయున్, తేటతెల్లంబు, కన్ = అత్యంతము విశదముకాఁగా, విజృంభించెను.

తా. వసంతర్తు విట్లు త్రైలోక్య మోహనముగా వ్యాపింప దేవతలు ను మెచ్చు లాగున నరిషడ్వర్గముల జయించిన యీపాండురాజుబుద్ధిని, మన్మథుని యహంకారవేగము జయించి తనయధీనము చేసికొని విజృంభించెను.

వ. అప్పుడు. 8

చ. అనయము మ్రోలనేకత మహాహార్దగతిం దన చిన్నిరామచం
ద్రుని నగుమోముదామరసిరుల్గనుపండువుగాఁ జెలంగఁగాం
క్షనరయుపాండురాజిత యశస్కుఁడు రాజవరుం డవారితా
తనువిభవాధిరాజ్యసముదగ్ర మనోధృతియై ప్రవర్తిలన్. 9

**రామాయణ.** అనయము = ఎల్లప్పుడును, మ్రోలన్ = ఎదుట, ఏక తమ = మిక్కిలి ముఖ్యమగు, హార్దగతిన్ = నెయ్యపుటునికిచే, తన, చిన్ని, రామచంద్రుని = రాముని యొక్క, [ఇట చంద్రశబ్దము శ్రేష్ఠవాచకము.] నగు మోముదామర = నవ్వుతోఁ గూడిన ముఖమనెడి తామరయొక్క, సిరుల్ = కాంతులు, కనుపండువుగాన్ = నేత్రపర్వముగా, చెలంగన్ = వెలయఁగా, కాంక్షన్ = కోర్కెచే, అరయు = చూచునట్టి, పాండు = తెల్లని, రాజిత = ప్రకాశించుచున్న, యశస్కుఁడు = కీర్తిగలవాఁడు, రాజవరుండు = రాజశ్రేష్ఠుఁడు, దశరథుఁడనుట. అవారిత = నివారింపఁ బడని, అతను = తగ్గని, విభవ = వైభవముగల, అధిరాజ్య = సామ్రాజ్యముచే, సముదగ్ర = మిక్కిలి గొప్పదగు, మనోధృతియై = మనస్సంతుష్టి గలవాఁడై, ప్రవర్తిలన్ = ఒప్పు చుండఁగా.

తా. ఎల్లప్పుడును దనకట్టెదుట మిక్కిలి ముఖ్యమైన స్నేహప్రవర్తనమున మెలఁగుచుండు తన ముద్దులరాముని చిరునగవుతోడి మోముదమ్మి కాంతి కనులపండువు సేయుచుండఁ గోర్కెతోఁ జూచుచుండు నట్టియుఁ, బరిశుభ్రమై ప్రకాశించుచుండు కీర్తిగలవాఁడు నగు దశరథుఁడు నిజ సామ్రాజ్యవైభవాతిశయమున మన స్సంతోషమునఁ బ్రవర్తించు చుండఁగాఁ జేరెనని మొదటి పద్యముతో దీని కన్వయము.

"ధృతి" ధృతిర్యోగాంతరే ధైర్యే ధారణా ధ్వరతుష్టిషు." అనివిశ్వ నిఘంటువు.

భారత. అనయము = మిక్కిలి, ప్రోలన్ = సమీపమున, ఏకతమ = ఏకాంతముగా, తనచిన్నరామ = తనచిన్న భార్యయైన మాద్రియొక్క, చంద్రుని... సిరుల్—చంద్రుని, నగు = నవ్వునట్టి, మోముదామర = ముఖ పద్మముయొక్క, సిరుల్ = కాంతులు, కనుపండువుగాన్, చెలంగన్, కాంక్షన్ = కోర్కిచే, అరయు = చూచు, పాండురాజు, ఇతరయశస్కుఁడు = పొందఁబడిన కీర్తిగలవాఁడు, రాజవరుండు = రాజశ్రేష్ఠుఁడు, అవారిత, అతనువిభవ = మన్మథ వైభవముచే నైన, ఆధి = మనోవ్యధయొక్క, రాజి = సమూహముచే, అసముదగ్ర = అల్పమైన, మనోధృతియై = మనోధైర్యము గలవాఁడై, ప్రవర్తిలన్.

తా. ఏకాంతమునఁ దనచెంతనున్న మాద్రీ ముఖకమలముం జూచి పాండురాజు మన్మథోద్దీపనమున గతధైర్యుఁడై యుండఁగాఁ, జేరెనని ముందటి పద్యముతో నన్వయము.

"తన చిన్నిరామచంద్రుని నగుమోముదామర" చంద్రోపమానమును, పద్మోపమానమును, జెప్పియుండుటచే నిది పునరుక్తి యనితలంపరాదు. "ఉపమానానువాదేతు విధిరన్యస్య సమ్మతిః, స్యాద్విశేష వివక్షాయాంపున రుక్తిః క్వచిద్గితా" యను నథర్వణవచనమున నిది సాధు వగుచున్నది.

క. ఆయమనియమైకనిధి మ
హాయతధైర్యమహిమగని యాసురక్షయ మ
త్యాయత్తతఁదాఁ జేయక
యాయతనుక్రియకుఁ జేరె నతనినియతిచేస్. 10

రామాయణ. ఆయమ=సత్యాహింసా సంధ్యాదులకును, నియమ = శౌచతప స్స్వాధ్యాయాదులకును, ఏకనిధి=ముఖ్యస్థానమైన, విశ్వామిత్రుఁడు, మహాయత = మిక్కిలి విస్తారమైన, ధైర్య, మహిమ = ధైర్యమహిమను, కని = చూచి, దశరథుని ధైర్యమును దెలిసియనుట. ఆయసురక్షయము =

ఆయసురనాశము, అత్యాయత్తతన్ = మిక్కిలి యాసక్తిచే, తాన్, చేయక, ఆయతనుక్రియకున్ = ఆగొప్ప కార్యమునకు, అతని నియతిచేన్ = ఆదశరథుని భాగ్యవశమున, చేరెన్ = ఆదశరథుని, చేరెను.

తా. విశ్వామిత్రుఁడు దశరథుని ధైర్యమహిమం దెలిసి, అసుర నాశము తాను జేయక యకార్యము రామునిమూలమునఁ జేయింపఁదలఁచి తత్ప్రార్థనకై యచటికి వచ్చెననిభావము.

ముద్దరాజురామన్న "మహిమగని యనుచోట మహిమ కాశరమగు వాఁడని యర్థముచేసి విశ్వామిత్రునకు విశేషణము గావించెను గాని యంత కంటె "దశరథునిధైర్యముం దలఁచి" యని యర్థము గావించుటయే రసవంతము.

"యమనియమైకనిధి" "శరీరసాధనాపేక్షం నిత్యంయత్కర్మ తద్యమః, నియమస్తు స యత్కర్మనిత్య మాగంతు సాధనం" అని యమరము.

భారత. ఆ యమ = ఆమాద్రి, నియమ, ఏకనిధి = నియమములకు ముఖ్యస్థానమైనది, మహాయత.. మహి - మహాయత = మిక్కిలి విస్తారమైన, ధైర్య మహి = ధైర్యమునకు స్థానమైనది, మగని...రక్ష - మగని = భర్త యొక్క, అసురక్ష = ప్రాణరక్ష, అమతి, ఆయత్తతన్ = అబుద్ధివశమున, మతిచెడియనుట. తాన్, చేయక, ఆయతనుక్రియకున్=ఆమన్మథ క్రీడకు, నియతిచేన్ = దైవవశమున, ఆతనిన్ = ఆపాండు రాజును, చేరెన్, దైవవిధి యట్లుండుటచేఁ జేరెననుట.

తా. పతివ్రతా శిరోమణి యగు నామాద్రిభర్తృప్రాణరక్ష ముఖ్య మని భావింపక దైవవిధి యట్లుండుటచే మన్మథ క్రీడకుఁగా నాతనిం జేరెను

చ. మనుజవరుండు నప్డు నదుకీమన్ ఘటియిల్లెడువిఘ్నవాక్ప్రవ
ర్తనలుగురుప్రయత్ననిహా[?]తంబులు సేయుచు, రామయేక్రియన్

నినువిడనేర్తునంచుఁ గడుఁ నెమ్మిఁ గవుంగిటఁ జేర్చియంతటం
దనయసువాంఛ డించి తగఁ దన్పెఁ దదర్థిఁ గృతార్థుఁగా మునిన్.

**రామాయణ.** మనుజవరుండు=మనుష్యశ్రేష్ఠుఁడు, దశరథుఁడనుట, అప్డు, నడుమన్ = మధ్యను, ఘటియిల్లెడు = చేరెడు, విఘ్నవాక్ =విఘ్నవాక్యముల, ప్రవర్తనలు = ఉనుకులు, [అయ్యో! పసివారి నెట్లంపుట యనునిట్టి విఘాతపు మాటలఁ బల్కుటయని భావము.] గురు... విహతంబులు - గురు = గురువైన వసిష్ఠునియొక్క, ప్రయత్న, విహతంబులు, చేయుచున్ = ప్రయత్నముచే మార్చినవాఁడై. [గురు నిర్బంధమునఁ బల్కనను మాటలు నిలిచెనని భావము.] రామ, ఏత్రియన్, నినున్, విడన్, నేర్తును. అంచున్ = నిన్నేలాగున విడువఁగల ననుచు, కడున్, నెమ్మిన్ = మిక్కిలి ప్రీతితో, కవుంగిటన్, చేర్చి = కౌగిలించుకొని, అంతటన్, తనయ, సువాంఛన్ = కుమారుని మీఁది యపేక్షను, డించి = విడిచి, తదర్థిన్ = రాముని గోరుచున్న, మునిన్ = మహర్షిని, విశ్వామిత్రుననుట, కృతార్థున్, కాన్ = ధన్యుండగులాగున, తన్పెన్ = తృప్తిపఱచెను.

తా. విశ్వామిత్రుఁడు రాముం బంపుమని నంత నేదశరథుఁడడ్డు మాటలాడఁగా వసిష్ఠుఁడెట్లైనను రాముం బంపుమని నిర్బంధించుటచే నావిఘాత వాక్యములు వీడి ఓ రామా నిన్నెట్లు విడనాడుదునని యాతనిం గౌఁగిలించుకొని తుదకాతని యెడఁగల వాంఛను వీడి విశ్వామిత్రునిష్టము పూర్తిగావించి యాతనిం దృప్తిపఱచెను.

**భారత.** అప్డు, మనుజవరుండున్ = మనుష్య శ్రేష్ఠుఁడు, నడుమన్, ఘటియిల్లెడు విఘ్నవాక్, ప్రవర్తనలు=మధ్యను గల్గు విఘ్నవాక్యములు, ప్రాణహాని కరమగు నికార్యము వలదని మాద్రి యాడిన విఘాతవాక్యములనుట. గురు = గొప్పదగు, ప్రయత్న, విహతంబులు, చేయుచున్ = గొప్ప ప్రయత్నమున నామాటల మార్చిన వాఁడై, [అతి నిర్బంధమున నాబిడ విఘ్నవాక్యములు పల్కకుండఁజేసి యనుట.] రామ ! = స్త్రీ !

మాద్రీయనుట. ఏక్రియన్, నినున్, విడన్, నేర్తున్, అంచున్ = ఏలా గున నిన్ను విడువఁగలననుచు, కడౌన్, నెమ్మిన్, కవుంగిటన్, చేర్చి = ఆలింగనముగావించి, ఆంతటన్, తన, అసువాంఛన్, డించి = తనప్రాణ ములయందపేక్ష వీడి, [మునిశాపము చొప్పునఁ దన ప్రాణము పోయినను సరియేయని యెంచి యనిభావము,] తదర్థిన్ = స్వప్రాణములఁ గోరుచున్న, కామునిన్ = మన్మథుని, కృతార్థున్ = ప్రయోజన వంతునిగా, తగన్, తన్పెను = తృప్తిపఱచెను. [మన్మథుని యిష్టము ననుసరించి యాబిడతోఁ జేరెననుట.]

తా. భర్తమాటలవిని మాద్రి యిది ప్రాణహాని కరమని విఘ్నవాక్య ములు పల్కినంతనే మిక్కిలి నిర్బంధించి యామెం గౌఁగిలించికొని తన ప్రాణములంగూడ సరకుసేయక యామెం గూడెను.

సీ. స్వవిధివిఘ్ననిరాసంబు సలుప నతఁడు
రామసాంగత్య మర్థించెఁ బ్రమదగరిమఁ
బెనుచుతదనుయాత్రకుఁ దనువు ప్రేంగఁ
బ్రస్ఫుటంబైనయుత్సాహభరముఁ బూనె. 12

రామాయణ. స్వవిధి = తానుజేయు యజ్ఞవిధికి, నిరాసంబు = విఘ్ననాశము, చలుపన్, అతఁడు=ఆ విశ్వామిత్రుఁడు, రామసాంగత్యము= రామునిచేరికను, అర్థించెన్ = కోరెను, అంతన్, ప్రమదగరిమన్ = సంతో షాతిశయమును, పెనుచు = వృద్ధిపొందించు, తత్ = రామునియొక్క, అను యాత్రకున్ = తనను, అనుసరించి వచ్చుటకు, తనువు=శరీరము, పొంగన్ = ఉప్పొంగఁగా, ప్రస్ఫుటంబైన, స్పష్టమైన, ఉత్సాహభరమున్ = ఉత్కంఠ ాతిశయమును, పూనెన్ = పొందెను. త్వరపడెననుట.

తా. రాముని మూలమునఁ దనయజ్ఞమునకు భంగమొనర్చు రాక్ష సులఁ జంపఁగోరి మునిదశరథుని'రాముం బంపు'మని కోరెను. రాముఁడు దన

తోరాఁ బోవుచున్నాఁడనుట దెలిసినతోడనే సంతోషాతిశయమున శరీర ముప్పొంగ నాతనిరాక కై త్వరపడెను.

భారత. స్వవిధి = తన దురదృష్టము, విఘ్ననిరాసంబు = విఘ్నము యొక్క నాశము, సలుపక, [మరణము చెందవలసిన లాగుననుండు విధి నిర్ణయము మా దియొక్క విఘ్నవాక్యములచేఁ గల్గిన యడ్డును నివారింపఁ గానని భావము.] అతఁడు = ఆరాజు, రామసాంగత్యము = స్త్రీ సాంగత్యము, మాద్రి చేరికను, అర్థించెక, అంతక, ప్రమద = స్త్రీ, మాద్రి. గరిమక, పెనుచు = గౌరవమును వృద్ధిపఱచు, తత్, అనుయాత్రకున్ = పాండు రాజు తోడియను మరణమునకు, తనువు, పొంగక, ప్రస్ఫుటంబైన, ఉత్సా హాభరము = ఉత్కంఠాతిశయము, పూనెక.

తా. పాండురాజు విధి నిర్ణయము వశమునఁ దన భార్య చెప్పుచుండు విఘ్నవాక్యములు నిలిచినంతనే యామెతోఁ జేరెను. అంత శాప ప్రకార మున నాతఁడు మరణింపఁగనే యాతని భార్యయగు మాద్రి యక్కాలమున శ్లాఘాపాత్రముగా నుండిన భర్త్రను మరణ వ్యాపారమునకై తానెంతయు నుత్సాహవంతురాలయ్యెను.

మహాస్రగ్ధర. తలఁపిల్లుత్సాహమొందం కై దనయుజన పరి
త్రాణమర్థించియక్కుం
దళితాపత్యానురక్తిన్ సహింపు సనుగతి
న్నానురాఁ బూనకుండ
న్వెలనొప్పన్నాన్ని స్వస్థానమునకుఁ జనియె
న్నాము నాత్మేశుఁ బ్రేమా
త్యలఘు శ్రేయస్సుమిత్రానవరతనయ యో
గాఢ్యుఁ దోడ్కొంచు వేడ్కన్. 13

**రామాయణ.** తలఁపు = తలంపు, ఇట్లు, ఉత్సాహము, ఒందన్ = ఉత్సాహమును బొందఁగా, తన, యజన, పరిత్రాణ = నిజయజ్ఞ రక్షణమును, అర్థించి = కోరి, ఆ, కందళిత, అపత్యానురక్తిన్, ఆచిగిర్చిన పుత్రానురాగము గలవానిని, మహీపున్ = రాజును, దశరథుననుట. అను గతిన్, తాను, రాన్, పూనకుండన్ = తనతో నారాజురాఁ బూనకుండునట్లు, వలను = ఉపాయము, ఒప్పన్, మాన్చి, = మానుపి, [యుక్తమగు లాగున బోధించి యాతనిమరల్చి యనిభావము.] ప్రేమ.....ఆఢ్యున్ - ప్రేమ = ప్రీతిచే, అత్యలఘు = కడునధిక మగునట్లు, శ్రేయః = శ్రేష్ఠుఁడైన, సుమిత్రా = సుమిత్రయొక్క, అనవర, తనయు = చిన్నకుమారుఁడు కాని వానితో, [పెద్దకుమారుఁడగు లక్ష్మణుని తోననుట.] యోగాఢ్యున్ = కూడికగలవానిని, ఆత్మేశున్ = పరబ్రహ్మస్వరూపుని, రామున్ = రాముని, వేడ్కన్, తోడ్కొంచున్ = పిలుచుకొనుచు, స్వస్థానమునకున్ = తన కోటికి, తనయాశ్రమమును గుఱించి యనుట. చనియెన్ = వెడలెను.

తా. మనస్సునందలి యుత్సాహ మభివృద్ధమగుచుండఁగాఁ, దన యజ్ఞ రక్షణముఁ గోరి, పుత్రస్నేహమునఁ దన వెంట రానుద్యమించిన దశరథునకు యుక్తమగు మాటలుచెప్పి యాతనిమరల్చి మిక్కిలిశ్రేష్ఠుఁడగు లక్ష్మణునితోఁ గూడిన, పరబ్రహ్మస్వరూపుఁడగు రాముని దనవెంట నిడికొని నిజాశ్రమమును గుఱించి వెడలెను.

"శ్రేయః" శ్రేయాన్ శ్రేష్ఠః పుష్కలశ్చ." అని యమరము.

"అనవరజ." "యవీ యోపరజానుజాః" అని యమరము.

"కం, దళితాపత్యానురక్తిన్ మహీపుననుచోట, దకారము ముందుండు బిందువునకును, మకారమునకును యతిచెల్లుటకు; "టతపవర్గాక్షరములకు డాపలించి, యొనరనూదిన బిందువులుండెనేని, వరుసణనములు వళులగు వానికెల్ల, నపనిఁ గొందఱుసుకవుల యనుమతమున." కావ్యాలంకార చూడామణి.

"కం, దళచూత్కార పరంపరల్ పయిపయిఁ మధ్యాహ్నముం దెల్పెడిన్" అని పెద్దనార్యుఁడు ప్రయోగించియున్నాఁడు.

"స్వఃస్థానమునకున్" ద్వితీయార్థమున షష్ఠి.

భారత. తలఁపు, ఇట్లు, ఉత్సాహము, ఒందన్ = మాద్రితనతలంపు, [ఇట్లుభర్తతో ననుమరణము గావింపవలయునను నుత్సాహము] పొందఁగా, అక్కన్ = కుంతిని, తనయ, జన, పరిత్రాణము, అర్థించి = పుత్రులరక్షణముగోరి, దళిత,...అనురక్తిన్-దళిత = ఖండింపఁబడిన, అపత్య = కుమారులయందలి, అనురక్తిన్ = ప్రీతిచే, పుత్రప్రీతిని విడనాడియనుట. మహీపునమగతిన్ = రాజువెంట, తాను = కుంతి, రాన్, పూనకుండన్ = రాకుండునట్లు, వలను, ఒప్పన్ , మాన్చి = ఉపాయముచేమాన్పి, ప్రేమ... అత్యుధు - ప్రేమ = ప్రీతిచే, అత్యలఘు = మిక్కిలిగొప్పదగు, శ్రేయః = పుణ్యమునకు, సుమిత్ర = చెలికాఁడైన, అనవరత = ఎల్లప్పుడు, నయ = నీతితోడి, యోగాఢ్యున్ = ఆత్మయోగసంపన్నుని, ఆముష్ = మనోహరుఁడైన, ఆత్మేశున్ =తనభర్తను, తోడ్కొంచున్, స్వః, స్థానమునకున్ = స్వర్గస్థానమునకు, అరిగెన్ = వెళ్లెను. మాద్రియనుమరణము గావించెననుట.

తా. మాద్రితనకు భర్తతో సహగమనము సేయవలయునను నుత్సాహముండుటచేఁ దన యక్కయగు కుంతిని పుత్రుల రక్షింపుమని కోరి, పుత్రప్రీతిని విడనాడి, భర్తతో నామెయు సహగమనము గావింపకుండున ట్లుపాయమున మరలించి, మిక్కిలి పుణ్యముగల తన భర్తతో ననుమరణ విధానమున స్వర్గము చేరెను.

"అక్కం దళిత" ఇటద్రుతమునకు బిందువగుటకు, "అయ్యంత్య నకారంబుసున్నల భినవదండీ" ఆంధ్ర భాషా భూషణము.

"శమ్మని లతాంతములకు మ్మెనసి." అని నన్నయభట్టు ప్రయోగించెను.

"శ్రేయః" "స్యాద్ధర్మ మస్త్రియాంపుణ్యశ్రేయసీ సుకృతం" అని యమరము. ఇటస్వస్థానమను నపుడు రామాయణార్థమున స్వ,స్థానమనియు, భారతార్థమున స్వః + స్థానముఁ = స్వస్స్థానము అని సకారద్విత్వముతోను రూపములుత్పన్నమైనను శ్లేషార్థసిద్ధికై స్వస్థానమని ద్వితీయసకార రహితమగురూపము నే గ్రహించెను.

మహాస్రగ్ధరా లక్షణము. "లసదుద్యత్కీర్తి వల్లీలళితగుణ గణాలంకృతాంగాసతాన, స్థసరాగంబుల్ మహాస్రగ్ధరకు వసుమునిస్థాన విశ్రాంతి నొప్పన్" భీమన.

గీ. అట్లు తండ్రిచేత విసృష్టులైన యట్టి
రాకొమారులు సహజన ● నీకయాత్రఁ
బూని సంయమిశ్వరనీయ ● మానులగుచుఁ
జనిరి నిజపురమునకు విషాద మొదవ. 14

రామాయణ. అట్లు, తండ్రిచేతన్ = దశరథునిచే, విసృష్టులైనయట్టి, రాకుమారులు = రామలక్ష్మణులు, నిజపురమునకున్ = అయోధ్యకు, అయోధ్యయందలి జనులకనుట. విషాదము = దుఃఖము. ఒదవన్ = కలుగఁగా, సహజన్ = స్వభావసిద్ధమయిన, అనీకయాత్రన్ = దండయాత్రను, పూని, సంయమీశ్వరనీయమానులు = విశ్వామిత్రునిచేఁ దోడ్కొనిపోఁబడువారు, అగుచున్, చనిరి = వెడలిరి.

తా. రామలక్ష్మణులు దశరథుఁ డంపినంతనే నిజవియోగమున నయోధ్యావాసులు దుఃఖించుచుండ యుద్ధయాత్రంబూని, విశ్వామిత్రుని వెంట నరిగిరి.

"అనీకయాత్ర." అస్త్రియాం సమరానీకరణాః" అని యమరము.

భారత. అట్లు, తండ్రిచేతన్ = పాండురాజుచే, విసృష్టులైనయట్టి= విడువఁబడినట్టి, తండ్రిలేనివారైయనుట. రాకుమారులు = పాండవులు, సహజననీకయాత్రన్ = తల్లియగు కుంతీదేవితోఁగూడిన యాత్రను, పూని,

సంయమీశ్వర = మహర్షులచేత, నీయమానులు = పిలుచుకొని రాఁబడు వారు, అగుచున్, నిజపురమునకున్ = వారిపట్టణమగు హస్తినకు, విషాదము, ఒదవన్, చనిరి = వెడలిరి.

తా. పాండవులు, పాండురాజ మరణానంతరమునఁ గుంతితోడ మహర్షులు తోడ్కొని పోవుచుండ, వీరియవస్థనుజూచి హస్తినాపురము నందలివారు దుఃఖించుచుండ నప్పురమున కరిగిరి.

"సంయమీశ్వర." సవర్ణ దీర్ఘసంధి. "అకస్సవర్ణే దీర్ఘః" పాణిని.

సీ. అత్తెఱంగునఁ జనునప్పుడు దమవార్త
దవుదవ్వులను విని తత్పథంబు
నందు మదప్రౌఢి మందాటక మహేభ
హరిశతాంగ సమృద్ధిఁ గరము మించు
సముదగ్రతరబలసంపద లెదురుగాఁ
గనిజపితృజ్యేష్ఠుఁ డనుప నతని
ప్రియముగారాము సంశ్రితధర్మ గుణమైన
యమ్మనుబుధాళికి నమ్మనిక ర
గీ. మగుచుఁ బరఁగె నమ్మహాబల ముకము భ
జించి యమపురగరిఁ జేర నంత
నక్కుమారు లరిగి రావలనూనని
గాథధృతిని మానికథలు వినుచు. 15

రామాయణ. అత్తెఱంగునన్ = ఆలాగున, చనునప్పుడు = పోవు నప్పుడు, రామలక్ష్మణు లట్లు విశ్వామిత్రునితో నేఁగునపుడనుట. తమ వార్త = రామలక్ష్మణులవార్త, దవుదవ్వులను = దూరదూరముగా, విని, తత్పథంబునందున్ = వారిమార్గమున, మదప్రౌఢిమన్ = మదోద్రేకము గల, తాటకన్, మహేభ = గొప్పయేనుఁగులయొక్కయు, హరి = సిం

హము యొక్కయు, శత, అంగ = నూఱుసంఖ్యలుగల శరీరములయొక్క, సమృద్ధిఁ = అతిశయస్ఫూర్తిచే, కరము = మిక్కిలి, మించు = అతిశయించు, సముదగ్రతరబలసంపదన్ = అత్యంత బలసమృద్ధి గలదానిని, ఎదురుగాన్, కని=ఎదుటఁజూచి, జపితృశ్రేష్ఠుఁడు = ఋషిశ్రేష్ఠుఁడగు విశ్వామిత్రుఁడు, అనుపఁగాన్ = అనుజ్ఞనీయఁగా, అతనిప్రియముగాన్ = విశ్వామిత్రునకుఁ బ్రియముగల్గులాగున, రాము=రామునియొక్క, సంశ్రిత = చేరిన, ధర్మ = వింటియొక్క, గుణమైన = అల్లెత్రాడుగల, అమ్మ = బాణము, బుధాళికిన్=దేవతలసమూహమునకు, సమ్మదకరము, అగుచున్= సంతోషకరమగుచు, అమ్మహాబల=గొప్పబలముగల యాతాటక, ముదము, భజించి = సంతోషమునంది, అమరనగరిన్, చేరన్ = స్వర్గముచేరునట్లు, పరఁగెన్ = పఱచెను, అంతన్ = పిమ్మట, అక్కుమారులు = రామలక్ష్మణులు, ఆవల, మానని = విడువని, గాఢధృతిని = పూర్ణధైర్యముతో, మౌనికథలు = విశ్వామిత్రుఁడు చెప్పుకథలను, వినుచున్ = అరిగిరి.

తా. రామలక్ష్మణులు విశ్వామిత్రుని వెంటవచ్చుచుండఁగా దూరము నుండియే వీరువచ్చు వార్తవిని తాటక యెదురరాఁగ, రాముఁడు స్త్రీవధ పాపమూలమగుటఁ దనకిష్టము లేకుండినను విశ్వామిత్రు నానతిచేఁ దన చేతి బాణమున నా రక్కసిని స్వర్గమున కనిపెను. ఆవల మహర్షి చెప్పు కథలాలకించుచు నాతని వెంటనరిగిరి.

“హరి”. “సింహోమృగేంద్రః పంచాస్యో హర్యక్షః కేసరీ హరిః.” అని యమరము.

“ధర్మ” “అథధర్మో స్త్రీ, పుణ్యేసామాన్యభావయోః, చాప న్యాయాధ్వరాహింసా యజ్ఞాచార యమేషువా.” నానార్థరత్నమాల.

“గుణ.” “మౌర్వీజ్యాశింజినీగుణః.” అని యమరము.

“అమ్మ.” “తనరుశరము కోలములికమ్మ తూపునా శూల పాణి.” ఆంధ్రనామసంగ్రహము.

భారత. అత్తెఱంగునఁ, చనునప్పుడు = పాండవులట్లు హస్తినా పురముంజేర నరుగునప్పుడు, తమవార్త, దవుదవ్వులను, విని = దూరము నుండియే యాలకించి, తత్పథంబునందుఁ, మదప్రౌఢిఁ = మదాతిరేక ముచే, మందాటక = తిన్నఁగాసంచరించు, మహేభ = గొప్పయేనుఁగుల యొక్కయు, హరి = గుఱ్ఱములయొక్కయు, శతాంగ = రథముల యొక్కయు, సమృద్ధిఁ, కరము, మించు, సముదగ్రతర, బలసంపదఁ = సేనాసంపదను, నిజ, పితృజ్యేష్ఠుఁడు = తమపెదతండ్రి, ఎదురుగాఁగఁ, అనుపఁ = పంపఁగా, అతని ప్రియము = ధృతరాష్ట్రుని ప్రీతియు, గారాము = గౌరవము, సంశ్రిత = ఆశ్రయించిన, ధర్మగుణమై, నయమున్ = నీతి, బుధాళికిఁ = పెద్దలకు, సమ్మదకరము, అగుచుఁ, పరఁగఁ, అమ్మహాబలము = ఆగొప్పసేన, తముఁ, భజించి, అమరఁ = ఒప్పఁగా, అవలమాన=ఇంచుక చలించుచున్న, నిగాఢధృతిని = అధికధైర్య మున, మౌనికథలు = మునిజనులు చెప్పెడికథలు, వినుచుఁ, అంతఁ, ఆ, కుమారులు = పాండవులు, నగరిఁ, చేరఁ, అరిగిరి = హస్తినంజేరఁ బోయిరి.

తా. తమ్మునికుమారులు వచ్చుచుండుట దెలిసి ధృతరాష్ట్రుఁడు చతు రంగబలముల నెదురనంపి వారిం బిలుచుకొని రమ్మనెను. బాలురాసేనల తోఁగూడి మునులుచెప్పెడి కథలు వినుచు హస్తినంజేర నరిగిరి.

“ అటక ” ‘ అటగతౌ ’ అనుధాతువుమీఁద ఘఞ్ప్రత్యయము.

“ హరి.” “ హరిర్యమారార్కశ్వాగ్నీందు, విష్ణ్వద్రాం శుకశేషువా, వాయుభేకాహిసింహేషు, కపౌచకపిలేత్రిషు.” నానార్థరత్నమాల.

“ శతాంగ.” “ శతాంగస్స్యందనోరథః ” అని యమరము.

“ అవలమాన ” “ ఆజీవదర్థభివ్యాప్తౌ.” అని యమరము.

“ గారాము ” “ పేర్మి యర్మిలి మక్కువకూర్మి నెమ్మి, నెనరుగా దిలిగారాము నెయ్యమింపు, ప్రేముడి యనుంగుముద్దనఁ బ్రియమునకును, నామధేయంబులయ్యె.” ఆంధ్రనామశేషము.

సీ. ఆరీతిఁ జని తమయానగరంబు ప్ర
వేశించి మెలఁగ నుద్వృత్తినడరు
నస్రపయోధుల నంబకంబులనాఁగి
తన్మహాశ్రమశోకదైన్యభరము
హరియించుటకుఁ దమకురువృద్ధు లొసఁగను
బహుళతాపసహిత భాషితములు
దీవెనల్వెన యవిధేయత తోడఁ జే
కొనుచును వెండియు నెనరుదారలు

గీ. గారనము లొనర్పఁ గైకొంచుఁ గ్రమమునఁ
బితృవియోగచింతఁ బ్రబిదిలిక్రీడ
సలిపి రెల్లప్రొద్దు సన్మానసస్థితిఁ
జాల ధార్తరాష్ట్ర లీలఁ దగిలి. 16

**రామాయణ.** ఆరీతి౯, జని = వెళ్లి, తమయాన౯ = తమయాజ్ఞయందు, కరంబు = మిక్కిలి, మెలంగ౯ = మహర్షులు మెలఁగఁగా, [స్వోద్దిష్టరాక్షస సంహారకులగుటచేఁదదర్థముగా రామలక్ష్మణులు తెల్పు చెప్పిననట్లుండెడి యని భావము.] ప్రవేశించి=ఆశ్రమము ప్రవేశించి, ఉద్వృత్తి౯, అడరు = గర్వముచే విజృంభించుచున్న, అస్రప, యోధుల౯ = రాక్షసవీరులను, అంబకంబుల౯, ఆఁగి = బాణములచే నివారించి, తత్... భరము = తత్, మహాశ్రమ = ఆగొప్ప యాశ్రమముయొక్క, శోక = వ్యసనముయొక్కయు, దైన్య = దీనత్వముయొక్కయు, భారమును, హరియించుటకు౯ = పోఁగొట్టుటచే, [ఆశ్రమ శోకదైన్యభరమనుట "గంగాయాం ఘోషః" అనుటవలె లక్షణ. ఆశ్రమమున నుండెడి మహర్షులయొక్క శోకదైన్యభరమని భావము. హరియించుటకు అని తృతీయార్థమున షష్ఠి.] తమకున్ = రామలక్ష్మణులకు, ఉరువృద్ధుల్ = మిక్కుట

మగు నభివృద్ధులు, ఒసఁగెడు=ఇచ్చుచుండు, బహుళ......భాషితములు—బహుళ=అనేకులగు, తాపస=మహర్షి జనుల, హితభాషితములు = మేలొసఁగెడిమాటలగు, దీవెనల్ = ఆశీర్వాదములను, వినయ, విధేయతతోడన్, అడఁకువతోడను, విధేయతతోడను, అణఁగిమణఁగి యుండుటతోడననుట. చేకొనుచున్ = గ్రహించుచు, వెండియున్ = ఇంకను, నెనరు దొరలు = ప్రియముగల్గించునట్టి, గౌరవముల్, ఒనర్పన్ = మహర్షులు గౌరవింపఁగా, కైకొంచున్ = గ్రహించుచు, క్రమమునన్ = వరుసఁగా, పితృవియోగచింతన్ = తండ్రియగు దశరథుని వీడుటవలనఁ గల్గినచింతను, ప్రిదిలి = వీడి, ఎల్లప్రొద్దున్ = ఎల్లప్పుడును, సత్, మానస, స్థితిన్ = సత్పురుషుల మనస్సులనెడి మానససరస్సునందలి యునికిచే, చాలన్ = మిక్కిలి, ధార్తరాష్ట్రిలీలన్, తగిలి = హంసలసామ్యమునంది, క్రీడసలిపిరి = వినోదించుచుండిరి.

తా. రామలక్ష్మణులాశ్రమము ప్రవేశించి, యచ్చటి మహర్షులు వీరి మాటచొప్పున నడచికొనుచుండఁగా, గర్వోద్రిక్తులగు రాక్షసవీరుల నిజ బాణముల నివారించి, యచ్చటి ఋషుల దుఃఖము పోఁగొట్టిరి. అంత నామహర్షులు సంతసిల్లివీరికి మేలుకలుగులాగున నాశీర్వదింప వినయ విధేయతలతో నా దీవెనలంగ్రహించిరి. మహర్షులు ప్రీతిచే నొనర్చు గౌరవముల నందికొని పితృవియోగముచేఁగలిగిన చింతనుమానిరి. సత్పురుషుల మనస్సుల నెడిమానస సరస్సులలో మనికిచే హంసలవిధము నైకొని వినోదించుచుండిరి.

"తమయాన కరంబుమెలఁగన్" అనుస్థలమున రాక్షసులయాజ్ఞయని యర్థము గావింపవచ్చునుగాని, రామలక్ష్మణుల యాజ్ఞయనుటయే కవియాశయము.

"ఆన." "ఆజ్ఞ ప్రియానతిస్యాజ్ఞయాన." ఆంధ్రభాషాభూషణము.

"అస్రప" "రాక్షసః కౌణపః క్రవ్యాత్క్రవ్యాదోఽస్రప ఆశరః."* అని యమరము. "అస్రంరక్తంపిబతీత్యస్రపః." గురు బాల ప్రబోధిక.

"సన్మానసస్థితిన్" అనుచోశ్లిష్టరూపకము. "సితాంశువర్ణైర్వ యతిస్మతద్గుణైః" అని శ్రీహర్షుఁడు ప్రయోగించెను.

"ధార్తరాష్ట్రిలీలన్." "ధార్తరాష్ట్రాస్సితేతరాః" అని యమరము.

భారత. ఆరీతిన్, చని, తమ, ఆనగరంబు = తమపట్టణమగు హస్తి నను, ప్రవేశించి, మెలఁగన్ = వర్తించుచుండఁగా, ఉద్వృత్తిన్, అడరు= మిక్కిలియధికమైన, అస్ర = కన్నీరనెడి, పయోధులన్ = సముద్రములను, అంబకంబులన్ = కన్నులయందు, ఆఁగి = నిలిపి, తత్, భరము - తత్ = ఆ, మహాశ్రమ = గొప్పప్రయాసవలని, శోకదైన్య భరము = దుఃఖదీనత్వ ములయొక్క యతిశయమును, హరియించుటకున్, తమ, కురువృద్ధులు = కురువంశమునందలి వృద్ధులగు, భీష్మాదులు, ఒసఁగెడు, బహుళ......భా షితములు—బహుళ = మిక్కుటములైన, తాపసహిత = పరితాపముతోఁ గూడిన, భాషితములు = మాటలను, దీవెనల్, = ఆశీర్వాదములు, వినయ, విధేయతతోడన్, చేకొనుచున్ = గ్రహించుచు, వెండియున్, నెనరు= ప్రియముగల, దొరలు = రాజులు, గౌరవములు, ఒనర్పన్, కైకొంచున్ = గ్రహించుచు, క్రమమునన్, పితృవియోగచింత = తండ్రి మరణమువలని చింతను, ప్రిదిలి, ఎల్లప్రొద్దున్, సన్మానసస్థితిన్ = మంచి మనోవ్యాపా రముచేత, చాలన్ = ధార్తరాష్ట్రిలీలన్ = దుర్యోధనాదులయొక్క లీలయందు, తగిలి, క్రీడ, సలిపిరి.

తా. అట్లు వెడలిన యాపాండవులు తమపట్టణమగు హస్తినాపుర ముంజేరిరి. భీష్మాదులు శోకభరమునవచ్చుకన్నీళ్లు కండ్లయందే యాఁపికొని పాండవుల శోకమపనయింపఁ బరితాపసహిత వాక్యములాడుచు నాశీర్వ దింప వారు దానిని వినయవిధేయతలతో గ్రహించిరి. ప్రియముగల దొరలు చేయు గౌరవములంగ్రహించి క్రమముగఁ దండ్రిమరణమువలని దుఃఖము వీడి, మంచిమనస్సుతో దుర్యోధనాదులఁజేరి యాడుకొనుచుండిరి.

“ అస్రము.” “అస్రమశ్రుణిశోణితే ” అని యమరము.

“ అంబకము.” “ అంబకం నేత్రశరయోః ” అని విశ్వము.

“ భరము.” “ భరోతిశయభారయోః ” నానార్థరత్నమాల.

“ చేకొనుచున్, కైకొంచున్ ” ఇవి శబ్దపల్లవములు.

“కైకొంచున్” చువర్ణకంబు పరంబగునపుడన్వాదుల కుత్వలోపంబేని నుస్థానంబున బిందువేని విభాషనగు.” బాలవ్యాకరణము.

మ. అమితప్రౌఢిగ ధాన్వికాగ్రియి పితృవ్యాదిష్ట వృత్తిన్మహో
త్తమ భక్తిన్ గ్రహియించి శాంతనవసత్వశ్రీచమత్కారప
క్త్రిమసౌభాగ్యధురీణ తన్మహిమహర్షిస్వాంత లీలోచితో
త్తమసంక్రీడలొనర్చిరక్కొమరులాత్మజ్ఞాతి సఖ్యాఢ్యులై.

రామాయణ. అమితప్రౌఢి, గ = మిక్కిలి గొప్పతనము నందిన, ధాన్విక = విలుకాండ్రలో, అగ్రియ = శ్రేష్ఠుఁడైన, పితృ = తండ్రియైన దశరథునిచే, వ్యాదిష్ట = ఆజ్ఞాపింపఁబడిన, వృత్తిన్ = వర్తనమును, మహోత్తమభక్తిన్ = మిక్కిలి గొప్పదగుభక్తిచే, గ్రహియించి [దశరథుఁడు “మహర్షుల యాజ్ఞననుసరింపుడు వారి కుత్సాహముగల్గునట్లు నడచికొనుఁడు” మున్నగు నుపదేశములంజేసి యుండుటచే నాలాగుననే నడచికొనుచుండిరని భావము.] శాంత.......... సంక్రీడలు—శాంత = శాంత గుణమునందిన, పరస్పరవిరోధము లేనియనుట. నవ = ప్రాయపువియునైన, సత్వ = జంతువులయొక్క, శ్రీ = సమృద్ధియొక్క, సమూహముయొక్క యనుట. చమత్కార = చెలలాటములచే, పక్త్రిమ = పరిపక్వమైన, సౌభాగ్య = ఒప్పిదమును, ధురీణ = వహించిన, తన్మహి = ఆయాశ్రమప్రదేశముననున్న, మహర్షి = మునులయొక్క, స్వాంత = మనస్సులకు, లీలోచిత = ఉల్లాసమునకుఁదగిన, ఉత్తమసంక్రీడలు=గొప్పక్రీడలను, అక్కొమరులు = ఆరాజకుమారులు, రామలక్ష్మణులనుట. ఆత్మజ్ఞ = బ్రహ్మజ్ఞులగు మహర్షులతో, అతిసఖ్యాఢ్యులై = మిక్కిలి స్నేహముగలవారై, ఒనర్చిరి = చేసిరి.

తా. రామలక్ష్మణులు దశరథోపదేశము భక్తితో గ్రహించి, పర
స్పరవైషమ్యములు మానివర్తించు సింహాదిజంతు సమూహముగల యాయా
శ్రమభూమియందలి మహర్షులతో మైత్రిగల్గి యుత్తమ క్రీడలొనర్చిరి.

"ధార్మికాగ్రియ" "పరార్థ్యాగ్ర్యప్రాగ్రసర, ప్రాగ్రాగ్ర్యాగ్రియ
మగ్రియం." అని యమరము.

భారత. అమిత ప్రౌఢిగన్, ధార్మిక = ధర్మాత్ముఁడైన, అగ్రియ
పితృవ్య = పెద్దతండ్రియగు ధృతరాష్ట్రునిచే, ఆదిష్టవృత్తిన్ = ఉపదిష్టమైన
వర్తనను, మహోద్యమభక్తిన్, గ్రహించి, శాంతనవ = భీష్మునియొక్క,
సత్వశ్రీ = బలసంపద యొక్క, చమత్కార = చాతుర్యముచే, పక్త్రిమ=
పరిపక్వమయిన, సౌభాగ్య ధురీణ = ఒప్పిదము వహించిన, తన్మహిమ =
ఆధృతరాష్ట్రుని యైశ్వర్యముచే, హర్షి = సంతోషించుచున్న, స్వాంత =
మనస్సునందలి = లీల = విలాసమునకు, ఉచిత = తగిన, ఉత్తమ, సం
క్రీడలు = ఆటలు, ఆ, కొమరులు = ఆరాజపుత్రులు, పాండవులనుట.
ఆత్మ = తమయొక్క, జ్ఞాతి = దాయాదులగు దుర్యోధ నాదులతో,
సఖ్యాఢ్యులై, ఒనర్చిరి. చేసిరి.

తా. ధర్మాత్ముఁడగు తమ పెదతండ్రి చేసిన హితోపదేశమును
భక్తితో గ్రహించి, భీష్మాచార్య బలసమృద్ధిచేఁ గల్గిన యాధృతరాష్ట్రు
నైశ్వర్యమునకుఁ దగినలాగున జ్ఞాతులగు దుర్యోధ నాదులతోఁ గూడి
పాండవు లాడుచుండిరి.

"పితృవ్య." "పితృభ్రాతాపితృవ్యస్స్యాత్" అని యమరము.

శా. శశ్వద్విస్ఫురిత స్వబాహుబలభీష్మప్రౌఢ చాపక్రియ
ల్విశ్వామిత్ర వితానవిఘ్నభయవిశ్లేషంబొనర్పన్ జగ
ద్విశ్వాసస్థితిఁ జాలియున్కినతులన్ శ్రీ వీరాత్మభవుల్గాంచిర
త్త్రైశ్వర్యాహమిక విశృంఖలవిహారారంభవిస్రంభముల్.

**రామాయణ.** శశ్వత్......క్రియల్—శశ్వత్ = చక్కఁగా, విస్ఫురిత = ప్రకాశించుచున్న, బాహుబల = భుజబలముచే, భీష్మ = భయంకరమైన, ప్రౌఢ, చాపక్రియల్ = ధనుర్వ్యాపారములు, విశ్వామిత్ర......విశ్లేషంబు—విశ్వామిత్ర, వితాన = విశ్వామిత్రునియజ్ఞము యొక్క, విఘ్న = విఘాతమువలని, భయ = భీతియొక్క, విశ్లేషంబు = ఎడబాటును, ఒనర్పన్, జగత్, విశ్వాస్యస్థితిన్ = లోకులు నమ్మునరీతిని, చాలియున్కిన్ = చాలియుండుటచే, ఆ, వీరార్భకుల్ = ఆవీరబాలురు, రామలక్ష్మణులనుట. అటులన్, అత్యైశ్వర్య......విస్రంభముల్—అత్యైశ్వర్య = ఈశ్వరకృత్యమును మీఱిన, అహమికా = గర్వమునుండి, విశృంఖల = స్వేచ్ఛగానుండిన, విహార, ఆరంభ = క్రీడాప్రయత్నము నందలి, విస్రంభముల్ = వేడుకలను, కాంచిరి = పొందిరి.

తా. తమ బాహుబలమున భయంకరమగు విలువిద్య విశ్వామిత్ర యాగవిఘ్న నిరాసనము గావింపఁగ నెల్లరును నమ్మఁజాలి యుండుటచే గర్వరహితమగు క్రీడలయందు వేడ్కఁగల వారైరి.

"వితాన." "క్రతువిస్తారయోరస్త్రీ వితానం త్రిషుతుచ్ఛకే," అని యమరము.

"ఐశ్వర్య." "గుణవచన బ్రాహ్మణాదిభ్యః కర్మణిచ" అను పాణిని సూత్రమున నిటష్యఞ్ప్రత్యయము.

**భారత.** శశ్వత్, విస్ఫురిత, స్వబాహుబల = తమ భుజబలములతోడ భీష్మ = భీష్మాచార్యులయొక్క, చాపక్రియల్, విశ్వ......విశ్లేషంబు—విశ్వ = సమస్తమైన, అమిత్ర = శత్రువులయొక్క, వితాన = సమూహము వలని, విఘ్నభయ = విఘాతమువలని భయమునుండి, విశ్లేషంబు, ఒనర్పన్ = పోఁగొట్టఁగా, జగద్విశ్వాస్యస్థితిన్, చాలియున్కిన్, అటులన్, వీరార్భకుల్ = *ఆకౌరవ పాండవులు, అత్యైశ్వర్య = అమితైశ్వర్యమువలని, అహమికా = అహంకారమును, విశృంఖలవిహార = స్వేచ్ఛాసంచారమును,

ఆరంభ, విస్రంభముల్ = ఆరంభముల యందుఁగల విశ్వాసములును, కాంచిరి.

తా. చక్కఁగాఁ బ్రకాశించునట్టి తమభుజబలమునకు భీష్మాచార్యుల చాపకౌశలము తోడ్పడ, శత్రువులజయించి యాకౌరవ పాండవులైశ్వర్యాధిక్యముచే గర్వించి స్వేచ్ఛావిహారములు సల్పుచు నారంభ విశ్వాసము గాంచి యుండిరి.

"విస్రంభ." "సమౌవిస్రంభ విశ్వాసౌ" - అని యమరము.

సీ. ఇమ్మాడ్కి నయ్యన్నదమ్ములపాప ల
వార్యఖేలల నతివ్యాప్తమైన
యాసవనక్షోణియందును సరసుల
గరిడి నిష్టపురాణపరిచితిఁ బ్రియ
మందెడుసమయంబునం దాటకాకుమా
రు లలోలసద్బలయాధి నెందు
మాఱుద్ధిలే కొప్పు మీఱు భీమోద్ధతి
బ్రబలంగఁ దారాసరణి మెలంగఁ

గీ. గడఁక చాలక కడుఁ గలఁగెడు తాపస
నాథహృదయవర్తనంబు దిరము
గాఁగఁ దేర్చి బాధకలితసుయోధనా
దులగు రాజనందనులు గడంగి. 19

రామాయణ. ఇమ్మాడ్కిన్ = ఈలాగున, ఆ, అన్నదమ్ములు = ఆసోదరులు, అపాపలవ = పాపలేశమునులేని, ఆర్యఖేలలన్ = గొప్పవారి యొక్క విహారములచేత, అతివ్యాప్తమైన = మిక్కిలివ్యాపించిన, ఆసవన క్షోణియందును = ఆయజ్ఞవాటము నందును, సరసులగరిడిన్ = రసికుల వెంబడి, ఇష్టపురాణ పరిచితిన్ = ప్రియమగు పురాణముల శ్రవణముల

చేతను, ప్రియమందెడు సమయంబున౯ = ప్రియపడు తరుణమున, తాటకా కుమారులు=తాటకా పుత్రులగు సుబాహు మారీచులు, అలోల...రూఢి౯— ఆలోల = చలింపని, సద్బల = గొప్ప సేనలవలని, రూఢి౯ = స్థైర్యముచే, ఎందు౯ = ఎచ్చటను, మాఱుద్దిలేక = సమానులులేక, ఒప్పమీఱు= భీమోద్ధతి౯ = భీకరగర్వముచే, ప్రబలంగ౯ = ప్రబలుచుండఁగా, తారాసరణి౯ = ఆకసమున, మెలంగ౯, కడఁక, చాలక = పూన్కిలేక, కదు౯, కలఁగెడు = కలఁతనెందు, తాపసనాథ = విశ్వామిత్రుని, హృదయ వర్తనంబు౯ = చిత్తవృత్తిని. తిరముగాఁగ౯ = స్థిరమగునట్లు, తేర్చి, బాధ, కలిత = మిక్కిలి చేయఁబడిన; సుయోధ = మంచియోధులకు సంబంధించిన, నాదులగుచు౯=సింహనాదముగలవారగుచు,రాజనందనులు = రామలక్ష్మణులు, కడంగి = ప్రయత్నించి.

తా. రామలక్ష్మణులా యాశ్రమ ప్రదేశమునఁ బెద్దలచెంతఁబురాణ శ్రవణాదులు సేయుచుండఁ దాటకాతనయు లగు సుబాహు మారీచులు, సేనాసమన్వితులయి యాకసమున నిలువ విశ్వామిత్రుని మనసుకలఁత నందెను. రాజపుత్రులాతని చిత్తము స్థిరపడునట్లు దిక్కులు మాఱుమ్రోగునట్లు సింహనాదము గావించి. మీఁది పద్యముతో దీని కన్వయము.

“గిరిడి” “చెంత కుఱుగలిడగ్గఱచేర్వ పొంత, దాపుసరస కెలను పజ్జ ప్రాపునొద్ద, యండ చక్కి గరిడి యననమరనౌస, మీపనామములుమనోజ్ఞ సాంబ” సాంబనిఘంటువు.

“ఉద్ది” “ఈడుదినుసుసాటి యెనదొరసరిజోడు, సవతుమాద్రి యుద్ది జతతరంబు, పురుడునాఁగ సదృశములకివి యాఖ్యలౌ, వివిధగుణసనాథ విశ్వనాథ” ఆంధ్రనామ సంగ్రహము.

భారత. ఇమ్మన్కి౯, ఆయన్నదమ్ముల పాపలు = ధృతరాష్ట్రపాండురాజ తనయులు, కౌరవ పాండవులనుట. అవార్య = అడ్డగింపని, ఖేలల౯ = ఆటలయందు, అతివ్యాప్తమైన, అళి౯ = అళచే, వనశ్రేణి

యందును, = అరణ్య ప్రదేశముల యందును, సరసులక్ = కొలఁకు లందును, గరిడిక్ = సాముకూటమునందును, ఇష్టపురాణ, పరిచితిక్ = వేడుకలయందుఁ బరిచయము చేతను, ప్రియమందెడు, సమయమంచుక్ = తరుణమునందు, ఆటకుక్ = క్రీడకు, ఆకుమారులలోక్ = కౌరవపాండవులలో, లసత్ ... రూఢిక్ — లసత్ = ప్రకాశించెడు, బలరూఢిక్ = శౌర్యాతిశయముగ, ఎందుక్, మాఱుద్ది, లేక, ఒప్పుమీఱు, భీమోద్ధతి = భీముని యౌద్ధత్యము, ప్రబలంగక్, తారు = తాము, కౌరవులనుట. అసరణిక్ = అవిధముగ, మొలంగక్, కడఁకచాలక = అట్లుండుటకు ధైర్యము చాలక, కడుక్, కలఁగెడు, తాప, సనాథ = పరితాపముతోఁ గూడిన, హృదయ ప్రసంగంబున, తిరుగు గాఁగక్, తేర్చి = తేర్చికొని, బాధ = ప్రతిజ్ఞతో, చంపవలయునను ప్రతిజ్ఞతో, కలితి = కూడిన, దుర్యోధనాదులు= దుర్యోధనుఁడు మున్నగు, రాజనందనులు, కడంగి.

తా. కౌరవపాండవులుపవనాది ప్రదేశముల విహరించుచుండ, వారిలో భీముని బలము దమకులేనందునఁ గౌరవులు ధైర్యముచాలక భీతిఁ జెంది యాతనిం జంపవలయునను ప్రతిజ్ఞ గలవారైరి. మీఁది పద్యముతో నన్వయము.

"గరిడి." "సాముకూటమునకు సరస గాగరిడినాక్" సాంబని ఘంటవు.

"బాధ." "భృశప్రతిజ్ఞ యోర్బాఢం" అని యమరము.

మ. అసమామ్నాయనయాధ్వరక్షణవిఘాతాపాదియై మించు రా
క్షసకర్ణంబునకుం దలంకక సమగ్రస్థైర్యధౌరేయమా
నసులై డెందములోన ధర్మపటిమం దద్భీమసేనాంగద
ర్పసముద్రేకము రూపుమాపఁ గలితప్రారంభులై రంతటన్.

రామాయణ. అసమ ..ఆపాదియై — అసమ = సాటిలేని, ఆమ్నాయనయ = వేదవిధిగల, అధ్వర, క్షణ = యజ్ఞోత్సవమునకు, విఘాత,

ఆపాదిన్తై = విఘ్నము కల్గించువారై, మించు = అతిశయించు, రాక్షస కర్మంబునకున్ = రాక్షసుల కార్యములకు, యజ్ఞశాలలయందు రక్తమాంస వర్షము గురిపించుట మున్నగు నీచకార్యములకనుట. తలంకక = బెదరక, సమగ్ర......మానసులై—సమగ్ర = పూర్ణమైన, స్థైర్య = స్థిరత్వమను దానియొక్క, ధారేయ=భారవాహియైన; మానసులై = మనస్సుగలవారై, ధర్మపటిమన్ =వింటి నేర్పుచే, తత్......సముద్రేకము—తత్=ఆ, భీమ= భయంకరమైన, సేనా = సైన్యముయొక్క, అంగ = రథాది చతురంగముల యొక్క, దర్పసముద్రేకము=గర్వాతిశయము, రూపు, మాపన్ = నశింపఁ జేయుటకు, అంతటన్, డెందములోనన్ = మనస్సున, కలితప్రారంభులు, ఐరి = ప్రయత్నించిరి.

తా. సాటిలేని వేదవిధిగల యజ్ఞోత్సవమునకు విఘాతము సల్ప నెంచిన రాక్షసుల క్రూరకార్యములకు జంకక ధైర్యముగలవారై, వింటి పటుత్వమున రాక్షసులసేనలగర్వము నశింపఁజేయ నారామలక్ష్మణులు ప్రారంభించిరి.

“ఆమ్నాయ.” “శ్రుతి స్త్రీ వేద ఆమ్నాయః” అని యమరము.

“క్షణ” “నిర్వ్యాపార స్థితౌ కాలవిశేషోత్సవయోః క్షణః” అని యమరము.

భారత. అసమ, ఆమ్నాయ = కాలముయొక్క, నయాధ్వ = నీతి మార్గముయొక్క, రక్షణ, విఘాతాపాదిన్తై, మించు, రాక్షసకర్మంబున కున్ = క్రూరకార్యములకు, తలంకక = భయపడక, వెనుదీయక యనుట. సమగ్ర స్థైర్య ధారేయ, మానసులై, అధర్మపటిమన్ = అధర్మపు నేర్పు చేత, భీమసేన...సముద్రేకము - భీమసేన = భీమునియొక్క, అంగదర్ప= శరీరగర్వముయొక్క, సముద్రేకము = అతిశయము, రూపుమాపన్, అంత టన్, డెందములోన్ = మనస్సునందు, కలిత, ప్రారంభులైరి.

తా. కురువంశమునందలి నీతిమార్గముయొక్క రక్షణమునకు విఘ్న
కరములగు క్రూరకృత్యములుచేయుటకు వెనుదీయక, ధైర్యముతో, నధ
ర్మము నాచరించుటయందలి నేర్పున భీముని బలదర్పము రూపుమాప
వలయునని యాదుర్యోధనాదులు తలంచిరి.

"ఆమ్నాయ." "ఆమ్నాయస్సంప్రదాయకః" అని యమరము.

ఉ. తోరపుటల్క నారిపులు దొమ్మిగఁ బైపయిఁ గ్రమ్మ వారిలీ
లారణవృత్తిఁ గిట్టి కడులావరిభీముఁడు రామభద్రుఁడే
పారెడువేడ్కతో నెఱపెనప్పుడు కాండపటుప్రహారదు
ర్వారవిధిన్ సుబాహుఁడను వాఁడిల సద్గతి గాంచి మించఁగన్.

రామాయణ. తోరపుటల్కన్ = అతిశయించిన కోపముచే, ఆ
రిపులు = సుబాహు మారీచులు, దొమ్మిగన్ = సంకులసమరము సేయ,
పయిపయిన్, క్రమ్మన్=మూఁగఁగా, అరిభీముఁడు = శత్రువులకు భయం
కరుఁడగు, రామభద్రుఁడు, వారి లీలారణవృత్తిన్ = అయసురులతోడిక్రీడా
మాత్రమగుయుద్ధవర్తనమున, కిట్టి=డాసి, అప్పుడు, ఏపారెడు వేడ్కతోన్ =
అతిశయించిన వేడుకతో, కాండ ......... విధిన్—కాండ = బాణ
ములయొక్క, పటుప్రహార = దృఢమగు ప్రయోగముచే, దుర్వారవిధిన్ =
అడ్డగింపరానిరీతితో, సుబాహుఁడనువాఁడు, ఇలన్ = భూమియందు,
సద్గతిన్, కాంచి, మించఁగన్ = చచ్చునట్లుగా, కడులావు = మిక్కిలి
బలము, నెరపెన్ = నిండించెను.

తా. సుబాహు మారీచులు దొమ్మిగా రామునిపైఁ బడరాఁగ నతఁడు
బాణప్రహారముల సుబాహువును నేలగూల్చెను.

భారత. తోరపుటల్కన్, ఆరిపులు = ఆశత్రువులు దుర్యోధ
నాదులనుట. పయిపయిన్, క్రమ్మన్, కడు, లావరి = బలముగల, రామ
భద్రుఁడు మనోజ్ఞమైన యదృష్టముగల, భీముఁడు, ఏపారెడువేడ్కతోన్,

అప్పుడు, సుబాహుఁడు = మంచి బాహువులుగలవాఁడు, బాహుబలము గలవాఁడనుట. అను, వాఁడే = ప్రతాపము, లసత్, గతిఁ, కాంచి = పొంది, మించఁగ = అతిశయింపఁగా, కాండ......విధిఁ—కాండ= నీటితో, పటుప్రహార=బలముగాఁగొట్టునట్టి, దుర్వార, విధిఁ = వ్యాపార మును, సెఱపెఁ = జరిపెను.

తా. జలక్రీడాసమయమునఁ బాండవకౌరవులకుఁ గలహము గల్గ బలవంతుఁడగు భీమసేనుఁడు దుర్యోధనాదులపైఁ దనబాహు పటుత్వము మెఱయ నీటింగొట్టి వారిని బాధించెను.

"రామభద్రుఁడు" శ్వశ్రేయసంశివంభద్రం" అని యమరము.

"కాండ." కాండో స్త్రీ దండబాణార్వ సర్గావసర వారిషు" అని యమరము.

వ. అప్పుడతండు మఱియును. 22

క. వెసఁ దజ్జ్యేష్ఠుని నతిసా
హసుని హృదర్పితమహాశుగాశుగవేగో
ల్లసదాప్రసభాచరితా
ధిసముద్రనిపాతుఁ జేసె దృఢదోశ్శక్తిన్. 23

రామాయణ. వెసఁ = వేగముగా, తజ్జ్యేష్ఠునిఁ = సుబాహుని యన్నయగు మారీచుని, అతిసాహసునిఁ, మిక్కిలి తెగువదనముగలవానిని, హృదర్పిత.........నిపాతుఁ—హృత్ = ఱొమ్మునందు, అర్పిత = వేయఁబడిన, మహాశుగాశుగ = గొప్పదగు వాయవ్యాస్త్రముయొక్క, వేగ, ఉల్లసన = వేగాతిశయమున = ప్రసభ = బలాత్కారముగా, ఆచరిత = చేసిన, అధిసముద్ర = సముద్రమధ్యమున, నిపాతుఁ = పడిన వానిఁగా, దృఢదోశ్శక్తిఁ = దృఢమగుబాహుబలముచే, చేసెఁ.

తా. రాముఁడు మారీచుని వాయవ్యాస్త్రమున సముద్ర మధ్యమునఁ బడు నట్లొనర్చెను.

"ఆశుగ." ఆశుగోవాయువిశిఖౌ" అని యమరము.

భారత. వెసన్, అతిసాహసున్, జ్యేష్ఠునిన్ = వారిలోఁ బెద్ద వానిని దుర్యోధను ననుట. అతిసాహసునిన్, హృత్, అర్పిత = మనస్సునఁ గల్గిన, మహాశుక్ = గొప్పవ్యసనమనెడి, ఆశుగ = బాణముయొక్క, వేగ = వేగముచే, ఉల్లసత్ = ఒప్పెడి, ఆప్రసభ, ఆచరిత= మిక్కిలిబలాత్కారముగా నాచరింపఁబడిన, ఆధి = మనోవ్యథయనెడి, సముద్ర=సముద్రమునందు, నిపాతున్ = పడినవానినిగా, దృఢ, దోశ్శక్తిన్ = బాహుబలముచే, చేసెన్ = భీముఁడనుకర్తృపద మధ్యాహార్యము.

తా. భీముఁడతి సాహసముగల దుర్యోధనుని మానసమునఁ గల్గిన గొప్ప మనోవ్యాధియనెడి సముద్రమునఁబడు వానినిగాఁ దనభుజబలము వలనఁ జేసెను. భీముఁడాచరించు కార్యముల మూలమున దుర్యోధనున కంతస్తాప మధికమయ్యెనని భావము.

చ. అతఁడును నట్ల బాల్యదశయందకడున్ బిరుదైనయాబలా
ద్భుతునిదురంబరిస్ఫురణఁదూలఁ బ్రవర్తిలువేళఁ గ్రూరచి
త్తతఁదనమూఁకతోఁ బొదివితాఁ దదజయ్యతఁ జూచుటన్ భయా
హతమతిఁ గట్టిడై చెవెసనాపగలోన ననారతంబుగన్. 24

రామాయణ. అతఁడును = ఆమారీచుఁడును, అట్ల బాల్యదశయంద = బాల్యముననే, కడున్, బిరుదైన = మిక్కిలిశౌర్యవంతుఁడైన, ఆ, బలాద్భుతుని = అద్భుతబలముగల యారాముని, తురంబు = యుద్ధము, అరిస్ఫురణ = శత్రుసామర్థ్యము, తూలన్, ప్రవర్తిలువేళన్ = కొంచెపడులాగున నొవర్చుతరుణమున, క్రూరచిత్తతన్ = క్రూరమగు మనస్సుకలుగుటచే, తనమూఁకతోన్, పొదివి = తనగుంపుతో సమీపించి, తాన్,

తత్ = ఆరాముని, అజయ్యతన్ = జయించుటకు శక్యముగాకుండుటను, చూచుటన్, భయాహతమతిన్ = భయమునఁగొట్టువడిన మనస్సుగలవాఁడగుటచే, వెసన్, ఆపగ = ఆద్వేషము, సోదరమరణమువలని ద్వేషమనుట. అవారితంబుగన్ = అడ్డగింపరానిదిగ, కట్టివైచెన్.

తా. సేనలతో నెదిరింపవచ్చిన మారీచుఁడు రాముని యాబల సమృద్ధిఁగాంచి యాతఁ డజయ్యుఁడనియెఱిఁగి సోదరమరణమువలని ద్వేషము మనసులో నణఁచికొని యుండెను.

"అజయ్యత" "క్షయ్య జయ్యౌశక్యార్థే" అని నిపాతము.

"మూఁక." "పౌజు చేరువ నెుత్తంబు బారుతుటుము, దండుపరిగమి కూటము పిండుదాఁటు, మూఁకదళము నుపేళ్లు సమూహమునకు, భుజగవర హార యవిముక్తపురవిహార." ఆంధ్రనామసంగ్రహము.

భారత. అతఁడును = ఆదుర్యోధనుఁడును, అట్లు = పూర్వోక్తప్రకారంబున, బాల్యదశయందు, కడున్, బిరుదైన, ఆబలాద్భుతున్ = అద్భుతబలముగల యాభీముని, నిదురన్ = నిద్రచే, పరిస్ఫురణ = తెలివి, తూలన్, ప్రవర్తిలువేళన్ = నశించినసమయమున, ప్రబుద్ధుఁడు కాకుండు నపుడనుట. క్రూరచిత్తతన్, తనమూఁకతో, పొదివి = సమీపించి, తాన్ = దుర్యోధనుఁడు, తత్ = ఆభీమునియొక్క, అజయ్యతన్, చూచుటన్ = చూచుటచే, [తాను ఆభీముని జయింపశక్యముగాదని తెలిసికొని యనుట.] భయాహతమతిన్, అవారితంబుగన్ = అడ్డగింపరానిదిగా, ఆపగలోనన్ = నదిలో, కట్టి వైచెన్ = త్రాళ్లతోఁగట్టి పడవైచెను.

తా. దుర్యోధనుఁడు భీమునియాబలముగాంచి, యాతఁ డజయ్యుఁడగుట యెఱిఁగి యతఁడు నిద్రించుచుండఁ ద్రాళ్లతోఁ గట్టివైచి నదిలోఁ ద్రోసెను.

"ఆపగ". "అపాంసమూహః ఆపం, తేన గచ్ఛతీత్యాపగా" గురుబాలప్రబోధిక.

వ. అప్పుడు. 26

క. ఘనవిగ్రహాజృంభణమున
ననయము దన కట్లు తెగఁగ నవ్వాహినిఁ గ్రీ
డనగెలిచి వచ్చునబ్బా
లునిఁ గని వెఱఁ గంది రాత్మలో నచటిజనుల్. 27

రామాయణ. ఘన......జృంభణమునన్-ఘన = గొప్పదగు, విగ్రహ = యుద్ధముయొక్క, జృంభణమునన్ = అతిశయముచే, అట్లు, అనయమున్, తనకున్ = రామునకు, తెగఁగన్ = మిక్కిలిఖండింపఁబడఁగా, క్రీడన్ + అ = విలాసముగానే, అవ్వాహినిన్ = ఆసేనను, గెలిచి, వచ్చునబ్బాలునిన్ = జయించివచ్చు నాబాలుని,! రామునునుట. కని = చూచి, అచటిజనుల్, ఆత్మలోన్ = తమలోన, వెఱఁగందిరి = ఆశ్చర్యపడిరి.

తా. యుద్ధమున ననాయాసమున శత్రుఖండన మొనర్చిన యారాముం గని, యచ్చటిమునిజను లాశ్చర్యము నెందిరి.

భారత. ఘన...జృంభణమునన్-ఘన, విగ్రహ = శరీరముయొక్క, జృంభణమునన్ = నీల్గుటచే, అనయమున్ = మిక్కిలి, తన, కట్లు తెగఁగన్ = తనయొక్కబంధనములు తెగఁగా, భీముని కట్లుతెగునట్లనుట. అవ్వాహినిన్ = ఆనదిని, క్రీడన, గెలిచివచ్చు = దాఁటివచ్చు, అబ్బాలునిన్ = భీముని, కని, అచటిజనుల్, వెఱఁగందిరి.

తా. భీముఁడొక్క తూఁటినీల్గుటచే నాతని కట్లు తెగినవి. అంతనా నది నీఁదిట్టు చేరనచ్చటి వారదిగాంచి యాశ్చర్యపడిరి.

"విగ్రహ". "విగ్రహస్సమరేకాయే విస్తారప్రవిభాగయోః" అని విశ్వము.

"వాహిని" "వాహినీసైన్యసరితోః." నానార్థరత్నమాల.

క. ఆతఁడు మదిఁ జతురాత్మ
భ్రాతృ సహాయతఁ గరంబు రంజిలుచుం దద్
జ్ఞాతులయాగస్స్ఫుటవిధు
లీతెఱఁగున జరుగ నిర్వహించె విజయతన్. 28

రామాయణ. అతఁడు=రాముఁడు, మదిన్=మనసున, చతుర...సహాయతన్-చతుర = సమర్థుఁడైన, ఆత్మ=తనయొక్క, భ్రాతృ = సోదరుఁడగు లక్ష్మణుని యొక్క, సహాయతన్ = తోడ్పాటుచేత, కరంబు = మిక్కిలి, రంజిలుచున్ = సంతోషించుచు, తద్జ్ఞ...విధులు - తద్జ్ఞ = విశేషజ్ఞుఁడగు విశ్వామిత్రుని, అతుల = సాటిలేని, యాగ = యజ్ఞముయొక్క, స్ఫుటవిధులు = స్పష్టమగుకార్యములు, ఈతెఱఁగునన్ = ఈలాగున, జరుగన్ = జరుగునట్లుగా, విజయతన్ = మిక్కుటమగు జయముకలవాఁడగుటచే, నిర్వహించెన్ = పూర్తిగావించెను.

తా. లక్ష్మణుని తోడ్పాటున రాముఁడు సంతసించుచు, విశ్వామిత్రుని యజ్ఞము నిర్విఘ్నముగాఁ గొనసాఁగునట్లు జయశీలుఁడై నిర్వహించెను.

భారత. అతఁడు = భీముఁడు, చతుర...సహాయతన్ - చతుర, ఆత్మ, భ్రాతృ = అన్నదమ్ములైన ధర్మజార్జుననకులసహదేవులయొక్క, సహాయతన్, మదిన్, కరంబు, రంజిలుచున్, తద్జ్ఞాతుల = ఆదాయాదులైన దుర్యోధనాదుల, ఆగః = అపరాధములయొక్క, స్ఫుటవిధులు = కనిపించుకొనుటలు, ఈతెఱఁగునన్, జరుగన్, విజయతన్, నిర్వహించెన్.

తా. భీముఁడు నిజసోదరుల తోడ్పాటునకెంతయు సంతసించి, దుర్యోధనాదులొనర్చిన యపరాధముల నీరీతిగ నిర్వహించెను.

"ఆగః" "ఆగోపరాధోమంతుశ్చ." అని యమరము.

సీ. అతఁడు దానవిహతయైనవసుధయంద
మునుమించుప్రఖ్యాతి ఘనసమృద్ధిఁ
దనర విశ్వామిత్రతాపసుహృత్ప్రమో
దస్ఫూర్తి సాధించి తద్గురుత్వ
శక్తి నంబక ఘనాశని గదాస్యాదులు
వర్ణింప నెక్కుడై వఱలఁ గాంచెఁ
గావున సద్వీర్యకలితుఁ డాశ్రితుల
యమ్మ నాకులవృత్తి నిమ్ముకొనఁగఁ

గీ. జేసె నంత ఘనఖ్యాతి భాసిలఁ గృప
నామునిఁ బురస్కరించి నానామహాస్త్ర
గరిమవడసి రాకొమరు లాగురుని రూఢిఁ
దిరము కొలిచెఁ దదచ్యుతతేజ మిలను. 29

**రామాయణ.** అతఁడు = రాముఁడు, దానవి = తాటక, హత యైన వసుధయంద = చచ్చినప్రదేశముననే, మును...సమృద్ధిన్ - మును = మున్ను, మించు, ప్రఖ్యాతి = అతిశయించినఖ్యాతియొక్క, ఘన = గొప్పదగు = సమృద్ధిన్ = అభివృద్ధిచే, తనరన్ = ఒప్పుచుండఁగా, విశ్వామిత్ర...స్ఫూర్తి - విశ్వామిత్రతాపసు = విశ్వామిత్రమహర్షి యొక్క, హృత్ = మనస్సునకు, ప్రమోదస్ఫూర్తిన్ = సంతోషాతిశయమును, సాధించి, తద్గురుత్వశక్తిన్ = ఆతనియొక్క గురుత్వముతోఁ గూడిన శక్తిచే, అంబక...ఆదులు - అంబక = బాణములనెడి, ఘన = మేఘములును, అశని = పిడుగులును, గదా = గుదియ, అసి, ఆదులు = కత్తి మొదలగు నవి, వర్ణింపన్ = ఎక్కుడై = వర్ణించుటకు అధికమై, వర్ణింపనసాధ్యమై యనుట. వఱలన్ = ఒప్పునట్లు; కాంచెన్ = పొందెను, కావునన్, అద్వీర్యకలితుఁడు = ఆయాయుధబలముతోఁ గూడినవాఁడు, రాముఁడనుట.

ఆశత్రు, లయమ్ము = ఆశత్రునాశము, అనాకులవృత్తిఁ = ఆకులపాటు లేని యునికితో, అనాయాసముగాననుట. ఇమ్ముకొనఁగఁ, చేసెఁ = సంతోషముతో నొనర్చెను, అంతఁ, ఘనఖ్యాతి, భాసిలఁ = ప్రకాశింపఁగా, కృపఁ = దయచే, ఆమునిఁ = ఆవిశ్వామిత్రుని, పురస్కరించి= ముందిడుకొని, నానా...గరిమఁ-నానా= అనేకవిధములగు, మహాస్త్ర= గొప్పయస్త్రములవలని, గరిమఁ = గౌరవమును, పడసి = పొంది, ఇలను = భూమియందు, అచ్యుతతేజము = నారాయణుని తేజస్సు, నారాయణు నంశయనుట. రాకొమరు లాగు = రాజకుమారుని విధమున, ఉరునిరూఢిఁ = మిగులరూఢిగా, తిరముకొలిపెఁ = స్థిరపఱిచెను.

తా. ఆరాముఁడు తాటకను సంహరించిన ప్రదేశముననే విశ్వామిత్రుని సంతసింపఁజేసి, యతనిదయచే దివ్యాస్త్రములఁ బొందిరంజిలెను. కాఁబట్టి శత్రువిజయమొనర్చి యామునిం బురస్కరించికొని విష్ణుతేజము రామాకృతిని బొందుట భువిని స్థిరపఱిచెను.

సర్వేశ్వరుఁడగు విష్ణున కేవిషయమునందును గొఱఁత లేకుండియు విశ్వామిత్రునకు శిష్యుఁడగుట యాతనికొక మహిమ గల్పించుటకే యని కవియాశయము.

"అసి"-"చంద్రహాసాసిరిష్టయః" అని యమరము.

భారత. అతఁడు = ఆ భీముఁడు, తాఁ, విశ్వ..........స్ఫూర్తిఁ — విశ్వ = సమస్తమైన, అమిత్ర = విరోధులకు, తాప = కష్టమును, సుహృత్ = హితులకు, ప్రమోదస్ఫూర్తిఁ = సంతోషాతిశయమును, సాధించి, తద్గురుత్వశక్తిఁ = గొప్పతనముతోఁగూడిన యాశక్తిచే, అవిహతమై, నవసుధయందమును = అమృతపుటందమును, మించు, ప్రఖ్యాతి = కీర్తి, ఘనసమృద్ధిఁ = గొప్పవృద్ధిచే, తనరఁ = ఒప్పఁగా, అఘనాశనిగఁ = పాపము పోవునట్లు, అంబకుఁ = తల్లికి, కుంతికనుట. దాస్యాదులు = సేవాదులు, వర్ణింపఁ, ఎక్కుడై = వర్ణింపసాధ్యము

గానట్లు, కాంచెన్, కావునన్ = పొందెనుగాఁబట్టి, ఆవీర్య కలితుఁడు = ఆపరాక్రమవంతుఁడు, భీముఁడనుట, శత్రులయమ్మన్ = శత్రువులగు దుర్యోధనాదులతల్లిని, గాంధారిని, ఆకులవృత్తిన్, ఇమ్ముకొనఁగన్, చేసెన్ = విచారమునకు స్థానమగునట్లు చేసెను. [తనకొడుకులట్లు తనకుశుశ్రూషలు గావించుటలేదని యామె చింతించెనని భావము.] అంతన్ = పిమ్మట, ఘనఖ్యాతి, భాసిలన్, ఆకుమారులు = కౌరవపాండవులు, కృపనామునిన్ = కృపాచార్యులను పేరుగల యాతని, పురస్కరించి, నానామహాస్త్రగరిమన్, పడసి, తత్ ........ తేజము - తత్ = ఆకుమారులయొక్క, అచ్యుత = జాఱని, తేజము = క్షాత్రతేజము, ఆ గురునిరూఢిన్ = గురువగు నా కృపాచార్యులయొక్క ప్రసిద్ధిని, ఇలను, తిరముకొలిపెన్ = స్థిరపఱచెను.

తా. భీముఁడు శత్రులకుఁ బరితాపమును మిత్రులకు సంతసమును నింపుచు, నమృతమువలెనుండు కీర్తియభివృద్ధికాఁగఁ, బాపములు నశించులాగున మాతృసేవ నేయుచుండెను. కావున నా పరాక్రమశాలియగు భీముఁడు శత్రులమాతయగు గాంధారి కాకులపాటొందవిఁచెను. అంత నా కౌరవపాండవులు కృపాచార్యునియొద్ద విలువిద్యనేర్చి తమ క్షాత్రతేజమున నాతనికి ఖ్యాతిగల్గించిరి.

"విశ్వామిత్ర" "మిత్రేచర్షౌ" అనుపాణినిసూత్రమున విశ్వామిత్రశబ్దము విశ్వామిత్రయని యాయెను.

భాసిలన్-" "రంజితిఖట్వాదీనాం బిందోశ్శస్యాపి లా వుభౌభవతః-" అనుచింతామణీ సూత్రము చొప్పున నించుకున్నకు ద్విత్వలకారము రాఁగ, "తత్రోభయోర్భవేదే కోలకారఇతికేచన" అను నధర్వణవచనమున, భాసిలనని యాయెను.

సీ. సంయమి దివ్యతే।జమునఁ గుంభినిజనిం
చినయాదిలక్ష్మినఁ। జేయుఁడైన
విమలశీలునిరఘు।వీరకులోత్తంసుఁ
దాఁగూర్చువాఁడయి। తన్నృపాల
వరకుమారకులకు। గురువై మనఃప్రీతి
దనర నత్యాశ్చర్య।జనకధామ
భీమబాణాసన।స్థేమవార్తాప్రవ
ర్తన మగుభవ్యసు।ధన్వినూత్న

గీ. విరచితావధానశ్రుతి।వీథికలను
ద్రోణుల సదాదరై కధు।రీణుఁడగుచుఁ
బ్రౌఢి మన్నించె మేదినీ।పతిసుతులును
దద్ధనుశ్శిక్షపస గాంచు।తమిఁబొదలిరి. 31

రామాయణ. సంయమి = విశ్వామిత్రుఁడు, దివ్యతేజమునన్ = దేవతాంశచే, కుంభినిన్ = భూమియందు, జనించిన, ఆదిలక్ష్మిన్, అజేయుఁడైన = జయింపనలవిగాని, విమలశీలునిన్ = నిర్మలస్వభావుని, రఘువీర కులోత్తంసున్ = రాముని, తాన్, కూర్చువాఁడయి = చేర్చువాఁడయి, సీతారాములకు వివాహముగావింపఁ దలఁచిన వాఁడయి యనుట. తన్నృపాల వర కుమారకులన్ = ఆరాజకుమారులను, రామలక్ష్మణులననుట. గురువై, మనఃప్రీతి, తనరన్=ఒప్పఁగా, అత్యాశ్చర్య .....ప్రవర్తనము—అత్యాశ్చర్య = మిక్కిలి యాశ్చర్యముగల్గించు, జనకధామ= జనకునింటనుండు, భీమ = పరమేశ్వరుని, బాణాసన = వింటియొక్క, స్థేమ = బలిమియొక్క, వార్తాప్రవర్తనము = మాటయొక్క ప్రవర్తనము, వింటిబలిమిని గుఱించి యాడుట యనుట-అను=అనెడి, భవ్యసుధన్ = మనోహరమగు నమృతమును, వినూత్న.........వీథికలు - వినూత్న = నవ

ముగా, విరచిత=చేయఁబడిన, విధాన = ఎచ్చరికగల, శ్రుతివీథికలు = కర్ణమార్గములు, అను = ద్రోణులన్ = దొప్పలయందు, సదాదర.........ధురీణుఁడు - సదాదర = మంచియాదరమే, ఏక = ముఖ్యమగు, ధురీణుఁడు = భారవాహి, అగుచున్, ప్రౌఢిమన్ = సామర్థ్యముచే, నించెన్ = నిండించెను, మేదినీపతిసుతులును = రామలక్ష్మణులు, తద్ధనుశ్శక్తిపస = ఆవింటియొక్క శక్త్యతిశయమును, కాంచు, తమిన్=చూడవలయునను నుత్సాహమున, పొదలిరి = ఒప్పిరి.

తా. విశ్వామిత్రుఁడు సీతారాములకు వివాహము గావింపఁదలఁచి శివధనుర్వృత్తాంతమును జెప్పఁగా నా రాకొమరులాధనువు పటిమంగాంచ నిచ్చగొనిరి.

"కుంభిని" "గోత్రాకుంభినీక్షమా." అని యమరము.

"స్థేమ." స్థిరశబ్దముమీఁద నిమనిప్రత్యయము.

ద్రోణులన్ = "ద్రోణీకాష్ఠాంబువాహినీ." అని యమరము.

భారత. సంయమి దివ్యతేజమునన్ = భరద్వాజుని దివ్యతేజస్సువలనను, కుంభిని = కుంభమునందు, జనించి, నయాదిలక్ష్మిన్ = నయాదిగుణములచే, అజేయుఁడైన, విమలశీలున్, నిరఘున్ = పాపరహితుని, వీరకులోత్తంసున్=వీరకులమునకు శ్రేష్ఠుఁడైనవాని, అత్యాశ్చర్య......ప్రవర్తనన్—అత్యాశ్చర్యజనక = మిక్కిలి యాశ్చర్యముగల్గించు, ధామ = ప్రభావముచే, భీమ = భయంకరమగు, బాణాసన = వింటివలని, స్థేమ = స్థైర్యమువలని, వార్తాప్రవర్తనన్ = మాటయొక్క ప్రవర్తనమున, ప్రఖ్యాతిచేననుట. మను = ఉండునట్టి, భవ్యసుధన్విన్ = మంచి విలుకాని, నూత్న ............ కలనున్—నూత్న=క్రొత్తఁగా, విరచిత, అవధాన = ఎచ్చరికతోడి, శ్రుతివీథికలనన్ = వేదమార్గవిచారముగలవాని, ద్రోణున్ = ద్రోణాచార్యుని, తన్నృపాలవరకుమారులకున్ = ఆ రాజపుత్రులకు, గురువై=గురువుగానై, మనఃప్రీతి=మనస్సంతోషము, తనరన్=

ఒప్పఁగా, తాన్ = ధృతరాష్ట్రుఁడు, కూర్చువాఁడయి = చేర్చువాఁడయి, [ధృతరాష్ట్రుఁడు రాజకుమారులకు ద్రోణునాచార్యునిగాఁ జేయఁదలఁచిన వాఁడయియని భావము.] లసత్ ........... ధురీణుఁడు-లసత్ = ప్రకాశించుచున్న, ఆదర = ప్రీతిచే, ఏక = ముఖ్యమగు, ధురీణుఁడు = భారవాహి, అగుచున్, మిక్కిలి ప్రీతిగలవాఁడయి యనుట. మేదినీపతి = రాజు, ధృతరాష్ట్రుఁడనుట. ప్రౌఢిన్ = చాతుర్యమున, మన్నించెన్ = గౌరవించెను, సుతులును=రాజకుమారులును, తద్ధనుశ్శక్తి=ఆద్రోణాచార్యుని వింటిబలిమియందలి, పసన్ = సారమును, కాంచుతమిన్ = గ్రహించుట యందలి యుత్కంఠచే, పొదలిరి = ఒప్పియుండిరి.

తా. భరద్వాజుని తేజమునలనఁ గుంభమునఁ బుట్టినవాఁడును, నయాద్యున్నత గుణసంపన్నుఁడును, దుర్జయుఁడును, నిర్మల స్వభావుఁడును, బాపరహితుఁడును, వీరవరేణ్యుఁడును, నత్యద్భుతమగు వింటి పసచేఁ బ్రసిద్ధిం గలవాఁడును, వేదవిచారవంతుఁడునునగు ద్రోణుని ధృతరాష్ట్రుఁడు ఆ రాజపుత్రులకు, గురువుగాఁ గూర్పఁదలఁచినవాఁడయి యాతనిం బ్రీతితో గారవించెను. రాజకుమారులునా ద్రోణుని ధనుశ్శక్తిని నందలి పసయుంగాంచ నుత్కంఠగలవారైరి.

“ధామ” “గృహదేహత్విట్ప్రభావా ధామాని,” అని యమరము.
“అజేయుఁడు” “అచోయత్” పాణిని.

వ. అందు. 32

మ. గురుసంకల్పము చొప్పఁదప్పకెలమిన్ క్షోణీజనాశ్చర్యవి
స్ఫురణం బొందఘనోగ్రకార్ముక వరంబున్వంపనెంతేమహా
శరస్తోత్కర్షరయ ప్రయుక్తిఁబొదలన్ సామర్థ్యసంపద్ధురం
ధరుఁడారామవిభుండుజిష్ణుఁడు సముద్భాసిల్లెనత్యంతమున్.

రామాయణ. గురుసంకల్పము చొప్పునన్ = గురువగు విశ్వామిత్రుని సంకల్పరీతిని, తప్పక, ఎలమిన్ = ప్రీతితో, క్షోణీజన్ = భూపుత్రికను, సీతననుట. ఆశ్చర్య విస్ఫురణన్ = ఆశ్చర్యాతిశయమును, పొందన్, ఘన............కార్ముకవరంబున్ - ఘన = గొప్పదగు, ఉగ్ర = శివుని యొక్క, కార్ముకవరంబున్ = ధనుశ్శ్రేష్ఠంబును, వంపన్, ఎంతేన్ = మిక్కిలి, మహాశ = గొప్పయాస, రయ... ప్రయుక్తిన్ — రయ=వేగము యొక్క, ఉత్కర్ష = అతిశయముయొక్క, ప్రయుక్తిన్ = కూడికచే, పొదలన్ = ఒప్పఁగా, సామర్థ్య..........ధురంధరుఁడు—సామర్థ్య సంపత్ = సామర్థ్యమను సంపదయొక్క, ధురంధరుఁడు = భారవాహి యగువాఁడు, ఆ రామవిభుండు = శ్రేష్ఠుఁడగు నారాముఁడు, జిష్ణుండు = జయశీలుఁడై, అత్యంతమున్, సముద్భాసిల్లెన్ = మిక్కిలి ప్రకాశించెను.

తా. గురువుయొక్క సంకల్పము ననుసరించి సీతాదేవిని భార్యగాఁ గైకొనుటకై యీశ్వరచాపము వంపవలెనను నాసగలవాఁడై జయశీలుఁ డగురాముఁడు మిక్కిలి సంతసించెను.

"గురు," అజ్ఞానాంధకారమును బోఁగొట్టువాఁడనుట. "గుశబ్ద స్త్వంధకారేస్యా, ద్రుశబ్ద స్తన్నిరోధకః, అంధకార నిరోధిత్వా, ద్గురు రిత్యభిధీయతే." యనుట యిందులకుఁ బ్రమాణము.

"సామర్థ్య సంపద్ధురంధరుఁడు," అనుటచే నెట్టివారిచేతను వంచుటకు సాధ్యముగానియాయీశ్వరుని వింటి నీతఁడు సులభముగా వంచుట యమాత్రముకాక విఱువఁగలఁడనుటయు, "జిష్ణుఁడు" అనుటచే శివ ధనుర్భంగమునఁ గుపితుఁడై యరుగుదెంచు పరశురాముం జయింపగలఁ డనుటయు సూచితములు.

భారత.గురు సంకల్పముచొప్పునన్ = గురువగు ద్రోణాచార్యుని సంకల్పరీతిని, తప్పక, ఎలమిన్, క్షోణీజన, భూజనులవలని, ఆశ్చర్య విస్ఫురణన్, పొందన్, ఘన, ఉగ్ర = భయంకరమైన, కార్ముకవరంబున్,

వంపన్, మహాశర......ప్రయుక్తిన్—మహాశర = గొప్ప బాణముల యొక్క, స+ఉత్కర్ష = ఉత్కర్షముతోఁగూడిన, రయ = వేగముతో, ప్రయుక్తిన్ = ప్రయోగముచే, పొదలన్ = ఒప్పఁగా, సామర్థ్య సంపద్ధురంధరుఁడు, ఆరామవిభుండు = తేజోవంతుఁడు, జిష్ణుఁడు = అర్జునుఁడు, అత్యంతమున్, భాసిల్లెన్.

తా. అర్జునుఁడు నిజగురు సంకల్పము ననుసరించి గొప్పవింటిని వంచుటకును, గొప్ప బాణములు వైవను, దగినవాఁడై, వెలయుచుండెను. "సముద్భాసిల్లెన్." అనుచోటనుపసర్గతోఁ గూడిన దానికి లకారద్విత్వము వచ్చుటకు, "సల్లలితైక పదముపై, నిల్లుండుటయగుట యనఁగ నెల్లెడఁ జనురా, జిల్లుట ప్రభవిల్లుట శో, భిల్లుట వర్తిల్లుటనఁగఁ బెనుపై యునికిన్." అని యాంధ్రభాషా భూషణమునఁ గ్రియాపదములలోఁ బ్రభవిల్లుటయని యుపసర్గములతోఁగూడ నెత్తియుండుటయే ప్రమాణము.

సీ. అపుడేమిచెప్పన కన్యాసాధ్యతద్ధను
ర్వార్త సర్వక్షత్రవంశ్యులందు
మిఁగులఁ గర్ణాసహ్యముగఁ బర్వ నతఁడు త
న్మహిమ పెంపు నరాతిమత్సరవిధి
నాత్మలో సరకుసేయక సంభ్రమించె న
మ్మునికృప జనకునింటను వివాహ
మగుటకు మున్ను తద్దంబకాశ్చర్యమం
త్రమహత్త్వస్ఫురితచండధామయుక్తి

గీ. నుదయ మందిన మేటియన్యుల కలఁగునె
యరయ నిట్లర్కసంతతిఖ్యాతిమహిమ
ధాత్రిపైఁగుంద సూతసంతానభావ
గణనఁ బ్రబలుట తత్ప్రోషకారణమున.

**రామాయణ.** అపుడు, ఏమిచెప్పన్ = అప్పు డేమని చెప్పు దును, వర్ణించుటకలవిగాదని భావము. అన్య......వార్త—అన్య = ఇతరులచే, అసాధ్య = సాధింపవీలుగాని, తత్, ధనుర్వార్త = ఆవింటి సమాచారము, సర్వక్షత్ర వంశ్యులందున్ = క్షత్రియవంశపు వారెల్లర యందును, అచ్చటికి వచ్చిన క్షత్రియవంశజు లందఱియందు ననుట. మిగులన్, కర్ణాసహ్యముగన్ = చెవికింపుగాని యట్లు, పర్వన్=వ్యాపింపఁగా, అతఁడు = రాముఁడు, తత్ = ఆవింటియొక్క, మహిమ పెంపున్ = మాహాత్మ్యాతిశయమును, అరాతి......విధిన్ - అరాతి=శత్రువులయొక్క, మత్సరవిధిన్ = అసూయను, తన జయముగాంచి యోర్వఁజాలని శత్రువులతోడి ద్వేషమును, ఆత్మలోన్ = తనలో, సరకుసేయక = లక్ష్యముసేయక, సంభ్రమించెన్ = త్వరపడెను, వివాహమగుటకుత్కంఠితుఁడాయెననుట. సన్మునికృపన్ = విశ్వామిత్రానుగ్రహమున, జనకునింటను = జనకమహారాజునింట, వివాహమగుటకు మున్ను, తత్......ధామ యుక్తిన్ — తత్ = ఆ విశ్వామిత్రుని ఆశ్చర్య = అచ్చరువగు, మంత్ర, మహత్త్వ = మంత్రమాహాత్మ్యముచే, కృత = చేయఁబడిన, చండ = తీక్ష్ణమైన, ధామ = ప్రతాపముతో, యుక్తిన్ = చేరికచే, ఉదయమందినమేటి = అభ్యుదయమందిన వీరుఁడు, అన్యులకున్ = ఇతరులకు, అలఁగునే = అడఁగునా ? అరయన్ = విచారింపఁగా, ఇట్లు, అర్క......మహిమ—అర్క = సూర్యుని, సంతతి = వంశముయొక్క, ఖ్యాతిమహిమ = కీర్త్యతిశయము, తత్పోషకారణమునన్ = ఆ రాముఁడు రక్షించుకతమున, ధాత్రిపైన్ = భూమిపై, కుంద......అవగణనన్ - కుంద = మొల్లలయొక్కయు, సూత = పాదరసముయొక్కయు, సంతాన= కల్పవృక్షముయొక్కయు, మహిమ=మాహాత్మ్యముయొక్క, భా=కాంతిని, అవగణనన్ = లెక్కింపక, ప్రబలుట = ప్రసిద్ధినందుట.

తా. ఆధనువు సమాచార మచ్చటికి వచ్చిన రాజులకు వినవింపు కాకుండఁగా, మాత్సర్యముసెంద రాముఁడావింటి మహిమంగాని, వారి

మాత్సర్యముగాని సరకుసేయక, వివాహమునకు త్వరపడెను, వివాహమునకు మున్నే విశ్వామిత్రు ననుగ్రహమున దివ్యాస్త్ర లాభముపొందిన శ్రీరాముఁ డీరాజుల లక్ష్యము సేయునే? ఇట్లాతనిపోషణచే సూర్యవంశ ఖ్యాతి మొల్లలయొక్కయుఁ, బాదరసముయొక్కయుఁ, గల్పవృక్షములయొక్క యుఁ గాంతినిదిరస్కరించి ప్రబలుట.

"కుందం" "మాఖ్యంకుందం" అని యమరము.

"సూత" "రసస్సూతశ్చపారదే." అని యమరము.

ఇటఁ బ్రబలుట యనుట భావే ప్రయోగము.

లడలక భేదమగుటచే"అలఁగునె" అనియుట డకారస్థానమున లకార ము వచ్చెను "వెలుఁడఁడు చందనోపవన వీథులకై యటు మాళిభాగ నిర్మల శశిరేఖసేయు నపరాధమునన్ గజదైత్యశాసనుం, గొలువఁడు." నైషధము. కూచి మంచి తిమ్మనకవి, "మొసలి, వ్యాళి, వ్రీళి, వెలదు, దళి," ఈ శబ్ద ములు గాక తక్కినవానికిఁ బ్రయోగములు లేవనుట ప్రామాదికము. దాడిమ్మని, దాళిప్తు గుమ్మళులు, గుమ్మడులు, ఇత్యాదులు పెక్కులుగలవు.

భారత. అపుడు, ఏమి చెప్పన్, అన్య......వార్త - అన్యా సాధ్య = ఇతరులచే సాధింపఁదగని. తత్ = ఆయర్జునుని, ధనుర్వార్త = వింటి సమాచారము, అర్జునుఁడు గొప్ప విలుకాఁడయ్యెనను ప్రసిద్ధియనుట. సర్వక్షత్రవంశ్యులందున్, సర్వక్షత్రియ రాజులందును, మిగులన్ = మిక్కిలి, కర్ణాసహ్యముగన్ = కర్ణున కోర్వఁదగనదిగా, పర్వన్= అతఁడు=కర్ణుఁడు, తన్మహిమపెంపు = ఆయర్జునుని చాపపాండిత్యాతిశయ మును, నర, అతిమత్సర విధన్ = ఆయర్జునుని మాత్సర్యమును, ఆత్మలోన్, సరకుసేయక, సంభ్రమించెన్, [ఇఁకఁ బూర్వకథా సూచనముగాఁగ వివాక్యము.] మునికృపన్ = దూర్వాసు ననుగ్రహమున, జనకునింటను = తండ్రియైన కుంతిభోజునింటను, వివాహము, అగుటకు, మున్ను, తదంబ కున్ = అతని తల్లియైన కుంతికి, ఆశ్చర్య......యుక్తిన్—ఆశ్చర్య =

ఆశ్చర్యకరమగు, మంత్రమహిమచే, కృత = చేయఁబడిన, చండధామ = సూర్యునితో, యుక్తిన్ = చేరికచే, ఉదయమందిన = జనించిన, మేటి, అన్యులకున్, అలఁగునే, అరయన్ = ఇట్లు, అర్కసంతతి = సూర్య పుత్రుఁడను, ఖ్యాతి, మహిమ, కుందన్ = అణఁగఁగా, సూత.........గ ణనన్ — సూత = సూతునికి, సంతానభావ = పుత్రత్వమనెడి, గణనన్ := ఎన్నికచే, ప్రబలుట, తత్పోషకారణమునన్ = అతని పోషణచేఁ గల్గినది.

తా. అన్యాసాధ్యమగు సర్జునని వింటిమహిమ క్షత్రియులెల్లరలోఁ గర్ణునకసహ్యముకాఁగ నతఁడాపార్థుని ధనుర్మహిమనుగాని యాతనిమాత్సర్య మునుగాని సరకుసేయకుండెను. కుంతివివాహమునకు మున్ను తన తండ్రియింట నుండ దూర్వాసాను గ్రహమునఁ గల్గిన మంత్రమహిమచే సూర్యునివలనఁ జనించిన వాఁడగుట నన్యులకడఁగునే. ఇట్లు సూర్యపుత్రుఁడయ్యు సూతు నిచేఁ బెంపఁబడుటచే సూతపుత్రుఁడుగా నెన్నఁబడుచుండెను.

"చండధామ" "ధామజన్మ ప్రభాస్థాన ప్రభావసుఖసద్మసు" నానార్థరత్నమాల.

చ. అదియటులుండెఁ గన్గొనుసకమ స్తజనుల్దమఁగోన ఫల్గునున్
మదఘనశత్రుభంగగరిమన్గురుదక్షిణసేసి యొప్పుశ
శ్వదనఘుఁ జారుమూర్తిమనువంశవతంసునుతించియమ్మహా
భ్యుదయునిఁగన్న నెంతలరునో జనకుండను చింతసంధిలన్.

రామాయణ. అది యటులుండెన్ = కన్గొను సమస్తజనుల్ = చూచునట్టి జనులెల్లరును, [నుతించిరి అనుక్రియకుఁ గర్త]అఫల్గున్ = సారవం తుని, ఉన్మద.........గరిమన్ - ఉన్మద = మిక్కిలి మదించిన, ఘన శత్రు = గొప్పశత్రువులను, భంగ = పరాజయించుటచేఁ గల్గిన, గరి మన్ = అతిశయమును, గురుదక్షిణచేసి = గురువైన విశ్వామిత్రునకు దక్షిణారూపమున నొనర్చి, ఒప్పు, శశ్వత్ = చక్కని, అనఘున్ = పాప రహితుని, చారుమూర్తిన్ = సుందరశరీరుని, మనువంశవతంసున్ = మను

వంశ శ్రేష్ఠుని, ఇమ్మహాభ్యుదయునిన్ = ఈగొప్ప శుభముగలవానిని, కన్నన్ = చూచిన, జనకుండు = జనకమహారాజు, ఎంతలరునో = ఎంత సంతసించునో, అను, చింత, సంధిలన్ = కలుగఁగా, తమలోన్, నుతించిరి = స్తోత్రముచేసిరి.

తా. సారవంతు డగువానిని, శత్రునే గురుదక్షిణగా సమర్పించిన పాపరహితుఁడగువానిని, సుందరాకారుని, మనువంశాలంకారమగు వానిని, రాముం జూచి, ఈతనిఁగాంచిన జనకుఁడెంత సంతసించునో యను తలంపుగలుగఁగా నతనింగన్గొను జనులు నుతించిరి.

“అఫల్గున్.” “అసారంఫల్గు,” అని యమరము.

భారత. అది యటులుండెన్, కన్గొను సమస్తజనుల్ = అర్జునుం జూచుజనులెల్లరును, ఫల్గునున్ = అర్జునుని, మద ......... గరిమన్= మద = మదముచే, ఘన = గొప్పవాఁడగు, శత్రు = శత్రువగు ద్రుపదుని, భంగగరిమన్ = భంగపఱచుటవలని గౌరవమును, గురుదక్షిణచేసి = గురువగు ద్రోణునకు దక్షిణగాఁజేసి, గురుదక్షిణార్థమై ద్రుపదుంబట్టితెచ్చి యనుట. ఒప్పు, శశ్వత్, అనఘున్, చారుమూర్తిన్ = మనోహరాకారముచే, మను = ఒప్పునట్టి వంశవతంసున్ = వంశాలంకారుని, ఇమ్మహాభ్యుదయునిన్, కన్నన్=చూచిన, జనకుండు = తండ్రియైన పాండురాజు, ఎంత, అలరునో, అను, చింత, సంధిలన్=కలుగఁగా, తమలోన్, నుతించిరి.

తా. మదించిన శత్రుఁడగు ద్రుపదుని గురుదక్షిణార్థముగాఁ బట్టి తెచ్చినవానిని, పాపరహితుని, సుందరాకారుని నర్జునుంగాంచిన జనులీతనితండ్రి బ్రదికియుండి యీతనింగాంచి యెంత యానందించునోయని నుతించిరి.

కనినన్ అనుటకు కన్నన్ అనిచెప్పుటకుఁ, “గింకందానొకరుండు గెల్చుకడమిం కీర్తింపఁబడ్డాఁడు.” అని ఎఱ్ఱాప్రగ్గడ పడినాఁడు అనుదానికి పడ్డాఁడు అని ప్రయోగించుటయే ప్రమాణము.

"పద్యాదుల నవర్ణకంబున కత్వంబును గడహల్లునకు ద్విత్వంబును విభాషనగు" బాలవ్యాకరణము.

వ. అంత. 36

సీ. తనయకలుషయత్న ♦ ఘనతరనిర్బంధ
మున రాజు పనుచుటకేయును గపటధు
రావారణావతారోరచితాతి మంజులా
క్షామయశోభిప్రకేశ స్తథామ
ఘన కేళికలనుండ ♦ గణ్యుఁడాత్మస్వామి
యనియునిజౌచితికేయును గణించి
యురుతరాదరము సేయుచు భ్రాతృయుతముగా
నమ్మనువంశరత్నమ్ముఁగొంచు

గీ. నరిగెనపరిచ్ఛదముగరాకేజాన్వయముని
తనదునుఖదుఃఖవిరహావర్త నలుసరకుఁ
గొనక సమవర్తి తనయుండు ♦ జనకుఁడేలు
పురమున కరాళి గతివాసి ♦ నరళసరణి. 37

**రామాయణ.** తన ......... నిర్బంధమునన్ - తన, అకలుష = పాపరహితమైన, ధర్మార్థమైనయనుట. యత్న = ప్రయత్నమునకు సంబంధించిన, రాక్షసనిరాసనపూర్వక యజ్ఞపరిసమాప్తిప్రయత్నమునకు సంబంధించిన యనుట. ఘనతర = మిక్కిలి గొప్పదగు, నిర్బంధమునన్, రాజు= దశరథుఁడు, పనుచుటయును = పంపుటయును, కపట ధురా .........క లనుండు - కపటధురా = కపటభారము యొక్క, వారణ = వారించునట్టి, అవతార = మత్స్యాద్యవతారములచే, చిత = సంపాదింపఁబడిన, అతి మంజుల = మిక్కిలి మనోజ్ఞమైన, అక్షామ = తగ్గని, అధికమైనయనుట.

యశః = కీర్తిచే, అభిప్రశస్త = మిక్కిలి ప్రశస్తమైన, ధామ = ప్రభా
వముచే, ఘన = గొప్పదైన, కేళి, కలనుండు = క్రీడావిధిగలవాఁడు, అగ
ణ్యుఁడు = అప్రమేయుఁడు, ఆత్మస్వామి = పరబ్రహ్మమగువాఁడు, అని
యుక్, నిజ, ఔచితియుక్ = తానాచరింపనుచితమగు కార్యమును,
గణించి, ఉరుతర = మిక్కిలిగొప్పదగు, ఆదరము = గౌరవము, చేయు
చున్, భ్రాతృయుతముగాన్ = తమ్ముఁడగు లక్ష్మణునితోడ, అమ్మను
వంశరత్నమ్మున్ = ఆమనువంశశ్రేష్ఠుని, రాముననుట- కొంచున్ = పిలుచు
కొనుచు, రాజాన్వయముని=రాజతపసి, విశ్వామిత్రుఁడు, [క్షత్రియవర్ణజాతుఁ
డై బ్రహ్మవరమున బ్రహ్మర్షియైనవాఁడని భావము.] సపరిచ్ఛదముగన్ = స్వపరి
వారముతోఁగూడ, తనదు ......... వర్తనల్ - తనదు = తనయొక్క,
సుఖ, దుఃఖ, విరహ, వర్తనలు = సుఖవిరహము యొక్కయు, దుఃఖవిర
హముయొక్కయు, విరహముయొక్కయు, వర్తనలు, సరకుగొనక =
లక్ష్యముచేయక, సమవర్తిన = సమవర్తిత్వముననే, ఉండు, జనకుఁడు,
ఏలు = పాలించు, పురమునకున్, అరాళగతిన్ = వంకరమార్గమును, పాసి=
విడిచి, సరళసరణిన్ = చాయతెరువున, అరిగెన్ = వెడలెను.

తా. యజ్ఞాచరణమునకై తాను నిర్బంధించుటచే దశరథుఁడు సుతుల
నంపఁగా రాముఁడు ఘోరాఘోరనివారణమునకై గావించిన మత్స్యాదికపటావ
తారములవలన సంపాదించిన కీర్తిప్రభావములతోడి విలాసముగలవాఁడును,
నమేయుఁడును, పరబ్రహ్మమగువాఁడునయియుఁ, దానాచరింప నుచిత
మగు కార్యమిట్టిదనియుఁదలఁచి, మిక్కిలి యాదరించుచు లక్ష్మణునితోడ,
నారాముం దోడ్కొని, విశ్వామిత్రుఁడు నిజపరివారముతోడఁ గూడి, సుఖ
దుఃఖాదిరహితుఁడై, సమవర్తనముగల జనకుఁడేలు మిథిలానగరమునకు
వంకరత్రోవపాసి, చక్కని తెరువున నరిగెను.

"కపట ధురా" ఇట 'ధూర్' శబ్దమున కకారాంతము గల్గుటకు, "ఋగాద్యంతస్య సమాసస్య అప్రత్యయాఽన్తావయవస్యాస్యాత్" అను వరరుచివార్తికము ప్రమాణము.

"తనయకలుషయాత్న" యనుచోట సంస్కృతశబ్ద వితతితోఁ దన యనుపదమునకు సమాసము గల్గుటకు "తనయశోవిశద ముక్తాసౌధ పాళికి" అని రామరాజభూషణోక్తి గలదు.

"కొంచు." కొనుధాతు వన్వాదులలోఁ జేరుటచే నిటఁ జువర్ణకము పరమగునప్పుడు బిందువయ్యెను. "జవనాశ్వములం, బూంచిన రథమున మణిమయ, పంచానన కేతువెత్తె బంధురఫణితిన్." అని సోమయాజియు నన్వాదులలోని పూనుధాతువునకుఁ జువర్ణకము పరమగునపుడు బిందురూపమునఁ బ్రయోగించెను.

"సుఖదుఃఖవిరహవర్తిన"లను చోట గద్దురాజురామన్న "ద్వంద్వాందే శ్రూయమాణం పదం ప్రత్యేకమభి సంబధ్యతే, అనున్యాయమున సుఖవిరహదుఃఖములయొక్కయు, విరహసుఖములయొక్కయు వర్తన"లని యర్థము గావించుట పొరపాటు. సుఖంచదుఃఖంచ సుఖదుఃఖే "అని ద్వంద్వముగావించుకొని, తయోర్విరహః" అని షష్ఠీతత్పురుషము గావింపవలయును. ఆవల, విరహశ్చ విరహశ్చ విరహా, అని ఏకశేషవృత్తి గావించుకొనవలయును. అప్పుడు సుఖవిరహ, దుఃఖవిరహ, విరహములని యర్థమగును. సుఖవిరహా దుఃఖవిరహములనుటచే ద్వంద్వరాహిత్యమును దాహరణపూర్వకముగాఁ దెలుపుటయకాక, విరహశబ్దమును బ్రత్యేకముగాఁ గొనుటచే, సంసారమున జనించినను, దక్కినవారివలె శబ్దాద్యాకృష్టుఁడు కాక తామరాకు పైనీటికి నాకును సంబధములేనట్లు ప్రాపంచిక సంబంధ రహితుఁడగుట సూచితమగును. కాన నిది యేకవి యాశయమగును. "కర్మణైవహిసంసిద్ధి మాస్థితా జనకాదయః." అనులాగునసట్టి మహానుభావుల మాహాత్మ్యము ప్రకటితమగు చున్నది.

"కపటధురావారణావతార." ఇటఁగపటశబ్దమున కవతారశబ్దముతో నన్వయముగావించుట యేకవియాశయము. అప్పుడు కృష్ణాద్యవతారములవలె నతిమానుషచేష్టితములఁ జూపక రాముఁ "డాత్మానం మానుషం మన్యే" యని తాను చెప్పిన కపటోక్తివెల్లడి యగును.

భారత. తనయ........నిర్బంధమునన్ = తనయ కుమారుఁడగు దుర్యోధనుని, కలుష = పాపయుక్తమగు, యత్న = ప్రయత్నమువలని, ఘనతర = మిక్కిలి గొప్పదగు, నిర్బంధమునన్, రాజు = ధృతరాష్ట్రుఁడు, పనుచుటయును, కపట...... ..కలనుఁడు - కపటధురా = కపటభారము చేత, వారణావత = వారణావతనగరమున, ఆరచిత=నిర్మింపఁబడిన, అతిమంజు = మిక్కిలి మనోజ్ఞమగు, లాక్షామయ = లక్కచేనిబిడమై, [ఇటఁబ్రాచుర్యార్థము నమయిట్ ప్రత్యయమువచ్చెను.] శోభి=ప్రకాశించుచున్న, ప్రశస్త, ధామ = ప్రశస్తమైనయింట, ఘనకేళికలను = గొప్పక్రీడలతో, ఉండన్ = వసించుటకై, గణ్యుఁడు = ఎన్నఁదగినవాఁడును, ఆత్మస్వామి=తనకుఁ బ్రభువగువాఁడును, అనియున్, నిజౌచితియున్, గణించి= అతనియాజ్ఞ జరుపుటదన కుచితమనియుఁదలఁచి, ఉరుతర, ఆదరము, చేయుచున్, భ్రాతృయుతముగాన్ = సోదరులతోడ, వంశరత్నమ్మున్ = స్వవంశమునకు రత్నమగు, అమ్మను = తల్లిని, కుంతిననుట. కొంచున్, సపరిచ్ఛదముగన్, రాజాన్వయముని=రాజర్షి యగువాఁడు, తనదుసుఖదుఃఖవిరహావర్తనలు, సరకుగొనక = తన సుఖముయొక్కయు, దుఃఖముయొక్కయు, బంధువిరహముయొక్కయు వర్తనలు, లక్ష్యపెట్టక, సమవర్తితనయుండు = యమునిపుత్రుఁడు ధర్మరాజనుట. జనకుఁడేలు పురమునకున్ = తండ్రియేలుచుండిన పట్టణమగు వారణావతమునకు, అగాళగతి=విచారము, పాసి = వీడి, సరళ సరణిః = సద్వర్తనమున, అరిగెన్ = వెడలెను.

తా. ధృతరాష్ట్రుఁడు పుత్రునినిర్బంధమునఁ బాండవుల వారణావతమునందలి లాక్షాగృహముననుండ నియమింప నిజపోషకుఁడగు ధృత

రాష్ట్రినానతిసేయుట దనకుచితమని తలఁచి మిక్కిలి సంతసమునఁ దమ్ములతోడఁదల్లిందోడ్కొని, సుఖదుఃఖ బంధువిరహాదులఁ బాటింపక చింత దక్కి తనతండ్రి యేలినదగు వారణావతమునకు ధర్మజుఁడు సంతసముతో నరిగెను.

గీ. పరమమునియతివశతమన్యురతిహేతు
వున మహాశాపహతిఁ జేసి తనువికృతిగ
నున్న నేలయంత వచింప నొగినరుదని
తత్కథల్ రుచి గొనుచు రాట్తనయు లందు. 38

**రామాయణ.** పరముని యతివ = గౌతమభార్యయగు నహల్య, శతమన్యురతి హేతువునన్ = ఇంద్రునితోడి రతికారణమున, మహాశాపహతిన్, చేసి = గొప్పశాపముగల్గుటచే, తనువికృతిగన్, ఉన్న = వికృతదేహమైయున్న, నేల, గౌతమశాపమున నహల్య శిలారూపమునందిన నేల యనుట. అంతన్, వచింపన్, రాట్తనయులు=రామలక్ష్మణులు, అందున్, తత్కథల్ = ఆయహల్యాసంబంధమగుకథలు, ఒగిన్ = వరుసగా, అరుదని = రుచిగొనుచున్, వినుచు.

తా. గౌతమశాపమున నహల్య వికృతరూపిణియై యున్నతావు చేరఁగనే విశ్వామిత్రుఁడు కథలఁజెప్పుచుండ రామలక్ష్మణులు వినుచు. ముందరిపద్యముతో నన్వయము.

"శతమన్యు" "జిష్ణుర్లేఖర్షభశ్శక్ర శ్శతమన్యుర్దివస్పతిః" అని యమరము.

**భారత.** అంతన్, నియతివశత=దైవాధీనత, పరమము=దాఁటఁదగనిది, మన్యు = శోకము, రతి = వేడుకయనెడి, హేతువునన్ = కారణమున, మహాశా, అపహతిన్, చేసి = మిక్కుటమగు నాశయొక్క నాశముజేసి యుండినను, తనువికృతిగన్, ఉన్నన్ = దేహవైవర్ణ్యమునంది యున్నను,

ఏల = ఏమిప్రయోజనము, అరుదు, అని, వచింపక - అందుక = ఆ మార్గ మధ్యమున, తత్కథల = ఆధర్మరాజు చెప్పెడికథలను, రాట్తనయులు = భీమాదులు, ఒగిక, రుచిగొనుచు.

తా. విధియలంఘ్యము. శోకముచేనైనను, వేడ్కచేనైనను, ఆశాప హతిచేనైనను, రోగాదులచేఁగల్గిన దేహకార్శ్యముచేనైన నేమిప్రయో జనము? విధికిం దప్పక లొంగియ తీఱవలయునని ధర్మజుఁడు మార్గ మధ్యమునఁ గథలు చెప్పుచుండ భీమాదులువినుచు. ముందరిపద్యముతో నన్వయము.

సీ. ఆలీలనలరుచు నరుగునప్పుడు తత్ప్ర
రస్ఫూర్తి మిగులఁ జిత్రం బొనర్చె
రమణీయమైన యా శ్రీరామపాదపరాగ
మాశాపవారణ మాచరింప
నాయతిపను శోభ నాకృతియును సర
సీకృతమానస శ్రీకలనయు
ఘనసవరత్నకాంచనధామశోభన
పన్యాభరణవైభవస్ఫురితయు
గీ. విపులతరపయోధి పరపదవ్యతిక్రమ
కరణవాంఛ కాంత వరణనిరతి
శయసమున్నతియును సయి వారలందఱు
గౌరవమునఁ దన్నుఁ గనుఁగొనంగ. 39

రామాయణ. ఆలీలక = ఆలాగున, అలరుచుక =సంతసించుచు, అరుగునప్పుడు, రమణీయమైన = మనోహరమైన, ఆరామ ......... పరా గము-ఆర్యామ = ఆరామునియొక్క, పాద=చరణములయందలి, పరాగము= ధూళి, ఆశాపవారణము = గౌతముఁడిడిన యాశాపముయొక్క పోఁగొట్టు

టను, ఆచరింపన్ = చేయఁగా, ఆయతిప = ఆయహల్య, సుశోభనాకృతి యును = మిక్కిలిమనోజ్ఞమైన యాకారముగలదియు, సరసీకృత......కల నయున్ - సరసీకృత = పచ్చిగాఁజేయఁబడిన, మానస = మనస్సునందలి, హ్రీకలనయున్ = లజ్జాస్థితిగలదియు, ఘన.........ధామ - ఘన=గొప్ప వగు, నవ, రత్న = నూత్నములైన రత్నములతోఁగూడిన, కాంచన = బంగారుయొక్క, ధామ=కాంతివంటి కాంతిగలదియు, శోభన......స్ఫురితయున్ - శోభన = మంగళకరమైన, వన్య = వనమునఁగల్గిన, నార చీరలునున్నగు, ఆభరణ = అలంకారములయొక్క, వైభవ = విభవముచే, స్ఫురితయున్ = ప్రకాశించునదియు, విపుల ......... సమున్నతియున్ - విపులతర = విస్తారమైన, పయోధరపద, వ్యతిక్రమకర = అతిక్రమము చేయుచున్న, జాఱుచున్నదనుట. నవ = అభినవమైన, అంతుకాంత = వస్త్రాంచలముయొక్క, వరణ = కప్పుటయందు, నిరతి=ఆసక్తిగల, శయ = హస్తముయొక్క, సమున్నతియును=ఉపచారము గలదియు, అయి, తత్... ......స్ఫూర్తిన్ - తత్ = వారియొక్క, పురః=ముందట, స్ఫూర్తిన్= ప్రకాశించుటచే, వారలు, అందఱు = రామాదులందఱు, గౌరవమునన్, తన్ను, కనుఁగొనంగన్ = చూచుచుండఁగా, మిగులన్ = మిక్కిలి, చిత్రంబు, ఒనర్చెన్ = ఆశ్చర్యముగల్గించెను.

తా. రాఘవులా లాగున సంతసిలుచుఁ బోవుచుండ, రామ పాదరజ స్సంగమున, సదాకృతిం ధరించినదియు, లజ్జావతియు, నూతనరత్నముల తోఁగూడిన బంగారువన్నెగలదియు, వన్యాలంకార పరిశోభితయు, చేలాం చలవరణాసక్త హస్తయు, నయివారిముందహల్య గాన్పించి వారికి నాశ్చర్యము గల్గించెను.

"నవరత్న కాంచన ధామ" ఇట నవశబ్దమునకుఁ దొమ్మిదియని కొందఱభిప్రాయ పడెదరుగాని యది సరికాదు. దంతకాంతి మౌక్తికచ్ఛా యను, మదిరాక్షియగుటచేఁ గన్నులకాంతి పద్మరాగచ్ఛాయను, నధరము

ప్రవాళచ్ఛాయను, గేశములు నీలచ్ఛాయను గల్గియుండుట సహజముగానఁ దక్కిన రత్నములకిటఁ బ్రసక్తిలేదు. ఈకారణముచే నవ, యనునాత్న మనియే యర్థముసెప్పుట సమంజసము. "శోభనవన్యాభరణ" వన్యాభరణములు శోభనములుగా నుండునా యనిన, రూపవతుల కాభరణములవలనఁ గ్రొత్త మెఱుంగు రాఁబోవదనియే కవియాశయము. దీనికిఁ బ్రమాణము, "సరసిజమను విద్ధం శైవలేనాపిరమ్యం, మలిన మపిహిమాంశోర్లక్ష్మ లక్ష్మీంతనోతి, ఇయమధిక మనోజ్ఞా వల్కలే నాపితన్వీ, కిమివహి మధురాణాం మండనం నాకృతీనాం," అభిజ్ఞాన శాకుంతలము.

"శయ సమున్నతి," "పంచశాఖశ్శయః పాణిః." అని యమరము.

"తత్పురస్ఫూర్తి." ఇట విసర్గలోపము శ్లేషార్థ సంఘటనమునకై కవి యవలంబింపవలసెను. అదియు "శర్పరే విసర్జనీయః" అను పాణిని సూత్రమాధారము గావించికొనియే యిట్లొనర్చెను.

**భారత.** ఆలీలన్, అలరుచున్, అరుగునప్పుడు = పాండవులెల్లు సంతోషించుచుఁ బోవునప్పుడు, రమణీయ ...........రాగము—రమణీయ = మనోజ్ఞమయిన, అ రామ = ఉద్యానవనముల యొంపలి, పాదప= చెట్లయొక్క, రాగము = పన్నె, అశా = దిక్కులయొక్క, అపవారణము = ఆచ్ఛాదనము, అచరింపన్ = చేయుచుండఁగా, ఆయతి......ఆకృతియును—ఆ యతి = వైశాల్యమును, వసు = ద్రవ్యముచే, శోభనాకృతియును, సరసీ......కలనయున్—సరసీ=కొలఁకులచే, కృత=చేయఁబడిన, మానస = మానసమనెడి సరస్సుయొక్క, హ్రీకలనయున్ = లజ్జాస్థితిగలదియు, ఘన......శోభన్—ఘన, నవరత్న = తొమ్మిదివిధములగు రత్నములు చెక్కిన, కాంచన = స్వర్ణమయమగు, ధామ = గృహముల యొక్క, శోభన్ = కాంతిచే, అవని ....స్ఫురితయున్—అవని+ఆభరణ = భూదేవికి భూషణమగు, వైభవముచే, స్ఫురితయున్ = ప్రకాశించునదియు, విపుల......సమున్నతియును—విపులతర = మిక్కిలి విశాల

మైన, పయోధరపథ = మేఘమార్గమును, ఆకాశముననుట. వ్యతిక్రమకర = అతిక్రమింపుచుండు, నవ+అంశు = మనోహరములగు కిరణములచే, కాంతి = మనోజ్ఞమైన, వరణ = కోటలయొక్క, నిరతిశయ = మిక్కిలి యధికమగు, సమున్నతియును = పొడవుగలదియును, ఐ, వారలందఱు, తన్నుఁ, గౌరమునన్, కనుఁగొనంగన్, తత్పరిస్ఫూర్తి = ఆవారణావతముయొక్క ప్రకాశము, చిత్రంబు, ఒనర్చెన్.

తా. పాండవులట్లు సంతోషమున నేఁగుచుండ నుద్యానవనముల యందలి కాంతి నల్దిక్కుల నాచ్ఛాదించుచుండ, మిక్కిలి వైశాల్యముగలదియు, ద్రవ్య పరిపూర్ణయునగుచుఁ, దిగ్యాంతి కొలఁకులు మానస సరస్సునకు లజ్జగలిగింపఁగా, రత్నములు చెక్కిన బంగారు పుట్టిండ్ల కాంతిని భూదేవికాభరణమగుచును, మేఘమండలము నతిక్రమించు నత్యున్నతము లగు కోటలు గల్గుచుఁ బాండవులు కన్న గౌరవముతోఁ జూచుచుండ నా వారణావతపురశోభ యొంతయుఁ జిత్రముగా నుండెను.

"రాగ" "రాగోనురక్తమాత్సర్యే, క్లేశాదౌ లోహితాదిషు." అని విశ్వము.

"అపవారణము." "అంతర్ధి రపవారణం" అని యమరము.

"ఆయతి." "ఆయతిస్స్యాద్దీర్ఘతాయాం, ప్రభావాగామికాలయోః." నానార్థ రత్నమాల.

"నవరత్న" "కురువింద వజ్రమౌక్తిక, పరమరకత శక్రనీల వైడూర్యమణో, పారిపుష్యరాగ విద్రుమ, వరసిత గోమేధికములు నవరత్నంబుల్" రత్నపరీక్ష.

"వరణ" "ప్రాకారో వరణస్సాలః" అని యమరము.

గీ. హరిపురాభోగ వార్తపెం పొప్పుడు వారి
మదిఁ బొడమఁ దలపోసి రకట్టిది యటంచుఁ

చెలువసంకోచవిభవవైచిత్రిఁబరఁగఁ
బరఁగునానగరంబుగన్పట్టఁజూచి. 40

**రామాయణ.** హరి.....వార్త - హరి = ఇంద్రునియొక్క, పురాభోగ = మున్ను సంభోగించిన, వార్త = సమాచారముయొక్క, పెంపు = అతిశయము, అపుడు, వారిమదిన్ = విశ్వామిత్రాదుల మనస్సున, పొడమన్ = జనింపఁగా, తలపోసి = ఊహించి [అహల్య వారటు స్వకృత దోషమును గురించి యాలోచించుచుండుట తెలిసియనుట] ఇది, రట్టు = నింద, పరపురుష సంగమునలని కూఅనుట. ఇటంచున్, చెలువ = స్త్రీ, అహల్యయనుట. సంకోచ.....వైచిత్రిన్ - సంకోచ విభవ = సంకోచాతిశయముచేనైన, వైచిత్రిన్ = వింతరీతిచే, పరఁగన్ = ఒప్పుచుండఁగా, పరఁగు నాన = ఒప్పునట్టి సిగ్గు, కరంబున్ = మిక్కిలి, కన్పట్టన్ = కనుపింపఁగా, చూచి=అయహల్యంగాంచి.

తా. ఇంద్రునితోఁ దాను పూర్వ మాచరించిన సంభోగ రూపకార్యము వారు తెలిసికొనిరనుట యూహించి యహల్య యిదియొక నింద గల్గెఁగదా యని మనస్సున సిగ్గుగల్గియుండ నామెంగాంచి. నుతిచేసిరని ముందటి పద్యముతో నన్వయము.

"హరి" "యమానిలేంద్రచంద్రార్క, విష్ణు సింహాంశువాజిషు, శుకాహికపి భేకేషు, హరిర్నా కపిలేత్రిషు," అని యమరము.

**భారత.** చెలువు = అందము, అసంకోచ.....వైచిత్రిన్—అసంకోచ = తగ్గనట్టి, విభవ వైచిత్రిన్ = వైభవాతిశయముచే, పరఁగన్, పరఁగు, ఆ నగరంబు = ఒప్పారు నాపురము, కన్పట్టన్, చూచి, హరి..... పెంపు-హరిపుర=ఇంద్రునిపట్టణముయొక్క, ఆభోగ=వైశాల్యమును గుఱించిన, వార్త, సమాచారముయొక్క, పెంపు = అతిశయము, అపుడు, వారిమదిన్, పొడమన్ = వారి మనస్సులోఁ గలుగఁగా, తలపోసిరి = ఎంచిరి.

తా. చక్కని వైభవముగల యా వారణావతము చూచినంతనే యమరావతి వారికి స్మరణకువచ్చెను.

అలంకారము. స్మరణము. లక్షణము. "యథానుభవ మర్థస్య దృష్టే తత్సదృశేస్మృతిః" కావ్యప్రకాశము.

గీ. అనిశశివవాస మైనపుణ్యాపురమణివ
ఘాపహాస్మృతివనుచునాయపకలంక
మానసోత్కర్షయుక్తులనూననుతులు
సేసియందఱుఁ దత్పురస్థితినిబరఁగ. 41

రామాయణ. అనిశ......వాసము—అనిశ = ఎల్లప్పుడు, శివ = మంగళమునకు, వాసము, ఐన = స్థానమైన, నిత్యశుభ ప్రదయైన, పుణ్యాపురమణివి = పుణ్యాంగనవు, అఘాపహాస్మృతివి = పాపాపహారక స్మరణముగల్గినదానవు, [స్మరణ మాత్రమునఁ బాపములు పోఁగొట్టు దానవని భావము.] అనుచున్, అయప = అయమ్మయొక్క, కలంక = కలఁక, మానన్ = మానునట్లు, సోత్కర్ష = అతిశయముతోఁగూడిన, యుక్తులన్, ఊనన్ = స్థిరముకాఁగా, [మనస్సున సంతోషము స్థిరపడునట్లు, అని భావము] నుతులుచేసి = స్తుతించి, అందఱును, తత్పురస్థితిని, పరఁగన్ = అయహల్యకెదుట నిలువఁగా.

తా. నిత్య శుభదాయినివగు పుణ్యాంగనవు, నీనామస్మరణము పాపాపనోదకరము. అనుచు నా బిడకలఁత దీఱులాగునను మానసమున సంతసము కల్గులాగునను, స్తుతించి యందఱు నెదురనిలువఁగా. చేకొనియె నను ముందరిపద్యమునందలి క్రియతో నన్వయించును.

"అఘాపహాస్మృతివి." "అహల్యా ద్రౌపదీ సీతా తారా మండోదరీ." అనిస్మరణ మాత్రమునఁ బాపములు పోఁగొట్టు పంచకన్యలలోఁ బ్రథమోపాత్తయగునది.

"అప" అప్పయనఁగాఁ దల్లి, అప్పశబ్దముయొక్క ద్విత్వరహితమగు రూపమేయగుచున్నది.

భారత. అనిశ శివవాసమైన = ఎల్లప్పుడును రుద్రునకు నివాసమైన, పుణ్య, పుర, మణివి = పుణ్యదాయకమైన నగరశ్రేష్ఠమవు, అఘాప హాస్మృతివి = స్మరణమాత్రమునఁ బాపముపోఁగొట్టుదానవు, అనుచుఁ, ఆయపకలంక.....యుక్తులు - అపకలంక = కళంకరహితమైన, మానస = మనస్సుయొక్క, ఉత్కర్ష = అతిశయముతోడ, యుక్తులు = కూడినవారు, అందఱున్ = పాండవులందఱునను. అనూనసుతులుచేసి = మిక్కిలి స్తుతించి, తత్పురస్థితిని, పరఁగన్ = ఆనగరమునయుండఁగా.

తా. ఎడతెగక రుద్రుఁడు వాసముసేయునగరశ్రేష్ఠమవు, స్మరణమాత్రమునఁ బాపములుపోఁగొట్టుదానవు, అని స్తుతింపుచు నప్పాండవులా నగరమున వసించుచుండఁగా.

సీ. ఆసమయమున నే మనిచెప్పనరుదెంచి
చూడనద్భుతతమస్ఫూర్తి యగుచు
తద్జ్ఞాతియమితచేతః కళంకుండు తి
గ్మృహమేధితద్వేష మహిమపేర్మి
ననలసముద్వృత్తి హతము గావింపంగ
నంచితానఘవిధి సంచితార్థ
సందర్శనుఁడు గామి నిందనపెంపెల
ర్పఁగఁ జేకొనియె నా రాకొమరులు

గీ. నతని యాదరక్రియఁ గాంచి యవలఁ జనిరి
స్వీయగురుయుక్తముగఁ దద్వి సృష్టులగుచు
విదురజనదర్శితోచిత వివరసరణి
నలఁత తొలఁగక దక్షిణానిలజధృతిని.

రామాయణ. అసమయమునన్ = అతరుణమున, ఏమనిచెప్పన్ = ఏమనిచెప్పుదును, తద్ఘ.....కళయుఁడు - తద్ఘ=అశాపమోక్షణరీతి నెఱిఁగిన, అతియమిత = మిక్కుటముగాఁ బోఁగొట్టఁబడిన, చేతఃకళంకుఁడు = మనస్సునందలి కలఁతగలవాఁడు, తద్గృహామేధి = ఆ యహల్యకుభర్త, గౌతముఁడనుట. అద్భుతతమస్ఫూర్తి = మిక్కిలి యాశ్చర్యకరమగు కాంతిగలవాఁడు, అత్యంతాశ్చర్య హృదయుఁడగుచు ననుట, చూడన్ = ఆయహల్యను జూచుటకొఱకు, అరుదెంచి, అనలస = అధికమైన, ముద్వృత్తి = సంతోషవర్తనము, తద్వ్యధిమహిమ పేర్మిన్ = భార్య యొక్క దుర్వృత్తిచేఁగల్గిన ద్వేషాతిశయమును, హతిను, గావింపంగన్= నశింపఁజేయఁగా, అంచిత .....సంవర్మనుఁడు - అంచిత = పూజితమైన, అనఘవిధి = పాపరహితవిధిచే, సంచిత = సంపాదితమైన, అర్థసంవర్మ నుండు = తత్త్వజ్ఞానముగలవాఁడు, కామినిన్ = అహల్యను, తనపెంపు = ప్రాతిశయము, ఎలర్పఁగన్ = ఒప్పఁగా, చేకొనియెన్ = గ్రహించెను, ఆరాకొమరులు = ఆరాజకుమారులు, రామలక్ష్మణులనుట. అతని = ఆగౌతముని, ఆదరక్రియ, కాంచి = ఆదరణమునంది, తద్విసృష్టులగుచున్ = అతనిచే వీడుకోలుపడసినవారయి, స్వీయగురుయుక్తముగన్ = తమగురువగు విశ్వామిత్రునితోఁగూడి, విదుర......సరణిన్-విదురజన = విజ్ఞజనులచే, నెఱవరులచేననుట. దర్శిత = చూపఁబడిన, ఉచిత=తగిన, వివరసరణిన్ = విశేషించిన మంచిమార్గమున, అలఁత, ఎఱుఁగక=శ్రమము దెలియక, దక్షిణానిలజ = మలయమారుతమువలనజనించిన, ధృతిని = సంత సముతో, అవలన్, చనిరి.

తా. శాపవిమోక్షణమయినంతనే గౌతముఁడట కరుదెంచి, సంతోషాతిశయమునఁ బూర్వమామెయొనర్చిన యపరాధమునశింపఁగా నాబిడను బరిగ్రహించెను. ఆరామలక్ష్మణు లాతని యాదరముపొంది యతనివీడి

కోలునంది తమగురువగు విశ్వామిత్రునితోఁగూడి సెలవరులెఱిఁగించినవారై యటనుండి వెడలిరి.

"ముద్వృత్తి." "ముత్ప్రీతిః ప్రమదో హర్షః" అని యమరము.

"సందర్శనుఁడు." "దర్శనం నయనస్వప్న బుద్ధిధర్మోపలబ్ధిషు," అని విశ్వము.

"విదుర." "జ్ఞాతాతు విదురో విందుః." అని యమరము.

భారత. ఆసమయమునన్, ఏమనిచెప్పన్, ఎంచిచూడన్, అరుదు= తలఁపఁగానరుదు, తద్జ్ఞాతి = అపాండవులదాయ, దుర్యోధనుఁడనుట. అద్భుత, తమస్స్ఫూర్తి = తమోగుణముగలవాఁడు, అమిత, చేతఃకళంకుఁడు= అమితమగు మనఃకాలుష్యముగలవాఁడు, అగుచున్, తద్గృహము = ఆపాండవులు వసించుగృహము, ఏధిత = వృద్ధిపొందిన, ద్వేషమహిమ పేర్మిన్ = ద్వేషాతిశయముచే, అనల = నిప్పుయొక్క, సముద్వృత్తిన్= దరికొల్పుటచే, హతము, కావింపంగన్, అంచి = పంపి, ఒక్కనింబంపి యనుట. తాన్, అఘవిధిన్ = పాపవువిధిచే, సంచిత, అర్థసందర్శనుండు = ప్రయోజనమొందువాఁడు, కామిన్ = కాకుండుటచే, నిందన పెంపు=మిక్కుటమగునపకీర్తి, ఎలర్పన్, కైకొనియెన్, ఆరాకొమరులు= పాండవులు, స్వీయగురుయుక్తముగన్=తమతల్లితోఁగూడ, విదుర......సరణిన్—విదురజన = విదురుఁడంపిన దూతచే, దర్శిత = చూపఁబడిన, వివరసరణిన్ = బిలమార్గమున, తద్విస్పృష్టులు=ఆదూతయొక్క వీడుకోలు వడసినవారు, అగుచున్, దక్షిణ=సమర్థుఁడగు, ఆనిలజ = భీమునియొక్క, ధృతిని = ధారణమున, అలఁత, ఎఱుఁగక, అతని = ఆ దుర్యోధనుని, ఆ దరక్రియ = అట్టిభయప్రదకార్యమును, కాంచి, ఆవలన్, చనిరి.

తా. తమోగుణవంతుఁడై, మనఃకాలుష్యయుక్తుఁడునగు దుర్యోధనుఁడు, పాండవులు వసించు నింటిం గాల్పనుద్దేశించి యొక్కని వారణావత

మునకనుప నిదదెలిసిన విదురుఁడొక దూతనంప నాతనిచే ద్రవ్వింపఁబడిన బిలమునుండి భీముఁడు దమ్ము వహింప నాదుర్యోధనుని వలనిభీతిచేఁ దప్పిత్తో డఁదప్పించుకొని యటనుండి పాండవులు వెడలిరి.

"వివర." "సుషిరంవివరం బిలం" అని యమరము.

"దక్షిణ" "దక్షిణస్సరళో దారపరచ్ఛం దానువృత్తిషు" అని విశ్వము.

"దరక్రియ" "దరోస్త్రీ యాంభయేశ్వభ్రే" యనియమరము.

క. చనునెడ శ్రీరాముఁడు పా
వని నవనిజరూపవైభవశ్రీ నుల్లం
బున నిడి దానవిచిత్రా
తనురాగప్రౌఢి వచ్చి తనుఁ బైకొనఁగన్. 43

రామాయణ. శ్రీరాముఁడు, చనునెడన్ = పోవుచుండఁగా, పావనిన్ = పవిత్రమైనదానిని, అవనిజ...శ్రీన్—అవనిజ = సీతయొక్క, రూపవైభవశ్రీన్ = సౌందర్యాతిశయమును, ఉల్లంబునన్ = మనస్సున, ఇడి, దానన్ = ఆకారణమున, విచిత్ర...ప్రౌఢి—విచిత్ర, అతను=మన్మథుని, రాగప్రౌఢి=మోహాత్మ్యతిశయము, వచ్చి, తనున్, పైకొనఁగన్, అలమికొనఁగ.

తా. అట్లు వెడలుచుండిన రాముఁడు సీతయొక్క సౌందర్యాతిశయము దనమనస్సున గోచరింప మోహాతిశయ మలమికొనఁగ. అనుమతించెనని ముందరి పద్యముతో నన్వయము.

భారత. చనునెడన్ = వెడలుచుండఁగా [పాండవులు బిలమునుండి వెలువడి వెడలుచుండఁగాననుట] శ్రీరాముఁడు = కాంతిచే మనోహరమగువాఁడు, పావని = భీముఁడు, నవ = నూతనమగు, నిజరూపవైభవశ్రీన్ = తన సౌందర్యాతిశయమును, ఉల్లంబునన్, ఇడి, దానవి = రాక్షసస్త్రీ,

హిడింబియనుట. చిత్ర, అతను, రాగప్రౌఢిన్ = మోహాతిశయమున, వచ్చి, తనున్, పైకొనంగన్.

తా. పాండవులట్లు పోవుచుండ భీమునిరూపాతిశయమును గాంచి మోహించి హిడింబియాతనిం జేర నరుదెంచి.

గీ. తొడఁగియపుడు దానితోఁ బుట్టుగురుతర
సంగరసముదీర్ణ సరణిఁ బరఁగ
వానినంత గెలిచి స్వగురుకథాదర
మమరఁ బ్రమదయుక్తి ననుమతించె. 44

రామాయణ. తొడఁగి - ప్రారంభించి, పూనియనుట. అపుడు, దానితోఁ బుట్టు = ఆమోహాతిశయముతో జనించుచున్న, గురుతర=మిక్కిలి యధికమైన, సంగరసము = చేరికయందలి యిచ్ఛ, ఉదీర్ణసరణిన్, పరఁగన్ = అధికముగా నొప్పఁగా, వానిన్ = ఆమోహవాంఛలను, అంతన్, గెలిచి = జయించి, స్వగురుకథాదరము = గురువగు విశ్వామిత్రుఁడు చెప్పెడికథలయందలి యాదరము, అమరన్ = ఒప్పఁగా, ప్రమదయుక్తిన్ = సంతోషముతోడి చేరికను, అనుమతించెన్ = సమ్మతించెను.

తా. ఆమోహముతోడ సంగేచ్ఛ గలుగఁగా దానినడఁచికొని విశ్వామిత్రుఁడు చెప్పు పుణ్యకథలు వినుచు సంతోషించెను.

భారత. తొడఁగి, అపుడు, దానితోఁ బుట్టుగు = దాని భ్రాతయగు హిడింబుఁడు, ఉరు.........సరణిన్-ఉరుతర = మిక్కిలి యధికమైన, సంగర = యుద్ధమునందలి, సముదీర్ణసరణిన్ = అధికరీతిని, పరఁగన్ = ఒప్పఁగాఁ, వానిన్ = ఆహిడింబుని, అంతన్, గెలిచి, స్వగురు = తన పెద్దలగు కుంతీ ధర్మజులు, కథాదరము, అమరన్ = కథనమునందలి గౌరవ మొప్పఁగా, ప్రమదయుక్తికిన్ = హిడింబితోడి చేరికకు, అనుమతించెన్.

తా. హిడింబియొక్క యన్నయగు హిడింబాసురుఁడు యుద్ధమునకు రాఁగవానింజయించి తనతల్లియు, నన్నయుఁ జెప్పటచే హిడింబిం బరిగ్రహింప నంగీకరించెను.

"తోఁబుట్టుగు" ఇటనకారమునకుఁ గకారమువచ్చుటకు, "క్వచిద్గకారోపః." ఆంధ్రశబ్ద చింతామణి.

"ప్రమదయుం డ్రికిఁ" ఇది సాధ్యసమాసము. రాజానాజ్ఞ, తటాకంబు నుదకము, గౌరివల్లభుఁడు - ఇత్యాదులు ప్రయోగములు లెక్కకు మిక్కుటములు.

వ. అంత. 45

గీ. ఉరుగుణాద్భుతజనకసుతోదయమహి
మాతిశయము సాధించి పుణ్యజనకాంత
సుగుణయనిపించుకొనినభాసురపురమణిఁ
జూపుతగులు వహించెనుత్సుకత నతఁడు. 46

రామాయణ. అతఁడు=రాముఁడు, ఉరుగుణ = గొప్పగుణములచే, అద్భుత = ఆశ్చర్యకరమగు, జనకసుతా = సీతయొక్క, ఉదయ = పుట్టుకవలని, మహిమాతిశయము = మాహాత్మ్యము, సాధించి, పుణ్యజన కాంత = పుణ్యముచేసినవారిచే మనోజ్ఞమగు, సుగుణ=సద్గుణములు గలది, అనిపించుకొనిన, భాసుర, పుర, మణిఁ =అందమైన పురశ్రేష్ఠమును, మిథిలననుట. ఉత్సుకతఁ = ఉత్కంఠతో, చూపుతగులు, వహించెఁ=చూడ నను రాగముపూనెను.

తా. రాముఁడు సీతయొక్క యుత్పత్తికి స్థానమును, పుణ్యము చేసిన జనులయునికిచే మనోజ్ఞమునయిన మిథిలంజూడ నుత్సుకుఁడాయెను.

భారత. అతఁడు = భీముఁడు, ఉరుగుణ ......... అతిశయము - ఉరుగుణ = గొప్పగుణముగల, అద్భుతజనక = ఆశ్చర్యకరుఁడైన, సుత =

కుమారునియొక్క, ఘటోత్కచునియొక్క యనుట. ఉదయ = పుట్టుక
వలని, మహిమాతిశయము = మాహాత్మ్యము, సాధించి, పుణ్యజనకాంత =
రాక్షసస్త్రీయగు హిడింబి, సుగుణ, అనిపించుకొనినన్ = వీడుకోలువం
దఁగా, పోఁగా ననుట. భాసురపురమణిన్ = అందమైన యా హిడింబి
యందు, మాపుతగులు, వహించెన్ = అనురాగము దాల్చెను.

తా. సద్గుణవంతుఁడగు ఘటోత్కచుఁడు కలిగినంత నాహిడింబి
భీమునివలన నాజ్ఞగైకొనివెడల నతఁడామెయం దనురాగము వహించి
యుండెను.

"పుణ్యజన." "యాతుధానః పుణ్యజనః" అని యమరము.

ఉ. అన్నగరంబు ప్రోదిఁ దనరారఁగఁ దమ్ములఁ గన్నతల్లి నా
సన్నుతఖేలనుండు విలసన్నయనైకవిలాసగౌరవా [లో
భ్యున్నతిఁ దద్వనాంతమునఁ బ్రోచెఁ గడుం దనక్రాంతియాత్మ
నన్నలయం గణింపఁడు మనస్స్థిరతన్వివరించుపూనికన్. 46

రామాయణ. అన్నగరంబు = ఆపట్టణము, ప్రోదిన్, తనరారఁ
గన్ = వైభవముచే నొప్పారఁగ, తమ్ములన్ = తామరలను, కన్నతల్లి,
నాన్ = కనినట్టితల్లియోయనన్, తామరలకుత్పత్తి స్థానమోయనులాగున,
ననుట. సన్నుతఖేలన్, ఉండు=వర్ణితవిలాసముతోనుండు, వికసత్......
అభ్యున్నతిన్ - వికసత్ = ప్రకాశించుచున్న, నయన = కన్నులయొక్క,
ఏక = ముఖ్యమైన, విలాసగౌరవ = శృంగారాతిశయముయొక్క, అభ్యున్న
తిన్ = గొప్పతనముచే, తత్, వనాంతమునన్ = ఆ మిథిలానగరము
లోని యుద్యానవనమందు, ప్రోచెన్ = పోషించెను. [పద్మకాంతిగల
నయనములచే శ్రీరాముఁడు, ప్రోచెన్, అనఁగాఁ గటాక్షించెనని భావము]
తనక్రాంతి=తన యలయిక, ఆత్మలోనన్, నెఱయన్ = మనస్సున నిండఁగా,
మనస్స్థిరతన్విన్ = మనసున స్థిరముగా నివసించియుండు స్త్రీని, సీతననుట.

వరించు పూనికన్ = వివాహమాడు యత్నమున, గణింపఁడు = ఆయలసటను, లెక్కసేయఁడు.

తా. శ్రీరాముఁడు మిథిలానగరమునందలి యుద్యానవనమును గటాక్షించెను. మనస్సున సీతనువరించు తమకముగల్గుటచేఁ దనమార్గాయాసము గూడ గణింపఁడు.

"నయనైకవిలాస గౌరవాభ్యున్నతిన్, ప్రోచెన్." నేత్రముల రక్షించెననుటకు నేత్రములఁగాంచెననునర్థము లక్షణచే స్ఫురించుచున్నది. లక్షణా లక్షణము. "వాచ్యార్థానుపపత్త్యాతత్సంబంధి న్యారోపితశబ్ద వ్యాపారో లక్షణా." ప్రతాపరుద్రీయము.

భారత. అన్న = ధర్మజుఁడు, కరంబు = మిక్కిలి, ప్రోదిన్, తనంతరఁగన్, తమ్ములన్ = సోదరులను, అర్జునాదులను ననుట. కన్నతల్లిన్ =కుంతిని, అనన్నుత, ఖేలనుఁడు = స్తుత్యవిలాసుఁడు, భీముఁడనుట. విలసత్.........అభ్యున్నతిన్ - విలసత్ = ప్రకాశించుచున్న, నయ= నీతియొక్క, నైక = ఎక్కుడగు, విలాస, గౌరవ, అభ్యున్నతిన్ = గొప్పతనముచే, తద్వనాంతమునన్ = ఆయడవియందు, ప్రోచెన్, కడున్, మనస్స్థిరతన్ = చిత్తస్థైర్యమున, విహరించు = ఉగ్గడించు, పూనికన్, తన శ్రాంతిన్, ఆత్మలోనన్, తెలియక్, గణింపఁడు = లెక్కచేయఁడు.

తా. భీముఁడు డాయడవియందు సోదరులను దల్లిని రక్షించుచుఁ దన చిత్తస్థైర్యమున నలసట గణింపకుండెను.

"తమ్ములన్" అనుటకు తామరలన్, సోదరులనని యర్థద్వయము గల్గుటకు. "తమ్ములనంచేరగుఁబ, ద్మమ్ములకను జన్ములకును గరుణేందు

వ. అది యట్లుండె. వారలందఱుఁ దత్ప్రకారంబున విపిన మార్గవర్తనంబు గడపి యథోచితగమనంబున. 47

సుగమము.

క. చనిరి పురసవిధమార్గం
బున సద్ద్విజలీలలు నడపుచు మాధుకరా
శన మొనఁగూర్చుచు నపుడు ప
వనసంతతి యలరఁ జేసె వారలయాత్మన్. 48

**రామాయణ.** పురసవిధమార్గంబునన్ = మిథిలానగరసమీపమార్గమున, చనిరి = వారుపోయిరి. ఉపవనసంతతి = ఉద్యానవన సమూహము, సద్ద్విజలీలలు = మేలైన పక్షులలీలలను, నడపుచున్, మాధుకర = తుమ్మెదల సంబంధమగు, అశనము = ఆహారము, మకరందమనుట. ఒనఁగూర్చుచున్ = సమకూర్చుచు, అపుడు, వారల యాత్మన్ = రామాదులమానసమును, అలరఁజేసెను = సంతోషింపఁజేసెను.

తా. రామాదులెల్లరు మిథిలా నగరప్రాంతము చేరిరి. అచ్చటి యుద్యానవనములు పక్షులవిలాసములచేతను. మకరందముస్రవింపఁ జేయుట చేతను వారిమనస్సుల నానందింపఁజేసెను.

“మాధుకర.” “తస్యేద” మనుపాణిని సూత్రమున నిట అణ్ప్రత్యయాంతతగ్గెను.

**భారత.** పురసవిధమార్గంబునన్ = ఏకచక్రపురముయొక్క సమీప మంచిత్రోవను, సద్ద్విజలీలలు, నడపుచున్ = బ్రాహ్మణవేషధారులై, చనిరి = పాండవులుపోయిరి, పవనసంతతి = భీముఁడు, మాధుకరాశనము, ఒనఁగూర్చుచున్ = భైక్షమును సమగూర్చుచు, వారల, యాత్మన్ = మానసములను, అపుడు, అలరఁజేసెన్ = సంతసింపఁజేసెను.

తా. పాండవులట్లు తల్లితోడ వెడలి బ్రాహ్మణవేషములూని యేక చక్రపురము సమీపించిరి. భీముఁడట భిక్షాన్నముచే వారిం దృప్తిపఱచెను.

"సద్ద్విజ." "దన్తవిప్రాణ్డజా ద్విజాః" అని యమరము.

"సంతతి." "సంతతిః పంక్తివిస్తారే పారంపర్య సుతాన్వయే." నానార్థ రత్నమాల.

ఆ-వె. అందు దారవృత్తి నందితానేకచ
క్రాగ్రహారహితవిహారమహిమఁ
బ్రచురసారసమదబకదర్పహారితఁ
దనరె సరసులందఱును నుతింప. 49

**రామాయణ.** అందుఁ = ఆమిథిలానగరమునందు, దారవృత్తిఁ = భార్యావర్తనముచే, నందిత............మహిమఁ - నందిత = స్తుతింపఁబడిన, అనేక, చక్ర = చక్రవాకపక్షులయొక్క, ఆగ్రహ + అరహిత = కోపరహితమైన, ఔత్సుక్యముగలయనుట. విహారమహిమఁ = సంచారాతిశయముచేతను, ప్రచుర.........హారితఁ - ప్రచుర, సారస = బెగ్గురుపక్షులయొక్కయు, మదబక = మదయుక్తములగు కొంగలయొక్కయు, దర్ప = గర్వమువలని, [ఇటగర్వమువలని యనుటకు గర్వకార్యమగు స్వేచ్ఛాసంచారమువలని యని భావము.] హారితఁ = మనోహరత్వముచే, సరసులు = సరస్సులు, అందఱుఁ, నుతింపఁ = స్తుతింపుచుండఁగా, తనరెఁ = ఒప్పెను.

తా. ఆమిథిలానగరములోని సరస్సులు చక్రవాకమిథునముల సంచారముచేతను, బెగ్గురుపక్షులయొక్కయు, కొంగలయొక్కయు స్వేచ్ఛావిహారములచేతను, సంపఱు పొగడఁదగినట్లొప్పుచుండెను.

"చక్ర." "కోకశ్చక్రశ్చక్రవాకః." అని యమరము.

**భారత.** అందుఁ = ఏకచక్రనగరమందు, ఉదారవృత్తిఁ, అంచి = గొప్పవర్తనముగల్గి, సాహసవర్తనుఁడై యనుట. తాఁ = భీముఁడు, ఏక

చక్ర ............ మహి - ఏకచక్రాగ్రహార = ఏకచక్ర పురమునకు, హిత = మేలగు, విహారమహిమన్ = సంచారవిశేషముచే, ఏకచక్రాగ్రహారమునకు భీముఁడొనర్చిన హితకార్యము నిరూపింపఁబడుచున్నది. ప్రచుర...హారితన్—ప్రచుర = ప్రసిద్ధమైన, సార = బలముగల, బక = బకాసురుని, దర్పహారితన్ = గర్వము నపహరించుటచే, బకసంహారముచే ననుట. సరసులు = రసికులు, అందఱును = ఎల్లరును, నుతింపన్ = తన్ను స్తుతించునట్లు, తనరెన్ = ఒప్పెను

తా. భీముఁడు దానేకచక్రపురమునకు హితము సేయువాఁడై మిక్కుటమగు బాహుబలముగల్గిన బకుని సంహరించుటచే నచ్చటిరసికులెల్ల రాతనిస్తుతింపనొప్పుచుండెను.

క. జననేత్ర చిత్రదారుణ
వనజగతులనిశలసత్ప్రకాశత నడుచుచో
గననరుదురమారూఢిం
దనరెజితాంగారపర్ణదర్పోదయతన్, 50

రామాయణ. జననేత్ర ... గతులు — జననేత్ర = జనులకంటికి, చిత్రము = వైచిత్రినిచ్చెడి, అరుణ = ఎఱ్ఱని, వనజగతులు = తామరల ప్రకారము, అనిశ = ఎల్లప్పుడు, లసత్ప్రకాశతన్ = శోభావశమున, నడుచుచోన్ = వెలయునట్టి యచ్చోటను, మిథిలాపురమున ననుట. జిత...దర్పోదయతన్—జిత = జయింపఁబడిన, అంగార = అగ్నివంటి, ఎఱ్ఱవన్నెగలయనుట. పర్ణ = ఱేకులయొక్క, దర్పోదయతన్ = గర్వాతిశయము గల్గుటచే, రమారూఢిన్ = లక్ష్మీప్రాప్తిచే, తనరెన్ = ఒప్పెను. శోభాయుక్తమైయున్నదనియు లక్ష్మీనివాసస్థానమైయున్నదనియు భావము.] కనన్, అరుదు = ఇది చూచుట కాశ్చర్యమగునది.

తా. జనులకన్నులకాశ్చర్య మొసఁగు నెట్టిదామర లెట్టిని కేకులు గల్గి, ఎల్లప్పుడుఁ బ్రకాశించుటచే శోభాకరమయ్యెను. ఇది గనినంతయు నాశ్చర్యము.

భారత. జవనేత్ర...గతులన్ — జననేత్రచిత్ర = జనుల కన్నులకుఁ జిత్రములగు నట్టియు, దారుణ = భయంకరములగు నట్టియు, వన, జగతులన్ = వనభూములయందు, నడుచుచోన్ = పోవునప్పుడు, కనన్ = చూచుటకు, నరుదురము = అర్జునుని యుద్ధము, జిత...ఉదయతన్ - జిత = జయింపఁబడిన, అంగారపర్ణ = అంగారపర్ణుఁ డనువానియొక్క, దర్పోదయతన్ = అహంకారాతిశయముగలదగుటచే, ఆరూఢిన్ = ప్రసిద్ధిచే, తనరెన్ = ఒప్పెను.

తా. ఏకచక్రపురమునుండి బ్రాహ్మణులతోడ నిర్గమించిన పాండవులు దారుణాటవీమార్గములసంచరించుచుండ నంగారపర్ణుఁడు యుద్ధమునకు రాఁగ నర్జునుఁడాతని జయించి ప్రసిద్ధితోఁ దనరెను.

"వనజగతులన్." "జగతీరత్నిగర్భ" అని యమరము.

"నడుచుచోన్" అన్నచ్చోరి శోధితప్రతులలో నొక్కదానం దక్కఁ దక్కిన వానియందెల్ల నడుచుచోనఁయే కలదుగాన నే దీని నంగీకరించితి నంతియకాని భూతార్థమున, "ఇ" అనియు, వర్తమానమున, "ఉ" అనియు భవిష్యత్తున "అ" అనియు నుండుట విధియని నామతముగాదు. "నడచి, నడిచి, నడచు, నడుచు, నడవన్, నడునన్, అని ద్వివిధముగాను బెక్కు ప్రయోగములుగలవు.

వ. అంతట వారియంతరంగమునందు. 51

క. వివిధద్విజాళి భూమా
నవరతసంశ్లాఘితస్వశ్రీయువరకల్యా
ణవిధివరద్రుపదసుతా
నవమంజులతాప్రవృత్తిని నడపెఁ గుతుకమున్. 52

**రామాయణ.** వివిధ...ప్రవృత్తి—వివిధ=పలువిధములగు, ద్విజాళి=పక్షిసమూహములయొక్క, భూమా=బాహుళ్యమున, అనవరత = ఎల్లప్పుడును, సంశ్లాఘిత = స్తుతింపఁబడినవియు, స్వయంవరకల్యాణవిధి=స్వయంవరవివాహవిధిని గలవియు, [సంశ్లాఘిత, కల్యాణవిధి, ఇవి లతాశబ్దవిశేషణములు.] వర = శ్రేష్ఠములయిన, ద్రు = వృక్షములు, పద = స్థానముగాఁ గలవియు సుతాన్త = మిక్కిలి కోమలములైన, మంజు = మనోజ్ఞములైన, లతా=తీఁగెలయొక్క, ప్రవృత్తి = ప్రవర్తనము. చెట్లపైఁ బ్రాఁకుట యనుట. కుతుకమున్, నడపెన్ = ఆరామునకు సంతోషమును జేసెను.

మిథిలాపురోద్యానమునందలియుపవనములలోని తీవెలు చెట్లపైనుండు పక్షులు నుతింప స్వయంవర కల్యాణ మాచరించుచున్నవో యననొప్పుచుఁ, జెట్లపైఁ దమంతన ప్రాఁకుచు రామునకు సంతసము గల్గించెను.

"ద్రు" "ద్రు ద్రుమాగమాః" అని యమరము.

ఇందు వృక్షములలతలుదమంతిన ప్రాఁక రామునకు సంతోషముగల్గనను వస్తువుచే, ద్విజాళిశ్లాఘింప, లతలు స్వయంవర కల్యాణ విధినందుటచేఁ గాఁబోలు వివాహార్థియగు రామునకు సంతసముగల్గెనను నుత్ప్రేక్షవ్యంజితమగుట నిదివస్తు కృతాలంకారధ్వని, ఇందులకు మూర్తికృతకావ్యాలంకార సంగ్రహమున "సకలచ్ఛాయ గుడించి యంత్రకృతమత్స్యంబీనృసింహక్షమా, తలనాథాగ్రణియేసె నంచువిని తద్వంశాధిపుంబట్టెనన్, సలిలచ్ఛాయగుడించియేయు నని యంపద్భీతిమార్తాండునిన్, బలిమింబట్టఁడువేఁగరాహు విధునిం గైకొన్న చందంబునన్." అని యుదాహరణమిచ్చి; "యంత్రమీనంబు దునుమాడినట్లదునుము, ననియకాఁబోలు రాహువర్కుని గ్రహింపఁ, డనెడు నుత్ప్రేక్షవాచకంబెనయలేమి వ్యంగ్యమగు" అని వివరించెను.

**భారత.** వివిధ.....ప్రవృత్తి - వివిధద్విజాళి = బ్రాహ్మణ సమూహముయొక్క, భూమా=బాహుళ్యముచే, అనవరత, సంశ్లాఘిత, స్వయంవర

కల్యాణవిధి, వర, ద్రుపదసుతా = స్వయంవరవివాహవిధిగల ద్రౌపది యొక్క, నవ = నూత్నమైన, మంజులతా = మనోహరత్వముయొక్క, ప్రవృత్తి = వృత్తాంతము, కుతుకముక్, నడపెక్ = పాండవులకుత్సాహము గల్గించెను.

తా. బ్రాహ్మణులు ద్రౌపదీ స్వయంవర కల్యాణమును గుఱించి ముచ్చటించుచుండఁ బాండవు లుత్సుకులైరి.

శా. అంతన్వారలు రామభద్రుపదరాజిన్యారూఢిచే నెంతయుం
జింతాతీతవిశేష మై ప్రబలలక్ష్మీన్మించుచంచద్ఘనో
పాంతంబత్పురి గూఢరాజపదవిప్రాకారరేఖక్ శుచి
స్వాంతుల్సేరిరి తత్పురోహితముఖవ్యాకీర్ణ సన్మాన్యులై. 53

రామాయణ. అంతక్, శుచిస్వాంతుల్ = శుద్ధమనస్కులగు, వారలు=విశ్వామిత్రాదులు, రామ...ఆరూఢిచేక్ - రామభద్రు = రాముని యొక్క, పదరాజి=పాదవిన్యాసపంక్తియొక్క, ఆరూఢిచేక్=ప్రాప్తిచే, ఎంతయుక్ = మిక్కిలి, చింతాతీత = భావనాతీతమగు, విశేషమై = విశేషముగల, వింత గుణముగలయనుట, [భావింపశక్యముగాని విలాసములంపగు నట్లుగా నని భావము.] ప్రబలక్=ప్రబలునట్లుగా, లక్ష్మిక్, మించుచుక్ = ఐశ్వర్యమున మించుచు, అంచత్=ఒప్పిదమగు, ఘన = గొప్పదగు, ఉపాంతక్ = సామీప్యముగలదానిని, గూఢ రాజపదవి......రేఖక్ - గూఢ = ఆవృతమైన, రాజపదవి = చంద్రమార్గముగల, ప్రాకార రేఖక్=ప్రాకార శ్రేణిగలదానిని, తత్పురిక్ = ఆమిథిలానగరమును, తత్.........సన్మాన్యులై - తత్పురోహితముఖ = ఆజనకుని పురోహితులు మున్నగు వారిచె, వ్యాకీర్ణ, చేయఁబడిన, సన్మాన్యులై = గౌరవముగలవారై, చేరిరి.

తా. రామునిపాదవిన్యాసములచేఁ జిహ్నితమగునదియు, భావింప నశక్యమగు విలాసములకుం దగునట్లుగ శోభిల్లుచుఁ జంద్రమండలము

నొరయు ప్రాకారముగలదియు నగు మిథిలాపురప్రాంతము నాజనకుని పురోహితాదులు దమ్ము గౌరవింపఁగా వారు చేరిరి.

"చింతా" స్యాచ్చింతాస్మృతి రాధ్యానం." అని యమరము.

"రాజపదవి ప్రాకారరేఖ" సంస్కృత సమాసమధ్యమున దీర్ఘము హ్రస్వమగుటకు, "నైజహి బంధోర్ధ్వదయం విదర్భే." అని కాళిదాస ప్రయోగముగలదు.

"రాజ" అనుటకుఁ జంద్రుఁడను నర్థముగల్గుటకు. "రాజా నృపేలతాభేదే, పతౌ క్షత్రియ చంద్రయోః" నానార్థరత్నమాల.

భారత. రామ ......... ఆరూఢిచేఁ - రామ = రమ్యమైన, భ = కాంతిగల, ద్రుపద = ద్రుపదరాజుయొక్క, రాజ్యారూఢిచేఁ = రాజ్యప్రాప్తిచే, ఎంతయుఁ, చింతాతీత = నిశ్చింతయగు, విశేషమై = తాత్కాలికావస్థగలదై, ప్రబల, లక్ష్మిఁ = మిక్కుటములగు బలముల యొక్క యతిశయముచే, మించు = మీఱుచుండు, చంచత్ = ఒప్పుచున్న, ఘన = గొప్పనగు, ఉపాంతక్ = సమీపప్రదేశముగల, తత్పురిఁ = ఆకాంపిల్యనగరమును, గూఢ......... రేఖఁ - గూఢ = గుప్తమగు, రాజపద = రాజచిహ్నముగల, విప్రాకారరేఖఁ = బ్రాహ్మణవేషములని సౌందర్యలీలచే, శుచిస్వాంతుల్ = శుద్ధమనస్కులు, తత్......సన్మానులై - తత్ = ఆ, ప్రసిద్ధమైన యనుట. పురః = ముందటికి, హిత = శ్రేయస్కరములయిన, ఖగ = సంచారముగల, వి=పక్షులచే, అక్షప్త = మిక్కిలిగాఁజేయఁబడ్డ, సన్మానులై = గౌరముగలవారై, శుచిస్వాంతుల్, వారలు = ఆపాండవులు, చేరిరి.

తా. ద్రుపదుని రాజ్యపాలనముచే నొప్పారుచుండు నానగరప్రాంత భూమిని సేనలు బలిసియుండ నట్టికాంపిల్యనగరమును బ్రాహ్మణ వేష ధారులగు పాండవులు శుభసూచకములగు పక్షిసంచారములు గౌరవించుచుండఁ జేరిరి.

"భ." "నక్షత్రమృక్షంభంతారా" అని యమరము.

"విశేషమై." విశేషః కాలికోవస్థా " అని యమరము.

"ముఖ" యనుట సంచారమను నర్థముగల్గుటకు, "ముఖంనిస్సరణే వక్త్రే ప్రారంభోదయ యోరపి." విశ్వము.

"తత్పురోహిత" ఇటుఁ బన్నబ్దము ప్రసిద్ధార్థకమగుటకు; "అనుభవతి శచీత్థం సాధ్వుతాచీముఖాభిః." అని శ్రీహర్షుఁడు ప్రయోగించి యున్నాఁడు.

"వ్యాక్ష్మప్త." కొన్ని ప్రతులయందు, "వ్యాక్లుప్త" అని యున్నది కాని యది వ్యాకరణదుష్టము.

గీ. అందుఁ దన్నృపాలుఁ డాత్మజ కిది యుంక
వంచు నెక్కుడ నియమించునట్టి
కార్ముకోత్తమమును ఘనమైనమూర్తిల
క్ష్యంబుసూచిరాన్నృపాత్మభవులు. 54

రామాయణ. అందుక్ = ఆ మిథిలా పట్టణమునందు, తన్నృపాలుఁడు = ప్రసిద్ధుఁడగు జనకమహారాజు, ఆత్మజకున్ = కూఁతురగుసీతకు, ఇది, ఉంకువ = శుల్కము, [కన్యార్థమిడవలసిన ద్రవ్యవిశేషము] అంచున్ = అనుచు, ఎక్కుడన్ = ఎక్కుపెట్టుటకు, నియమించినట్టి = ఆజ్ఞాపించినట్టి, ఘనమైన, గొప్పదైన, మూర్తి, కాఠిన్యముచే, లక్ష్యంబు= చూడఁదగిన దానిని, కార్ముకోత్తమంబున్ = ధనుఃశ్రేష్ఠమును, ఆ నృపాత్మభవులు = ఆరాజకుమారులు, రామలక్ష్మణులు, చూచిరి.

తా. మిథిలాపురమున జనకుఁడు దనకూఁతువివాహమున కిది యుంకువయని శివధనువుం జూపినయంతన యారాకొమరులు గాంచిరి.

"ఉంకువ." "ఓలియుంకువయనశుల్కమొప్పునభవ" ఆంధ్రనామశేషము.

“మూర్తి.” మూర్తిః కాఠిన్యకాయయోః ” అని యమరము.

“కార్ముకోత్తమము.” యుద్ధకర్మకొఱకు సమర్థమైనదిగావ నీపేరు గల్గెను. “కర్మణేప్రభవతి కార్ముకం” గురుబాలప్రబోధిక. “కర్మణ ఉకఞ్” అని పాణిని సూత్రము.

భారత. అందుఁ = ఆకాంపిల్య నగరమున, తన్నృపాలుఁడు = ద్రుపదమహారాజు, ఆత్మజకుఁ = కూఁతురగు ద్రౌపదికి, ఇది = మత్స్యయంత్రచ్ఛేదనమనుట. ఉంకువ, అంచుఁ, ఎక్కిడఁ, నియమించినట్టి, కార్ముకోత్తమమును = ధనుశ్శ్రేష్ఠమును, ఘనమైన, మూర్తి = శరీరము, మత్స్యస్వరూపమగు యంత్రముననుట. లక్ష్యంబు = గుఱిగా, ఆనృపాత్మభవులు = పాండవులు, చూచిరి.

తా. ద్రుపదుఁడు ద్రౌపదీవివాహమునకు మత్స్యయంత్రచ్ఛేదన ముంకువయని; వింటిని, మత్స్యయంత్రమును జూపఁ బాండవులు చూచిరి.

వ. అటమున్న సకలదిగ్దేశాగతులైనరాజకుమారులు నిజశక్తి
తారతమ్యంబునం జేసి దర్శనస్పర్శనచాలనోచ్చాలనాదివ్యా
పారసారాహంకారు లగుచు, శిథిలప్రయత్నులయి తొలంగి
పోవం జేవ మిగులు నమ్మహాకోదండంబు గనుంగొను
నప్పుడు వారలందు. 55

రామాయణ భారతార్థములు సమము. అటమున్న = అంతకుమున్నే, నానాదిగ్దేశాగతులైన, రాజకుమారులు, నిజశక్తి తారతమ్యమునంజేసి = తమశక్తిభేదములచే, తమశక్తికొలఁదిననుట. దర్శన = చూచుట, స్పర్శన = తాఁకుట, చాలన = కదలించుట, ఉచ్చాలనాద = పైకిలేపనెత్తుట మున్నగు, వ్యాపార = పనులే, సార = బలముగాఁగల, అహంకారులు, అగుచుఁ = గర్వముగలవారగుచు, శిథిలప్రయత్నులయి, తొలంగిపోవఁ, చేవమిగులు=సారవంతమగు, అమ్మహాకోదండంబు = ఆ

గొప్పవింటిని, కనుంగొనునప్పుడు = చూచునపుడు, వారలందు [రా - రామలక్ష్మణులందు, భా - పాండవులందు.]

తా. సుగమము.

చ. అనుపమదివ్యవిక్రమసమగ్రుఁడు రామవిభుండు జిష్ణుఁ డా
యనితరభేద్య రౌద్రధనువ న్శ్రమభంగిగ వంచి బాహులీ
లనెఱపె నభ్రగానిమిషలక్షహృదంబకవృత్తి నుర్వరా
జనహృదయాక్షివర్తనముఁ జాలఁగ నద్భుతవార్ధిముంచుచున్.

రామాయణ. అనుపమ............సమగ్రుఁడు — అనుపమ = సాటిలేని, దివ్యవిక్రమ = గొప్పపరాక్రమముతో, సమగ్రుఁడు = పూర్ణమైనవాఁడు, జిష్ణుఁడు = జయశీలుఁడు, లేక, నారాయణుఁడు, అగు, రామవిభుండు = రాముఁడు, ఆయనితరభేద్య రౌద్రధనువు = ఇతరులచే భేదింపరాని యా శివునివింటిని, అశ్రమ = శ్రమలేనియట్లు, భంగి, కన్ = భంగము గలదానినిగా, వంచి = వక్రముగావించి, [వంచినంతమాత్రన విఱుగునట్లొనర్చియనిభావము] అభ్రగ.........వృత్తిన్ - అభ్రగ = ఆకసమున నున్న, అనిమిష = దేవతలయొక్క, లక్ష = సమూహముయొక్క, హృత్ = హృదయములయొక్కయు, అంబక = నేత్రములయొక్కయు, వృత్తిన్ = ఉనికిని, ఉర్వరా.........వర్తనమున్ - ఉర్వరా = సర్వసస్యాఢ్యయగు నా భూమియందలి, జన = జనులయొక్క, హృదయ = మనస్సులయొక్కయు, అక్షి = నేత్రములయొక్కయు, వర్తనమున్ = ఉనికిని, చాలఁగన్ = మిక్కిలి, అద్భుతవార్ధిన్ = ఆశ్చర్యసముద్రమున, ముంచుచున్, బాహులీల = స్వభుజవిలాసము, నెరపెన్, = ప్రకాశింపఁజేసెను.

తా. రాముఁడితరాభేద్యమగు శివునివింటిని విఱిచి దేవతలయొక్కయు మనుష్యులయొక్కయు, హృదయములకును నయనములకును నాశ్చర్యము గల్గించుచు నిజబాహుబలము వెలయించెను.

"నెరపెన్." నెరయుధాతువునకు రేఫద్వయమునందునుం బ్రయోగములుగలవు. "నెరపెసుపర్వులకు విభుని, నిటలాలకముల్." కవికర్ణరసాయనము. "మెఱసి బలవిక్రమంబులు నెఱపువాఁడ." భారతము, ఉద్యోగపర్వము.

"లక్ష" "శతంసహస్రసంయుతం, సర్వమానస్యవాచకం" అను ప్రమాణమున నిట లక్షకు సమూహవాచకత్వము గల్గెను.

"ఉర్వరా." యనుటకు సర్వసస్యాఢ్యయను నర్థముగల్గుటకు; "ఉర్వరా సర్వసస్యాఢ్యా." అని యమరము.

భారత. అనుపమదివ్య విక్రమసమగ్రుఁడు, రామవిభుండు = మనోజ్ఞుఁడగు ప్రభువు, జిష్ణుఁడు = అర్జునుఁడు, ఆయనితరభేద్య, రౌద్ర = భయంకరమైన, ధనువు = విల్లు, అశ్రమభంగిగన్, వంచి = శ్రమలేకుండునట్లు వంచి, అభ్రగ = ఆకాశమునుబొందిన, పైనుండుననుట. అనిమిలక్ష = మత్స్యయంత్రమునుయొక్క గుఱిని, వ్యాప్, నారించునట్టి, అంబకవృత్తిన్ = బాణవ్యాపారమున, ఉర్వరాజన, వ్యాపయ, అక్షి, వర్తనముల్, చాలఁగన్ = మిక్కిలి, అద్భుతవార్ధిన్ = ఆశ్చర్యసముద్రమున, మునుచుచున్ = మునిఁగించుచు, బాహులీల, నెరపెన్.

తా. బలసంతుఁడగు నర్జునుఁడా ధనువుచే యంత్రమత్స్యముం దునిమి యచ్చటి జనుల నాశ్చర్యపరవశులఁగావించెను.

"అనిమిష" అనుటకు దేవతలనియు మత్స్యములనియు నర్థమువచ్చుటకు, "సురమత్స్యావనిమిషౌ" అని యమరము.

చ. ఉదుటున సట్లు తన్మహీపుఁ డొడ్డినయొడ్డు జయించి యేమనం
ద దసహాకర్ణ శల్యసముదగ్రితప్రథనాశ్రితాధికా
భ్యుదయతఁ జెందె భీమభుజకీర్తిసహాయతఁ దజ్జయార్థులై
కదిసి నమస్తభూపతులుగ్రైకొనిరంతకుమున్న భంగమున్.

**రామాయణ.** ఉదుటనన్ = చేవచే, అట్లు, తన్మహీపుఁడు = జనకుఁడు, [తచ్ఛబ్దము ప్రసిద్ధవాచకము.] ఒడ్డిన, ఒడ్డున్ = పందెమును, శివధనువు వంచునట్టి పందెముననుట. జయించి, తదసహ...ప్రథన్—తత్ = ఆ కార్యమువలని, అసహ = ఓర్వనట్టివారి, కర్ణశల్య = చెవులకు ములుకు లంబోలిన, సముదగ్రతర = మిక్కిలిగొప్పదగు, ప్రథన్ = ప్రఖ్యాతిచే, ఆశ్రిత = పొందఁబడిన, అధిక = మిక్కుటమగు, అభ్యుదయతన్ = శ్రేయముగల్గుటను, చెందెన్ = పొందెను. [రాముఁడను కర్తయధ్యాహార్యము.] తజ్జయార్థులై = ఆరాముం జయింపఁగోరిన వారై, సమస్తభూపతులు = అచ్చటికి వచ్చినరాజులెల్లరు, అంతకున్న = తత్పూర్వమే, కదిసి = సమీపించి, భీమ = భయంకరమగు, భుజపుష్టి = రాముని బాహుబలము యొక్క, సహాయతన్ = తోడ్పాటు గల్గుటచే, భంగమున్ = భంగపాటును, కైకొనిరి = గ్రహించిరి. ఏమనన్ = అప్పటియాశ్చర్యమేమన నచ్చును.

తా. రాముఁడు జనకుఁ డొడ్డిన శివుని విల్లువంచుటయను పందెమును జయించి ప్రఖ్యాతిని బడసెను. రాజులందఱిది విని యుద్ధమునకు వచ్చి రాముని బాహుశక్తిచే భంగపాటుపెందిరి.

"ప్రథనం" "ప్రథనం ప్రవిదారణం" అని యమరము.

"ప్రథా" "ప్రథాఖ్యాతౌ" అని యమరము.

ఉదుటు. "గట్టియుక్కు, చేగయూటయుదుటు చేవయురవులిగు, వనదృఢత్వము పేరులలరు" సాంబని. ఘంటువు.

**భారత.** ఉదుటునన్, అట్లు, తన్మహీపుఁడు = ద్రుపదుఁడు, ఒడ్డిన, ఒడ్డు = మత్స్యయంత్రము విఱచునట్టి పందెమును, జయించి = గెలిచి, తత్, అసహ,, కర్ణ = కర్ణునితోడను, శల్య = శల్యునితోడను, గూడిన, సముదగ్రతర, ప్రథన = యుద్ధమున, ఆశ్రిత, అభ్యుదయతన్, చెందెన్ = పొందెను. [అర్జునుఁడను కర్తయధ్యాహార్యము.] తజ్జయార్థులై సమస్తభూపతులు = రాజులందఱును, అంతకున్న, కదిసి = ఆయర్జునుండాసి,

భీమ = భీమునియొక్క, భుజపుష్టిసహాయతన్ = బాహుబలముయొక్క తోడ్పాటుచే, భంగముల్, కైకొనిరి.

తా. ద్రుపదుఁడొడ్డిన మత్స్యయంత్రచ్ఛేదనరూపమగు పందెమును గెలిచియు కర్ణశల్యాదుల యుద్ధమున జయించియు నర్జునుఁడు ప్రఖ్యాతి నొందెను. తక్కినరాజులు యుద్ధమునకు రాఁగ వారిని భీమ భుజబలసహాయమున భంగపఱచెను.

ఆ. వె. అతఁడు వీర్యశుల్క యగురాజసుత నట్లు
దనదుసొమ్ముఁ జేసికొని భృశప్ర
కాశితాత్మవంశుఁ డై శోభిలెను మామ
కసదృశప్రమోద మావహిల్ల. 58

రామాయణ. అతఁడు = రాముఁడు, వీర్యశుల్క, అగు = పరాక్రమమేయుంకువగాఁగల. రాజసుతన్ = సీతను, తనదుసొమ్మున్, చేసికొని=తనవస్తువుగా నొనర్చికొని, భార్యగాఁగ్రహించి యనుట. భృశ...వంశుఁడై - భృశ = మిక్కిలి, ప్రకాశిత = ప్రకాశింపఁజేయఁబడిన, ఆత్మ = తనయొక్క, వంశుఁడై = కులముగలవాఁడై, మామకున్ = జనకునకు, అసదృశప్రమోదము = సాటిలేని సంతోషము, ఆవహిల్లన్ = కలుగునట్లు, శోభిలెను.

తా. వీర్యశుల్కయగు సీతను భార్యగాగ్రహించి మామకుసంతోషమొనఁగూర్చుచు వెలసెను.

"శుల్క" "శుల్కోస్త్రీ స్త్రీధనేపిచ." అని యమరము.

భారత. అతఁడు = అర్జునుఁడు, వీర్యశుల్కయగు, రాజసుతన్ = ద్రౌపదిని, అట్లు తనదుసొమ్మున్, చేసికొని = వివాహమాడి, భృశ, ప్రకాశిత, ఆత్మ, వంశుఁడు = తన వంశమునుగలవాఁడు, ఐ, మామకున్ = ద్రుపదునకు, అసదృశప్రమోదము, ఆవహిల్లన్, శోభిలెను = వెలసెను.

తా. అర్జునుఁడు ద్రౌపదిని వివాహమాడి తన వంశమును దెలి-
మామకు సంతోషమొనర్చువాఁడగుచుం బ్రకాశించుచుండెను.

సీ. అసమానపాండుకీర్తిసమృద్ధి జనకుఁడు
ధర్మరాజీడితకర్మపరుఁడు
స్వజననియుక్తియుఁ బరగుణవ్యాపము
నీశ్వరాజ్ఞయుఁ దనహృదయగతియు
నేకమై తనుఁ జాల నెచ్చరింప నిజాను
జులసన్మతిని బిల్చి తెలియఁజెప్పె
తమకు నందఱకును దారభావంబున
నాచరింపఁగఁ బాత్ర మగుట యరసి

గీ. యునికి నపుడాసుబాహు జయోపశోభి
తమ్ము లైనకుమార రత్నముల కాభు
జద్రవిణశుల్కయనుజలజాతగంధ
వరుచి ఘనహృదబ్జామోదగరిమ నొసఁగె. 59

రామాయణ. అసమాన = సాటిలేని, పాండుకీర్తి = తెల్లనికీర్తి యొక్క, సమృద్ధి=ఆధిక్యముగలవాఁడు, జనకుఁడు, ధర్మ...... పరుఁడు - ధర్మ = ధర్మముయొక్క, రాజి = పంక్తిచే, ఈడిత = స్తుతింపఁబడిన, కర్మపరుఁడు = కార్యములయం దాసక్తిగలవాఁడు, స్వజన = తనయాప్త జనులయొక్క, నియుక్తియున్ = ఆజ్ఞయు, పర = పరులయొక్క, గుణ వ్యాపమున్ = గుణవిస్తారమును, ఈశ్వరాజ్ఞయున్ = దేవునుజ్ఞయు, భగవంతుని ప్రేరణయనుట. తన హృదయగతియున్ = తనమనోభిప్రాయ మును, ఏకమై = ఒక్కటియై, తనున్ = తన్ను, జనకుననుట. చాలన్ = మిక్కిలి, ఎచ్చరింపన్ = ప్రేరేపింపఁగా, నిజానుజున్ = తనతమ్ముని, కుశధ్వజుననుట. లసన్మతిని = ప్రకాశించుబుద్ధిగలవాని, పిల్చి, తెలియన్,

చెప్పి = తెలియునట్లు చెప్పి, [రాఘవులు నల్వురకును దమపుత్రికల నల్వుర నిచ్చి వివాహముసేయుట యుచితమని తెలియునట్లు చెప్పి యని భావము.] తమకుఁ, అందఱకుఁ = తమకెల్లరకు, జనకాదులకనుట. ఉదారభావంబునఁ = గొప్పతనముతో, ఆదరింపంగఁ = చేయుటకు, పాత్రము = యుక్తము, అగుట, ఆరసి యునికిఁ = తెలిసియుండుటచే, అపుడు, ఆసుబాహుజయోపశోభితమ్ములైన = చక్కని బాహువిజయముగలరాముని తమ్ములైన, కుమారరత్నములకుఁ = లక్ష్మణ భరతశత్రుఘ్నులకు, ఆభుజద్రవిణశుల్క = భుజబలమనెడి ద్రవ్యమునేయుంకువగాఁగల సీతయొక్క, అనుజలఁ = చెల్లెండ్రగు నూర్మిళామాండవీ శ్రుతకీర్తులను, జాత.....గరిమఁ - జాత = జనించిన, బాంధవరుచి = బంధుత్వమునందలి యభిరుచిచేత, ఘన = గొప్పదగు, హృదయాబ్జ = తామరవంటి మనస్సునందలి, ఆమోదగరిమఁ = సంతోషాతిశయమును, లేక, హృదయాబ్జ = హృదయమనెడి తామరలయందలి, ఆమోదగరిమఁ = పరిమళాతిశయమును, ఒసఁగెఁ = ఇచ్చెను.

తా. శుద్ధకీర్తియై, ధర్మాసక్తుఁడగుజనకరాజు, దనరారుటయు, గుణాతిశయములు, ఈశ్వరప్రేరణయు, నిజమనోభీష్టప్రకారము నొక్కటై తన్నెచ్చరింపఁ దనతమ్ముఁడగు కుశధ్వజుం బిలిపించి యాతనితో దాశరథులు నల్వురకును దమపుత్రికలనిచ్చుట మేలని తెలియఁజెప్పి, యికార్యమాచరించుట యుక్తమగుట దెలిసిన వాఁడగుటచే, యారాముని తమ్ములగు లక్ష్మణభరతశత్రుఘ్నులకు సీతచెల్లెండ్రగు నూర్మిళామాండవీశ్రుతకీర్తులనీయ నిశ్చయించెను.

ఇటదాశరథులకు సీతాదులనిచ్చుటకు స్వజననియుక్తి కారణమయ్యెను. ఇది స్వజన నియుక్తియకాని గురుజననియుక్తికాదు కావున జనకుఁ "డాత్మబుద్ధిస్సుఖ" మ్మను చొప్పున నడచికొనువాఁడుగాన "స్వజననియుక్తి" యంత దృఢమగు కారణముగాఁ జాలదు. కాఁబట్టియే "వరగుణవ్యాస"మను నూతనకారణము దేవలసెనుగాని, "భక్షితేపి లశు.

నేనశాంతో వ్యాధి" యనులాగున నాత్మబుద్ధిననుసరించు వాని కీగుణవ్యాస మిష్టముగాక పోవచ్చును. "లోకోభిన్నరుచి" గదాయని తలఁచియే "యాశ్వరాజ్ఞ" యనెడి మూఁడవకారణముం దెచ్చికొనెను. ఇందుఁ బూర్వమున్న దోషముపశాంత మయ్యెఁగాని, యీపదమున నింమక కాఠిన్యము దోఁచుటచే దానికి మృదుత్వమునొసఁగఁ "దనహృదయగతియు" నని జంటించెను.

"వ్యాసము." "విస్తారోవిగ్రహోవ్యాసః" అని యమరము.

భారత. అసమాన, పాండు = పాండురాజుయొక్క, కీర్తిసమృద్ధి = కీర్తియొక్కవృద్ధికి, జనకుండు = పుట్టుకయగువాఁడు, ధర్మరాజు, ఈడిత= స్తోత్రము చేయఁబడిన, కర్మపరుఁడు = కర్మములుగలిగినవాఁడు, స్వజనని యుక్తియుఁ = కుంతియొక్క వాక్యమును, పరగుణ, వ్యాసమునీశ్వర = వ్యాసునియొక్క, ఆజ్ఞయుఁ, తనహృదయగతియుఁ, ఏకమై=ఒకటిగాఁ జేరి, తనుఁ, చాలన్, హెచ్చరింపన్, నిజానుజులన్ = తన సోదరులను, భీమా, అర్జున, నకుల, సహదేవులననుట. సన్మతిని = మంచిబుద్ధిచే, పిలిచి, తెలియన్, చెప్పి = వారికి తెలియులాగుఁ జెప్పి, తమకుఁ అందఱకును, దారభావంబునఁ = భార్యాత్వమున, అంగీకరింపంగన్, పాత్రమగుటన్. అరసియునికిన్=విచారించి యుండుటచే, అప్పుడు, సుబాహుజయోపశోభితన్ములైన, భుజపరాక్రమ శోభితులగు, కుమారరత్నములకును = పుత్రశ్రేష్ఠులకు, ఆభుజద్రవిణశుల్క=బాహుబలమునే శుల్కముగాఁ గలిగిన, ద్రౌపది,అను= అనెడి, జలజాత భాంధవరుచి=సూర్యకాంతి, మనస్సుగజ్ఞామోదగరిమన్ = గొప్పనైనహృదయములనెడి తామరలకు సంతోషమనెడి వాసనయొక్క గొప్పతనమును, ఒసఁగెన్ = ఇచ్చెను.

తా. ధర్మరాజు తనతల్లి యానతియు వ్యాసునియాజ్ఞయు తన యుపమ నొకటిగానుండుటంబట్టి తమయేవురకును ద్రౌపది భార్యాత్వము

నొందుట యుక్తమని భావించి తమ్ములరావించి యీ వృత్తాంతమువారికిఁ దెలిపెను. వారెల్లరును ద్రౌపదియందాసక్తులైరి.

"ఈడిత." "ఈడిత పణాయిత పనాయిత ప్రణుత" అని యమరము.

ఇట అమోదగరిమయను స్థలమున, అమోదమనెడి అమోదమని శ్లిష్టరూపకము.

వ. అంతన్ దత్ప్రవృత్తి యాకర్ణించి. **60**

కం. తనయులు దాను నపుడు త
జ్జనకుం డగుడెంచి చూచుజనులకు ననుభా
వనిరూఢిమానితానం
తనవోత్సవముగ నొనర్చెఁ దత్పరిణయమున్. **61**

**రామాయణ.** తజ్జనకుఁడు = ఆ రాజపుత్రుల తండ్రియగు దశరథుఁడు, తనయులున్ = కుమారులును, తానును, అప్పుడు, అగుడెంచి, చూచుజనులకున్ = అచ్చటికివచ్చి చూచువారికి, అనుభావనిరూఢిన్ = ప్రభావమహిమచే, మానిత = సమ్మానింపఁబడిన, అనంత = పెక్కు, నవోత్సవముగన్ = క్రొత్తయుత్సవముగా, తత్పరిణయము = వారి వివాహమును, ఒనర్చెను = చేసెను.

తా. దశరథుఁడు, భరత, శత్రుఘ్నులతోనటకువచ్చి చూచువారల కుత్సాహము గలుగునట్లు, వివాహముగావించెను.

**భారత.** అపుడు, తజ్జనకుఁడు = ద్రౌపది తండ్రియగు ద్రుపదుఁడు, తనయులున్, తానును = కుమారులగు ధృష్టద్యుమ్నాదులును, తానును, అంచిచూచు జనులకున్ = తిలపోయుజనులకు, అరుదు = ఒకతె ఏవురకు భార్యయగుట, ఆశ్చర్యము, అనుభావనిరూఢిన్ = అనెడి తలంపుయొక్క దార్ఢ్యమును, మాని = వదలి, తాను, అంతన్ = పిమ్మట, తత్పరిణయము = ఆ ద్రౌపదీ వివాహమును, నవోత్సవముగన్, ఒనరించెను=నూత్నమగు నుత్సవముగా, ఒనర్చెను = చేసెను.

తా. అట్టి సందర్భమున ఒకతె అయిదుగురిని వివాహముచేసికొను
టను ఆశ్చర్యమను తలంపునమాని పాండవులకు, మిక్కిలి వేడుకతో వివా
హముగావించెను. 62

వ. అందు.

క. త్రిజగద్భూషణ మగుభూ
మిజనాదృతశీలఁ గృష్ణమృగనేత్రఁ బురం
ధ్రిజనులు గై సేసిరి సొం
పు జనింప వివాహయోగ్య భూషావిధులన్. 63

రామాయణ. త్రిజగద్భూషణమగు = మూఁడు లోకములకును
నాభరణముగా నుండుదానిని, ఆదృతశీలన్ = గౌరవింపఁబడిన స్వభావము
గలదానిని, కృష్ణమృగనేత్రన్ = జింకయొక్క కన్నులవంటి కన్నులుగల
దానిని, భూమిజన్ = సీతను, పురంధ్రిజనులు = అంతఃపుర స్త్రీలు,
సొంపు, జనింపన్ = సంతోషముగలిగింపఁగా, వివా.........విధులన్ -
వివాహయోగ్య = వివాహమునకుఁ దగిన, భూషావిధులన్ = నగలున్నగు
నలంకార కార్యములచే, గై సేసిరి = అలంకరించిరి.

తా. ముల్లోకములకు నలంకారమగు నాసీతాదేవిని స్త్రీలు వివాహ
యోగ్యముగా నలంకరించిరి.

"కృష్ణమృగనేత్రన్." కృష్ణమృగముయొక్క నేత్రమువంటి
నేత్రము గలదానిననుటకు. "అపుడాచందనగంధి గంధగజయానన్." అని
శంకరకవి ప్రయోగముగలదు.

"పురంధ్రి." "గృహమును భరించునదని యర్థము." పురంగృహం
ధరతీతి పురంధ్రీ. ధృఞ్ ధరణే." గురుబాల ప్రబోధిక. "పురంధ్రి
జనులు." ఇది సాధ్యసమాసము.

భారత. త్రిజగద్భూషణమగు, భూమిజన = భూజనులచే, ఆదృత
శీలన్ = గౌరవింపఁబడిన స్వభావముగలదానిని, మృగనేత్రన్, కృష్ణన్ =

ద్రౌపదిని, పురంధ్రిజనులు, సొంపు, జనింపన్ = కలుగులాగున, వివాహ యోగ్యభూషావిధులన్, కైసేసిరి = అలంకరించిరి.

తా. త్రిలోకభూషణమగు నాద్రౌపదిని స్త్రీలు నానావిధాభరణములతో నలంకరించిరి.

మహాస్రగ్ధర. లలనల్ గైసేసి కాంత శ్రీరమణగృహమహా
 శ్రీలక్ష్మి వై యొప్పుమంచున్
గలితాశీర్వాదలైరక్కడ మముగురు భా
 గ్యస్థితుల్మీఱనీ దృ
గ్బలవన్మాల్యాంగరాగాభరణవసనసౌ
 భాగ్యలక్ష్మీకలై కాం
తల గత్సంసేవలందుం గోర్కెలం బు మనుచును
 శ్రీతాంత్రా పెంచిరందున్. 64

రామాయణ. అందున్ = ఆ ప్రదేశమున, కాంతల్ = స్త్రీలు, లలనన్ = నీకను, కై సేసి = అలంకరించి, రమణ..........లక్ష్మివై - రమణగృహ = భర్తృగృహమునకు, మహాలక్ష్మివై = శ్రీమహాలక్ష్మివై, ఒప్పుము, అంచున్ = అనుచు, కలితాశీర్వాదలైరి = ఆశీర్వదించినవారైరి, అక్కడమ, ముగురు = తక్కినయామూవురు, ఊర్మిళామాండవీశ్రుతకీర్తులనుట. భాగ్యస్థితుల్, మీఱన్ = ఐశ్వర్యస్థితు లతిశయించులాగున, ఈదృక్..........లక్ష్మీకలై = ఈదృక్ = ఈలాటి, బలవత్ = బలవంతములగు, గొప్పవగునట్టి యనిభావము. మాల్య = పూలదండలవలనను, అంగరాగ = గంధములవలనను, ఆభరణ = నగలవలనను, వసన = వస్త్రములవలనను, సౌభాగ్యలక్ష్మీకలై = మనోజ్ఞతాతిశయముగలవారై, కాంత... సంసేవలందున్ - కాంత = భర్తలయెడ, లగత్ = తవిలిన, సంసేవలందున్ = సేవలయందు, కోర్కెలను = కోర్కెలను, మనుచు = పోషించు,

ఉత్కంఠన్ = ఉత్సాహమును, ప్రాపించిరి = పొందిరి, వేగిరపాటును జెందిరని భావము.

తా. కొందఱు స్త్రీలు సీత నలంకరించి భర్తృగృహమున శ్రీమహాలక్ష్మివలె మనుచుండుమని యాడిరి. తక్కినమూవురగు నూర్మిళా మాండవీ శ్రుతకీర్తులను సీతాదేవితో సమానముగా నలంకారముగాంచి భర్తృసేవాసముత్సుకలై యుండిరి.

భారత. కాంతల్, లలనన్ = ద్రౌపదిని, కైసేసి, రమణ = భర్తల యొక్క, పాండవులయొక్క యనుట. గృహ, మహాలక్ష్మివై, ఒప్పుము' అంచున్ = అనుచు, కలితాశీర్వాదలై = ఆశీర్వదించిరి, అక్కడన్ = ఆభర్తృగేహమున, గురుభాగ్య = గొప్పభాగ్యముగలదానా, [ఇది ద్రౌపది యొక్క సంబుద్ధి] మమున్ = మమ్ము, స్థితుల్, మీఱన్ = అతిశయింపఁగా, ఈదృక్ = ఈలాటి, బలవత్, మాల్య, అంగరాగ, ఆభరణ, వసన, సౌభాగ్య లక్ష్మికలా = సౌభాగ్యసంపత్సమృద్ధియొక్క, ఏకాంత = మిక్కిలియు, లగత్ = తగిలిన, ఆసక్తిగలయనుట. సంసేవలందున్ = అనుభవము లందు, తలఁపుము = తలంపుము, అనుచున్, ఉత్కంఠన్, అందున్, ప్రాపించిరి = పొందిరి.

తా. ద్రౌపదిని గొందఱు ముత్తైదువ లలంకరించి భర్తలయిండ్ల మహాలక్ష్మివై మనుమనుచు నాశీర్వదించిరి. మఱియు నీవిట్టి యలంకారములు ధరించినపుడెల్ల మమ్ముం దలంపుమనుచు నాబిడంబ్రాపించిరి.

వ. తద్వధూజనకుండును దత్కాలసముపస్థితంబైన వరసమాగమంబున కత్యంతసంతుష్టుం డగుచు ననంతవిభవసంపదలు పొదల, నెదురుకోలు సేయించి, తత్ప్రవేశోత్సవంబు నడపునపుడు. 65

రామాయణ భారతార్థములు సమము. సుగమము.

సీ. నృపకన్యకల కనిందితనవభ్రమరకా
స్యవిలాసలక్ష్మి నిరస్తపూర్ణ
తారకాధిపతులకారయఁ దత్పూర్వ
భవసంచితోరుతపఃఫలంబు
లే గురుశుభగుణభోగాంచితులు వీరు
లీరీతిఁ దగఁ బతులైరటంచు
లోకరక్షణ చతురాకార భాగ్యన్య
విమల తేజోవిలాస మిది యనుచు

గీ. నర్థినే తెంచి చూచెఁ బౌరాళియత్యు
దారమణి భూషణోజ్జ్వల దాశరథుల
మాంగలికవస్త్రరత్నభూషాంగరాగ
పాండుసూనులఁ గన్నులపండువుగను. 66

రామాయణ. నృపకన్యకలకున్ = రాజకన్యకలకు, నీతో౯్నశా మాంసకీ శ్రుతకీర్తులకనుట. అనిందిత..........తారాధిపతులకున్— అనిందిత = నిందింపఁబడని, నవభ్రమరక = మనోహరమగు ముంగురులతోఁ గూడిన, ఆస్య = ముఖముయొక్క, విలాసలక్ష్మీ = శోభాతిశయముచే, నిరస్త = తిరస్కరింపఁబడిన, పూర్ణతారకాధిపతులకున్ = పూర్ణచంద్రుని గలవారికి, ఆరయన్ = విచారింపఁగా, తత్పూర్వ......... ఫలంబులే—తత్ = ఆ, పూర్వభవ = పూర్వజన్మమునందు, సంచిత = సంపాదింపఁబడిన, ఉరు = గొప్పదగు, తపఃఫలంబులే=తపస్సువలని ప్రయోజనములే, గురు............అంచితులు - గురు = గొప్పదగు, శుభగుణ = సద్గుణములయొక్క, భోగ=అనుభవమున, అంచితులు = ప్రకాశించువారు, వీరలు = రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు, ఈరీతిన్, తగన్, పతులైరి అటంచున్ = ఇట్లు భర్తలైరంచు, లోక...........విలాసము - లోక

రక్షణ = లోకముల రక్షించుకొఱకు, చతుః, ఆకారభాక్ = నాల్గువిధము
లైన యాకారములుపొందిన, దివ్య = దేవతాసంబంధమగు, విమల=నిర్మల
మగు, తేజోవిలాసము, ఇది, అనుచుక్=అంచు, అత్యుదార.........దా
శరథులక్ - అత్యుదార = మిక్కిలి గొప్పవగు, మణిభూషణ = రత్న
భూషణములవలన, ఉజ్జ్వల = ప్రకాశించుచున్న, దాశరథులక్ = దశ
రథపుత్రులగు రామ లక్ష్మణులను, మాంగలిక............సూనులక్ =
మాంగలికవస్త్ర = మంగళార్థమగు వస్త్రములు గలవారును, [వివాహోచిత
మగు పసుపు దోవతులు ధరించినవారనుట.] రత్నభూషా = రతనంపుఁదొడ
వులు గలవారును, అంగరాగ = మైపూఁత గలవారును, పాండు=తెల్లనైన,
సూనులక్ = పుష్పములుగలవారు నగు వారిని, పౌరాళి = పురజనసమూ
హము, అర్థిక్ = కోర్కెతో, ఏతెంచి = వచ్చి, కన్నులపండువుగను =
నేత్రపర్వమగులాగున, చూచెక్ = కాంచెను.

తా. చంద్రుం దిరస్కరించు మోములుగల యా సీతాది రాజకన్య
కలకు వారి పూర్వజన్మ తపఃఫలముచే యిట్టి కల్యాణగుణ పరిపూర్ణులగు
భర్తలఁ గూడెత్తెనని యాడుచును; లోకముల రక్షించునట్టియు, నాలుగా
కారములు ధరించినట్టియు, దైవసంబంధమగు తేజోవిశేషమిదియనుచును,
రత్నభూషాసమంచితులై మాంగలిక వస్త్రవిధారులగు నా దాశరథులఁ
బురజనులు ప్రీతితోడ నరుదెంచి నేత్రపర్వముగాఁ గాంచిరి.

"భ్రమరక." "తేలలాటే భ్రమరకాః." అని యమరము.

"దాశరథులు." అపత్యార్థకతద్ధితము.

భారత. నృపకన్యకుక్ = రాజకన్యకు, ద్రౌపదికనుట. అలక...
...........భ్రమరకుక్-అలక = ముంగురులచే, సందిత = దూషింపఁ
బడిన, తిరస్కరింపఁబడినయనుట. భ్రమరకుక్=తుమ్మెదలఁగల దానికి,
ఆస్య...........తులకుక్ = ఆస్యవిలాసలక్ష్మీ, నిరస్త = తిరస్కరింపఁ
బడిన, పూర్ణ తారకాధిప = పూర్ణచంద్రునియొక్క, తులకక్ = సామ్యము
గలదానికి, అరకుక్, తత్పూర్వభవ = అంతకుముందు జన్మమునందు.

సంచిత = సంపాదితమైన, ఉరు తపఃఫలంబులు = గొప్ప తపస్సుయొక్క ఫలములు, ఉరుశుభగుణ, భోగ, అంచితులు = ఒప్పెడివారు, వీరలు, వీరు, ఏగురు=ఏవురు, పాండవులనుట. ఈరీతిన్, తగన్, పతులైరి, అటంచున్ = అని చెప్పుమ, లోకరక్షణ........విలాసము—లోకరక్షణ = లోక రక్షణార్థమగు, చతుర = సమర్థమైన, ఆకారభాక్ = ఆకారమును బొందిన, దివ్య = దేవసంబంధమయిన, ధర్మానిలేంద్రాశ్వినేయ సంబంధము లగుననుట. విమల, తేజః = అంశయొక్క, విలాసము, ఇది యనుచున్, అత్యుదార, మణిభూషణ, ఉజ్జ్వలత్ = ప్రకాశించెడి, ఆశ = దిక్కులు గల, రథులన్ = రథములుగలవారిని, మాంగలిక వస్త్రి, రత్నభూషా, అంగరాగ = మైపూఁత, వీనితోఁగూడిన, పాండుసూనులన్ = పాండు పుత్రులను, పౌరాళి, అర్థిన్, ఏతెంచి, కన్నుల పండువుగన్, చూచెన్ = గాంచెను.

తా. ద్రౌపదియొక్క పూర్వజన్మతపఃఫలమే యీ యేవురుపతుల రూపునఁ గన్గెననియు, లోకరక్షణార్థము దేవాంశల జనించినవారనియు నప్పటి పౌరులాదుమ నా పాండుపుత్రులఁ గన్నుల పండువుగాఁ గాంచిరి.

"అలకసంజిత" "అలకాశ్చూర్ణకుంతలాః" అని యమరము. ద్రౌపది పూర్వజన్మమున నేవురు భర్తలఁ గోరెననుటకు, "ఈశ్వరుండు ప్రసన్నుండయి వరంబు వేఁడుమనిన నక్కన్యక నాకుం బతిదానంబుఁ బ్రసాదింపుమని యర్థిత్వంబున నేను మాఱులు వేఁడినం గరుణించి యీశ్వరుండు నీకు దేహాంతరంబున నేవురు పతులగుదురని" ఆదిపర్వము.

చ. అలఘుతరాజవంశమున శ్రీలై విలసిల్లెడు నక్కుమారకు
ల్నలుగురు రూపవైభవకళల్గడు మీఱుచు సద్గుణాతి శీ
తల చతురాకృతిన్ మెఱయుశేతజ్ఞన కాన్వయభాగ్యలక్ష్మినా
నలరెడు పెండ్లికూఁతుల సమోదర మొప్పఁగనోలిఁ బెండ్లియై.

రామాయణ. అలఘుతర = మిక్కిలి గొప్పదగు, అజవంశ = అజ మహారాజుయొక్క వంశమనెడి వెదురునందు, మణులై = రత్నములై, [వెదురునుండి ముత్యము లుదయించును.] విలసిల్లెడు=ప్రకాశించుచుండెడు, ఆకుమారకుల్ = ఆ బిడ్డలు, నలుగురు = నల్వురు, రామలక్ష్మణ భరతశత్రుఘ్నులనుట. రూపవైభవకళల్=రూపాతిశయము, కడు, మీఱుచున్= మిక్కిలి యతిశయించుచు, సద్గుణ............ఆకృతిన్ - సద్గుణ = మంచిగుణములచేత, అతిశీతల = మిక్కిలి చల్లనగు, చతురాకృతిన్ = నాల్గు ఆకారములచే, మెఱయు = ప్రకాశించు, తజ్జనకాన్వయ = అజనకునియొక్క వంశమునందలి, భాగ్య, లక్ష్మినార్ = లక్ష్మియోయనులాగున, అలరెడు, ఒప్పెడు పెండ్లికూఁతులన్ = పెండ్లికుమార్తెలను, సదాదరము, ఒప్పఁగన్ = మంచియాదరమొప్పఁగా, ఓలిన్ = వరుసగా, పెండ్లియై = వివాహామాడి.

తా. అజవంశమణులగు నారామాదులు జనకరాజ వంశమునందలి భాగ్యలక్ష్ములో యనఁదనరు నాసీతాదులం బెండ్లియాడి. పేర్చిరని ముందరి పద్యములో నన్వయము.

“ అలఘుతరాజవంశమణులై ” వంశమనెడి వంశమున ననిగాఁట శ్లిష్టరూపకము. వెదురునుండి ముత్యములు కల్గుననుటకు: “కరీంద్రజీమూతవరాహశంఖ మత్స్యాహిశుక్త్యుద్భవ వేణుజాని, ముక్తాఫలాని ప్రథితానిలోకే తేషాంహి శుక్త్యుద్భవమేవ భూరి” అని మల్లినాథసూరి కుమారసంభవ వ్యాఖ్యానమున నుదాహరించియున్నాఁడు.

భారత. అలఘుతన్ = గొప్పతనముచే, రాజవంశమణులై, విలసిల్లెడు, ఆకుమారకుల్ = ఆధర్మజ భీమార్జున నకుల సహదేవులు, నలు = నలునియొక్క, గురు=గొప్పదగు, రూపవైభవకళల్, కడున్, మీఱుచున్= అతిశయించుచు, సద్గుణ, అతిశీతల, చతుర = మనోజ్ఞమైన, ఆకృతిన్, మెఱయు, తత్ = ఆ ద్రౌపదియొక్క, జనక = తండ్రియైన ద్రుపదుని,

అన్వయభాగ్యలక్ష్మినాన్, ఒలరెడు, పెండ్లికూఁతున్ = ద్రౌపదిని, లస దాదరము, ఒప్పన్, తగన్, ఓలిన్, పెండ్లియై = వివాహమాడి.

తా. రాజవంశ శ్రేష్ఠులగు నపాండవులు ద్రుపదాన్వయ భాగ్య లక్ష్మియగు ద్రౌపదిం బెండ్లాడి.

గీ. అతులితానందమునఁ బేర్చి రంత విదుర
మంత్రి ధృతరాష్ట్రుఁ డమ్మహా మహులతండ్రి
వినిహతమనోవిచారుఁడై తనదుపురికిఁ
గొడుకుల వధూయుతముగఁ దోడ్కొనుచు రాఁగ. 68

రామాయణ. అతులితానందమునన్ = సాటిలేని యానందముచే, పేర్చిరి = అతిశయించిరి, అంతన్ = పిమ్మట, విదుర = వివేకులైన, మంత్రి = ప్రధానులచే, ధృత = ధరింపఁబడిన, రాష్ట్రుఁడు = రాష్ట్రముగలవాఁడు, అమ్మహామహుల తండ్రి = ఆ మహాత్ములగు రాముల తండ్రి, దశరథుఁ డనుట. వినిహత = నాశము గావింపఁబడిన, మనోవిచారుఁడై = మనోవిచారము గలవాఁడై (పుత్రులకు వివాహము గానలయుఁగదా యను విచారము దొలఁగినవాఁడై యనుట) తనదు పురికిన్ = నిజనగరమగు నయోధ్యకు, కొడుకులన్ = కుమారులను, వధూయుతముగన్ = భార్యలతోఁ గూడు నట్లుగా, తోడ్కొంచున్, రాఁగన్ పిలుచుకొనిరాఁగ.

తా. దశరథుఁడు విగతమనోవిచారుఁడై వధూవరులం దోడ్కొని యయోధ్యాభిముఖుఁడయి రాఁగ. ముందరి పద్యముతో నన్వయము.

భారత. అతులితానందమునన్, పేర్చిరి, అంతన్, విదురమంత్రి = విదురుని మంత్రిగాఁగల, ధృతరాష్ట్రుఁడు, అమ్మహామహుల తండ్రి = ఆపాండవుల పెదతండ్రి, వినిహత మనోవిచారుఁడై = పాండవులు మరణించిరిగదా యనెడి విచారము వీడినవాఁడై, తనదు పురికిన్ = హస్తినకు, కొడుకులన్ = పాండవులను, వధూయుతముగన్ = ద్రౌపదితోఁ గూడినట్లు, తోడ్కొంచున్, రాఁగన్.

తా. విదుర మంత్రియుతుఁడగు ధృతరాష్ట్రుఁడు పాండవులు మరణింపక బ్రదికియున్నందులకై విచారము దక్క వధూసహితముగ వారిని హస్తినకు రావింప.

సీ. ప్రౌఢిఁ బేర్చిన వారిభావ మెలర్పంగ
ననుపశాంతాత్మత నరుగుదెంచి
రాకుమారులవైరి లోకాభిగమ్యభు
జావిజృంభణగుణశ్లాఘనుండు
వీరు నర్జునుఁ బరశూరులసత్ప్రతా
పాన్వితభీమబాహాసహాయుఁ
డై యొప్పినట్టి యాహవజయశోభిరా
ముండని వేడ్క పెంపున వెదకుచుఁ

గీ. బలుపె మిక్కిలి జూడ్కులం దఱిని గడచి
యవల దాశరథి శ్రేష్ఠుఁ డైన యతని
పైఁ బురిస్థితజనకిదంకిటకుచిత్త
ములమహాదరసంభ్రమము మెలయనపుడు. 69

రామాయణ. ప్రౌఢిన్, పేర్చిన = దిట్టముగ గర్వించి, నవ = నూతనమైన, అరిభావము = శాత్రవము, ఎలర్పంగన్ = ఒప్పుచుండఁగా, అనుపశాంత, ఆత్మతన్ = శాంతింపని బుద్ధిగలవాఁడగుటచే, అరుగుదెంచి, రాకుమారులవైరి = రాజకుమారులకు శత్రువు. లోకాభిగమ్య ........శ్లాఘనుండు - లోకాభిగమ్య = లోకులచేఁ బొందఁబడిన, భుజావిజృంభణ గుణ = శౌర్యాతిశయమనెడి గుణముయొక్క, శ్లాఘనుండు = పొగడ్త గలవాఁడు, [లోకులీతని బాహుబలముంగూర్చి శ్లాఘించుచున్నారనుట.] వీరున్ = పరాక్రమశాలియైన, అర్జునున్ = కార్తవీర్యార్జునుని, పరశు... ...సహాయుఁడై - పరశు = గండ్రగొడ్డలిచే, ఉరు = మిక్కిలి, లసత్ =

ప్రకాశించుచున్న, ప్రతాపాన్విత = పరాక్రమ సమన్వితమగు, భీమ = భయంకరమైన, బాహాసహాయుఁడై=భుజబలమును సహాయముగాఁగలవాఁడై, [ఇట బాహాశబ్దము బాహాబలమున కుపలక్షణము.] ఓర్చినట్టి = జయించినట్టి, ఆహవజయశోభి = యుద్ధవిజయమునఁ బ్రకాశించువాఁడు, రాముఁడు = రాముఁడు, పరశురాముఁడనుట. అనివేడ్క పెంపునన్ = యుద్ధమునందలి యుత్సాహాతిశయమున, వెదకుచున్, అందఱిని, కడచి, అవలన్, పురస్థిత= ఎదుటనుండు, జనకదంబకము చిత్తములన్ = జన సమూహముయొక్క మనస్సునందు, మహాదరసంభ్రమము = మిక్కిలి భీతివలనఁగల్గిన భ్రమ, ఒలయన్ =కలుగఁగా, అపుడు, దాశరథిశ్రేష్ఠుఁడైన, అతనిపైన్ = దశరథ పుత్రులలో శ్రేష్ఠుఁడగు శ్రీరామునిపై, చూడ్కులు, మిక్కిలి, పఱపెన్ = ప్రసరింపఁజేసెను.

తా. పరశురాముఁడు సూత్ర్నశాత్రవయుక్తుఁడై శాంతివిహీనుఁడై యుద్ధపువేడ్కనట కరుడెంచి యటఁగలవారల నెల్లం గడచి రామునిపై చూడ్కులు నిగుడించెను.

భాంరత. ప్రౌఢిన్, పేర్చినవారిన్, క్షౌణిని, ఎలర్పంగన్ = సంతసములో, అనుపన్, శాంతాత్మతన్, ఆకుమారులు=ఆరాజకుమారులు, పాండవులు, అరుగుదెంచిరి=వచ్చిరి, అవైరి.........శ్లాఘన్ - అవైరి లోకాభిగమ్య = శాత్రవులచేఁ బొందరాని, భుజావిజృంభణగుణ శ్లాఘన్ = భుజదర్పమువలని పొగడ్తలో, ఉండు, సిరుల్, అర్జునున్ = అర్జునుని, పరశూరులన్ = శత్రువును, సత్...............సహాయుఁడై - సత్ = ప్రకాశమగు, ప్రతాపాన్విత, భీమ = భీమసేనునియొక్క, బాహాసహాయుఁడై = భుజబలము సాయముగాఁ గలవాఁడయి, ఓర్చినట్టి, జయించినట్టి, ఆహవజ = యుద్ధమువలనఁగల్గిన, యశోభిరాముఁడని = కీర్తిచే నందమైనవాఁడని, వేడ్క పెంపునన్, వెదకుచున్, పురస్థిత = పట్టణమునన్ను, జనకదంబకము = జనులసమూహము, చిత్తములన్, మహాదర = మిక్కిలిగౌర

వము, సంభ్రమము = ఆశ్చర్యము, ఒలయక్, అపుడు, అందఱిని, కడచి, అవలన్ = చలింపని, ఆశకి = అపేక్షచే, రథిశ్రేష్ఠుఁడైన = రథికశ్రేష్ఠుఁడైన, అతనిపైన్ = ఆయర్జునునిపైన, మిక్కిలి, చూడ్కులు, పఱపెన్ = ప్రసరింపఁజేసెను.

తా. ద్రుపదుఁడనిపినంతనే యారాజకుమారులు హస్తినకరుదెంచిరి. అచ్చటిపురజనులు యుద్ధవిజయమువలని కీర్తిచే శోభితుఁడనియు, పరాక్రమశాలియగు భీమునిసాయముగాఁ గలవాఁడనియు సర్జునింబొగడుచు నత్యంతాదర సంభ్రమములతో నటఁగలవారినెల్లఁ గడచి యాతనిపైఁ జూడ్కులు పఱపిరి

వ. కనుంగొనుజనులు తదనంతరంబ. 70

సుగమము.

సీ. ఎంతయు నద్భుతం బీరామభార్గవ
రాము లసత్ప్రౌఢి యేమిచెప్ప
బలవ దనేక పత్తుల నాను గుణ్యంబు
జగ దుపశోభితంబుగ భజించెఁ
గంటిరే యనువారు గడఁకనేతద్ద్వయ
పురుషు లన్యోన్యంబు నోరసి యెన్న
రెట్టుగాఁగలవారొ యిటుమీఁద ననుశంక
మదిఁబెట్టువారు సకౌతుకలై
గీ. యొదవు మనభాగ్యమహిమ నయోనిజాత
మహితనయ కృష్ణ మృగనేత్ర మంజుగాత్రి
యైదువతనంబు ప్రోఁక మా యమ్మ యనుచు
సతికిఁ గేల్మోడ్చువారు నైరసందడిలిరి. 71

రామాయణ. ఈ రామభార్గవరాముల సత్ప్రౌఢి = శ్రీరామభార్గవరాముల యొప్పిదమగు దిట్టతనము, ఏమిచెప్పన్ = ఏమనిచెప్పన్, ఎంత

యుం, అద్భుతంబు = ఆశ్చర్యము, బలవత్, అనేకప = ఏనుఁగులయొక్క, తులన్ = సాటిని, అనుగుణ్యంబుగన్ = తగులాగునను, జగదుపశ్లోకితంబుగన్ = లోకముచేఁ బొగడఁబడినట్లు, భజించెన్, పొందెను. ఇచ్చటిక్రియకుఁ 'ప్రౌఢి' యనునది కర్త. [రామభార్గవలసత్ప్రౌఢి మత్తద్విరదాపమ్యమును భజించెనని భావము.] కంటిరే, అనువారున్, కడఁకన్ = ప్రయత్నముచే, ఏతత్ = ఈ వరపురుషులు = పురుషశ్రేష్ఠులు, శ్రీరామభార్గవరాములనుట. అన్యోన్యంబుగన్ = పరస్పరము, ఒరసి = తాఁకి, ఇటమీఁదన్ = ఇంకమీఁద, ఎవ్వరు, ఏట్టుగాఁగలవారో = ఎవరే మగుదురో, అను, శంకన్ = సంశయమును, మదిన్, పెట్టువారున్ = మనస్సున నిడుకొనువారు, తలపోయువారనుట. మనభాగ్యమహిమకున్, అక్కటదకల్ = ఆకొఱఁతలు, ఏలయొదవున్ = ఏలకల్గును, అయోనిజాత = మాతృగర్భమునుండి పుట్టనిది, మహీతనయ = భూపుత్రి, సీతయనుట. కృష్ణమృగనేత్ర = జింకయొక్కకన్నులవంటి కన్నులుగలది, మంజుగాత్ర = మనోజ్ఞశరీర, ఐదుపతినంబు ప్రోఁక = సౌమంగల్యపుంబ్రోవు, మాయమ్మ= మాతల్లి, అనుచున్, సతికిన్ = సీతకు, కేలెమ్మోడ్పువారును నై = చేతులు జోడించువారును నై, సందడిలిరి = జనులనికర్త్రుపద మధ్యాహార్యము.

తా. ఈ రామభార్గవరాముల ప్రౌఢి యంతేయు నాశ్చర్యకరము, వీరిరువురన్యోన్య మెదిరించి యెవ్వరెట్లు కాఁగల వారో యనువారును, మన భాగ్యముమంచి దగుచుండ నట్టికొఱవలేల కల్గు? మంజుగాత్రియై స్వయం ప్రభూతయగు సీతామహాదేవి యీతనిభార్యయై యుండ నెట్టిలోటునుగల్గ దనుచు నామెకు మ్రొక్కులిడు వారుగను నపటి జనులుండిరి.

భారత. ఎంతయున్, అద్భుతంబు = ఈ రామ - ఈ స్త్రీయొక్క, ద్రౌపదియొక్క యనుట. భర్గ = శివసంబంధమగు, వర = వరముచే, అమల = శుద్ధమయిన, సత్ప్రౌఢిన్ = గొప్పమహిమను, ఏమనిచెప్పన్, బలవత్, అనేక, పతులన్ = భర్తలను, అనుగుణ్యంబు = తగినట్లుగా, జగ

దుష్శ్లోకితంబుగన్, భజించెన్ = పొందెను, కంటిరే, అనువారున్, కడఁకన్, ఏతత్ = ఈ బిడయొక్క, పరపురుషులు = భర్తలు, పాండవులనుట. అన్యోన్యంబున్, ఒరసి = పరస్పరము యుద్ధమొనర్చి, ఇటమీఁదన్ ఎవ్వరు, ఎట్టు, కాఁగలవారో = ఏవ్వరెట్లు కాఁగలరో. అను, శంక, మదిన్, పెట్టువారున్, మనభాగ్యమహిమకున్, అక్కొ_దన, ఏల, ఒదవున్, అయోనిజాత=యజ్ఞకుండోద్భవయనుట. మహితనయ=పొగడఁబడిననీతిగలది, మృగనేత్ర, మంజుగాత్రి, ఐనువతనంబుప్రోఁక, మాయమ్మ, కృష్ణ = ద్రౌపది, అనుచున్, సతికిన్ = పతివ్రతయగునా ద్రౌపదికి, కేలు మోడ్చువారునై = చేతులు బోడించువారై, సందడిలి.

తా. శివునివరముచే. నీబిడకేవ్వురు భర్తలగుట యెంతయుఁ గాని యాడఁ దగినదనువారును, నింకమీద వీరు స్త్రీమూలకమగు ద్వేషముచేఁ బరస్పర యుద్ధమొనర్చియేమి కాఁగలవారో యని సంశయించువారును, నల్లేలయగు? మాంగల్యములకుఁ బ్రోవగు నీద్రౌపది యుండనట్టి సంశయము పనిలేదని యామెకు మ్రొక్కులిడువారుగను నచటి జనులుండిరి.

"అన్యోంబు నొరసి యెవ్వరెట్టు కాఁగలవారో యిటమీఁద నను శంక మదిఁబెట్టువారు!" "ఏకామిషలోభో హి వైరి తరోర్మూలం" అను లాగున నేవ్వురకొక్క వనిత యందాసక్తి కల్గుట ద్వేషకారణమగు నేమోయని జనులకు సంశయముదయించెను. "సుందోప సుందాసహజావభీకా, సురేష్వపక్వాపి సురాంగనా మూం, అన్యోన్యమాహాత్య పురా యమస్య, మనోభవేషారివలక్ష్యమాస్తాం" అని యనంత భట్టువును స్త్రీమూలముగ వైరము గల్గునను నిరూపించెను.

వ. మఱియును. 72

చ. చనియెఁ బ్రశాంత మై యనలసత్వరహేతివిశాలవృత్తిచే
తనయసివింటి మిట్టియతిధర్మ యమోదయు రాజమానశా

**సనుఁ గొనివచ్చెఁ దానవరజస్స్ఫురణాఢ్యునిఁ జేసి క్రమ్మఱన్**
**మనపృథగూఢ భాగ్యమహిమస్థితి యిట్టిది పోవిచిత్రముల్**

అవతారిక. చూడవచ్చినజను లిట్లాడుకొనుచున్నారు.

రామాయణ. అనలస = అమందమైన, త్వర=వేగముగల, హేతి, ఖడ్గముయొక్క, విహార = సంచారమందు, వృత్తి = వర్తనముగల, చేతన= బుద్ధి, ప్రశాంతమై, చనియెన్, అని, వింటిమి = శాంతించెనని వింటిమికదా, ఇట్టి యతిధర్మున్ = ఈలాటిసన్న్యాస ధర్మము గలవానిని, యమోద యుక్ = యమముయొక్క యుపయముగలవానిని, రాజమానశాసనున్ = రాజులయొక్క గర్వమును శాసించువానిని, పరశురామునను. మన, పృథక్ = వేఱుగా, ఊఢ = వహింపఁబడిన, భాగ్యమహిమస్థితి = భాగ్య మహిమయొక్క విధము, మనదౌర్భాగ్యమనుట. తాన్ = తాను, క్రమ్మ అన్ = మరల, నవ = నూతనమైన, రజస్స్ఫురణా ఢ్యునిన్ = రజోగుణ స్ఫురణాఢ్యుని, చేసి = కొనివచ్చెన్ = తీసికొనివచ్చెను. విచిత్రముల్ = చిత్రములు, ఇట్టివి, పో = ఇట్టివేకదా.

తా. యుద్ధవ్యాపారములం దాసక్తిమాని మునివ్రతము లాచరింపు చున్న యట్టి యీపరశురాముని మరలరజోగుణవంతునిఁగాఁ జేసియిటకుఁ దెచ్చినది మన దౌర్భాగ్యమయగును. ఇట్టివికదావింతలు.

"అనల స్త్వర హేతి." రవేరర్చిశ్చ శస్త్రించ వహ్నిజ్వాలాచ హేతయః" అని యమరము.

"యమోదయుక్." "శరీరసాధనాపేక్షం నిత్యం యత్కర్మ తద్యమః." అని యమరము.

భారతి. గూఢభాగ్యమహిమస్థితి = నిగూఢమైన యదృష్టమహిమ యొక్క యునికిగల, మనపృథ = మనకుంతి, అనల... చేతన — అనల = అగ్నియొక్క, సత్వర = వేగముతోఁగూడిన, హేతి = జ్వాలలయొక్క, విహారవృత్తిచేతన=సంచారవర్తనచేతనే, ప్రశాంతమై, చనియెనని వింటిమి =

మరణించెనని వింటిమి, ఇట్టి, అతిధర్మున్ = ఈలాటి మిక్కుటమగు ధర్మముగలవానిని, యమోదయున్ = యమునివలన జనించినవానిని, ధర్మజుననుట. రాజమాన, ప్రకాశించుచున్న, శాసనున్ = ఆజ్ఞగలవానిని, తాన్ = కుంతి, అవరజస్ఫురణాఢ్యునిన్, చేసి = తమ్ములతోఁ గూడిన వానినిగాఁజేసి, క్రమ్మఱన్, కొనివచ్చెన్, విచిత్రముల్, ఇట్టివిపో = ఇట్టి వేకదా చిత్రములు.

తా. కుంతికుమారులతోడన వారణావతమున నగ్నిలోఁ బడిచచ్చె నని వింటిమి. అట్టిదిమరల సానుజుఁడగు ధర్మజుని గొని యిటకువచ్చెను. ఇట్టివిగదా వింతలు.

"అవరజ స్ఫురణాఢ్యునిఁజేసి," "యవీయోఽవరజానుజాః" అని యమరము.

గీ. అని యనేకు లనేకవాక్యములు వలుక
నట్లు చనుదెంచినట్టి భీమాగ్రజన్ము
నిజపుర స్థాయిగాఁ గాంచి నిఖిలలోకు
లును సముద్వేగచిత్తులై వినుతి సేయ. 74

రామాయణ. అని, అనేకులు = పెక్కురు, అనేకవాక్యములు = పెక్కుమాటలు, పలుకన్, అట్లు, చనుదెంచినట్టి, భీమ = భయంకరుఁడైన, అగ్రజన్మున్ = బ్రాహ్మణుని, పరశురామునననుట. నిజ = తమయొక్క, పురస్థాయిగాన్ = ఎదుట నుండువానినిఁగా, కాంచి = చూచి, నిఖిలలోకులును = ఎల్లరును, సముద్వేగచిత్తులై, సంభ్రమమున వినతులై, వినుతి, చేయన్ = స్తోత్రము చేయఁగా.

తా. అట్లరుదెంచిన యాపరశురాముంగాంచి భయాకులురై యెల్ల రును నుతింపుచుండఁగా. ముందరిపద్యములో నన్వయము.

భారత. అని, అనేకులు, అనేకవాక్యములు, పలుకన్, అట్లు, చను దెంచినట్టి భీమాగ్రజున్ = భీమునియన్నను, ధర్మజుననుట. నిజపురస్థాయి

గాఁ = తమ పురమునందుండువానినిగా, కాంచి, నిఖిల లోకములున్ సముత్, వేగ = సంతోషాతిశయముతోఁ గూడునట్లుగా, వినతుఁడై, వినుతి చేయన్.

ఉ. పేర్మిని విగ్రహించినను భీమ ధనంజయ లీలఁ బేర్చు త
ద్ధర్మజ తేజ మాత్మజ ప్రతాపసమృద్ధి నడంచు నంచు నం
తర్మనుఁడై మహీధవుఁ డసత్సమరాజ్యసమర్పణంబు దా
నిర్మలవృత్తిఁ జేయుట యనీతిగ నెంచెఁ గడున్మనంబునన్!

రామాయణ. భీమ, భయంకరమైన, ధనంజయలీలన్ = అగ్ని వలె, పేర్చు = విజృంభించుచుండు, తత్ = అపరశురామునియొక్క, ధర్మజ = వింటివలన జనించిన, తేజము = తేజస్సు, పేర్మిని, విగ్రహించినన్ = మిక్కుటముగా విరోధించినచో, ఆత్మజు = కుమారుఁడగు రాముని, ప్రతాపము = పరాక్రమమును, అడంచున్ = అణఁచును, అంచున్, అంతర్మనుఁడై = దుఃఖించినవాఁడై, మహీధవుఁడు = రాజు, దశరథుఁడనుట. తత్ = అపరశురామునితోడి, సమర = యుద్ధమనెడి, ఆజ్యసమర్పణంబు= నేయిపోయుట, దాన్, నిర్మలవృత్తిన్ = శుద్ధవర్తనమున, చేయుట, అనీతిగన్ = అన్యాయముగా, మనంబునన్ = మనస్సులో, కడున్, ఎంచెన్ = తలపోసెను.

తా. దశరథుఁడు పరశురాముని శౌర్యాగ్ని తనపుత్రుని తేజ మడంచునని దుఃఖితుఁడై యతనితో యుద్ధమాడుట యన్యాయమని తన మదిం దలంచెను.

"అంతర్మనుఁడై." "దుర్మనా విమనా అంతర్మనాః." అని యమరము.

భారత. మహీధవుఁడు = ధృతరాష్ట్రుఁడు, పేర్మిని, విగ్రహించినను, భీమ ధనంజయలీలన్ = భీమార్జునుల విహారములచే, పేర్చు = అతిశయించు, తద్ధర్మజతేజము = ఆధర్మపుత్రుని తేజస్సు, ఆత్మజు = దుర్యో

ధనుని, ప్రతాపసమృద్ధిక్, అడంచుట్, అంచుట్, అంతరాత్ముఁడై = తిమ్మణ్ణుఁడై, తత్ = ఆధర్మజునకు, సమరాజ్య సమర్పణంబుట్ = తన కుమారునితో సమానమగు రాజ్యమిచ్చుటను, అర్ధరాజ్య దానమనుట. తాక్, నిర్మలవృత్తిక్, చేయుటయ, నీతిగక్ = న్యాయముగా, మనంబునక్, కడుక్, ఎంచెక్.

తా. భీమార్జునులతోఁగూడిన ధర్మపుత్రుని ప్రతాపము నిజపుత్రుని ప్రతాపము నణఁచివేయునని ఖిన్నుఁడై ధృతరాష్ట్రుఁడా ధర్మజునకర్ధ రాజ్య మిచ్చు టుచితమని భావించెను.

సీ. అట్లాత్మ నెంచినకయ్యర్ధరాజ్య మహిమ
తేజఃప్రదీప్తుఁ డాకరాజప్రియము
తో నమర్చి యనుప కమానసపర్యాప్తి
నెఱపుచు నాదరోక స్నేహ మొప్ప
సప్రణతిగ నమ్మకహీప్రభు నానతిఁ
గైగొని నిలక శికిఘ్నంబ యరిగి
ప్రథితమహాచలేంకద్రప్రస్థ పుటభేద
నప్రభువై శిఖాకగప్రతాప

గీ. కలితుఁ డుడు దండనీతి భాకస్వరుఁడు నిజభు
జైకవశ సర్వధరణి పకర్థాధ్యుఁ డగుచు
నవరజస్థితి బంధురాకజ్యవిరళనతిఁ
బొదలి యభిరామవర్తనంకబునఁ జెలంగె. 76

రామాయణ. అట్లు, ఆత్మక్ = మనస్సునందు, ఎంచి = తలఁచి, నయ..........ప్రదీప్తుఁడు - నయ = నీతిచేత, బుద్ధ = వృద్ధిపొందిన, రాజ్యమహిమక్, తేజఃప్రదీప్తుఁడు = పరాక్రమముచే నొప్పువాఁడు, ఆరాజు = దశరథుఁడు, ప్రీతితోక్, అమర్చి, అనుపమాన = సాటిలేని,

సపర్యావిధిన్ = పూజావిధిని, సెలుపుచున్ = చేయుచు, ఆదర = గౌరవములని, ఉన్మేషము = వికాసము, ఒప్పన్, సప్రణతిగన్ = నమస్కరించిన వాఁడగు చుండఁగా, అమ్మహాప్రభు = ఆరాజాయొక్క, ఆనతిన్ = ఆనమస్కృతిని, కైకొని = గ్రహించి, నిలక = నిలువక, పూజావిధుల నంగీకరింపకయనుట. శ్రీఘంబ, అరిగి, ప్రథిత = ప్రసిద్ధమయిన, మహానలేంద్ర = గొప్ప పర్వతశ్రేష్ఠముయొక్క, క్రౌంచపర్వతముయొక్క యనుట. ప్రస్థ = చరియయొక్క, పుట = బంధనముయొక్క, భేదన = భేదించుటయందు, ప్రభు = సమర్థమైన, పైశిఖ = కుమారస్వామి సంబంధమైన, ఉగ్ర = తీక్ష్ణమైన, ప్రతాప = పరాక్రమముతో, కలితుఁడు = కూడినవాఁడు, [పరమశివునొద్ద విద్యాభ్యాసము సేయుచుండు నప్పుడు కుమారస్వామియుం బరశురాముఁడును గ్రౌంచాద్రి భేదనమాచరించుట పురాణప్రసిద్ధము.] ఉరు = శ్రేష్ఠమయిన, దండనీతి = దండనీతిని గల వాఁడు, [ఈదండనీతియాన్వీక్షక్యాది నీతులలో నొకటియగు.] భార్గవుఁడు = భృగువంశ సంజాతుఁడు, పరశురాముఁడనుట. నిజ.........శ్లాఘ్యుఁడు - నిజ = తనయొక్క, భుజ = బాహువులకు, ఏక = ముఖ్యమైన, వశ = లోఁబడిన. సర్వధరణిప = ఎల్లరాజుల, అర్థాఘ్యుఁడు = అర్థప్రాణములు గలవాఁడు, అగుచున్, నవ.........అనిరళరతిన్ = నవ = నూత్నమైన, రజ్యతి=రజోగుణములచే, బంధుర = సమర్థమైన, ఆజి=యుద్ధమందుఁగల, అవిరళ రతిన్ = దట్టమైన యిచ్ఛచే, అధికేచ్ఛచే ననుట. పొదలి, అభిరాము = రాముని కెదురైన, వర్తనంబునన్ = ఉనికిచే, చెలంగెన్ = ప్రకాశించెను.

తా. దశరథుఁడు నమస్కరింప నాతని నమస్కృతులనంది యర్ఘ్యాదొనర్చు పూజాదులం గ్రహింప నొల్లక యటనుండి కదలిచని, రాముని కెదుర నిలచెను.

"నయుద్ధరాజ్య" నయ+బుద్ధ = గుణసంధి—"ఆద్గుణః" పాణిని. "సపర్య," "సపర్యా తర్పణంబలిః," అని యమరము.

"ప్రస్థ." "ప్రస్థో స్త్రీ సానుమానయోః." అని యమరము.

భారత. అట్లు, ఆత్మన్, ఎంచిన = తలఁచిన, అర్ధరాజ్యమహిమను, తేజః ప్రదీప్తుఁ[డు, ఇది పార్థాగ్ర్యుఁడను దానికి విశేషణము.]ఆరాజు = క్షాత్రతేజస్సుచేఁ బ్రకాశించుచుండు ధృతరాష్ట్రుఁడు, ప్రియముతోన్, అమర్చి, ప్రీతితో నిచ్చి, అనుపన్ = పంపఁగా, మానసపర్యాప్తిన్ = మనఃస్ఫూర్తిని, సంతోషముననుట, నెఱపుచున్ = వెలయింపుచు, ఆదరోన్మేషము, ఒప్పన్, సత్కృతిగన్ = నమస్కృతితోఁ గూడినట్లు, అమ్మహీప్రభు = రాజగు నా ధృతరాష్ట్రునియొక్క, ఆనతి = ఆజ్ఞను, కైకొని = గ్రహించి, నిలక = నిలువక, ఆలస్య మొనర్పక యనుట. శీఘ్రింబ, అరిగి, ప్రథిత, మహత్ = గొప్పదగు, అచల = స్థిరమైన, ఇంద్రప్రస్థపుటభేదన = ఇంద్రప్రస్థపట్టణమునకు, ప్రభువై = రాజై, శిఖా = అగ్నిజ్వాలవలె, ఉగ్ర, ప్రతాప = పరాక్రమముచే, కలితుఁడు, ఉరు = గొప్పదగు, దండనీతి = దండనీతియందు, భార్గవుఁడు = శుక్రునంతవాఁడు, నిజ, భుజ, ఏక, వశ = లోఁబడిన, సర్వధరణి = భూమిని సమస్తముగలవాఁడు, పార్థాగ్ర్యుఁడు = పార్థులలో జ్యేష్ఠుఁడు, ధర్మజుఁడనుట. అపరజస్థితిన్ = సోదరుల యునికిచే, బంధురాజి = చుట్టముల సమూహముయొక్క, అవిరళరతిన్ = అత్యంతానురక్తిచే, [యుక్తుఁడు] అగుచున్, పొదలి, అభిరామ = మనోజ్ఞమగు, వర్తనంబులన్, చెలంగె.

తా. ధృతరాష్ట్రుఁడట్లర్ధ రాజ్యమీయఁగా గ్రహించి ధర్మజుఁడు నమస్కృతి పూర్వకముగ నాతని యానతిచొప్పున నటనిలువక శీఘ్రింబ యరిగి యింద్రప్రస్థముచేరి యటరాజై, బాంధవ జనరంజకుఁడగుచు వెలయుచుండెను.

"నిలువుము కొలువుము పిలువుము; గెలువుము విడువుమనఁగాఁదిగిన బహుశబ్దం, బులకుం దృతీయ వర్ణము, తొలఁగిన దోషంబులేదు" కవి సంశయ విచ్ఛేదము.

"నిలక" యను స్థలమున వకారలోపమగుటకు "చాకున్న నీదు

ముక్తులు" కాశీఖండము "వెఱకుమని తనున్నఖంబున నెఱుకుతేని" కాశీఖండము. "అర్జునుపైఁగూర్మి నతని నోసేయఁడు" భారతము. మున్నగు పెక్కులు వకారలోప ప్రయోగములుగలవు.

వ. ఇట్లు ప్రవర్తించుచుండ. 77

క. సత్తైక్యముకతమున వీ
రత్యంతము నిర్విభేదు లయ్యు నతనుమా
యాత్యాజితమై త్రీసా
తత్యతఁ దమలోనఁ బోరెదరొ యనుశంకన్. 78

రామాయణ. సత్య = యథార్థమైన, ఐక్యముకతమునన్ = ఏకత్వకారణమున, [ఇద్దఱు నావిష్ణువునవతారములగు కారణమున ననిభావము.] వీరు = ఈ రామభార్గవ రాములు, అత్యంతమున్ = మిక్కిలి, నిర్విభేదుల య్యును = భేదరహితులయ్యును, అతను మాయా = ఎక్కుడగుమాయచే, త్యాజిత = విడిపింపఁబడిన, మైత్రీ = స్నేహముయొక్క, సాతత్యతన్ = ఎడతెగమిగల వాఁటచే, తమలోనన్, పోరెదరో, అనుశంకన్

తా. విష్ణు నవతారములయి భేదరహితులయ్యు నీ రామభార్గవ రాములు మాయచే మైత్రివీడి తమలోఁ బోరెదరేమో యను శంకచే. కయ్యంబుల వేడుక కాఁడు వచ్చెనని ముందరి పద్యముతో నన్వయము.

"సత్త్యైక్యముకతమున" నను స్థలమున రామభార్గవ రాముల యైక్యమునుగుఱించి, "ఏనును నీవును వైష్ణవాంశ సంభావిత భద్రమూర్తులము" అని పరశురామముఖముననే మల్లికార్జున భట్టు తెలిపెను. "శ్రీదేవుని యంశమునఁ బుట్టితిమి మన మనఘా." అని అయ్యలరాజు రామభద్రకవియు నీ రామ పరశురామైక్యమును బరశురామ ముఖమునుండియే ప్రకటింపఁజేసెను.

భారత. సతి = స్త్రీయొక్క, ద్రౌపదియొక్క యనుట. ఐక్యముకతమునన్ = ఏకత్వకారణమున, [ఏవుర కొక్కతె భార్యయగు కారణ

మున నని భావము.] వీరు = ఈపాండవులు, అత్యంతము౯, నిర్విభేదులయ్యు౯, అతను మాయా = మన్మథమాయచే, త్యాజిత = విడువఁబడిన, మైత్రీ, సాతత్యత౯, తమలోన౯, పోరెదరో, అను శంక౯ = సంశయముచే.

తా. పరస్పర మభిన్నులయ్యు నేవురకొకతె భార్యయగుటచే మన్మథమాయను మైత్రివీడి వీరొండొరులతోఁ బోరెదరేమో యను సంశయమున.

క. కయ్యంబుల వేఁడుకకాఁ
డయ్యున్నతకలహకేళి కాకాంక్షుఁడై
నెయ్యమున వచ్చె నారదుఁ
డయ్యెడ దివినుండి వారి నభిదర్శింపన్. 79

**రామాయణ.** కయ్యంబుల వేఁడుకకాఁడు = యుద్ధప్రియుఁడు, అయ్యున్నత కలహకేళిక౯ = ఆగొప్ప యుద్ధక్రీడయందు, ఆకాంక్షుఁడై = అపేక్షగలవాఁడై, [సప్తమ్యర్థమునఁ బంచమి,] నారదుఁడు, అయ్యెడ౯ = ఆప్రదేశమున, దివినుండి = స్వర్గమునుండి, వారిఁ = ఆరామభార్గవ రాములను, అభిదర్శింప౯ = చూచుటకొఱకు, నెయ్యమున౯ = ప్రీతితో, వచ్చె౯.

తా. నారదుఁడు స్వర్గమునుండి యారామ భార్గవ రాముల యుద్ధము చూడనటకు వచ్చెను.

రామాయణార్థమున నారదు నూరక తెచ్చి నిలుపుట కేవలము శ్లేషార్థ సంఘటనమునకై కావింపఁబడినది యగును.

**భారత.** కయ్యంబుల వేఁడుకకాఁడయ్యు౯ = యుద్ధాపేక్షగలవాఁడయ్యు, నత = అణఁగినట్టి, కలహకేళికా = యుద్ధక్రీడయందు, ఆకాంక్షుఁడై, నారదుఁడు, అయ్యెడ౯, దివినుండి, వారి౯ = ఆపాండవులను, అభిదర్శింప౯, నెయ్యమున౯, వచ్చె౯.

తా. యుద్ధప్రియుఁడయ్యు నారదుఁడు పాండవులమీఁది దయచే యుద్ధకాంక్ష విడిచినవాఁడై వారిం జూడ నటకువచ్చెను.

వ. అప్పుడు. 80

ఉత్సాహ. అనరాధిపతి కుమారక శ్రాగ్రయాయితమ్ములుగ్  
దాను బరశుభాసమానధాముఁ డైన మునికిఁ బెం  
పూన నర్ఘ్యముఖ్యవిధు లనూనముగ నొనర్ప న  
మ్మౌనివరుఁ డనవగణితసమస్తతదుపచారుఁ డై. 81

రామాయణ. అనరాధిపతి కుమారకాగ్రయాయి = ఆదశరథుని కుమారులలో జ్యేష్ఠుఁడగు రాముఁడు, తమ్ములుగ్ = సోదరులును, లక్ష్మణభరత శత్రుఘ్నులును, తానుగ్, పరశుభాసమాన = గండ్రగొడ్డలిచేఁ బ్రకాశించు చుండు, ధాముఁడైన = ప్రతాపముగల, మునికిగ్ = మహర్షికి, పరశురాము నకనుట. పెంపు, ఊనగ్ = గౌరవమొందునట్లు, అర్ఘ్యముఖ్యవిధులు = అర్ఘ్యము మున్నుగాఁగల విధులు, అనూనముగగ్ = తగ్గకుండులాగున, విశేషముగా ననుట. ఒనర్పగ్ = చేయఁగా, అమ్మౌనివరుఁడుగ్ = ఆ పరశురాముఁడును, అనవగణిత = ఎంచఁబడని, సమస్త, తదుపచారుఁడై = అతని సర్వోపచారములు గలవాఁడై.

తా. రాముఁడు నిజసోదర సహితుఁడై పరశురామున కర్ఘ్యాది పూజలు జరిపిన వాని నతఁడు లక్ష్యపెట్టనివాఁడై. "అకళంకితనిట్టనుగ్" అను పద్యముతో నన్వయించుచున్నది.

భారత. అనరాధిపతికుమార కాగ్రయాయి=ఆరాజపుత్రులలో జ్యేష్ఠుఁడగు ధర్మజుఁడు, తమ్ములుగ్ = సోదరులైన భీమార్జుననకుల సహదేవులును, తానుగ్, పరశుభ, అసమాన = ఇతరులకు శుభకరమై, సాటిలేని, ధాముఁడైన= తేజముగలవాఁడైన, మునికిగ్ =మహర్షికి, నారదునకనుట. పెంపూనగ్, అర్ఘ్యముఖ్యవిధులు, అనూనముగగ్, ఒనర్పగ్, అమ్మౌనివరుఁడు = ఆనార

దుఁడు, నవ......ఉపచారుఁడై - నవ = నూత్నములగున, గణిత = ఎంచఁబడిన, సమస్తతదుపచారుఁడై.

తా. ధర్మజుఁడు సోదరసమేతుఁడయి యానారదున కర్ఘ్యాది పూజావిధులం గావింప నారదుఁడు వానినెల్లం బరిగ్రహించి.

ఉత్సాహలక్షణము. "సాహచర్య పద్మమిత్ర సప్తకంబుగురువు నుత్సాహవృత్తమునకె చెల్లుజలజదళ విలోచనా." తాతంభట్టు.

వ. పదంపడి నిజభ్రూచలననిరస్తసమస్తజనుల నుపలక్షించి
తదనుజసమక్షంబున. 92

తా. సుగమము.

క. అకళంకిత నిట్లనుఁగొం
చక యేమీ మనము సమర శ్రీ సముదారక్రీ
డకు నొండొరు మార్కొనుట దొ
రకునని వచ్చితి నెఱుఁగ శ్రీ రావా కినుకల్. 83

రామాయణ. అకళంకితన్ = కళంకరహితుఁడగుటచే, కొంచక = సంకోచించక, ఇట్లనున్ = పరశురాముఁడిట్లనును, ఏమీ, మనము = నీవును నేనును, సమర = యుద్ధమనెడి, సముదార = గొప్పదగు, క్రీడకున్ = విహారమునకు, ఒండొరున్ = ఒకరితో నొకరు, మార్కొనుట = ఎదురించుట, దొరుకున్, అని = చిక్కునని, వచ్చితిన్, కినుకల్ = కోపములు, ఎఱుఁగరావా = తెలియఁబడవా.

తా. పరశురాముఁడు సంకోచింపక యిట్లనును. మన కిరువురకును యుద్ధము కలుగునను నపేక్షతో వచ్చితిని, నాకోప స్వభావము నీవింక నెఱుఁగవా!

భారత. అకళంకితన్, ఇట్లనున్ = నారదుఁ డిట్లనును, ఏన్ = నేను; మీమనము = మీమనస్సు, దారక్రీడకున్ = భార్యయగు ద్రౌపది తోడిక్రీడకు, సమరసము = సమానానురాగముగలది, [అకారణమున] ఒం

డోరుఁ = మీలో నొకరితో రొకరు, మార్కొనుట, దొరకుఁ = సంభవించును, అని, వచ్చితిఁ = అరుదెంచితిని, ప్రతీకారముచేయుదమనివచ్చితిననుట. ఆకినుకల్ = ఆక్షేపములు, స్త్రీమూలకములగు నాక్షేపములు, ఎఱుంగక, రావు = తెలియఁగారావు.

తా. నారదుఁడిట్లనును. ద్రౌపదీవిహారమున మీరేవురును సమానానురాగులుగానుండుటచే మీలో నెట్టి వైరము గల్గునోయని దానిమాన్పఁదలఁచి వచ్చినాఁడను.

"సమరసము" "శృంగారాదౌరసే వర్యే, గుణే రాగేద్రవేరసః" అని విశ్వము.

క. చేతశ్చిత్రముగాదె స
మాతతగుణసార్థసిద్ధిమద్రామమహా
ఖ్యాతిపతివ్రత యిట్లవి
ఘాతముగ ననేకభర్తృకత నడపుటిలన్. 84

రామాయణ. సమాతత.........సిద్ధి — సమాతత = విస్తారమైన, గుణ = గుణములచే, సార్థసిద్ధి = అర్థసిద్ధిగల, మత్ = నాయొక్క, రామమహాఖ్య = రాముఁడనెడు పేరు, అతిపతివ్రత = అత్యంతపతివ్రతయగునది, ఇట్లు, అవిఘాతముగ = అడ్డులేకుండ నట్లుగా, ఇలన్, అనేకభర్తృకతన్ = పెక్కురు భర్తలుకలదౌటను, నడపుట, చేతశ్చిత్రము, కాదే = మనస్సునకు వింతగదా.

తా. విస్తృత గుణములచే సార్థకమగు నారామనామమిన్ని దినములుగా నన్నే యాశ్రయించియుండి పతివ్రతయనిపించుకొనిన దిప్పుడా నామమునే నీవు వహించుటచే ననేకభర్తృక యయ్యెను. ఇది యాశ్చర్యము కదా ?

భారత. సమాతత. గుణసార్థ = గుణసమూహముయొక్క, సిద్ధిమత్ = సిద్ధిగల్గిన, రామ = స్త్రీ=ద్రౌపది, మహాఖ్యాతి = మిక్కిలి ఖ్యాతిగలది,

పతివ్రత, ఇట్లు, అవిఘాతముగన్, ఇలన్, అనేకభర్తృకతన్, నడపుట, చేతశ్చిత్రముకాదే.

తా. సద్గుణములుగల పతివ్రతయగు నీద్రౌపది యిట్లేవురకు భర్తయగుట యెంతయు వింతగదా ?

ఆ. వె. ఇదియ నాకు మీకు ని తరేతరద్వేష
హేతు వనుచుఁ దోఁచె నేకతన్వి
భూతి నెరపునేను బుంవ్యక్తులకు నాలి
తనముతో సమాఖ్య మనుచు టెట్లు. 85

రామాయణ. ఇదియ = ఈరామనామమే, నాకున్, మీకును = నాకునుమీకును, [ఇట మీకునను బహువచనము శ్లేషార్థ సంఘటనమునకై యుపయోగింపఁబడినది.] ఇతరేతర ద్వేషహేతువు = పరస్పర విరోధకారణము, అనుచున్, తోఁచెన్, ఏకతన్ = ముఖ్యత్వమున, విభూతిన్ = ఐశ్వర్యమును, నెరపు = నిండింమనట్టి, నేను, [నే నొక్కఁడనే గొప్పవాఁడననిపించుకొనియుంటి నని భావము.] పుంవ్యక్తులకున్ = పురుషులకు, నాలితనముతోన్ = నీచత్వముతో, సమాఖ్యన్ = రామాయనెడిమంచిపేరును, ఎట్లు, మనుచుట = ఎట్లు కాపాడుట. [రామయనెడి యీమంచిపేరు స్త్రీలకుండిన సరియేకాని నాకుఁ దక్కఁ బురుషులకుండిన దానినే నెట్లు నిల్పుదునని భావము.

తా మన యిరువురకు నొక్కపేరుండుట యే ద్వేషకారణము. ఇంతకాలముగా నేనొక్కఁడనే గొప్పవాఁడనని పించుకొని యిప్పుడు స్త్రీలకైన సరియేకాని పురుషుల కీరాముఁడను పేరుండిన దానిని నిలువనిత్తునా

భారత. ఇదియ = ఇట్లు మీరింద ఱొక్కతెయందు వ్యామోహము గల్గియుండుట, మీకున్, ఇతరేతరద్వేషహేతువు, అనుచున్, నాకున్, తోఁచెన్, ఏకతన్వి = ఒక స్త్రీ, విభూతినెరపు = విభుత్వముఁ బూర్తిగా వించు, ఏనుపుంవ్యక్తులకున్ = ఏవురు పురుషులకు, ఆలితనముతోన్ =

భార్యాత్వములో, సమాఖ్యక్ = కీర్తిని, మనుచు టెట్టు = ఎట్లు నిర్వహించుట.

తా. ఒక్కతె యింటికు భార్యయగుటయే మీకుఁ బరస్పర ద్వేషకారణమని నేఁదలఁచెదను, ఒక్కయాఁడుది యేవురకు పత్నియై కీర్తింగా పాడుకొను టెట్లగును ?

చ. భవదుపయామకాలమునఁ జర్చినసుద్దులు విన్నవాఁడనా
భవుపరధర్మమట్టగుట భావములోనిడి మాకు శంకలె
య్యవి యని యుబ్బుటొప్పదివిశయావరశక్తికి లోనుగావశ
క్యవిజయము ల్మదీరితమహాశరమణ్యవరుద్ధ యుద్ధముల్.

రామాయణ. భవదుపయామకాలమునక్ = నీపెండ్లి సమయమున, చర్చినసుద్దులు=వ్యాపించిన సంగతులు, విన్నవాఁడక్, ఆభవు=ఆరుద్రుని, పరధర్మము=గొప్పవిల్లు, అట్టగుట = అట్లువిఱువఁబడుట, భావములోక్, ఇడి=మనస్సుననిడి, మాకక్, శంకలు, ఎయ్యవి=మాకేమి సంశయము, అని, ఉబ్బుట = గర్వించుట, ఒప్పదు = తగదు, ఇవి = నేఁ బ్రయోగించు నీ బాణములు, అవరశక్తికిక్ = అగొప్పశక్తికి, శివధనుర్భంజనరూపశక్తికి, లోనుగావు = లోఁబడునవికావు, [నా బాణములయెదుట నీశక్తి యుపయోగశూన్యమని భావము.] మదీరిత.........యుద్ధముల్—మదీరిత = నాచేఁ బ్రయోగింపఁబడిన, మహాశరమణి = గొప్పవగుబాణశ్రేష్ఠములచే, అవరుద్ధ = అడ్డగింపఁబడిన, యుద్ధముల్, అశక్యవిజయముల్ = సాధ్యముగాని జయముగలవి, జయింపశక్యముగాని వనుట.

తా. నీ వివాహసమయమున జరిగినవృత్తాంతమెల్లను విన్నాఁడను, శివుని విల్లు విఱుచుటచేత నే యుబ్బకుము, నాబాణములచే నడ్డగింపఁబడిన యుద్ధములు జయింప శక్యములుగానివి.

"ఉపయామ" "తథా పరిణయోద్వాహోపయామాః పాణిపీడనం" అని యమరము.

భారత. భవదుప యామకాలమునన్, పర్వినసుద్దులు, విన్నవాఁడన్, భవు, పరధర్మము= ఆశివుని వరమురీతి, అట్టగుట, భావములోన్, ఇడి, మాకున్, శంకలు, ఎయ్యవి, అని, ఉబ్బుట = గర్వించుట, ఒప్పను, ఇవి= స్త్రీమూలక వైరములు. అవరశక్తిన్, లోనుగావు = లోఁబడవు [స్త్రీమూలకవైరమన్నింటిని మించినదని భావము.] మత్ = నాచేత, ఈరితి= చెప్పఁబడ్డ, మహాశ = స్త్రీవైషయికాధికాపేక్షగల, రమణి = స్త్రీలచే, అవరుద్ధ = అడ్డగింపఁబడిన, కల్పింపఁబడిన యనుట. యుద్ధములు, అశక్యవిజయములు = అసాధ్యజయములు,

తా. మీ వివాహకాలమున వ్యాసుఁడు చెప్పిన పంచేంద్రోపాఖ్యాన విషయము నాకును దెలియవచ్చెను. శివుని వరమునఁగదా మేమేవురము పతులమైతిమి మాకేమి లోటని యుబ్బవలదు. స్త్రీ మూలకములగు వైరముల శక్యవిజయములు. ఇట మహాశయను నది యుద్ధములను దానికి విశేషణము.

క. విను మంతపనులరాకకు
మునుపుగఁ దచ్ఛాంతిమార్గమొకం దెలిపెద నొం
డొనరింవుము సమయము ధరఁ
గొనసాఁగితనర్చెద మను కోర్కి గలిగినన్. 87

రామాయణ. వినుము, అంతపనుల రాకకు మునుపుగన్ = అశక్యవిజయములగు నాబాణములు పైఁబడునంతటి పనులకు రాకమున్న, ధరన్ = భువిని, సమయుము = మరణింపుము, కొనసాఁగి, తనర్చెదను = ఉత్తరోత్తరముగా నుండెదను, అనుకోర్కి, కల్గినన్ = అనెడి కోరికయుండిన, తచ్ఛాంతిమార్గమున్ = ఆ బాణపుపాటుగలుగక శాంతించునుపాయము, ఒండు = ఒకటి, తెలిపెదన్, ఒనరింపుము.

తా. నా బాణములు పైఁబడి నిన్ను నశింపఁజేయకమున్నె యది శాంతించు నుపాయ మొక్కటి చెప్పెదను, చావక పైపైనభివృద్ధి నంద నిచ్ఛయుండిన నట్లొనర్పుము.

భారత. వినుము = ధర్మజా వినుము, అంతపనులరాకకు మునుపుగన్ = పరస్పరము పోరుసల్పునంతటి కార్యము కల్గుటకుమున్న, ధరన్, శాన సాఁగి, తనర్చెదను, అనుకోర్కెకలిగినన్, తచ్ఛాంతిమార్గమున్ = అట్టి పోరురాక శాంతించు నుపాయము, సమయము = సంకేతము, ఒండు, తెలిపెదన్, ఒనరింపుము.

తా. మీలో నట్టిపోరుగల్గకయున్నది శాంతించులాగున నొక సంకేతము దెల్పెదను. పై పై నభివృద్ధిఁగోరినచో దానిని విని యట్లొనర్చునది.

చ. సమరసరూఢి మచ్చరిత ! సాధ్వసమాకృతిఁ బర్వ రాజస
త్వమదనిరాసి వక్త్రముగు ! వందనధర్మము పూని కొల్వు సే
యుమనుమునీకుఁదమ్ములకు ! నొక్కనియొక్కనియింట నేఁడుపూ
ర్ణముగవసించిసొంపులమ ! రన్సమయంబిటుసేయుటొప్పగున్.

రామాయణ. సమర......సాధ్వసము-సమర = యుద్ధమందు, సరూఢి = ప్రసిద్ధితోఁగూడిన, మచ్చరిత = నాచరిత్రమువలని, సాధ్వసము = భయము, ఆకృతిఁబర్వన్ = ఆకారముతోఁగానరాఁగ, రాజసత్వ......నిరాసివక్త్రమగు - రాజసత్వ, మద = రాజులయొక్క పరాక్రమగర్వమును, నిరాసి = నశింపఁజేయుఁ, వక్త్రమగు = ముఖమునుగల, ప్రారంభమునుగలయనుట. వందనధర్మము, పూని = నమస్కారధర్మమూని, [రాజులబలగర్వ మొక్కనియెడఁ దలవంచినఁ దగ్గుననిభావము.] కొల్వుసేయుము = నన్ను సేవింపుము, మనుము = ఈమార్గమున బ్రదుకుము, నీకున్, తమ్ములకున్, ఒక్కనియొక్కనియింటన్=మీనల్వురిలోనొక్కొక్కనియింట, నేఁడు = ఈదినము, పూర్ణముగన్, వసించి, [ఉండుదు నను క్రియ యధ్యాహార్యము.] సొంపులు, అమరన్ = మీకుసొంపు లమరుటకు, ఇట్లు, సమయంబు = సంకేతము, చేయుట, ఒప్పగున్ = తగును.

తా. యుద్ధమునఁ బ్రసిద్ధిపొందిన నాచరిత్రమువలని భయమాకృతి పొందిన లాగునను౦డ, రాజగర్వ నిరాసకమగు నమస్కారరూప ధర్మ

మాచరించి నన్నుఁగొల్చుము, ఆకతమున సుఖింపుము, నేను నీదినము మీనల్వురలో నొక్కొక్కనియింటను నుండివెళ్లెదను. ఇట్టి సంకేతము చేయుట నీకుఁదగును.

ఇది కేవలము శ్లేషార్థసిద్ధికై తెచ్చికొనిన విషయముగాని దీని కిట నేమాత్రమును సంబంధము లేదు.

ఇట నేఁడను దానిలో నర్థబిందువు గల్గుటకు; "వాఁడి మయూఖము ల్గలుగువాఁ డపరాంబుధి గ్రుంకె ఘేనువుల్, నేఁడిటఁ దెచ్చె." అని నన్నయ ప్రయోగము గలదు. "తెచ్చెసురేంద్రుని కరివి,వ్వచ్చుండిదె నేఁడు దివ్య వస్తుచయముతోన్" అని నైరావతచరిత్రమునను బ్రయోగము గలదు.

భారత. సమ రసన్ = సమానమగు రసముగల దానిని, రూఢిమ చ్చరితన్ = ప్రసిద్ధిగల చరిత్రము గలదానిని, సాధు = అందమైన, అసమ = సాటిలేని, ఆకృతిన్ = ఆకారముగలదానిని, పర్వ...వక్త్రిన్—పర్వ రాజ = పున్నమనాఁటి చంద్రునియొక్క, సత్వమద = మనోజ్ఞతాగర్వ మును, నిరాసి = తిరస్కరించెడు, వక్త్రిన్=ముఖముగలదానిని, మగువన్= స్త్రీని, ద్రౌపది ననుట. తన ధర్మము పూని = పతివ్రతాధర్మము పూని, నీకున్, తమ్ములకున్, ఒక్కని యొక్కనియింటన్ = ఒక్కొక్కని యింటను, ఏఁడు=సత్సరము, పూర్ణముగన్, వసించి, సొంపుల, అమరన్= అమరులాగున, కొల్వు సేయుమనుము = సేవసేయుమనుము. ఇటు, సమ యంబు సేయుట = సంకేతము సేయుట, ఒప్పగున్.

తా. ద్రౌపది మీలో నొక్కొక్కనింట నొక్కొక్కవత్సరము వసించుచు మీకు సేవసేయునట్లు సంకేతము గావించుకొనుట యొప్పును.

వ. మఱియు నొక్కనియమం బెఱింగించెద. 89

క. విను రామ యొరునిశాంతం

బున సేవ యొనర్చుకాలమున నెవ్వఁడు దాఁ

జనుదండకార్యగతి నా
యనవర్షాచరితతీర్థయాత్రుఁడుగఁ దగున్. 90

రామాయణ. రామ, వినుము, ['నీవు' అని కర్త యధ్యాహార్యము] శాంతంబునన్ = శాంతిచే, సేవయొనర్చుకాలమునన్ = సేవించునట్టి కాలమున, ఒరుని, దండకార్యగతిన్ = దండోపాయమున, ఎవ్వఁడు, తాన్, చనున్ = ఎవ్వఁడు ప్రవర్తించునో, ఆయన = అతఁడు, వర్షాచరిత = వర్షకాలమున నాచరించిన, తీర్థయాత్రుఁడుగన్ = తీర్థయాత్ర కలవాఁడుగా, తగున్.

తా. సేవసల్పుకనియింట నుండ దండోపాయమున మెలఁగెనేని వాఁడు వర్ష కాలమునఁ దీర్థయాత్ర సల్పుఁడగును

రామాయణపర్యాయమున నీ యర్థము కేవలము శ్లేషార్థసంఘటనకై తెచ్చికొనినదియే యగును.

భారత. విను. రామ = ద్రౌపది, ఒరు నిశాంతంబునన్, ఒక్కని యింట, సేవయొనర్చుకాలమునన్, ఆర్యగతిన్ = మంచిమార్గమున, దండకున్, ఎవ్వఁడు, తాన్, చనున్ = ఎవ్వఁడు పోవునో, ఆయన, వర్ష = ఒక్కయేఁడు, ఆ చరిత, తీర్థయాత్రుఁడుగన్, తగున్ = ఒక్కయేఁడు తీర్థయాత్ర నేయవలయును

తా. ఆ శ్లోకక్కనియింట నుండ నింకొక్కఁడు సమీపమున కరిగినచో నాతఁ డొక్కయేఁడు తీర్థయాత్ర చేయవలయును.

"నిశాంత" "నిశాంతవస్త్యసదనం" అని యమరము.

క. అని శమదమహిమవర్తనుఁ
డనిపించుకొని చనియెను సహస్రకరుఁడు నా
యనలసమానౌజస్స్ఫుర
ద్ఘినిజిత్రపతంగలీలఁ దెంచెదేఁ జనునెడన్. 91

రామాయణ. అనిశ = ఎల్లప్పుడును, మదమహిమ = గర్వాతిశయముచే నయిన, వర్తనుఁడు = ఉనికిగలవాఁడు, అనిపించుకొని = ప్రఖ్యాతిని గలిగి, సహస్రకరుఁడు = కార్తవీర్యార్జునుఁడు, చనియెను = మరణించెను, చనునెడఁ = మరణించుకాలమున, నాయనలసమాన = నా దగు నగ్నితో సాటియగు, ఓజః = తేజముయొక్క, స్పృష్టిని=స్పర్శము చేత, చిత్ర = అద్భుతమైన, పతంగలీలఁ = మిడుతవిధమున, చెందెను.

తా. పరాక్రమ గర్వముగల యా కార్తవీర్యార్జునుఁ డప్రియవాది యగుటచే నా ప్రతాపాగ్నియందు మిడుతవలెఁ బడి మరణించెను.

భారత. అని = పూర్వోక్తప్రకారముగా నాడి, శమ...వర్తనుఁడు—శమ = అంతరింద్రియ నిగ్రహముచేతను, దమ = బహిరింద్రియ నిగ్రహముచేతను, హిమ = చల్లనైన, వర్తనుఁడు = ఉనికిగలవాఁడు, నారదుఁ డనుట, అనిపించుకొని, చనియెఁ = స్వర్గమునకు వెళ్లెను, చను నెడఁ = అట్లు వెళ్లునప్పుడు, సహస్రకరుఁడుఁ = సూర్యుఁడును, ఆ, అనలసమాన, ఓజః, స్పృష్టిఁ, చిత్రపతంగ = చిత్రమునఁగల సూర్యుని విధమున, చెందెఁ.

తా. అంతరింద్రియ బహిరింద్రియ నిగ్రహముగల యా నారదుఁ డిట్లు హితబోధ గావించి స్వర్గమున కరిగెను. పోవునెడ నాతని స్పర్శమున సూర్యుఁడు తేజోహీనుఁడై చిత్రమునఁ గల సూర్యునివలె నాయెను.

"హిమ" "తుషారశ్శీతజ శ్శీతో హిమః" అని యమరము.

"పతంగ" "పతంగః పక్షిసూర్యయోః" అని యమరము.

"అనల సమానౌజస్స్పృష్టిని" వృద్ధిసంధి.

భారతార్థమున నారదుఁడు వెడలెను. ఇంక శ్లేషార్థ సంఘటన మునకై రామాయణమునఁ దెచ్చిపెట్టికొనిన నారదుని గతి యేమైనదియుఁ దెలుపకుండెను.

ఉత్సాహ. అంతరహిత సముయప్రవృత్తి నర్జునుండు ధర్మరా
జాంతికమున కరిగె దృఢనిజాయుధగ్రహేచ్ఛన
త్యంతమగుగురు ధేనుదస్యుతాపి తాతి మన్యుమ
త్స్వాంత బాడబప్రశాంతి సలుపనేర కొండుమై. 92

అవతారిక. ఇంక రెండు పద్యములం గార్తవీర్యార్జునుని భంగముతే
తెలుపుచున్నాఁడు,

రామాయణ. అంతః+అహిత = అంతశ్శత్రువులయొక్క, [కామ
క్రోధాద్యరిషడ్వర్గముయొక్క యనుట.] సముయప్రవృత్తిః = సమష్టి
వ్యాపారమున, అర్జునుండు = కార్తవీర్యార్జునుఁడు, దృఢనిజాయుధగ్ర
హేచ్ఛః = దృఢమైన, తన యాయుధమును గ్రహించుటయందలి యపే
క్షచే, [దృఢశబ్దమాయుధ గ్రహేచ్ఛ యనుదానికి విశేషణము. ఆయుధ
గ్రహేచ్ఛను మానక యని భావము.] అత్యంతము = మిక్కిలి, గురు......
ప్రశాంతి—గురు = తండ్రియగు జమదగ్నియొక్క, ధేను = ఆవుయొక్క,
దస్యుతా = దొంగిలించుటవలన, ఆపిత = చెందఁబడిన, అతిమన్యు=అత్యం
తక్రోధముగల, మత్ = నాయొక్క, స్వాంత = మానసమనెడి, బాడబ=
బడబానలమునకు, ప్రశాంతిః = శాంతిని, ఒండుమైః = వేఱువిధ
ముగా, చలుపనేరక = చేయనేరక, ధర్మరాజాంతికమునకుః = యముని
సమీపమునకు, అరిగెః = పోయెను.

తా. కార్తవీర్యార్జునుఁడు నాతండ్రియొక్క హోమధేనువును
దొంగిలించుకొనివచ్చుటయు కాక నన్ను శరణుపొందక నాతోడి యుద్ధ
మునకై యాయుధము నెత్తికొని నిలిచెను. నా క్రోధమనెడి బడబానల
మునకు వేఱు ప్రతిక్రియ సేయఁజాలక మరణించెను.

మరణించెనని కఠినముగాఁ జెప్పుటకు మాఱుగ ధర్మరాజాంతిక
మున కరిగెనని మృదువుగాననెను. "రిపూనుర్వరు క్షేత్ర తలేచరంతం,
తృణాయుమత్వా వృష సేనముగ్రం, కిరీటికోపః పరధేనుకాంతం, నినాయ

కాండైర్యమలోక గోష్ఠం.'' అని యనంత భట్టుఁడును మరణించెననుటను గాఢన్యరహితముగా ప్రయోగించెను.

భారత. అంతఁ, రహిత = విడువఁబడిన, సమయవృత్తిఁ = సంకేతముగల నర్తనచే, సంకేత భంగమొనర్చిన వాఁడైయనుట. అర్జునుండు అత్యంతము, గురు.........ప్రశాంతిఁ—గురు = పూజ్యమైన, ధేను = పాఁడియావుయొక్క, దస్యు = దొంగలచే, తాపిత = తపింపఁజేయఁబడినట్టియు, అతిమన్యుమత్ = మిక్కిలి దుఃఖముగల, స్వాంత = మానసముగల, బాడబ = బ్రాహ్మణునకు, ప్రశాంతిఁ = తాపశాంతిని, ఒందుమైఁ, నలుప నేరక, దృఢ.....గ్రహేచ్ఛఁ - దృఢ = దృఢమైన, నిజ = తనయొక్క, ఆయుధ గ్రహేచ్ఛఁ = ఆయుధము గ్రహింపవలయుననెడి కోరికచే, ధర్మరాజాంతికమునకుఁ = ధర్మరాజునొద్దకు, అరిగెఁ.

తా. బ్రాహ్మణ హోమధేనువును దొంగలు గ్రహించుకొని పోవుటచేఁ గన్గిన యాతని దుఃఖమును వేఱొండుమార్గమున నాఁపలేక యాయుధము గ్రహింపఁదలఁచి సమయభంగముగూడ సరకుసేయక ధర్మరాజుండు చోటికి కర్జునుఁడరిగెను.

"సమయవృత్తిఁ." సమయశ్శపథాచార కాలసిద్ధాంత సంవిదః.'' అని యమరము. "బాడబ ప్రశాంతి." "ద్విజాత్యగ్రజన్మ భూదేవబాడబాః" అని యమరము.

క. ఉదుటున నట్లరిగిన యతఁ
డది ప్రాయశ్చిత్త తీర్థయాత్రాలీలఁ
వదలక పూతము సేయఁ
సదమలగతి పూనె వృథలె సత్సంగరముల్. 93

రామాయణ. ఉదుటునఁ = ఉద్ధతిచే, అట్లరిగి, అట్లువెళ్లి, అతండు = ఆ కార్తవీర్యార్జునుఁడు, అది = అగురుధేను చౌర్యరూపదోషము, వదలక, పూతము, చేయఁ = పవిత్రముచేయుటకు, ప్రాయ

శ్చిత్త......లీలన్ — ప్రాయశ్చిత్త = పాపాపనోదనకర్మకు, తీర్థ=రేవైన, ప్రవేశస్థానమైన యనుట. యాత్రాలీలన్ = యుద్ధయాత్రాలీలచే, సద మలగతిన్ = మంచిదియు, శుద్ధము నగుగతిని, స్వర్గము పొందుటను పూనెన్, సత్సంగరముల్ = ధర్మయుద్ధములు, వృథయె = వ్యర్థమగు నదా?

తా. కార్తవీర్యార్జునుఁడు, తానాచరించిన హోమ ధేన్వపహార రూపకార్యమునకుఁ బ్రాయశ్చిత్తముగా యుద్ధయాత్ర యొనర్చి సద్గతి పొందెను. ధర్మయుద్ధములు వ్యర్థములగునా? ఎట్టి పాపాత్ముఁడేనియు రణరంగమున మరణించిన వీరస్వర్గమును బొందునని భావము.

తీర్థమనుటకు రేవను నర్థముగల్గుటకు, "జలావతారోగురు యోన్యు పాయ. శాస్త్రాధ్వరర్షి జుష్టతోయం, మన్త్రాద్వయోస్తావదశ పుణ్య భూమిః. పాత్రంజలం స్త్రీకుసుమంచ తీర్థం," నానార్థ రత్నమాల.

రణరంగహతుఁడు వీరస్వర్గము చెందుననుటకు; "ద్వావిమౌ పురుషౌలోకే, సూర్యమణ్డల భేదినౌ, పరివ్రాడ్యోగ యుక్తశ్చ, రణే చాభి ముఖోహతః." అని స్మృతి ప్రమాణముగలదు.

అలంకారము, అర్థాంతరన్యాసము, లక్షణము "సామాన్యం వావి శేషోవా, తదన్యేన సమర్థ్యతే, యత్రసోర్థాంతరన్యాస, స్సాధర్మ్యేణే తరేణవా," కావ్యప్రకాశము.

భా॰రత. ఉమటునన్ = వేగముగా, అట్లు, అరిగి, అతఁడు = అర్జు నుఁడు, అది = ఆ సమయసంగమును, పూతముసేయన్, ప్రాయశ్చిత్త, తీర్థయాత్రాలీలన్ = పుణ్యక్షేత్రయాత్రలను, నవలక, సత్, అమల, గతిన్ = గమనమును, పూనెన్, సత్సంగరముల్ = సత్పురుషుల ప్రతిజ్ఞలు, వృథయె.

తా. అర్జునుఁడట్లు లోనికరిగినందులకై ప్రాయశ్చిత్తముగాఁ దీర్థ యాత్రకు వెడలఁబూనెను. సత్పురుషుల ప్రతిజ్ఞ వ్యర్థములు కావు.

"అది......పూతము సేయక." అనుచోడ నది యనునది జడవాచక మగుటచే నచ్చటి ద్వితీయకుఁ బ్రథమయయ్యెను.

"సంగరముల్." "ప్రతిజ్ఞాఽజి సంవిదాపత్సు సంగరః" అని యమరము.

గీ. అతను రణరస భోగికన్యార్థపరతఁ
దా నిలావంతుఁ డనుమహాద్రవిణనిధిని
సుతుల సద్వృత్తిఁ బడసెఁ దమితయశస్స్వ
లీలసుఖియింతు ననుచింత లేదెపుడును. 94

రామాయణ. అతను రణరసభోగికిన్ = తగ్గనట్టి యుద్ధరసానుభవముగలవానికి, అన్యార్థపరతన్ = ఇతర ప్రయోజనాసక్తిచే, తాన్, ఇలావంతుఁడను = భూమినిగలవాఁడను, రాజననుట. ద్రవిణ నిధిని = ద్రవ్యవంతుఁడను, సుతులన్ = కుమారులను, సద్వృత్తిన్ = మంచివ్యాపారముచే, పడసెదన్ = పొందెదను, మిత......లీలన్—మితయశః = మితమైన కీర్తిగల, స్వలీలన్ = తన విలాసముచే, సుఖియింతున్, అనుచింత= సుఖించెదను- అనెడిచింత, ఎపుడును, లేదు,

తా. యుద్ధోపభోగికి రాజత్వమునఁగాని, ద్రవ్యవంతత్వమునఁగాని, సుతయుక్తతచేఁగాని, కీర్తిచేఁగాని సుఖింతునను చింత కలుగదు.

భారత. అతను .. పరతన్—అతనురణ = మన్మథరణము నందలి, రస = వేడుకగల, భోగికన్యా = సర్పాంగనయొక్క, ఉలూచియొక్క యనుట. అర్థపరతన్ = ప్రయోజనాసక్తిచే, తాన్, ఇలావంతుఁడు, అను= ఇలావంతుఁడను పేరుగల, మహాద్రవిణనిధిని = మహాబలాఢ్యుని, లన ద్వృత్తిన్, సుతున్ = కుమారుని, పడసెన్ = పొందెను, దమిత... లీలన్—దమిత = అణఁచి వేయఁబడిన, యశః = కీర్తిగల, స్వలీలన్ తన క్రీడచే, సుఖియింతునను చింత, ఎపుడును, లేదు.

తా. నాగకన్యయైన యులూచితోఁ గూడి ఇలావంతుఁడను నొక సుతుం గాంచెను. పుత్రార్థ మాబిడ కోర నామెం జేరె నంతియకాని తీర్థయాత్రాపరుఁ డగునపుడు స్త్రీసంభోగము గోరి స్వకీర్తిని నాశము చేసికొన నొల్లఁడు.

ఇటఁ దీర్థయాత్రాపరునకు స్త్రీసంభోగము దోషము కాదే యను నంశము నీ కవి చక్కఁగా సమర్థించినాఁడు.

“ద్రవిణనిధిని” “ద్రవిణంతు ధనం బలం” అని యమరము.

సీ. తీర్థయాత్రా సమాప్తిఁ గరంబు దనరిరా
జోప భోగ్యంబైన యుద్ధవసుధ
నతిసరసమగు చిత్రాంగదానామల
తాంగి కృప సురతావాప్తిఁ జేసి
భాసురనందన ప్రసవభూషితవర
వర్ణినీగురుచిత్రవాహనుండు
తదదూరదేశసిద్ధసరసీపుణ్యతీ
ర్థోపసేవలమహాశాపకలుష

గీ. నైకనిర్ఝరీధృతమౌక్తికకలాప
రూపలోపకృజ్జలవిహారుఁడును దివ్య
ధామకలితుండునై పూతతరుఁ డగునరుఁ
డొప్పెసఁగు రుచిరయశోమహోదయతను. 95

రామాయణ. తీర్థయాత్రా = తీర్థయాత్రకు, సమ = సాటియైన, ఆప్తిక = వ్యాప్తిచే, కరంబు = మిక్కిలి, తనరి = ఒప్పి, రాజోప భోగ్యంబైన = రాజులచే ననుభవింపఁదగిన, యుద్ధవసుధక = రణరంగమున, అతిసరసమగు = మిక్కిలి ప్రియమగు, చిత్రాంగ...అవాప్తిఁజేసి— చిత్ర = ఆశ్చర్యకరమైన, అంగదాన = శరీరచ్ఛేదమువలని, అమలతా =

శుద్ధత్వముచే, అంగీకృత = గ్రహింపఁబడిన, సురతా = దేవత్వముయొక్క, అవాప్తిఁజేసి = ప్రాప్తిచే, భాసుర......వాహనుఁడు, భాసుర = ప్రకాశించుచున్న, నందన = నందనవనమునందలి, ప్రసవ = పుష్పములచే, భూషిత = అలంకృతమైనట్టియు, వరవర్ణినీ = ఉత్తమస్త్రీలచేత, గురు = భారయుక్తమైన, చిత్రవాహనుండు = విమానము గలవాఁడు, తవదూర... ...... జలవిహారుఁడును—తత్ = ఆనందనవనమునకు, అదూరదేశ = సమీపప్రదేశముననున్న, సిద్ధసరసీ = ఆకాశగంగయొక్క, పుణ్యతీర్థోప సేవన = పుణ్యజలసంసేవనమునందు, మహాశ = అత్యాశగలవారైనట్టియు, అకలుష = దోషరహితలైనట్టియు, నైకనిర్జరీ = పెక్కురు దేవతా స్త్రీలచే, ధృత = ధరింపఁబడిన, మకరీకలాప = మకరికాపత్త్రాలంకారములచేనైన, రూప = సౌందర్యముయొక్క, లోపకృత్ = లోపము గల్గించు, జలవిహారుఁడును = జలక్రీడగలవాఁడును, [ఆకాశగంగాజల సంసేవనమునం దాసక్తిగల పెక్కురు దేవతాస్త్రీలు పను మకరికాపత్త్రములు నశించుచుండినను గార్తవీర్యార్జునినితో జలక్రీడ లాడుచుండిరని భావము.] దివ్యధామకలితుండునై = దివ్యగృహయుక్తుఁడై, నూరతరుఁడగు, నరుఁడు = మనుష్యుఁడు, కార్తవీర్యార్జునుఁ డనుట. రుచిర......ఉదయ తను—రుచిర = మనోజ్ఞమగు, యశః = కీర్తియొక్క, మహోదయతను= శాంత్యుదయమున, ఒప్పెసఁగుఁ = ప్రకాశించుచుండును.

తా. కార్తవీర్యార్జునుఁడు తీర్థయాత్రలతో సమానమగు యుద్ధ భూమిని దేహము వదలుటవలననైన దేవత్వావాప్తిచే నందనవనమునందలి పుష్పములతోఁ గూడినట్టియు, దేవతాస్త్రీలతోఁ గూడినట్టియు విమానములఁ గలవాఁడై, యాకాశగంగావిహారాసక్తలగు దేవాంగనలతోఁ గూడి జలక్రీడలు సల్పువాఁడునై, యశోవైభవమున నొప్పారుచుండెను.

"అంగదాన" "దో అవఖండనే" అను ధాతువున నిష్ఠాంతశబ్దము.

"నైక" వృద్ధిసంధి.

భారతార్థమున కేర్పడిన యీ పద్యము రామాయణార్థమునఁ గ్లిష్టముగా నన్వయించి యర్థము చేయవలసి యున్నది.

భారత. తీర్థయాత్రా సమాప్తిక్ = తీర్థయాత్రా ప్రయుక్తమగు వత్సర పరిపూర్తిచే, కరఁబు, తనరి, రాజోపభోగ్యంబైన, ఉద్ధవసుధక్ = ఉత్సవాప్లుతముచే, అతి సరసమగు = మిక్కిలి శృంగారరసముతోఁ గూడిన, చిత్రాంగదానామ = చిత్రాంగద యనెడి పేరుగల, లతాంగి = తీఁగవంటి శరీరముగలదానిచే, స్త్రీచే ననుట. కృత = చేయఁబడిన, సురత = సంభోగముయొక్క, అవాప్తిక్, చేసి, భాసుర, సంపన్ప్రసవ = పుత్రుఁడగు బభ్రువాహనుని పుట్టుకచే, భూషిత, వరవర్ణినీగురు = ఆ చిత్రాంగద తండ్రియగు, చిత్రవాహనుండు = చిత్రవాహనుఁ డనుపేరుగల రాజుం గలవాఁడు, [చిత్రవాహనునకుఁ జిత్రాంగదాగర్భజనితుఁడగు బభ్రువాహను నర్జునుఁ డిచ్చెనని భావము.] తదనూర ............ ఉపసేవ నలక్ష—తత్ = ఆ చిత్రవాహనుని పట్టణమగు మణలూరుపురమునకు, అనూరదేశ = సమీపప్రదేశమునందున్న, తీర్థ = తీర్థమైన, సరసీ = సరస్సుయొక్క, పుణ్య = పుణ్యయుక్తమైన, తీర్థ = రేవునందు, ఉపసేవనలక్ష = స్నానములచేత, మహాశాప........జలవిహారుఁడు—మహాశాప = గొప్ప శాపముచే, కలుష = కలఁగిన, నైకనిర్జరీ = అనేక దేవతాస్త్రీలచేత, ధృత = ధరింపఁబడిన, మకరీ = ఆఁడు మొసళ్లయొక్క, కలాప = సమూహముయొక్క, రూప = ఆ మొసళ్లరూపముయొక్క, లోపకృత్ = నాశనముగావించు, జలవిహారుఁడును = జలవిహారము గలవాఁడై, [శాపవశమున నాఁడు మొసళ్లగు దేవతాస్త్రీలశాపమును బోఁగొట్టినవాఁడై యనుట.] దివ్య, ధామ = తేజస్సుతోడ, కలితుండునై, శూరతరుఁడగు, నరుఁడు = అర్జునుఁడు, సగుణ = మిక్కిలి గొప్పయగు, చిరయశః = చిరకీర్తియొక్క, మహోదయతను = గొప్పయుదయముతో, ఒప్పెన్.

తా. తీర్థయాత్రావసానమున నర్జునుఁడు మణలూరుపురమునకుఁ జేరి యటఁ జిత్రాంగదయందు బభ్రువాహనుఁ డను కుమారుం బుట్టించి వాని నా చిత్రాంగదా జనకుఁడగు చిత్రవాహనున కిచ్చి యటనుండి కదలి యా యూరికి సమీపప్రదేశమునఁ గల యొక సరస్సున శాపవశమున వాఁడు మొసళ్లై యుండిన దేవతాస్త్రీల శాపమోక్షణము గావించి యొప్పెను.

"క్రవ్యాస్త్ర" "క్రవ్యాశో భ్రామకో బద్ధ్వా తూణీరే సంహితావపి." అని యమరము.

"ఒప్పెసగురుచిర" ఇట రామాయణార్థమున ఎసఁగు నని సార్థబిందు రూపమును, భారతార్థమున సగురు అని నిర్బిందురూపమును గల్గుటకు; "శ్లేషేస బిందు నిర్బిందో్వ శ్మేశనం కుత్ర చిన్మతం." అథర్వణకారికావళి.

చిత్రవాహనున కర్జునుఁడు చిత్రాంగదా సముద్భవుఁడగు బభ్రువాహను నిచ్చుటను గుఱించి; "చిత్రాంగదయందు బభ్రువాహనుం డను పుత్రుం బడసి చిత్రవాహనునకు వంశకరుంగా నిచ్చి" అని యాదిపర్వమునఁ గలదు.

అప్సరసులకుఁ గల్గిన శాపకారణమును గుఱించి యర్జునునితో వారే చెప్పుచున్నవారు. "ఉగ్రతపంబు సేయుచున్నవాని......నొక్క బ్రాహ్మణుంగని వాని తపంబునకు విఘ్నంబుసేయ సమకట్టి. వేడుక నమ్మౌని ముందటఁ, బాడితి మాడితిమి పెక్కు పరిహాసంబుల్, గూడిగఁ బలికితిమి ......................ఏము రాగకారణవికారంబులు గావించిన నవి దనకుం గోపకారణంబులయిన నతి కుపితుండయి బ్రాహ్మణుండు మమ్మేవురను మహాగ్రాహంబులుగా శపియించిన" ఆదిపర్వము.

అనేక యనుటకు నైక యని ప్రయోగించుటకు, "గమికర్మీకృత నైకనీవృతః" అని శ్రీహర్షుని ప్రయోగమును గలదు.

గీ. అంత శౌర్యాశ్రయంబైన యట్టిమేటి
వీడు నాకాహవస్పృహాన్వీత ధామ
కాంతిఁ జూచి పోయెద ననికదలి వచ్చి
నాఁడ నెఱిచూపు మదనుగుణక్రమమున. 96

రామాయణ. అంత = అంతటి, కార్తవీర్యార్జునునితో సాటియగు, శౌర్యాశ్రయంబైన = పరాక్రమమున కాశ్రయమైన, మేటివి = గొప్ప వాఁడవు [అని తలఁచి] ఆహవ......కాంతిన్—ఆహవ = యుద్ధము నందు, స్పృహా = అపేక్షతోడ, అన్వీత = కూడిన, ధామ = ప్రతాపము యొక్క, కాంతిన్ = స్ఫురణచే, లేక, కాంతిన్ = ఇచ్ఛచే, నాకున్, ఈడు = సరియగు వాఁడవు, చూచి, పోయెదన్, అని = అట్టి నిన్ను చూచి పోయెదనని, కదలివచ్చినాఁడన్ = కదలి వచ్చితిని, మదనుగుణ క్రమమునన్ = నాకుఁ దగునట్టి విధమున, నెఱి, చూపు ను = పరాక్రమము చూపుము.

తా. కార్తవీర్యార్జునునివంటి బలముగలవాఁడవు, నాకుఁ దగినవాఁడ వనియు, నీతోడి యుద్ధాభిలాషతో వచ్చినాఁడను, నాతో నెదిరింపుము.

"కాంతిన్" అనుటకు ఇచ్ఛచే నను నర్థము, గల్గుటకు; 'కము కాంతౌ' అను ధాతువు మూలమున నగుచున్నది.

భారత. అంతన్ = పిమ్మట, శౌరి...వీడు—శౌరి = కృష్ణునకు, ఆశ్రయంబైన = ఆధారమైన, అట్టిమేటి = ఆలాటి గొప్పదగు, వీడు = నగ రము, ద్వారకయనుట. నాక... ... కాంతిన్ — నాక = స్వర్గ ముతో, ఆహవస్పృహాన్వీత = యుద్ధముచేయుటయందు దిచ్ఛతోఁగూడిన, స్వర్గమును దిరస్కరించున దనుట. ధామ = ఇండ్లయొక్క, కాంతిన్ = కాంతిగలదానిని, చూచిపోయెదనని, కదలివచ్చి, నాఁడ = నాఁడే, నెఱి

చూపు = పరాక్రమము చూపునట్టి, మదను = మన్మథుని, గుణక్రమ మునన్ = గుణానుసారముగ.

తా. వీమ్నట నర్జునుఁడు ద్వారకంజూచి పో నరుదెంచి, వాఁడే మన్మథుని గుణానుసారముగ. ముందరి పద్యముతో నన్వయము.

క. తెరలక మనము సుభద్రా
కరనాళీకగ్రహేచ్ఛఁగప్పఁగఁజనునా
దొరయదుపురిఁ జేరి జన వి
సరముల కెఱుక పడనీకశౌర్యతనుఘృణన్. 97

రామాయణ. తెరలక = కలఁతపెందక, మనము=నీవును, నేనును, సుభద్రా......గ్రహేచ్ఛన్—సుభద్రాకర = మంగళాస్పదమైన, నాళీక గ్రహేచ్ఛన్ = శరగ్రహణాపేక్షను, యుద్ధాపేక్ష ననుట. కప్పఁగఁ జనునా = అణఁచి వేయవచ్చునా, నీవన్, అశౌర్యతను = శౌర్యహీనత్వ ముచే, ఘృణన్ = జుగుప్సచేతను, పురిన్, చేరి = అయోధ్యనుజేరి, జన విసరములకున్ = జనసమూహములకు, ఎఱుకపడన్ = కనుపట్టునట్లుగా, దొరయదు = యుక్తముగాదు.

తా. మనము శుభాస్పదమగు శరములం గ్రహించి యుద్ధము సేయ వలెనని యుండ దానిం గప్పి పువ్వవగునా? అల్లానర్చితివేని శౌర్యహీనుఁ డవై, జుగుప్సాకరుఁడ వగు నీవు నీ నగరమునందలి జనుల కెల్లు కనఁబడు వాఁడవు.

"నాళీకగ్రహేచ్ఛ." "నాళీకం శరపద్మయోః" అని విశ్వము.

భారత. సుభద్రాకరనాళీక గ్రహేచ్ఛన్ = సుభద్రయొక్క తామర వంటిచేయి పట్టుకొనవలయు ననెడి కోర్కెచే, వివాహేచ్ఛచే ననుట. తెరలక, మనము, కప్పంగన్ = మనస్సును ఆక్రమింపుచుండఁగా, చను నాదొర = చనుచుండు నా యర్జునుఁడు, యదుపురిన్, చేరి = ద్వారకను

జేరి, శౌరి = కృష్ణునియొక్క, అతను = తగ్గని, ఘృణన్ = దయచే, జనవిసరములకున్, ఎఱుకపడనీక = అందలి జనసమూహములకుఁ దెలియనీయక.

తా. సుభద్రను వివాహమాడవలయు నను నాస యధికము కాఁగ నర్జునుఁడు ద్వారకంజేరి, కృష్ణు ననుగ్రహమున నచ్చటి జనులకుఁ దెలియనీలాగున. తిరంబై పోయెనని ముందరి పద్యముతో నన్వయము.

"శౌర్యతను ఘృణన్." "ఘృణాజుగుప్సాకృపయోః" అని విశ్వము.

మ. అనయంబు న్మదనామితాస్త్రకలనాత్యంతార్తి రాకుండఁజ
య్యన మౌనిత్వకృతేష్టసిద్ధితఁ దిరంబై పోయెదే దీప్యమా
ననిరూఢింపయిఁబడ్డ యాదవులనానావీరధర్మప్రవృ
త్తిని నర్థంబనిపించి యాత్మపురికిన్ దేవేరితోఁ గూడఁగాన్.

రామాయణ. అనయంబున్ = ఎల్లప్పుడును, మదనామిత......అత్యంతార్తి—మత్ = నాయొక్క, అనామిత = ఆఁగఁబడని, అస్త్రకలన = బాణప్రయోగముచేతనైన, అత్యంతార్తి = మిక్కుటమగుబాధ, రాకుండన్ = కలుగకుండునట్లు, చయ్యనన్ = శీఘ్రముగా, మౌనిత్వ...సిద్ధితన్ - మౌనిత్వ = మౌనము వహించియుండుటచే, కృత = చేయఁబడిన, ఇష్టసిద్ధితన్ = ఇష్టము సిద్ధించుటచేత, తిరంబై = స్థిరత్వము నెంది, దీప్యమాన నిరూఢిన్ = ప్రసిద్ధముగా, పయిఁబడ్డ = పైనఁబడిన, ఆదవుల = దూరముననున్న, నానావీరధర్మప్రవృత్తిన్ = పెక్కువీరుల ధర్మప్రవర్తనము, నిరర్థంబనిపించి = వ్యర్థమనిపించి, దేవేరితోన్, కూడఁగన్ = భార్యతోఁ గూడునట్లుగా, ఆత్మపురికిన్ = అయోధ్యకు, పోయెదే = పోయెదవా.

తా. నాబాణములచే బాధ కలుగుటకు మున్నే మౌనమవలంబించి, వీరధర్మము వీడి, భార్యతోడ నయోధ్యకుఁ బోదలఁచితివా.

భారత. అనయంబుల్ - మదన............అత్యంతార్తి మదన = మన్మథునియొక్క, అమితాస్త్రకలనా = బాణవిద్యచేనగు, అత్యంతార్తి, రాకుండఁగ, చయ్యనఁగ, మానిత్వకృతేష్టసిద్ధిఁగ = యతి వేషమూనుటచేఁ జేయబడిన యిష్టసిద్ధికల్గుటచే, యతివేషమూని సుభద్రను వివాహమాడి యనుట. తిరంబై, దేదీప్యమాన నిరూఢిఁ = ప్రకాశముగా, పయిఁబడ్డ... ప్రవృత్తిఁ - పయిబడ్డ = తనమీఁదబడిన, యాదవుల = యాదవులయొక్క, నానావీరధర్మ ప్రవృత్తిఁ = అనేకపరాక్రమ విజృంభణములను, నిరర్థం బనిపించి = వ్యర్థమనిపించి, ఆత్మపురికిఁ = హస్తినకు, దేవేరితోఁ, కూడఁగన్ = భార్యయగు సుభద్రతోఁ గూడునట్లుగా, పోయెన్.

తా. మదనబాణములకు గురికాక యర్జునుఁడు సన్న్యాసివేషమూని శీఘ్రముగా సుభద్రను వివాహమాడి నిజపురికిఁ బోవుచుండ యాదవులడ్డపడ వారి పరాక్రమము వ్యర్థమొనర్చి, భార్యయగు సుభద్రతో నరిగెను.

చ. అనికృతధర్మవీక్షుఁ డయి యా వరవర్ణి ని కామసంభ్రమం
బునడుపుచున్ గరంబమర పూజ్యసమిజ్జయశోభిమన్యునా
మునిసుతుఁ గాంచి లక్ష్మణుఁడు సముద్రితదీప్తి ధనంజయుండు
నేర్పెనయఁగభీరవీరసమరేక్ష్యతరోచ్చరణ ప్రగల్భతన్. 99

రామాయణ. అని = ఈ లాగునఁ జేసి, కృత = చేయఁ బడిన, ధర్మవీక్షుఁడయి = వింటియందు, గాపుగలవాఁడై, విల్లెక్కువెట్టి సంసిద్ధుఁడై యనుట. ఆ వరవర్ణి = ఆ బ్రహ్మచారి శ్రేష్ఠుఁడగు పరశురాముఁడు, నికామ = మిక్కిలి, సంభ్రమంబు = వేడ్కను, నడుపుచున్ = కొనసాఁగించుచు, [విల్లెక్కువెట్టఁబూనుట, అంబులపొది సవరించుట మున్నగు కార్యములనడపుచునని భావము.] కరంబు, అమరన్ = మిక్కిలి యొప్పుచుండఁగా, పూజ్య = శ్లాఘనీయమగు, సమిజ్జయ = యుద్ధజయముచేత, శోభి = ప్రకాశించుచున్న, మన్యున్ = కోపముగల, ఆ మునిసుతున్ =

పరశురాముని, కాంచి, అముద్రితదీప్తి = అమితతేజముచే, ధనంజయుండు= అగ్నిని బోలినవాఁడు, లక్ష్మణుండు, నేర్పెనయన్ = చాతుర్యయుక్తముగా, ఉచ్చరణప్రగల్భతన్ = ఉచ్చారిణశక్తిచే.

తా. పరశురాముఁడు తన వింటిం జూచుచు దాని నెక్కువెట్ట సంసిద్ధుఁడయియుండ నాతనింగాంచి తేజమున నగ్నికెనయగు లక్ష్మణుఁడు చాతుర్యమొప్పఁగా నుచ్చారణశక్తిచే. ఇట్లనుననిముందరి పద్యముతో నన్వయము.

"వరవర్ణి." "వర్ణినో బ్రహ్మచారిణః." అని యమరము.

"సమిజ్జయు." "సముదాయస్త్రియాం సంయత్సమిత్యాజి సమిద్యుధః" అని యమరము.

ఇటలక్ష్మణునిచేఁ బలికించుట కేవలము శ్లేషార్థ సంఘటనకై తెచ్చిపెట్టుకొనినదియే యగును. కానిరాజు లేవిషయమేనిం దాము పలుకక రాజనము మొఱయ మంత్రులు మున్నగువారిచేఁ బల్కించుట సంప్రదాయమగుటంబట్టి యావిషయ మీకవి చక్కఁగాఁ బాటించెను.

భారత. అని కృత = తిరస్కరింపఁబడని, ధర్మవీక్షుఁడయి = ధర్మదృష్టి గలవాఁడై, ఆ వరవర్ణిని = ఆ సుభద్రయందు, కామసంభ్రమంబు= మన్మథసంబంధమగు వ్యాపారమునందలి వేడ్కను, నడపుచున్, కరంబు, అమరపూజ్య = దేవతలచే శ్లాఘింపఁదగిన, సమిజ్జ = యుద్ధమునఁ గల్గిన, యశః=కీర్తిగల, అభిమన్యు నామునిన్ =అభిమన్యుఁడను పేరుగల, సుతున్, కాంచి = కుమారునిబొంది, లక్ష్మణుఁడు = లక్ష్మీవంతుఁడు, అముద్రిత దీప్తి = నిరర్గళప్రకాశముగల, ధనంజయుండు = అర్జునుఁడు, నయ...... ప్రగల్భతన్ - నయ = నీతిచే, గభీర = గంభీరమైన, వీర = శూరులచే, సమవేక్ష్యతర = మిక్కిలి వాంఛింపఁదగిన, ఉచ్చ = గొప్పదైన, రణప్రగల్భతన్ = యుద్ధప్రౌఢిమను, నేర్పెన్.

తా. ధర్మమతిక్రమింపక యర్జునుఁడు సుభద్రయం దాసక్తుఁడై యభి మన్యువను పుత్రునిం బడసి యాతనికి గొప్ప యుద్ధములందలి ప్రౌఢిమను నేర్పెను.

"అనిక్కృతధర్మనీతుఁడయి," ధర్మము నతిక్రమింపక సుభద్ర యందభిమన్యుఁబడసె ననుటలోఁ గామపరతంత్రుఁడుగాక శాస్త్రమర్యాద లనే యనుసరించి, "ధర్మప్రజార్థం త్వాం వృణీమహే" యను వాక్యము ననుసరించుచు సుతుంగాంచెనని కవియాశయము.

గీ. కొసర నిట్లనుభావంబుగపస నెరపుచు
నమ్మహాత్మునితో జిష్ణుతేజోఽతిశయము
మిక్కిలిఁ బ్రకాశముగ భ్రాతృమిత్రబంధు
సచివులసమాదృతినిఁ జూపి కరుచితసరణి. 100

రామాయణ. కొసరన్ = ఇష్టముతో, ఇట్లు, అనుభావంబుపసన్, నెరపుచున్ = ఈలాగున, నిశ్చయముయొక్క చాతుర్యమును ప్రకాశింపఁ జేయుచు, అమ్మహాత్మునితోన్ = ఆమహానుభావునితో, పరశురామునితో ననుట. జిష్ణు = జయశీలమైన, తేజోతిశయము=తేజోధిక్యము, మిక్కిలిన్, ప్రకాశముగన్=మిక్కిలి, తేజరిలఁగ, రుచిత సరణిన్ = ఒప్పినమగు విధ ములో, సమాదృతిన్ = మంచి యాదరముతో, భ్రాతృ......సచివులన్ - భ్రాతృ = సోదరులను, మిత్ర = హితులను, బంధు = చుట్టములను, సచి వులన్ = మంత్రులను, చూపి.

తా. స్వనిశ్చితము ప్రకాశింపఁజేయుచు, నాదరముతోఁ దమ్ము సంబంధించిన వారి వేర్వేఱంజూపి. ముందరిపద్యముతో నన్వయము.

భారత. కొసరన్ = విజృంభించునట్లు, ఇట్లు, అనుభావంబు, నెరపు చున్ = ఇట్లు ప్రభావముయొక్క సారము వ్యాపింపఁజేయుచు, అమ్మహా త్మునితోన్ = ఆయభిమన్యునితో, జిష్ణుతేజోతిశయము = అర్జునుని తేజోతి

శయము, మిక్కిలిన్ = మిగుల, ప్రకాశించుచుండఁగా, భ్రాతృ, మిత్ర, బంధువులు, ఉచితసరణిన్ = యుక్తరీతిని, అసమ = సాటిలేని, ఆదృతిని, చూపిరి=గౌరవముచూపిరి.

తా. అభిమన్యునితోఁగూడిన యర్జునుని తేజము మిగులఁ బ్రకాశింపఁగా నాతని బంధుగులెల్లరును సాటిలేని యాదరముచూపిరి.

క. మగలయిలు వరుసఁగలపెను
దగవరులొకఁడొకఁడొక్కొక్క ‡ తనయుఁడుచిరశౌ
ర్యగతినుతిఁ జెందఘనకీ
ర్తిగనలరంగలరు ద్రోవ ‡ దివరక్రమతన్. 101

రామాయణ. మగల యిలువరసఁగల = వంశానుగత మగుమగఁటి మిగల, పెనుదగపరులు = మంచి నేర్పరులు, ఒకఁడొకఁడు, ఒక్కొక్క పురుషుఁడే, ఒక్కొక్క, తన = తనయొక్క, ఉరు, చిర, శౌర్యగతి = అధికమై, స్థిరమైన, శౌర్యవర్తనము, నుతిన్, చెందన్=ప్రసిద్ధమగునట్లుగా, అలరంగలరు = సంతోషింపఁగలరు, అక్రమతన్ = క్రమము తప్పునట్లుగా, త్రోవ, దివరు = మార్గమునదిగరు, దుర్మార్గమున దిగఁజాలరనుట.

తా. మావారెల్లను శూరాగ్రేసరు లయి ఖ్యాతిగన్నవారు, అక్రమ మార్గమున దిగఁజాలరు.

భారత. ఘనకీర్తిగన్ = గొప్ప కీర్తి కలుగునట్లుగా, అల, రంగలరు = రంగుమీఱు, ద్రోపది = ద్రౌపది, తగన్, వరులు = భర్తలు, ధర్మజాదులనుట. ఒకొక్కఁడొక్కఁడు = ఒక్కొక్కఁడును, రుచిర = మనోహరమగు, శౌర్యగతి = పరాక్రమవర్తనమున, నుతిన్ = స్తోత్రముగల, ఒక్కొక్కతనయున్ = ఒక్కొక్కకుమారుని, చెందన్ = పొందఁగా, వరక్రమతన్=ఉత్తమమైన క్రమము గల్గుటచే, మగలయిలువరస, కలపెను.

తా. ద్రౌపది తనభర్తలలో నొక్కొక్కనివలన నొక్కొక్కకుమారుని గనెను.

"ద్రోవది" ఇది ద్రౌపదీ శబ్దమునకు వికృతి. "ద్రోవది బంధురం బయిన క్రొమ్ముడి గ్రమ్మనవీడ్చి" అని సోమయాజి ప్రయోగించెను.

సీ. అంత శౌర్యాప్తిచే నధికప్రహర్షసం
పన్నతఁ దగఁ గాంచి యున్నతమగు
దండితనమున వీ రుండ నే నస్ఫుట
పటుశక్తివిజయుండ బాలిశుండ
నీకాభిముఖ్యంబు గైకొని సుమనోబ
లంబుతోఁ దగ నుత్తరంబుఁ జెప్పఁ
జతురుండ నాతపస్స్థితివనా ద్భుతవివి
ధవిహారభోగవ ర్తనల నోసరి

గీ. తనరు నచ్యుతయోగశోభనతనుండ
వనికిఁ బనివడి విప్రుఁడై యనలుఁ డేఁగు
దెంచె ననవరదీప్తి నేతెంచి యిట్లు
పలుకు దీవనలనగర్వకళ నెఱపుచు. 102

రామాయణ. అంత శౌర్యాప్తిచేన్ = అంతటి పరాక్రమము గల్గుటచే, అధిక ప్రహర్షసంపన్నతన్ = అత్యంత సంతోషయుక్తతను, తగన్, కాంచి = పొంది, ఉన్నతమగు = గొప్పదగు, దండితనమునన్ = దిట్టతనముతోడ, వీరు, ఉండన్ = వీరెల్లరుండఁగా, నేను, అస్ఫుట......విజయుండన్ = అస్ఫుట = స్పష్టముగాని, పటుశక్తి = పూర్ణబలముచే, విజయుండన్ = జయముగలవాఁడను, [గొప్ప బలమున విజయముగాంచు నంతటి స్థితిలో లేనివాఁడనని భావము.] బాలిశుండన్ = బాలుఁడను, నీకున్, అభిముఖ్యంబు, కైకొని = ఎదుర్కొని, సుమనో బలంబునన్ = తెలివైన మనోబలముతోడ, తగు నుత్తరంబు=తగిన సమాధానము, చెప్పన్, చతురుండనా = సమర్థుఁడనా, తపస్స్థితివి = తపస్సునందు నిలుకడగల

వాఁడవు, అనాదృత........వర్తనలన్ — అనాదృత = ఆదరింపఁబడని, వివిధ = నానావిధములగు, విహారభోగవర్తనలన్ = వేడ్కలతోడి యనుభవ వర్తనలచేత, ఒనరి = ఒప్పి, తనరు = ప్రకాశించునట్టి, అచ్యుత = నిలుకడగల, యోగ = అష్టాంగయోగములచేత, శోభన = మంగళప్రదమైన, తనుండవు = శరీరముగలవాఁడవు, అనికిన్ = యుద్ధమునకు, పనివడి = కోరి, విప్రుఁడై = బ్రాహ్మణుఁడయ్యును, అనలుఁడు = అగ్ని, ఏఁగుదెంచెననన్ = వచ్చెనాయను లాగున, వరదీప్తి = గొప్పకాంతితో, ఏతెంచి = వచ్చి, ఇట్లు, అనలస = తగ్గని, గర్వకళన్ = గర్వప్రాప్తిని, నెరపుచున్, ఈవు, పలికెదవు. [ఇట్లు పల్కుట నీకు యుక్తమగునాయనిభావము.]

తా. మీరు మిక్కిలి శౌర్యముగలవారు, ఇట్టివారుండ బాలుఁడను, గొప్పయుద్ధము లొనర్పఁ జాలు శక్తిలేనివాఁడను, నగు నేనెట్లు నీకుఁ జాతుర్యముతో సమాధానము చెప్పఁగలవాఁడను? తపస్వివై, యష్టాంగ యోగనిష్ఠుఁడవగు మహానుభావుఁడవు, బ్రాహ్మణుఁడవు, అట్టి నీవు యుద్ధాసక్తుఁడవై యగ్నియే వచ్చెనోయనులాగున నింతి తీక్ష్ణతతో వచ్చి యిట్లు పలికెదవు.

"యోగశోభనత." యమ నియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యానధారణ సమాధులని యష్టాంగయోగములు యోగశాస్త్ర ప్రసిద్ధములగునవి.

భారత. అంతన్, శౌరి = కృష్ణుని, ఆక్తిచేన్ = ఆగమనముచే, అధిక ప్రహర్షసంపన్నతన్, తగన్, కాంచి, ఉన్నతమగు, దండితనమునన్, వీరుండు=పరాక్రమశాలి, అనేనః......శక్తి - అనేనః = పాపరహితమైన, స్ఫుట, పటుశక్తి, అశాలిశుండు = బుద్ధిమంతుఁడు, విజయుండు = అర్జునుఁడు, అనీక = యుద్ధమునందు, ఆభిముఖ్యంబు, కైకొని, సుమనోబలంబుతోన్ = దేవబలముతో, తగన్, ఉత్తరంబు, చెప్పన్. చతురుండు = సమర్థుఁడు, అనాతపస్థితి = ఎండలేనట్టి, వన = తోఁటయందలి, అదృత

వివిధ, విహార, భోగవర్తనలన్, ఒనరి = ఒప్పి, తనరు, అచ్యుత=కృష్ణుని తోడి, యోగ = సఖ్యమువలని, శోభనతన్, ఉండన్, వనికిన్ = అడవికి, అనవరత = తగ్గని, దీప్తిన్ = కాంతితో, పనివడి, అనలుఁడు = అగ్ని, విప్రుఁడై = బ్రాహ్మణుఁడై, ఏఁగుదెంచెన్ = వచ్చెను, ఏతెంచి, అగర్వ = గర్వయుక్తముకాని, కళన్ = వర్తనచేత, దీవనలు = ఆశీర్వాదములు, నెరపుచున్, ఇట్లు పలికెన్.

తా. అట్టియెడఁ గృష్ణుఁడటకు వచ్చుటచే నర్జునుఁడు మిగుల సంతసించెను. అంత వారిరువురు వనవిహారము సల్పుచుండ నగ్ని బ్రాహ్మణవేష మూనియటకువచ్చెను. వచ్చి వారి నాశీర్వదించి యిట్లు పల్కెను.

"అనేనః" "కలుషం వృజినైనోఘం" అని యమరము.

"చతురుండ నాతపస్థితి." ఇట రామాయణార్థమున 'తపస్స్థితి' యనియు, భారతార్థమున, 'నాతపస్థితి'యనియు నగుచున్నది. శ్లేషార్థ సంఘటనమునకై రామాయణార్థమునందలి సకారద్విత్వమీకపి వీడెను.

క. విను విజయ శక్తి మీఱితి
నను గాఢాహమిక చెల్లు నే నామదిలో నెం
దును బహుతరాశనుండన్
జనునే మిమ్మడుగవలయు నే సకలార్థంబుల్. 103

రామాయణ. విను = వినుము, విజయశక్తిమీఱితిని = జయశీలతచే నతిశయించితిని, అను, గాఢాహమిక=గాటమగు నహంకారము, చెల్లునా, ఎందును, మదిలోన్ = మనస్సునందు, బహుతరాశన్, ఉండన్, చనునే = అత్యాశతోనుండఁ దగునా, సకలార్థంబుల్ = అన్నివిషయములను, మిమ్మున్, అడుగవలయున్ = మిమ్మడిగి తెలిసికొనవలయును.

తా. నేను యుద్ధముల జయమును బొందితినని గర్వింపనగునా? అత్యాశతో నుండఁదగునా? ఏదియు మిమ్మడిగికదా తెలిసికొనవలయును?

"అను గాఢాహమిక చెల్లు నామదిలోనన్." ఇట ప్లుతయతి. లక్ష

ణము. ప్లుత మనఁబరఁగుఁ ద్రిమాత్రా, న్వితవర్ణము దానిమీఁది విదితస్వర
ముల్, కృతినయ్యక్షరములు చనుఁ జతురానన సదృశవళ్లు చక్కటికెల్లన్."
తాతంభట్టు.

భారత. విజయ = అర్జునా, విను, శక్తిమీఱి, తినన్ = అమిత
ముగా భక్షించుటకు, గాఢాహామిక, నామదిలోనన్, ఎందును, చెల్లున్,
బహుతర, ఆశనుండన్ = మిక్కుటముగాఁ దినువాఁడను, వలయుసకలార్థం
బుల్ = నాకువలయునట్టి సర్వప్రయోజనములును, నేన్, మిమ్ము, అడుగన్,
చనున్ = నేను మిమ్మడుగవచ్చును.

తా. అమితముగాఁ దినవలయునను నాస నామదిని గలదు. నే
మిక్కుటముగాఁ దినువాఁడను. నాకు వలయువానిని మిమ్మడిగి యేకదా
నేను బొందవలయును.

మ. అని వాలాయముగా నభీష్టతమ మానన్నంబొసంగన్ స్వనీ
తినిమున్నెంతయునియ్యకొల్పిమఱియు న్దృవృత్తిఁ బ్రవర్తిల్లుము
జ్జనితోల్లాసముతోడఁ బల్కెసముదంచత్ఖాండవాస్వాదవ
ర్తనమిష్టంబని రాజపుత్రునకు శశ్వత్తంబాశుచిత్వంబునన్.

రామాయణ. అని = యుద్ధము, వాలాయముగాన్ = అనివార్య
ముగా, అభీష్టతమమాను = ఇష్టమగును, అన్నన్ = అనినచో, మున్ను =
ముందు, స్వనీతిని = బ్రాహ్మణ ధర్మమును, ఎంతయున్, ఇయ్యకొల్పి =
నిర్వహించి, మఱి, ఉద్వృత్తిన్ = గొప్పవర్తనమునందు, పొసంగన్ =
పొసఁగునట్లు, ప్రవర్తిల్లుము, ఉజ్జనిత = కలిగినట్టి, ఉల్లాసముతోడన్ =
సంతోషముతో, పల్కె = మాటయే, సముదంచత్ = ప్రకాశించుచున్న,
ఖాండ = ఖండశర్కరా సంబంధమగు, వాః = నీటియొక్క, స్వాద =
రుచివంటి రుచిగల, వర్తనము = ఉనికిగలది, శశ్వత్తంబా = ప్రసిద్ధమగునట్టి,

శుచిత్వంబునన్ = అప్రతిహతుఁడౌటచేత, అని = యుద్ధము, ఇష్టంబు = ప్రియమగునది.

తా. రాజపుత్రునకు యుద్ధము ప్రియమగునంటివేసి, నీవు బ్రాహ్మణుఁడవగుటచే స్వధర్మము నిర్వహించి గొప్పవర్తనమున నుండుము. రాజపుత్రునకు వాఙ్మాధుర్యమును యుద్ధము నీరెండును ప్రియమగునవియే.

"పల్కె సముదంచత్ఖాండవాస్వాదనర్తనః" వాఙ్మాధుర్యము ప్రియమనుటచే, నీవలెఁ గఠినాక్షరములు పలుకక మృదు మధురముగనే నీయీ రౌద్రతకోలు యుద్ధము నడికారని తెలిసెడి నామాటలే నివర్తన మగునని లక్ష్మణు నభిప్రాయమనుట విశదమగుచున్నది.

"ఖాండ." "స్యాత్ఖండశర్కరలే చేక్షువికారమణిభేదయోః" అని విశ్వము.

ఇట ఖండ శబ్దము, తస్యేదమ్మని అణ్ప్రత్యయాంతమగుటచే ఖాండమని యయ్యెను.

"వాః" "వార్వారి సలిలంకమలం జలం." అని యమరము.

"శుచిత్వంబునన్." శుచిశ్శుద్ధేనుపహతే, శృంగారాషాఢయోరపి, గ్రీష్మేహుతవహేపిస్యాత్." అని విశ్వము.

భారత. అని, వాలాయముగాన్, అభీప్సితమమా, అన్నంబు, ఒసంగన్ = ఇష్టమైన యాహారమిమ్మనుటకు, నన్ను, స్వనీతిని = తన బ్రాహ్మణాకారధర్మముచేత, ఎంతయున్, ఇయ్యకొల్పి = అంగీకరింపఁజేసి, [నీ కోరెడియాహార మొసఁగెదనని యగ్నునిచే ననిపించుకొని యనిభావము] మఱి = అట్లనిపించుకొనినదిమ్మట, ఉద్వృత్తిన్, ప్రవర్తిల్లు, ముత్ = సంతోషముచే, జనిత = కల్గిన, ఉల్లాసముతోడన్ = సంతోషముతో, సముదంచత్, ఖాండవ = ఖాండవవనముయొక్క, ఆస్వాద = చవిచూచుట యనెడి, వర్తనము = ఉనికి, ఇష్టంబని = కోరికయని, రాజపుత్రు

నకుఁ = అర్జునునకు, శస్త్రంబౌ, శుచిత్వంబునన్ = అగ్నిరూపముతోన్, పల్కెన్.

తా. అర్జునునిచే, "నీయిష్టమగు నాహారమొసఁగెద" ననిపించుకొని యావలఁదనయగ్నిరూపమును బయలుపెట్టి ఖాండవవనమును జవిచూడఁ దలఁచెదనని పల్కెను.

"అన్నంబు." అన్నశబ్ద "మదభక్షణే" యను ధాతువున నిష్పన్న మగుటచే నాహారవాచకమగుచున్నది.

యజన, యాజనా, ధ్యయ, నాధ్యాపన, దాన, ప్రతిగ్రహములనెడి షట్కర్మాధికారము బ్రాహ్మణునకుఁగలదు. ఈకారణముననే ప్రతిగ్రహార్థి యగు నగ్ని బ్రాహ్మణవేషము దాల్చెను.

ఉత్సాహ. ఈవిధమునఁ బల్కి మఱియు నిట్టు లనియె నట్టికాం
తాౘవిధి కొకవిఘ్న మిపుడు కలదు నిన్ను నారయం
గా మునివి రణాధికారమునకుఁ దగుదువే
తావదర్థగతియు మున్నె దలఁచినాఁడ నామదిన్. 105

రామాయణ. ఈవిధమునన్, పల్కి = లక్ష్మణుఁ డిట్లు పలికి, మఱియున్, ఇట్టులనియెన్ = ఇంకను నిట్లు చెప్పెను, అట్టికాంౘవిధికిన్ = నీవట్లుయుద్ధముకోరుటకు, ఒక విఘ్నము, ఇపుడుకలదు = ఒకవిఘాత మిప్పుడ కల్గియున్నది, విను, నిన్నున్, ఆరయంగా, మునివి = మహర్షివి, ఆ,రణాధికారమునకున్ = యుద్ధముసేయునట్టి యాయధికారమునకు, తగుదువే, [మహర్షివగుటచేఁ దపముసేయు నధికారముగలదుగాని క్షత్రియుని వలెనీకు యుద్ధాధికారము లేదనిభావము.] మున్నె, ముందే, నామదిన్ = నామనస్సునందు. తావదర్థగతియున్ = అంతటి కార్యరీతిని, తలఁచినాఁడన్ = తలపోసితిని.

తా. లక్ష్మణుఁ డిట్లుపల్కి మరల నిట్లనెను. నీయీ యుద్ధాపేక్షకొకవిఘాతముగలదు. నీవు మహర్షివగుటచే నీకుఁ దపము సేయుట యం

దధికారముమాత్రమున్నదికాని మావలె యుద్ధాధికారములేదు. ఈ విషయము నేనుమున్నే యాలోచించితిని.

భారత. ఈ విధమునన్, పలికి, మఱియున్, ఇట్టులనియెన్, అట్టి కాంక్షావిధికిన్ = అట్టిఖాండవదహనేచ్ఛకు, ఇపుడు ఒక విఘ్నము, కలదు, వినుము, నిన్నున్, అరయంగాన్ = విచారింపఁగా, నివారణాధికారమున కున్, తగుదువు = ఆ విఘ్నమునాఁపుటకుఁ జాలుదువు, ఏతావదర్థగతి యున్ = ఈవిషయమంతయును, నామదిన్, మున్న, తలఁచినాఁడన్.

తా. అగ్నియిట్లు పల్కి మఱియు నిట్లనెను. నాయీ ఖాండవ దహన ప్రయత్నమునకొక విఘాతముగలదు. దానిని నీవు నివారింపఁగలవు. ఈవిషయము మున్నే నేనాలోచించినాఁడను.

గీ. వఱలునచ్యుతసఖ్యాతిఁవర్ణి తాతు
లప్రదీప్తి నిట్లలరునీవిప్రభావ
మెందుఁ బెట్టనికోటగానెసఁగుచుఁ గడఁ
జేర్తువస్మన్మహాశరాజితనిరూఢి. 106

రామాయణ. వఱలు=ప్రసిద్ధమైన, అచ్యుత = స్థిరమగు యోగముచే, సఖ్యాతి = కీర్తితోఁగూడిన, వర్ణితా=బ్రహ్మచారిత్వముయొక్క, అతుల = పాటిలేని, ప్రదీప్తిన్ = తేజముచే, ఇట్లు, అలరు, నీవిప్రభావము = బ్రాహ్మణత్వము, ఎందున్, పెట్టని కోటగాన్, ఎసఁగుచున్ = రక్షకముగా నొప్పుచు, అస్మత్........ ..నిరూఢిన్ - అస్మత్ = మాయొక్క, మహాశర = గొప్పబాణములయొక్క, అజితనిరూఢిన్ = జయింపరాని ప్రసిద్ధిని, అప్రతిహత ప్రసిద్ధిననుట. కడచేర్తువు = అతిక్రమింతువు.

తా. బ్రహ్మచర్యముచేఁ బ్రకాశించు బ్రాహ్మణత్వము నీకుఁ బెట్టని కోటయై యొప్పుచుండ మాయప్రతిహతమగు శరశక్తినిఁ దిరస్కరింతు వేమో ? నీవు బ్రాహ్మణుఁడ వగుటచే నీతోయుద్ధమాడ సంశయించు చున్నారము.

భారత. ఏఱలు = ఒప్పుచున్న, అచ్యుత = కృష్ణునితోడి, సఖ్య = స్నేహమున అతివర్ణిత = మిక్కిలి వర్ణింపఁబడిన, అతుల = పాటిలేని, ప్రదీప్తిన్, ఇట్లు, అలరు=సంతోషించుచున్న, నీవు,ఇప్పి)భావము=మహిమ, ఎందున్, పెట్టనికోటగాన్, ఎసఁగుచున్, ఒప్పుచు, అస్మత్ = మా యొక్క, మహాశ = గొప్ప యాశయందలి, రాజిత, నిరూఢిన్ = ప్రకాశించుచున్న నేర్పును, కడచేర్తువు=సఫలము సేయుదువు.

తా. శ్రీకృష్ణుని స్నేహమున మహాప్రభావవంతుఁడవగు నీవు నాయపేక్షం బూర్తిగావింపఁగలవు.

"నీవిప్రభావంబ" సుస్థలమునఁ గొందఱునీ+వి+ప్రభావమని పదచ్ఛేదమగునని యభిప్రాయపడెదరు. అదిక్లిష్టముగా నున్నది. ముద్దరాజు రామన్న నీవు+ఇప్పి)భావమని పదచ్ఛేదము గావించెను. అదియు నవిచారితమగు నదియే. శ్లేషార్థ సంఘటనమునకై రామాయణార్థమున నీవిప్రభావమనియు, భారతార్థమున నీవు+ఇప్రభావమని ద్విత్వరహితముగాను గావింపనగును, ఇదియే సహృదయ హృదయంగమమగును. అసంయుక్త హల్లునకే కాని సంయుక్త హల్లునకు ద్విత్వము గలుగదు. అప్పుడు నీవు, అనునది కర్త యగును. "అనచిచ" అను సూత్రమువలన ద్విత్వ సంపాదించుకొనవలయు నంతటి నిర్బంధము నిటఁ గలుగదు.

ఉత్సాహ. ఎన్న నేవరించునరసమిన్మహావనంబులో
నన్నగారి కినిసినన్ ఘనాతిచండకాండ వృ
ష్టి న్నలంపవచ్చుజగదజేయ దండనుండుమా
యన్న బ్రాహ్మణునకు విరచితాంజలి యగుభక్తితోన్.

రామాయణ. ఎన్న నే=ప్రసిద్ధమగునట్లుగానే, వరించు=నీవు స్వీకరించునట్టి, వరసమిత్ = శ్రేష్ఠమయిన యుద్ధమనెడి, మహ = ఉత్సవము యొక్క, అవనంబులోన్ = పోషించుటయందు, ఆ నగారి, కినిసినన్ = అయింద్రుఁడు కోపించి యెదుర్కొన్నను, ఘన = దట్టములు, అతిచండ =

మిగుల తీక్ష్ణములును, అగు, కాండవృష్టికి=బాణవర్షముచేత, నలంపవచ్చు= నలంచివేయఁజాలు, జగత్, అజేయ = జగత్తునందలివారిచే జయింపఁగాని దండనుండు = దండనీతి గలవాఁడు, మాయన్న = నాయన్న యగు శ్రీ రాముఁడు, బ్రాహ్మణునకున్ = విప్రునకు, భక్తితోన్, విరచితాంజలి యగున్ = చేయఁబడిన నమస్కారము గలవాఁడగును. నమస్కరించు నని భావము.

తా. నీ వపేక్షించినయుద్ధమును బోషించుటలో మాయన్న దేవేంద్రు నంతటి వాఁ డెదుర్కొన్నను వెనుదీయక ఘోరాస్త్రముల వర్షింపఁ జేయును. జగమునందలి వారిచే జయింపఁ గానిదండనీతిని గలవాఁడయ్యు నీవు బ్రాహ్మణుఁడవు; కావున భక్తితో నమస్కరించును.

"బ్రాహ్మణునకు విరచితాంజలియగు" ననుటకు "గవాగ్రజన్మ నామగ్రే న శూరో గోష వానయ" మ్మని రామవాక్యము.

భారత. ఎన్నన్ = తలపోయఁగా, నేపరించు = నేను కోరునట్టి, పర=శ్రేష్ఠమయిన, సమిత్=సమిధలుగల, మహావనంబులోన్ = ఈఖాండవ వనము నందు, అనగారి, కిరీటిన్ = అయింద్రుఁడు కోపము చెందిన, ఘనా...వృష్టిన్-ఘన = మేఘములనంచి, అతిచండ = మిగుల దట్టమయిన, కాండవృష్టిన్=జలవర్షముచే, నలంపవచ్చున్=హింసింపనచ్చును, జగత్+ అజేయ=లోకముచే గెలువఁబడఁదగనివాఁడా ? దండన్, ఉండుమా=నా సమీపముననుండుమీ, అన్నన్ = అనఁగా, బ్రాహ్మణునకున్ = బ్రాహ్మ ణాకృతిని బొందినయగ్నికి, [అర్జునుఁడు] విరచితాంజలియగు భక్తితోన్= నమస్కారముతోఁ గూడినభక్తితో.

తా. ఓజగదజేయ! నేనీ వనఁబునందలి యోషధులు మొదలగు వాని సమిత్తులంబోలెఁ జేసికొనఁగా, నింద్రుఁ డలిగి మేఘములవలన వర్షము గురిపించి నన్నలయింప వచ్చును. కనుక, నట్టివిఘ్న మొనఁగూడమికి నీవు నాయొద్ద నేయుండుమా! యనఁగాఁ గృతాంజలియై భక్తితో. ముందరి పద్యముతో నన్వయము.

స్రగ్ధర. ఆరాజన్యోత్తముం డి ట్లనుదితరభసుం
డై భవత్సత్వరవ్యా
హారం బిట్లోర్చియుంట న్యముగఁ గొనకు మా
తాన్నంగనాశుల్కతాదృ
క్సారోగ్రేష్వాస మిట్లశ్రమజితమగుటెం
చంగనాచేతి కాటం
క్రూరేష్వాసంబు లేదొక్కఁడు గలుగునె త
ద్ఘోరయుద్ధంబు సైఁపన్. 108

రామాయణ. ఆరాజన్యోత్తముండు = ఆరామచంద్రుఁడు, ఇట్లు, అనుదితరభసుండై = పుట్టనట్టి కోపముఁ గలవాఁడై, భవత్, సత్వరవ్యాహారంబున్ = నీయొక్క వేగముతోఁగూడిన మాటలను, ఇట్లు, ఓర్చియుంట= ఇటుల సైరించియుండుట, అన్యముగన్, కొనకుము=వేఱువిధముగాఁ దలఁపకుము, ఆత్మ+అంగనా = తనయిల్లాలికి,సీతకనుట. శుల్క=ఓలియయినట్టి, తాదృక్సార = అట్టిచేవగల, ఉగ్రేష్వాసము = శివధనువు, ఇట్లు అశ్రమజితమగుట, ఎంచంగన్ =ఇట్లు చులకనగా జయింపఁబడుటను, ఎంచఁగా, ఆచేతికిన్ = రాముని చేతికి, ఆటన్ = ఆడుటయందు, క్రూరేష్వాసంబు లేదు = ఘోరధనువొక్కటిలేదు, ఒక్కఁడు = ఒకధనువు, తత్ ఘోరయుద్ధంబు సైఁపన్ = ఆరాముని క్రూరమగుయుద్ధము నోర్చుటకు, కలుగునె= కలుగఁ గలదో ?

తా. నీవాక్యమువలన నుప్పతిల్లిన కోపము సైరించినందులకు శ్రీరాముని వేఱువిధముగ భావింపకుము. తనభార్య నోలిగా శివునిధనువును వించిపెట్టిన యీతని హస్తమునందుండుటకు మఱియొక ధనువున్నదో ? ఉండఁగలదో? భూతభవిష్యత్తులందును లేదనుట.!

వ్యాహారము = మాటయనుటకు "వ్యాహార ఉక్తిర్లపితమ్" - అనియమరము.

భారత. అరాజన్య+ఉత్తముఁడు = అయర్జునుఁడు, ఇట్లు అనుక్ = ఇట్లు చెప్పను, దితరభసుం డై = ఖండితమైన త్వరగలవాఁడయి, వేగపడక యనుట. భవత్సత్వర = నీవేగముతోఁగూడిన, వ్యాహారంబుక్, ఇట్లు ఓర్చియుంట = మాటలను వినియు నూరకుంట, అన్యముగక్, కొనకుము = వేఱొండుగ భావింపకుము, ఆత్మాంగనా = నాభార్యయగు ద్రౌపదికి, తుల్య = ఓలి రూపమగు, తాదృక్ = అట్టి, సార = సారమయిన, ఉగ్రేష్వాసము = క్రూరధనువు, ఇట్లు అశ్రమజితమగుట, ఎంచంగక్ = ఇట్లు శ్రమయేలేక జయింపఁబడుటను దలఁపఁగా, నాచేతికిక్, అటక్ = తాకునట్లుగా, క్రూరేష్వాసంబులేదు = గట్టివిల్లులేదు, (అట్లుండె నేని) తత్ ఘోరయుద్ధంబునైఁపక్, ఒక్కఁడు గలుగునె = ఒకఁడేనియుఁ గలఁడో ?

తా. అంత నర్జునుం డతని కిట్లనును. నీమాటలను వినియు నూరకుంటకుఁ గారణ మన్యముగాఁ దలఁపకుము. మత్స్యయంత్రభేదన పాటవము చెందిన నాచేతి కిచ్చోటఁదగినవిల్లొకటిలేదు. అట్టి దొండుండునేని, నాఘోర యుద్ధము నోర్చువాఁ డెవఁడు ?

ఒక్కటియనుట కొక్కండని వచ్చుటకు, "ఇప్పుడేను రాకుండ నొకండువచ్చి మఱియొండునే." అని పెద్దన ప్రయోగించెను.

సీ. అనుటయు నాతఁ డారాజనాథనరకుమా
రాగ్రణిఁ జూచి నీకీయాత్మయందు
నిటువంటితలఁ పున్న నిదిగో! మహాబలో
ద్దామంబు కమలేశదత్త మయ్యె
నాకేశచాపంబునకు నెక్కుడీగాండి
వం బగు భారతీవరుధనుర్మ
తల్లిక శేషోగ్రకతరగుణప్రౌఢిన
త్యధికంబు క్రమమున నన్యదేవ

గీ. ధృతము లైనవానిని గణుతింపనేల?
దీని నెక్కిడి నీభుజస్థేమఘనవి
జృంభణముఁ జూపు మని తనచేతివిల్లు
దృఢరణస్థితి నరదంబుఁ దెచ్చి యిచ్చె. 109

రామాయణ. అనుటయుఁన్ = ఇట్లు రామునికై లక్ష్మణుఁడు చెప్పఁగా, ఆజనవాథవరకుమారాగ్రణిఁన్, జూచి = ఆదశరథ మహారాజు యొక్క శ్రేష్ఠుఁ డైనపుత్రజ్యేష్ఠునిం జూచి, నీ యాత్మయందుఁన్ = నీచిత్తమున, ఇటువంటి తలంపున్నఁన్ = ఇట్టిపూజ్యభావ ముండునేని, ఇదిగో = ఇదో చూడుము. మహత్,బల+ ఉద్దామంబు = ప్రకృష్టమయిన బలమునకు స్థానమయినది, కమలా+ఈశదత్తము, అయ్యేఁన్ = విష్ణుమూర్తిచేత నీయఁబడెను. ఈ నాకేశ, చాపంబునకుఁన్, ఎక్కుడు = ఇంద్రుని ధనువుకంటెను శివుని ధనువుకంటెను నెక్కుడగునది. [ఇట నాకేశచాపంబునకుఁన్, ఈశచాపంబునకుఁన్ అని యన్వయము గావించుట రసవంతముగా నున్నది.] ఇదిగొప్పయైనది. ఈగాండీవము = ఈచాపము, ఆభారతీవరు ధనుర్మహిమకుఁన్ = ఆబ్రహ్మదేవుని శ్రేష్ఠమైన చాపముకంటెను, అశేష = మిగుల, ఉగ్రతరపాత్రికిచేత, అత్యధికంబు=మిగుల శ్రేష్ఠమయినది, అగుఁన్, క్రమమునఁన్ = అట్టిక్రమము వే, అన్యదేవధృతము లైన = ఇతరదేవతలచేత ధరింపఁబడిన, వానిని, గణుతింపనేల = ఏల లక్ష్యపెట్టవలెను? దీనిఁన్, ఎక్కిడి=ఇచ్చాపము నెక్కువెట్టి, నీభుజస్థేమఘన విజృంభణముఁన్ = నీభుజబలమువలని గొప్పదగు విజృంభణమును, చూపుమని = కనఁబఱచుమని, దృఢరణస్థితిఁన్ = దృఢ మయినరణములయందలి యునికినిగలదానిని, నరదంబుఁన్=నరుల చెదించు దానిని, చేతివిల్లుఁన్ = తనచేతిధనువును, తెచ్చి, యిచ్చెను.

తా. అట్టివచనములను విని పరశురాముఁడు రామునితో నిట్లనెను. "నీ పలినయట్లు చిత్తమునందు నీకాపూజ్యభావము గలదేని, నిదిగో చూడుము—

ఈధనుశ్శ్రేష్ఠము నాకు వారుణుని వలన నీఁబడెను. ఇది, బ్రహ్మరుద్రేంద్రాదుల చాపముల కంటెను పరమైనది. దీని కితరదేవతలచాపము లెంత మాత్రమును సాటిగావు. దీని నెక్కు వెట్టుటచేత నీభుజసారమును వెలయింపుము, చూతము" అనుచుఁ దనచేతి ధనువును, నరులను ఖండించు దానిని దృఢమైనరణస్థితి గలదానిని దెచ్చియిచ్చెను.

భారత. అనుటయుఁన్ = ఇట్లు అర్జునుండు చెప్పఁగా, అతఁడు = ఆయగ్నిదేవుఁడు, ఆజననాథవరకుమారాగ్రణిం జూచి = ఆరాజపుత్రశ్రేష్ఠుఁడయినయర్జునుంజూచి, నీయాత్మయందున్, ఇటువంటితలంపున్నన్ =నీమనస్సునం దిట్టితలంపుండెనేని, ఇదిగో,మహాబలోద్దామంబు,నాకున్ కమలేశ= జలాధిపతియగువరుణునిచే, దత్తమయ్యెన్ =ఈఁబడెను. ఈగాండివంబు=ఈ గాండీవమను పేరుగలది, ఈశచాపంబునకున్ =రుద్రచాపముకంటెను, ఎక్కుడు = శ్రేష్ఠమైనది, అశేష = అధికమగు, ఉగ్రతర = ఘోరతరమగు, గుణప్రౌఢిన్ = నారియొక్క గొప్పఁదనముచే, భారతీవరుధనుర్మతల్లికిన్ = బ్రహ్మయొక్కచాప శ్రేష్ఠమునకంటెను, అధికంబగున్, క్రమమునన్ = ఈవరుసనుబట్టి, అన్యదేవ ధృతములైన=ఇతరదేవతలచే ధరింపఁబడ్డ, వానిని = చాపములను, గణుతింపనేల = ఏల లెక్కపెట్టవలయును? దీనిని, ఎక్కిడి = ఈచాపమునందలి బాణముల సంధించి, నీ భుజస్థేమఘనవిజృంభణముం, జూపుము=నీభుజబలమువలని దట్టమైన విజృంభణమును గనఁబఱచుము. అని, తనచేతివిల్లు = తనయొద్దనుండిన గాండీవమును, దృఢరణస్థితిన్ = దృఢమైన రణములయందలి మెలఁకువలఁగల దానిని, అరదంబున్ = రథమును, తెచ్చియిచ్చెన్.

తా. అర్జునుం డట్లు చెప్పఁగా నగ్నియు, "నీతలఁపట్లుండు నేని దె యీగాండీవ మనుదివ్యధనువును బుచ్చుకొనుము. ఇది వరుణదేవుని వలన నా కియ్యఁబడెను. బ్రహ్మేంద్రాదుల చాపములకంటెను శ్రేష్ఠ

మయినది. దీని నెక్కుపెట్టి నీ భుజవిజృంభణమును వెలయింపుము. అని తనచేతివిల్లును, దృఢరణస్థితిగల రథమును దెచ్చియిచ్చెను.

గుణము=నారి యనుటకు "మౌర్వీ జ్యా శింజినీ గుణః" అని యమరము.

మ. నుతశక్తిన్నృపసూనుఁ డట్టిధనువుల్ నోమ్ పెట్టియైంద్రాయుధో
ద్ధతిపాథోదనిరాసి యయ్యె నపుడాతం డుర్ సముద్వేగయు
క్తతఁ గీర్తించి కృతావృథాగ్రగహతదస్త్రాక్రామితస్వర్గప
ద్ధతియై యిష్టమహావనీచరతఁ జెంతం గాంచి పొంగెన్మదిన్.

రామాయణ. నుతశక్తిన్ = పొగడఁదగిన సామర్థ్యముచేత, నృపసూనుఁడు=రామచంద్రుఁడు, అట్టిధనువున్ =అంతటిమహాచాపము, మోపెట్టి= ఎక్కుపెట్టి, అపుడు, ఐంద్రాయుధ+ఉద్ధతిన్, పాథోద = ఇంద్రచాపంబుయొక్క సమున్నతితోడిమేఘమును, నిరాసి యయ్యెన్=ధిక్కరించు వాఁడాయెను. [తేజోవంతమగు నాచాపము పూనిన పిదప నీలమేఘశ్యాముఁడగు శ్రీరామ చంద్రమూర్తి ఇంద్రచాపముతోఁ బ్రకాశించు నీలమేఘమును ధిక్కరించు వాఁ డయ్యె ననుట] ఆతండున్ = ఆపరశురాముఁడును, సముద్వేగ యుక్తతన్ = భయవేగముచేత, కీర్తించి = స్తుతించి. కృత = చేయఁబడిన, అవృథా = వ్యర్థముగాని, గ్రహ = ఎక్కుపెట్టుటను గల, తత్ + అస్త్ర = ఆబాణముచేత, ఆక్రామిత = ఆక్రమింపంబడిన, పోఁగొట్టఁబడిన యనుట. స్వర్గపద్ధతియై = పుణ్యలోకములమార్గము గలవాఁడయి, ఇష్టమహావనీచరతన్ = ఇష్టమహాప్రపంచమునం దనకిచ్చ వచ్చుచోటులఁ దిఱుఁగులాడుటకు, కాంచి, మదిన్, పొంగెన్ = చిత్తమునందు సంతసించెను.

తా. రామచంద్రుఁడు నుతశక్తియై తా నాతేజోవంత మగుచాపము నెక్కు వెట్టుచో, నింద్రచాపముతోడి కాఱుమేఘముసొరును ధిక్కరించు

వాఁడయి మెలఁగెను. అట్టియెడ శ్రీరాములధనుస్సంధానమునకు గుఱి లేక పోవుట తగదని యందులకుఁ దన పుణ్యాగతుల ఖండించు నట్లుచేసి, తనయిచ్ఛకు వచ్చుచోటుల మెలఁగుట కుత్తరవు చెంది ముదితహృదయుఁడై యరిగెను.

భారత. సుతశక్తిక్ = పొగడఁదగినసామర్థ్యముతో, నృపసూనుఁడు = అర్జునుఁడు, అట్టిధనువుక్, మోపెట్టి = గొప్పమహిమగల యట్టి యా గాండీవమెక్కుపెట్టి, ఐంద్రాయుధోద్ధతి = ఇంద్రునియాయుధములయుద్ధతి తోఁగూడిన, పాథోద = మేఘములను, నిరాసియయ్యెక్ = పోఁగొట్టినవాఁడాయెను. [ఇంద్రుఁడు ప్రయోగించిన మేఘములవలె దట్టములయిన వజ్రాద్యాయుధములను నిరసించినవాఁడయ్యె ననుట.] అపుడు = అట్టియెడ, అతఁడుక్ = ఆయగ్నియును, సముత్ = సంతోషముతోఁగూడిన, వేగ = సంభ్రమముతోడనైన, యుక్తితక్ = కూడికచేత, కీర్తించి = అర్జునుని పొగిడి, కృత = చేయఁబడిన, అవృథా = వ్యర్థముకాని, అగ్రహా = కోపముగల, తత్ = ఆయర్జునునియొక్క, అస్త్రి = బాణములచేత, క్రాంతస్వర్గపద్ధతియై = కప్పఁబడిన యాకాశమార్గము గలవాఁడయి, [అర్జునుఁ శరపఞ్జరమును గలవాఁడై యనుట] ఇష్ట = ఇంపగునట్టి, మహావనీచరతక్ = ఖాండవవనసంచారమున, చెందంగాంచి = పొందఁగలిగి, మదిక్ = చిత్తము నందు, హర్షించెను.

తా. ఇట్లు దివ్యచాపమ్మును అర్జునుండు పొంది, దట్టముగాఁ బ్రయోగించి యింద్రునిబాణములను ఖండించివైచుచు ఆకాశపథంబునఁ బఞ్జరమును గట్టెను. అగ్నియును యథేచ్ఛావిహారమును సల్పి యాఖాండవమునందు హర్షస్థితిం జెందెను.

"వేగము" సంభ్రమము అనుటకు - "సమౌ సంవేగసంభ్రమౌ" అని యమరము.

గీ. తనకనలుచేష్ట లంతభీతిని ఘటింప
మగిడి శరణన్నఁదన్మహిమయుఁ దదాత్త
తన్మహాదైన్యము గణించిదయ దలిర్పఁ
గాఁచెనేమన ! నప్పుడారాంచపట్టి. 111

రామాయణ. అంతన్ = అంతట, తనకనలుచేష్టలు = [రాముఁడు] తనకోపవిచేష్టితములు, భీతిన్ ఘటింపన్=పరశురామునకు భయముగలుగఁ జేయ, మగిడి=మళ్లి, శరణు+అన్నన్=రక్షింపుమనఁగా, తత్ + మహిమ యున్ = ఆపరశురామునిప్రభావమును, తత్+ఆత్తతన్ = ఆతని శ్రేష్ఠత్వ మును, తత్, మహాదైన్యమున్=అతనియధికమగు దీనభావమును, గణించి= తలఁచి, దయ తలిర్పన్ = కరుణయతిశయింపఁగా, ఏమనన్ = ఏమి చెప్పను? అప్పుడు, ఆరాచపట్టి, కాఁచెన్.

తా. శ్రీరామునికోప విచేష్టితములం జూచి భీతి చెంది పరశు రాముఁడు మరల శరణుపొందఁగా దయగలిగి, యాతని దీనత్వమును గణించి రక్షించెను.

ఇటుఁ బరశురాముని రక్షించుట దీనుఁడను భావమునమాత్రమే కాక వేదార్థ పరిజ్ఞానవంతుఁడగుటచే నీతఁడు గొప్పవాఁడగునని తలఁచుటయు నగును. "శ్రుతంతు సర్వేభ్యో గరీయః." అను గౌతమ ధర్మ సూత్రమే యిందులకుఁ బ్రమాణము.

భారత. తనకున్=[మయుఁడు] తనకు, అనలుచేష్టలు = అగ్నిదేవుని కార్యములు, అంత,భీతిన్, ఘటింపన్=చాలభయము గలిగింపఁగా, తత్+ మహిన్ = ఆఖాండవవనప్రదేశమునందు, మయున్ = మయుని, తదా = అప్పుడు, ఆత్త = పొందఁబడిన, తత్ = ఆ మయునియొక్క, మహా దైన్యమున్, గణించి=గొప్పదీన భావము చూచి, దయతలిర్పన్ = కరుణ

యతిశయింపఁగా, అప్పుడు, ఆరాచపట్టి, కాఁచెన్, ఏమనన్ = అతని యాశ్రిత వాత్సల్యమేమి చెప్పను.

తా. అఖండపవనమునం దున్నమయునకు అప్పటియగ్ని విచేష్టితములు ప్రాణభయమును గలిగింపఁగా నతఁడు మిగుల దీనభావమున శరణు వేఁడెను. అట్టియెడ నర్జునుఁడతని రక్షించెను.

ఉ. క్రుక్కక భూమిభృత్కులవిరోధి కడంక నడంచి యిమ్మెయిన్
తక్కక హేతిధారి కుచితంబగు కార్యము నిర్వహించి పెం
పెక్కుడు గాఁగ నాత్మపురి కేఁగె హరిన్నుతకీర్తిఁ గూడి న
ల్దిక్కులఁ బిక్కటిల్లుచుఁ దనర్చు ప్రతాపవిజృంభణంబునన్.

రామాయణ. క్రుక్కక = అలయికఁ జెందక, భూమిభృత్కుల విరోధి = రాజులకుఁ బగవాఁడగు పరశురామునియొక్క, కడంకన్ = యత్నమును, ఇమ్మెయిన్ = ఈలాగున, అడంచి = అణఁచి, తక్కక = అంతఁబోక, హేతిధారికిన్ = శస్త్రమును ధరించినవానికి, ఉచితంబగు కార్యము = తగినపని, [రాజు దానొరులజయించునపుడు శాసించులాగున నింక నే క్షత్రియునితోడను బోరంగడఁగుమని శాసించి యని భావము.] నిర్వహించి, పెంపు, ఎక్కుడు, కాఁగన్ = గొప్పతనము అతిశయించునట్లు. హరిత్, నుతకీర్తిన్, కూడి = దిక్కులయందుఁ బొగడఁబడినకీర్తిగలిగి, నల్దిక్కులన్ = నాల్గుదిక్కులయందును, పిక్కటిల్లుచున్, తనర్చు = అతిశయముతో నొప్పియుండు, ప్రతాప విజృంభణంబునన్ = పరాక్రమాతిశయముతో, ఆత్మపురికిన్, ఏఁగెన్ = తననగరమగు నయోధ్యకుం బోయెను.

తా. అట్లు రాముఁడు పరశురామునిగర్వము భంగపఱచి దిక్కుల యందలి తనకీర్తిప్రతాపములు పిక్కటిలునట్లుగా పెంపొందుచు నయోధ్య కుం బోయెను.

హేతి = శస్త్రమనుటకు.- "రవేరర్చిశ్చశస్త్రంచ వహ్నిజ్వాలాచ హేతయః" అని యమరము.

భా॥ రత. స్రుక్కక = అలయక, భూమిభృత్కులవిరోధి = పర్వత పంక్తులకు శత్రుఁడయిన యింద్రుని యొక్క, కడంకన్, అణంచి=ప్రయత్నములను రూపుమాపి, ఇంద్రుని యుద్ధపరాఙ్ముఖునిగాఁ జేసి యనుట. ఇమ్మెయిన్, తక్కక = ఇట్లు వదలక, హేతిధారికిన్ = జ్వాలలను ధరించిన యగ్నికి, ఉచితంబగు కార్యమున్, నిర్వహించి = తగినకార్యమును నేర్పఱచి, [అగ్నిచే ఖాండవవన దహనమునుగావించి యనుట.] పెంపెక్కుడు గాఁగన్ = గౌరవ మతిశయిల్లునట్లు, నుతకీర్తిన్ = స్తుతింపఁబడిన కీర్తిం గల, హరిన్ = కృష్ణుని, కూడి = కలిసి, నల్దిక్కులన్, పిక్కటిల్లుచున్, తలిర్చు ప్రతాపవిజృంభణంబునన్, ఆత్మపురికిన్ = తనపురియగు నింద్రప్రస్థనగరమునకు, ఏఁగెన్, = పోయెను.

తా. అర్జునుఁడిట్లు దేవేంద్రుని యుద్ధప్రయత్నములనుమాన్చి, యిచ్చవచ్చినట్లు అగ్నిని ఖాండవభక్షకునిగాఁ జేర్పఱచి శ్రీకృష్ణునిఁగూడి తనపురియగు నింద్రప్రస్థమున కేఁగెను.

భూమిభృత్తు = కొండ యనుటకు "భూభృద్భూమిధరే నృపే" అని-యమరము.

సీ॥ సర్వేశ్వరుఁడు కృష్ణుఁ డసఖ్యాతి మహిమకు
నెంతపెంపును దగు నేమిచెప్ప!
దక్షుఁ డానరుఁ డట్లు దనర రాక్షసకుల
తక్షకుం డతివిచిత్రతరశక్తి
మయుఁ డతిక్రాంతవాగ్జ్ఞానసభావిశే
షంబు వైవస్వతసంతతికిని
దనదులీలోదయంబున నుపాదించియుఁ
బెట్టె నత్యంతంబుఁ బెంపుసొంపు

గీ. సంఘటిల మరుచ్ఛ్రితమఖసంతతుల క
తఁడు గదా దండమును సమిద్ధజయనాది
కంబు వరము నిచ్చెను హరికింబడరఁగఁ
బలుదెఱంగుల నార్యులు ప్రస్తుతింప. 113

రామాయణ. సర్వేశ్వరుఁడు, కృష్ణ=విష్ణుదేవునియొక్క, సఖ్యాతి మహిమకున్=ఖ్యాతితోఁగూడినమాహాత్మ్యమునకు, ఎంత పెంపును, తగున్= ఎంతగౌరవమును దగియుండును, ఏమి చెప్పన్ = ఏమని వర్ణింపనగును? దక్షుఁడు, ఆనరుఁడు = సమర్థుఁడయిన యారాముఁడు, రాక్షసకుల తక్షకుండు = రాక్షససమూహములను శాసించువాఁడు, అతివిచిత్రతరశక్తిమయుఁడు = మిక్కిలి యాశ్చర్యకరమగు శక్తిప్రాచుర్యము గలవాఁడు, అట్లు తనరన్ = అట్లొప్పఁగా, అతిక్రాంత వాఙ్మనస = అవాఙ్మనసగోచరమైన, భాని శేషంబు = శోభాధిక్యము, వైవస్వతసంతతికిని = సూర్యవంశమునకు, తనదు లీలోదయంబునన్ = తనక్రీడామాత్రమగు నవతారము చేత, ఉపాదించియున్ = కలిగించియును, పెట్టెన్, మరుచ్ఛ్రిత = దేవసమూహములకును, మఖసంతతులకున్ = యాగసమూహములకును; అత్యంతంబు, పెంపు, సొంపు, సంఘటిలన్ = మిగుల గౌరవమును సంతోషమును గలుగఁగా, అతఁడు గదా = ఆరామచంద్రుఁడే కద! దండ = ఆధారము, మును=పూర్వము, సమిద్ధజయనాదకంబు = యుద్ధవిజయము మొదలగునట్టి, వరమున్, హరికిన్ = ఇంద్రునకు, ఇంబు, అడరన్ = ఇంపొందఁగా, ఆర్యులు = పెద్దలు, పలుతెఱంగులన్ ప్రస్తుతింపన్ = అనేక విధములుగా పొగడఁగా, ఇచ్చెన్.

తా. విష్ణుమూర్తియగు రాముని మహిమావిశేషము వాఙ్మనస మగోచరమైనది. ఆ సర్వశక్తి తనయుదయముచేత రాక్షస వినాశమును నిజవంశమునకు గౌరవమును దేవతలకును యాగములకును గౌరవమును గలిగిం

చెను: ఆర్యులౌననునట్లు తొల్లి యింద్రునకు యుద్ధజయాదిక మయిన వరి మొసంగెను.

జయనము = జయమనుటకు "జయనేజయః" అని యమరము.

భారత. సర్వేశ్వరుఁడు, (అగు) కృష్ణు = శ్రీకృష్ణమూర్తియొక్క, సఖ్య = స్నేహముపలని, అతిమహిమకుఁ = అధిక మాహాత్మ్యమునకు, ఎంత పెంపునఁదగుఁ = ఎంతగౌరవమును దగియుండును, ఏమని చెప్పఁ = ఆగౌరవమెంతయని వర్ణింపనగును? దక్షుఁడు = సమర్థుఁడు, అనరుఁడు = ఆ యర్జునుఁడు, అట్లుతనరఁ = హరికృపావిశేషమున నట్లొప్పుచుండఁగా, రాక్షసకుల తిలకుండు = రక్కసులయొక్క వన్నెదంగి, అతివిచిత్రతరశక్తి = మిక్కిలి యాశ్చర్యయుక్తమగు సామర్థ్యముగలవాఁడు, మయుఁడు = మయాచార్యుఁడు, అతిక్రాంతి = అతిక్రమింపఁజడిన, వాక్+మాన=మాటల యొక్క పరిమాణముగల, సభావిశేషంబు = ఒకరమణీయమైన సభను, పైఐ స్వతసంతతికిని = యమపుత్రుఁడయిన ధర్మరాజునకును, తనదులీలో దయంబునఁ, ఉపాదించియుఁ = తనశిల్పనైపుణ్యమున నొనర్చి, "అత్యంతంబు పెంపు సొంపు సంఘటిలఁ = మిగుల పెద్దయాకృతియును అందమును గలుగునట్లు, గవ = గుదియును, దండము = దండమును, మరుత్ శతమఖసంతతులకుఁ = వాయువుయొక్కయు నింద్రునియొక్కయు పుత్రులగు భీమార్జునులకు, హరికిఁ = కృష్ణునకు, సమిద్ధజయ = యుద్ధముల యందలి జయమును గలిగించు, నాది = ధ్వనినిగల, కంబువరముఁ = శంఖశ్రేష్ఠమును, అతఁడు = ఆమయాచార్యుఁడు, ఇంబు అడరఁగఁ, ఆర్యులు పలుతెఱంగులఁ బ్రస్తుతింపఁ, ఇచ్చెను.

తా. కృష్ణమూర్తి సఖ్యముపలనిమహిమ నేమని చెప్పవచ్చును. అట్లు ఆ యర్జునుఁ డొప్పుచుండఁగా, నతనిశరణు పొందిన మయాచార్యుఁడు తన శిల్పనైపుణి వెల్లడియగునట్లొకసభను నిర్మించి, ధర్మజునకుఁ దెచ్చి

యిచ్చెను. అర్యులు నుతించునట్లు గదాదండశంఖములను భీమార్జునులకును గృష్ణునకు నిచ్చెను.

“తక్షకుఁడు.” సర్పమునకును వడ్రంగికి నీపేరుగల్గుటకు ; “తక్షకో నాగవర్ధక్యోః.” అనియమరము.

“కంబు.” శంఖమనుటకు ; శంఖస్స్యాత్కంబుర స్త్రియాం.” అని యమరము.

“ఇంబడర.” సంతోషమతిశయించుట యనుటకు. “ఇంబడరఁగా భజనసంబులకడన్ ” అని కవిజనాశ్రయము.

చ. అది యటులుండె నట్టిసభయానతశత్రుదయాళుఁ డాజిభా
స్వదరిహృదంతవహ్నిసమకీర్తిసుతుం డఖిలోకభాగ్యసం
పద లమరంగఁ జేకొని శుభస్థితిఁ దమ్ములుఁ దాను నంతయున్
బొదల శుచిత్వశాలి యజపుత్త్రుఁడు మిక్కిలి సంతసిల్లుచున్.

**రామాయణ.** అది యటులుండెన్ = అట్లుండఁగా, అట్టి, సభయ = భీతితోఁగూడిన, ఆనత = నమ్రులయిన, శత్రు = విరోధులయెడ, దయాళుఁడు=కృపఁగలవాఁడు, ఆజిన్ = యుద్ధమునందు, భాస్వత్=ప్రకాశించుచున్న. అరి = శత్రువులకు, హృత్, అంతవహ్నిసమ, కీర్తి = హృదయము నందురగులుచున్న యగ్నికి సమమైనయునికి గలవాఁడు. [అయిన]సుతుండు= పుత్రుఁడు, రాముఁడనుట. అఖిలోక = లోకమునకుమీఱిన, భాగ్యసంపదలు, అమరంగన్=భాగ్యలక్ష్ములు ఒప్పుచుండఁగా, చేకొని=పొంది, శుభస్థితిన్, తమ్ములున్ = లక్ష్మణభరతశత్రుఘ్నులును, తానున్ రాముఁడును, పొదలన్ = వర్ధిల్లుచుండఁగా, శుచిత్వశాలి = నైర్మల్యముగలవాఁడు, అజపుత్రుఁడు = దశరథుఁడు, మిక్కిలి, సంతసిల్లుచున్ = మిక్కిలి యానందించుచు.

తా. అది యటులుండఁగా శ్రీరామచంద్రుఁ డెట్టిశత్రువేని శరణ నినఁ గనికరించువాఁడును గర్వించిన వైరుల కగ్నివంటివాఁడునునై యతి లోక సుఖముల ననుభవించుచుఁ దమ్ములుఁ దాను వెలయుచుండఁగాఁ దదీయ జనకుండయిన దశరథమహారాజు మిక్కిలి యానందించుచు.

"అతిలోక" "అత్యాదయఃక్రాంతాద్యర్థే ద్వితీయా." అని ద్వితీయా సమాసము.

భా. ప్ర. అది యటులుండఁగ, అట్టిసభ = అంతటిమహిమాన్వితమైన సభయందు, [ఇట సభాశబ్దము జడవాచకము గనుక దీనిద్వితీయకుఁ బ్రథమ యయ్యెను.] అనతశత్రుదయాళుఁడు = నమ్రులయిన విరోధులయెడ కృపాళుఁడు, ఆజిక్ = యుద్ధములయందు, దీవ్యత్ = ఒప్పుచున్న, అరి=శత్రువులకు హ్యాత్ = మనస్సులయందు, అంతవహ్ని = ప్రళయాగ్నిం బోలినవాఁడు, సమస్త సుతుండు = యమునకుఁ బుత్రుఁడగు ధర్మరాజు, అతిలోక భాగ్యసంపదలు, అమరంగన్ = లోకాతీతములగు భాగ్యసంపదలొప్పుచుండఁగా, చేకొని = పొంది, [దీనికిఁ గర్మ సభయగును.] శుభస్థితిన్ = శుభస్థితిని, తానును, తమ్ములును = తానును తమ్ములగు భీమార్జున నకులసహదేవులును, ఎంతయున్, పొదలన్ = మిగులవృద్ధిపొందుచుండఁగా, శుచిత్వశాలి = పవిత్రతాయుక్తుఁడగువాఁడు, అజపుత్రుఁడు = బ్రహ్మ మానసపుత్రుఁడగు నారదమహాముని, మిక్కిలి సంతసిల్లుచున్ = మిగుల నానందించుచును.

తా. అట్లుండఁగా నామయసభయందుఁ దానును దమ్ములునుగా నానతశత్రుపాలకుఁడును నధికరశత్రుహృదంతరాగ్నియునగు ధర్మరాజు లోకాధిక భాగ్యములఁ బొదలుచుండ నారదమహర్షి మిగుల సంతసిల్లుచును [క్రిందిక్రియతో నన్వయము.]

"అనతశత్రు దయాళుఁడు." ఇట దయాశబ్దము పైనాళుచ్ ప్రత్యయము వచ్చుటకు; "స్పృహి, గ్రహి, పతి, దయి, నిద్రా, తంద్రా శ్రద్ధాభ్యః ఆళుచ్." పాణినీయము.

క. చనుదెంచి సర్వదిగ్వ
  ర్తనఁ దేజము మెఱయఁ దత్పురస్థితిఁ బెంపొం
  దె నతం డనుజులు దానుం
  బూనరించుమహోపచారకముల రంజిలుచున్. 115

రామాయణ. అతఁడు చనుదెంచి = అట్లు దశరథుఁడు వచ్చి, సర్వదిక్ వర్తనన్ = అన్నిదిక్కులయందును వ్యాప్తమగుటచేత, తేజము మెఱయన్ = ప్రతాపము శోభిల్లఁగా, తత్పురస్థితిన్ = ఆ యయోధ్యానగరవాసముచేత, అనుజులు తానున్ = భ్రాతృయుతుఁడై రాముఁడు, పూనరించుమహత్ + ఉపచారములన్ = చేయు గొప్పయుపచారములను, రంజిలుచున్ = రాజిల్లుచును, పెంపొందెన్ = ఉన్నతిని గనెను.

తా. అట్లు దశరథమహారాజు నిజపురికి వచ్చి తనపుత్రులు చేయు మహోపచారములకుఁ జిత్తము రంజిల్లఁగాఁ బెంపొందుచుండెను.

భారత. సర్వదిగ్వర్తనన్ = అన్నిదిశలయందును వెలయుట చేత, తేజము మెఱయన్ = తేజస్సు శోభిల్లఁగా, అతఁడు చనుదెంచి= ఆ నారదమహర్షి వచ్చి, అనుజులున్ తానున్ = తమ్ములును తానును [పాండవులు,] పూనరించు మహోపచారములన్ = చేయునట్టి యధికోపచారములచే, రంజిలుచున్ = సంతసిలుచును, తత్పురస్థితిన్ = వారికెదుట, పెంపొందెన్ = ఒప్పెను.

తా. అన్నిదిక్కులయందును తేజము వ్యాపించునట్లు నారదుండు వచ్చి యాధర్మజాదులు చేయు మహోపచారముల కానందమొందుచువారి యెదుట సుఖాసీనుఁడై యొప్పెను.

శా. మాహానాథ విహారవాహనకృపాకమాహాత్మ్యసాహాయ్యకో
  త్సాహి శ్లక్ష్ణకటాక్ష వీక్షితభక్తవ్రాత సంసార శ్రీ
  బాహుళ్యప్రదపాదసంస్మరణ పంకపాహేమకూటాద్రిఖే
  లాహేవాకవిపాకవిస్మరితకైలాసాదికేళీరసా. 116

అవతారిక. ఈ పద్యమునందును, ముందుపద్యములు రెంటింటను, నీ గ్రంథమునందలి కృతిపతియగు విరూపాక్షస్వామిని గవి వర్ణించుచున్నాఁడు.

అ. మహానాథవిహారవాహన ! = వృషభశ్రేష్ఠమగు నందిని విహారార్థమైన వాహనముగాఁ గలవాఁడా ? కృపామాహాత్మ్య = దయామహిమ యనెడి, సాహాయ్యక = సహాయము చేత, ఉత్సాహి = ఉప్పొంగిన, శ్లక్ష్ణకటాక్ష = కటాక్షలేశము చేత, విక్షిపిత = ఎగమీటఁ బడిన, [చెదర్పఁబడిన యనుట.] భక్తవ్రాత = భక్తులసమూహముల, సంసార = సంసారములను గలవాఁడా ! [భక్తులను నిత్యులుగా నొనర్చువాఁడా యని భావము.] శ్రీబాహుళ్యప్రద = అధికసంపదల నిచ్చునట్టి, పాదసంస్మరణ = పాద ధ్యానమును గలవాఁడా, పంపా హేమకూట+అద్రి = పంపానది యందును, దత్తీరమునందలి హేమకూటాచలమునందును, ఖేలా = క్రీడలను గలిగియుండుటచే, [పంపా ఖేలా, పంపా హేమకూటాద్రి ఖేలా యని యన్వయము గావింపనగును.] హేవాకవిపాక = హృదయంగమమైన పరిచయముచేత, విస్మరిత = మఱచిపోఁబడిన, కైలాసాది = కైలాసము మొదలగువానిని గల, కేళీరసా = విహారేచ్ఛనుగలవాఁడా !

తా. వృషభశ్రేష్ఠమును వాహనముగాఁ గలవాఁడా, కటాక్షలేశమున భక్తులను నిత్యులుగా నొనర్చువాఁడా, పాదస్మరణ సేయువారి కధిక సంపద లిచ్చువాఁడా, పంపా హేమకూట విహారమునఁ గైలాస విలాసమును మఱచినవాఁడా.

"మహానాథ." "మహేయీ సౌరభేయీ గౌ రుస్రా మాతా చ శృంగిణీ." అని యమరము.

క. పెదవేఙ్కటాద్రిహృదయా
స్పదపదవిన్యాస తుంగభద్రావీచీ

మృదుశీకరవిరచితనిజ
సదనాంగణరంగవల్లికసౌభాగ్యకళా. 117

అ. పెదవేఙ్కటాద్రి = పెద్దవేంకటాద్రిరాజుయొక్క, హృదయాస్పద = మనస్సునకాస్పదమగు, పదవిన్యాస = నడకగలవాఁడా! తుంగభద్రావీచీ = తుంగభద్రానదియొక్క యలలయందలి, మృదుశీకర = మృదువులగు తుంపురులచేత, విరచిత = చేయఁబడిన, నిజసదనాంగణ = స్వీయమగు నాలయములోని యంగణమున, రంగవల్లి = ముగ్గును గల, సౌభాగ్యకళా!

తా. పెదవేంకటాద్రిరాజుయొక్క హృదయమున నుండువాఁడా, తుంగభద్రానదీతరంగములలోని తుంపురుల నాలయమున ముగ్గులవలె రచించుకొనువాఁడా!

స్రగ్విణి. బ్రధ్నకోటీసమభ్రాజితేజోఘనా
బుధ్నభావాప్తిసంపుష్టసృష్టిద్రుమా
బుధ్నపద్మోద్భవసంస్తవ్యహృద్వ్యర్చితా
గృధ్నుతాపూర్వకాకృష్టశిష్టార్చనా. 118

గద్యము. ఇది నిఖిలసూరి లోకాంగీకార కవిత్వవైభవ,
యమరనార్య తనూభవ, సౌజన్య జేయ, సూరయ
నామధేయ ప్రణీతంబైన, రాఘవపాండ
వీయంబునందుఁ ద్వితీయాశ్వాసము.

అ. బ్రధ్నకోటీ=పలువురు సూర్యులతోడ, సమభ్రాజి = సమానముగా ప్రకాశించునట్టి, తేజోఘనా=తేజస్సుచే దట్టమైనవాఁడా! బుధ్నభావ = మూలభావముయొక్క, ఆప్తి = పొందికచేత, సంపుష్ట = పోషింపఁబడిన, సృష్టిద్రుమా=సృష్టియనెడి వృక్షమును గలవాఁడా! బుధ్న

వత్, బోధ=వృద్ధినిగల, జ్ఞానముచేత, సంహృష్యత్ = సంతోషించుచున్న, ఋష్యర్చితా = ఋషులచే నర్చింపఁబడువాఁడా ! గృధ్నుతా = కోరికను, పూర్వక = ముందుగాఁ గల్గుటచే, ఆకృష్ట = ఆకర్షింపఁబడిన, శిష్ట = పెద్దలచేతి, అర్చనా = పూజ గలవాఁడా !

తా. అనేకసూర్య సమప్రకాశయుక్తుఁడా, మూలభావాప్తిచేఁ బోషింపఁబడిన సృష్టియనెడి వృక్షముగలవాఁడా, జ్ఞానాధిక్యమున నంతోషించుచుండు ఋషులచే నర్చింపఁబడినవాఁడా, కోరిక గల్గుటచేఁ బెద్దలచే నంగీకరింపఁబడి పూజింపఁబడువాఁడా.

పై మూఁడుపద్యములు నాశ్వాసాంతరూపములు.

గద్యము. ఇది శ్రీహయగ్రీవకరుణావలబ్ధసారస్వతసారోభయ
భాషాకవిత్వ తత్త్వజ్ఞ, చెన్నపురీ విశ్వవిద్యాలయ సమా
సాదిత విద్వద్బిరుదాంచిత, కవికులతిలక, భారద్వాజ
గోత్రపవిత్ర, శ్రీ శ్రీనివాసాచార్యతనూజ, మంగ
మాంబాగర్భశుక్తి ముక్తాఫల, భాష్యకార
కవివిరచితంబైన, కవిభావ ప్రకాశికాస
మాఖ్యంబగు రాఘవపాండవీయవ్యాఖ్య
యందు ద్వితీయాశ్వాసము.



శ్రీ ర స్తు.

# రాఘవపాండవీయము.

## తృ తీ యా శ్వా స ము.



మద్గౌరీపరమ
ప్రేమాస్పద యాకువీటిపెదవేంకటధీ
ధామ సదాలసదసదృ
గ్భూమ విరూపాక్ష హేమకూటాధ్యక్షా. 1

అవతారిక. ఆశ్వాసాదిని గృతిపతియగు విరూపాక్షదేవునిం బేర్కొనుచున్నాఁడు.

అర్థము. శ్రీమత్......ఆస్పద; శ్రీమత్ = సంపదగల, గౌరీ = పార్వతియొక్క, పరమప్రేమ = శ్రేష్ఠమగు ప్రేమకు, ఆస్పద = స్థానమగువాఁడా, ఆకువీటి .....ధామ ; ఆకువీటి = ఆకువీడునంకముగాఁగల, పెద వేంకట = పెదవేంకటాద్రియొక్క, ధీ = బుద్ధిని, ధామ = ఉనికిపట్టుగాఁగలవాఁడా, సదా.....భూమ ; సదా = ఎల్లప్పుడు, లసత్ = ప్రకాశించుచుండు, అసదృక్ = సాటిలేని, భూమ = మహిమగలవాఁడా, హేమకూటాధ్యక్షా = హేమకూటమునకు నాయకుఁడగువాఁడా, విరూపాక్ష = విరూపాక్షనామముగల యో పరమశివుఁడా, అవధరింపుమని ముందరిపద్యములో నన్వయము.

తాత్పర్యము సులభము.

"శ్రీమద్గౌరీ" ఇటఁ బార్వతికి సంపద్యుక్తి శోభాస్పదత్వమయగును. శ్రీమచ్ఛబ్దము గౌరీవిశేషణమగునేని శివునిచే భార్యగా నంగీకృత యగుట కతమునఁ గలిగిన కాంతి యుక్తత యని భావము. గౌరి యీశ్వరాంగీకృతిచేఁ గాంతియుక్తయయ్యె ననుటకుఁ బార్వత్యవయవ వర్ణనమునఁ గాళిదాసుఁడు కుమార సంభవమున, "ఏతావతా నన్వనుమేయశోభి కాంచీగుణస్థాన మనిందితాయాః. ఆరోపితం య ద్గిరిశేన పశ్చా దనన్యనారీ కమనీయ మంకం" అని చెప్పుటయే ప్రమాణము.

శ్రీమచ్ఛబ్దము విరూపాక్షునకు విశేషణము గావించునెడల శ్రీమంతుఁడును, గౌరీప్రేమాస్పదుఁడునని విశేషణోభయపదమగును. అప్పుడు శివునకు సంపద్యుక్తి యేమిటన ? అర్ధనారీశ్వరుఁడగుటయ యనుట. లక్ష్మికి దుర్గాది నామములుంట లక్ష్మీగౌరులకభేదముం దెల్పుడు నిది సరియగును. లక్ష్మికి దుర్గాదినామములుండుటకు, "నవదుర్గాం మహాకాళీం" అని లక్ష్మ్యష్టోత్తరశతమునఁ గలదు.

"భూమ." ఇట నిమనిచ్ ప్రత్యయముయొక్క యికార లోపమునకును, బహుశబ్దమునకు భూ అనునాదేశము గల్గుటకును; "పృథ్వ్యాదిభ్య ఇమనిచ్, బహోర్లోపో భూచబహోః." సిద్ధాంతకౌముది.

"ఆకువీటి." ఇటవీడుశబ్ద మాపవిభక్తికాంత మగుటచే "టి" అను నాప విభక్తిక ప్రత్యయము వచ్చెను.

వ. అవధరింపు మట్లు రంజిల్లుచున్న యయ్యతీంద్ర సామ్రాజ్య
ధౌరేయుండు. 2

రామాయణ. అవధరింపుము, అట్లు, రంజిల్లుచున్న = ప్రకాశించుచున్న, ఆ+అతీంద్ర = ఇంద్రునతిక్రమించిన, సామ్రాజ్య, ధౌరేయుండు = భారవాహియగువాఁడు, దశరథుఁడనుట.

భారత. అవధరింపుము, అట్లు, రంజిల్లుచున్న, యతీంద్రసామ్రాజ్య ధౌరేయుఁడు = మునీశ్వరోత్తముఁడు, నారదుఁడనుట.

తాత్పర్యముసుగమము. ఇట్లనియె నని ముందన్వయము.

"రంజిల్లు." ఇందుకు నకు ద్విత్వలకారము వచ్చుటకు; రంజితి ఘట్యాదీనాం బిందో శ్చస్యాపిలావుభౌభవతః." ఆంధ్ర శబ్దచింతామణి, "ఆ+అతీంద్ర. ఇటరేఫోష్మేతరాసంయుక్తహల్లు పరమగుటచేఁ ద్రికమునకు హ్రస్వతయు హల్లునకు ద్విత్వమును గలిగెను.

తే. అతిశుభార్థసంపత్ప్రదం బైనవసుధ
మహిమ నేలుచు వాత్సల్యమధురిమమున
నతని నలరింపుచును బ్రియం బగుసభాజ
నప్రధానహితోక్తిబృందమున నంత. 3

రామాయణ. అతిశుభ.....ప్రదంబైన; అతిశుభ=మిక్కిలి మంగళకరమైన, అర్థసంపత్ = ద్రవ్యసమృద్ధికి, ప్రదంబైన = ఉనికిపట్టైన, వసుధ = భూమిని, మహిమన్ = గొప్పతనముచే, ఏలుచున్ = రక్షింపుచు, వాత్సల్యమధురిమమునన్ = ప్రీతిమాధుర్యముచేతను, ప్రియంబగు = ప్రీతికరమగు, సభాజన.....హితోక్తి; సభాజన = సభలోనిజనుల యొక్కయు, ప్రధాన = మంత్రులయొక్కయు, హితోక్తిబృందమునన్ = హితవాక్యసమూహముచే, అతనిన్ = రాముని, అలరింపుచును = సంతోషింపఁ జేయుచును,

తా. దశరథుఁడు వాత్సల్య యుక్తమగు నిజోక్తిచేతను సభాజన ప్రధానాదుల యుక్తులచేతను రాముని సంతోషింపఁజేయుచు,

ఇట నతీంద్ర సామ్రాజ్య ధౌరేయుం డనుకర్తృ పూర్వపదము నుండి యధ్యాహార్య మగుచున్నది. ఇట్లనియె నని ముందరికన్వయము.

*"మధురిమ". "స్వాదుప్రియౌతు మధురౌ." అమరము.

భారత. అతిశుభార్థ......పదంబైన ; అతిశుభ, అర్థసంపత్ = భావ పుష్టమగు, పదంబై = వాక్యముగలదయి, నవ = నూతనమైన, సుధ = అమృతముయొక్క, మహిమను, ఏలుచున్ = తానుపాలించుచు, . అతి క్రాంతామృత మహిమయనుట. వాత్సల్యమధురిమమునన్, ప్రియంబగు, సభాజన = బహుమానమే, ప్రధాన = ముఖ్యముగాఁగల, హితోక్తిబృంద ములచేతన్, అతనిన్ = అధర్మరాజును, అలరింపుచున్.

తా. ఆనారదుఁడు మంగళకరములై భావపుష్టిగల వాక్యములుగల్గి యతిక్రాంతామృత మహిమయగు ప్రీతిమాధుర్యమునను, ప్రియగౌరవములు ముఖ్యముగాఁగల హితోక్తి జాలములచేతను ధర్మజుని సంతసింపఁజేయుచు. యతీంద్రసామ్రాజ్య ధౌరేయుఁడని పూర్వపద్యమునుండి కర్త యధ్యా హార్యము. ఇట్లనియెనని ముందరనన్వయము.

"శుభ." "శ్వఃశ్రేయసం శివం భద్రం కల్యాణం మంగళం శుభం" అమరము.

ఇటఁ బదమనునది సుప్తిఙన్తమగునదే కాని పలుకని యర్థము సేయఁ దగదు. మాట యని యర్థము గావించిన శుభార్థసంపదగలుగదు.

"మహిమ." ఇటమహచ్ఛబ్దముపై నిమనిచ్ వచ్చుటకు "పృథ్వా దిభ్య ఇమనిచ్." సిద్ధాంతకౌముది.

"మధురిమ." "వర్ణదృఢాది భ్యష్యఞ్చ." సిద్ధాంతకౌముది.

"సభాజన." "ఆనందన సభాజనే." అమరము.

వ. ఇట్లనియె. 4

స్పష్టము.

క. క్రమమున ధరణీభరణ
క్షమమగుతద్ధర్మనీతికచాతుర్యవిశే
షమశేష మరసి యధిక
ప్రమదుఁడయి ప్రసంగవశత కరప్పించి తగన్. 5

రామాయణ. క్రమమునన్ = వరుసఁగా, ధరణీ......క్షమము; అగు; ధరణీభరణ = భూభరణమునకు, క్షమము+అగు = యోగ్యమగు, తత్......విశేషము; తత్ = ఆరామునియొక్క, ధర్మనీతి = ధర్మపుర స్కృతమగు నీతియొక్క, చాతుర్యవిశేషము = సామర్థ్యవిశేషము, అశే షము = శేషములేకుండునట్లు, అంతయుననుట. అరసి = విచారించి, అధిక ప్రమదుఁడయి = మిక్కిలి సంతోషము గలవాఁడయి, [ఇట రాముని ధర్మనీతి విచారము ప్రమదోద్భవమునకుఁ గారణమయ్యె నని భావము.] ప్రసంగవశతన్ = ప్రస్తావవశముగా, తగన్, రప్పించి = రావించి, [ఇట ధర్మనీతి విశేషమును బ్రసంగవశమున రావించి యని యన్వయము.

తా. దశరథుఁడు భూభరణక్షమమగు రాముని ధర్మపూర్వక నీతి విశేష విచారమున నానందితుఁడై ప్రజలయొద్ద నానీతివిశేషము ప్రస్తావ వశమున రావించి.

భారత. క్రమమునన్, ధరణీభరణ క్షమమగు, తత్, ధర్మ=ఆధర్మ జునియొక్క, నీతి = రాజనీతియొక్క, చాతుర్యవిశేషము, అశేషము, అరసి = అంతయు విచారించి, అధికప్రమదుఁడయి = మిక్కిలి సంతో షము గలవాఁడయి, తగన్, ప్రసంగవశతన్, రావించి.

తా. నారదుఁడు భూభరణక్షమమగు ధర్మజుని నీతి విశేషమును విచారించి యానందించి ప్రస్తావవశమున దానిరావించి.

"ధర్మ." "ధర్మోస్త్ర్రీ పుణ్యసామాన్య భావయోః. దావన్యాయా ధ్వరాహింసా యజ్ఞాచారయమేషు." నానార్థరత్నమాల. కావున ధర్మ శబ్దము యమవాచియైనను యమపుత్రుఁ డగుటచే నీతనికిని ధర్మరాజను వ్యవహారము కలిగెను.

"ప్రమద." "ముత్ప్రీతిః ప్రమదోహర్షః." అమరము.

సీ. బంధురంజనరామ ♦ భద్ర ధర్మాత్మజ
మైశ్వర్యశోభిత ♦ యన్వయైక

పావన పాండురాజీవ వరమాధుర్య
శోభన నయనవసుప్రతాప
నిర్మలప్రౌఢివి నీతత్త్వవిజ్ఞాన
సౌశీల్యశౌర్యాదిసద్గుణములు
విని యుబ్బుచున్నవాఁ డనుమోదగరిమఁద
త్తృప్తిరణఁ జేసి యేఁ దివిరి నిన్నుఁ

గీ. బనిచెదసమస్తమహిరాజ్యపాలనము గ
రంబు నుతికెక్కఁ జేయుము రాజసూయ
మానచంద్రికాస్ఫూర్తియుఁ బొనికీర్తి
మున్నుగాఁ బర్వ కకుబంతములఁ దలిర్ప. 6

అవతారిక. ఈ రాముని సంబోధించి దశరథుఁ డీవాక్యములు పలుకుచున్నాఁడు.

**రామాయణ.** బంధురంజన = చుట్టముల నలంకరించెడి వాఁడా, **రామభద్ర** = రామచంద్రుఁడా, ధర్మాత్మ = పుణ్యాత్ముఁడగు వాఁడా, ఐశ్వర్య, శోభిత=లక్ష్మిచేఁ బ్రకాశించువాఁడా, జయలక్ష్మిచే శోభితుఁడా యనుట; అన్వయ+ఏక పావన = వంశమును ముఖ్యముగాఁ బవిత్రము సేయువాఁడా, పాండు......నయన; పాండు = తెల్లని వన్నెగల, రాజీవ = తామరయొక్క, రమాధుర్య = కాంతివహించిన, శోభననయన = అందమగు కన్నులు గలవాఁడా, వసుప్రతాప = అష్టవసువులప్రతాపమువంటి ప్రతాపము గలవాఁడా, నిర్మలప్రౌఢివి=కళంకములేని ప్రజ్ఞగలవాఁడవు, నీ......... సద్గుణములు; నీ = నీయొక్క, తత్త్వ, విజ్ఞాన = పరబ్రహ్మజ్ఞానమును, సౌశీల్య = సద్వర్తనమును, శౌర్య = పరాక్రమము, ఆది = ఇవి మొదలుగాఁగల, సద్గుణములు, విని = నీ యీ సుగుణములాలకించి, మోద గరిమన్ = సంతోషాతిశయముచే, ఉబ్బుచున్నవాఁడను, తత్తృప్తిరణఁ

జేసి = ఆ సద్గుణముల ప్రేరేపణచేత, ఏన్ = నేను, అవిరి = ప్రయ
త్నించి, నిన్నున్, పనిచెదన్ = ఆజ్ఞాపించెదను, సమస్త.....పాలనము;
సమస్తమహిరాజ్య = సమస్తభూమండలము యొక్క, పాలనము = ఏలుట,
కరంబు = మిక్కిలి, నుతికెక్కన్ = స్తోత్రపాత్రమగులాగున, రాజ......
పోని; రాజ = చంద్రునిచే, సూయమాన = సృజింపఁబడుచుండు, [ఇట
వర్తమానార్థకత్వము నూత్న తా పాదనార్థమని యెఱుఁగునది.] చంద్రికా
స్ఫూర్తియుక్ పోని = వెన్నెల నిగ్గంబోలెడి, కీర్తి=యశము, మున్నుగాన్
పర్వి = ముందుగా వ్యాపించి, కకుబంతములన్ = దిగంతముల, తలిర్పన్ =
తేజరిల్లగా, ఏలుము = పాలింపుము.

తా. బంధురంజనుఁడవై, ధర్మాత్ముఁడవయి, జయలక్ష్మీసమే
తుఁడవై, కులపావనుఁడవయి, రాజీవాక్షుఁడవై, పరాక్రమవంతుఁడవయి,
శుద్ధప్రజ్ఞుఁడవైన నీ పరబ్రహ్మజ్ఞాన సద్వర్తన పరాక్రమాది సద్గుణములు
విని మిక్కిలి సంతసించి యాగుణములు ప్రేరేపించుటచే నిన్నాజ్ఞాపించు
చున్నాఁడను. నీకీర్తి దిగంతములవఱకు వ్యాపింప నీవు రాజ్యపాలన
మొనర్పుము.

"రామభద్ర." మయూరవ్యంసకాదులవలె విశేష్యపూర్వపద కర్మ
ధారయమిది యగును. "మయూరవ్యంసకాదయశ్చ." సిద్ధాంతకౌముది.

"మాధుర్య" ఇది మధురముయొక్క భావార్థకము. "గుణవచన
బ్రాహ్మణాదిభ్యః కర్మణిచ." సిద్ధాంతకౌముది.

నిర్మలప్రౌఢివి నీతత్త్వవిజ్ఞానయను స్థలమునఁ గొందఱు రామాయణా
ర్థమునఁ దస్యభావస్తత్త్వమ్మని తకారద్విత్వమును, భారతార్థమునఁ వినీ
తత్వ యని తకారద్విత్వరహితరూపమును నిట్లు రెండు విధములగుట శ్లేష
మూలకమగు నిర్బంధమునఁ గల్గెనని యభిప్రాయపడెదరు. కాని ఇటఁ
దత్త్వవిజ్ఞానము పరబ్రహ్మజ్ఞానమని రామాయణార్థమున నగును. అప్పుడు
తకారద్విత్వము లేదు. "తత్వంవిలం బమానే స్యాత్స్వరూపేపరమాత్మని"
యని నానార్థరత్నమాలయందు ద్విత్వరహితరూపమును గనుపట్టుచున్నది.

ముద్దరాజురామన్న, "తత్వ = సిద్ధాంతమైన" అని యర్థముగావించుటచే నట్టిసంశయము గల్గెను. కాని పరబ్రహ్మజ్ఞానమనుటయే యట సమంజసమగును.

"రాజ" చంద్రుఁడనుటకు. "రాజా నృపే తాలభేదే పతౌ క్షత్రియ చంద్రయోః" నానార్థరత్నమాల.

"స్ఫూర్తియుఁబోని" ఇది వదర్థకము "అట్టిపోని, బోఁటి, వంటి శబ్దంబులు వదర్థకంబులు." ప్రౌఢవ్యాకరణము.

"మహీరాజ్య." ఇటమహీరాజ్య శబ్దము సాధ్యసమానమై యిట్టి రూపమునందెను.

భారత. బంధురంజన, [ఇట హేత్వర్థమునఁ దృతీయ.] రామ = మనోజ్ఞమగువాఁడా, భద్ర = శుభములుగలవాఁడా, ధర్మాత్మజ = ధర్మపుత్రుఁడా, ఐశ్వర్య = సంపదలవలన, శోభిత = ప్రకాశించువాఁడా, అన్వయ+ఏకపావన, [ఇంతవఱకు ధర్మజుని సంబోధించుట యగును.] పాండురాజు, ఈ వర..............సద్గుణములు; ఈ, వర = శ్రేష్ఠమైన, మాధుర్య = ప్రియత్వమును, శోభననయ = మంగళకరమగు నీతియు, నవ = నూతనమగు, సుప్రతాప = మంచి పరాక్రమము, నిర్మలప్రౌఢి, వినీతత్వ = వినయయుక్తుఁడగుట, విజ్ఞాన, సౌశీల్య, శౌర్యాది సద్గుణములు, విని = శౌర్యముమొదలగువానిని విని, అనుమోదగరిమన్ = సంతోషాతిశయముతో, ఉబ్బుచున్నవాఁడు, ఏను, తత్ = ఆగుణములయొక్క ప్రేరణఁజేసి, తివిరి, నిన్ను, పనిచెదన్ = ఆజ్ఞాపించెదను, సమస్త మహీరాజ్య పాలనము, కరంబు, నుతికెక్కన్ = భూపరిపాలనము మిక్కిలి స్తుత్యర్హమగునట్లు, చంద్రికాస్ఫూర్తియుఁబోని, కీర్తి = వెన్నెలయొక్క కాంతిని బోలిన యశము, మున్నుగాన్, పర్వి=ముందరవ్యాపించి, కకుబంతములన్, తలిర్పన్ = రంజిల్లఁగా, రాజసూయము=రాజసూయయాగము, చేయుము. అన = ఇది నీతండ్రియాజ్ఞ.

తా. ధర్మతనూజ ! నీతండ్రిపాండు మహారాజు నీదగు మాధుర్యాది గుణగణముల నాకర్ణించి యెక్కుడు ముదముగొన్నవాఁడు. ఆతని ప్రేరణచే నేనిప్పుడు నిన్నాజ్ఞాపించువాఁడను. సర్వజనస్తుత్యర్హముగ భూపాలన మొనర్చుచు వెన్నెలవలెఁ బ్రకాశించు నీకీర్తి దిగంతములవఱకు వ్యాపించు లాగున రాజసూయయాగము గావింపుము. ఇది నీతండ్రియాజ్ఞసుమా.

ముద్దరాజురామన్న ఇట "ఆన కీర్తికంటె మున్నగాఁదలిర్ప రాజసూయముచేయు"మని యర్థముగావించి 'కీర్తి మున్నగా' అని సమస్తపదముగావించెను. కాని రాజులజయించి యావల రాజసూయము జరుపవలసియుంట రాజ విజయ జాతకీర్తి దిగంతములవఱకు వ్యాపింపఁజేసి యావలరాజసూయయాగ మాచరింపుమనుట యుక్తతరము కావున 'కీర్తిమున్నగా' అని వ్యస్తపదముగానే యుండనగును. ఇదియే కవియాశయముగనుండును. చెప్పవలయు నవన్నియుఁ జెప్పి యావల "నిది నీతండ్రియాజ్ఞ" యనిననే పూర్వోక్తము లవిలంఘ్యములను నర్థమును గోచరించును.

"రామ." మనోజ్ఞమని యర్థము గల్గుటకు. "రమ క్రీడాయాం." అను ధాతువువలనఁ గలుగుటయే కారణమగుచున్నది. మఱియు; "రామః బలరామే, రాఘవే, పరశురామే, వృకమారకమృగే, త్రిసంజ్ఞాయాం, జాతధాతక్యాం, కామశాస్త్రి ప్రవీణస్త్రియాం, చక్రవర్తిన్యాం, కుష్ఠే, వాస్తుకే, హింగుళ్యాం, విష్ణౌ, మనోజ్ఞే, నీలే, శ్వేతే, గౌరీ లక్ష్మీవాణీ రంభాసు, చతుర్ముఖే, శిల్పే, స్థవిరే, రతీదేవ్యాం" అని శబ్దార్థకల్పతరువునఁ దెల్పఁబడెను.

"పాండురాజీవరమాధుర్య." ఇట భారతార్థమున 'రాజు' అని దంత్యముగను రామాయణార్థమున 'రాజీవ' యని తాలవ్యముగను నుచ్చారణము గలుగుటకు, "ఒక్కానొకచోఁ జకారంబు భయంబునగు" నని సీతారామాచార్యులు నుడివిరి.

"కకుప్." "దిశస్తుకకుభః కాష్ఠాః." అమరము.

క. అనుటయు ముకుళితకరుఁ డై
యనఘా ! మది నవధరింపు మే మంతటి శక్తుం
డనె ? యే నొండొకపని నా
కనుగ్రహింపు మన మఱియు నతఁ డి ట్లనియెన్. 7

రామాయణ భారతార్థములు సమము. అనుటయున్ = అని చెప్పుటయు [దశరథుఁ డిట్లు చెప్పుటయు, నారదుఁ డిట్లు చెప్పుటయు నని క్రమముగ నుభయార్థములందు నన్వయము.] ముకుళితకరుఁడై = మోడ్పు చేతులు గలవాఁడై, [రాముఁడు, ముకుళితకరుఁడై ధర్మజుఁడు ముకుళిత కరుఁడై అని యుభయార్థములందు నన్వయము గావించునది.] అనఘా = పాపరహితుఁడా, మదిన్ = మనసునందు, అవధరింపుము = చక్కఁగాఁ దలఁపోయుము, ఏన్ = నేను, అంతటిశక్తుండనే = నీవు వచియించిన కార్యము చేయఁజాలునంతటి శక్తుండనా, [రాజ్యభారము వహించునంతటి శక్తిసంపన్నుండనా, రాజసూయయాగము చేయునంతటిశక్తి సంపన్నుండ నాయని యన్వయ.] ఒండు + ఒకపని = ఇంకొకపనినైనను, నాకున్, అను గ్రహింపుము = నాకానతిమ్ము, అనన్ = అనఁగా, మఱియున్, అతఁడు [దశరథుఁడు, నారదుఁడు] ఇట్లనియెన్.

తా. అని యానతీయఁగా ముకుళితహస్తుఁడై నేనంతటి పనిచేయ సమర్థుఁడనా, నాకింకేపని నే నానతిమ్ము అని చెప్పఁగా మఱియు నతఁ డిట్లనియెను.

చ. జనకునియాజ్ఞ యన్నయవి
చార్యముమున్ని దియెన్ని చూడుమా
యనయమునన్నిధిన్ నిను స
మర్థతరుండనినిశ్చయించి పం

చినపని దీనినీవు దగఁ
జేయసదాత్త సుధర్మతన్ సుఖం
బునహరికొల్వొనర్తునని
పూనినవాఁడనయంబుబుద్ధిలోన్. 8

రామాయణ. జనకునియాజ్ఞ, అన్నన్ = తండ్రియాజ్ఞ యనినచో, అవిచార్యము=విచారింపఁదగినదికాదు, అవశ్యకర్తవ్యమగునదనుట; మున్ను = ముందు, ఇది=తండ్రియాజ్ఞ మీఱరానిదను నీవిషయము, ఎన్ని, చూడుమా = ఆలోచించి చూడుమా, అనయము = ఎల్లప్పుడును, సత్ + నిధిన్=సత్పురుషులకునిధి యగు, నిన్నున్, సమర్థతరుండు = మిక్కిలి సామర్థ్యవంతుఁడవు, అని, నిశ్చయించి, పంచిన పని = ఆజ్ఞాపించిన పనియగును, దీనిన్ = ఇకార్యమును, నీవు, తగన్, చేయన్ = నీవుచేయఁగా, సదా = ఎల్లప్పుడును, ఆత్త = స్వీకరింపఁబడిన, సుధర్మతన్ = లెస్సయగు ధర్మము గలుగుటచే, సుఖంబునన్ = సుఖముగా, హరికొల్వు = విష్ణుసేవ, ఒనర్తున్ = చేయుదును, అని, బుద్ధిలోన్ = మనస్సున, నయంబు = ఈన్యాయమును, పూనినవాఁడన్ = వహించినాఁడను.

తా. తండ్రియాజ్ఞను గుఱించి యుక్తాయుక్త విచారము తగదు' అనుటను ముందుఁదలఁపునకుఁ దెచ్చికొనుము, సత్పురుషులకు నీవు నిధివనియు, సమర్థతరుఁడవనియుఁ దలఁచియే నీకీభూభరణాజ్ఞ యిచ్చితిని, నీవట్లొనర్చిన నింక నేను హరిభజన సేయుచు సుఖముండెదనని భావించుచున్నాఁడను.

భారత. జనకునియాజ్ఞ, అన్నన్, అవిచార్యము = ఆలోచింపఁదగనిది, మున్ను, ఇది ఎన్నిచూడుము, ఆయన = నీతండ్రియగు నాపాండురాజు, యమునన్నిధిన్ = యముునెదుట, నిన్నున్, సమర్థతరుండని, నిశ్చయించి, పంచినపని=ఆజ్ఞాపించినకార్యము, దీనిన్, నీవు, తగన్, చేయన్ = ఈ యాగమును నీవు తగునట్లు చేయఁగా, సదా, ఆత్త, సుధర్మతన్ = పొందఁబడిన దేవసభగలవాఁడగుటచేత, దేవసభనుపొంది యని భావము.

హారికొల్వు, ఇంద్రునిసేవ, ఒనర్తునని = చేయుదునని, బుద్ధిలోన్ = మన స్సులో, అనయంబున్, పూనినవాఁడు.

తా. ధర్మతనూజా! తండ్రియానతిమీఱరానిదనుట ప్రథమమునఁ మదిం దలఁచిచూడుము. నీవు రాజసూయముచేయఁదగు వాఁడవనియు మునిసమీపమున నీతండ్రి నిశ్చయించియే యీయాజ్ఞచేసి యున్నాఁడు. ఇది నీవు చేసిన యెడలఁ దా నింద్రసభకరుదెంచి యెల్లప్పుడు నాతని సేవ సేయుచుండువాఁడ నని నీతండ్రి పూనియున్నాఁడు.

"సుధర్మ" "స్యాత్సుధర్మా దేవసభా" అమరము.

"ఆయన" దీనిరూపనిష్పత్తి ఆ + అన్న; అన్నలోన నకారలోప ముగల్గిన, ఆ + అన = ఆయన. 'ఆ' కళయగుటచే నచ్చుపరమగు నపుడు యడాగమము గల్గెను.

క. జనులందఱు నీయంద
త్యనురాగముకలిమి నెఱపెదరుసత్త్వమహా
త్త్వనిరూఢిఁ బొల్పెసఁగునీ
యనుజులు భవదీయశాసనైకాయత్తుల్. 9

రామాయణ భారతార్థములు సమము. జనులందఱు = ఎల్ల జనులును, నీయందున్ = నీవిషయమున, అత్యనురాగము కలిమిన్ = మిక్కిలి ప్రీతికలిగియుండుటను, నెఱపెదరు = జరిపెదరు, సత్త్వ...... నిరూఢిన్; సత్త్వ = బలమువలని, మహత్త్వ = మహిమవలని, నిరూఢిన్ = పెంపుచే, పొల్పు, ఎసఁగు = అందగించుచుండు, నీయనుజులు = నీతమ్ములు, [రామాయణ పర్యాయమున భరతలక్ష్మణ శత్రుఘ్నులనియు, భారత పర్యాయమున, భీమార్జున నకులసహదేవులనియు నన్వయము.] భవదీయ = నీదగు, శాసన + ఏకాయత్తుల్ = ఆజ్ఞయందాసక్తి కలవారు, ఆజ్ఞకులోఁ బడినవారనుట.

తా. జనులందఱు నీయందత్యంత ప్రీతిగలిగియున్నారు. బలాధికు
లగు నీసోదరులు నీమాట జవదాఁటక నీకులోఁబడియున్నారు.

ఇటఁ గొన్నిగ్రంథములలో 'సత్వ' యనియుఁ గొన్నింట మహాత్వ
యనియు దకారద్విత్వరహిత రూపములు గానవచ్చెడిని. కానియస్మత్పరి
శోధితములగు వ్రాఁత ప్రతులలో నీరెంటను దకారద్విత్వము గన్పట్టుచున్నది.
విశ్వప్రకాశమున "సత్త్వంగుణే పిశాచాదౌ బలే ద్రవ్యస్వభావయోః."
అనియు, నామలింగాను శాసనమున "ద్రవ్యాసు వ్యవసాయేషు సత్త్వమ
స్త్రీతుజంతుషు." అనియు, తకార ద్విత్వసహితముగనే కనుపట్టుచున్నది.
"సతోభావస్సత్త్వం" అని వ్యుత్పత్తియు నగుచున్నది. ఇట్లే, మహతో
భావః మహత్త్వం" అని వ్యుత్పత్తియగుటచే రెంటను దకారద్విత్వముండ
వలయుట యావశ్యకము.

వ. కావున నమ్మహాకార్యంబు నిర్వహింప. 10

. సులభము.

గీ. అనఘ నీవె తగుదు వనివారితనయాద
రౌచితిఁగడునొప్ప నాయతిశుభ
గుణవశుఁ డనిపించుకొని నిజేచ్ఛఁజనని
యత్యుదారుఁ డఖిల కృత్యవిదుఁడు. 11

అవతారిక. ఇది మొదలు "క్లిష్టతయించు కంతయునను పద్యము
వఱకు దశరథుఁడు రామునకు నీతి నుపదేశించుచున్నాఁడు.

రామాయణ. అనఘ = పాపరహితుఁడగునో రామచంద్ర, అని
వారిత......... ఔచితిన్; అనివారిత=అడ్డగింపరాని, నయ=నీతియొక్క,
ఆదర = అమితమైన, ఔచితిన్ = ఔచిత్యముచే, కడున్ = మిక్కిలి,
ఒప్పన్ = ఒప్పుటచే, నీవ, తగుదువు = నీవేతగినవాఁడవౌదువు, ఆయతి
.....వశుఁడు ; ఆయతి = ఉత్తరకాలఫలముచేత, శుభ = మంగళము

లగు, గుణ = గుణములకు, కల్యాణగుణములకనుట. వశుఁడవు = అధీనమైనవాఁడవు, అనిపించుకొని, నిజేచ్ఛగ్ = తన యిష్టానుసారము, చనని = నడవకుండునట్టి, అత్యుదారుఁడు = మిక్కిలి సమర్థుఁడవు, అఖిలకృత్యవిదుఁడు = సర్వకార్యములను నెఱిఁగినవాఁడవు. నీవు సద్గుణ యుక్తుఁడవౌట సర్వకార్యముల నెఱుఁగుదువనుట.

తా, నీత్యాదులచే నొప్పారియుండుటకు నీవే తగుదువు. భావికాలమున శుభదములగు సర్వకల్యాణగుణగణ పరిపూర్ణుఁడవని ఖ్యాతిగడించినవాఁడవు, కావున సర్వకార్యములును నీ యిచ్ఛానుసారము మెలఁగుటచే వానినంతయు నెఱిఁగియుండువాఁడవు.

"అదర" దర, కొంచెము, అదర, కొంచెము గాకుండుట, విస్తారమనుట. "దర" కొంచెమనుటకు; "ఈషదర్థే దరంస్మృతం," అమరము.

"ఆయతి" భావికాలమనుటకు; "ఉత్తరఃకాల ఆయతిః" అమరము.

భారత. అనఘ, నీవె, తగుదువు = ఈ రాజసూయము నిర్వర్తింప నీవె తగుదువు, అని = పలికి, వారి... ఔచితిగ్ ; వారి = పాండవుల యొక్కయు, తన = తనయొక్కయు (నారదునియొక్క) ఆదర + ఔచితిగ్ = ఆదరముయొక్క యుచితత్వముచే, కడుగ్, ఒప్పగ్, శుభగుణవశుఁడు = సద్గుణములకు వశుఁడు అనిపించుకొని ఆ యతి = ఆ మౌని, నారదుఁడనుట; నిజేచ్ఛగ్, చనగ్ = వెడలఁగా, నియతి = విధిచే, పిత్రాజ్ఞారూపవిధిచే ననుట; ఉదారుఁడు = గొప్పవాఁడు, అఖిలకృత్యవిదుఁడు= సర్వకార్యపరిజ్ఞాత.

తా. ధర్మాత్మజ, నీవేతగుదువనిపలికి పాండవుల గౌరవమునకుఁ బాత్రుఁడయి నారదుఁడు తనయిష్టానుసారమరిగెను. అంత నఖిల వేదియగు ధర్మరాజు. ముందరి పద్యముతో నన్వయము.

"నియతి" నియమమన్నందులకు; "నియతిర్నియమందైవే" అమరము.

" అనిపించుకొని. " ఇది ప్రేరణార్థకము.

"నిజేచ్ఛ" "అద్గుణః" గుణసంధి.

గీ. ఆయవనివరేణ్యుఁ డాయాగమవ్యయా
గమసముచితధర్మగతి నడుపుట
కై జయింపవలయు నాశలనన్నింటి
ననికృతిజనగోష్ఠి నాకళించి. 12

**రామాయణ.** ఆయవనివరేణ్యుఁడు = అట్టి రాజశ్రేష్ఠుఁడు, ఆయ+ ఆగమ = రాఁబడికి, వ్యయ = వెలవుకు, ఆగమ...గతిన్, ఆగమ = రాఁబడికి, సముచిత = తగినట్లు, ధర్మగతిన్ = ధర్మవర్తనమును, నడుపుటకై = జరుపుటకొఱకు, అనికృత = శఠత్వములేని, కపటరహితులనుట. జనగోష్ఠిన్ = జనులతోడి గోష్ఠిచే, ఆకళించి=తెలిసికొని, ఆయ వ్యయాది త్యాదుల నెఱింగియనుట; ఆశలన్, అన్నింటిన్ = సర్వాపేక్షల, జయింప వలయును, ఆశారహితుఁడై యుండవలయుననుట. ఆశారహితుఁడైననే యుచితధర్మము లాచరింప సమర్థుఁడగును.

తా. రాజు తన యాయ వ్యయములను దెలిసి యుచితమగునంత ధర్మ కార్యమాచరింప నిష్కపటులగు వారిగోష్ఠి నెఱిఁగి యాశారహితుఁడై యుండనగును.

ఇటఁ గొందఱు, ఆ + ఆగమ, వ్యయములనిపద విభాగముగావిం చెదరు కాని తచ్ఛబ్దమున కిటఁ బ్రసక్తిలేనందున ఆయ + ఆగమయని పదవి భాగముగావించుటయే సమంజసముగా నున్నయది.

నడపుట యని కొన్నియచ్చుప్రతులలో నుండినను ప్రాచీకగ్రంథ లములో నడుపుట యని యుండుటనదియే యుక్తమనితోఁచెడిని.

ఆగమ సముచితముగ ధర్మగతి నడుపుటకు "ఆయంబునందు నాల్గవ భాగమొండె మూఁడవభాగమొండె నందర్ధమొండెఁ, గాని వ్యయము సేయవలదు నరపతికిని." భారతము, సభాపర్వము.

ఇట రాజనీతిప్రకారము భారతకథ నడుపుటకై తెచ్చిపెట్టుకొనిన దయినను సమయోచితమగులాగునను, తెచ్చిపెట్టుకొనిన దనితోఁపకుండు లాగునను వర్ణించుట కవియొక్క చాతుర్యమును బ్రకటించుచున్నది.

భారత. ఆ యవని వరేణ్యుఁడు = ఆరాజశ్రేష్ఠుఁడు, ధర్మరాజనుట; అవ్యయ............గతిన్; అవ్యయ = నాశములేని, ఆగమసముచిత = వేదోచితమైన, ధర్మగతిన్ = ధర్మవర్తనమున, ఆయాగమున్ = ఆరాజసూయయాగమును, నడుపుటకై = చేయుకొఱకు, ఆశలన్, అన్నింటిన్ = అన్నిదిక్కులను, జయింపవలయును, అని, దిగ్విజయ మొనర్పవలయునని, కృతిజనగోష్ఠిన్ = పండితగోష్ఠిచే, ఆకలించి = తెలిసికొని.

తా. ధర్మజుఁడు వేదోక్తప్రకారమున రాజసూయయాగము జరుపఁదలఁచి దిగ్విజయము చేయవలయుననుట విద్వజ్జనములమూలమునఁ దెలిసికొని. "రిపులనేలఁగలిపె" ననువఱకుఁ గుళకము.

"ఆశ" అపేక్ష, దిక్కనుటకు, "ఆశాతుదిగీహయోః" నానార్థరత్నమాల.

"గోష్ఠి" సమజ్యా పరిష ద్గోష్ఠీ సభా సమితి సంసదః." అమరము.

"గావో నానావిధా వాచః తిష్ఠంత్య త్రేతి గోష్ఠీ. స్థాగతినివృత్తౌ." గురుబాల ప్రబోధిక. ఇట గోష్ఠిశబ్దమునకుఁ బ్రాధాన్యమీనవసరము దోఁపదు.

గీ. సత్త్వధర్మకళావిరాజత్ప్రతాప
ఘనుఁడు రాజులలోఁ బెద్ద యనఁగఁజనుప్ర
కృష్టతనుజరాసంధుఁడు కేవలముని
శ్రేష్ఠకర్మాతిమ్ముం డని యెన్నుమదిని. 13

రామాయణ. సత్త్వ = బలముచేతను, ధర్మకళా=ధర్మశాస్త్రముచేతను, విరాజత్ప్రతాప = ఒప్పుచున్న ప్రతాపముచేత, ఘనుఁడు = అధి

కుఁడైనవాఁడు, రాజులలోన్ = పెద్దయనఁగన్, చనున్ = క్షత్రియులలో నుత్తముఁడనఁ దగియుండును. ప్రకృష్ట=అధికమైన, తను=దేహముయొక్క, జరా = ముదిమియొక్క, సంధుండు = సంధానముగలవాఁడు, మిగుల వృద్ధుఁ డనుట. (ఐనప్పటికిని.) కేవలము = మిక్కిలి, నిజ + ఇష్ట = తనకిష్టమయిన, కర్మ = ప్రయోజనమునందు, అక్షముండు = అసమరుఁడు, అని, మదిని ఎన్ను = మనస్సునందెంచుకొనును.

తా. ధర్మశాలియును సత్త్వవంతుఁడును నగునృపుఁడే రాజులలోఁ బెద్ద యనిపించుకొనును గాన, మిగుల వృద్ధుఁడగుటచేతనా యతనికా పెద్దపేరుగలుగును ? నేను ముదుసలిగాన రాజ్యపాలనమున కీవే తగుదువని భావము.

"సత్త్వధర్మకళా" ముద్దరాజురామన్న సత్త్వశబ్దమునకు బలిమి యని యర్థము గావించెను గాని ధర్మకళాశబ్దమునకు ధర్మమని యర్థము గావించినపుడు సత్త్వశబ్దమునకు గుణమని యర్థము గావించుటయే సమంజస మగును.

"సత్త్వ." కొన్ని ప్రతులలో 'సత్వ' అని యున్నది కాని సతో భావః "సత్త్వ" మ్మని యగుటచేఁ దకార ద్విత్వమే యుండవలయును.

భారత. సత్త్వ...ఘనుఁడు; సత్త్వ = బలిమిచేతను, ధర్మకళా= ధనుర్విద్యచేతను, విరాజత్ = ప్రకాశించుచున్న, ప్రతాప = పరాక్రమము చేత, ఘనుఁడు = గొప్పవాఁడు, రాజులలోన్, పెద్ద యనఁగన్, చను = క్షత్రియులలో గొప్పవాఁ డనఁజను, ప్రకృష్టతను = గొప్పతనముచేతను, జరాసంధుండు = బృహద్రథతనూజుఁడు, కేవలము = మిక్కిలి, నిజ = తనదగు, ఇష్టకర్మ = యాగకర్మమునందు, అక్షముండు = ఓర్వనివాఁడు, క్షమారహితుఁ డనుట; అని, ఎన్నుమదిని = తలంచునట్టి మనస్సుచేత.

తా. బలముచేతను ధనుర్విద్యచేతను బ్రకాశించుచుండు శౌర్యము చేతను గొప్పవాఁ డగుటచే రాజులలో పేరెన్నిక గాంచినవాఁ డగు జరా

సంధుఁడు స్వీయ యాగము నోర్వఁడని మనస్సునఁ దలఁచినవాఁడై; విహిత సన్మంత్రుఁడగు నను ముందరి పద్యముతో నన్వయము.

"జరాసంధుఁడు." పూర్వము బృహద్రథుని భార్యలు రెండుమనుజ శకలములు దమకు జనించుటకు నా శకలములు వెలుపలఁ జాఱవై చిన జర యను రాక్షసి యా శకలముల నొక్కటం జేర్ప నదికిన శిశువయ్యె నను భారతకథ యిట ననుసంధేయము.

"ఇష్టకర్మ." "ఇష్టంయాగాది కర్మస్యాత్." అమరము.

"కేవలము నిజేష్టకర్మాక్షముండు." ఇటఁ గేవలశబ్దము సామాన్య వాచి "కేవలయోధనా, కేవలుఁడే." అని సోమయాజి ప్రయోగములు గలవు.

గీ. విహితసన్మంత్రుఁ డగుచువివేకఘనుఁడు
విహతి లేకొప్పనచ్యుతవిజయసంయు
తప్రహితభీమసేనోద్ధతిప్రవృద్ధి
చేతరిపునేలఁగలపెను సిరులు గొనుచు. 14

రామాయణ. విహిత... అగుచున్; విహిత=చేయఁబడిన, సన్మంత్రుఁడగుచున్ = ఇష్టజనులతోడఁ జేయఁబడిన యాలోచన గలవాఁడగుచు, తనకు గోచరింపని యంశములు మంత్రులు మున్నగువారితోఁ జేరి యాలోచించునని భావము; వివేకఘనుఁడు = తెలివిచే గొప్పవాఁడు, రాజు అనుకర్త యధ్యాహార్యము; అచ్యుత......ప్రవృద్ధిచేత; అచ్యుత = జాఱని, విజయ = జయముతోడ, సంయుత = కూడిన, ప్రహిత = మిక్కిలి హిత మైన, ప్రకర్షమైన హితమనుట; భీమ=భయంకరమైన, శత్రుభీకర మగున దనుట; సేన + ఉద్ధతి = సేనలయౌద్ధత్యముయొక్క, ప్రవృద్ధిచేతన్ = ప్రకర్షమైన వృద్ధిచే, మిక్కుటమగు పెంపుచేననుట, రిపునేలన్ కల=శత్రు భూమిలో నుండెడి, పెనుసిరులు గొనుచున్ = విశేషమగు సంపదలను గ్రహించుచు, విహతి = నాశము, లేక, ఒప్పన్.

తా. తనకుఁ దోఁపని యాలోచనల మంత్రులు మున్నగువారి మూల మున గ్రహించుచుండు జ్ఞానాధికుఁ డగు నరపాలుఁడు జయశీలము లగుచుఁ దన మేలు గోరుచు, శాత్రవ భయంకరములగు సేనల యౌద్ధత్యాభివృద్ధిచే శత్రు భూములంగల యైశ్వర్యమెల్లం గ్రహించుచు నొప్పుచుండును.

"విహిత సన్మంత్రుఁ డగుచు." "ఏలిక యాత్మబుద్ధిఁ దనకించుకఁ దోఁపని కార్యమాప్తుఁడై, చాల వివేకియైన ఘనుసన్నిధి నూహ యొనర్చి నేర్చినం, బోలఁగ నెల్లభంగులను బొందగుచుండు." పంచతంత్రము.

భారత. విహిత...అగుచున్; విహిత = చేయఁబడిన, సన్మంత్రుఁ డగుచున్ = మంచి యాలోచనగలవాఁ డగుచు, సదాలోచనా పరుఁ డనుట; వివేకఘనుఁడు, ధర్మరాజను కర్త యధ్యాహార్యము; విహతిలేక = నాశములేక, ఒప్పు, అచ్యుత...ప్రవృద్ధిచేత; అచ్యుత = కృష్ణునితో, విజయ = అర్జునునితో, సంయుత = చేరినట్టుగా, కృష్ణార్జున సహితముగా ననుట; ప్రహిత = పంపఁబడిన, భీమసేన = భీముని, ఉద్ధతి = ప్రహార ములయొక్క, ప్రవృద్ధిచేతన్ = మిక్కుటమగు పెంపుచే, సిరులన్ కొనుచున్=విజయలక్ష్మిం గ్రహించుచు,రిపున్ = శత్రువును, జరాసంధు ననుట; నేలన్, కలిపెన్ = మట్టిఁగలియం గానొర్చెను, సంహరించె ననుట.

తా. సదా లోచనాపరుఁడగు ధర్మరాజు కృష్ణార్జున సహితముగా భీము నంపి యతని ప్రహారములచే జరాసంధుని సంహరించి విజయలక్ష్మిం గ్రహించెను.

ఇట సిరులంగొనుచు ననుటలోఁ గొందఱు రామాయణార్థమునందు వలె ఐశ్వర్యము గ్రహించెనని యభిప్రాయపడెదరు కాని విజయలక్ష్మిం గ్రహించెననియే కవి యాశయము. ఇట్లే భీమసేనోద్ధతియను స్థలమునను గొందఱు భీమసేనుని గర్వమని యభిప్రాయపడెదరు కాని భీమసేనుని ప్రహారమనియే కవి యాశయ మగును.

"ఉద్ధతి." ఉత్+హతి = ఉద్ధతి, ఉద్హతి యని యగుటకు; "వర్గ హల్లులకు హకారము పరమగునపుడు వర్గహల్లు తృతీయాక్షరముగాను, హకారము చతుర్థవర్గముగాను వైకల్పికముగా నగును." అస్మదీయమగు ఆంధ్ర విజ్ఞానచంద్రిక.

మ. స్వనిదేశోన్నతి నంతట న్నెఱయుచున్ శక్తిం జతుర్దిఙ్నరేం
 ద్రనికాయంబును గెల్చి తమ్ములసమానప్రాప్తవిత్తార్పణం
 బునఁ దన్పన్ వశులైన బ్రాహ్మణులతోఁ బూర్ణాధ్వరారంభుఁడై
 యనఘశ్రీఁ బృథివీశుఁ డొప్పెసఁగు రూఢాపూర్వసత్కీర్తితోన్.

రామాయణ. స్వ...ఉన్నతిన్; స్వ = తనయొక్క, నిదేశ = ఆజ్ఞయొక్క, ఉన్నతిన్ = మహిమచే, అంతటన్ = ఎల్లెడలను, నెఱయుచున్ = వ్యాపించుచు, శక్తిన్ = సామర్థ్యముచే, చతుర్దిక్...... నికాయంబును; చతుర్దిక్ = నాల్గుదిక్కులందుఁగల, నర + ఇంద్ర = రాజులయొక్క, నికాయంబును = సమూహమును, గెల్చి = జయించి, తమ్మున్, [ఇటఁ దమ్మునను టబ్రాహ్మణుల ననుట.] లసమాన...విత్తార్పణంబునన్; లసమాన = ఒప్పునట్లుగా, ప్రాప్త=పొందఁబడిన, ధర్మముచే సంపాదింపఁబడినదనుట; విత్త + అర్పణంబునన్ = ద్రవ్యమిచ్చుటచేత, తన్పన్ = తృప్తిపఱుపఁగా, ధర్మవర్తనమున ద్రవ్యార్జనము గావించి దానిని బ్రాహ్మణులకుఁ దనియులాగున దానమొనర్చి యనిభావము; దానికతమున, వశులైన = స్వవశులైన, బ్రాహ్మణులతోన్, పూర్ణాధ్వరారంభుఁడై = పూర్ణములగు యజ్ఞముల ప్రారంభముగలవాఁడయి, అనఘశ్రీన్ = పాపరహితమగు శ్రీచే, నిర్మలశ్రీచే ననుట; రూఢ...కీర్తితోన్ = రూఢ = స్థిరమైన, అపూర్వ = నూతనమైన, వింతయగునదనుట; సత్, కీర్తితోన్ = మంచికీర్తితో, ఒప్పెసఁగున్ = మనోజ్ఞుఁడగును.

తా. తనయాజ్ఞ యన్నిస్థలముల వ్యాపించుచుండఁ దనభుజశక్తిని నల్దిక్కులనుండు రాజులం గెల్చి ధర్మార్జితమైన ద్రవ్యముతో బ్రాహ్మణులం

దృప్తిపఱచి వారితోఁగూడి యజ్ఞములనారంభించి సంపత్కీర్తులకు స్థాన మగుచు రాజిల్లెను.

"అంతటన్." సర్వపర్యాయమగు నంతశబ్ద మాపవిభక్తికాంతమై ఇట్టిరూపముదాల్చెను. దీనికీయాపవిభక్తికాంతత వైకల్పికమనిగ్రహించునది. "అంతయుదానయై వెలసి," "అంతకు నొక్కఁడేగలఁడు." అస్మదీయ మగు పద్మావతీపరిణయ నాటకము.

"చతుర్దిఙ్నరేంద్ర" "యరోనునాసికేనునాసికేవా," పాణిని.

"నికాయంబు." "అథసధర్మిణాం స్యాన్నికాయః" అమరము.

భారత. స్వనిదేశోన్నతిన్, అంతటన్, నెఱయుచున్, అన్ని స్థలముల వ్యాపించుచు, శక్తిన్, చతుర్దిక్ + నరేంద్ర, నికాయంబును = నలుదిక్కుల రాజులసమూహమును, గెల్చి, తమ్ములు = భీమాదులు, అసమాన = సాటిలేనట్లుగా, ప్రాప్త, విత్తార్పణంబునన్, తాముయుద్ధముల విశేషముగాఁ బొందినద్రవ్యమార్జించుటచే ననుట; తన్పన్, పశస్తైన, బ్రాహ్మణులతోఁజేరి, పూర్ణ = పూర్తియైన, అధ్వర = యాగముయొక్క, ఆరంభుఁడై = ప్రారంభముగలవాఁడయి, సగురు......కీర్తితోన్; సగురు = తండ్రితోఁ గూడినట్లుగా, ఊఢ = వహింపఁబడిన, అపూర్వ, సత్కీర్తితోన్=మంచికీర్తితోడ, అనఘశ్రీన్, పృథివీశుఁడు=ధర్మరాజు, ఒప్పెన్.

తా. తనయాజ్ఞ జగమెల్ల వ్యాపింపఁగ తమ్ములు నిజబాహుబలమున నల్దిక్కులందలి రాజులంజయించి తెచ్చిన ధనముచే బ్రాహ్మణులం దృప్తి పొందించి, వారిసహాయమున యజ్ఞపరిపూర్తి గావించి జగన్నుత కీర్తియై యైశ్వర్య యుక్తుఁడై వెలసెను.

"ఒప్పెసఁగురూఢాపూర్వ." ఇట రామాయణార్థమున ఎసఁగున్ అని యర్ధబిందువు కల్గుటయు, భారతార్థమున "సగురు" అని యనుస్వారము లోపించుటకును "శ్లేషేసబిందు నిర్బిందోస్సర్వేశ నంయుక్తచిన్నతం." అథర్వణ కారికావళి.

ఉ. క్లిష్టత యించుకంతయును లేక మనఃప్రమదంబుతోడ నా
యిష్టము నిర్వహించి పృథి వీశులలోపల నర్హభీష్మసం
శిష్టిమెయిన్ గరంబొనరిఁ జెందుదు నుత్తమపూజ చక్రికు
త్కృష్టత నుర్విలోన సమ తేజుఁడ వీవని పల్కె నెమ్మితోన్.

రామాయణ. క్లిష్టత=క్లేశత, ఇంచుకంతయును, కొంచెమేనియు, లేక, మనఃప్రమదంబుతోడన్ = చిత్తసంతుష్టితో, నాయిష్టమున్=నాకోరిక్కెని, నిర్వహించి, పృథివీశులలోపలన్ = రాజులలో, అర్హా...సంశిష్టిమెయిన్, అర్హా = తగిన, భీష్మ = భీకరమైన, సంశిష్టిమెయిన్ = గొప్పయాజ్ఞచే, కరంబు = మిక్కిలి, ఒనరి = తగి, అనుత్తమపూజన్ = అత్యుత్తమపూజను [అవ్యయములకనేకార్థములు గలుగుటచే నిటనిది నిషేధవాచిగా నేరదు.] చెందుదు = పొందఁగలవు. [లిడ్లాట్టుల వకారమునకు వైకల్పికముగా లోపముగల్గుటచే నిట నిట్టిరూపముగల్గెను.] ఈవు = నీవు, ఉర్విలోనన్ = భువిని, ఉత్కృష్టతను = శ్రేష్ఠత్వముచే, చక్రికిన్ = విష్ణునకు, సమతేజుఁడవు = సమానమగు తేజముగలవాఁడవు. ఇటఁ దుల్యార్థమునఁ దృతీయకుమాఱుగా షష్ఠిగల్గెను.] అని, నెమ్మితోన్ = ప్రీతితో, పల్కె.

తా. క్లేశరహితుఁడవై మనస్సంతుష్టితోడ నాకోరికనీడేర్చి రాజులలో సమ్యగాజ్ఞాప్రవర్తనుఁడవై గొప్పపూజను బొందగలవు. నీవీరాజులలో శ్రేష్ఠత్వమున విష్ణువుతో సమానమగువాఁడవని దశరథుఁడు రామునితోఁ జెప్పి; నడపెనని ముందరిపద్యమునఁ గ్రియ.

"ఇంచు కంతయును." ఇటనంతయనునది పరిమాణార్థమున శబ్దముకడఁజేర్చునట్టి నిపాతము.

"అనుత్తమపూజ." ఇటననుత్తమశబ్దము పంచమీ బహువ్రీహిగను గావింపవచ్చును.

భారత. క్లిష్టత, ఇంచుకంతయును, లేక = కొంచెమేనియులేక, మనఃప్రమదంబుతోడన్ = మనస్సంతోషముతో, ఆయిష్టము=ఆయజ్ఞకర్మము, హోమదానాది క్రియలనిభావము ; నిర్వహించి=చేసి, పృథివీశులలోపలన్= అచ్చటికి వచ్చినరాజులలోపల, అర్హా...మెయిన్ ; అర్హా = తగిన, భీష్మ

సంశిష్టి మెయిన్ = భీష్మునియాజ్ఞచే, తుదన్, ఉత్కృష్టతన్, ; ఉర్వీలోన్, అసమతేజుఁడవు=సాటిలేని తేజముగలవాఁడవు, అని, నెమ్మితోన్, పలికి, కరంబు = మిక్కిలి, చక్రికిన్ = కృష్ణునకు, ఉత్తమపూజ = అగ్రపూజ, ఒనరించెన్ = చేసెను.

తా. ధర్మరాజా రాజసూయమును నిర్వర్తించి భీష్మాచార్యుల యాజ్ఞచే శ్రీకృష్ణునకగ్రపూజగావించెను. "ఇష్టము" "అధ్వరక్రతు కర్మేష్టం" అమరము. ఇష్టమనుటకు హోమదానాది క్రియలని యర్థముగావించుటకు "ఏకాగ్నికర్మ హవనం త్రేతా యాంయచ్చ హూయతే, అంతర్వేద్యాంచ యద్దానమిష్టంత దభిధీయతే" అని స్మృతిప్రమాణము గలదు.

గీ. మఱియుఁ దగుమాట లాడి యమర్త్యకార్య
నియతలీలావతారు నసన్నీలవర్ణు
స్నేహరసమున నభిషిక్తుఁ జేయ నతఁడు
లలి నడపె నప్డు తచ్ఛుభలగ్నచింత. 17

రామాయణ. మఱియున్ = ఇంకను, తగుమాటలు, ఆడి = తగిన మాటలుచెప్పి, అమర్త్య...అవతారున్; అమర్త్య=దేవతలయొక్క, కార్య= పనికొఱకు, నియత = నిర్ణయింపఁబడిన, లీలావతారున్ = విలాసార్థమగు నవతారముగలవానిని, దేవకార్య నిర్వాహణమునకై లీలామానుషుఁడై యవతరించిన వానిననుట; అసన్నీలవర్ణున్ = ఆనల్లని వన్నెగలవానిని, నీలరూపుఁ డగు రామునినుట; స్నేహరసమునన్=పుత్రస్నేహరసముతో, అభిషిక్తున్ చేయన్ = పట్టాభిషిక్తునిఁగాఁ జేయుటకొఱకు, అతఁడు = దశరథుఁడు, లలిన్ = మిక్కిలి, అప్డు, తచ్ఛుభలగ్నచింతన్ = పట్టాభిషేకమునకు వలయు నాశుభలగ్నముం గుఱించిన విచారమును, నడపెన్ = జరిపెను.

తా. దశరథుఁడు దేవకార్యార్థమై లీలామానుషావతార మెత్తిన రామచంద్రునిందగు మాటలాడి పుత్రస్నేహమునం బట్టాభిషిక్తుం గావింపఁదలఁచి దానికివలయు లగ్నవిచారము గావించెను. "లలిన్." "లలివార కేడ్తెఱ

పెలుచవావిరియన, నతిముఱియనఁ బోరిఁ బోరియనంగఁ, గడుఁజాలమిగు లంగ గాటం బనంగన, త్యంతముగ ననుట కాఖ్యలయ్యె.'' ఆంధ్రనామ శేషము.

భారత. మఱియును, తగుమాటలు, ఆడి = పలికి, అమర్త్య కార్య నియతలీలావతారుఁ, అన్నిలపర్ణుఁ=అనల్లని వన్నెగలవానిని, విష్ణురూపుఁ డగు నాకృష్ణుననుట; స్నేహరసమునఁ = మైత్రి యనెడి జలముచే, అభిషిక్తుంజేయఁ = స్నాతుంజేయఁగా, స్నేహరసము వర్షించి యని భావము ; అతఁడు = ఆకృష్ణుఁడు, అప్పు, తత్ = ఆధర్మరాజుయొక్క, శుభలగ్న= శుభములయందు లగ్నమైన, చింతఁ = లలిఁ, నడపెఁ=జరిపెను. అతని యిష్టము చొప్పున నగ్రతాంబూలము గ్రహించెనని భావము.

తా. ధర్మజుఁడు శ్రీకృష్ణుని నుతించి యగ్రపూజ యొనర్పఁగ నతఁడా ధర్మజు నిష్టము చొప్పున నప్పూజం గ్రహించెను.

చ. సువిభవభూతిఁ బేర్చు హరిసొంపవుఁగాదనుశ్రీమదాత్మవై
భవము వెలార్చుచుం బ్రబలభవ్యతదీయ సుదర్శనంబుచే
దివిభువినున్న సభ్యవితతిం బరికల్పిత సాధులోచనో
త్సవవిధిమైనితాంతము దితత్త్వముఁజెందగఁజేసె నంతటన్.

రామాయణ. సువిభవభూతిఁ = మిక్కుటమగు వైభవసంపదచే, పేర్చు = అతిశయించు, హరిసొంపును = ఇంద్రుని చందమును, అవుఁ, కాదు, అను=అవును, కాదు, అనెడి, మించినదనుట; శ్రీమత్=సంపద్యుక్తమైన, మిక్కిలి వృద్ధినందినదని భావము; ఆత్మవైభవము=తనయొక్క విపులత్వమును, వెలార్చుచుఁ=ప్రకాశింపఁజేయుచు, ప్రబల...సుదర్శనంబుచేఁ; ప్రబల=ప్రబలమైన, భవ్య = శుభముగల, తదీయ = ఆవైభవసంబంధమగు, సుదర్శనంబుచేఁ = చక్కనిచూపుచే, దివిఁ, భువిఁ, ఉన్న=ఆకాశము నందును, భూమియందునున్న, సభ్యవితతిఁ = సభాసదులగుమిని, సుర భూసురుల ననుట; అంతటఁ = సర్వత్ర, పరికల్పిత......విధిమై ; పరి

కల్పిత = కలిగింపఁబడిన, సాధు=లెస్సయగు, లోచనోత్సవవిధిరై = నేత్రానంద విధముగలదై, నితాంత ముదితత్వము = మిక్కిలి సంతుష్టత్వము, చెందఁగన్ చేసెను = చెందులాగొనర్చెను, "అతఁడు" అని పూర్వపద్యమునుండి కర్త యనువర్తించుచున్నది.

తా. ఆ దశరథుఁడ తీంద్రమగు నిజవైభమున సుర భూసురవరుల కానంద మొదవించెను.

" భవ్య. " "భావుకంభవుకం భవ్యం" అమరము.

భారత. అంతటన్, ఆవల, సువిభవ భూతిన్ = మంచివైభవమనెడి సంపదచే, పేర్చు, హరి = కృష్ణునియొక్క, సొంపును, అవున్, కాదు, అను = అవును కాదు అనెడి, నిందించుచుండు వానిననుట; శ్రీ...వైభవము; శ్రీమద=సంపద్యుక్తమైన గర్వముగలవానిని, [ఉత్తమధ్యమపదము] ఆత్మ = తనయొక్క, వైభవము, వెలార్చుచున్ = ప్రకటముగావించుచు, ప్రబలన్=అతిశయింపఁగా, వినున్న...వితతిన్; వినున్న = తిరస్కరింపఁబడిన, సభ్యవితతిన్=సభ్యులసమూహము గలవానిని, ఐశ్వర్యమదమున నిజవైభవము ప్రకటింపుచుఁ గృష్ణునకగ్రపూజగావించుటచే నటఁగల సభ్యులనెల్లదూషించుచుండనట్టివాని ననిభావము. చేదివిభున్=చేదిదేశపురాజును, శిశుపాలునను‌ట. భవ్య...సుదర్శనంబు = భవ్య=మంగళకరమైన, తదీయ=ఆకృష్ణునకు సంబంధించిన, సుదర్శనంబు = చక్రము, పరికల్పిత...విధిరై; పరికల్పిత = కలిగింపఁబడిన, సాధు = సత్పురుషుల, లోచనోత్సవవిధిరై= నేత్రానందవిధిగలదై, [ఇది సుదర్శనమునకు విధేయ విశేషణము.] నితాంతము = మిక్కిలి, దితత్వమున్ = ఖండితత్వమును, చెందఁగన్, చేసెన్ = పొందులాగొనర్చెను. శిరఃఖండన మొనర్చెదని భావము.

తా. ఐశ్వర్యమదముచే నిజవైభవము ప్రకటించుచు నట్లు కృష్ణునకగ్రపూజ గావించినందుల కచ్చటి సభాసదుల నిందించుచుండు శిశుపాలుని శ్రీకృష్ణుని చక్రము ఖండించెను.

ఇట "వినున్న సభ్యవితతిం" అను స్థలమునం గొందఱు విను+ఉన్న; సభ్యవితతిం, అని పదచ్ఛేదము గావించి, ఆకసమున నున్న యని యర్థము గావించెదరు కాని ప్రథమాంతమగు విను శబ్దము సప్తమ్యర్థమున రాదు కాన నట్టి యర్థ మసంగత మగును. మఱియు సభాజనుం దూషించె ననుట సందర్భోచితముగ నున్నది. కావున నియ్యదియే సమంజసము.

సీ. ఘనధర్మసుతరాజ్యఘటన యాశలనట్లు
దనరుచునికిం గనుంగొని యసహ్య
మానతద్వైభవమందరోన్మథితహృ
ద్విషధివిషాయితద్వేషభరత
జనని గర్హ్యాచారమునకోడ కెట్లో యే
మం(ౘా బంధువు లన్యాదిగుణగు
రుతమాయనాడుదురోదరం బట్టిచో
నూహింప నౌచిత్యయుక్త మనక

గీ. తద్వ్యధిని హరియించె నత్యంతదుష్ట
మతిని దుర్యోధనుండు సపత్నితనయుండ
జాతశాత్రవరాజ్య విభూతిమీఱు
టుల్లమున నించుకంతయు నోర్వలేక. 19

రామాయణ. ఘన...ఆశలన్ - ఘన = గొప్పదగు, ధర్మ = ధర్మముతోఁ గూడిన, సుత = కుమారునియొక్క, రామునియొక్క యనుట; రాజ్యఘటన = రాజ్యమును చేర్చుటయందుఁ గల, ఆశలన్ = అపేక్షలచే, [ఇది సాధ్యసమాసము.] అట్లు, తనరుచునికిన్ = ఒప్పుచుండుటను, కనుఁగొని = చూచి, [ఇది శబ్దపల్లవక్రియ] అసహ్యమాన .....ద్వేష; అసహ్యమాన = సైరింపఁజాలని, తద్వైభవ = ఆరాముని వైభవముగల, రాముని వైభవముం గాంచి యోర్వలేని దనుట; మందర+ఉన్మథిత హృద్విషధి =

మందరచే మథింపఁబడిన హృదయమనెడి సముద్రమునకు, విషాయిత = హాలహాలవిషమువలె జనించిన, ద్వేష = వైరముగల, భరతజనని = భరతుని మాత, కైకేయి యనుట; గర్హ్యాచారమునకున్ = నింద్యాచారమునకు, ఓడక = వెనుదీయక, ఎట్లో = ఏమగునో, తన యీ యకార్యముచే మీఁద నేమగునో యని తలంపక యని భావము; బంధువులు = బాంధవులు, ఏమంద్రో = నన్నేమని దూషింతురో, అన్వయాది గుణగురుతన్ = సద్వంశాది సద్గుణ గౌరవమును, మాయన్ = నశించులాగున, ఆడుదురో = పలుకుదురో, తూలింతురో యనుట; ఇట్టిచోన్=ఇట్టి సమయమున, దరంబు= భయంబు, ఊహింపన్ = ఆలోచింపఁగా, ఔచిత్యయుక్తము = ఉచితత్వ సంయుక్తము, ఇట్టియెడ భయపడుట యుచిత తరమనుట; అనక = అని చెప్పక, తలంపక యనుట; అత్యంతదుష్టమతిని = మిక్కిలి దుష్టమగు బుద్ధిచేత, దుర్యోధనుఁడు = పోర శక్యము గానివాఁడు. సపత్నీతనయుండు = చవతికొడుకు, రాముఁడనుట; (ఇది సాధ్యసమాసము.] అజాత...విభూతిన్; అజాతశాత్రవ = నిష్కంటకమైన, రాజ్యవిభూతిన్ = సామ్రాజ్యైశ్వర్యమున, మీఱుట = అతిశయించుట, ఉల్లమునన్ = మనస్సున, ఇంచుకంత యున్ = కొంచెమేని, ఓర్వలేక, తద్విధిని = ఆపట్టాభిషేక కార్యమును, హరియించెన్ = నాశము గావించెను.

తా. దశరథుఁడు రామునకుఁ బట్టాభిషేకముగావింప నాసపడుచుండుటఁగని కైకేయి మందరాకులిత మానసమనెడి సముద్రమునఁ గాలకూటవిషాయితమగు ద్వేషముగలదగుచు, సవతికొడుకగు రామునిసామ్రాజ్య వైభవము చూడనోపక, లోకులేమనెదరో, ఈ యకార్యమున నేమగునో, తనకపకీర్తి గలుగునో యని తలంపక యాతనిపట్టాభిషేకకార్యమునకు భంగము గల్పించెను.

"హృద్విషధి." ఇది రూపకము.

"గర్హ్యాచార" దండాదిభ్యోయః." పాణిని.

"విమథివిషాయిత." విమథి యగుటనందు విషాయితత్వము సహజ మని భావము.

"దరంబిట్టిచో .నూహింపనౌచిత్యయు క్తమనక." ఇటఁ గొందఱు, "ఊహింపక + ఔచితి + అయు క్తము + అనక." అని పదచ్ఛేదము గావించిరికాని "ఇట్టి చోదరంబూహింప నౌచిత్యయు క్తము + అనక." అని పదచ్ఛేదము గావించుట సందర్భశుద్ధముగ నున్నది.

"అంద్రో." తిదుటలుపరంబగునపుడన్వాదులను స్థానంబున విభావగా నున్నయగుట నందురు + ఒ అనియయి, రువర్ణకంబు పరంబగు నపుడు నున్నమీఁది తదడలయుత్వంబునకు లోపంబు విభావనగుట నిట నంద్రు+ఒ = అంద్రో అనురూపము నిష్పన్నమయ్యెను.

భారత. ఘన, ధర్మసుత = ధర్మపుత్రుని, రాజ్యఘటన = రాజ్యప్రాప్తి, ఆశలక = దిక్కులందు, అట్లు, తనరుచునికిక, కనుఁగొని = చూచి, అసహ్యమాన ... భరతక ; అసహ్యమాన = సైరించుటకుఁగాని, తత్, వైభవ = ఆధర్మజుని వైభవమనెడి, మందర=మందరపర్వతముచే, ఉన్మథిత = చిలుకబడిన, హృత్, విమథి = హృదయమనెడి సముద్రమునకు, విషాయిత, ద్వేషభరతక = విరోధాతిశయముచే, జన నిగర్హాశీ ఆచారమునకుక = జనులచే నిందింపఁబడు నాచారమునకు, ఓడక = వెను దీయక, ఎట్లొ, అన్వయాదిగుణ గురుతక = సద్వంశము మున్నగువాని వలని గుణగౌరవమును, బంధువులు = భీష్మాదులు, ఏమంద్రో = ఏమనియాడు దురో, మాయక, ఆడు = మాయచే నాడునట్టి, దురోదరంబు=జూదము, ఇట్టిచోక, ఊహింపక, ఔచితి=ఉచితత్వముతోడ, అయుక్తము=కూడనిది, ఉచితముకానిదనుట; అనక, తద్విధిని=అద్యూతకార్యముచే, అత్యంత దుష్టమతిక=మిక్కిలిదుష్టమగు బుద్ధిచే, సపత్నిత=విరోధిగాఁ జేయఁబడిన, నయుండు = నీతిగలవాఁడు, నీతి విదూరుఁడని భావము; దుర్యోధనుండు, కర్త; అజాతశాత్రవ = ధర్మజునియొక్క, రాజ్యవిభూతిని = సామ్రాజ్య

వైభవమును, మీఱుట = అతిశయించుట, ఉల్లమునన్, ఇంచుకంతయున్, ఓర్వలేక, హరియించెన్ = అపహరించెను, ధర్మజుని రాజ్యవైభవము హరించెననుట.

తా. ధర్మజ రాజ్య విస్తృతింగాంచి యోర్వఁజాలక దుర్యోధనుఁడు తన యీ యకార్యము మూలమునఁ దుదకెట్లగునో యనుటనుగాని భీష్మాదులదిగాంచిన నేమందురో యనుటఁగాని, మాయాద్యూత మనుచిత మనుటఁగాని యాలోచింపక దుర్యోధనుఁ డత్యంతదుష్టబుద్ధియై జూదము మూలమున ధర్మజుని రాజ్యవైభవమెల్ల నపహరించెను.

"దురోదరంబు" "రణేద్యూతేదురోదరం." అమరము.

"సపత్న." "రిపౌవైరిసపత్నారిద్విషద్ద్వేషణదుర్హృదః" అమరము.

సీ. అవ్వేళ భవితవ్య । తానుసారితఁ బ్రియ
కైతవదాసీకృ । తాతిమన్యు
గళితప్రమోదయై । కృష్ణసారప్రేక్షు
ప్రబలోగ్రతనుస్వక । పటము దోఁప
మలయుదుశ్శాసన । మత్సరంబున శంకి
తత్వంబు నొంది స । త్వరిత యగుచు
స్వపురస్థితిఁ దనర్చు । చక్రిలీలామ ర్త్య
మూ ర్తి నుద్దేశించి । ముదిత వలికెఁ
గీ. దా మునుపు గన్నయాత్మనా । థ వరశక్తి
గడుపరాజితయై యప్డు । గానుపింప
ధర్మపాశసంయుత నిరు । త్తరని జాధి
ప్రతిసదై న్యేక్షితానన । పద్మ యగుచు.

రామాయణ. అవ్యేళ౯=అసమయమున, భవితవ్యతానుసారిత౯ = భావినిర్ణయానుసారమున, ప్రియ...ప్రమోదయై; ప్రియ=చెలియగు, కైతవ= కపటయుక్తురాలగు, దాసీ = దాసియగు మందరచేత, కృత = చేయఁబడిన, అతిమన్యు = మిక్కిలిక్రోధమువలన, గళిత = పోయిన, ప్రమోదయై = సంతసముగలదై, కృష్ణసారప్రేక్ష = కురంగనయన, కైకేయి యనుట; ప్రబలోగ్రతను = ప్రబలమైన క్రౌర్యముచే, స్వకపటము = తనకాపట్యము, తోఁప౯ = తోఁచునట్లు, మలయు = ఉండు, దుశ్శాసన = అణఁచుటకు శక్యముగాని, మత్సరంబు౯ = చూపోపమియు, అశంకితత్వంబు౯ = శంకలేకుండుటయును. [ఇది మత్సరంబుననుటకు విశేషణము.] ఒంది = పొంది, సత్వరిత యగుచు౯ = వేగసహితయగుచు, స్వపురస్థిత౯ తనర్చు = తనముందట నొప్పుచు, చక్రి ... మూర్తి౯; చక్రి = విష్ణుని యొక్క, లీలామర్త్యమూర్తి౯ = లీలామానుష రూపమును, రామునను‌ట; ఉద్దేశించి, ముదిత = స్త్రీ, కైకేయి యనుట; తామునుపుగన్న = తాను మునుపు చూచిన, ఆత్మనాథ = తన పెనిమిటియొక్క, దశరథునియొక్క యనుట; వరశక్తి = వరములనెడి శక్తి, కడు౯ = మిక్కిలి, పరాజితయై=పరులచేత నివారించుటకు సాధ్యముగానిదై, అపుడు, కానుపింప౯, ధర్మ.....పద్మ; ధర్మపాశ=ధర్మమనెడి త్రాళ్లచే, సంయత = కట్టఁబడుటచే, హేతువు; నిరుత్తర = బదులాడని, నిజాధిపతి = తనభర్త యొక్క, దశరథునియొక్కయనుట; సదైన్య = దీనత్వముతోఁ గూడినట్లుగా, ఈక్షిత = చూడఁబడిన, ఆననపద్మ = పద్మమువంటి ముఖము కలది, [ఉపమిత బహువ్రీహి] అగుచు౯, పలికె౯.

తా. కైకేయి మందరోద్బోధితయై కుపితురాలగుచుఁ దనయెదుట నుండు లీలామానుష విగ్రహుఁడగు శ్రీరామచంద్రుని వీక్షించి, తనకు దశరథుఁడు పూర్వమొసఁగిన వరద్వయముం దెలిపెను. దశరథ మహీకాంతుఁడును ధర్మపాశబద్ధుఁడగుటచేఁ బదులేమియు నాడనేరక నిట్లని పలికెను.

"కృష్ణ సార." "కృష్ణసారరురున్యంకుశంబరరౌహిషాః," అమరము.

"కృష్ణేన నీలవర్ణేన సారః." గురుబాలప్రబోధిక. నల్లవన్నె చేత శ్రేష్ఠమగునదని యర్థము.

"మత్సర" "మత్సరోన్యశుభద్వేషే తద్వత్కృపణ యోస్త్రిషు." అమరము.

"మన్యు" "మన్యుర్దైన్యే క్రతౌ క్రుధి." నామలింగానుశాసనము.

"ముదిత." "ముగుదవగలాడి సింగారి ముదిత యువిదగరితయన భామినీ సమాఖ్యలగుసాంబ" సాంబనిఘంటువు.

భారత. అవ్వేళన్ = అట్లుజూదమాడుసమయమున, భవిత వ్యతాను సారితన్ = అదృష్టానుసారముగ, ప్రియ......ప్రమోదయై; ప్రియ = ప్రియుఁడగు ధర్మజుని, కైతవ = జూదముచేత [కితవుని కర్మముకైతవము] దాసీకృత = దాసిగాఁ జేయఁబడినదై, [ఇదిహేతువు] అతిమన్యు = అత్యంతశోకముచే, గళిత = భుక్తమైన, ప్రమోదయై = సంతసముగలదై, దాసిగాఁజేయఁబడుటచే నీబిడకు జనించిన శోకము సంతసమును నశింపఁ జేసెనని భావము; సారప్రేక్ష = సారమగు బుద్ధిగలదగు, కృష్ణ = ద్రౌపది, ప్రబల, ఉగ్రతను, స్వక, పటము = తనదగువస్త్రము, [స్వార్థమునకప్రత్యయము.] దోఁపన్ = అపహరించుటకు, [దోఁచుధాతువు మీఁదిపుగాగమము.] మలయు = ప్రయత్నించు, దుశ్శాసన = దుశ్శాసనునియొక్క, మత్సరంబునన్ = మాత్సర్యముచే, శంకి తత్వంబున్, ఒంది=సందేహించి, దుశ్శాసనుని మూలమునఁదన కెచటమానభంగము గల్గెడినో యని భయపడియని భావము, సత్వరితయగుచున్ = త్వరతోఁ గూడినదగుచు, స్వపుర, స్థితిన్, తనపట్టణమగు ద్వారకయం దుండుటచే, తనర్చు = ఒప్పుచుండు, లీలామర్త్యమూర్తిన్, చక్రిన్ = కృష్ణుని, ఉద్దేశించి = తలంచి, తాన్ మును కన్న = తాను ముందుఁ గాంచిన, ఆత్మ = తనయొక్క, నాథ =

భర్తల, వర = శ్రేష్ఠమైన, శక్తి = బలము, కడు, పరాజితరై = మిక్కిలి జయింపఁబడినదై, శాత్రవవిజయముచేఁ దన నాథుల పూర్వపుశక్తి నశించె నని భావము; అప్డు, కానుపింపఁగా =కనుపింపఁగా, ధర్మపాశ......పద్మ; ధర్మ, పాశ, సంయత, ధర్మమనెడి త్రాటిచేఁ గట్టఁబడిన, [ఇది నిరుత్తర తకు హేతువు] నిరుత్తర, బదులులేని, ధర్మపాశముచేఁ గట్టువడుటచే నుత్తరము చెప్పఁజాలక పోయిరని భావము, నిజాధిపతి = తన భర్తలచే, సదైన్య = దీనత్వముతోఁ గూడినట్లుగా, ఈక్షిత = చూడఁబడిన, అనన పద్మ, అగుచుఁ, ముదిత = ద్రౌపది, పలికెఁ = ఇట్లు పలికెను.

తా. విధివశమున ధర్మజుఁడు జూదమాడి భార్యనొడ్డి యోడుటచే దాసీకృత యగుచు నకారణమున జనించిన దుఃఖమున గతహర్షయైన ద్రౌపది, క్రౌర్యమున దుశ్శాసనుఁడు నిజవస్త్రము నపహరింప రాఁగ నెచ్చటఁ దనకు మానహాని యగునో యని భయమంది తత్తరపడుచు, మున్ను దమ కుండిన పరాక్రమమంతయు ద్యూతజితు లగుటచే నశింప ధర్మపాశగ్రస్తులై తన భర్తలు తన్ను దీనతతోఁ జూచుచుండ, ద్వారకావాసియగు కృష్ణుని మానసమున ధ్యానించి యిట్లు పలికెను.

"గళితప్రమోదయై;" కొన్ని ప్రతులలో "గళిత ప్రమోదయై యని పాఠము గాన్పించుచున్నది కాని ప్రాచీనప్రతులలో నెల్ల "గళితప్రమోదయై," అను పాఠమే కాన్పించుచుండుటచే నే నద్దాని ననుసరించితిని. గళిత యనుటకు భుక్తమని యర్థము గావించుటకు "భక్షిత చర్వితలిప్త ప్రత్యవసితగళిత ఖాదితప్సాతం,అభ్యవహృతాన్న.జగ్ధగ్రస్తగ్లస్తాశితం భుక్తే." అమరము.

"సారప్రేక్షు." "ప్రేక్షోపలబ్ధి శ్చిత్సంవిత్ప్రతిప ద్ఞప్తిచేతనాః." అమరము.

"కైతవ." ద్యూతోస్త్రియా మక్షవతీ కైతవం పణ ఇత్యపి." అమరము.

"స్వపురస్థితి." ఇట రామాయణార్థమున పురః+స్థితి = పురస్స్థితి యని సకారద్విత్వముగాను, భారతార్థమున పురస్థితి అని ద్విత్వరహితము గాను నగుచుండ, రెంటను సకార ద్విత్వరహితరూప ముండుటయు శ్లేషార్థ సంఘటనమున నేర్పడిన మార్పె యగును. అదియు "శర్పరే విసర్జనీయః" అను పాణిని సూత్రాధారమునఁ గావింపఁబడెను. "ధర్మపాశసంయత." కొన్ని ప్రతులలో సంయుతయని యున్నది కాని పెక్కు ప్రతులలో సంయత యనియే కానవచ్చుటచే నే నద్దాని ననుసరించితిని. ఈ రూప మెంతయు సందర్భశుద్ధముగ నున్నది.

"ధర్మపాశ." ఇట ధర్మమున పాశత్వారోపణము గల్గుటచే నిది రూపకము.

"ముదిత వలికె." "గసడదవాస్స్యుః ప్రథమా మాత్రాత్." ఆంధ్రశబ్దచింతామణి.

చ. వినుము దయాభివృద్ధి ప్రభవింపఁగ నిద్ధర యేలురాజు మ
త్తనయుఁడు నాకు మాపతి ముదంబునఁ బూర్వమునం దనుగ్రహిం
చినవరలాభ మిప్పు డిటు సేసె నిజాత్మ నుపేక్షమానినీ
మునియతినిల్పు మానహతిసోఁకక యుండఁగఁ జేసియి త్తఱిన్.

అవతారిక. ఇటనుండి రెండు పద్యములఁ గైకేయి రాము నరణ్యమున కరుగుమని యందులకుం దగు కారణముం దెల్పుచున్నది.

రామాయణ. వినుము = ఓ రామచంద్రా, నీవు వినుము, ఉదయాభివృద్ధిక్ = అభ్యుదయాభివృద్ధి, ప్రభవింపఁగన్ = కలుగులాగున, మత్, తనయుఁడు = నా పుత్రుఁడు, భరతుఁ డనుట; ఇద్ధరయేలు రాజు = ఈ భూమి నేలఁదగిన రా జగును, నాకున్, మాపతి = నాభర్త, దశరథుఁ డనుట; [ఇట మాయను బహువచనము భావిరాజ్ఞీత్వగర్వమునఁ గల్గిన దగును.] ముదంబునన్ = సంతోషముతో, పూర్వము = మున్ను, అనుగ్రహించిన = ప్రసాదించిన, వరలాభము = వరముయొక్క లాభము,

ఇప్పుడు, ఇటు, చేసెక్ = ఇప్పుడు ఇట్లొనర్చెను. నీ పట్టాభిషేక కార్యము మానెనని భావము; నిజాత్మన్ = నీ చిత్తమున, ఉపేక్షమాని = ఏదియో చెప్పుచున్నదని యశ్రద్ధ మాని, ఇత్తఱిన్ = ఈ సమయమున, ఆన హాని పోఁక కయుండఁగన్, చేసి = నీ తండ్రియాజ్ఞ నశింపకుండులాగున నొనర్చి, నీ, సునియతి = నీదగు గొప్ప నిర్ణయమును, నిల్పుమా = స్థిరముగ నుండు నట్లు సేయుమా.

తా. నా కుమారుఁ డభ్యుదయ పరంపరల నందునట్లు రాజ్య మేలఁ గలవాఁడు, నాకుఁ బూర్వము నాభర్త ఇట్టి వర మిచ్చుటచేతనే యిప్పుడిట్లొనర్పవలసెను; నీ వింక నీ తండ్రియాజ్ఞను వ్యర్థము గావింపకుండులాగునఁ జేయుమా.

"నియతి." "నియతిర్దైవ నియమా." నానార్థరత్నమాల.

"ఉదయాభివృద్ధి." "ఉదయస్య అభితో వృద్ధిః." అని యర్థము గావించుకొనవలయును. అప్పుడు. అభ్యుదయవృద్ధి యను భావమగును.

అవతారిక. ఇటనుండి రెండుపద్యములు ద్రౌపది శ్రీకృష్ణునిం దన్ను రక్షింపుమని ప్రార్థించెడి ప్రకారముం దెల్పును.

భారత. దయాభివృద్ధి = దయాసంవృద్ధి, ప్రభవింపఁగన్ = కలుగులాగున, వినుము = కృష్ణా! నామాట వినుము, ఇద్ధర, ఏలురాజు = ఈ భూమిని పాలించురాజు, ధృతరాష్ట్రుఁ డనుట; మత్త, నయుఁడు = మదించినవాని నీతివంటి నీతిని గలవాఁడు, మత్తునకు నీతి యాకాశపుష్పము వంటిది గనుక నీతి విదూరుఁడని భావము; నాకున్, ఉమాపతి = పరమశివుఁడు, పూర్వమునందు, అనుగ్రహించిన, వరలాభము = భర్తలలాభము, ఇప్పుడు, ఇట్లు, నిజాత్మన్, నన్ను, ఉపేక్ష చేసెన్, ఏవురు భర్తలు గలుగుట కతనఁ గార్యములన్నియు సుకర మగునని తలంచినందులకు ఇట్లుపేక్ష సేయునట్లయ్యెనని భావము; మానినీ= స్త్రీలయొక్క, సునియతి = మంచి నియమము, ఇత్తఱిన్, మానహాని పోఁక కయుండఁగన్, చేసి = మానహాని కలుగకుండులా గొనర్చి, నిల్పుమా.

తా. ఈ రాజ్యము నేలు ధృతరాష్ట్ర మహీపాలుఁడు నీతి విదూరుఁడు, నాకు పంచపతి దానము రక్షక బాహుళ్యయుక్తిచే ననుకూలపరిణామి యగునని తలంచినందుల కట్లు కాక స్వాత్మోపేక్షకుఁ గారణమయ్యెను. ఇట్టియెడ మానినీమానమునకు హాని గలుగకుండు లాగున రక్షించు భారము నీయది యగును.

"ఉమాపతి పూర్వమునం దనుగ్రహించిన వరలాభము." ఇది పంచేంద్రోపాఖ్యానమున విస్తృతమయినది కావున నక్కథ యిట నను సంధేయము.

ఉ. ఏకము నీ వెఱుంగనిది యెయ్యది సర్వవిదుండ వీవు సో
త్సేకనిరూఢి నెల్లెడల శ్రీపస నాతనయుండుదంచితా
స్తోక విభూతి మీఱ నొరుచొప్పున నియెడ నుండవచ్చునో
నీకును గావునన్ మది గణింపఁగ నెమ్మెయిఁ గాన దిక్కగున్.

రామాయణ. ఏకము = ఒక్కటియేని, నీవు ఎఱుంగనిది ఎయ్యది= నీవు ఎఱుఁగకుండున దేది గలదు, నీకుఁ దెలియని దేదిగల దనుట; నీవు, సర్వవిదుండవు = అన్నియుఁ దెలిసినవాఁడవు, సోత్సేక, నిరూఢిన్ = ప్రౌఢ్యతిశయముతోఁ గూడినట్లు, ఎల్లెడలన్ = సర్వత్ర, శ్రీపసన్ = ఐశ్వర్యాతిశయమున, నా తనయుండు = నా కుమారుఁడు, భరతుఁ డనుట; ఉదంచిత...విభూతిన్; ఉదంచిత = ఒప్పుచున్న, అస్తోక = తగ్గని, విభూతిన్ = ఐశ్వర్యముచే, మీఱన్ = మించుచుండగా, నీకున్, ఒరు చొప్పునన్ = అన్యునిలాగున, అగస్త్యభ్రాతవలె ననామధేయునిగ ననుట; ఇయ్యెడన్ = ఇచ్చట, ఉండవచ్చునో = ఉండుట తగునా, చవితి తల్లి కొడుకు గొప్పస్థితియందుండ నీ వనామధేయునివలె నుండుట తగదని భావము; ఎమ్మెయిన్ = ఏ లాగుననైనను, గణింపఁగన్ = ఆలోచింపఁగా, ఇఁకన్, కాన = అడవియే, దిక్కు = శరణమగును, అప్రసిద్ధుఁ

డవుగా నలువురలో నుండుటకంటె నెచ్చటే నేకాంతమున నుండుట శ్రేయస్కరమని భావము.

ఓ రాముఁడా ! నా కుమారుఁడు ప్రౌఢిమీఱ నిట నభివృద్ధి నందుచుండ నీ యవమానమున కోర్చి యిట నెట్లుండఁజాలుదువు ? కావున నే విధముగ నాలోచించినను నీవడవి నుండుటయే శ్రేయస్కరమని భావించెదను,

"కాన." "కానయన యడవి యనంగఁ గాననంబు." ఆంధ్ర నామశేషము. వర్ణలోపమున నేర్పడిన కానన శబ్దముయొక్క వికృతి.

"ఒరుచొప్పున నుండవచ్చునో, ఎమ్మెయి గణించినన్ కాన దిక్కగున్." ఎదుటివాఁడు ధనవంతుఁడై తేజరిలుచుండ, "న బంధుమధ్యే ధనహీన జీవనం" అనులాగున నిట వసించుటకంటే నేయడవి నేనుండి సమసించుట మేలని రామునకుఁ దోఁపింపఁ గైకేయి యిట్లనెను.

భారత. నీవు ఎఱుంగనిది ఏకమును ఎయ్యెది = నీ వెఱుంగని దొక్కటియే నేది గలదు, ఈవు సర్వవిదుండవు = నీ వన్నియుం దెలసినవాఁడవు, శ్రీప = రమాపతీ ; సనాతన = శాశ్వత మగువాఁడా, ఇవి కృష్ణుని సంబోధనలు, ఎల్లెడలన్, ఉండుదు = సర్వవ్యాపివై యుండుదువు ; అంచిత, ఆస్తోక, విభూతిన్ = లీలావిభూతి, మీఱన్ = అతిశయింపఁగా, నీకును, ఒరుచొప్పునన్, ఉండవచ్చునో = నీ యీలీలావిభూతి ప్రబలుచుండ భూభారము తగ్గింప నవతరించిన నీవు నీ యవతారకార్యము సేయక సామాన్యునివలె నుండుట తగునా యని భావము ; నీకును అను సముచ్చయ స్వారస్యమున భక్తపరాధీనుఁడ వగు నీ విట్లు భక్తులు బాధ చెందుచుండ నన్యునివలె నుండుట తగదను భావమును సూచించుచున్నది. కావునన్ = కనుక, ఇయ్యెడన్ = ఈ సమయమున, ఇంకన్, మదిన్=మనసున, గణింపఁగన్ = ఆలోచించిన, ఎమ్మెయిన్ దిక్కు కానన్ = నీవు దక్క నాకు వేఱుదిక్కు గానిపించుటలేదు.

తా. సనాతనుఁడ వగు నో కృష్ణభగవానుఁడా, నీ కీలోకమునఁ దెలియని దేదియును లేదు, సర్వజ్ఞుఁడవు, సర్వవ్యాపివి, ఇట్టి నీవు నీభక్తలోకము బాధ చెందుచుండ నుపేక్షింపుచు భక్తుల కప్రియము సేయు నీచుల నీభూమి భరింపలేక కష్టపడుచుండ, భూభారాపనోదనమునకై జనించిన వాఁడవు నీ యవతారకార్యమును మాని యిట్లు సామాన్యునివలె నుండ నగునా? నాకు నీవుదక్క వేఱొదిక్కు లేదు కాఁబట్టి రక్షింపుమా.

“విభూతి.” భగవంతునకు నిత్యవిభూతియు లీలావిభూతియు నని సంసారమోక్షములు రెండు నైశ్వర్యస్థానమున నుంట నైశ్వర్య పర్యాయ మగు నిప్పదము సంసారమోక్షములకుఁ బర్యాయముగా వ్యవహరింపఁబడు చున్నది.

“కాన.” కావున యనునది వర్ణలోపమున నీ రూపునందెను.

“స్తోక.” “స్తోకాల్పక్షుల్ల కాస్సూక్ష్మం శ్లక్ష్ణం దభ్రంకృశంతను.” అమరము.

“సర్వవిదుండవు.” “సర్వం వేత్తీతి సర్వ వి”త్తని వ్యుత్పత్తి యగును.

సీ. ఇట్లు వల్కెడునంత • హృదయసాహసమున
దాక్షిణ్యము లవంబు • దనకు లేమిఁ
దోరంపుబిరుసున • దుశ్శాసనుఁ డవని
విభునూరకునికి భా•వింప నతని
కే నన్నపనిసేయు • చెంతయునభిమతా
ర్థంబనికని యవా•రణ మగువన
వాసస్థితిని గూర్పు•స్వాంతవర్తనమున
నీ్వతగర్హణభయ • నిష్ఠదోఁప
గీ. రామకపటభావం బెందు • నేమియునుజ
నింప దేమన నెంతటి • వెంపు నీదు

నెమ్మనమునందు నెఱయనాకయమ్మపాదు
కొలుపుభూత భవద్భవ్య క గురుమహాజ్ఞ. 23

రామాయణ. ఇట్లు పల్కినంత = ఈలాగున నాడఁజాలునంతట, హృదయసాహసమునన్ = హృదయమునందలి తెగువతో, దాక్షిణ్యము = ఛందానువర్తిత్వము, లవంబు = కొంచెమేనియు, తనకున్ లేమిన్ = తనకు లేకుండుటచే, తోరంపు, బిరుసునన్ = అతిశయించిన కాఠిన్యమున, దుశ్శాసనుఁడవని = శిక్షింపశక్యముకాని వాఁడవని, విభు = రాజుయొక్క, దశరథునియొక్క యనుట; ఊరకునికిన్ = తూష్ణీంభావమును, [ఇటషష్ఠీసమాసమునందలి యుకారమగుటచే నకారాగమము.] భావింపన్ = విచారింపఁగా, అతనికిన్ = ఆ దశరథునకు, ఏన్, అన్న, పని = నేఁ జెప్పిన కార్యము, భరతపట్టాభిషేక, రామవనవాస రూపకార్యమనుట; చేయుట= చలుపుట, ఎంతయున్ = మిక్కిలి, అభిమతార్థంబు = ఇష్టకార్యము, [అప్రతిషిద్ధమనుమతం భవతి యను న్యాయమున నాతని మౌనమే యంగీకార సూచకమనుట.] అని, కని=చూచి, తెలిసియనుట ; అవారణమగు = అడ్డగింపరాని, అన్యశంక లేనియనుట ; వాసస్థితిని = అరణ్యావాస విధమునందు, అన్వీత......నిష్ఠ ; అన్వీత=అనుసరింపంబడిన, గర్హాణ భయనిష్ఠ = పితృవచన వ్యాఘాతమొనర్చిన నిందగల్గుననుభయముతోడియునికి,తోఁపన్= మనస్సుకు గోచరింపఁగా, స్వాంతవర్తనమునన్=మనోవృత్తిని, కూర్పు = చేర్పును, వనవాసాపేక్ష నీమదిగోచరించుఁగాక యని భావము. రామ = ఓ రాముఁడ, నీదు = నీయొక్క, నెమ్మనమునందున్ = నిండుమనస్సున, కపటభావంబు=కాపట్యము, ఎందున్ = ఎప్పట్టునను, ఏమియును=ఏమాత్రమును, జనింపదు = కలుగదు, ఏమనన్ = నిన్నేమని కొనియాడఁగలను, ఎంతటి పెంపు = ఎంతటి గొప్పతనము, నీ పెంపెంతటి స్తుత్యర్హమగు చున్నదని భావము. [ఇదివనవాసమున కాతనిం బురికొల్ప నొనర్చుకపట స్తోత్రమగును] భూత.........మహాజ్ఞ ; భూత = అయిన, భవత్ = నీయొక్క, భవ్య =

మంగళకరుఁడైన, గురు = తండ్రియొక్క, మహాజ్ఞ = గొప్పయాజ్ఞ, [నాయమ్నయను కారకక్రియకులకర్త.] నీ విషయమున మంగళములాశాసించు జనకుఁడనిభావము; కావుననే యీతఁడు నీకు శుభములు గలిగింపనెంచి యీ వనవాసాజ్ఞ యిడెననుటను కైకేయిసూచించుచున్నది. నాయమ్న = న్యాయమగునదే, ఇది న్యాయముయొక్క తద్భవము. నెఱయఁగ = పూర్ణమగునట్లు, పొదుకొలుపుము = స్థిరపఱచుము, పిత్రాజ్ఞారూపమగు న్యాయమును నీవనుష్ఠానపూర్వకముగ స్థిరపఱచుమని భావము.

తా. కైకేయి యించుకేనియు దాక్షిణ్యము లేక కఠినురాలై రామునితో నిట్లనెను. ఓరామచంద్రా! నీవు శాసించుటకు సాధ్యమగువాఁడవు కావని రాజిట్లు మౌనమవలంబించి యున్నాఁడు కాని నే నిప్పు డాడిన యీ భరత పట్టాభిషేక, భవద్వనవాస రూపకార్యము లాతని కిష్టములగు నవియే; కావున సందేహింపక యీ ప్రయత్నము మానక వనవాసరూప సంకల్పము నిష్కపటమగు నీమానసమునఁ జొనుపుము; నీ జనకు నానతి పూర్ణము గావింపఁజూడుము.

"దాక్షిణ్యమ." దక్షిణస్యస్వభావః దాక్షిణ్య"మ్మని వ్యుత్పత్తియగును. "దక్షిణస్సరళే యామ్యదిక్షే్న ఛందానువర్తిని." నానార్థ రత్నమాల.

"ఊరక, బిరుసు." పెక్కుప్రాఁతప్రతులలో నీపదములు సాధారణరేఫ యుక్తములు గానే కనఁబడుచున్నవి. ఒక్కెడనివి శకటరేఫ యుక్తముగా నుండెనుగాని పెక్కు ప్రతులలో నుండునదే యుక్త మగునదని గ్రహించి సాధారణరేఫముగానే యుపయోగించితిని. "బిరుసు, బిఱుసు." రెండు రూపములును నిఘంటువుననున్నవి. "ఊరక." ఇది సాధారణరేఫ సహితమయ్యగును. "మిన్నక యూరకయన్నఁ దూష్ణీమర్థ" మని యాంధ్రనామ శేషమునఁగలదు.

"దాక్షిణ్యమలవంబు." ఇటనవధారణ స్వారస్యముననే కొంచమేనియు ననుభావము గలుగుచున్నది. ఇట్లుండఁ గొందఱవధారణార్థకముం దీసి "దాక్షిణ్యము, లవంబు" అని యభిప్రాయ పడెదరుకాని లవంబేని

యను భావమటఁ గోచరింపఁ జాలదు కావున నా యభిప్రాయము సమంజస మగునది కాదు.

భారత. ఇట్లు = ఈలాగున, పల్కెడునంతన్ = చెప్పెడునంత టిలో, ద్రౌపది కృష్ణునుద్దేశించి యిట్లాడునంతలోననుట; హృదయసాహస మునన్, దాక్షిణ్యము + అ = ఛందానువృత్తిత్వమే, మోమోటముండిననే ఛందానువృత్తిత్వముగల్గునుగాన మోమోటమని భావము; లవంబు = ఇంచు కేనియు, తనకు, లేమిన్, ఘోరంపుబిరుసునన్ = కాఠిన్యముచే, దుశ్శా సనుఁడు = దుస్ససేనుఁడు, అవని విభు = ధృతరాష్ట్రుని, ఊరకునికి భావింపన్ = మానము నాలోచింపఁగా, ఏను, అన్నపని = అన్నయగు దుర్యోధనుని యాజ్ఞను చేయుట, ఎంతయున్, అభిమతార్థంబు, అని = దుర్యోధనుని యాజ్ఞయొనర్చుట ధృతరాష్ట్రునకు సమ్మతమగుటచేతనే యాతఁ డూరకయున్నాఁడని భావము, కని, అవారణన్ = అడ్డములేక, మగువన్ = స్త్రీని, అవాసస్థితిన్ = వస్త్రహీనస్థితిని, కూర్పి = చేర్చునట్టి, స్వాంతవర్తనమునన్ = మనోవృత్తిని, పీత......నిష్ఠన్; పీత = పోయిన, గర్హణ=నిందనము, భయ = భీతియును, కల, నిష్ఠ=తలపెట్టుట, తోఁపన్. రామకున్ = స్త్రీకి, ద్రౌపదికనుట; అపటభావంబు = వస్త్రహీనత, ఎందున్, ఏమియును, జనింపదు = కలుగదు, ఆయమ్మ = ఆద్రౌపది, నెమ్మనమునందున్ నెఱయన్ పాదుకొలుపు = మనస్సునఁ బూర్ణముగా నెలకొల్పియున్న, భూత.........మహాజ్ఞ; భూత భవద్భవ్య = భూత భావివర్తమానకాలకర్తయై గొప్పవాఁడగు శ్రీకృష్ణునియొక్క, మహాజ్ఞ = గొప్పయాజ్ఞ, ఏమనన్ = ఏమనివర్ణింతును, ఎంతటిపెంపును, ఈడు. ఇది కవియొక్క వాక్యమగును.

తా. ద్రౌపది యిట్లాడినంతనే దుశ్శాసనుఁడు లేశమయిన దాక్షి ణ్యములేక, కఠినచిత్తుఁడై తాను తన యన్నపని యొనర్చుట తండ్రికిష్ట మగునదియే కావున నతఁడూరకున్నాఁడని భావించి, ద్రౌపదీవస్త్రములు

నూడ్పం బ్రయత్నింపనది వ్యర్థమాయెను. ఆమెకు వస్త్రహీనత గలుగ దయ్యెను. ద్రౌపది మనమున ధ్యానించు నాకృష్ణుని మహిమయేయది, అతని యాజ్ఞ నెంతని కొనియాడఁగలము? అతని దెంతటి పెంపగుచున్నది!

"వాసస్థితి." ఇట రామాయణార్థమున "వాసస్థితి" అని యైనను భారతార్థమున, "వాసః+స్థితి" యని యగుటచే సకార ద్విత్వరూపము రావలసియుండియు శ్లేషార్థసంఘటనమునకై ద్విత్వరూపమును వీడెను. అదియు "శర్పరేవిసర్జనీయః." అను సూత్రముచే సాధితమగుచున్నది.

"నెమ్మనము." నెఱ, మనము అని పదచ్ఛేదము. సమాసమున నంత్యాక్షర లోపమును, మకారద్విత్వమును గలిగెను.

సీ. తొల్లియొకప్పుడెం ◊ దునుగన్నయదిగాక
తనరునాయరిదివ ◊ ర్తనకు మెచ్చి
స్వవరమహారాజ్య ◊ సంపద లూ్భ్నాయ
కుఁ డొసంగరాముచే ◊ కొన్న దానఁ
దజ్జ్యేష్ఠసుతుఁడవా ◊ ప్తవిషాదతనుజెంది
మగుడనమందాత్మ ◊ మాయచేత
గురుదత్తరాజ్యంబు ◊ హరియించెదోదూయ
మానులై జనులులో ◊ లోనఁదిట్ట
గీ. నని కృతాత్మగురువ ◊ చోనుపాలను నాత
తప్రభావుసనఘు ◊ ధర్మసూతి
నందఱోటువఱచి ◊ యాచతుర్దశవర్ష
భోగ్యమగు ప్రవాసమునకుఁ బనిచె. 24

రామాయణ. తొల్లి = పూర్వము, [తొలియొక్క రూపాంతరమే యుదియగును.] ఒకప్పుడు = ఒకసమయమున, ఎందును, కన్నయది, కాక, తనరు = దృష్టపూర్వముకాక యొప్పుచుండు, నా, అరిది, వర్తనకున్ =

నాయొక్క, ఆశ్చర్యజనకమగు కార్యమునకు, మెచ్చి = శ్లాఘించి, [ఇటం ద్వితీయార్థమున షష్ఠి.] స్వవర... .....సంపదల్ ; స్వ = తనయొక్క, దశరథునియొక్క యనుట ; వర = శ్రేష్ఠమైన, మహారాజ్య సంపదల్ = సామ్రాజ్యసంపదలు, భూనాయకుఁడు = దశరథుఁడు, ఒసంగన్ = ఈయఁగా, రామ = ఓరాముఁడా, చేకొన్నదానన్ = గ్రహించినదానను, తత్ జ్యేష్ఠసుతుఁడవు = అతని పెద్దకుమారుఁడవు, ఆప్త=పొందఁబడిన, విషాదతను = వ్యసనతను, చెంది = పొంది, దుఃఖము గలిగినవాఁడవై యని భావము. మగుడన్ = మరల, అమందాక్ష = సిగ్గులేని, మాయచేత = కాపట్యముచే, గురుదత్తరాజ్యమున్=నీతండ్రిచే నొసఁగఁబడినరాజ్యమును, జనులు = ప్రజలు, దూయమానులై = దుఃఖించువారై, లోలోనన్ = మనస్సులలోనే, తిట్టన్ = దూషించుచుండఁగా, హరియించెదో = అపహరించెదవా, అని, కృత.........పాలనన్ ; కృత=చేయఁబడిన, ఆత్మ= తనయొక్క, గురు = తండ్రియొక్క, దశరథునియొక్కయనుట ; అనుపాలనన్ = పరిపాలనము గలవానిని, ఆతత = విస్తారమైన, ప్రభావున్= మాహాత్మ్యముగలవానిని, అనఘున్ = నిష్పాపుని, ధర్మసూతిన్ = ధర్మము జనించుటకుఁ గారణమగు వానిని, [ఇవి రామునకు విశేషణములు.] అంద = అందే, ఓటు పఱచి = ఓడించి, ,ఆచతుర్దశ ......... అగు, ఆ చతుర్దశ = పదునాలుగవ యేఁటివఱకును, భోగ్యమగు = అనుభవింపఁదగిన, ప్రవాసమునకున్ = అరణ్యావాసమునకు, పనిచెన్ = పంపెను.

తా. పూర్వ మద్భుత జనకమగు నాకార్యమునకు మెచ్చి దశరథమహారాజు నాకుఁ దనరాజ్య మెల్లనొసఁగెను, అతని పెద్దకుమారుఁడవగు నీవు అడవికి వెడలవలయునే యనుదుఃఖముగల్గి లోకులేమనుకొందురో యను లజ్జ లేక, కాపట్యమున, నీవొనర్చు నకార్యమువలన దుఃఖముచెంది ప్రజలు నిన్నులోలోనఁ దిట్టుచుండ నీతండ్రి యొసంగిన రాజ్యము నపహరించెదవా ? అని రామునిం బితృవాక్యపరిపాలనము సేయం బురికొల్పుచుఁ బదునాలుగేఁడుల రణ్యావాసము సేయులాగునఁ బనిచెను.

"అమందాక్ష." "మందాక్షంహ్రీస్త్రపావ్రీడా" అమరము.

"హరియించెదో." ఇటలాట్టు నందలి వకారమగుటచే దీనికి వైకల్పికముగా లోపము గల్గెను.

"ఆచతుర్దశ." ఇట నభివిధ్యర్థమున నాజ్ వచ్చెననుటకు, "ఆఙ్మర్యాదాభివిధ్యోః" పాణిని.

"జ్యేష్ఠ." త్రిషుజ్యేష్ఠోతిశస్తేపి," అమరము.

"గురు." "ఉకారాంతఃపుంసి. బృహస్పతౌ, లఘుద్వయే, తాళప్రాణాంగభేదే, నిషేకాదికృత్పితరి, పురోహితే, బృహతి, ఖ్యాతే, దుర్భరే, సంయుక్తవర్ణపదే, దీర్ఘాక్షరే;" శబ్దార్థకల్పతరువు.

"తొల్లి...నాయరిది వర్తనకుమెచ్చి స్వవరమహారాజ్య సంపదల్ భూనాయకుఁడొసంగ." ఇటఁ దెల్పిన యయ్యరిది వర్తనము విషయమై; "తొల్లి జయంతపురంబునం బురందరశంబరులకుం గయ్యంబయిన నయ్యింద్రునకుం దోడరిగి దశరథుండు భండనంబు సేయు నవసరంబున నారాక్షసుండనేక మాయలు గావింప నీవు ధవళాంగుండను మునివలనం బడసిన మంత్ర విద్యచేతవానికిం బ్రతీకారం బొనర్చుటకు మెచ్చి" భాస్కర రామాయణము.

భారత. తొల్లి, ఒకప్పుడు, ఎంమను కన్నయదికాక = ఎచ్చటను జూచినదికాక, తనరు = ఒప్పుచున్న, ఆ, అరిదివర్తనకుఁ = ఆయద్భుత కార్యమునకు, అక్షయ వస్త్రగమ రూపకార్యమున కనుట; మెచ్చి, స్వ... సంపదల్; స్వ = తనయొక్క, ద్రౌపదియొక్క యనుట; వర = భర్తలను, పాండవులననుట; మహారాజ్య సంపదల్ = సామ్రాజ్య సంపదలును, భూనాయకుఁడు = ధృతరాష్ట్రుఁడు, ఒసంగఁ = ఈయఁగా, రామ = స్త్రీ, ద్రౌపదియనుట; చేకొన్నఁ = గ్రహింపఁగా [ఇది శబ్దపల్లవక్రియ] నిజాక్షయ వస్త్రగమముంగాంచి పాతివ్రత్యమునకుమెచ్చి ధృతరాష్ట్రుఁడు ద్యూతజితులగు నాబిడభర్తలను దాసత్వమువలన విముక్తిగావించి,వారోడిన

సామ్రాజ్యమునెల్ల మరలఁ గోడలగు ద్రౌపదికొసంగ నామె గ్రహించెనని భావము; దానన్ = ఆకారణమున, ధృతరాష్ట్రుఁ డట్లొసఁగుటచేననుట; తజ్జ్యేష్ఠసుతుఁడు=అతని పెద్దకుమారుఁడు, దుర్యోధనుఁడనుట; అవాప్త= పొందిన, విషాదతను, చెంది, అమంద...మాయచేతన్; అమంద = తగ్గని, అక్షమాయచేతన్=పాచికలకు సంబంధించినమాయచే, దోదూయమానులై = దుఃఖితులై, జనులు, లోలోనన్, తిట్టన్ = దూషించుచుండఁగా, గురు దత్తరాజ్యంబున్ = తండ్రిచే నట్లొసఁగఁబడిన రాజ్యమును, హరియించెన్, అనికృత...పాలనున్; అనికృత = కుత్సితముగాని, ఆత్మ = తనయొక్క, గురు = గొప్పదగు, వచః = మాటయొక్క, అనుపాలనున్ = పాలనము గలవానిని, సత్యవాక్య పరిపాలకు నని భావము; ఆతతప్రభావున్, అనఘున్ ధర్మసూతిన్ = ధర్మపుత్రుని, అంద=ఆపునర్ద్యూతమునందే, ఓటువఱచి, ఆచతుర్దశ...భోగ్యమగు; ఆచతుర్దశ = పదునాలుగవ యేఁడుపుట్టువఱకు, భోగ్యమగు = అనుభవింపఁదగు, పదుమూఁడేఁడులు వెళ్లువఱ కనుభవింపఁ దగునదని భావము; ప్రవాసమునకున్ = అరణ్యావాసమునకు, పనిచెన్ = పంపెను.

తా. ఇది వఱకు నెచ్చటను జూచియెఱుఁగని యాయక్షయ వస్త్రా గమముం గాంచి యా ద్రౌపదియొక్క పాతివ్రత్యమునకుమెచ్చి ధృతరా ష్ట్రుఁడు అద్యూతజితులగు నాబిడభర్తలను వారిసామ్రాజ్యమును నొసంగ నామె గ్రహించెను, తండ్రి యిట్లొసంగుటకు దుర్యోధనుఁ డెంతయు దుఃఖించి కపటముగాఁ బునర్ద్యూతమాడి జనులాతనిం బెక్కువిధములలో లోనదూషింపుచుండఁ దండ్రిచే నీఁబడిన యారాజ్య మపహరించెను, సత్య వాక్యపరిపాలనుఁడగు ధర్మసూతి నాపునర్ద్యూతము నందోటువఱచి పదు నాలుగవయేఁటి ప్రారంభమువఱ కనుభవింపఁదగిన యరణ్యావాసమున కనిపెను.

"అక్ష." "అక్షో రథస్యావయవే పాచికే వ్యక్షమింద్రియం" విశ్వనిఘంటువు.

“అనికృత.” “నికృతస్త్వనృజుశ్శఠః” అమరము.

“వరమహారాజ్య సంపదల్ చేకొన్నన్.” “ధర్మతనయుండు దాస్యంబువలనఁ బాయవలయు...ననిననిచ్చితి...నగనద్రౌపది...ధర్మజా నలువురు దమ్ములు...పాయంగవలయు దాస్యమువలనన్. అనిన ధృతరాష్ట్రుండు నీకోరిన వరంబిచ్చితి” నని; సర్వసంపదలు స్వరాజ్యంబును నొప్పఁగొని...సుఖంబుండుము.’’ అని ధృతరాష్ట్రుఁడు పాండవులవిడిపించి వారి రాజ్యము మరల నిచ్చినట్లు నన్నయ యాంధ్రభారతము సభాపర్వమునం దెల్పెను.

ఇట “నాచతుర్దశవర్ష” యను నపుడు రామాయణార్థమునఁ బదునాలుగేఁడులు పూర్తియగువఱకు ననియు, భారతార్థమునఁ బదునాలుగవయేఁడు పుట్టువఱకునని యర్థము గావించుట యుభయార్థశ్లేషము కొఱకే యని భావింపవలయును.

సీ. అతఁడు తద్వచనాను § స్మృతినాత్మసామ్రాజ్య
మొకవికారము లేక § యుజ్జగించి,
ప్రియకరానుజకళత్ర § యుతంబుగా నుగ్ర
కాననంబునకు నే § గంగ నంత
వత్సరామలసత్ప్ర § వర్తనజనులకు
నప్రకాశంబుగ § నాచరింపఁ
బూని యరిగెదయ్యొ § మానెమ్మనంబుల
వేడుకలన్నియు § వృథగఁ జనఁగఁ

గీ. జేసితె కటకటా యంచుఁ § జింతఁ జాల
వగచువారును బతిఁదిట్టు § వారు నగుచుఁ
బౌరవృద్ధులు వెనువెంటఁ § బాయ కరిగి
రతఁడు వారల మగుడంగ § ననిచి చనియె.

రామాయణ. అతఁడు = ఆరాముఁడు, తత్ ... అనుస్మృతిన్ ; తత్ = ఆకైకేయియొక్క, వచన = వాక్యముయొక్క, అనుస్మృతిన్ = అనుసరించుటచేత, కైకేయిమాట చొప్పుననను ట; ఆత్మసామ్రాజ్యము=తన యొక్క సామ్రాజ్యమును, [జ్యేష్ఠాను స్మృతిని రాజ్యమునకుఁ దానుత్తరపు టధికారియగుటచే నిటనాత్మశబ్దము ప్రయోగింపఁబడెను.] ఒక వికారము లేక = ఒక్కింతయేని మాఱుపాటులేక, ఉజ్జగించి = విడిచి, ప్రియ ... యుతంబుగాన్; ప్రియతర=మిక్కిలి ప్రియులైన, అనుజ=తమ్మునితోడను, లక్ష్మణునితో ననుట; కళత్ర=భార్యయగు సీతతోడను, యుతంబుగాన్ = కూడినట్లు, ఉగ్ర = క్రూరమైన, కాననంబునకున్ = అడవికి, ఏఁగంగన్= వెడలఁగా, సీతాలక్ష్మణ సహితుఁడై రాముఁడ డవికి వెడలఁగాననుట ; అంతన్ = పిమ్మట, ఇటనుండి పౌరవాక్యము ; వత్స, రామ, ఇవి రాముని సంబోధనలు ; లసత్ప్రవర్తనల్ = ప్రకాశించుచుండు ప్రవర్తనలను, జను లకున్ = ఇచ్చటి ప్రజలకు, అప్రకాశంబు కన్ = అప్రకాశమగునట్లు, ఆచరింపన్ = చేయుటకై, పూని = ప్రయత్నించి, రాముఁడడవికి వెళ్లు టచే నతనిప్రవర్తన లింకఁబ్రజల కగోచరమగునని భావము; అరిగెదయ్య= పోయెదవా, మానెమ్మనంబులన్ జేడుకల్ వృథ చనంగన్ చేసితే = మాచిత్తములయందలి వేడ్కల వ్యర్థపుచ్చితే, రామునకుఁ బట్టాభిషేక మగును, దశరథునకంటె నెక్కుడుగ మమ్మాతఁడాదరించు నని యిట్లేవేవో వేడుకల ననుభవింపఁ గోరుచుండ మాకోర్కెల గొంతెమ కోర్కెలు గావించివెడలితివా యని భావము; కటకటా, విషాదార్థకము; అంచున్, చింతన్ = ఆచింతచే, చాల=మిక్కిలి, వగచువారును = దుఃఖించువారును, పతిన్ = దశరథుని, తిట్టువారున్ = దూషించు వారును, అగుచున్, పౌరవృద్ధులు, వెనువెంటన్ = అతని ననుసరించి, పాయక = విడువక, అరిగిరి = వెడలిరి, అతఁడు = రాముఁడు, వారలన్ = ఆపౌరవృద్ధులను, మగుడంగన్, అనిచి = పంపి, చనియెన్ = వెడలెను, రాముఁడు తన్ననుస రించి వచ్చుపౌరవృద్ధులఁ దిరిగి వెడలు నట్లొనర్చి తానరిగె ననుట;

తా. రాముఁడు కైకేయీవాక్యము ననుసరించి న్యాయముగఁ దనకు రావలసిన రాజ్యవైభవము నించుకంతయు వికారము చెందక వీడి సీతాలక్ష్మణసహితుఁడై యడవులకుఁ దరలెను, ప్రజలు నోర్వక, రామ మామనములంగల కోర్కెలెల్ల వమ్ముగా నిట్లు నీవడవుల కరిగెదవా ! అయ్యో ! మిక్కిలి దుఃఖించుచుఁ బురవృద్ధులు రామునివెంటనంటి రాఁగ నాతఁడు మంచిమాటలచే వారి నివారించి మరల పురమున కనుపి తానరణ్యమున కరిగెను.

భారత. అతఁడు = ఆధర్మరాజు, తత్...అనుస్మృతిన్ ; తత్ = ఆ దుర్యోధనునియొక్క, వచన = మాటయొక్క, అనుస్మృతిన్=అనుసరణమున, దుర్యోధనుని మాటచొప్పుననుట ; ఆత్మసామ్రాజ్యము = తనరాజ్యమును, ఒకవికారములేక, ఉజ్జగించి = విడిచి, ప్రియతర, అనుజ=భీమార్జుననకుల సహదేవులతోడను, కళత్ర = ద్రౌపదితోడను, యుతంబుగాన్ = కూడినట్లు, ఉగ్రకాననంబునకున్, ఏఁగంగన్, అంతన్ = ఆవల, వత్సర...వర్తనల్ ; వత్సర = సంవత్సరమున, పదుమూఁడవ యేఁటననుట ; అమల = నిర్మలమైన, సత్ప్రవర్తనల్=చక్కని ప్రవర్తనలు, జనులకున్, అప్రకాశంబుగన్, పూని, అరిగెన్ = వెడలెను, పండ్రెండేఁడు లరణ్యవాస మొనర్చి, పదుమూఁడవయేఁటఁ దమచరిత్ర మెఱుఁగకుండులాగున నజ్ఞాతవాస మొనర్చునట్లు ప్రతిన పూని యరిగె నని భావము ; దయ్యమా=దైవమా, ఇది పౌరుల విచారవాక్యము ; నెమ్మనంబులన్, వేడుకలన్నియున్, వృథచనంగన్, చేసితే = మానసముల నేవేవో వేడ్కల ననుభవింపఁగోరియుండ వానినెల్ల వ్యర్థములు గావించితివే, యని భావము : కటకటా, అంచున్, చింతన్, చాల, వగచువారును=దుఃఖించువారును, పతిన్=ధృతరాష్ట్రుని, తిట్టువారును, అగుచున్, పౌరవృద్ధులు, వెను వెంటన్ = తన్ననుసరించి, పాయక, అరిగిరి, అతఁడు=ఆ ధర్మజుఁడు, వారలన్, మగుడన్, అనిచి = పంపి, చనియెన్ = తాను వెడలెను.

తా. ధర్మజుఁడు దుర్యోధనుని వాక్యానుసారముగ భీమార్జుననకుల సహదేవులతోడను, ద్రౌపదితోడను గూడి యడవులకరుగునపుడు అజ్ఞాత వాసవత్సరమున నొరులకంటఁ బడక దాఁగియుండ నంగీకరించి యడవులకుఁ దరలుచుండెను, అప్పుడు పౌరవృద్ధులు, దైవమా ! మామానసములలోని కోర్కెల వ్యర్థపుచ్చితివా? అయ్యో ! అని మిక్కిలి వగచుచు నాతని ననుసరించి పోవుచుండ ధర్మజుఁడు వారిని నివారించి పురమున కనిపి తానడవుల కేఁగెను.

వ. అంత. 26

గీ. పుత్రమోహమున విభుండు పోయినశోక
మున వగచుచు మఱియుఁ గూడ వచ్చి
కడుఁ బ్రయాణవిఘ్నకరు లగు భరతము
ఖ్యులఁ బ్రయత్నమున మరిగిడ్చి వెసను. 27

రామాయణ. పుత్రమోహమునన్ = కుమారుఁడగు శ్రీరామచంద్రుఁ నెడఁగల మోహముచే, విభుండు = దశరథుఁడు, పోయినశోకకున్ = పోయినట్టిశోకకు, మరణించినందులకనుట ; వగచుచున్ = దుఃఖించుచు, మఱియున్ = ఇంకను, కూడన్, వచ్చి = రాముని వెంటనరుదెంచి, కడున్ = మిక్కిలి, ప్రయాణ = రాముని యాయరణ్య ప్రయాణమునకు, విఘ్నకరులగు=విఘాతమొనర్చునట్టి, రామునిం దిరిగి పట్టణమునకు రమ్మను నట్టివారిననుట ; భరతముఖ్యులన్ = భరతుని ముఖ్యముగాఁ గలవారిని, ప్రయత్నమునన్ = అతిప్రయత్నమునన్, మగుడ్చి = త్రిప్పి, వారి నతి ప్రయత్నమున మరలించియనుట, వెసను = వేగముగా.

తా. పుత్రవాత్సల్యమున నాతని విశ్లేష మోర్వఁజాలక దశరథుఁడు మరణింప, భరతాదులు రామునను సరించి యాతని యాయరణ్యావాసము వలదని వారింప రాముఁడు వారినతిప్రయత్నమున మరల నయోధ్య కనిపెను నని క్రిందటి పద్యముతో నన్వయము.

భారత. పుత్రమోహమునన్ = కుమారుఁడగు దుర్యోధను నెడఁగల మోహమున, విభుండు = రాజగు ధృతరాష్ట్రుఁడు, పోయినపోకకున్ = నడచిననడవడికి, వగచుచున్, మఱియున్, కూడన్, వచ్చి, కదున్, ప్రయాన = ప్రకర్షగమనమునకు, త్వరితగమనమునకనుట ; విఘ్నకరులగు, తాము వృద్ధులగుటచే గమయునుస్మృతికి భంగము కలుగులాగున త్వరిత గమనమువలదని వారించువారని భావము; భరతముఖ్యులన్ = భరతవంశశ్రేష్ఠులను, భీష్మాదులననుట ; ప్రయత్నమునన్, మగుడ్చి, వెసను.

తా. దుర్యోధను నెడఁగల మోహమున ధృతరాష్ట్రుఁడట్లు ధర్మజాదులడవికిఁ బోవుచుండ నూరకుండుటకువగచి భీష్మాదులు తామట్టి యన్యాయరాజ్యముననుండ నొల్లక ధర్మజాదుల ననుసరించి రాఁబూని వారి త్వరితగమనమును వారించుచుండ, ధర్మజుఁడు వారినతిప్రయత్నమున పురమునకేఁగునట్లుమరల్చె; చనియెనని పూర్వపద్యమునందలి క్రియతో నన్వయము. ఇట 'భరతముఖ్యుల' అను దానిలోని శ్లేషను మాత్రమే యాధారము గావించుకొని రెండర్థములను సాఁగించెను.

చ. బహువనిచిత్రకూటముఖపర్వతచక్ర మతిక్రమించి వి
శ్వహితుఁడుదండకాశ్రమనివాసు లెదుర్కొని కొంచుఁబోవఁద
త్ప్రహితసపర్యుఁడై యలరెఁ బావని యాత్మవిశుద్ధసత్త్వవి
గ్రహఘనలక్ష్మిఁ జూపఱకుఁ గన్నులపండువుగాఁగనంతటన్.

రామాయణ. బహు........చక్రము; బహువన=పెక్కడవులు, చిత్రకూటముఖ = చిత్రకూటముమున్నగు, పర్వతచక్రము = కొండల మొత్తము, అతిక్రమించి = కడచి, విశ్వహితుఁడు = లోకహితుఁడగు శ్రీరామచంద్రుఁడు, దండకాశ్రమనివాసులు = దండకారణ్యము నందలి యాశ్రమవాసులగు మునులు, ఎదుర్కొని = తనకెదురవచ్చి, కొంచున్ పోవన్ = పిలుచుకొనిపోవఁగా, తత్.....సపర్యుఁడై; తత్ = ఆమహర్షులచేత, ప్రహిత = చేయఁబడిన, సపర్యుఁడై = పూజగలవాఁడై; [ఇది

బహువ్రీహి.] ఆత్మ......లక్ష్మి ; ఆత్మ = తనయొక్క, విశుద్ధ = మిక్కిలి పరిశుద్ధమైన, సత్త్వగుణముగల, విగ్రహ = శరీరముయొక్క, ఘన = గొప్పదగు, లక్ష్మి = సౌందర్యము, పావని = పవిత్రమైనది, ఇది విగ్రహమునకు విశేషణము, చూపఱకున్ = చూచువారలకు, కన్నులపండువు కాఁగన్ = నేత్రపర్వముకాఁగ, అంతటన్ = సర్వత్ర, అలరెన్ = సంతోషించెను.

తా. రాముఁడు పెక్కడవులు చిత్రకూటముమున్నగు పెక్కుపర్వతములను గడచి దండకారణ్యమున కరుఁగఁగ నటఁగల యాశ్రమవాసులగు మునులు పెక్కుసపర్యలు సేయ వానినెల్లం గ్రహించి, పవిత్రమగు నిజశరీర కాంతిచే నందలివారలకు నేత్రపర్వమగుచు నలరెను.

"చూపఱకుఁగన్నులపండువు, కాఁగ, నలరెన్." "నిర్గుణోనిరంజనో నిర్వికల్పోనిరాఖ్యాతశ్శుద్ధోదేవ ఏకోనారాయణః" అనియును, "నతేరూపం నచాకారః" అనియును, రూపాది రహితుఁడని స్పష్టముగాఁ దెల్పుచు, "తథాపిపురుషాకారో భక్తానాంత్వంప్రకాశసే." అని భక్తుల సంతుష్టికొఱకే యాతఁడు రూపముందాల్చినట్లు చెప్పుటచే, భక్తుల సంతుష్టియే యతని సంతుష్టి యగుచున్నది. కావుననే భక్తులకుఁ గన్నులపండువుగాఁగఁదాను నలరెనని భావమగును.

"సపర్యా." "సపర్యాతర్పణం బలిః." అమరము.

భారత. బహువన, చిత్ర = విచిత్రములగు, కూటముఖ = శిఖరాదులు గల, పర్వతచక్రము, అతిక్రమించి, విశ్వహితుండు = లోకహితకరుఁడగు ధర్మతనయుఁడు, దండకున్ = తనసమీపమునకు, ఆశ్రమనివాసులు = ఆశ్రమస్థులగు మునులు, వచ్చియని యధ్యాహార్యము. ఎదుర్కొని = తన్నెదురుకొని, కొంచుఁబోవన్ =తమ యాశ్రమములకుం బిలుచుకొనివెడలి ; వారి వెంటవెడలియనుట; తత్ప్రహిత, సపర్యుఁడై=పూజలుగలవాఁడై, అలరెన్ = సంతోషించెను, పావని=భీముఁడు, ఆత్మ...లక్ష్మి ; ఆత్మ=తనయొక్క,

విశుద్ధ = శుద్ధమైన, సత్త్వ = బలముగల, విగ్రహాలక్ష్మి = యుద్ధలక్ష్మి, చూపఱకున్, కన్నులపండువు, కాఁగన్, అంతటన్ = ఆవల.

తా. ధర్మజుఁడు పెక్కడవులు పలుకొండలు నతిక్రమించి పోవఁగా నరణ్యవాసులగు మునులాతని నెదుర్కొని తమయాశ్రమములకుఁ బిలుచుకొని వెడలి పలుపూజలఁ గావింప నాతఁడలరెను. భీముఁడు తనబలిమితోడి యుద్ధముగాంచి చూపఱులానందమందుచుండ. కిమ్మీరుంగూల్చెనను వఱకు నేక రోజనమగును.

"చిత్రకూట." "కూటో స్త్రీ శిఖరం శృంగం." అమరము.

"పావని." ఇట,. "పవనస్యాపత్య" మ్మనియపత్యార్థమున 'నిఞా' దేశమువచ్చెను. "అతఁ ఇఞ్" పాణిని.

క. సతియును దానును నతివి
శ్రుతమగు తనబలిమినమితసుమనఃకిమ్మీ
రతరశ్రీధృతమగునతి
వితతాటవి గొంకులేక విహరించుతఱిన్. 29

రామాయణ. సతియును, తానును = సీతయును, రాముఁడును, అతివిశ్రుతమగు, తనబలిమిన్ = మిక్కిలిప్రసిద్ధమైన తనబలముచే, అమిత... శ్రీన్; అమిత = మితిలేని, విశేషించిన యనుట; సుమనః = పుష్పములచే, కిమ్మీరతర శ్రీన్=మిక్కిలి చిత్రవర్ణముగల శోభను, ధృతమగు=ధరింపఁబడిన, అతివితత = మిక్కిలివిస్తారమైన, అటవిన్=అడవియందు, కొంకు = భయము, లేక, విహరించు తఱిన్ = సంచరించుసమయమున.

తా. రాముఁడు సీతాసహితుఁడై నిజబలముతోఁ బుష్పములచేఁ జిత్రవర్ణముగ విరాజిలు నాయడవియందు విహరించు సమయమున.

"సుమనః" "స్త్రియస్సుమనసః పుష్పం." అమరము.

"కిమ్మీరతర." "చిత్రంకిమ్మీరకల్మాషశబలైతాశ్చకర్బురే." అమరము.

భారత. సతియును = ద్రౌపదియును, తానును, = భీముఁడును, అతివిశ్రుతమగు, తన, బలిమిన్ = నిజసత్త్వముచే, నమిత .....దృతమగు; నమిత = పంపఁబడిన, అణఁపఁబడిన యనుట; సుమనః = దేవతలనుగల, కిమ్మీర = కిమ్మీరుఁడను నసురుని, తరః = బలిమియొక్క, శ్రీ = సంపదచే, దృతమగు = ఆదరింపఁబడిన, అతివితతాటవిన్, కొంతలేక, విహరించుతఱిన్ = సంచరించు సమయమున.

తా. మిక్కిలి బలశాలియగు భీముఁడు ద్రౌపదితోఁజేరి స్వబలమున దేవతలనణంచుచుండు కిమ్మీరుఁడుండు నడవియందు నిర్భయుఁడై సంచరించుచుండఁగా.

"తరః." "ద్రవిణంతరస్సహోబలశౌర్యాణి." అమరము.

ఇట రామాయణార్థమున, "కిమ్మీరతర + శ్రీ." అని విసర్గలోపముగాను; భారతార్థమున, "కిమ్మీర తరః + శ్రీ" అని విసర్గయుక్తముగాను బదచ్ఛేదము గావింపవలసియుంట శవర్ణ ద్విత్వ రహిత, సహిత రూపములు గలుగవలసియుండ నుభయార్థ సంఘటనకై శవర్ణద్విత్వ రహితరూపమునం బ్రయోగించెను. అదియు "శర్పరేవిసర్జనీయః' అనుసూత్రమున సాధితమగుచున్నది.

శా. దోరాస్ఫాలకరాళితోద్ధతివిరాడ్ధుర్ నీలశైలోపముం
దారాధ్వానయుతాట్టహాసవిసరద్దంష్ట్రామయూఖాళిఁ గి
మ్మీరాభిఖ్యుఁదనర్చు రాక్షసుమదక్లిష్టోక్తులాటోప దు
ర్వారాకృష్టమహీజుఁడై వదరుగర్వగ్రస్తుఁగూల్చెన్ ధరన్.

రామాయణ. దోః.....ఉద్ధతిన్; దోః = భుజములయొక్క, ఆస్ఫాల = చఱచుటచే, కరాళిత = భయంకరముగా నొనర్పఁబడిన, ఉద్ధతిన్ = ఔద్ధత్యముగలవానిని, గర్వసహితుననుట; భుజాస్ఫాలనమున భీకరమగు తన యౌద్ధత్యముం జూపువాఁడని భావము; నీలశైలోపమున్ = నల్లనికొండతోసాటియగు వానిని, తార.....మయూఖాళిన్; తార,

ఆధ్వాన = ఉచ్చధ్వనితో, యుత=కూడిన, అట్టహాస, పెద్దనవ్వుచేత, విస రత్ = వ్యాపించుచుండు, దంష్ట్రా = కోఱలయందలి, మయూఖాళిక = కిరణసమూహములచేత, కిమ్మీరాభిఖ్యక = చిత్రవర్ణకాంతిచే, తనర్చు = ఒప్పుచుండు, రాక్షసుక = అసురుని, ఆటోప...మహీజాహృఁడై; ఆటోప = వేగమున, దుర్వార = నివారింపఁదగనట్లు, ఆకృష్ట = అపహరింపఁబడిన, మహీజాఁడై = సీతనుగలవాఁడై, వేగాతిశయమున నడ్డగింప సాధ్యముగా నట్లు సీతనపహరించిన వానినని భావము, మద...ఉక్తులు; మద = మద ముచే, మ్లిష్ట = అవిస్పష్టమగు, ఉక్తులు = పలుకులు, వదరువానిక = ప్రేలెడువానిని, గర్వగ్రస్తుక = గర్వముచెందినవానిని, విరాధుక=విరాధుఁ డనురాక్షసుని, ధరక=నేలపై, కూల్చెక, చంపెననుట; రాముఁడనుక ర్త యధ్యాహార్యము.

తా. భుజాస్ఫాలనము సేయుచు భయంకరుఁడై, నల్లనికొండంబోలుచు వికటాట్టహాసమొనర్చుచుఁ, దన్ముఖమునదంష్ట్రలయందుఁ జనించినకాంతు లచేఁ జిత్రవర్ణము గావింపఁబడిన శోభంగలిగి, మత్తుఁడగుట ననభిస్పష్ట వాక్యముల వదరుచు, గర్వగ్రస్తుఁడై దుర్వారవేగమున సీతాపహరణ మొనర్చు విరాధుఁడనెడి రాక్షసుని రాముఁడు సంహరించెను.

"దోరాస్ఫాల." "భుజబాహూప్రవేష్టోదోఃస్యాత్." అమరము.

"కరాళిత." "కశేరుణికరాళంస్యాత్ భీషణే వాచ్యలింగకం" అమర శేషము.

"తార." "తారోత్యుచ్చైః." అమరము.

"ధ్వాన." "ధ్వనిధ్వానరవస్స్వనాః." అమరము.

"మ్లిష్ట." "అథమ్లిష్ట మవిస్పష్టం." అమరము.

భారత. దోరస్ఫాల, కరాళిత, ఉద్ధతి = ఔద్ధత్యముయొక్క, విరాధుక = విశేషసంసిద్ధిగలవానిని, ఘూర్జుననియుం జెప్పనగును; నీలశైల ఉపముక, తారాధ్వాన, యుత = కూడిన, అట్టహాస, విసరత్, దంష్ట్రా,

మయూఖాళీక్ = కిరణపంక్తులుగలవానిని, మద, ౘిష్టోక్తిల్, వదరు=ప్రల పించుచుండు, గర్వగ్రస్తుక్, కిమ్మీరాభిఖ్యక్ తనర్చు రాక్షసుక్ = కిమ్మీరుఁడను పేరఁ దనరుచుండువసురుని, ఆటోప దుర్వార, ఆకృష్ట,మహీ జుఁడై = పైకిఁ బెకలించి గ్రహింపఁబడినవృక్షము గలవాఁడై, వెసక్, ధరక్, కూల్చెను = సంహరించెను, పూర్వపద్యమునందలి పావనియను పదము కర్తయగుచున్నది.

తా. భుజాస్ఫాలనమున భయంకరుఁడై, వికటాట్టహాసముగావించుచు, మదాతిశయమునఁ దడఁబడుచుండు మాటలుగల్గి, గర్వితుఁడై వచ్చిన కిమ్మీరుఁడను రాక్షసుని భీముఁడొకవృక్షమును బెకలించి దానిచే సంహ రించెను.

"రాధ" అనుదానికి సంసిద్ధియనుటకు "రాధసంసిద్ధౌ" అను ధాతు వున ఘఞంతమయ్యెను.

రాధుననుటకు ధూర్తునని యర్థముగావించుటకు; ... రాధోమృగయా దుష్టయోః.... విశ్వనిఘంటువు.

ఆ. అనికాటుఁ డట్లు హతుఁ డయి దేవతా
తుష్టిఁ జేసె వారు దొడఁగినట్టి
విపినవాసకార్య మపవిఘ్నమై సాఁగఁ
బ్రథమహత మగుబలిపశువుఁబోలె. 31

రామాయణ భారతార్థములు సమము. వారు=[రామాదులు, పాండవులు,] తొడఁగినట్టి = ప్రారంభించినట్టి, విపినవాస కార్యము = అరణ్యావాసరూపకార్యము, అపవిఘ్నమై = అపగతమగువిఘ్నము గలదై, హతవిఘ్నమై యనుట; సాఁగక్ = సాఁగుటకు, ప్రథమహతమగు = మొదటఁ చంపఁబడు, బలిపశువుక్, బోలెక్=బల్యర్థమగు పశువునుబోలె, [బలికొఱకుఁ బశువని చతుర్థీతత్పురుష.] అనికాటుఁడు = ఆరాక్షసుఁడు

[విరాధుఁడు, కిమ్మీరుఁడు,] అట్లు ఆలాగున, హతుఁడయి, దేవతాతుష్టిన్, చేసెన్ = దేవతలకు సంతోషమొనఁగూర్చెను.

తా. వారు, [రామాదులు, పాండవులు,] చేయునట్టి యాయరణ్యావాసము నిర్విఘ్నముగాఁ గొనసాఁగ గలందులకై యాదినిచ్చుబలి పశువువలె రాక్షసుఁడు, [విరాధుఁడు, కిమ్మీరుఁడు,] మరణించెను. దానదేవతలెల్ల సంతుష్టినందిరి.

అలంకారము. ఉత్ప్రేక్ష.

వ. అది యట్లుండె. మహారణ్యంబు దరియంజొచ్చి యారాజమూర్ధన్యుండు. 32

రామాయణ భారతార్థములు, సమములు.

సులభము

[ఆ రాజమూర్ధన్యుండు, రామాయణ రాముఁడు, భారత ధర్మరాజు] ఇట ముద్దరాజు రామన్న భీముఁడనెనుగాని రాఁబోవు పద్యములం గాంచిన ధర్మజుఁడనుట సుస్పష్టమగును. మఱియు భీమునకు రాజమూర్ధన్యుఁడని ఈ కవి ప్రయోగింప సాహసింపఁడు.

క. ఈతెఱఁగున సతితో స
భ్రాతృకుఁడై వరుసఁ జని ప్రపంచితసుమనో
ద్వైతవనభూములందుఁ బ
భూతామోదమున నెలమిఁ బొందుచు నంతన్. 33

రామాయణ. ఈతెఱఁగునన్ = ఈలాగున, సతితోన్ = భార్యతో, తతోనుట ; సభ్రాతృకుఁడై = తమ్మునితోఁ గూడినవాఁడై, లక్ష్మణ సహితుఁడైయనుట ; వరుసన్ = క్రమముగా, చని, ప్రపంచిత...భూములందున్ ; ప్రపంచిత = విస్తరింపఁబడిన, సుమనః = పుష్పములతోడ, ద్వైత = ఐక్యముగల, వనభూములందున్ = అటవీప్రదేశములందు, పుష్పి

తములగు నటవీ ప్రదేశముల యందనిభావము, ప్రభూత = విశేషించిన, ఆమోదమునన్ = వాసనచే, అపుష్పముల వాసనచే నని భావము, ఎలమి = తనివి, పొందుచున్ = చెందుచు, అంతన్ = ఆపల.

తా. భార్యాసోదరులతో నడవి కరిగిన రామచంద్రుఁ డచ్చటి పుష్పముల వాసనచే తనివందుచు. ముందరి పద్యముతో నన్వయము.

భారత. ఈ తెఱఁగునన్, సతితోన్ = ద్రౌపదితో, సభ్రాతృకుఁడై = భీమార్జున నకులసహదేవ సహితుఁడై, వరుసన్, చని, ప్రపంచిత ... భూము లందున్ ; ప్రపంచిత = ప్రసిద్ధులైన, సుమనః = సజ్జనులుగల, ద్వైతవన భూములందున్ = ద్వైతవన ప్రదేశములందు, ప్రభూత = అతిశయించిన, ఆమోదమునన్ = సంతోషముతో, ఎలమిన్, పొందుచున్, అంతన్ = ఆవల, పూర్వపద్యమునఁగల ఆరాజమూర్ధన్యుఁడను పదము కర్త.

తా. ధర్మజుఁడు సతీ సోదర సహితుఁడై క్రమముగఁ జని ద్వైత మునంజేరి మిక్కిలి సంతసించి, ముందు పద్యముతో నన్వయము.

"ప్రపంచిత." "విపర్యాసే విస్తరేచ ప్రపంచః" అమరము.

" సభ్రాతృకుఁడై. " " వోపసర్జనస్య " పాణిని.

" సుమనోద్వైతవన" "సుమనాః పుష్పమాలత్యోః స్త్రియాందేవే" నానార్థరత్నమాల.

" ఆమోదమునన్. " " అదంతికపుంసి ... ఆనందే, విమర్దోద్భవ మనోహర దూరవ్యాపిగంధే." శబ్దార్థకల్పతరువు.

చ. మొలచు వచః ప్రసంగముల కే ముందరగాఁగల కార్యరేఖ వెం
పెలయఁబరాత్మచింతన సుకేహృచ్ఛరభంగసుతీక్ష్ణకుంభజా
దులహిత శాసనక్రమము కే తోఁ జరియించెద రత్యనూన త
త్కలితబహూపచారితికకేతంబునరంజిలియంచు నెంచుచున్.

రామా రాణ. మొలచు ... ప్రసంగములన్, మొలచు = ఉత్పత్తిలు చుండు, వచః = మాటలయొక్క, ప్రసంగములన్ = ప్రస్తాపములచే

ముందరన్ = ముందు, కాఁగల...పెంపు; కాఁగల, కార్యరేఖ = కార్యశ్రేణియొక్క, ఇంకఁ జరుగవలయు కార్యక్రమమున కనుట ; పెంపు=అతిశయము, ఎలయన్=ప్రకాశింపఁగా స్ఫురింపఁగాననుట, [ఈయజాది పదమే క్రమముగ వెలయునని హాలాది యాయెను.] పరాత్మ ... క్రమములోన్; పరాత్మ = పరమాత్మయొక్క, చింతన = ధ్యానించుటచే, సుహృత్ = మంచిహృదయముగల, పరబ్రహ్మచింతనమున శుద్ధమానసులని భావము; శరభంగ = శరభంగుఁడను మహర్షియు, సుతీక్ష్ణ = సుతీక్ష్ణుఁడను మర్షియు, కుంభజ = అగస్త్యుఁడును, ఆదుల = మొదలుగాఁగల వారియొక్క, హితశాసన = హితోపదేశములయొక్క, క్రమములోన్, రతి...కతంబునన్ ; రతి = వేడుకచే, అనూన=తగ్గనట్లు, అధికమగు లాగుననసుట; తత్కలిత= ఆమునులచే నొనర్పఁబడిన, బహూపచారతకతంబునన్=మిక్కుటమగునుపచారము మూలమున, రంజిలి = సంతసించి, చరియించెదన్ = సంచరించెదను, అంచున్ = అనుచు, ఎంచుచున్ = తలఁచుచు.

తా. ప్రస్తావవశమున నింక మున్ను జేయఁ గలకార్యముల విషయము మానసమున స్ఫురింపఁగాఁ బరబ్రహ్మధ్యానమున సద్హృదయులగు శరభంగాదుల హితోపదేశములు వినుచు వారొనర్చు సపర్యల రంజిల్లెదనని తలంచుచున్.

“ కార్యరేఖ.” “ రేఖాతుశ్రేణిలేఖయోః.” నానార్థరత్నమాల.

“రంజిలి.” ఇటనేకలకారతకు ; “ తత్రోభయోర్భవేదేకోలకార ఇతికేచన.” అధర్వణకారికావళి.

“కార్యరేఖ పెంపెలయన్.” ఇటఁ బ్రకాశింపఁగానన మనస్సునఁ నొనర్పవలసిన యసురసంహారరూప కార్యక్రమము స్ఫురింపఁగానని భావమగుచున్నది. ఇది మునుల సందర్శించుటకు హేతువగును. మునులం దర్శించినంగాని ; రాక్షసులు వారింబాధించురీతి నెఱుఁగుటయుఁ దత్కారణమునఁ దానసురులం జంపునట్లు ప్రతిజ్ఞ యొనర్చుటయు, నత్కారణమున రాక్షసులపై ద్వేషము పూనుటయు సంభవింపవు

భారత. మొలచు, వచః, ప్రసంగములన్, ప్రస్తావవశమున ననుట; ముందరన్ = ముందు, అజ్ఞాత వాసానంతరమున, కాఁగల కార్యరేఖ, పెంపు = జరుగఁగల కార్యక్రమముయొక్క పెంపు, యుద్ధమనుట; ఎలయన్, దుర్యోధనాదులు దన రాజ్యభార మంగీకరింపరనియుఁ దన్మూలమునఁదప్పక యుద్ధమే జరుగఁగలదనియు నిశ్చయించి,యాయుద్ధప్రయుక్త విషయము మనస్సునకు స్ఫురింపఁగానని భావము; పర అత్మ చింతన్ = శత్రువులగు దుర్యోధనాదులయొక్కయుఁ, దనయొక్కయు చింతనచే, బలాబలవిచారముచే ననుట; అసుహృత్.........కుంభజాదలు; అసుహృత్ = ప్రాణములహరించునట్టి, శర = బాణములయొక్క, భంగ = భంగ మొనర్చుటయందు, సుతీక్ష్ణ = ప్రచండులయిన, కుంభజాదులు = ద్రోణాచార్యుఁడు మున్నగువారు, అహిత ......... క్రమముతోన్; అహిత = దుర్యోధనునియొక్క, శాసనక్రమముతోన్ = ఆజ్ఞానుసారమున, అతి, అనూన, తత్ = ఆ దుర్యోధనాదులచే, కలిత, బహూపచారత కతంబునన్, రంజిలి, చరియించెదరు = వర్తించెదరు, అంచున్, ఎంచుచున్, అది యట్లుండెనను పద్యమునందలి రాజమూర్ధన్యుఁడను కర్తయిట ననువర్తించుచున్నది.

తా. అజ్ఞాతవాసానంతరపుఁ గార్యక్రమము ప్రస్తావవశమునరాఁగఁ గౌరవులు దనరాజ్యభార మంగీకరింపరనియుఁ దన్మూలమున యుద్ధము తప్పక జరుగఁగలదనియు మనస్సున స్ఫురింపఁగా, దాని కనువగులాగున స్వశక్తి పరశక్తుల విచారించుచు నెట్టిప్రాణహారమగు శరమునేనియు భంగపాటొందవింపఁజాలు ద్రోణాదులు కౌరవవాక్య వశవర్తులై, వారి పూజలం గైకొని రంజిలుచుందురని తలంచుచు.

ఇట "అసుహృచ్ఛర." భంగ అనుస్థలమున ముద్ద రాజారామన్న శత్రు శర, భంగమునని యర్థము గావించెనుగాని, అసు, హృత్, శరభంగ, అని యర్థముగావించినఁ గుంభజాదుల ప్రభావమున కింకయువన్నె దెచ్చినట్లగునుగాన నిది యెంతయు యుక్తమగును.

"శరభంగ" శబ్దమునకుఁ గొందఱు చాపభంగమని యర్థము గావించెదరుగాని యది సమంజసముకాదు.

సీ. కడుఁదన్మహాశ్రమ గమనోదితోత్సాహుఁ
డయ్యె నాసమయంబు నందు నమిత
తుంగహృద్రిపుశర భంగమునీశ్వరు
నంబకము న్మహి మాస్పదమును
ఘనతపశ్శక్తిఁ దె మ్మని విధి దయచేసి
వెస జిష్ణుఁ బంచెఁ ద ద్వేళవచ్చి
తత్పితామహుఁడు స త్యవిధానుఁ డట్లంప
నాఘనుఁడింద్రకీ లాశ్రమప్ర

గీ. వేళ మొనరించి యవ్విధి విభు సురేశు
నఖిలనుతుని భజించెద యాత్వరాతి
రాముఁ డాదిత్యకులభర్త రమణ వచ్చి
కరుణసేయునంతకుఁ దగు గట్టితాల్మి. 35

రామాయణ. కడున్ = మిక్కిలి, తత్.........ఉత్సాహుఁడు; తత్ = ఆమహర్షులయొక్క, మహా + ఆశ్రమ = గొప్పయాశ్రమములకు, గమన = పోవుటకు, ఉదిత = పుట్టిన, ఉత్సాహుఁడు అయ్యెన్, ఉత్సాహముగలవాఁడయ్యెను, ఆ సమయంబునందున్ = ఆతరుణమున, నమిత... ఆస్పదమును ; నమిత = అణఁపఁబడిన, తుంగ=ఉన్నతములగు, బలవంతములగునవనుట; హృద్రిపు = అంతశ్శత్రువులఁగల, అరిషడ్వర్గము నణఁచినవాఁడని భావము; శరభంగమునీశ్వరు = శరభంగమహర్షియొక్క, అంబక = నయనములకైన, మున్మహిమ = సంతోషాతిశయమునకు, ఆస్పదమును = స్థానమగువానిని [ఆస్పదశబ్దమునిత్య నపుంసకము.] తపశ్శక్తిన్ = తపమువలనిశక్తిగలవానిని, వెసన్ = వేగముగా, తెమ్ము, అని = తోడితెమ్మని,

విధి=బ్రహ్మ, దయచేసి = అనుగ్రహించి, జిష్ణుఁ=ఇంద్రుని, పంచెఁ = పంపెను, తద్వేళ = అట్లు బ్రహ్మను దర్శించు సమయము, వచ్చి [ఇది బ్రహ్మయనుట కుహేతువగుచున్నది. కాఁబట్టి యిటవచ్చి యనుటకురాఁగా నని యర్థముగావించునది,] సత్యవిధానుఁడు=సత్యమగు విధానమున గలవాఁడు, తత్పితామహుఁడు=ఆబ్రహ్మ, అట్లు, అంపఁ = పంపఁగా, ఆ ఘనుఁడు= ఆ గొప్పవాఁడు, శరభంగమహర్షి యనుట ; ఇంద్ర = ఇంద్రుఁడా! [ఇది సంబోధన] కీల = అగ్నిజ్వాలలయందు, అశ్రమ = శ్రమలేనట్లు, ప్రవేశము, ఒనరించి = ప్రవేశించి, విభుఁ = గొప్పవానిని, సురేశుఁ = దేవశ్రేష్ఠుని, అఖిలనుతునిఁ = అందఱిచేఁ బొగడఁబడినవానిని, [ఇవి బ్రహ్మకు విశేషణము] అవ్విధిఁ = ఆ బ్రహ్మను, భజించెదఁ = ఆశ్రయించెను యాత్వరాతి = రాక్షసశత్రుఁడు, ఆదిత్యకులభర్త = సూర్యవంశశ్రేష్ఠుఁడు, రాముఁడు, రమణఁ, వచ్చి, కరుణసేయునంతకుఁ = దయసేయువఱకు, గట్టితాల్మి = దృఢమగు నోర్పు, విలంబసహత్వ మనుట ; తగుఁ = యుక్తము. ముందు పద్యముతో నన్వయము.

తా. రాముఁడు ఆమహర్షుల యాశ్రమముల వెడల నుత్సాహి యయ్యెను. బ్రహ్మ జితేంద్రియుఁడగు నా శరభంగమహర్షిని నేత్రపర్వముగాఁ గాంచ నిచ్ఛించి యింద్రునంప బ్రహ్మసమీపమునకు రావలయు కాలము సమీపించినందున దేవేంద్రుఁ డాతని యాశ్రమమునకురాఁగా, శరభంగుఁడు - ఓ యింద్రుఁడా ! అగ్నిం బ్రవేశించి నే బ్రహ్మసమీపమునకు వచ్చెదఁగాని రాక్షసాంతకుఁడగు రాముఁడు వచ్చునంతకు నోపికపట్టి యుందును.

"అంబకం." "అంబకం నేత్రశరయోః." విశ్వనిఘంటువు.

"కీల." "ద్వయోర్జ్వాలకీలౌ." అమరము.

"యాతు." "యాతుధానఃపుణ్యజనో నైరృతో యాతురక్షసీ." అమరము.

తత్పితామహుఁడు = ఆయింద్రుఁడనియు, సత్యవిధానుఁడు = సత్యధనము గలవాఁడనియు నర్థమగునని యభిప్రాయపడెదరు కాని అది యసమంజసము.

భారత. కడున్, తత్......ఉత్సాహుఁడు; తత్ = ఆతలంపువలని, మహాశ్రమగ = మిక్కిలి శ్రమనుజెందిన, మనః = మనస్సుచే, దిత = ఖండింపఁబడిన, ఉత్సాహుఁడు, అయ్యెన్ = ఉత్సాహవంతుఁడయ్యెను. ద్రోణాదులు దన కనుకూలురుగా రను చింతచేఁగతోత్సాహుఁడయ్యెనని భావము; ఆ సమయమునన్, అమిత......భంగమున్; అమిత= మితిలేని, విశేషించిన యనుట; తుంగవ్రాత్ = ఉన్నతచిత్తులగు, రిపు = శాత్రవుల, శర = బాణముల, భంగమున్ = భంగమొనర్చెడి దానిని, [ఇట నమితశబ్దము శరశబ్దవిశేషణము.] మహిమాస్పదమును = మహిమకు స్థానమగుదానిని, ఈశ్వరు నంబకమున్ = పరమేశ్వరుని బాణమును, పాశుపతాస్త్రము ననుట; ఘనతపశ్శక్తిన్ = గొప్ప తపశ్శక్తిచే, తెమ్మని = తీసికొని రమ్మని అని, విధిన్ = అందులకు వలయు మంత్రవిధానమును, దయచేసి = అనుగ్రహించి, సత్యవిధానుఁడు, తత్పితామహుఁడు = ఆ ధర్మజుని తాతయగు వ్యాసుఁడు, తద్వేళన్, వచ్చి, వెసన్, జిష్ణున్ = అర్జునుని, పంచెన్ = పంపెను, అట్లు, అంపన్, అఘనుఁడు = గొప్పవాఁడగు నా యర్జునుఁడు, ఇంద్రకీల, ఆశ్రమ, ప్రవేశము, ఒనరించి = ఇంద్రకీలపర్వతమునందలి యాశ్రమమునం బ్రవేశించి, [ఒనరించి యనునది పొనరించియొక్క పూర్వరూపము.] అవ్విధిన్ = ఆవిధానమున, దయాత్వరాభిరాముఁడు = దయవలని త్వరచే మిక్కిలి రమణీయమగువాఁడు, ఆదిత్యకులభర్త = దేవశ్రేష్ఠుఁడు, ఇంద్రుఁ డనుట; కరుణన్, వచ్చి, కరుణసేయునంతకున్ = అనుగ్రహించువఱకు, తగున్ = తగిన, గట్టితాల్మిన్ = స్థిరమైన సహనముతో, అఖిలనుతుని = అందఱచేఁ బొగడఁబడినవానిని, విభున్, సురేశున్ = దేవేంద్రుని, భజించెన్ = ఆశ్రయించెను, ఇంద్రుని గుఱించి తపము సల్పె ననుట.

తా. ధర్మజుఁడు ద్రోణాదులు శత్రుపక్షమున నుండుటకు విచారించుచుండ వ్యాసుఁ డటకువచ్చి శత్రుశరభంగకరమగునట్టి పాశుపతాస్త్రముం గొనిరమ్మని యర్జునునకు దానికి వలయు మంత్రవిధానమంతయు నుపదేశించెను. అర్జునుఁ డ ట్లాతనిచేఁ బంపఁబడినవాఁడై యింద్రకీలపర్వతమునందలి యాశ్రమమును బ్రవేశించి, తన్నింద్రుఁ డనుగ్రహించువఱకు దీక్షపూని యాతని ధ్యానించుచుఁ దప మొనరించెను.

"విధి" "విధిర్విధానే దైవేపి. అమరము."

దీనికి ము న్నుండు మైపద్యములలో నెల్ల భీముం గర్త గావించి, ఈ పద్యమున ముద్దరాజు రామన్న "అవ్వేళవచ్చి = ఆ ధర్మరాజు విచారవేళ యందు వచ్చి," యని పూర్వోత్తర సందర్భశూన్యముగ నర్థమొనర్చెను. ఇట నిట్టి యర్థము గావించుటచేత నే యతఁడు 'రాజమూర్ధన్యుఁ' డను స్థలమున భీముఁడని యర్థము గావించుట పొరపాటని స్పష్టముగాఁ దెలియు చున్నది.

గీ. ప్రీతివచ్చినాకీశుఁడు నాతపోవి
భూతిఫలము దానై యత్యపూర్వవృత్తి
నధికశివమనురూపసన్నిధియొసంగ
నతనినంచికృతార్థుఁడ నగుదు ననుచు. 36

రామాయణ. ప్రీతిన్, వచ్చి = ప్రీతిచే నరుదెంచి, నాకన్, ఈశుఁడు = రాముఁడు, నా తపోవిభూతిఫలమున్ + ఐ = నా తపఃఫలము తానే.యయి, అతి+అపూర్వవృత్తిన్ = మిక్కిలివింత యగులాగున, అధిక శివము = మిక్కిలి మంగళమయిన, కడుమంగళకరమగున దనుట; అనురూపసన్నిధి = యుక్తమగు సాన్నిధ్యము, ఒసంగన్ = ఈయఁగా, అతనిన్ = ఆ రామచంద్రుని, అంచి = పంపి, కృతార్థుండ నగుదున్ = ధన్యుఁడ నగుదును. అట్లు బ్రహ్మలోకమునకు వత్తు ననుట; అనుచున్; ముందటి పద్యములో నన్వయము.

తా. నా తపఃఫలమగు శ్రీరాముఁడు నాయాశ్రమమునకు వచ్చి నన్ననుగ్రహించిన తర్వాత నేను బ్రహ్మయొక్క యానతిచొప్పున వచ్చెదను.

భారత. ప్రీతిన్, వచ్చి, నాకీశుఁడున్ = ఇంద్రుఁడును, ఆతపో విభూతిఫలము = ఆ తపస్సనెడి సంపదయొక్క ఫలము, తాన్ = తాను, నైయత్యపూర్వవృత్తిన్ = నియతత్వపూర్వక వర్తనమున, అధిక...... సన్నిధి ; అధిక = ఎక్కుడగు, శివమనురూప = శివసంబంధమగు మంత్ర రూపమయిన, సన్నిధిన్ = గొప్పనిధిని, ఒసంగన్ = ఈయఁగా, అతనిన్ = ఆయింద్రుని, అంచి = పంపి, కృతార్థుండన్, అగుదున్, అనుచున్ = ధన్యుఁడ నయ్యెద ననుచు, పూర్ణకాముఁడ నగుద ననుచని భావము.

తా. ఇంద్రుఁడు ప్రియముతో వచ్చి యాతని తపమునకుఁ బ్రయోజ మగు, శివమంత్రరూపమగు నిధి నొసఁగి వెడలెను. అర్జునుఁడు దా నా మంత్రరాజము మూలమునఁ బూర్ణకాముఁడ నగుదు ననుచు; ముందు పద్య ముతో నన్వయము.

"నాకీశుఁడు" "నాకినాం ఈశః, నాకీశః." అని వ్యుత్పత్తి.

"అంచి." ఇంచుక్పు క్వగామంబులు పరంబగునపు డాగమాదేశ లోపంబులు పెక్కు తెఱంగులం గానంబడుటచే నిట ననుచు ననుదాని కంచునని కాఁగ దాని క్త్వార్థక మంచియని యాయెను.

వ. యథోచితవినయోపచారపూర్వకంబుగా నింద్రుని మగుడ ననిచి. 37

రామాయణ భారతార్థములు సమము. సుగమము.

క. తనమనమున నెంతయు మిం
చినతాత్పర్యమునరాజశేఖరుశుభద
ర్శనునిరఘునాథుఁ దలఁచు
చనుపమభూయస్సమాధి నతఁడు దలిర్చెన్. 38

రామాయణ. అతఁడు = ఆశరభంగమహర్షి, ఎంతయున్ = మిక్కిలి, మించిన = అతిశయించిన, తాత్పర్యమునన్ = భావమున, రాజశేఖరున్ = రాజశ్రేష్ఠుని, శుభదర్శనున్=మంగళమగు చూపు గలవానిని, శోభననేత్రు ననుట; రఘునాథున్ = రాముని, తనమనమునన్ = తనచిత్తమున, తలఁచుచున్ = తలంచుచు, ధ్యానించుచు ననుట ; అనుపమ... సమాధిన్; అనుపమ = సాటిలేని, భూయః = తఱుచగు, సమాధిన్=యోగనిష్ఠను, తలిర్చెన్ = సంతోషించెను.

తా. శరభంగమహర్షి తన మనమున మిక్కిలి భక్తితో రఘురాముని ధ్యానించుచు యోగనిష్ఠుఁ డయ్యెను.

"సమాధి." సమాధిర్నియమే ధ్యానే విపాకేచసమర్థనే." అమరము.

భారత. అతఁడు = ఆయర్జునుఁడు ; ఎంతయున్, మించిన, తాత్పర్యమునన్ = భావమున, శుభదర్శనున్, నిరఘున్ = పాపరహితుని, నాథున్, రాజశేఖరున్ = చంద్రశేఖరుఁడగు నీశ్వరుని, తనమనమునన్, తలఁచుచున్, అనుపమ, భూయస్సమాధిన్ = యోగనిష్ఠను, తలిర్చెన్.

తా. ఆయర్జునుఁడు మానసమున నీశ్వరుని ధ్యానించుచు సమాధినిష్ఠుఁడయ్యెను.

"రాజశేఖరున్." "రాజానృపే తాలభేదేపతౌ క్షత్రియ చంద్రయోః." నానార్థరత్నమాల.

చ. అతఁడును దత్తపోమహిమ న్యచ్చటిమానులువచ్చి చెప్పఁగా
నతికుతుకంబున న్వినుచు న్నచ్చటికిం జనియెం బరాజితో
ద్ధతివిలసద్వయో మృగయున్ తన్ వనలక్ష్మి నశేషలోకసం[స్.
స్తుతగుణకుంధరాత్మజకుఁ న్జూపియుఁ జెప్పియు వేడ్క సేయుచు

రామాయణ. అతఁడును = ఆరాముఁడును, తత్తపోమహిమ = ఆ శరభంగుని తపోమాహాత్మ్యమును, అచ్చటి మానులు = అచ్చటిమహర్షులు,

వచ్చి, చెప్పఁగాన్, అతికుతుకంబునన్ = మిక్కిలి సంతోషమున, వినుచున్ = ఆకర్ణింపుచు, పరాజిత......యుతన్; పరాజిత = అపజిత మైన, తిరస్కరింపఁబడినయనుట; ఉద్ధతి = ఔద్ధత్యముగలవై, పరస్పర వైరవిహీనములైయని భావము; [ఇది విలసనమునకు హేతువు.] విలసత్ = ఒప్పుచుండెడి, వయః = పక్షులతోడను, మృగ = మృగములతోడను, యుతన్ = కూడిన, ఆయాశ్రమమునందలి పశుపక్ష్యాదులు సైతము పర స్పరద్వేషమును మానియున్నవని భావము; వనలక్ష్మిన్ = అరణ్యశోభను, అశేష........గుణకున్; అశేష = సమస్తమైన, లోక = జనముచే, సంస్తుత = పొగడఁబడిన, గుణకున్ = గుణముగలదానికి, ధరాత్మజకున్ = సీతకు, చూపియున్, కాన్పించియు, చెప్పియున్, వేడ్క చేయుచున్ = వేడుక గల్పించుచు, అచ్చటికిన్ = ఆశరభంగాశ్రమమునకు, చనియెన్ = పోయెను.

తా. శరభంగ మునీంద్రుని తపోమహిమం గుఱించి యచ్చటి మహ ర్షులు ప్రశంసింపఁగా రాముఁడువిని యాతనింగాంచ నుత్సుకుఁడై తరలి పశు పక్ష్యాదులు సైతము పరస్పర వైరముమాని స్నేహముతోనుండునట్టి యా మునీంద్రునాశ్రమప్రాంత లక్ష్మిం జనకాత్మజకుం జూపుచు వానిగుఱించి వర్ణించుచు నామెకు వేడ్కగూర్పుచు నయ్యాశ్రమమున కేఁగెను.

"వయః." "వయః పక్షిణి బాల్యాదౌ." నానార్థరత్నమాల.

"లోక." "లోకస్తు భువనేజనే." అమరము.

"మృగ." "మృగ్యతేలుబ్ధకైరితిమృగః. మృగఅన్వేషణే." గురు బాలప్రబోధిక.

. భారత. అతఁడును = ఈశ్వరుఁడును, [ఇచ్చట సముచ్చయ సామ ర్థ్యముననే పూర్వపదోక్తార్జునధ్యాత పరమేశ్వరుఁడని తచ్ఛబ్దమున కర్థ మగుచున్నది.] తత్తపోమహిమ = ఆ యర్జునుని తపోమహిమ, అచ్చటి మౌనులు = అయింద్రకీలమునందలి మహర్షులు, వచ్చి, చెప్పఁగాన్, అతి

కుతుకంబునన్, వినుచున్, పర......మృగయుతన్ ; పర = ఇతరులచే, అజిత = జయింపఁబడని, ఉద్ధతి = ఔద్ధత్యముచే, విలసత్, వయః = ప్రాయముగల, మృగయుతన్ = వ్యాధత్వముతోడ, [ఇట భావార్థమున క్త ప్రత్యయము.] వనలక్ష్మిన్ = ఆయింద్రకీలపర్వత ప్రాంతవనలక్ష్మిని, అశేషలోక సంస్తుతగుణకున్, ధరాత్మజకున్ = పార్వతికి, చూపియున్, చెప్పియున్, వేడ్క, చేయుచున్, అచటికిన్ = అప్పర్వతమునకు, చనియెన్ = పోయెను.

తా. ఇట్లర్జునునిచే ధ్యానము సేయఁబడుచుండు నప్పరమేశ్వరుఁ డింద్రకీలాచలమునుండి వచ్చిన మహర్షు లతనితపోమహిమందెల్ప నాతనిం గాంచ మాయాకిరాతుఁడై పార్వతితోడ వచ్చుచు, నచ్చటి వనశోభఁ జూపుచుఁ జెప్పుచు నాబిడ కుత్సాహము గల్పించుచు నచ్చటి కరిగెను.

"మృగయుతన్." "మృగాన్వధార్థం యాతీతిమృగయుః" గురుబాల ప్రబోధిక.

"ధరాత్మజకున్" "ధరశ్శైలే ధరాభువి." నానార్థరత్నమాల.

చ. వలసినవన్యవర్తన మ
వార్యగతిన్ జరిగింపుచున్ బ్రవ
ర్ధిలుతమిఁ బేర్చుతమ్మునియ
తిస్థిరభక్తిఁ బ్రమోదసంపదల్
దలకొనఁగా నరణ్యచర
తన్ భజియించి యతండుముఖ్యభృ
త్యులమరసంయములుదము
తో మదిఁ బ్రొక్కనటించెమర్త్యతన్. 41

రామాయణ. ప్రవర్ధిలుతమిన్ = వృద్ధిపొందుచుండు నిచ్ఛచే, పూర్ణేచ్ఛచేననుట; వలసిన వన్యవర్తనము=వలసినట్టియాటవిక జీవనోపాయములను, ["వనేభవాః వన్యాః" అని వ్యుత్పత్తియగుటచే నటవీ జాతములగు

కందమూల ఫలాదికమని భావము.] అవార్యగతిన్ =అనిరుద్ధగతిగా, అధిక ముగానని భావము; జరిగింపుచున్ = కల్గించుచు, [ఇటఁ బ్రేరణార్థమునఁ బుగాగమము.] లక్ష్మణుఁడు సీతారాములకు వన్యాహారము సంపాదించి యిచ్చుటలో సంపూర్ణమగు నాసచే నిచ్చెఁగాని యగ్రజానకవరజుఁడు పరిచర్య సేయుటవిధిగదా యనునభిప్రాయముతో నీలేదనిభావము; పేర్చు = అతిశయిల్లు, శేష్యతిశయాధాయకత్వము శేషభూతుని లక్షణ మగుటచే రాముఁడాహారము గ్రహించి యతిశయించియుండ స్వకృత్యము నిర్వహించితిని గదాయని లక్ష్మణుఁడు పేర్చెనని భావమగును; తమ్మునిన్ = సోదరుఁడగు లక్ష్మణుని, అతిస్థిరభక్తిన్ = మిక్కిలి తిరమగు భక్తిచేత, ప్రమోద సంపదల్ = ఆనందమనెడి సంపదలు, తలకొనఁగాన్ = వ్యాపింపఁగా, అరణ్యచరతన్ = వనసంచారిత్వమును, భజియించి = పొంది, ముఖ్యభృత్యుల్ = ముఖ్యులౌ సేవకులగు, అమరసంయముల్ = దేవమునులు, ముదముతోన్ = సంతోషముతో, మదిన్ = మనస్సున, మ్రొక్కన్ = నమస్కరింపఁగా, [మానుషావతారమునసుండుటయే యిట మది మ్రొక్కుటకు హేతువు] మర్త్యతన్ = మనుష్యత్వమును, నటించెన్.

తా. లక్ష్మణుఁడు వన్యాహారములం గొనివచ్చి యీ నాతని భక్తి వలన మిక్కిలి సంతసించి రాముఁడరణ్యమున దేవమునులు ప్రాప్తమర్త్యభావుఁడగుట మానసములందే మ్రొక్కుచుండ సామాన్య మనుష్యునివలె నటించెను.

"వర్తనము." "వృత్తిర్వర్తనజీవనే." అమరము.

"వర్థిలుతమిన్." "గ్రచ్చుకోరికితమికోర్కి-యిచ్చ." ఆంధ్రనామ సంగ్రహము.

ముద్దరాజు రామన్న వన్యవర్తనము = కందమూలఫలాదికము, జరిగింపుచున్=ఆహారము చేసికొనుచు," అని యర్థముగావించి, 'జరిగింపుచున్' అను స్థలమునందలి ప్రేరణార్థమునందలి పుగాగమమనుట నాలోచింపక రాముఁడాహారము గ్రహించుచుండెనని యభిప్రాయపడెను. రామునకు లక్ష్మ

ణుఁడాహారము సంపాదించి యిచ్చెననుటయే కవియాశయుగుననుటకీ ప్రేత కార్థకపుగాగమమే ముఖ్యనిదర్శనము.

"నటియించెమర్త్యతన్." ఆత్మానం మానుషంమన్యేరామం దశ రథాత్మజ"మ్మని తానెంత కప్పిపుచ్చినను, "గచ్ఛలోకానను త్తమాన్." అని జటాయువున కూర్ధ్వలోక మొసఁగుట యాతని నటనమును విశద పఱచుచునే యున్నది. "సత్యేనలోకాన్జయతి" యనుటచే నయూర్ధ్వగతి దానము పొసఁగునని తలంచినను, బరశురాము నూర్ధ్వలోకభంగమును, శంబూకవధమున బ్రాహ్మణబాలుం బునర్జీవితుం గావించుటయు నీతనియతి మానుషకృత్యముల వెలియిడుచునే యున్నవి.

భారత. వలసిన = వన్యవర్తనము = వనవిహారము, అవార్యగతిన్, జరిగింపుచున్, ప్రవర్ధిలు, తమిన్, పేర్చు, తమ్మున్ = పార్వతీపరమే శ్వరులను, నియతి = నిర్ణయపూర్వకమగు, స్థిర భక్తిన్, ప్రమోదసంప దల్, తలకొనఁగాన్, అరణ్యచరతన్ = వ్యాధత్వమును, భజియించియు = పొందియే, తండు, ముఖ్యభృత్యులు = నందిమున్నగు భృత్యులు, అమరన్ = అమరియుండఁగా, సంయముల్ = మహర్షులు, ముదముతోన్, మదిన్, మ్రొక్కన్, మర్త్యతన్, నటించెన్.

తా. నందిమున్నగువారు వ్యాధత్వమునుబొంది తమ్ము [పార్వతీపర మేశ్వరులను] భజించుచుండఁ దనవలెవారింగూడ వన్యవిహారము సల్పు లాగునఁ గావించి, కిరాతవేషధారియై పరమశివుఁడు మహర్షులు దన్నుమాన సమునఁనే నమస్కరించుచుండ మనుష్యత్వమును నటించెను.

" తండుముఖ్యభృత్యులు. " " తండునందినా నందికేశ్వరే" అమ రము.

వ. అది యట్లుండెనట్టి సమయంబున. 42

తా. సులభము.

చ. బిరుదునఁ బేర్చు దేవరిపు భీమవరాహవ పుష్కరాక్షునుం
దరసవిశేషధామ సముదంచితసత్త్వమయాంగ రాజకుం
జరకుధరాకృతిం బ్రబలు సర్వపలాశిచయంబు గూల్చు సు
స్థిరు నిను మావిభుం డను మతిన్ వెనుదాలెదమాదరంబునన్.

అవతారిక. ఇది మహర్షుల వాక్యము.

రామాయణ. బిరుదునన్ = వీరత్వముచే, పేర్చు = అతిశయించు, భీమ = భయంకరమగు, వర = శ్రేష్ఠమైన, ఆహవ = యుద్ధముగలవాఁడా, పుష్కరాక్ష = తామరవంటి కన్నులు గలవాఁడా, సుందర......అంగ; సుందర = అందమైనట్టియు, సవిశేషధామ = విశేష తేజస్సహితమై నట్టియు, సముదంచిత = మిక్కిలి యొప్పుచున్న, సత్త్వమయ = సత్త్వ గుణప్రధానమైనట్టియు, అంగ = అంగముగలవాఁడా, రాజకుంజర = రాజ శ్రేష్ఠుఁడా, రాముఁడా యనుట; కుధరాకృతిన్ = పర్వతాకారముల, ప్రబలున్ = ప్రబలుచున్న, మిక్కిలి యభివృద్ధిపొందుచున్న యని భావము; సర్వపలాశిచయంబున్ = సర్వరాక్షస సమూహమును, కూల్చు, సుస్థిరున్ = కూల్చునట్టి స్థిరమైనవానిని, నినున్ = నిన్ను, మావిభుండు = లక్ష్మీవల్ల భుఁడు, విష్ణుఁడనుట; అను, మతిన్ = అనెడుబుద్ధిచే, ఆదరంబునన్ = ప్రీతితోడ, వెనుదాలెదము = అనుసరించెదము.

తా. ప్రసిద్ధయుద్ధ నిపుణుఁడగు వాఁడా, తామరలవంటి కన్నులు గలవాఁడా, అందమై తేజస్సంపన్నమై సత్త్వగుణ ప్రధానమగు నంగములు గలవాఁడా, రాజశ్రేష్ఠుఁడగునో రాముఁడా, మిక్కిలి యభివృద్ధి పొందు చుండు రాక్షసులం గూల్చు నిన్ను నారాయణుఁడని మేమెఱుంగుటచే ననుసరించెదము.

"ఆహవ." "సంగ్రామాభ్యాగమాహవాః" అమరము.

"రాజకుంజర." ఇటఁ గొందఱు "ఉపమితంవ్యాఘ్రాదిభి స్సామాన్యాప్రయోగే" అనుసూత్రముచొప్పున, "రాజా, కుంజరమువలె" నని యభిప్రాయపడెదరుకాని యది సమంజసముకాదు. కుంజరశబ్దమిట శ్రేష్ఠ

వాచకము. "సింహశార్దూల నాగాద్యాః పుంసిశ్రేష్ఠార్థగోచరాః." అమరము.

"పుష్కరాక్ష." "బిసప్రసూనరాజీవ పుష్కరాంభోరుహాణిచ." అమరము.

భారత. విరుదునన్, పేర్చు = అతిశయించునట్టియు, దేవరిపు... రాక్షసున్; దేవరిపు = దేవతలకు శత్రుఁడగునట్టియు, భీమ = భయంకరుఁడైన, వరాహవపుష్క = వరాహశరీరముగల, రాక్షసున్ = రక్కసుని, తరస.....రాజకున్; తరసవిశేష = మాంసభేదమునకు, క్రొవ్వునకనుట; ధామ = స్థానమగు, సముదంచిత = మిక్కిలి ప్రకాశించుచున్న, సత్త్వమయ = బలప్రచురమైన, [హిరణ్మయ కుండలాదులయందువలెఁ బ్రాచుర్యార్థమున మయిట్ ప్రత్యయము.] అంగ రాజకున్ = శరీరశ్రేష్ఠముగల వానిని, చర = సంచరించుచున్న, కుధరాకృతిన్ = పర్వతాకారమున, ప్రబలు = వృద్ధినందునట్టియు, జంగమమగు పర్వతమాయనులాగున వృద్ధిఁ బొందుచుండునట్టి; [ఇది రాక్షసవిశేషణము.] సర్వపలాశిచయంబున్ = వృక్షసమూహములను, కూల్చు = పడఁద్రోయునట్టి, సుస్థిరునిన్ = మిక్కిలి స్థిరమగువానిని, వరాహరాక్షసుననుట; విభుండు = పరమేశ్వరుఁడు, అనుమతిన్ = ఇష్టముతో, దమాదరంబునన్ = అణఁచుటయందాదరముచే, వెనుదాలెన్ = వెనుకఁదవిలెను.

తా. పరాక్రమమున నతిశయించునట్టియు, దేవశత్రువగు నట్టియు, భయంకరమగు వరాహశరీరముగల రాక్షసుఁడగువానిని, మాంసప్రచురమగు పరాక్రమయుతమగు శరీరముగలవానిని, జంగమమగు పర్వతమాయనులాగున నొప్పునట్టివానిని, నన్నివృక్షములఁ బడఁద్రోయునట్టివానిని, స్థైర్యముగల వానిని, ఆవరాహరూప రాక్షసుని నణఁపఁదలఁచినవాఁడై పరమశివుఁడాతని వెన్నంటెను.

ఇట 'బిరుదునఁబేర్చు' ననుపదమును గొందఱు దేవతలకు విశేష ణము గావించిరి. శత్రూత్కర్షము వర్ణనముగావించి యట్టివానిం జయించిన వాఁడని నాయకుం దెల్పుట యెంతయు నుచితమగునుగాన దీని రాక్షసునకు విశేషణము గావించుట రసవత్తరము.

"వరాహ." "వరాహస్సూకరో ఘృష్టిః." అమరము.

"వపుష్క." "ఉరః ప్రభృతిభ్యఃకప్." పాణిని.

"తరస." "పిశితం తరసం మాంసం." అమరము.

"సర్వపలాశి." "పలాశిద్రుద్రుమాగమాః." అమరము.

"అంగరాజకుం, జరకుధర." "నాంతంబైనపదంబులఁ బొంతంబై నున్న శబ్దములకచటతపల్, దొంతిగజడదబలగు నయ్యంత్య నకారంబునున్న యఖినవదండీ" ఆంధ్రభాషా భూషణము.

సీ. అని కోర్కిమీఱ ని § జాలోక పరుల తీ
 తాశ్రమాలయులు ద § న్ననుసరింప
నవని భూదారాను § యానోచితాధ్వని
 క్షిప్తాంఘ్రిగతులను § జెన్ను మిగుల
నాత్మభక్తుని సత్త్వ § మరసి ప్రోచుటకురా
 జవతంసుఁ డట్లు వ § త్సలత నేఁగి
యావనక్రోడంబు § నం దాతపస్వియుఁ
 దానునుగూడ స § త్ఫలత నొప్పె
గీ. నంబకము లేసిరివహించె § నదితదుభయ
సంగరాగ మనోర్జితో § త్సవధురాని
మిత్తతఁ గరంబు నుతిఁ గాంచె § మించె నప్పు
డొగిఁ దదన్యోన్యజన్యము § ద్ద్యోతి యగుచు.

**రామాయణ.** అని = ఇట్లని, కోర్కి, మీఱఁగ = అతిశయింపఁగా, నిజ; ఆలోకవరులు = తన్నుఁజూచుటయందు దాసక్తిగలవారు, [ఆలోకన శబ్దముయొక్క రూపాంతరమే ఇది.] దాఁటిన, ఆశ్రమ = ఆశ్రమముల యందలి, ఆలయులు = స్థానముగలవారు, వారి వారి యాశ్రమప్రదేశముల వీడిన వారని భావము; అగునట్టిమహర్షులు, తన్నుఁగ = రాముని, అను సరింపఁగ, అవని......గతులను; అవనిభూ = సీతయొక్క, ఉదార=గొప్ప దగు, అనుయాన = తోడవచ్చుటకు, [మందయానతయే యిట నుదారతకుఁ గారణమగును.] ఉచిత = తగినట్లుగా, అధ్వనిక్షిప్త = మార్గమున నుంపఁ బడిన, అంఘ్రి = పాదములయొక్క, గతులను = గమనములచే, చెన్ను మిగులఁగ = మిక్కిలి ప్రకాశింపఁగా [“గజసింహగతీ వీరౌ శార్దూలవృష భోపమౌ.”] అని రామాయణమున రామునకును నలువిధములగు నడకలుండు నట్లు చెప్పుటచే, గజయానకుచితమగునట్లు తానును గజగమనుఁడయ్యె నని భావము; ఆత్మభక్తుని = నిజభక్తుఁడగు శరభంగమహర్షియొక్క, సత్త్వము = సత్త్వగుణము, అరసి = విచారించి [అరసియొక్క రూపాంతరమే యిది.] ప్రోచుటకుఁ = రక్షించుకొఱకు, [చతుర్థ్యర్థమున షష్ఠి.] రాజవతంసుండు = రాజశ్రేష్ఠుఁడు, రాముఁడనుట; అట్లు, వత్సలతఁ = వాత్సల్యముచే, ఏఁగి = వెడలి, ఆవనక్రోడంబునందుఁ = ఆవనమధ్యమున, ఆతపస్వియుఁ = ఆమహర్షియు, తానును = రాముఁడును, కూడఁ = చేరఁగా, అప్పుడు,సత్ఫలతఁ, ఒప్పు=మంచిఫలములు గలవౌటచే నొప్పెడి, అంబకంబులు = నయనములు, ఏసిరిఁ వహించెఁ = ఎట్టిలక్ష్మిని వహించెనో, ఎట్టి యొప్పిదముం గాంచెనోయని భావము; అది = ఆ యొప్పిదము, తత్......నిమిత్తతఁ; తత్ = ఆరామశరభంగులయొక్క, ఉభయ = జంటయొక్క, సంగ=చేరిక యందలి, రాగ=ప్రీతిగల, మనః=మనస్సుచే, అర్జిత = సంపాదింపఁబడిన, ఉత్సవధురా = ఉత్సవాతిశయముయొక్క, నిమిత్తతఁ = కారణత్వముచే, వీరిపరస్పరసంగమువలన వీరికెంతయు నుత్సాహము జనించెనని భావము; కరంబుఁ = మిక్కిలి, నుతి, కాంచి =

పొగడ్తనంది, ఒగిన్ = క్రమముగా, తత్......ద్యోతి; తత్ = ఆరామ శరభంగులయొక్క, అన్యోన్య, జన్య = పరస్పరమువలన పుట్టిన, ముత్ = సంతోషముచే, ద్యోతి = ప్రకాశించునది, అగుచున్, మించెన్ = అతిశయించెను.

తా. రామావలోకనాసక్తులగు మహర్షులు నిజాశ్రమముల వీడి యాతని ననుసరించుచుండ, మందగమనయగు సీతాదేవి దన వెంటవచ్చుటకై తాను మందగమనుఁడై, స్వభక్తుఁడగు శరభంగమునీంద్రుం గావ వాత్సల్యమున నతని యాశ్రమమున కరిగి యాతనితోఁ గూడియుండ నప్పుడు పరస్పర ప్రీతిం దెల్పువారి చూపులు స్తోత్రార్హ్యమగుచుండెను.

"వత్సలత నేఁగి." ఇటవాత్సల్యము నవరసాంతర్భూతమ యగును. ఎట్లన ? రసములలోఁ బ్రథమతో గణితమగు శృంగారమునకు 'రతి' స్థాయి యగును. ఆరతి ముత్తెఱంగుగా నగుచున్నది. "రతిదా నాయక నాయికాది పరతన్ రంజిల్లు శృంగారమై, క్షితిలో దేవ గురు ద్విజాది పరతం జెన్నొందు సద్భక్తియై, సుత మిత్రా శ్రిత సోదరాది పరతన్ సొంపారు వాత్సల్యమై;" రసాభరణము. కావున ననంతుని మతము చొప్పున శృంగార భక్తి వాత్సల్యము లొక్కకోటిలోఁ జేరిన వగుట నియ్యది నవ రసాంతర్గత మనుట నిర్వివాదాంశము.

"వనక్రోడంబునందున్." ఇటఁ గ్రోడ శబ్దమునకు నిఘంటువులలో భుజాంతరమను నర్థము గలదు. కావున నడవి నడిమిభాగమను భావమున నీ పదప్రయోగము గావించెను. "క్రోడో నా సూకరేక్లీబ ముత్సంగే వక్షసిద్వయోః." నానార్థ రత్నమాల." "ననాక్రోడం భుజాంతరం." అమరము.

"తపస్వి." "అస్మాయా మేధా స్రజో వినిః." పాణిని.

"ఉత్సవధురా." ఇటఁ దచ్ఛాత్యయాంతత గల్గుటకు; "ఋక్పూరబ్ధూః పథామానక్షే." పాణిని.

"మనోర్జిత." ముద్దరాజురామన్న, 'మనః + అర్జిత' యనిన మనోర్జితయని యగుననుట భావింపక, పొరపాటున 'మనః + ఆర్జిత' యనిపదచ్ఛేదముగావించెను. అప్పుడు 'మన ఆర్జితయని యగునుగాన నది సమంజసము గాదు.

భారత. అని కోరిక = యుద్ధవాంఛ, మీఱన్ = అతిశయింపఁగా, నిజ = తన్ను, శివుననుట; ఆలోక = చూచుటయందు, పరులు = ఆసక్తులు, అతీతాశ్రమాలయులు = విడువఁబడిన యాశ్రమావాసము గలవారు, మహర్షులనుట ; తన్నున్ = పరమశివుని, అనుసరింపన్, భూదార ............ గతులను ; భూదార = వరాహముయొక్క, అనుయాన = వెన్నాడుటకు, ఉచిత = తగిన, అధ్వని = చప్పుడుగానట్లు, క్షిప్త = పెట్టఁబడిన, అంఘ్రిగతులను, అవని = భూమి, చెన్ను మిగులన్ = మిక్కిలి యొప్పుచుండఁగా, ఆత్మభక్తుని = నిజభక్తుఁడగు నర్జునుని, సత్త్వము = బలము, అరసి, ప్రోచుటకున్, రాజవతంసుఁడు = చంద్రశేఖరుఁడగు పరమేశ్వరుఁడు, అట్లు, వత్సలతన్, ఏఁగి = వెడలి, ఆవనక్రోడంబునందున్ = ఆ యడవిపందియందు, ఆ తపస్వియున్ = అయ్యర్జునుఁడును, తానును, కూడన్, సత్ఫలతన్ ఒప్పు = మంచి ముండ్లుగల వాటచే నొప్పెడి, అంబకంబులు = బాణములు, ఏసిరి = ప్రయోగించిరి. అది = ఆప్రయోగించుట, తత్.........నిమిత్తతన్ ; తత్ ఉభయ = వారిరువురయొక్క, సంగర = యుద్ధముయొక్క, ఆగమన = కలుగుటయనెడి, ఉత్సవధురా = ఉత్సవాతిశయమునకు, నిమిత్తతన్ = కారణత్వమును, వహించెన్ = పొందెను, అప్పుడు = ఆసమయమున, తత్ = ఆయిర్వురయొక్క; అన్యోన్యజన్యము = పరస్పరయుద్ధము, ఉద్ద్యోతియగుచున్ = ప్రకాశించునదగుచును, కరంబు = మిక్కిలి, నుతిఁ = పొగడ్తను, కాంచి పొంది, మించెన్ = అతిశయించెను.

తా. యుద్ధాభిలాష యతిశయింప నచటి మహర్షులు దమయాశ్రమములువీడి మా యాయాకిరాతు ననుసరింపఁగాఁ, బరమేశ్వరుఁ డవ్వరాహము

ననుసరింపనను వౌనటులఁ జప్పుడుసేయక యడఁగులిడుచుఁ దనభక్తుని బల మారసి రక్షింపఁదలఁచి యా వన ప్రదేశమున కరిగి యచట నర్జునుఁడేసినట్లు తాను నావరాహముపై బాణములనేసెను. అట్లువా రిర్వురునొక్క వరా హముకొఱకే బాణమువేయుటచే 'నేకామిషభోగినాం వైరి తరోర్యా లే'మ్మనునట్లు పరస్పరస్పర్ధగలుగఁ, దత్కారణమునఁ బరస్పర సంగ్రా మము సర్వస్తుతి పాత్రమానట్లు చెలఁగెను.

"వన క్రోడంబు నందుఁ." "క్రోడో భూదార యిత్యపి." అమరము.

"సత్ఫలతనొప్ప." సస్యశాణా గ్రయోః ఫలం." నానార్థ రత్న మాల.

"అన్యోన్యజన్య." "యుద్ధమాయోధనం జన్యం." అమరము.

వ. వార లిద్దఱుఁ గొంత తడవు. 44

రామాయణ భారతార్థములు సమము. సులభము.

క. నుతసత్త్వాధికరణ లస
దితరేతరజాత్యుచిత స ద్ధ సమిద్ధ సపర్యా
యతిరోహితభావు లగుచు
ధృతి యొసఁగఁగ ధర్మపటిమ దృఢత నెరపుచున్. 45

రామాయణ. నుత... ... ...భావులగుచుఁ ; నుత=స్తుతింపఁ బడిన, సత్త్వ = సత్త్వగుణమునకు, అధికరణ = స్థానమైన, లసత్=ఒప్పు చున్న, ఇతరజాత్యుచిత = పరస్పర జాతులకుఁదగిన, బ్రహ్మ క్షత్ర జాతు లకుఁదగిన యని భావము; సమిద్ధ = మిక్కిలి ప్రకాశించుచున్న, సపర్యా= ఆతిథ్యముయొక్క, ఆయతిఁ = విస్తృతియందు, రోహిత = మొలచిన భావులు, అగుచుఁ = తాత్పర్యము గలవారగుచు, ధృతిఁ = సంతోష మును. నెరపుచుఁ = నిండించుచు, ధర్మపటిమఁ = ధర్మాధిక్యమును,

దృఢతన్ = దార్ఢ్యముచే, నెరపుచున్. ప్రవర్తిల్లిరని ముందరి పద్యముతో నన్వయము.

తా. వారు పరస్పరజాత్యుచితాతిధ్యమున సంతుష్టులగుచు ధర్మ పటిమ నెఱపుచు.

"సపర్యా." సపర్యా తర్పణంబలిః." అమరము.

"ధృతి." "ధృతిర్యోగాంతరే ధైర్యేధారణాధ్వరతుష్టిషు."
అమరము.

భారత. నుతసత్త్వ...భావులు అగుచున్; నుత=పొగడఁబడిన,సత్త్వ= బలముగల, అధిక రణ=ఎక్కుడుయుద్ధముచే, లసత్=ఒప్పుచున్న, ఇతరే తరజ = ఒండొరులవలనఁ గల్గిన, అతి, ఉచిత = మిక్కిలి యుక్తమైన, సమిద్ధ = మిక్కిలితగిన, సపర్యాయ = పర్యాయముతోఁ గూడిన, తిరో హిత భావులు, అగుచున్ = తిరోహితత్వము గలవారగుచు, అపజయము గలవారనుట ; ధృతి = ధైర్యము, నెరపుచున్, ధర్మపటిమన్ = వింటి నేర్పును, దృఢతన్ = దార్ఢ్యముతో, నెరపుచున్ = నిండించుచు, ముందరిపద్యముతో నన్వయము.

తా. కిరాతార్జునులు మిక్కిలి బలముగలవారగుచు నొక్కరి వెంబడి నొకరు అపజయము పొందుచు మరల జయించుచున్నట్లు ధైర్యముతో మిక్కిలి యుద్ధ మొనర్చుచు.

వ. ప్రవర్తిల్లి రయ్యవసరంబున. 46

రామాయణ భారతార్థములు సమము. సులభము.

మ. అరుదార స్మరభావవిస్ఫురిత శౌ
ర్యాలోక ఖేలన్మనో
హరమాహాత్మ్యము మీఱులుబ్ధకరణ
వ్యావర్తనాశక్తి ని

ర్భరుఁడై తాపసుఁడంపలేమిఁ బ్రకటిం
పంజూచి యీరాట్కులా
భరణంబిందునె చిక్కునోయని నిలిం
పవ్రాత మెంచె న్మదిన్. 47

**రామాయణ.** అరుదారన్ = అరుదగునట్లుగ, నర......ఖేలన్; నరభావ = నరత్వముచే, విస్ఫురిత = ప్రకాశించుచున్న, శౌరి = విష్ణువైన రామునియొక్క, ఆలోక = చూచుటయనెడి, ఖేలన్ = లీలచే, మనోహర = మనోజ్ఞమైన, మాహాత్మ్యము = మహిమ, మీఱఁగాన్ = అతిశయింపఁగా, [ఇట ఖేలాశబ్దమునందలి తృతీయ స్వమాహాత్మ్యాతిశయమునకు హేతువగుచున్నది.] మానుషవిశిష్టదైవత్వము మాహాత్మ్యాతిశయమునకుఁ గారణమగుచున్నదని భావము. ఆ హేతువున, లుబ్ధ...... నిర్భరుఁడై; లుబ్ధ = లోభింపఁబడిన, కరణ = ఇంద్రియముయొక్క, అంతరింద్రియము యొక్కయనుట; వ్యావర్తన = త్రిప్పుట యందలి, అశక్తి = శక్తిలేమిని, నిర్భరుఁడై, భగవన్మహిమ యతిశయించుటచే నమ్మహిమ యందు లుబ్ధమగు తనమానసము త్రిప్పలేనివాఁడై యని భావము; తాపసుఁడు= మహర్షి, శరభంగుఁడనుట; అంపలేమిన్ = ఆరామునటనుండి పంపలేకుండమిని, ప్రకటింపన్ = ప్రకాశింపఁజేయఁగా, రాముని దన యాశ్రమమునుండి పంపనని యాడఁగాననుట; [భారతార్థమునందలి, "అంపలేమి= శరాభావము." అను నర్థమునకై తెచ్చి పెట్టుకొనినది యగును.] చూచి, నిలింప వ్రాతము = దేవసమూహము, [ఇది కర్తృపదము.] ఈ రాట్కులాభరణంబు = రాజకులశ్రేష్ఠుఁడు, రాముఁడనుట; ఇందునె = ఈ యాశ్రమముననే, చిక్కునో అని = నిలుచునోయని, రాక్షససంహారము గావింపక యిటనే నిలుచునేమోయని, మదిన్, ఎంచెన్.

తా. మనుష్యత్వవిలసిత దైవత్వముగల్గుటచే నీరాముని మాహాత్మ్యమతిశయింపఁగా నక్కారణమున నిమ్మహిమమున లుబ్ధమగు నంతఃకరణ

ముంద్రిప్పఁజాలక రాముందన యాశ్రమమునుండి పంపఁజాలనన దేవతలు రాముఁడు రాక్షససంహార మొనర్పక యిటనే నిలుచు నేమోయని తలంచిరి.

ముద్దరాజురామన్న "మనోహర మాహాత్మ్యమమీఱన్," అనుటకు శరభంగుని తపోమహిమయని యర్థము గావించెను గాని భగవన్మహిమ యని యర్థము గావించుటయే మిక్కిలి సమంజసముగా నున్నయది.

మఱియు నారామన్న "లుబ్ధకరణ" అనుదానికి, లుబ్ధ = ఎడఁబాయఁజాలని, కరణ = ఇంద్రియముయొక్క, లోభముయొక్క యనుట, అని యర్థము గావించెను. "లుబ్ధకరణ=అంతఃకరణముయొక్క" అనుటయే కవియాశయ మగునని తోఁచెడిని, "లుబ్ధకరణ" "కరణం సాధకతమ క్షేత్రగాత్రేంద్రియేష్వపి." అమరము.

"రాటుక్కలాభరణంబు." ఇట నమహత్త్వము గల్గుటకు, "క్వచిదర్థ విశేషేతు క్లీబేతూభయరూపతా, విచక్షణమనోమోదకారిణీ శబ్దకల్పనా." అధర్వణకారికావళి.

భారత. అరుదారన్, నర ... మాహాత్మ్యము; నర=అర్జునునియొక్క, భావ = అభిప్రాయముయొక్కయు, లక్షణచే మనస్థైర్యముయొక్క యని యగుచున్నది; విస్ఫురిత = స్ఫురింపుచున్న, శౌర్య = పరాక్రమము యొక్క, ఆలోక = చూచుటకొఱకు, పరీక్షించుటకొఱకనుట; ఖేలత్ = విహరించుచున్న, మనః = మనస్సునుగల, [ఇట భావ శౌర్య పదద్వయము జెప్పుటచే మనస్థైర్య శరీరదార్ఢ్యములు రెండు నని తెలియునది.] అర్జునుని మనస్థైర్య, శౌర్యములఁ బరీక్షించుటకొఱకే పరమశివుని యీ విహార మేర్పడెనని భావము; హార = పరమేశ్వరుని, మాహాత్మ్యము = మహిమ, జయరూపమగునది; మీఱన్ = మించఁగా, అర్జునుని పరాక్రమమునకంటెఁ బరమశివుని జయరూపమహిమ మించఁగాననుట; శివుఁడు జయింపఁగానని భావము; లుబ్ధక ... నిర్భరుఁడై; లుబ్ధక = మాయా కిరాతునియొక్క, రణ = యుద్ధమును, వ్యాకర్తన = మాన్పుటయందుఁగల, అశక్తి = శక్తిరాహిత్య

మున, నిర్భరుఁడై, ఇది యర్జునునకు విశేషణము; తాపసుఁడు = తపస్వి, అర్జునుఁడనుట; అంపలేమిన్ = అమ్ములులేకుండుటను, ప్రకటింపన్ = ప్రకాశింపఁగా, చూచి, నిలింపవ్రాతము = దేవసమూహము, ఈరాట్కలాభరణంబు = ఈ యర్జునుఁడు, ఇందునె = ఈ బాణరాహిత్యముననే, చిక్కెనో, అని, మదిన్, ఎంచెన్ = తలంచెను.

తా. అర్జునుని మనస్స్థైర్యమును శరీరబలమును గాంచఁదలంచి యా పరమేశ్వరుఁడు విజయమున మీఱఁగా నర్జునుఁడాతని యుద్ధమాఁపఁజాలక తన దొనలలో నమ్ములు గానరాకుండుటచే వగచుచుండ దేవతలిక్కారణముననే యీతఁడు పరమశివునకుఁ జిక్కెనేమోయని తలంచిరి.

"లుబ్ధకరణ." "లుభ్యతిమృగేష్వితిలుబ్ధకః." గురుబాలప్రబోధిక.

క. తనకును శరభంగమునీ
శునకు సమరసత్వభరము సొరిది నొదవుచున్
దనరుటఁ గడు నెన్నికలం
గని ప్రబలధృతిం దనర్చు క్షత్రియుఁ డంతన్. 48

రామాయణ. క్షత్రియుఁడు=ఆరాముఁడు, అంతన్, తనకును=రామునకును, శరభంగమునీశునకును = శరభంగమహార్షికిని, సమ = సమానమైన, రసత్వభరము = రసత్వాతిశయము, అనురాగాతిశయమనుట; సొరిదిన్ = క్రమముగా, ఒదవుచున్=కలుగుచు, తనరుటన్ = ఒప్పుటచే, కడున్ = మిక్కిలి, ఎన్నికలం గని=పొగడ్తలంగాంచి, ప్రబల=అధికమగు, ధృతిన్, తనర్చున్ = ఒప్పును.

తా. తనకును శరభంగునకును సమానానురాగము గలుగుటచే రాముఁడు అధిక ధైర్యవంతుఁడాయెను.

భారత. తనకును = అర్జునునకును, శరభంగమున్ = బాణాభావమును, ఈశ్వరునకున్ = శివునకు, సమరసత్వభరమున్ = యుద్ధమునందలి శౌర్యా

తిశయమును, సారిదిక్, ఒదవుచుక్, తనరుటక్ = ఒప్పుటచే, కడుక్, ఎన్ని=తలఁచి, కలంగని = కలఁతచెందని, ప్రబల ధృతిక్, తనర్చు = ఒప్పునట్టి, క్షత్రియుఁడు = అర్జునుఁడు, అంతక్ = ఆవల, పై పద్యములో నన్వయము.

తా. తన శరము లయిపోవుటయుఁ బరమశివుని పరాక్రమ మతిశయించుటయుంగని కలఁతచెందక యర్జునుఁడు ఆవల.

సీ. అతిదృఢం బైనట్టి యాత్మసఖ్యాతిచా
పలత యెంతయుఁ దన బలిమిఁ ద్రిప్పి
ఘనతేజు నమ్మహాత్ముని నీకు నలబ్రహ్మ
కట్టడ యెట్లట్లు కాక దాఁట
నగునె పొమ్మనుచుఁ దాఁ నని వెనుగడఁక మొ
త్తంబై నిలింప సంఘుంబు విరులు
గురిసె నప్పుడు నిజస్థిర చండ హేతిపా
తమున వికార లేశముఁ బొరయక

తే. మెఱయ నారణ్యకేంద్రుపై మెచ్చు దనర
నర్హగతి విధిఁ జేరంగ నరిగె నా స
మిద్ధశౌర్యుఁడు శుభమాని యుద్ధవశత
ఘనపదవి నెల్ల ఖచరులు వినుతి సేయ. 49

రామాయణ. అతిదృఢంబైనట్టి = మిక్కిలి దృఢమైన, ఆత్మ... చాపలత; ఆత్మ = తనయొక్క, సఖ్య = మైత్రియొక్క, అతిచాపలత = అత్యంత చపలత్వము, ఎంతయుఁ = మిగుల, తనబలిమిక్ = తనబలముచే, త్రిప్పి = మరలించి, ఘనతేజుక్ = గొప్పతేజముగల, అమ్మహాత్మునిక్ = ఆశరభంగుని, నీకుక్=అల, బ్రహ్మకట్టడ = బ్రహ్మయొక్కయాజ్ఞ, ఎట్లు= ఏలాగో, అట్లుకాక=ఆలాగుననేకాక, దాఁటనగునే = అతిక్రమింప సాధ్య

మగునా, పొమ్ము, అనుచున్, బ్రహ్మయాజ్ఞ మీఱ రానిదగుట దాని నను
సరించియే నడుచుకొనుమని భావము; తాన్ = రాముఁడు, కడంకన్ =
ప్రయత్నమున, అనిపెన్ = పంపెను, నీవూర్ధ్వలోకమున కరుగవలయునని
యాజ్ఞాపించెనని భావము; అప్పుడు = ఆసమయమున, మెచ్చుదనరన్ =
మెచ్చికలొప్పుచుండఁగా, నిజ...పాతమునన్; నిజ = తనయొక్క, స్థిర=
సార్వకాలీనమగు, చండ = తీక్ష్ణమగు, హేతి = అగ్నియందు, ఆహితాగ్ని
త్వరూపమున నిటునగ్నికి స్థైర్యముగల్గెనని యెఱుంగనగును; పాతమునన్ =
పడుటచే, వికారలేశమున్ = ఇంచుకేని మాఱుపాటును, పొరయక =
చెందక, మెఱయున్ = ప్రకాశించుచుండు, అరణ్యకేంద్రుపైన్=మహర్షి
శ్రేష్ఠునిపై, శరభంగునిపైననుట; నిలింపసంఘంబు = దేవతలసమూహము,
అర్హగతిన్ = తగిన క్రమమున, విధిన్ చేరంగన్ = బ్రహ్మనుజేరు
చుండఁగా, విరులు = పుష్పములు, కురిసెన్. దేవతలు పూలవాన గురిపించి
రని భావము; ఆసమిద్ధశౌర్యుఁడు = ప్రకాశించు యుద్ధముగలవాఁడు,
రాముఁడనుట; శుభ, మాని = పవిత్రుఁడగు శరభంగ మునీంద్రునియొక్క
ఉద్ధవ = సంతోషముల, శత = పెక్కులచే, ఘన = గొప్పదగు, పదవిని=
స్థానమును, ఎల్లఖచరులు = దేవతలందఱు, వినుతిచేయన్ = స్తుతింపు
చుండఁగా, అరిగెన్ = వెడలెను; రామచంద్రుఁడు శరభంగున కాపదవి
నొసంగుటచే దేవతలా రామునిం బొగడిరని భావము.

తా. శరభంగమహర్షి రాముని వీడి వెడల నిష్టపడకుండిన నారామ
చంద్రుఁడు నీవు బ్రహ్మయానతి మీఱరాదనిచెప్పి యాతని నూర్ధ్వలోకమున
కనిపెను, ఆమహర్షియు నగ్నింబడి వికారశూన్యుఁడై బ్రహ్మలోకమున
కరుగుచుండ దేవతలతనిపైఁ బూలవాన గురిపించిరి; శ్రీరాముఁ డట్లామునీం
ద్రునకు గొప్పపదవి నొసఁగుటచే దేవతలాతని స్తుతించిరి. అంత రాముఁడట
నుండి కదలిచనెను.

భారత. అతిదృఢంబైనట్టి = మిక్కిలి దృఢమైన, ఆత్మ...లత; ఆత్మ = తనయొక్క, సఖ్యాతి=కీర్తితోఁగూడిన, చాపలత=లతవంటిధనువు, గాండీవమనుట; [ఉపమానోత్తర పదకర్మధారయము] ఎంతయుఁ, తన బలిమిఁ, త్రిప్పి=విసరి, ఘనతేజుఁ, అమ్మహాత్ముని, ఆపరమేశ్వరుని, నీకుఁ, అల, బ్రహ్మకట్టడ, ఎట్లు, అట్లుకాక, దాఁటనగునే, పొమ్మ, అనుచుఁ = బ్రహ్మ నావలన నీ గాండీవము దెబ్బను నీవు దినవలయునని విధించుటచే నీవట్లేయగుదువని భావము; తాఁ = తాను, అని పెను కడంకఁ = యుద్ధమందలి పూర్ణప్రయత్నమున, మొత్తఁ = కొట్టఁగా, పైఁ = ఆకసమున, నిలింపసంఘంబు = దేవతల సమూహము, విరులు కురిసెఁ = పుష్పవర్షము కురిపించెను. అప్పుడు, నిజ = తనయొక్క, అర్జునునియొక్కయనుట. స్థిర, చండ, హేతి = ఆయుధముయొక్క, పాత మునఁ = పాటుచే, వికారలేశముఁ, పొరయక, మెఱయు = ప్రకా శించు, ఆరణ్యకేంద్రుపైఁ = ఆ మాయాకిరాతునిపై, మెచ్చు, తనరఁ, అర్హగతివిధిఁ = సమయోచిత విధానముగ, వేగముగా ననుట; ఆసమిద్ధ శౌర్యుఁడు = ప్రకాశించు శౌర్యముగల, శుభమాని = మంగళకరుఁడగు నాయర్జునుఁడు, యుద్ధవశతఁ = బాహుయుద్ధ వశమున, ఘనపదవిఁ = ఆకాశమున, ఖచరులు = దేవతలు, వినుతి, చేయఁ=పొగడఁగా, అరిగెఁ= వెడలెను, బాహుయుద్ధముసేయ నీశ్వరునిపైకి వెడలెనని భావము.

తా. అర్జునుఁడు తన గాండీవము నామాయాకిరాతునిపై విసరివైచి నది వ్యర్థమయ్యెను. అప్పుడు దేవతలర్జునునిపై పూలవాన గురిపించిరి. ఆవింటి పాటున నేమాత్రమును మార్పులేక యుండునప్పరమేశ్వరుపై నర్జునుఁ డాక సమున దేవతలు నుతింప బాహుయుద్ధ మొనర్ప నరిగెను.

"నియుద్ధ." "నియుద్ధంబాహుయుద్ధం స్యాత్." అమరము.

వ. అంతఁ.

శా. మాయామర్త్యుఁడు మాధవుం డచలని
స్నైత్రిన్ సుతీక్ష్ణాశ్రమ
స్ఫాయత్సత్త్వవిహార మప్రవిశదీ
షద్ద్వేష రోషాంకురం
బై యేపారఁగఁ జూచుచుం బరువడిన్
హర్షోదయం బెక్కఁగా
జాయం దమ్ముని గూఢదృష్టిఁ గనన్ భ్రూ
సంజ్ఞ న్నియోగించుచున్. 51

**రామాయణ.** మాయామర్త్యుఁడు = మాయామానుషుఁడు, మాధవుండు=విష్ణువు, రాముఁడనుట, అవిచలస్నైత్రిన్=చంచలరహితమైన స్నేహమున, స్థిరస్నేహమున ననుట; సుతీక్ష్ణ...విహారము ; సుతీక్ష్ణాశ్రమ=సుతీక్ష్ణుని యాశ్రమమునందు, స్ఫాయత్ = ప్రవృద్ధమగుచుండు, సత్త్వ=జంతువుల, విహారము = విహరించుట, అప్రవిశత్.....అంకురంబై ; అప్రవిశత్ = ప్రవేశింపని, ఈషత్ = కొంచెమగు, ద్వేష = విరోధమువలని, రోష = కోపమనెడి, అంకురంబై = మొలకగలదై, ఏపారఁగన్ = ఒప్పారఁగా, పరువడిన్ = వేగముగా, చూచుచున్ = ఆ విహారములం గాంచుచు, హర్షోదయంబు, ఎక్కఁగాన్, జాయన్ = భార్యను, సీతననుట; దమ్మునిన్ = లక్ష్మణుని, గూఢదృష్టిన్ = పొడుకొనినదృష్టితో, సావధానదృష్టితో ననుట ; కనన్=చూచుటకు, భ్రూసంజ్ఞన్=కనుబొమలసైఁగచే, కనుబొమ్మలుకదల్చునట్టి సైఁగచే ననుట, నియోగించుచున్=ఆజ్ఞాపించుచు, ముందరనన్వయము.

తా. రాముఁడు సుతీక్ష్ణాశ్రమమునందలి జంతువులు పరస్పరద్వేషము మాని విహరించుచుండఁ జూచుచు సంతోషించుచుఁ దనభార్యను దమ్మునినిది చూడుఁడని భ్రూసంజ్ఞ నాజ్ఞాపించుచు ;

భారత. మాయామర్త్యుఁడు, ఉమాధవుండు = పరమశివుఁడు అవిచల స్నైత్రిన్ = చలింపనిస్నేహమున, అర్జునునిపైఁ గలస్నేహమున ననుట; సుతీక్ష్ణ...విహారము; సుతీక్ష్ణ = మిక్కిలి తీక్ష్ణమైన, అశ్రమ = శ్రమలేని స్ఫాయత్ = వృద్ధినందుచున్న, సత్త్వ = బలముయొక్క, విహారము = సంచారము, యుద్ధవిహారమనుట; అప్రవిశత్ = ప్రవేశింపని, ఈషత్, రోషాంకురంబై = కించిద్విరోధము వలని ద్వేష లేశమునుగలదై, కొంచె మేనిం గోపముగొనకయనుట, ఏపారఁగన్ = ఒప్పఁగా, చూచుచున్, ఫల్గు = అర్జునునియొక్క, వడిన్ = వేగమున, హర్షోదయంబు = సంతోషా తిశయము, ఎక్కఁగాన్, జాయన్=భార్యను, పార్వతిననుట; తమ్మున్ = తన్నున్ అర్జునుని, నిరూఢదృష్టిన్ = సావధానదృష్టితో, కనన్, భూసంజ్ఞన్, నియోగించుచున్ = ఆజ్ఞాపించుచు, ముందన్వయముగలదు.

తా. మాయాకిరాతుఁడగు నాపరమేశ్వరుఁడా యర్జునుని యుద్ధము నించుకేని కోపమందక స్నేహముతో నీక్షించుచు సంతోషించుచుఁ, దన్ను నర్జునునిం గనుమని భూసంజ్ఞను బార్వతిని నియమించుచు;

క. ప్రీతిదనర భూరితప
శ్చాతుర్యసుతీక్ష్ణసత్త్వసందర్శనసం
జాత మగువేడ్క యంతటఁ
జేతోరంజనము మిగులఁ జేయనలరుచున్. 52

రామాయణ భారతార్థములు సమము. ప్రీతి, తనరన్, భూరితపశ్చాతుర్య [రామా. అత్యంత తపశ్చాతుర్యముగల, భార=మిక్కుట మగు తపశ్చాతుర్యముయొక్కయు,] సుతీక్ష్ణసత్త్వ [రామా. సుతీక్ష్ణ మహర్షియొక్క సత్త్వగుణముయొక్క, భార - మిక్కిలి తీక్ష్ణమగుబలిమి యొక్క] సందర్శన = చూచుటచేత, సంజాతమగు = కలిగిన, వేడ్క = వేడుక, అంతటన్, చేతోరంజనమున్, మిగులన్=మిక్కిలిగా, చేయన్, అలరుచున్=సంతోషించును, [రామాయణ పర్యాయమున రాముఁడనియు,

భారతపర్యాయమున శివుఁడనుచును కర్తయధ్యాహార్యము.] మున్వయము గలదు.

తాత్పర్యము సులభము.

క. భద్రగతి నరుగ లోపా
ముద్రానందస్వరూప ♦ మునిదర్శిత ని
ర్ణిద్రప్రసన్నతాసం
పద్రుచిరత మెఱయ నేత్ర ♦ పర్వ మొనర్చెన్ 63

**రామాయణ.** భద్రగతిన్ = మంగళకరమైన గమనమున, అరుగన్ = వెడలఁగా, సుతీక్ష్ణాశ్రమమునుండి వెడలఁగానని భావము; లోపాముద్రా.........ముని; లోపాముద్రా = లోపాముద్రకు, ఆనంద = సంతోషకరమైన, స్వరూప = నిజరూపముగల, లేక; లోపాముద్రయొక్క యానందస్వరూపుఁడైన, లోపాముద్రయొక్క యానందమే మూర్తీభవించెనా యనులాగుననుండు నట్టియనిభావము; కాక; లోపాముద్రయొక్క యానందస్వరూప = ద్రవ్యరూపుఁడగు, లోపాముద్రయొక్క యానందస్వమ్మే యీరూపుగానున్నదనుట; అట్టి, ముని = అగస్త్యుఁడు, దర్శిత...........రుచిరత; దర్శిత = చూపఁబడిన, నిర్ణిద్ర = స్పష్టమైన, ప్రసన్నతా = అనుగ్రహమునెడి, సంపత్ = సంపద, రుచిరత = శ్రేష్ఠత్వము, మెఱయన్ = ప్రకాశింపఁగా, నేత్రపర్వ మొనర్చెన్ = కనులపండువుగావించెను, చూచెననుట; రాముని ననుకర్మ యధ్యాహార్యము.

తా. రాముఁడు అటనుండి కదలియగస్త్యాశ్రమమున కరిగెను. అగస్త్యుఁడు మిక్కిలి వాంఛతో రామునిఁగాంచెను

**భారత.** భద్రగతిన్ = శుభకరలీలను, అరుక్.........స్వరూపము, అరుక్ = రోగములేని, అలోప = లోపములేని, అముద్ర = నిస్సీమమైన, ఆనంద = సంతోషముగల, స్వ = తనయొక్క, రూపము,

నిదర్శిత, నిర్ణిద్ర = ప్రసన్నతాసంపత్, రుచిరత = మనోజ్ఞత్వముచే, మెఱయఁగ, నేత్రపర్వము = కన్నులపండువగునట్లు, ఒనర్చెఁగ = చేసెను, ప్రత్యక్షమయ్యెననుట, శివుఁడని కర్తయధ్యాహార్యము.

తా. ఆరోగ్యకరమై యక్షయమై సమరహితమై యానందరూపమగు స్వరూపము నయ్యర్జునునకు నేత్రపర్వమగులాగున నాయుమానాథుఁడు ప్రత్యక్షమాయెను. "ఆనందో బ్రహ్మ." యను శ్రుతిప్రమాణమగుట నిటఁబరమాత్మస్వరూపమునఁ బ్రత్యక్షమయ్యె ననిభావము.

వ. అంత. 54

సులభము.

సీ. దివిమోచి యున్నయశ్రీదని ధర్మకార్యార్థ
మానతంబుగఁ జేసినట్టి ఘనుని
ంచి లోకమునావరించినవిషరాశి
నాపోశనము గొన్నయద్భుతాత్ము
జీవనదోషవిద్రావణజ్యోతిర
యస్వమూర్త్యాలోకుఁ డగుమహాత్ము
నఖిలవేదాంతవేద్యాత్ము భువనవం
ద్యుతిఁ బెంపుమీఱుమహానుభావు

తే. నమరనిమ్నగా నిత్యసేకముల నెలయు
జడలలేఁ గెంపువిమలతఁ గడు మెఱయఁగ
మొకమున్ తోలు విభూతినమిద్ధతనుప్ర
నొండొకటి కందమై యొప్ప నొప్పువాని. 55

అవతారిక. అర్థాన్వయవిభేద మూలమున నగస్త్య శివపర్యాయముల నర్థముగల్పించి వర్ణించుచున్నాఁడు.

**రామాయణ.** దివిన్ = ఆకాశమును, మోఁచియున్న = మోని నది, ఆకాశమువఱకు వ్యాపించిన, అద్రిని = పర్వతమును, మేరువునను‌ట, ధర్మకార్యార్థము = సంధ్యాది ధర్మకార్యములనడచుటకొఱకు, అనతంబుగన్ = వంగునట్లు, చేసినట్టి, ఘనుని = గొప్పవానిని, వింధ్యము గర్వమునవాకసము వఱకెదిగి చంద్రసూర్యుల మార్గమునడ్డగింప సంధ్యాది కృత్యములు చెడిపోవుచుండ నవి సరిపఱుపఁదలఁచి దక్షిణదేశయాత్ర వెడలుచుండిన యగస్త్యుఁడు దానిచెంతనరుగనయ్యద్రిరాజమాతనికి నమస్కరింప నవనతముగాఁగఁ దా దక్షిణదేశయాత్ర వెడలి వచ్చువఱకట్లే యుండవలయునని యాజ్ఞాపించి వెడలినవాఁడు నేఁటివఱకు రాకున్నవాఁడని పురాణగాథ.

మించి = అతిశయించి, లోకముగ్ = జగమును, ఆవరించిన, విషరాశిన్ = సముద్రమును, లోకమునకు విరుద్ధముగఁ బ్రవర్తించుటచే నిటసముద్రమునకు జల శబ్దపర్యాయమునఁ బ్రయోగించిన విషరాశి శబ్దము సార్థకమని యెఱుంగునది; ఆపోశనముగొన్న = పానముచేసిన, అద్భుతాత్మున్ = ఆశ్చర్యస్వరూపుని, జనులను రాక్షసులు సముద్రమున దాఁగియుండి అప్పుడప్పుడువచ్చి దేవాదుల బాధింపుచు మరల సముద్రమునదాఁగుచుండిరి. దేవబాధానివృత్త్యర్థ మగస్త్యుఁడా రాక్షసులతోడ సముద్రజలమంతయుఁ బానముచేసి మరల వెలుపలికివదలెను. అని పురాణగాథ గలదు.

జీవనదోష = జలమునందలి కళంకమును, అడుగునను‌ట, విద్రావణ = మాన్పుచున్న, జ్యోతిర్మయ = నక్షత్రరూపమైన, స్వమూర్తి ఆలోకన్ = ప్రకాశముగలవానిని, అగస్త్యోదయము శరద్రుతువున నగుటచే నప్పుడు నీరు కాలుష్యమువీడి నిర్మలమగుననిభావము. కావుననే "ప్రససాదోదయాదంభః కుంభయోనేర్మహౌజసః." అని రఘువంశము.

అఖిల... వేద్యాత్మున్ ; అఖిల = సమస్తమైన, వేదాంత, వేది = వేదాంతములందెలిసిన, ఆత్ముఁడై, భువనవంద్యతన్ = లోకముచే నమ

స్కరింపఁబడుటవలన, ఇటులోకము చేనన 'గంగా యాంఘోషః' అను నట్లు లక్షణచే లోకమునందలి జనులచే ననియెఱుంగునది; వంద్యతన్ = నమస్కరింపఁదగు వాఁడగుటచే, పెంపుమీఱు = అతిశయించు, మహానుభావుర్ = గొప్పవానిని, అమరనిమ్నగా = దేవనదిచే, గంగ చేననుట; నిత్యసేకములన్ = ఎల్లప్పుడు తడుపుటచే, గంగానదీజలముచ సదాభిషేకమొనర్చుటచే ననిభావము; ఎలయు = ఒప్పుచున్న, జడల = జడల యొక్క, లేఁగెంపు = బాలారుణత్వము, విమలతన్ = నిర్మలత్వముచే, కడున్ = మిక్కిలి, మెఱయఁగన్ = ప్రకాశింపఁగా, మెకముతోలు = కృష్ణాజినము, విభూతిసమిద్ధ = భూతిపూఁతచేఁ బ్రకాశించు, తనువు = శరీరము, ఒండొకటికిన్ = పరస్పరము, అందమై, ఒప్పన్ = మనోహరమై యొప్పఁగా, ఒప్పువానిన్=తనరువానిని, అగస్త్యుననుట; ముందు పద్యము నందలిచూచి యనునసమాపక క్రియతో నన్వయము.

తా. వింధ్యాద్రి యూకసము మట్టిమున్న ధర్మకార్యమునకై దానివంగి యుండులా గొనర్చినయాతని, లోకములనావరించిన సముద్రము నాపోశనముగొన్న మహాత్ముఁడగువాని, నీటియొక్క మాలిన్యము పోఁగొట్టు నక్షత్రరూప స్వమూర్తిప్రకాశము కలయాతని, వేదాంత వేద్యాత్ముని, లోకులచేవంద్యుఁడగు వానిని, ఆకాశగంగా జలములందడు పఁబడి యెఱ్ఱకాంతిగలజడలు కాంతిమెఱయ, కృష్ణాజినము, విభూతి, లేపములనొండొంటిచేఁ బ్రకాశించు దేహముగలవానిని అగస్త్యుని;

భారత. దివి = స్వర్గమును, మోచియున్న = మోపిన, అద్రిని= పర్వతమును, మేరువుననుట, ధర్మ=వింటియొక్క, కార్యార్థము=కార్యము కొఱకు, ఆనతంబుగన్ = చేసిన, అట్టి, ఘనుని = గొప్పవానిని, త్రిపురాసుర సంహారమునకై మేరువువిల్లుగావంచినవానిని; శివునకు విశేషణమిది. మించి లోకముల్ = ఆవరించిన, విషరాశిన్ = కాలకూట విషమును, ఆపోశనము, కొన్న, అద్భుతాత్మున్ = ఆశ్చర్యస్వరూపుని,

దేవాసురులమృతమునకై సముద్రముచిలుకుచుండఁ గాలకూట విషము దయింపఁగనే దానిని ఆరగించిన వానినని భావము; 'జీవనదోష = సంసారదోషమును, విద్రావణ = తఱిమెడి, జ్యోతిర్మయ, స్వమూర్తి, ఆలోకుఁడు = సందర్శనముగలవాఁడు, అగు, మహాత్మ్కన్, నిఖిలవేదాంత వేద్యాత్ముని = సర్వవేదాంతములచేఁ దెలియఁబడువాఁడై, భువనవంద్యతన్, పెంపుమీఱు, మహానుభావున్, అమరనిమ్నగా, = గంగానదియొక్క, నిత్యసేకములన్, నెలయున్ = చంద్రుఁడును, శిరమునందలి గంగచే నిత్యమును దడుపఁబడు చున్నాఁడనుట జడలలేఁగెంపున్, విమలతన్, మెఱయన్ = ప్రకాశింపఁగా, మెకముతోలు = గజచర్మము, విభూతి, సమిద్ధ, తనువున్, ఒండొకటికిన్ = అందమై ఒప్పన్, ఒప్పువానిన్ = ఒప్పెడువానిని, శివుననుట ;

తా. మేరువునుధనువు గావించినవానిని, గాలకూట విషము నార గించినవానిని, ప్రాణులదోషమును బోఁగొట్టఁజాలు జ్యోతిర్మయ స్వరూప దర్శనముగలవానిని, వేదాంతవేద్యప్రభావుని, భువనవంద్యుని, శిరమునందలి గంగా జలమున నిత్యముందడుపఁబడుచుండు చంద్రుఁడును, జడలు,విభూతి యును నివి యొకదానికొకటి యందమగుచుండ నొప్పువానిని;

"లేఁగెంపు." ప్రాఁతాదులనంతిమాక్షరలోపమును లుప్తశేషమునకుఁ బరమైన పరుషమునకు సరళాదేశము ;

"దివిమోచియున్నయద్రిని." రామాయణార్థమున, ఆకాశమువఱకు వ్యాపించిన యద్రిని, వింధ్యముననియు, భారతార్థమున, స్వర్గమును మోచి యున్న యద్రిని, మేరువుననియు, శబ్దశ్లేషగాని, యర్థశ్లేషగాని లేక పదా న్వయభేదముగాని లేకుండఁగనే యర్థాన్వయవిభేదము గల్పింపఁబడియెను. రామాయణార్థమున గౌణవృత్తియనియు,భారతార్థమునముఖ్యవృత్తియనియు నక్కారణమున నిది ముఖ్య గౌణవృత్తిశ్లేష ఘటనమునఁ జేరునని కొంద అభిప్రాయపడెదరుగాని, కవి యట్టిశ్లేష ఘటనము స్పష్టముగాఁ గావిం

చిన ప్రదేశములు పెక్కులుండ నస్పష్టమగుచు నర్థాన్వయవిభేదము స్పష్టముగాఁ గాన్పించు నీప్రదేశమున ముఖ్యగౌణవృత్తి శ్లేషగలదని యూహించుట సరికాదు. ఒకచో నస్పష్టముగ నించుక యుండినను నది ప్రధానము గానందున విసర్జింపఁదగిన దగును.

“అద్భుతాత్మన్.” “ఆత్మా యత్నో ధృతిర్బుద్ధి స్స్వభావో బ్రహ్మవర్ష్మ చ.” అమరము.

తే. చూచి యాదిత్యకులరాజసుతుఁడు హర్ష
వినయభక్తుల సాష్టాంగవినతిఁ జేసె
నపుడు గాకున్న నట్టితదస్త్రసిద్ధి
డనుప్రయోజన మని సురల్ దనరి రాత్మ. 56

**రామాయణ.** చూచి=అగస్త్యునిగాంచి, ఆదిత్యకులరాజసుతుఁడు=సూర్యకులరాజసుతుఁడు, రాముఁడనుట; హర్షవినయభక్తులన్ = సంతోషమునను, అడఁకువచేతను, భక్తిని, సాష్టాంగవినతి చేసెన్=సాష్టాంగముగ నమస్కరించెను. సురల్ = దేవతలు, తదస్త్రసిద్ధి = అగస్త్యునివలన నతనికయిన యస్త్రసిద్ధి, అపుడు కాకున్నన్ = వెంటనే యుపయోగకారి కాకపోయినను, తమ ప్రయోజనము = వెనుకఁ దమ ప్రయోజనమునకే యగునను అని, ఆత్మన్, తనరిరి = సంతసించిరి.

తా. రాముఁ డగస్త్యునకు సాష్టాంగ నమస్కార మొనర్చెను. అగస్త్యుఁ డాతని కస్త్రదానము చేసెను. దేవత లదిగని వెంటనే తమకు లాభకారికాకున్నను క్రమముగఁ దమ ప్రయోజనమునకే యగునని సంతసించిరి.

ఇటఁ గొన్ని ప్రతులలో వినుతి చేసె ననియున్నది. సాష్టాంగముగా నొనర్చుట నతిగాని నుతిగాదు. కావునఁగొన్ని ప్రతులలో నుండు 'నతి' యనుపాఠమే సమంజసముగఁ దోఁచుచున్నది.

“అపుడుగాకున్ననట్టి.” మఱికొన్ని ప్రతులలో, అపుడుకానున్న యట్టియని యున్నది. అప్పుడు కాఁబోవునట్టి యస్త్రలాభమనిదానిభావ మగుచున్నది. కాని అప్పటి యాయస్త్ర లాభము వెంటనే కాకున్న నెప్పటి కేని స్వలాభము కొఱకే యగుననునర్థము రసవంతముగా నుండుటచేఁ బెక్కుప్రతులంగల, అపుడు గాకున్న నట్టియనుపాఠమునే గ్రహించినాఁడను.

భారత. చూచి = పూర్వోక్త శివునిఁగాంచి, ఆదిత్యకులరాజ = దేవేంద్రుని, సుతుఁడు = కుమారుఁడు, అర్జునుఁడనుట; హర్ష, వినయ, భక్తులన్, సాష్టాంగ, వినతి, చేసెన్ = నమస్కరించెను, వారు=దేవతలు, అపుడు, కాకున్నన్, అట్టి, తత్ అస్త్రసిద్ధి = ఆపాశుపతాస్త్రసిద్ధి, తమ ప్రయోజనము అని = స్వప్రయోజనమున కగునని, కాలకేయ నివాతకవచాదుల సంహరించుటకగునని, ఆత్మన్, తనరి = సంతసించిరి.

తాత్పర్యము సులభము.

“ఆదిత్య కులరాజసుతుఁడు.” ఇదియును నర్థాన్వయవిభేదము గలదియ యగును.

వ. అట్టి సమయంబున. 57

అర్థ తాత్పర్యములు సులభము.

క. స్వతపఃఫల సాక్షాత్కా
రతఁ గృతసాన్నిధ్యుఁడైన రాజవతంసున్
హతకలుషుఁడు దపసి ముద
న్వితమగు చిత్తమున నిట్లని ప్రశంసించెన్. 58

రామాయణ భారతార్థములు సమము. స్వ = తనయొక్క, తపఃఫల, సాక్షాత్కారతన్ = ప్రత్యక్షమగుటచే, కృతసాన్నిధ్యుఁడైన = సమీపించిన, రాజవతంసున్, [రామాయణ. రాజశ్రేష్ఠుని, శ్రీరామునను; భారత, చంద్రశేఖరుని, శివుననుట;] హతకలుషుఁడు = గౌ

పాపుఁడు, తపసి [రామాయణ; అగస్త్యుఁడు, భారత; అర్జునుఁడు,] ముద్ అన్వితమగు = సంతోషముతోఁగూడిన, చిత్తమునన్, [రామాయణ. మనస్సున, భారత. మనస్సుచేననుట.] ఇట్లని ప్రశంసించెన్.

క. విశ్వేశ్వర విశ్వాత్మక
విశ్వాధిష్ఠాన యఖిల వేదాంతవచ
శ్శశ్వదభివర్ణ్యమాన మ
హైశ్వర్య నిరీహ నిత్య యభవ శుభమయా! 59

అవతారిక. ఇది మొదలు నాలుగు పద్యములు రామాయణ పర్యాయమున రాముని నగస్త్యుఁడును, భారతపర్యాయమున నర్జునుఁడు శివుని స్తుతించెదరు.

**రామాయణ భారతార్థములు సమము.** విశ్వేశ్వర = లోకమునకు నీశ్వరుఁడా, విశ్వాత్మక = లోక స్వరూపుఁడా, విశ్వాధిష్ఠాన= లోకములకు స్థానమగువాఁడా, అఖిల... ..మహైశ్వర్య; అఖిల = సమస్తమైన, వేదాంతవచః, వేదాంతవాక్యములచే, శశ్వత్ = ఎక్కుడుగా, అభివర్ణ్యమాన = వర్ణింపఁబడుచుండు, మహైశ్వర్య = గొప్పదైయైశ్వర్యము గలవాఁడా, నిరీహ = అపేక్షాశూన్యుఁడా! నిత్య = నిత్యుఁడా! అని మధ్యాంతరహేతుఁడాయనుట; అభవ = పుట్టుకలేనివాఁడా, శుభమయా = మంగళస్వరూపుఁడా.

ఇట రామాయణార్థమున రామ పరమగునపుడు, విశ్వాత్మక, విశ్వాధిష్ఠాన శబ్దముల నారాయణ శబ్దార్థము వివరింపఁబడెను. ఎట్లన్న నారాణాం అయనం. అనియు, నారాః అయనంయస్యసః, అనియు వ్యుత్పత్తులగును, విశ్వాత్మకశబ్దమున బహువ్రీహ్యర్థమును, విశ్వాధిష్ఠాన శబ్దమున షష్ఠీతత్పురుషార్థమును వివృతములు.

మ. నిశితప్రజ్ఞతఁజూడ నే వికృతియుఁ బ్లేదంద్రు నీయందు నీ
దశరూపాశ్రయణంబొనర్చుట మదిం దర్కింపలోకంబులం
దశుభప్రక్షయముఁ శుభోదయమునుద్యద్భక్తవాత్సల్యతా
తిశయాయత్తతఁ జేయ నింతియ గుణాతీతప్రసన్నాత్మకా!

అర్థము. గుణాతీత = త్రిగుణాతీతుఁడా, ప్రసన్నాత్మకా = ప్రసన్నమనస్కుఁడా, నిశిత=తీక్ష్ణమైన, ప్రజ్ఞతన్=బుద్ధితో, చూడన్= ఆలోచింపఁగా, నీయందున్ = నీయెడ, ఏవికృతియున్ = ఎట్టిమార్పును, లేదంద్రు = లేదనిచెప్పెదరు, "నిర్గుణో నిరంజనో నిర్వికల్పశ్శుద్ధో దేవ ఏకః." అను శ్రుతి యిందులకుఁ బ్రమాణము; [రామాయణ] నీదశరూపాశ్రయంబు = నీదశావతారాశ్రయమును [భారత] ఈ దశన్ = ఈలాగు, రూపాశ్రయణంబు = రూపమునాశ్రయించుటను, కిరాతరూపాశ్రయణము ననుట; ఒనర్చుట = చేయుట, మదిన్, తర్కింపన్ = విమర్శింపఁగా, లోకంబులందున్, అశుభప్రక్షయమున్ = అమంగళముల నాశమును, శుభోదయమును = మంగళములు కలుగుటయు, ఉద్యత్.........ఆయత్తతన్; ఉద్యత్ = ఉదయించుచున్న, భక్త = భక్తులయందలి, వాత్సల్యతాతిశయ = వాత్సల్యత్వాధిక్యమునకు, ఆయత్తతన్ = అధీనతచే, చేయన్ = చేయుటకే, ఇంతియ.

ఇట రామాయణార్థమున దశావతారములు ప్రస్తావము చెప్పుట సందర్భోచితము గాదనియు, బలరామ బౌద్ధకల్కులు వెనుకటి వారగుటచే నిట్లుచెప్పుట సూరనయొక్క యాలోచనా శూన్యతయనియుఁ గొందఱు చెప్పెదరుగాని, యట్లనుట సాహసము. ఒక్కొక్క చతుర్యుగమునందు నవతారములు జరుగుచు నుండుటచే భూతభావ్యవతారములం జేర్చి చెప్పె నని సమాధానము చెప్పవచ్చును. భారతార్థము సరిపడుటకు నిట్లు చెప్పె ననియు సమాధానము చెప్పవచ్చును.

క. అది సకలసదాచారం
బది సర్వజ్ఞాన మది సకలమ స్తజనిఫలం
బొదవినకోలఁది నొకప్పుడు
హృదయము నీయందుఁ జేర్తు రేని మహేశా. 61

అర్థము. మహేశా, ఒకప్పుడు, ఒదవినకొలఁదిన్, హృదయము = మనస్సు, నీయందున్, చేర్తురేనిన్, అది, సకలసదాచారంబు = ఎల్ల సదాచారమునగును, అది, సర్వజ్ఞానము = అన్నివిధములగు జ్ఞానరూప మగును, అది సమస్త జనిఫలంబు = సర్వజన్మసాఫల్యమగును.

తాత్పర్యము సుభము.

ఇపద్యమున శ్లేషాఖ్యగుణముగలదు. పాఠసమయమున నేకపదవదా భాసమానత్వమే శ్లేషయగును. "మిథస్సంశ్లిష్టపదతా శ్లేష యిత్యభిధీయతే." ప్రతాపరుద్రీయము.

క. అతివాఙ్మనసాస్పద యీ
నుతి కొగ్గినసాహసమ్మునను సహింపు దయన్
మతి నాకు నేన లజ్జిం
చితినో యచ్యుత యనంత శివ గుణరాశీ! 62

అర్థము. అతి వాఙ్మనసాస్పద = అవాఙ్మానసగోచరుండా, ఈ నుతికిన్, ఒగ్గిన సాహసమ్మును = ఇట్లుస్తుతింపఁబూనిన యీసాహసమును, దయన్, సహింపుము = కరుణచేనోర్చుకొనుము, ఓ అచ్యుత=[రామాయణ] ఓ విష్ణుఁడా, [భారత] ఓజాఱుటలేనివాఁడా, అనంత = అంతము లేని వాఁడా, శివగుణరాశీ = [రామాయణ] మంగళకరగుణముల సమూహము గలవాఁడా, [భారత] శివ = శివుఁడా, గుణరాశీ = సద్గుణ సమూహము గలవాఁడా, మతిన్, నాకున్, నేన, లజ్జించితిన్, ఇట్లు నీయట్టివాని నేనుస్తుతింపఁ బూనినందులకు నాకు నేనే సిగ్గుచెందితిని. వేదములకుఁగూడ

నసాధ్యుఁడగువాని స్తుతింపఁ బూనుటయే యిట లజ్జకుఁ గారణమగు చున్నది.

తాత్పర్యము సులభము.

క. అనుచు పునఃపునరభివం
దనములు నెమ్మనమునం దుదంచితసమ్మో
దనితాంతభక్తిసంతత
వినయంబులు సందడింప వేమఱుఁ జేసెన్. 63

## రామాయణ భారతార్థములు సమము.

అర్థము. అనుచున్, నెమ్మనంబునన్=మనస్సున, ఉదంచిత. వినయంబులు; ఉదంచిత = మిక్కిలి యొప్పెడి, సమ్మోద = ప్రీతిచే, నితాంత = మిక్కుటమగు, భక్తి సంతతవినయంబులు = భక్తియు విస్తారమగు వినయమును, సందడింపన్ = అతిశయింపఁగా, పునఃపున రభివందనంబులు = మఱలమఱల నమస్కారములు, వేమఱున్, చేసెన్.

వ. తదనంతరంబ. 64

సుగమము.

క. విమలుఁడు రాజన్యోత్తముఁ
డమితతపశ్శక్తిమహిమమహర్షీశకృపా
సమవాప్తి నిష్టదివ్యా
స్త్రమతల్లీ సిద్ధి గని ముదం బందె గడున్. 65

**రామాయణ.** విమలుఁడు = నిర్మలుఁడు, రాజన్యోత్తముఁడు = రాజశ్రేష్ఠుఁడు, రాముఁడనుట; అమితతపశ్శక్తి = మహోన్నతమగు తపశ్శక్తికి స్థానమగువాఁడు, మహర్షీశ = ఋషిశ్రేష్ఠుఁడగు నగస్త్యుని, కృపాసమవాప్తిన్ = దయగలుగుటచే, ఇష్టదివ్యాస్త్రమతల్లీసిద్ధిన్ = ఇష్ట

మగు దివ్యాస్త్రశ్రేష్ఠముయొక్క సిద్ధిని, విష్ణుచాప సంసిద్ధినను‌ట, కని = పొంది, కడుఁ ముదంబు అందెఁ = మిక్కిలి సంతసించెను.

తా. రాముఁ డగస్త్యానుగ్రహమున విష్ణుచాపమంది మిక్కిలి సంతసిల్లెను.

ఇటఁ గొందఱు 'మహర్షీశ కృపాసమవాప్తి ననుపదము ఇష్ట దివ్యాస్త్రమతల్లీ సిద్ధిననుదానికి విశేషణముగాఁ గావింపనగునని యభిప్రాయపడెదరుగాని యది యంతరసమంతముగాదు.

**భారత.** విమలుఁడు, రాజన్యోత్తముఁడు = అర్జునుఁడు, అమిత తపశ్శక్తి మహిమన్ = అత్యంత తపశ్శక్తి ప్రభావమున, హర్షీశ = హర్షించిన శివునియొక్క, కృపాసమవాప్తిన్ = దయగల్గుటచే, ఇష్టదివ్య అస్త్రమతల్లీసిద్ధిన్ = ఇష్టమైన దివ్యాస్త్రశ్రేష్ఠసిద్ధిని, పాశుపతాస్త్ర సిద్ధిని, కని, కడున్, ముదంబందెన్ = సంతోషించెను.

తా. అర్జునుఁడు నిజతపఃప్రభావమున సంతుష్టుఁడగు శివునివలనఁ బాశుపతాస్త్రమునొందెను.

"రాజన్య." మూర్ధాభిషిక్తుఁడగు రాజునకుఁ బేరగుటకు; "మూర్ధాభిషిక్తో రాజన్యః." అమరము.

**శా.** అక్షుద్రప్రథమాన దివ్యశరసంప్రాప్తిం ప్రకాశించునా
కుక్షిద్వంశవతంసుఁ గన్గొని మహాకగోదావరీతీరస
ద్రక్షోపాయపథంబు నేఁడు దొరికెం గేరండంచు సంరక్షణా
పేక్షం దద్వనభూమిదేవతలుసంప్రీతిం గనన్ మూకలై. 66

**రామాయణ** అక్షుద్ర.............సంప్రాప్తిన్ ; అక్షుద్ర = నీచముగాని, గొప్పదగునన‌ుట. ప్రథమాన ప్రఖ్యాతమగుచుండు, దివ్యశర సంప్రాప్తిన్ = దివ్యాస్త్రలాభముచే ప్రకాశించు, ఆ కుక్షిత్, వంశ = రాజవంశమునకు, వతంసున్ = శిరోభూషణ మగువానిని, రామునన‌ుట ;

కన్గొని = చూచి, మహాగోదావరీతీర = గొప్పదగు గోదావరీతీరముననున్న, సత్ రక్షా = సజ్జనుల సంరక్షణముయొక్క, ఉపాయపథంబు = ఉపాయ మార్గము, నేఁడు, దొరికెన్ = చిక్కెను, రండు, అంచున్, సంరక్షణాపేక్షన్ = సంరక్షణమునందలి యపేక్షచే, తద్వన = ఆ దండకారణ్యమునను న్న, భూమిదేవతలు = బ్రాహ్మణులు, సంప్రీతిన్, కడున్, మూఁకలై.

తా. రామునకు దివ్యశరము లభింప నదిగాంచిన దండకారణ్యవాసు లగు బ్రాహ్మణులు 'గోదావరీతీరముననున్న సజ్జనుల రక్షించునుపాయము నేఁడు దొరికెనురం'డని యొండొరులంబిలుచుచు మూఁకలుగట్టి; క్రిందిపద్య ముతో నన్వయము.

భారత. అక్షుద్ర, ప్రథమాన = ప్రఖ్యాతమగుచున్న, దివ్యశర = పాశుపతాస్త్రముయొక్క, సంప్రాప్తిన్, ప్రకాశించు, ఆకుక్షిద్వంశవతంసున్ = ఆరాజకుల శిరోభూషణమగు నర్జునుని, కన్గొని, మహాగః = గొప్పయపరాధముచే, దావరీతి = దావాగ్నివలె, రసత్ = మ్రోగుచున్న, రక్షః + అపాయపథంబు = రాక్షసుల కపాయముగల్గుమార్గము, కాలకేయాది రాక్షస వధోపాయమార్గమనుట; నేఁడు, దొరికెన్, రండు, అంచున్, సంరక్షణాపేక్షన్ = రక్షణమునందలి యపేక్షచే, తద్వన భూమిన్=ఆవనప్రదేశమునందు, దేవతలు, సంప్రీతిన్, కడున్, మూఁకలై.

తా. పాశుపతాస్త్రలాభమునఁ బ్రకాశించు నయ్యర్జునుం జూచి మనకిఁక నసురసంహారోపాయము చిక్కెను రండనుచు నవ్వనమునందు దేవతలు మూఁకలుగట్టి; ముందుపద్యముతో నన్వయము.

"కుక్షిద్వంశ." "గోత్రాకుఃపృథివీపృథ్వీ" అమరము.

"మహాగః" "ఆగోపరాధోమంతుశ్చ." అమరము.

"దావ." "దవదావౌ వనారణ్యవహ్నీ." అమరము.

వ. యథోచితప్రకారంబునం బొడసూపి యతని ప్రణామాది వినయకృత్యంబులు గైకొని. 67

క. అరుదుగ నుపచార మొన
ర్చిరి దీవన లెలమి నిచ్చిరి తను తమ మహా
శిరసాదరార్పణంబులఁ
గర మమరుచునుండ వేడుకను సప్రభులై. 68

**రామాయణ.** తమతమ మహాశ = వారివారి యధికాశ, రస ఆదర అర్పణంబులన్ = అనురాగముయొక్కయు, ఆదరముయొక్కయు, ప్రకటనములచే, కరము = మిక్కిలి, అలరుచున్ = సంతోషించుచు, ఉండన్, వేడుకను, సప్రభులై = ప్రభుసహితులై, అరుదుగన్, ఉపచారము ఒనర్చిరి = ఉపచరించిరి, దీవనల్=ఆశీర్వాదములును, ఎలమిన్= ప్రీతిచే, ఇచ్చిరి.

తాత్పర్యము, సుగమము.

**భారత.** తమతమ = వారివారి, మహాశిర=గొప్పయస్త్రీలయొక్క, సాదరార్పణంబులన్ = ప్రీతితోడి యిచ్చుటచే, వేడుకను, సప్రభులై, కరము = మిక్కిలి, అమరుచు నుండన్, అరుదుగన్ = ఉపచార మొన ర్చిరి. దీవనల్, ఎలమిన్ = ప్రీతితో, ఇచ్చిరి.

తాత్పర్యము. సుగమము.

తే. అంత నాత్మపురస్థితిఁ గొంతకాల
ముండి తమకార్యములకొదవ లుడిపి చనుటఁ
గోరి వారలు దను దోడుకొంచుఁ జనఁగఁ
జనియె వేడ్కఁ దదావాస జగతి కతఁడు. 69

**రామాయణ.** అతఁడు = ఆరాముఁడు, అంతన్, ఆత్మపురః + స్థితిన్ = తమయెదుటనునికిని, కొంతకాలము, ఉండి, తమ కార్యంబుల

కొదలు, ఉడిపి=తమ పనులయందలి కొఱంతలు పోఁగొట్టి, చనుటకున్ కోరి= వెళ్లుటనుగోరి, వారలు, తనున్ తోడుకొంచున్ చనఁగన్=వారు దన్ను పిలుచుకొని వెళ్లఁగా, తదావాస జగతికిన్ = వారుండు ప్రదేశమునకు, వేడ్కన్, చనియెన్ = వెళ్లెను.

తాత్పర్యము. సుగమము.

**భారత.** అంతన్, అతఁడు = అర్జునుఁడు, ఆత్మపురస్థితిన్ = తన నగరముననునికిచే, స్వర్గమున నునికిచేననుట; కొంతకాలము, ఉండి, తమ కార్యములకొదలు ఉడిపి చనుటకున్ కోరి = తమ పనులలోని కొఱంతలను తీర్చి వెళ్లుటకుఁగోరి, కాలకేయాద్యసురసంహారమును జేయఁగోరియనుట; వారలు = ఆదేవతలు, తనున్, తోడుకొంచున్, చనఁగన్ = వెళ్లఁగా, వేడ్కన్, తదావాస జగతికిన్ = వారి యునికిపట్టగు స్వర్గమునకు, చనియెన్.

తాత్పర్యము. సుగమము.

కొన్ని ప్రతులలో 'తదావాస' యనెడు స్థలమునఁ 'దదాస' యను పాఠము గనపట్టుచున్నది. వేడ్కన్,అని యుండ,ఆసన్ అనునది సందర్భ శుద్ధముగా లేనందునను; బెక్కు వ్రాఁతప్రతులయందుఁ, దదావాసయనియే యుండుటచే సమంజసమగు నాపాఠమునే గ్రహించినాఁడను.

రామాయణార్థమున, పురః+స్థితియని పదచ్ఛేద మగుటచే విసర్గ లోపముశ్లేషార్థ సంఘటనకై కవియవలంబింపవలసెను. అదియు "శర్పరే విసర్జనీయః" అనుపాణినిసూత్రమాధారము గావించుకొనియే యిట్లొనర్చెను.

క. అందు నమందశుభోదయ
మొందఁగని బిడౌజుఁ డలరు చుండె సుమిత్రా
నందన జనకసుతానిశ
నందర్శితనవన ఫ్రొల్లసద్భజనరతిన్. 70

**రామాయణ.** అందున్ = ఆవనమునందు, సుమిత్రా......భజనరతిన్; సుమిత్రానందన = లక్ష్మణునిచేతను, జనకసుతా = సీతచేతను, అనిశ = ఎల్లప్పుడు, సందర్శిత = చూపఁబడిన, నవనవోల్లసత్ = క్రొత్తక్రొత్తఁగా నుల్లసించుచుండెడి, [వీష్ని యందుద్విర్భావము.] భజనరతిన్ = సేవలయందలి యాసక్తితో, నిబిడౌజుఁడు = దట్టమగు తేజము గలవాఁడు, శ్రీరాముఁడనుట; అమందశుభోదయమొందన్ =అతిశుభములు గల్గుచుండ, అలరుచుండెన్ = సంతోషించుచుండెను.

తా. ఆ యడవియందు శ్రీరాముఁడు సీతాలక్ష్మణులు దన్ను సేవించుచుండ సంతసముతోనుండెను.

**భారత.** అందున్=ఆ స్వర్గమందు, ఆమందశుభోదయమొందన్ = అతిశుభములు పొందుచుండఁగా, నిజసుతునకటనమితశుభములు గలుగుచుండఁగా నని భావము; కని = చూచి, సుమిత్ర........భజనరతిన్; సుమిత్ర = మిత్రులకు, ఆనందనజనక = సంతసముగల్గించుచుండు, సుత = కుమారుఁడగు నర్జునునివలన, అనిశ సందర్శిత = ఎల్లప్పుడు చూపఁబడుచుండు, నవనవోల్లసత్, భజనరతిని = సేవాసక్తిచే, బిడౌజుఁడు = ఇంద్రుఁడు, అలరుచుండెన్.

తా. ఇంద్రుఁడు స్వర్గమున నిజసుతుఁడర్జునుఁడు మిక్కిలి శుభములనందుచుఁ దనకు సేవసేయుచుండ నెంతయు సంతసించెను.

"బిడౌజుఁడు" "ఇంద్రోమరుత్వాన్మఘవాబిడౌజాః పాకశాసనః" అమరము.

సీ. ఆసక్తిఁదనరిననవాసవసేవామి
పానుభవనిరంతరానువృత్తి
నడఁగక పేర్చుపేరానఁ గుందెడియుర్వ
శీతలోదరిపరిశస్ఫీతతరస

కామసంభృత నొక్కతె యహీనాంశు వం
శాకల్పమైనయారాకొమారుఁ
డున్నచోటికిఁ దమి నొక్కనాఁ డేతెంచి
కెలవుననుండి యాకృతివిలాస
తే. మరసిచూచి విశృంఖలస్మరశరార్తిఁ
బూని నాసురవనిత దాఁ గానయోగ్య
మైనకాంతాకృతి వహించి కానుపించె
సిగ్గుఁ జెఱునవ్వుఁ జూడ్కులుఁ జెన్నుమీఱ. 71

అవతారిక. శూర్పణఖోర్వశీ వృత్తాంతము లంజుటించికవి యిట్లాడుచున్నాఁడు.

**రామాయణ.** ఆసక్తిన్, తనరి = ఒప్పి, మిక్కిలి యాసక్తయై యనుట; నవ ఆసవసేవా = నూత్నమగు మద్యము ద్రావుటయందును, ఆమిష + అనుభవ = మాంసమును భుజించుటయందును, నిరంతరాను వృత్తిన్ = ఎల్లప్పుడను వర్తించుటచేతను, అడఁగక = అణఁగక, తృప్తి చెందకయనుట; పేర్చు = అతిశయించు, పేరాసన్ = అత్యాసచే, కుందెడి = దుఃఖించెడి, ఎంతమద్య మెంతమాంసము దొరికినను నింకను నెక్కుడుగఁ జిక్కలేదుకదాయని దుఃఖించెడిదని భావము; ఉరు = గొప్పదగు, అశీతల+ఉదరి = చల్లగాని యుదరముగలది, ఇవి శూర్పణఖకు విశేషణములు; పరిస్ఫీతతరస = పూర్ణమాంసమునందలి, కామసంభృతతన్ = అపేక్షాత్వరచే, ఒక్కతె, శూర్పణఖయనుట; అహీనాంశువంశాకల్పమైన = సూర్యవంశమున కలంకారమైన, ఆరాకుమారుఁడు ఉన్నచోటికిన్ = ఆరాజకుమారుఁడున్న స్థలమునకు, రాముఁడుండుచోటికనుట; తమిన్, ఒక్కనాఁడు = ఒక్కదినము, ఏతెంచి = వచ్చి, కెలవునన్ = సమీపమున, ఉండి, ఆకృతివిలాసము = ఆకారముయొక్క విలాసమును, అరసి, చూచి = విచారించి, విశృంఖల స్మరశరార్తిన్ = పూర్ణమగు

మన్మథబాణములవలని యార్తిని, పూనెన్, కానన్, ఆసురవనిత=అసుర స్త్రీ, శూర్పణఖయనుట; సిగ్గు, చిఱునవ్వు, చూడ్కులు = చూపులు, చెన్నుమీఱన్ = అందగింపఁగా, యోగ్యమైన = తదనుభవ యోగ్యమైన, కాంతాకృతిన్ = స్త్రీయొక్క యాకారమును, మానుషాంగనాకృతిననుట; వహించి, కానుపించెన్.

తా. పూర్ణముగ మద్యమాంసము లనుభవించుచుండియుఁ దృప్తి చెందక శూర్పణఖ మాంసాసక్తిచే రాముని సమీపించి యాతని దర్శించి నంతనే అతని రూపవిలాసమునకు మోహితయై మన్మథబాణములకు గుఱియై తదనుభవ యోగ్యమగు మానుష కాంతారూపము వహించి యాతనికిఁ గాన్పించెను.

"ఊర్వశీతలోదరి." యణాదేశసంధి. "ఇకోయణచి" పాణిని. "ఆమిషానుభవ," "తరస," "పిశితంతరసంమాంసంపలలం క్రవ్యమామిషం." అమరము.

**భారత.** ఆసక్తిన్, తనరిన, వాసవసేవామిష = ఇంద్రుని సేవించుట యనెడి నెపముచేఁగు, అనుభవ నిరంతరానువృత్తిన్, అడఁగక=అణఁగక, ఎల్లప్పుడు నింద్రునిసేవించియు దానఁదృప్తినందక యనిభావము; పేర్చు, పేరాసన్, కుందెడి, ఊర్వశీతలోదరి = ఊర్వశియనెడి స్త్రీ, పరిస్ఫీతతర = మిక్కిలి పూర్ణమైన, సకామ = మన్మథునితోఁ గూడిన, సంభ్రమతన్ = సంభ్రమ యుక్తయగుటచే, ఒక్కతెయు, హిమాంశు వంశాకల్పమైన = చంద్రకులమున కాభరణమగు, ఆరాకుమారుఁడున్న చోటికిన్ = ఆ యర్జునుఁడుండు స్థలమునకు, తమిన్ = రాత్రియందు, ఒక్కనాఁడు, ఏతెంచి, శశవుననుండి, ఆకృతివిలాసము, అరసి, చూచి, విశృంఖలస్మర శరార్తిన్ = యథేచ్ఛమగుమదనబాణార్తిని, తాన్, పూనెన్, ఆసురవనిత = ఆయప్సరస, కానన్, యోగ్యమైన, చూచుటకు యుక్తమగు, కాంతాకృతిన్, వహించి,ఎప్పుడో యావన యున్మకాన్న కడసారి యాకారముమాని యనా

ఘ్రాతపురుషగంధయగు నాకారమువహించి యని భావము ; సిగ్గు, చిఱు నవ్వు, చూడ్కులన్ = దృష్టులందు, చెన్నుమీఱన్, కానుపించెన్.

తా. ఎడఁదెగక దేవేంద్రా నుభవము సేయుచున్నను, తృప్తినందక యూర్వశి కామమున నర్జునుని సమీపించి యాతని రూపముంగాంచి మోహించి కామబాణ పరవశయై యువకుఁడగు నాతనికిఁ దగినట్లాకారము నంది యాతనికిఁ గాన్పించెను.

"తమి." "రజనీ యామినీతమీ." అమరము.

వ. ఇట్లు గానుపించి పరస్పరసందర్శనసమయసముచిత సంభావ ణంబులు నడపి తనమదిం బొదలెడి మదనవికారంబు తెలం గోఁగించిన నతండు. 72

తే. తనకు దారయోగితకల్మిఁ దగఁ దెలుపుచు<br>
మదనుజవశకలితనిజమతిని బ్రబలు<br>
మనసుచేత నాచతురగామిని నెఱయఁగ<br>
నాన లేక త న్గవియ రా మానుపుచును. 73

**రామాయణ.** తనకున్, దారయోగితకల్మిన్ = భార్యతోఁగూడి యుండుట కల్గుటను, తగన్ తెలుపుచున్ = తగినట్లు తెలుపుచు, మద నుజ.....మతిని; మదనుజ = నాతమ్ముఁడగు లక్ష్మణునకు, వశకలిత = అధీనము గావింపఁబడిన, నిజమతిని = స్వబుద్ధిచే, ప్రబలుము అనన్ = వృద్ధిపొందుమనఁగా, నాకును న్నే భార్యకలదు కావున నీబుద్ధిని లక్ష్మణు నందు వినియోగింపుమన ననిభావము; సుచేతనా=మంచి బుద్ధియందు, చతుర కామినిన్=చాతుర్యవంతురాలు కామిచే, నాన=సిగ్గు, లేక, తన్ = ఆలక్ష్మ ణుని, కవియరాన్ = పైఁబడరాఁగ, మానుపుచును, ముందరిపద్యముతో నన్వయము.

తా. రాముఁడు నాకు భార్యయున్నదిగాన నాతమ్ముఁడగు లక్ష్మణునందు నీమనస్సును బ్రవేశింపఁజేయుమని నంతనే బుద్ధిహీనురాలగుట నా లక్ష్మణునిపైఁ బడరాఁగ నాతఁడా బ్రయత్నము మానుచు.

**భారత.** తనరన్ = అర్జునను, ఉదారయోగిత కల్గి = గొప్పదగు యోగిత్వముగల్గుట, తగన్, తెలుపుచున్, మనను = మన్మథునియొక్క, జవ=వేగమున, శకలిత=శిథిలమైన, నిజమతిని=స్వబుద్ధిగలదానిని, మన్మథాధీనమనస్కనను; ఆచతురగామినిన్ = చాతుర్యముతోడి నడకగల యా యూర్వశిని; బ్రబలుమనసుచేతన్ = వృద్ధిపొందునట్టి మనస్సుచే, మన్మథవికారముచేఁ బ్రబలుచుండు మనస్సుచే, నెఱయఁగన్=పూర్ణముగా, ఆన లేక = తాళఁజాలక, తన్, కవియరాన్, మానుపుచు; ముందరిపద్యముతో నన్వయము.

తా. అయర్జునుఁ డూర్వశితో నేను యోగినని చెప్పియు నామె మన్మథబాణ శిథిలిత బుద్ధియగుటచే మదనాయత్త చిత్తయై తాళఁజాలక తనపైఁ బడరాఁగ నాప్రయత్నమును మానుపుచు;

సీ. జ్యేష్ఠసాభ్రాతసుస్థితి లక్ష్మణుఁడు వల్కె
నరయున ఇటు వచ్చి తబల నన్ను
బ్రహ్మచర్యస్థితి భజియింపఁ బరమతా
పసనాథసత్యాజ్ఞ తపసఁ బనిచిన
నాయగ్రజునియోగ మీయోజఁ జెలుపుకో
నర్హమే మగిడిపొమ్మనిన వలపు
పొలుపుగా రాము నూల్కొలుపుచుఁ గదిసి య
తం డట్లు పలుక నెంతదాఁక గుట్టుఁ

ఆ. జరిపె దనుచుఁ దిరిగితిరిగి వైకొనుకోర్కె
నతని నతని మదవదనమ విశిఖ

దళిత హృదయ యగుచు దెలచి యుందు నొకింత
గలఁక లేమిఁ జూచి నెలఁత గనలె. 74

**రామాయణ.** జ్యేష్ఠ సౌభ్రాత్రసుస్థితి = అన్నయగు రామునితోడి, సౌభ్రాత్రమున సుస్థితిగల, లక్ష్మణుఁడు, పలికెన్ = ఈలాగునఁ జెప్పెను, అబల, అరయక = విచారింపక, బ్రహ్మచర్యస్థితిన్, నన్నున్, భజియింపన్ = పొందుటకు, ఇటవచ్చితి = ఈ వైపునకువచ్చితివి, ఆలోచింపక బ్రహ్మచారినగు నన్నుఁబొందవచ్చితివేయనుట; పరమ తాపసనాథ సతి ఆజ్ఞపసన్ = మిక్కిలిపరితాపముతోఁగూడిం భార్యయొక్క యాజ్ఞా ప్రభావమున, పనిచినన్ = పంపఁగా, నాయగ్రజుని యోగము, ఈయోజన్ = ఈలాగున, చెఱుపుకోన్, అర్హమె = తగునా, అతఁడు నాయొద్దకంపినంతనే వంచితయగుచు యుక్తమగు నాతనిసాంగత్యము చెఱుపుకొనుట నీకుఁదగునా యని భావము; మగిడి పొమ్ము అనినన్ = మరలి యాతనియొద్దకేయరుగుమన, వలపు పొలుపుగాన్ = తనవలపురమ్యమగునట్లు, విలాసములతోఁగూడియనుట; రామున్, నూల్కొలుపుచున్ = ప్రేరేపించుచు, కదిసి = సమీపించి, అతండు అట్లపలుకన్ = రాముఁడు మున్నుపోలెఁ బలుకఁగా, ఎందాఁకగుట్టు జరిపెదు అనుచున్ = ఎంతవఱకు నీగుట్టు నెఱవేర్చుకొందువనుచు, తిరిగి, తిరిగి, పైకొనుకోర్కిన్ = పైఁబడునాసతో, అతనిన్, ఆతనిన్ = ఆరాముని, ఆలక్ష్మణుని, మదవత్......హృదయ; మదవత్ = మదముగల, అసమవిశిఖ = మన్మథబాణములచే, దళిత = చీల్పఁబడిన, హృదయ, అగుచున్, తెలచి = అర్థించి, అందున్ = అట్లుకోరుటయందు, ఒకింత కలఁకలేమిన్ చూచి = కొంచెమేనివారు చాంచల్యమందకునికిఁజూచి, నెలఁత = స్త్రీ, శూర్పణఖయనుట; కనలెన్ = కోపించెను.

తా. తనయన్న యెడలం బ్రీతిగల్గు లక్ష్మణుఁడా శూర్పణఖంగాంచి బ్రహ్మచారినగు నన్నుగోరనగునా? భార్యమాటలచే నాయన్న నిన్నిట్లు తఱిమినంతనే వంచితురాలవై యాతనియోగము మానుకొనఁదగునే? మరల నీవటకేయేఁగుమన నావిడమరల రామునొద్దకురా నాతఁడు పూర్వోక్తము

చొప్పుననాఁడ మీరింకెంతవఱకు గుట్టు నెఱవేర్పఁగల్గుదురో చూతమనుచు రామునుండి లక్ష్మణునొద్దకును, లక్ష్మణునుండి రామునొద్దకును నరుగుచుఁ దన ప్రయత్నము సఫలము కాకుండుటచే నాశూర్పణఖ కోపించెను.

భారత. జ్యేష్ఠ = పెద్దవాఁడగు ధర్మజునితోఁడ, సౌభ్రాత్ర, సుస్థితి, లక్ష్మణుండు = లక్ష్మియుక్తుఁడగు నర్జునుఁడు, పల్కెన్, అబల, ఇది యూర్వశిని సంబోధించుట; అరయక, ఇటు, వచ్చితివి = నన్నుఁ జేరవచ్చితివి; బ్రహ్మచర్యస్థితిన్ భజియింపన్ = బ్రహ్మచర్య వృత్తినవలంబింప వలసినట్లు, పరమతాపస నాథసత్య ఆజ్ఞ పనన్ పనిచిన=నన్ను శపోధనుఁ డగు వ్యాస మహర్షి యాజ్ఞావైభమునఁబంపిన, నాయగ్రజు నియోగము ఈ యోజన్ చెఱుచుకోన్ అర్హమె = నాయన్నయాజ్ఞ ఇట్లు చెఱుచుకో వచ్చునా, మగిడి, పొమ్మ, అనినన్ = అనఁగా, వలపుపొలుపు గారాము నూల్కొలుపుచున్=అనురాగాతిశయము, నెనరును బ్రకటింపుచు, కదిసి, అతండు= ఆ యర్జునుఁడు, అట్లు, పలుకన్ = పూర్వమువలెఁ బలుకఁగా, ఎందాఁక, గుట్టు, జరిపెదు, అనుచున్, తిరిగి తిరిగి, పైకొనుకోర్కెన్ = మఱిమఱిపై కొనునట్టి యపేక్షచే, అతసిమ = తనుతాహీనమగు, గొప్పదగునదనుట; దవత్=దవాగ్నివలె నాచరించెకి, అసమశిఖ, గళితహృదయయగుచున్, అతనిన్ = ఆయర్జునుని, తెలచి = నమస్కరించి, అంనన్=ఆ నమస్కృతియందు, ఒకింత, కలఁక, లేమిన్, చూచి, నెలఁత=ఊర్వశి, కనలెన్ = కోపించెను.

తా. అన్నయగు ధర్మజునియెడ విశ్వాసముగల యర్జునుఁ డూర్వశింగాంచి యిట్లనెను. మునీంద్రుఁడగు వ్యాసుని యానతి చొప్పున మా యన్న యాజ్ఞను నేను బ్రహ్మచర్య వ్రతమూని యున్నాఁడను; నే నట్టి వ్రతము నెట్లు చెఱుపుకొనుట ? నీవు మరలి పొమ్మన నాయింతి తనవలపు పొలుపును గనికరమును బ్రకటింపుచు మరల సమీపింప నర్జునుఁడును బూర్వమువలెఁ బల్క "నీ వెందాఁక నీగుట్టు నెఱవేర్తువో చూచెదఁగాక

యని మఱి మఱి యతిశయించు కోర్కిచే మదన బాధితయై యాతనికి నమస్కరించి, యదియును వ్యర్థముగాఁగఁ గోపముచెందెను.

"లక్ష్మణుఁడు" లక్ష్మివాన్ లక్ష్మణ శ్శ్రీలః." అమరము.

సీ. ఏమని చెప్ప నిం బెసఁగెడు నునుఁబల్కు
లలర నేత్రైకపర్వాంగలక్ష్మి
నొప్పు రాకాసి తద్ద్యుతిమాని తా నన
యంబు జాత్యుచితరూపంబులైన
దృక్పాణిపదగతుల్ దీపింపఁగ మహాస్ర
గూఢగంధంబులు రూఢిఁబర్వ
మేను సాంద్రతరసార్ద్రాను లేపనముచే
నవగుణాధిక్యమై భవము సూపఁ

తే. ప్రేమ మదన లీలలపయిఁ బెరిఁగి పెరిఁగి
మదిఁ గలంపఁగ నిట్టట్టుఁ గదిసి కదిసి
సప్రకర్ష భీభత్సాత్మ సప్రజపిత
వికృతినై తుదఁ గోపంబు వెలయఁబలికె. 75

రామాయణ. ఏమనిచెప్పన్ = ఏమనివచింతును, ఇంపెసఁగెడు నునుపల్కుల్ = సంతోషకరమగు మృదూక్తులు, అలరన్ = ఒప్పఁగా, నేత్రైకపర్వ = కన్నులకు ముఖ్యమగు పండువుగానుండు, అంగలక్ష్మిన్, ఒప్పు = శరీరకాంతిచే నొప్పుచుండు, రాకాసి= రాక్షసి, శూర్పణఖయనుట; తద్ద్యుతి = ఆరూపమును, మానుషరూపమునునుట; మాని = వీడి, తాన్, అనయంబు = ఎల్లప్పుడు, జాత్యుచితరూపంబులైన = రాక్షసజాతికిఁదగిన, దృక్ = కన్నులయొక్కయు, పాణి = చేతులయొక్కయు, పద= కాళుల యొక్కయు, గతుల్ = నడకలు, చేష్టలనుట ; దీపింపఁగన్ = ప్రకాశింపఁగా, రాక్షసజాత్యుచితాంగ వ్యాపారములు గలదగుచునని భావము;

మహాసృ = మిక్కుటమగు నెత్తుటితో, గూఢ = ఆవరింపఁబడిన, గంధం బులు=వాసనలు, రూఢిꣳ = స్థిరముగా, పర్వꣳ = వ్యాపింపఁగా, మిక్కుటముగా వ్యాపింపంగననుట; మేను=శరీరము, సాంద్ర = దట్టమైన, తరస= మాంసముచే, ఆర్ద్ర = తడిసిన, అనులేపనముచేꣳ=పూఁతచేత, అవగుణా ధిక్య వైభవము=దుర్గుణముయొక్క యధికవైభవము, చూపꣳ, ప్రేమను, అదనలీలపయిꣳ=భక్షణరూపకార్యముపై, పెరిఁగి, పెరిఁగి, మదిꣳ, కలం పఁగꣳ = కలఁతవెట్టఁగా, ఇట్టు అట్టుꣳ కదిసి కదిసి = ఇటువైపును నటు వైపును సమీపించి, స్వపకర్ష = ఆధిక్యముతోఁగూడిన, భీభత్సాత్మక = జుగుప్సారూపముగా, ప్రజనిత = కలిగిన, వికృతిమై = వికారరూప సంప న్నయై, తుదꣳ=కడకు, కోపంబు వెలయꣳ=కోపమతిశయింప, పలికꣳ.

తా. ఏమనిచింతును, సర్వాంగసుందరమగు నా మానుషరూపము మాని, జాత్యుచితపాణి పాదాదుల విలసనముగలదై, రక్తమువలని దుర్గం ధము వ్యాపింప, శరీరము మాంసపుపూఁతతోడనుండ, భక్షణాశయతి శయింప నీవైపునా వైపుంగదిసి భీభత్సాత్మక వికృతరూప యగుచుఁ, గోపాతిశయమున నిట్లనెను.

"మహాస్ర" "అస్రమస్త్రశుణిశోణితే." అమరము.

**భారత.** ఏమనిచెప్పꣳ, ఇంపెసఁగెను, నునుపుక్కులు, అందꣳ, నైత్రైకపర్వ = కనులకు ముఖ్యమగు పండువవలెనుండు, అంగలక్ష్మిꣳ = శరీరకాంతిచే, రాకా సితద్యుతి = పూర్ణిమాచంద్రునివలె, మానిత = గౌర వింపఁబడిన, ఆనన = ముఖముగలది, అంబుజ = తామరలకు, అత్యుచిత = మిక్కిలి తగిన, రూపంబులైన = సౌందర్యముగలవైన, దృక్, పాణి, పద గతుల్ = విలాసములు, దీపింపఁగꣳ = ప్రకాశింపఁగా, మహాస్రక్ = గొప్పపుష్పములచే, కల్పపాదప కుసుమములచేననుట; ఊఢ = వహింపఁ బడిన, గంధములు = పరిమళములు, రూఢిꣳ, పర్వꣳ = వ్యాపింపఁగా, మేను, సాంద్రతర = మిక్కిలి దట్టమగు, సార్ద్ర = తడితోఁగూడిన, అను

లేపనముచేర్ = మైపూఁతచే, నవ = నూతనమైన, గుణాధిక్య = మిక్కుటమగు గుణము గల్గుటవలని, వైభవము = గొప్పదనము, చూపర్ = ప్రకటింపఁగా, తక్కిన యనులేపనములవలెఁగాక యూర్వశియనులేపన మెంతు వాఁటక సర్వదా తడియాఱకుండుటచే నూతనమగు నొకవైభవము గాంచెనని భావము; మదన లీలపయిన్=కామవిలాసముపయి, ప్రేమ=ప్రీతి, పెరిఁగి పెరిఁగి=మిక్కిలి వృద్ధిపొంది, మరిన్, కలంపఁగన్, ఇట్టు, అట్టున్, కదిసి, కదిసి, స ప్రకర్ష = ధీరతతోఁగూడిన, భీభత్సాత్మకున్ = అర్జునుని మానసమునకు, అప్రజనిత=పుట్టింపఁబడని, వికృతిమై=వికారముగలదై, తానిట్టట్టుఁగదియుటవలన ధీరుఁడగు నర్జునునకు మానసవికారము జనింపఁజేయఁజూచియు వ్యర్థయయ్యెనని భావము; తుదిన్=కడను, కోపంబు, వెలయన్= ప్రకాశింపఁగా, పలికెన్.

తా. ఊర్వశిసంతోష ప్రదములగు పల్కులతోడను, గన్నులపండువగు శరీర సౌందర్యముతోడను, బూర్ణిమాచంద్రునిఁబోలు ముఖముగలదియై, తామరలఁ బోలిననేత్రములు, కాలుసేతులు లోని విలాసములు ప్రకాశించుచుండ, కల్పవృక్షప్రసూన పరిమళములు వ్యాపింపఁగా, తడియాఱక యెల్లప్పుడు నార్ద్రముగానుండు ననులేపనముచే శరీరమొకవింతరీతిని వైభవము చూపఁగా, మన్మథ విలాసముపైఁ బ్రేమయభివృద్ధమయి, యదితనమదిని గలఁత పెట్టనిట్టట్టుగదిసి, ఇట్లు తానొనర్చిన ప్రయత్నము వ్యర్థమగునట్లా ధైర్యఖనియగు నర్జునుని మానసమును వికృతము సేయలేక తుదనుగోపించి యిట్లు పలికెను.

ఇట ముద్దరాజురామన్న; "చెమ్మటను దడిసినమైపూఁతయందుఁ బరిమళ మెచ్చుగనుక" యనెను. దేవాంగనకుఁ జెమ్మటనిచ్చుట గవియాశయముగాదు. మైపూఁతయొక్క ప్రభావమే యిట్టి దగునని యాతని యభిప్రాయముగా నుండనోపును.

మఱికొందఱు "సాంద్రతర్, రసార్ద్ర" అనిపదచ్ఛేదము గావింపనగునని యభిప్రాయ పడెదరుకాని "సాంద్రతర." అనుట రసవంతము.

"రాకాసితద్యుతి." ఇటరామాయణార్థమున; రాకాసి, తత్, ద్యుతి; యని, యగుటచే, తద్ద్యుతియని దకార ద్విత్వసహిత రూపముగాను నుండ శ్లేషార్థ సంఘటనమునకై, "రాకాసితద్యుతి" యని ద్విత్వరహిత రూపముం గ్రహించెను; అయినను, "అనచిచ" యను విభాషాసూత్ర మాధారము గావించుకొని హల్ద్విత్వమంగీకరింప వచ్చును. "మదిఁగలఁపంగన్." ఇటఁ గొందఱు; అర్జుని మనస్సుకలఁతపెట్టుట"కని యభిప్రాయపడెదరు కాని యది సమంజసము కాదు. మదన లీలపెంపేఁచేమ, పెరుఁగుటచేఁ దన మదికలఁగె ననుటయే సందర్భశుద్ధము.

చ. అలవియెఱుంగలేక యితరాంగనలంబలెనన్ను నిమ్మెయిం
గలఁచుటయుక్తమే? యెదవుఁగాక భవత్కృతదుష్టచేష్టితం
బులకు ఫలంబు నేఁడొకటిపూర్ణముగా నుపభోగ్యమైకడు
న్జలమున నెందు నీమగతనంబు కడంకలరూపుమాలుటల్.

అవతారిక. శూర్పణఖ గోపించి రాముం జంపెదనని పల్కుచున్నది. భారతార్థమునందలి యూర్వశీ శాపము వివరింపనిటనిది తెచ్చి పెట్టుకొనిన సందర్భమేయైనను గోపించిన శూర్పణఖ యాడుమాట యగుటచే సందర్భశుద్ధముగనే యున్నది.

**రామాయణ.** అలవి = సాధ్యాసాధ్యములు, ఎఱుంగలేక = తెలియఁజాలక, ఇతరాంగనలంబలెన్ = తక్కిన స్త్రీలవలె, సామాన్య స్త్రీలవలెననుట; నన్నున్, ఇమ్మెయిన్ = ఈలాగున, కలఁచుట = కలఁతపెట్టుట, యుక్తమే, భవత్కృత = నీచే నాచరింపఁబడిన, దుష్టచేష్టితంబులకున్ = దుష్కార్యములకు, మోహితురాలిని నన్నుపేక్షించినందులకని భావము; లేక, ఉభయకూల సమస్థిత శాద్వలభ్రమగతాగత ఖిన్నగవీదశకుందెచ్చిన నీ యీపరిహాసకార్యమున కనియుఁగాపచ్చును, అప్పుడు మున్నే కామవ్రణ పీడితయగు నన్నిట్లిట నుండియటకు నటనుండి యిటకుంద్రిప్పి, గండస్యోపరిపిటకాసంవృత్తాయన్నట్లు పరిహాస పాత్రురాలిం గావించి

మఱింత కలఁచివైచిన యీయకార్యమున కని యర్థము గావింపవగును; నేఁడు = ఈదినము, ఫలంబు ఒకటి = ఒకఫలము, పూర్ణముగాన్ ఉప భోగ్యమై = సంపూర్ణముగా ననుభవింపఁదగినదై, కడున్ చలమునన్ = మిక్కిలి మాత్సర్యముచే, ఎందున్, నీ మగతనంబు కడంకల రూపుమాలు టల్ = నీ పరాక్రమముయొక్క యత్నముల రూపరహితము లగుటలు, నిన్ను సంహరించుట యనిభావము; ఒదవున్ కాక = కలుగునుగాక.

తా. నన్ను సామాన్య స్త్రీలవలెఁదలఁచి నామాటల నలక్ష్యము సేయుటయ కాక నన్నిట్టట్టు ద్రిప్పి పరిహాస పాత్రురాలిఁగాఁ జేసితివి. ఈ యకార్యములకు ఫలముగా నీ పౌరుషము నశించులాగున నిట్లు నిన్ను సంహరించెదను.

**భారత.** అలవి, ఎఱుఁగలేక, ఇతరాంగనలంబలెన్, నను్న్, ఇమ్మెయిన్, కలఁచుట యుక్తమే ; గణికలు సామాన్య నాయికలగుటచే మానుష గణికలవలెఁ దన్నును భావించె నేమోయని యభిప్రాయపడి, నన్నిట్లు తిరస్కరించుట నీకు మేలుగావని యాడుచున్నదని భావము; ఇప్పుడుఁగూడ నూర్వశికి దింపుడు గళ్లపుటాస [శవమును గాటికిం గొనిపోవు నపుడు మూఁడుస్థలముల దింపెదరు. అచ్చట నేనిమరలఁ బ్రదికివచ్చునేమో యను నపేక్షగలుగుటయే దింపుడు గళ్లపుటాసయగును.] వీడకున్నది ; భవ త్కృత దుష్టచేష్టితంబులకున్ = నీ యాచరించిన యీ దుష్కార్యములకు, ఫలంబున్ = ఫలముగూడ, [ఇచ్చట ద్రుశమ సముచ్చయార్థకమే కాని ద్వితీయావిభక్తి ప్రత్యయముగాదు.] పేఁడు, ఒకటి, పూర్ణముగాన్, ఉప భోగ్యమై = ఒక్కసంవత్సరము పూర్ణముగా ననుభవింపఁదగినదై, కడున్, చలమునన్ ఎందున్, నీ మగతనంబు = నీపుంస్త్వముయొక్క, కడంకల రూపుమాలుటల్ ; నపుంసకత్వము గల్గుటయని భావము; ఒదవున్, కాక.

తా. సామాన్యగణికగా నెంచి నన్ను దిరస్కరించినందులకు ఫల ముగా నీకొక్క పత్సరము నపుంసకుఁడుగా నుండునట్లు శాప మొసంగితిని.

వ. అనిపలికి తదనంతరంబ. 77

సీ. మదిఁజపలతఁ దన్ను నెదిరిఁగానమిని సీ
తాదేవరామలా స్యాదితత్వ
విశ్రుతినాస నై వేల్పులు దనరాక
పోకలుగాంచియుబ్బునఁ జెలంగ
నుండనేరక మర్త్య యోగేచ్ఛఁ జని యిట్లు
వచ్చె నేఁడని కన్న వారు నవ్వ
సిగ్గులేకేమని యగ్గలికను జన
స్థానంబుచేరి తత్సంశ్రయఖర

తే. దూషణాదులచేత నా దుర్గలితము
లంతకంతకు దీపింప నాత్మవార్త
జరిపెదను జాతివికృతి చేష్టలు దనిజాల
ప్రీతి నుడిగించె ననుచింతఁ బెట్టి మదిని. 78

**రామాయణ.** మదిచపలతన్ = చిత్తచాంచల్యమున, తన్నున్ ఎదిరిన్ కానమిని = తన్ను నెదిరిని కానఁజాలని దాటచే, సీతా...నాసనై; సీతాదేవర = సీతమఱఁదియగు లక్ష్మణుని, అమల = నిర్మలమగు, అసి = కత్తిచే, ఆదితత్వ = చక్కఁగా ఖండింపఁబడుటచే, విశ్రుతినాసయై = కర్ణనాసికా విహీనయై, తనయొక్కయు నెదిరియొక్కయు నంతరముగానక ప్రవర్తిల్లుటచే లక్ష్మణుఁడు ఖడ్గమున దీనిచెవులు ముక్కులు నంటఁబట్టి కోసె నని భావము; వేల్పులు = దేవతలు, తన రాకపోకలంగాంచి = తన గమనాగమనములనుజూచి, ఉబ్బునన్ చెలంగన్ = సతోషమునఁ జెలఁగుచుండఁగా, తానట్లు వచ్చుటయుఁ దనగౌరవ ముడిపోవుటయును దేవతలుచూచి సంతోషము చెందిరని భావము; ఉండనేరక = ఊరక యుండఁజాలక, మర్త్యయోగేచ్ఛన్ చని – మనుష్య సమాగమమునందలి కోర్కె[illegible]వెడలి,

ఇట్లు వచ్చె నే అనే=ఇట్టి విపరీతదశ వచ్చెనుగదాయని, కన్నవారు నవ్వఁగా=చూచినవారు నవ్వఁగా, సిగ్గులేక=లజ్జలేకున్నను, మని = తాను జీవించి, పగదీర్చికొనుటకై మెండిగ జీవించుట యని భావము; అగ్గలికను=వీరత్వముచే, ఇట శూర్పణఖయొక్క వీరత్వ మెల్లనిం బగసాధింపవలయునను పట్టుదలయేయగును; జనస్థానంబు, ఇది ఖరదూషణాదుల యునికిపట్టు, చేరి, తత్సంశ్రయ=అందు వసించియున్న, ఖర......దుర్లలితములు; ఖరదూషణాదుల=ఖరుఁడు, దూషణుఁడు మున్నగువారి చేతనా=బుద్ధియొక్క, దుర్లలితములు = దుశ్చేష్టలు, అంతకంతకుక్, దీపింపక = అంతకంతకతిశయింపఁగా, దనుజ అతి వికృత చేష్టలు = రాక్షసులయొక్క వికారమగు చేష్టలు, దివిజుల ప్రీతిక = దేవతలప్రీతిని, ఉడిగించెక = నశింపఁజేసెను, ఇది నశింపఁజేయునని భావము; అను, చింతక, మదినిబెట్టి = మనస్సున నిడికొని, ఆత్మవార్త జరిపెక = తనవార్త నడిపెను, తన యావృత్తాంతము వివరించెననుట.

తా. చిత్త చాపల్యమున తనయొక్కయు నెదిరియొక్కయు నంతరము దెలియక పోవుటచే లక్ష్మణుఁడు దీని దుష్ప్రవర్తనకలిగి ఖడ్గమున శ్రవణ నాసికలఁ గోయఁగా, నట్టి తన్నుగాంచి దేవతలు సంతోషింపఁగను, జూచినవారెల్ల నిట్లు మర్త్య సహవాసముగోరి వికృతరూపయయ్యెఁగదా యని నవ్వుచుండఁగా, నిర్లజ్జయై జనస్థానమున కరిగి, అచట వసించు ఖరాదులతో ననమతిం దెల్పెను.

“దేవర.” “స్యాలాస్స్యుర్భ్రాతరః పత్న్యాః స్వామినో దేవృదేవరౌ.” అమరము “వార్త.” “వార్తా ప్రవృత్తిర్వృత్తాంతః.” అమరము.

“ప్రీతినుడిగించెక” ఇటభావిని భూతమగుటకు; “తావచ్చెసుదర్శనాయుధుఁడు.” అని పోతనప్రయోగము గలదు.

“మదిచపలత”, అంచయానాదులవలె నిదిమిశ్రసమాసమగును. కొన్ని ప్రతులలో. “మదిఁజపలత” యనియుం, “మతిచపలత” యనియు,

దిద్దియుండుటసాహసము. ప్రాచీనప్రతులలో నెల్ల "మదిచపలత" యనియే కాఁ వచ్చు నన్నది.

"వార్త జరిపెదనుజాతివికృతచేష్టలు." ఇటనుద్దరాజురామన్న వార్తజరిపెదను అని పదచ్ఛేదము గావించెనుగాని ముందరిపద్యమున ఖరప్రయాణము తెల్పఁబడుటచే నిచ్చట భవిష్యత్కాలిక క్రియసందర్భ శుద్ధముగాకున్నది. కావున జరిపెనను భూతకాలిక క్రియయే సమంజసము. కవి యాశయము నిట్లేయుండ నోపును.

భారత.—మదిచపలతన్, తన్నున్, ఎదిరిన్, కానమిన్, ఇనీ, ఇదినిందార్థకము; తాన్ - దేవరామ = దేవాంగన, లాస్యాది = నృత్యము మొదలగు వానియొక్క, ఇటనాది శబ్దమున గీతవాద్యాదులు సూచితములు; తత్త్వ=యథార్థజ్ఞానముయొక్క, విశ్రుతిన్=ప్రసిద్ధిచే, లాస్యాదులు చక్కఁగా దెలియుననుప్రసిద్ధిచేననుట ; ఆసద్మా = ఆసపుట్టి, వేల్పులు = దేవతలు, తనరాకపోకలు, కాంచి, ఉబ్బునన్, చెలంగన్, ఉండ నేరక, తన నృత్యాది విజ్ఞానప్రసిద్ధిని దనరాకపోకలకు సంతసించుచుండఁ దానట నుండ నేరక యని భావము ; మర్త్యయోగేచ్ఛన్ = మానుష సమాగమాపేక్షచే, చని, ఇట్లువచ్చెనే, అని, కన్నవారు, నవ్వన్ = పరిహసింపఁగా, దేవాదుల సమాగమమునఁ దృప్తినందక మనుష్యమాత్రునిం గవయుంబూని వచ్చెఁగదా యనిచూచినవారునవ్వఁగా; సిగ్గులేక, ఏమని=ఏమియని, అగ్గలికను=విలాసముచే, జనస్థానంబుచేరి = సభనుచేరి, తత్సంశ్రయ = ఆసభలో నున్నవారి, ఖర=క్రూరమైన, దూషణాదులచేతన్=నిందాదులచేత, నాదుర్లలితములు=నాదుశ్చేష్టలు, అంత కంతకున్, దీపింపన్=అతిశయింపఁగా, ఆత్మవార్త, జరిపెదను=జరుపఁగలను, జాతివికృతిచేష్టలు=నాజాతికిఁ దగిన వికారచేష్టలు, గణికాజాతికిఁదగిన చేష్టలనుట; దివిజుల ప్రీతిన్ ఉడిగించెన్ = దేవతల ప్రీతిని బోఁగొట్టెను, అనుచింతన్, మదిని, పెట్టి; నివాసమున కరిగెనని ముందరి పద్యములోని క్రియతో నన్వయము.

తా. నా లాస్యాదులచే దేవతలు మెచ్చుచుండ నట్టి నేను నెదిరిం దెలియక, చూచువారు మనుష్యమాత్రునికై జని యిట్లవమతింపఁబడివచ్చె నే యని పరిహసింపఁగా లజ్జలేక నేను సభకేఁగి యందలివారి దూషణల నెట్లు విందును? దేవతలకు నా యీదుష్కార్యము మూలమునఁ బ్రీతి సడలెఁగదా యని భ్రమించుచు;

క. అనివార్యము ఖరవాహిని
దనవార్తపురఃప్రయాణతఁ దెల్లడలఁగ రా
మనివాసమున కరిగె మ
న్యునిరూఢతఁ గదలి యుద్ధృతోత్సాహగతిన్. 79

**రామాయణ.**—అనివార్యము = అడ్డగింపరానిది, (అట్టి,) ఖరవాహిని = ఖరుని సేన, తనవార్త = తానువచ్చెడువార్త, పురః ప్రయాణతన్ వెడలఁగన్ = తనకంటె ముందుఁ దెలియు చుండునట్లు, మన్యునిరూఢతన్ = రోషాధిక్యమున, కదలి, యుత్ = యుద్ధమందు, ధృతోత్సాహగతిన్ = ధరింపఁబడిన యుత్సాహముగల గమనముతో, రామనివాసమునకున్ = రాముఁడుండు నెడకు, అరిగెన్ = వెళ్లెను.

తాత్పర్యము సుగమము.

" ఖరవాహిని. " "వాహినీపృతనాచమూః." అమరము.

" మన్యునిరూఢతన్." "మన్యుర్దైన్యే క్రతౌ క్రుధి" అమరము.

" యుద్ధృతోత్సాహ " " యుధ్యంతే పరస్పరమితియుత్. " యుధసంప్రహారే." గురుబాలప్రబోధిక.

**భారత.**—అనివార్య, ముఖరవాహిని = మ్రోఁగుచుఁ బ్రవహించుచున్న, తనవార్త = తనవృత్తాంతము, పురః ప్రయాణతన్, వెడలఁగన్ తనవృత్తాంత మెంతయుఁ డఁచిపెట్టినను నిలువక తనకంటె ముందు జనుల చెవి కెక్కుచుండఁగానని భావము; మన్యునిరూఢతన్ = శోకాతిశయమున,

ఉద్ధృతోత్సాహగతిన్ = వెకలింపఁబడిన యుత్సాహముగల గమనమున, కదలి, రామ = ఊర్వశి, నివాసమునకున్ అరిగెన్ =తనయింటికరిగెను.

తాత్పర్యము సుగమము.

సీ. అదియంతయును విని యపుడు వేఱోక చండ
మైచింతనున్న య త్త్యాత్మఖేద
జనకుననుంగుపట్టిని దగఁ బిల్చి నీ
యాశాపదానంబు నే నెఱుఁగుదు
మదిఁ జింతపలదునీ కిడియనిష్టసమాగ
మముగాదు నాదగుమాటఁ జేసి
ఘనమోదమున నుండు మనుచు జిష్ణుఁడు నుమి
త్రానందనుఁడు దేర్చెఁ బూని యంత

ఆ. సార తరబలారి శాసనోద్దీప్తసం
రంభవిభవుఁ డగుచు రామవిభుఁడు
భుజవశీకృతాజి విజయుండు వేల్పుల
జయజయస్వనాతిశయము నిగుడ 80

**రామాయణ.**—అది యంతయును విని = ఖరదూషణాదులు యుద్ధమునకు వచ్చుట యంతయును విని, అపుడు, వేఱోకచండమై =వేఱోకవిధమై, ఇంతకు మున్ను త్సాహవతిగానుండిన దిప్పుడు దుఃఖిత యయ్యెనని భావము, చింతన్ ఉన్న = చింతతోనుండఁగా, అత్యాత్మఖేద = మిక్కిలి దుఃఖించుచున్న, జనకుననుంగుపట్టిని = జనకుని కూఁతును, సీతనుట; తగన్, పిల్చి, ఇదిమొదలు లక్ష్మణునిమాట ; నీయాశ అపదానంబు = నీభర్తయగు రాముని పరాక్రమము, నేన్, ఎఱుంగుదున్ = నేఁ దెలియుదును, మదిన్ = మనస్సున, చింత, వలదు, నీకున్, ఇది = ఈయుద్ధము, అనిష్టసమాగమముకాదు = అనిష్టముయొక్క రాకగాదు,

నాదగుమాటఁ జేసి = నామాటచే, ఘనమోదమునన్ = గొప్పసంతో షముతో, ఉంచుము, అనుచున్, జిష్ణుఁడు = జయశీలుఁడగు, సుమిత్రానం దనుఁడు = సుమిత్ర కుమారుఁడు, లక్ష్మణుఁడనుట ; తేర్చెన్; అంతన్, పూని, సార...విభవుండు; సారతర = మిక్కిలిసారమగు, బల = బలము గల, అరి = శత్రువుల యొక్క, శాసన = శిక్షించుటయందు, ఉద్దీప్త = మిక్కిలి ప్రకాశించుచున్న, సంరంభవిభవుండు = ప్రయత్నవైభవము గలవాఁడు, అగుచున్, భుజ = బాహువులచే, లక్షణచే బాహుబలమున ననియగును; వశీకృత = అధీనముగాఁ జేసి కొనఁబడిన, ఆజి = యుద్ధము నందలి, విజయుండు = జయముగలవాఁడు, రామవిభుఁడు = శ్రీరాముఁడు, వేల్పుల = దేవతలయొక్క, జయ జయస్వనాతిశయము = జయజయధ్వాన ము యొక్క యతిశయము, నిగుడన్ = వృద్ధికాఁగా; చెందుబెండాడెనని ముందు పద్యముతో నన్వయము ;

తా. రాముని యీ యుద్ధసంరంభమువిని సీత చింతించుచుండ లక్ష్మ ణుఁడామెతో; "నీ భర్తయొక్క బల మే నెఱుఁగుదును. ఇది నీకనిష్టముగా నేరదు నామాటవిను" మని యూరడించెను. నిజబాహుబలమున శత్రువుల సంహరించి యుద్ధమున విజయము పొందఁ దగినరాముఁడు వేల్పుల జయ జయధ్వాన మతిశయించుచుండఁగా ;

"నీయీ శాపదానంబు." "అపదానం కర్మవృత్తం" అమరము.

భారత.——అదియంతయున్, విని = ఊర్వశీశాపము మున్నగు వానిని విని, అపుడు, వేఱొకచందమై = చింతనున్న, అత్యాత్మఖేద జన కున్ = మిక్కుటముగాఁ దనకు దుఃఖము గల్గించుచున్న వానిని, కుమా రుని దుఃఖము చూచి తండ్రియు దుఃఖితుఁ డయ్యెనని భావము; అనుంగు పట్టిని = ప్రియకుమారుని, అర్జును ననుట; తగన్, పిల్చి, నీయీ శాప దానంబు= నీకుఁ గల్గిన యీ యూర్వశీ శాపదానము, నేన్, ఎఱుఁగు దున్, మదిన్, చింత, వలదు, నీకున్, ఇది, అనిష్ట=ఇష్టముగాని, సమ =

సంవత్సరమున, ఆగమము=రాకగలది, కాదు, నీయిష్టముగానివత్సరములో రాదనుట; అజ్ఞాతవాసవత్సరముననే వచ్చునదనుట; నాదగుమాటన్, చేసి, ఘనమోదమునన్, ఉండును = అనుచున్, సుమిత్రానందనుఁడు = సన్మిత్రులకానంద మొసఁగెడి, జిష్ణుఁడు = ఇంద్రుఁడు, తేర్చెన్ = దుఃఖము నుండి తేర్చెను, అంతన్, పూని, సారతర, బలారి = ఇంద్రుని, శాసన = ఆజ్ఞచే, ఉద్దీప్త = ప్రకాశించుచుండు, సంరంభవిభవుఁడు, అగుచున్, రామవిభుఁడు=అభిరామ వైభవముగలవాఁడు, భుజవశీకృతాజి = బాహు బలముచే నధీనముగాఁ జేసికొనఁబడిన యుద్ధముగలవాఁడు, విజయుఁడు = అర్జునుఁడు, వేల్పుల జయజయధ్వానాతిశయము, నిగుడన్, చెండుబెండా డెనని ముందరి క్రియతో నన్వయము.

తా. ఊర్వశీ శాపక్రమమెఱిఁగి యర్జునుఁడు దుఃఖించుచుండ దేవేంద్రుఁడు పుత్రశోకముగాంచి యోర్వలేక ప్రియసుతు నతనినిబిల్చి "నీకుఁ గల్గిన శాపక్రమ మేనెఱుంగుదును, నీవిందులకుఁ జింతిలకుము, ఇదినీకనిష్టమగు వత్సరమునరాక, నీ యిష్టమగు నజ్ఞాతవాసవత్సరముననే వచ్చును, కాఁబట్టి నా మాటనమ్మి నీ దుఃఖముడుగు"మని తేర్చెను. అంతనర్జునుఁడును నింద్రాను మతినసురసంహార ప్రయత్నముగలవాఁడగుచు, దేవతలు జయజయ ధ్వానములు సేయుచుండ ;

గీ. సర్వదివ్యాస్త్రదుర్వారసారయుత ని
వాతకవచాదిరక్షోద్ధిశాతులరణ
విహరణోత్సాహదైవతవిమత సేన
పైనడరి చెండుబెండాడెఁ బ్రభుయుతముగ. 81

రామాయణ భారతార్థములు. సమము.

అర్థము.—సర్వ...... సేనపైన్ ; సర్వ దివ్యాస్త్రదుర్వార = ఎల్ల యస్త్రములచేతను నడ్డగింపఁదగని, సారయుత = బలముగల, నివాత

కవచాది రక్షోర్జిత = [రామా. గాలిదూఱఁజాలని కవచముమున్నగు రక్షణ సామగ్రిచే నూర్జితమైన, భార. నివాతకవచాదులగు రాక్షసులచే సంపాదితమగు,] అతుల = సాటిలేని, రణవిహారణోత్సాహ = యుద్ధవిహారమున నుత్సాహముగల, దైవతవిమతసేనపైన్ = అసురసేనపైని, ప్రభుయుత ముగన్ = వారి నాయకులతోఁగూడ, అడరి, చెండు చెండాడెన్ = సంహరించెను.

తాత్పర్యము సుగమము.

క. తమిఁదద్ధ్వంస నిమిత్త
ప్రమదదశాస్యుఁ డగునాసురప్రభు కడకేఁ
గి మనోమోదోచితసం
భ్రమతం బ్రణమిల్లె నతనిపాదంబులకున్. 82

**రామాయణ.** తమిన్ = తొందరపాటుతో, తద్ధ్వంసనిమిత్త ప్రమద = ఖరాదుల నాశమునకుఁ గారణమయిన స్త్రీ), శూర్పణఖయనుట; దశాస్యుఁడు, అగు అసుర ప్రభుకడకున్ ఏఁగి = పదితలలు గలవాఁడగు నసురరాజు సమీపమునకు వెళ్లి, రావణుని సమీపించి యనుట ; అతని పాదం బులకున్ = ఆ రావణుని పాదములకు, మనః అమోద ఉచిత సంభ్ర మతన్ = మనస్సునందుఁగల దుఃఖమునకుఁదగిన సంభ్రమముతో, ప్రణ మిల్లెన్ = నమస్కరించెను.

తాత్పర్యము సుగమము.

**భారత.** తమిన్ = అపేక్షతోడ, తత్ = ఆ నివాతక వచాదుల, ధ్వంసనిమిత్త, ప్రమదదశా = సంతోష దశతోఁగూడిన, ఆస్యుఁడగు = ముఖముగల, ఆ సురప్రభుకడకున్ = ఆ దేవేంద్రుని సమీపమునకు, ఏఁగి= వెళ్లి, కాలకేయాదులు చచ్చుటచే సంతసించు నా దేవేంద్రు నొద్ద కర్జునుఁ డరిగియని భావము; మనోమోద ఉచిత సంభ్రమతన్=మనస్సునందలి సంతో

వమునకుం దగిన సంభ్రమముతో, అతని=ఆ దేవేంద్రుని, పాదంబులకున్, ప్రణమిల్లెన్.

తాత్పర్యము సుగమము.

ఆ. అతడుఁ తనయవరజయాకర్ణ నాసాస్ర
ములు నిజాక్షులనఘవిలసనమ్ము
గదు నిగుడ్ప నడిగి యడిగి తత్కథితస
భార్యరామవృత్తకార్యుఁ డగుచు. 83

**రామాయణ.** అతఁడు = ఆరావణుఁడు, తన యవరజ = తనసోదరి యగు శూర్పణఖయొక్క, ఆ కర్ణనాసాస్రములు = చెవులయందును ముక్కునందునుగల యా నెత్తురులు [భారత పర్యాయమున సాస్రములు నిజాక్షులని యన్వయింపవలసివచ్చుటచే నందులకై యిట నస్రములని బహువచనప్రయోగము గావింపఁబడియెను.] నిజాక్షులన్ = తననేత్రములందు, అఘవిలసనమ్ము = దుఃఖముపలనియుద్రేకమును, కదున్, నిగుడ్పన్=వృద్ధిచేయఁగా, శూర్పణఖచెవులుముక్కును దెగి యట నెత్తురు కారుటచూచిన వెంటనే రావణుని నేత్రములందు దుఃఖమెక్కుడుగా నుద్రేకించెనని భావము; అడిగియడిగి = అట్లగుటకుఁగారణము మాటిమాటికడిగి, తత్కథిత......కార్యుఁడు; తత్ = ఆశూర్పణఖచే, కథిత = చెప్పఁబడిన, సభార్య=భార్యయగు సీతతోఁగూడిన, రామ=రాముని, వృత్త=అతీతములగు, కార్యుఁడు=కార్యముగలవాఁడు, అగుచున్, అతఁడట్లు కర్ణనాసాచ్ఛేదమునకుఁగారణమడుగ శూర్పణఖ రామునిచే జరిపింపఁబడిన వృత్తాంతమెల్ల విస్తరించిచెప్పెనని భావము; తదా శ్రమంబునకు వచ్చెనప్పుడనిముందన్వయము.

"అస్రములు." "అస్రమశ్రుణి శోణితే." అమరము.

"అఘవిలసనమ్ము." "దుఃఖాంహోవ్యసనేష్వఘం." అమరము.

**భారత.** అతఁడు=ఇంద్రుఁడు, తనయ=కుమారుని, వర=శ్రేష్ఠమైన, జయాకర్ణనా = విజయము వినుటవలని, సాస్ర = ఆనందబాష్పములతోఁ

గూడిన, నిజాక్షులు=తన నేత్రములు, అనఘవిలసనమ్ము = దుఃఖరాహిత్యము వలనివికాసము, కడుఁ, నిగుడన్ = అతిశయింపఁగా, కుమారుఁడగు నర్జునుని యాజయ వృత్తాంతము వినినంతన యింద్రుని నేత్రముల నానంద బాష్పములుగల్గి, సంతోషమువలని విలాస మభివృద్ధినందెనని భావము; అడిగి యడిగి=సంతోషాతిశయముననా వృత్తాంతము మరల మరల నడిగి, తత్కథిత=అ యర్జునునిచేఁ జెప్పఁబడిన, సభ ఆర్య=సభయందలి పెద్ద వారికి, రామ = మనోజ్ఞమగు, వృత్త= జరిగిన, కార్యుఁడు, యుద్ధకార్యము గలవాఁడగుట, అగుచున్, ఒసఁగెనని యందన్వయము.

తాత్పర్యము సుగమము.

క. తనకారుణ్యము మిక్కిలి
గను దామరగమిఁ దలిర్పఁ ॥ గాఁ గ్రక్కునలే
చినిజాసనార్ధభాగం
బునఁదనయున్న తగభీర ॥ మూర్తి నునుచుచున్. 84

రామాయణ భారతార్థములు సమము.

అర్థము. [రామాయణ.] తనకున్ ఆరుణ్యము = రావణునకెఱ్ఱఁ దనము, [భారత.] తనకారుణ్యము = ఇంద్రునిదయ, మిక్కిలి, కను దామరగమిన్ = తామరలవంటి కన్నులసమూహమున, తలిర్పఁగాన్, గ్రక్కునన్ = తటాలున, లేచి, నిజ=తనయొక్క, ఆసనార్ధభాగంబునన్= ఆసనమునందలి సగముభాగమున, ఉన్నత గభీరమూర్తిన్ = ఉన్నతమై గంభీరమైన శరీ మును, ఉనుచుచున్.

తాత్పర్యము సుగమము.

గీ. దివ్యకోటీరమాహార ॥ తీవ్రశక్తి
యుద్ధసహాయనకునాకీశుఁ ॥ డొసఁగె నీన

రుండు మద్బంధువైరమా ర్యాఢినిర్వ
హించె నెఱవేఱెఁ జెప్పెడి దేమియనుచు. 85

**రామాయణ.** దివ్యకోటీ.....శక్తిన్; దివ్య = దేవతలయొక్క, కోటీ = సమూహముయొక్క, రమా = ఐశ్వర్యమును, హార = అపహరించునట్టి, తీవ్రశక్తిన్ = తీక్ష్ణమగుశక్తిని, అధికశక్తిననుట; యుద్ధసహునకున్ = యుద్ధ మొనర్ప శక్తుఁడగు, నాకున్, రావణున కనుట; ఈశుఁడు = శివుఁడు, ఒసఁగెన్ = ఇచ్చెను, ఈనరుండు = ఈమనుష్యుఁడు, రాముఁడనుట; మద్బంధు వైరము = నా బంధువులతోడిద్వేషమును, ఆరూఢిన్, స్థిరముగా, నిర్వహించెన్ = జరిపెను, నెఱవేఱెన్ = వాని కార్యము పూర్తియాయెను, చెప్పెడిదేమి, అనుచున్ = అనుచు, నాజ్ఞాతులతో నీమనుష్యమాత్రుఁడుద్వేషము పూర్తిచేసికొనెనుగా, ఇఁక నేమి చెప్పుట యని భావము; ఇతఁడిట్లొనర్ప నూరకుండిన శివుని మెప్పువడసి నేఁబొందిన యాశక్తి వృథయేకదా యని యాతఁడు తలఁచెననుట సూచితము.

తాత్పర్యము సుగమము.

భారత. నాకీశుఁడు = దేవేంద్రుఁడు, ఈనరుండు = ఈయర్జునుఁడు, మద్బంధువై = నాకుఁజుట్టమై, రమారూఢిన్ = సంపదయొక్క స్థైర్యమును, నిర్వహించెన్, నెఱవేఱెన్ = నా కార్యము పూర్తియాయెను, అనుచున్, ఆహార తీవ్రశక్తి యుద్ధ సహునకున్ = శివునియొక్క తీవ్రశక్తిగల యాయుద్ధము నోర్చినవానికి, అర్జునున కనుట; దివ్యకోటీరము = దివ్యకిరీటమును, ఒసఁగెన్ = ఇచ్చెను;

"కోటీరము." "కిరీటే, ఇంద్రగోపక్రిమౌ, ఇంద్రచాపె, ఇంద్రే, నకులే." శబ్దార్థకల్పతరువు.

నరనారాయణులలోని నరుఁడర్జునుఁడై జనించు కతమున నాతనికి నరుఁడను పేరుగల్గెను. ఈవిషయము జామదగ్న్యుఁడు సుయోధనునకు

దంభోద్భవ చరిత్రము చెప్పిన సందర్భమున "నరుఁడు సేనఁగూల్చి యాత
నిభంగపెట్టి పట్టివిడిచెనట్టి యమ్మహాత్ములిపుడు పార్థుఁడనఁగఁ, గృష్ణుఁడనఁగ
లీలార్థకలిత జన్మలైరి." అని కలదు. భారతము. ఉద్యోగపర్వము.

సీ. అప్పుడు దనమది యందుఁ దద్విజయ వా
ర్తాశ్రవణంబుచే నశ్రమోత్థ
మగుమన్యుకలనని లాత్మజయమలస
ద్రూపప్రవృత్తిమా ధుర్యమడఁపఁ
ద్వరితభవ్యస్వాంత వర్తనోచితతీర్థ
యాత్రానల్ప తపోమహత్త్వసాధు
సహచరీకృతసింహ శరభశార్దూలకు
మారీచరాతిసు మత్తతరుణ

గీ. హరిణమైరామపర్ణశా లాంచితవన
భూములబెడంగు దృక్పర్వముగ మెలఁగుచుఁ
బ్రబలుమార్తాండసంతతి ప్రభువు మోస
పుచ్చుటకు నంచితా మోదమచ్చుపడఁగ. 86

రామాయణ. అప్పుడు, తనమదియందు = తనమనస్సున, తద్విజయ
వార్తాశ్రవణంబుచేన్ = ఆరాముని జయవార్తయొక్క యాకర్ణనముచేత,
అశ్రమ, ఉత్థమగు = సులభముగాఁగల్గిన, మన్యుకలనన్ = కోపమహిమను,
రాముని విజయవార్త వినఁగనే రావణునకుఁ గోపముగల్గెనని భావము; అశ్ర
మోత్థమన నప్రయత్నముగనే కల్గెననుట; ఇలాత్మజ......మాధుర్యము;
ఇలాత్మజ = సీతయొక్క, అమల = నిర్మలమైన, సద్రూప=మంచి రూపము
యొక్క, ప్రవృత్తి = వార్తయొక్క, మాధుర్యము = పెంపు, అడఁపన్ =
పోఁగొట్టఁగా, రామవిజయము వలనఁగల్గిన కోపము సీతా రూపశ్ర
వణ మాధుర్యమున నణఁగిపోయెనని భావము; త్వరిత=శీఘ్రముగా, భవ్య=

కాఁబోవు, స్వ+అంత వర్తన = నాశవర్తనకు, ఉచిత = తగిన, తీర్థ = సేవకు, యాత్ర = ప్రయాణమును, చల్పి = చేసి, తనకు మరణ మాసన్నము కాఁబోవుచున్నందున నందులకు ద్వారమగు యాత్రయొనర్చెనని భావము; తపోమహత్త్వసాధుః = స్వతపో మాహాత్మ్యమున సాధుత్వమందిన వానిని, తపస్సువలన శాంతత యూతని పూర్వపు క్రౌర్యమునణఁచి సాధుత్వ మలవడఁజేసెనని భావము; సహచరీకృత సింహశరభ శార్దూలకః = సహవాసీకృతములైన, సింగమును, శరభమును, పులిని గలవాఁడు, పైరెండును మారీచునకు విశేషణములు; [శార్దూలకః అని యిటస్వార్థమున కప్ వచ్చెను.] మారీచ రాక్షసుః = మారీచుఁడను రాక్షసుని, మత్తతరుణ హరిణమై=మదించినట్టియు, యౌవనయుక్త మగునట్టియు జింకయై, రామ పర్ణశాలాంచిత భూముల వెండగు=రాముని పర్ణశాల సమీపమున నొప్పుచున్న వన భూముల యందము, దృక్పర్వము కః మెలఁగుచుః = కనులపండువగునట్లు మెలఁగుచు, ప్రబలు = వృద్ధినందుచున్న వానిని, ఇదియును మారీచునికి విశేషణమగును; మార్తాండ సంతతిప్రభుః = సూర్యవంశపు రాజగు రాముని, మోసపుచ్చి, వంచించి, అంచి = అంపి, తాః = రావణుఁడు, మోదము అచ్చుపడఁగః = సంతోష మతిశయింపఁగా, తదాశ్రమంబునకు వచ్చెనని ముందన్వయము.

“ప్రవృత్తి” “వార్తాప్రవృత్తిర్వృత్తాంతః.” అమరము.

“శరభ” ఇదియెనిమిది కాళ్లుగలిగి యూర్ధ్వ నయనమై సింహమును జంపెడి మృగము. “అష్టపాదూర్ధ్వనయనశ్శరభో వనగోచరః.” అని భారతము. “శృణాతిసింహమితి శరభః. శౄహింసాయాం.” గురుబాల ప్రబోధిక.

**భారతి.** అప్పుడు, తనమదియందున్ = తన మనస్సున, ధర్మజుని మనస్సునం దనుట; తద్విజయవార్తా అశ్రవణంబుచేః = ఆ విజయుని (అర్జునుని) వృత్తాంతముయొక్క వినఁబడమిచే, తెలియకుండుటచే ననుట;

అశ్రమ × ఉత్థమగు = తగ్గువడక జనించిన, మన్యుకలన్ = దుఃఖాతిశయముచే, అనిలాత్మజ.....మాధుర్యము; అనిలాత్మజ = భీముని యొక్కయు యమ = కవలయొక్కయు, నకుల సహదేవులయొక్కయు ననుట; లసత్ = ప్రకాశించుచున్న, రూప ప్రవృత్తి మాధుర్యము, అడఁపన్, అర్జునునివార్త దెలియక చింతిలుచునుండు ధర్మజునకు చింతాభరమునఁదన యొద్ద నుండు భీమనకులసహదేవుల సంగర్శన మాధుర్యము గూడఁదగ్గెనని భావము; త్వరిత = తొందర పడుచుండు, భవ్య=శుభమగు, స్వాంతవర్తన= మనోవ్యాపారమునకు, ఉచిత = తగిన, తీర్థయాత్రసల్ప = పుణ్యక్షేత్రయాత్ర యొనర్ప, ధర్మజుఁ డర్జునుని వెదుకవలయునను త్వరాతిశయమున నందులకనువగునట్లు తీర్థయాత్ర సల్పఁబూనెనని భావము; తపోమహత్వ = తపోమహిమచే, సాధు = లెస్సయైనట్లు, సహచరీకృత = సహాయము గాఁజేయఁబడిన, సింహ, శరభ, శార్దూల, కుమారీ = పెంటిపిల్లలయందు, చరాక్ష = తగులుచున్న కన్నులుగల, మిక్కిలి ప్రీతిచేఁ జూచుచున్న వనుట; సుమత్త= మిక్కిలి మదించిన, తరుణ హరిణమై = యౌవనవంతములగు జింకలుగలదై, తపోమాహాత్మ్యమున జింకపిల్లలు భయలేశములేక సింహశరభాదికుమారికల యందు మోహము గలిగియున్నవని భావము; ఇట నుండు జంతువులు పరస్పర వైరముమాని మెలఁగుచున్నవని పిండితార్థము; రామ = మనోహరమగు, పర్ణశాల = మహర్షుల పర్ణశాలలచే, అంచిత = ఒప్పుచున్న, వనభూముల, బెడంగు=అందము, దృక్పర్వముకన్ = కన్నుల పండువు గాఁగా, మెలఁగుచున్, ప్రబలు, మార్తాండ సంతతి ప్రభువున్ = సూర్య పుత్రునకు సంబంధించిన రాజును, యమతనూజుఁడగు ధర్మపుత్రుననుట; లేక ప్రభుశబ్దము పుత్రవాచకముగా నొనర్చికొనినచో యమపుత్రునని యర్థమగును; మోసపుచ్చుటకున్, అంచిత = ఒప్పుచున్న, ఆ మోదము, అచ్చుపడఁగన్; జటుఁడువచ్చెనని ముందరి పద్యముతో నన్వయింప వలయును;

"మన్యుకలన్." "కలాశిల్పే గారవేచ." అమరము.

క. ఘన దర్పోన్మూలిత బహు
మునిజటుఁడను పరమకలుషమూ ర్తియసురకాం
తి నికేతనమై యతిభా
వనియతిఁ బ్రకటించునట్టి వర్ణ్యాకృతితోన్. 87

**రామాయణ.** బహుదర్ప + ఉన్మూలిత, మునిజటుఁడు = మిక్కుటమగు గర్వమునఁబెకలించి పాఱవేయఁబడిన మునుల జడలుగలవాఁడు, గర్వమున మహర్షులకెల్ల హింసగలిగించు వాఁడని భావము; అనుపరమ కలుషమూర్తి = అశాంత పాపాత్ముఁడు, అసుర = రాక్షసుఁడు, రావణుఁడనుట; కాంతినికేతనమై = కాంతికి స్థానమై, యతిభావ= సన్న్యాసిత్వముయొక్క, నియతిన్ = నియమమును, ప్రకటించునట్టి, వర్ణ్య = వర్ణింపఁదగు, ఆకృతితోన్; ముందుపద్యముతో నన్వయము;

తా. నిజ గర్వముచేఁ బెక్కుఋషుల జడలను బెకలించి పాఱవైచిన వాఁడును, అత్యంత పాపాత్ముఁడు నగు రావణుఁడు యతి భావము ప్రకటించు నాకారముతో;

**భారత.** ఘనదర్ప, ఉన్మూలిత బహుముని, జటుఁడను = జటుఁడను పేరుగల, పరమ కలుషమూర్తి = అసుర, కాంతినికేతనమై = కాంతికి స్థానమై, అతి భావనియతిన్=అత్యంతమగు భావనిర్ణయమును, ప్రకటించు నట్టి, వర్ణి = బ్రహ్మచారియొక్క, ఆకృతితోన్; ముందరి పద్యముతో నన్వయము.

తా. దర్పోన్మూలిత మునియగు జటుఁడను పాపాత్ముఁడగునసుర బ్రహ్మచారి రూపముతో; "వర్ణ్యాకృతి." యణాదేశసంధి. "ఇకో యణచి." పాణిని.

వ. తదాశ్రమంబునకు వచ్చునప్పుడు. 88

క. కుతుకంబున మహితనయా
పతిత దనుజవంచన ప్రపంచన మృగధీ
చతురిమము లేక తానా
శ్రితబుద్ధింజూచి యుల్లసిల్లెడు మదిలోన్. 89

**రామాయణ.** కుతుకంబునన్ = కౌతూహలముతో, మహితన యాపతి = రామునియొక్కయు, తదనుజ = అతని తమ్ముఁడగు లక్ష్మణుని యొక్కయు, వంచన ప్రపంచన = వంచించుటను ప్రకటించుచున్న, మృగ ధీచతురిమములు = మృగరూపమగు మారీచునియొక్క బుద్ధిచాతుర్యములు, ఏకతానాశ్రిత = ఏకాగ్రమగు నట్లాశ్రయింపఁబడిన, బుద్ధిన్, చూచి, ఉల్లసిల్లెడుమదిలోన్ = సంతోషించెడు చిత్తముతో; క్షితిజను జేరెనని ముందన్వయము;

తా. రావణుఁడు రామలక్ష్మణుల వంచించుటను ప్రకటించు మృగరూపుఁడగు మారీచుని బుద్ధిచాతుర్యము నేకాగ్ర బుద్ధితోఁగాంచి సంతసించి;

"ప్రపంచన," 'ప్ర' యను నుపసర్గ పూర్వకమగు 'పచవిస్తారే' యనుధాతువునఁ గర్తరి ల్యుడంతము.

"ఏకతా నాశ్రిత" "ఏకతానో నన్యవృత్తిః." అమరము.

**భారత.** కుతుకంబునన్, మహిత... ..చతురిమము; మహిత = శ్రేష్ఠ మైన, నయ = ధర్మమార్గమున, ఆపతిత = వచ్చిన, దనుజ = రాక్షసుని, వంచన = కపటముయొక్క, ప్రపంచన = ప్రతి పాదకతయొక్క, మృగ = తెలియుటలోని, ధీ = బుద్ధియొక్క, చతురిమము = చాతుర్యము, లేక, తమ్ము వంచించుటకు బ్రహ్మచారి వేషముతో వచ్చెననుట దెలియక యని భావము; తాను = ధర్మరాజు, ఆశ్రితబుద్ధిన్ = ఆశ్రితుఁడను బుద్ధిచే, చూచి, ఉల్లసిల్లెడు మదిలోన్; క్షితిజనపతిచేర ననుకూలించెనని ముందరి పద్యమునఁ గర్తయుఁ గ్రియయుఁ గలవు;

తా. ధర్మమార్గమున నుండువానివలె వచ్చిన జటాసురుని యా వంచనాప్రకార మెఱుఁగక యాతఁడాప్తుఁడని ధర్మజుఁడు సంతుష్టబుద్ధితో;

"మృగధీ." "మృగ అన్వేషణే" అనుధాతువుమీఁద అచ్ప్రత్యయాంతము.

క. క్షితిజనపతి సన్నిధియం
దతని మహితవృత్తిఁ జేరననుకూలించెన్
మతియతి విశ్వాస సమ
న్వితగ దృఢతరాఘవసతిఁ నిశిచరుఁడంతన్. 90

**రామాయణ.** క్షితిజన్ = సీతను, అపతిసన్నిధియందున్ = భర్త లేని సమయమునందు, అతనిమ = తగ్గని, హితవృత్తిన్ = మంచివానివలె, చేరన్ = రాఁగా, రాఘవ సతి = రాముని భార్య, మతి = తనబుద్ధి, అతి విశ్వాస సమన్వితకన్ = మిక్కిలి నమ్మకముగలది కాఁగా, దృఢతన్ = ధైర్యముచే, అనుకూలించెన్ = సీతాకృత సత్కారములంద రావణునకనుకూలించెను, అంతన్, నిశిచరుఁడు = రాక్షసుఁడు, రావణుఁడనుట; హరించెనని ముందరి పద్యముతో నన్వయము;

తా. రాముఁడు సమీపమున లేనందున మిక్కిలి మంచివానివలె రావణుఁడు చేరుటచే సీత యత్యంత విశ్వాస సమన్వితకాఁగ నామెవలని సత్కారములంద నాతని కనువయ్యెను; అంతరావణుఁడు;

భారత. మతి = బుద్ధి, ధర్మపుత్రుని బుద్ధియనుట, అతివిశ్వాస సమన్వితకన్, = అధికవిశ్వాసము యుక్తముకాఁగా, ఇది జటాసురుఁడు చేరుటకు హేతువగును; దృఢతర + అఘవసతి = మిక్కుటమగు పాపమునకునికిపట్టగు జటాసురుఁడు, క్షితి జనపతి సన్నిధియందున్ = ధర్మపుత్రుని సమీపమునందు, మహితవృత్తిన్ = అతనిన్, చేరన్, అనుకూలించెన్;

అంతన్ = పిమ్మట, నిశిచరుఁడు = ఆరాక్షసుఁడు. హరించెనని ముందరి పద్యముతో నన్వయము;

తా. ధర్మజుఁడత్యంత విశ్వాస యుక్తుఁడుగా నుండుటచేఁ జాప బుద్ధియగు జటాసురునకు మంచివానివలె నాతనిం జేర ననుకూలించెను. అంత నారక్కసుఁడు;

తరల. గుణవిదూరతసంధిలన్ శ్రుతిఘోరనిష్ఠురదుష్టభా
షణము లాడుచుఁ దద్వసత్యుటజంబుఁ జొచ్చి స్వరూపభీ
షణత నాయమ నందనున్నతశౌర్యవిశ్రుతితో సగ
ర్హణతఁ బట్టి హరించెఁ దత్ప్రియమదాపహారము మున్నుగాన్. 91

**రామాయణ.** గుణవిదూరత సంధిలన్ = సద్గుణదూరత గల్గఁగా, దుర్గుణయుక్తుఁడై యనుట; శ్రుతి........భాషణముల్; శ్రుతి=చెవులకు, ఘోర=క్రూరమైన, నిష్ఠుర = పరుషములైన, దుష్టభాషణముల్ = దుర్భాషలు, ఆడుచున్ = పలుకుచు, తద్వసతి + ఉటజంబు, చొచ్చి = ఆమెయుండు పర్ణశాలం బ్రవేశించి, స్వరూపభీషణతన్ = భీకరమగు తన యాకారముతో, ఆయమన్ = ఆ సీతాదేవిని, అందున్ = అచ్చట, అనున్నత=నీచమగు, శౌర్యవిశ్రుతితోన్ = పరాక్రమప్రసిద్ధ్యముతో, సగర్హణతన్ = నిందతోఁ గూడుటతో, తత్ప్రియమదాపహారము మున్నుగాన్ = ఆమె సంతోషము నపహరించుట ముందు గలుగునట్లుగా, పట్టి హరించెన్ = అపహరించెను.

తా. గుణహీనుఁడగు రావణుఁడు శ్రుతికటువులగు పరుషభాషణము లాడుచు సీతయుండు పర్ణశాలం బ్రవేశించి, తన రూపుంజూపి భీతిలఁ జేసి తన్మూలమున నామె సంతసము నశింపఁగా, నామెం బట్టి హరించెను;

**భారత.** గుణ విదూరత సంధిలన్ = భీముని దూరగతత్వము కలుగఁగా, భీముఁడు చెంతలేకుండఁగాననుట; శ్రుతి ఘోరనిష్ఠుర దుష్ట

భావణముల్, ఆడుచున్, తత్పసతి = ఆధర్మజుఁడుండు, ఉటజంబు, చొచ్చి, స్వరూపభీషణతన్, ఆయమనందనున్ = ఆ ధర్మజుని, నతశౌర్య విశ్రుతితోన్ = అణఁగిన పరాక్రమఖ్యాతితో, కపటముతో ననుట; తత్ప్రమదాపహారము మున్నుగాన్ = అతని భార్యయగు ద్రౌపదీహరణము మున్నుగా, సగర్వాణతన్, పట్టి హరించెన్ = ఆ ధర్మజుం గూడఁ బట్టి హరించెను;

తా. భీముఁడు లేనిసమయమున జటాసురుఁడుటజముచొచ్చి తన రూపము ప్రకటించి క్రూరవాక్యములు పల్కుచు, ద్రౌపది మున్నుగా నా ధర్మజుని హరించెను;

"గుణ విదూరతన్." "గుణః ప్రధానే శబ్దాదౌ మౌర్వ్యాం సూదే వృకోదరే." విశ్వనిఘంటువు

"తద్వసత్యుటజంబు." "సంస్త్యాయ ముటజంధామ." అమరము. తరళలక్షణము. "జలరుహాహితసోదరీముఖచంద్రచంద్రిక లాదటన్, గోలఁదిమీఱఁగ లోచనంబుల గ్రోలి యొప్పుమహాసుఖిన్, బలుకుచో నభరంబులున్ బివపన్ సజంబు జగంబులున్, జెలువుగాఁ దరళంబునోలి రచింతురంధకజిద్ద్యుతిన్." ఛందోదర్పణము.

క. నానాప్రకారదీనవ
చోనిచయము నడపుధర్మసూతినిసతి న
ద్దానవవరుఁ డట్లు నిజ
స్థానమునకుఁ గొనుచు గగనసరణిం జనఁగన్. 92

రామాయణ భారతార్థములు సమము. అర్థ. నానాప్రకార= పెక్కువిధములగు, దీనవచోనిచయము = దీనవాక్యముల సమూహము, నడపు, పెక్కువిధములుగా దీనత్వముతోఁ బల్కుచున్నయని భావము; ధర్మసూతిని, సతిన్, అద్దానవవరుఁడు [రామాయణ. ధర్మమునకుఁ గాగణ

మగు నా సీతాదేవిని. ఆ రావణుఁడు, భారత. ధర్మరాజును ద్రౌపదిని నా జటాసురుఁడు,] అట్లు, నిజస్థానమునకుఁ, కొనుచుఁ = గ్రహించుకొని పోవుచు, గగన సరణిఁ= ఆకాశమార్గమున, చనఁగన్.

తాత్పర్యము సుగమము ;

వ. అదియంతయు విని కోపోద్దీపితుం డగుచు నడ్డంబు పఱతెంచి.

చ. తిరుగుము పోకుపోకుమని తిట్టుచు వాని నెదిర్చి విక్రమో
ద్ధురుఁ డగుచుఁ మహాబలసుతుండపతత్త్రపదోర్జితప్రహా
రరభసభీషణం బగుదురం బొనరించె జటాయువంత నా
నిరుపమబాహుసాహసవినిద్రునిచేత నడంగె నెంతయున్.

రామాయణ. తిరుగుము, పోకు, పోకుము, అని, తిట్టుచుఁ = దూషించుచు, జటాయువు = జటాయువను గ్రద్ద, వానిఁ =ఆ రావణుని, ఎదిర్చి, విక్రమ×ఉద్ధురుఁడగుచుఁ = పరాక్రమమున గొప్పవాఁడగుచు, మహాబల.........భీషణంబగు; మహాబల = మిక్కిలి బలముగల, మిగుల దృఢమగునట్టి; సుతుండ = చక్కని ముఖము యొక్కయు, పక్షులకు ముఖ కార్యములన్నియు ముక్కుతోడ నే జరుగుటచే ముక్కుయొక్క యని భావము; పతత్త్రి = ఱెక్కలయొక్కయు, పద= పాదములయొక్కయు, ఊర్జిత ప్రహార = గొప్పదెబ్బలయొక్క, రభస = వేగముచే, భీషణంబగు = భయంకరమగు, దురంబు = యుద్ధము, ఒనరించెఁ = చేసెను. అంతఁ = పిదప [ఆ జటాయువు] నిరుపమ.........వినిద్రునిచేతఁ ; నిరుపమ = సాటిలేని, బాహుసాహస = భుజబలమున, వినిద్రునిచేతఁ = జాగరూకుఁడగు వానిచే, ఎంతయుఁ = మిక్కిలి, అడంగెఁ = అణఁగెను ;

తా. జటాయువు సీతను హరించుకొని పోవుచున్న రావణునితోఁ దిరుగుము, పోకు, పోకుమని దూషించుచు నతని నెదిర్చి దృఢమగు తన

ముక్కుతోడను, ఱెక్కలతోడను, పాదములతోడను బ్రహరించి భీకర యుద్ధ మొనర్చెను. అతడు బాహు బలశాలియగు రావణునిచే గతబలుఁ డాయెను ;

"సుతుండ." "వక్త్రాస్యేవదనం తుండం." అమరము

"పతత్త్రి." "గరుచ్ఛక్షశ్ఛదఃపత్రం పతత్త్రించ తనూరుహం." అమరము.

భారత. తిరుగును, పోకు, పోకుము, అని, తిట్టుచుక్, వానిక్ = ఆజటాసురుని, ఎదిర్చి, విక్రమోద్ధురుఁడు, అగుచుక్, మహా బలసుతుండు= వాయునందనుఁడు, అపతత్ = జాఱని, త్రప = సిగ్గుగల, సిగ్గును విడువని వనుట ; శౌర్యముగలవని భావమగును; ఇది బాహువులకు విశేషణము; దోర్జిత = బాహువులచే సభ్యసింపఁబడిన, ప్రహార = గ్రుద్దులయొక్క, రభస భీషణంబగు = వేగమున భయంకరమగు, దురంబు, ఒనరించెక్, జటా+ఆయువు = జటాసురునాయువు, అంతక్, నిరుపమ, బాహు సాహస, వినిద్రునిచేతక్ = జాగరూకుఁడగు భీమునిచే, ఎంతయుక్, అడంగెక్ = అణఁగెను. జటాసురునాయువు ముగిసెనని భావము ;

తా. భీముఁడు తిరుగుము పోకు పోకుమని యాజటాసురు నెదిర్చి పిడికిటిదెబ్బలచే యుద్ధమొనర్చెను. అంత నా జటునాయువు ముగిసి యాతఁడు మరణించెను.

"దోర్జిత." "భుజబాహూ ప్రవేష్టోదోః," అమరము.

వ. అక్కాలంబునందు. 95

సీ. తనప్రియ మును వేడ్కకైవెనువు శోభిలఁ గృష్ణ
సారంబు సౌవర్ణసారసమధి
కశ్రీలఁగ్రాల నోకొక్కటి దైవగతిఁజూచి
తాద్మృగబ్జముల కుకొత్కంఠ వెంచి

నలిఁ దదానయనంబునకుఁ బంపఁ దానిఁ జే
యుంగ నబ్బక దానవాంతకుండు
రామభద్రుండు కరంబు దూరంబుగా
నరిగి యంతటను దా మరలుదృష్టి
గీ. కొనరుఁగైకొని పౌలస్త్య ఘననియుక్త
తచ్ఛమూరు దర్ప మడంచి త్రాస చకిత
దారవచ నాగతభ్రాతృదర్శనమున
మానసములోన మోదంబు పూనెనంత. 96

**రామాయణ.** తనప్రియ = తనకాంత యగుసీత, మును = మున్ను, వేడ్కపెనువు శోభిలన్ = వేడుకయతిశయించుచుండఁగా, ఉత్సుకయై యనుట; కృష్ణసారంబు = జింక, సౌవర్ణ సారసమధికశ్రీలన్ = సువర్ణవికారమయి సారవంతమగుటచే మిక్కిలి గొప్పవగుకాంతులచే, క్రాలన్ = ప్రకాశింపఁగా, ఒక్కటి = ఒక్కదానిని, దైవగతిన్ = దైవవశమున, చూచి, తాన్ = సీత, పృగబ్జములకున్ = తామరలవంటి నేత్రములకు, ఉత్కంఠపెంచి = అపేక్షయతిశయించి, మిక్కిలివాంఛ గలిగియనుట; నలిన్ = కోర్కెచే, తదానయనంబునకున్ = దానిందెచ్చుటకు, పంపన్, దానిన్ = ఆసీతయొక్క యపేక్షను, చేయుంగన్ = ఒనర్చుచుండ, అబ్బక = అదిపట్టువడక, దానవాంతకుండు = రాక్షససంహారి, రామభద్రుండు = శ్రీరాముఁడు, కరంబు దూరంబుగాన్ అరిగి = కడుదూరము వెడలి, అంతటను, తాన్, మరలుదృష్టికిన్ ఒనరున్ కైకొని = తిరిగివచ్చెడు ప్రయత్నమున కింపుఁబూని, పౌలస్త్య = రావణునిచే, ఘన = గొప్పగా, పూర్ణముగాననుట; నియుక్త = నియోగింపఁబడిన, నిర్బంధ పూర్వకముగా నియోగింపఁబడినయని భావము; తచ్ఛమూరు = ఆజింకయొక్క, దర్పము, అడంచి = అణఁగించి, సంహరించి యనుట; అంతన్, త్రాస = భయముచే, చకిత = భీతిలిన, దార = భార్యయొక్క, సీతయొక్కయనుట, వచన = మాటచే,

ఆగత = వచ్చిన, భ్రాతృదర్శనమునన్ = సోదరుఁడగు లక్ష్మణుని దర్శ
నమున, మానసములోన్=మనస్సున, ఆమోదఁబు = దుఃఖమును, పూనెన్.
రాముఁడు రానందులకై సీత భీతిలి పలికిన పలుకులచే లక్ష్మణుఁడు రాఁగ
నాతఁడట్లామె నొంటరిగా విడిచివచ్చుటచే రాముఁడెంతయు దుఃఖమునందె
నని భావము ;

కృష్ణసార. " "కృష్ణేన, నీలవర్ణేనసారః, కృష్ణసారః;" గురుబాల
ప్రబోధిక ;

"చమూరు;" "కదలీకందలీ చీనశ్చమూరుప్రియకావపి, సమూరు
శ్చేతిహారిణా అమీ అజినయోనయః." అమరము.

**భారత.** తనప్రియమును, వేడ్కపెంపును = వినోదాతిశయమును,
శోభిలన్ = ప్రకాశింపఁగా, కృష్ణ = ద్రౌపది, సారంబు = శ్రేష్ఠమైన,
సౌవర్ణసారసము = బంగారు తామర, అధికశ్రీలన్, శ్రాలన్, ఒక్కటి,
దైవగతిన్, చూచి; మిక్కిలిసుందరమగు బంగారుతామరయొక్కటి దైవ
యోగమునఁగాన్పింప దానినిజూచి ; తాదృక్ అబ్జములకున్ = అట్టితామ
రలకు, ఉత్కంఠ, పెంచి, నలిన్=వాంఛచే, తదానయనంబునకున్, పంపన్=
భీముని బంపఁగా, దానిన్, చేయంగన్, అబ్బక, దానవాంతకుండు=ఆబకా
సురుంజపిన భీముఁడు, రామభద్రుఁడు = ఒప్పెడి శుభము గలవాఁడు,
కరంబుదూరంబుగాన్, అరిగి, అంతటను, దృష్టికోనరున్ = కంటికింపగు
వానిని, కైకొని, పౌలస్త్య = కుబేరునిచే, ఘననియుక్త = ఘనమానట్లు
గా నియోగింపఁబడిన, తత్ = ఆ, చమూ = సేనయొక్క, ఉరు = గొప్ప
దగు, దర్పము, అడంచి, త్రాసచకిత = జటునిదుశ్చేష్టితమువలనిత్రాస
మున భీతిలిన, దార = భార్యయైనద్రౌపదియొక్క, వచన=మాటలచే,
ఆగత=వచ్చిన, భ్రాతృదర్శనమునన్ = అన్నదమ్ములఁ జూచుటచే, మాన
సములోనన్, మోదంబుపూనెన్ = సంతోషమందెను; అంతన్,

రావణునివలెఁ గుబేరుఁడునుబులస్త్యునిమనుమఁ డగుటచేనీపేరువాని కిని దగియున్నది. "చమూ," "పృతనావాహినీచమూః." అమరము.

క. ముగుద యెఱుంగక పంచినఁ
దగునే యి ట్లేఁగుదేర? తమ్ముఁడ! యౌద్ధ
త్యగరిష్ఠయక్షరక్షో
విగాఢ మీయడవి యిదివివేకము తెఱఁగే? 97

అవతారిక. ఇట రామాయణ పర్యాయమున రాముఁడు లక్ష్మణుని తోడను, భారత పర్యాయమున ధర్మజుఁడు భీముని తోడను బల్కినట్టి పల్కులు జంటింపఁబడియెను. ఇట్టి యిర్వురవాక్యములు శ్లేషాదులచే ద్వ్యర్థకములుగాక యేకార్థకములగు చున్నవి.

రామయణ భారతార్థములు సమము. ముగుద [రామయణ. సీత, భారత. ద్రౌపది] ఎఱుంగకపంచినన్ = తెలియక పంపినను, తమ్ముఁడ [రామాయణ. లక్ష్మణుని సంబోధన, భారత, భీమునందలి వాత్సల్యమునం బిలుచుట,] ఇట్లేఁగుదేరన్ తగునె = ఇట్లు వచ్చుట దగునా, ఈ యడవి, ఔద్ధత్యగరిష్ఠ=మిక్కిలియౌద్ధత్యముగల, యక్ష రక్షః = యక్షుల చేతను, రాక్షసులచేతను, విగాఢము =దట్టమగునది, ఇది=ఇట్లు వచ్చుట, వివేకము తెఱఁగే= తెలివియొక్కవిధమా, ఇదితెలివిగలవాఁడొనర్పవలసినది యాయనుట;

తాత్పర్యము సుగమము,

వ. అనియుతనింబలుకుచు. 98

ఆ. అంతనిజమహాశు గాధిక్యసంప్రాప్తి
శంసి సవ్య సాచి సముపగమ వి
యోజితవ్యథత్వమొదవ నై వస్వత
సంతతి నృపలోక సత్తముండు. 99

**రామాయణ.** అంతర్శుక్, నిజ, మహాశుక్ = గొప్ప శోకము యొక్క, ఆధిక్య=అతిశయముయొక్క, సంప్రాప్తి= పొందుటను, శంసి = తెలుపుచున్న, సవ్య = ఎడమదిక్కునకు, సాచి=అడ్డముగా, సముపగమ= రాకగల, వి = పక్షులచేత, యోజిత = కూర్పఁబడిన, వ్యథత్వము = దుఃఖము గలవాఁడౌట, ఒదవన్ = కలుగఁగా, వైవస్వత సంతతి = సూర్యవంశమునందలి, నృపలోకసత్తముండు = రాజలోకశ్రేష్ఠుఁడు, రాముఁడనుట; తిరిగివచ్చి యని ముందరిపద్యమునకన్వయము ;

తా. అప్పుడు మిక్కిలిదుఃఖము కలుగఁబోయెడినని సూచించుచు నెడమవైపున నడ్డముగాఁ బోవుచున్నపక్షులఁజూచి తన్మూలమున మిక్కిలి దుఃఖించి, రాముఁడు ;

"శుక్," మన్యు శోకౌతు శుక్ స్త్రియాం." అమరము.

**భారత.** అంతర్, నిజమహాశుగాధిక్య సంప్రాప్తి = తనకుగొప్ప యస్త్రశ్రేష్ఠముయొక్క చిక్కుటను, శంసి = తెలుపునట్టి, పాశుపతాస్త్ర సిద్ధివలని మహత్త్వమును దెల్పుచున్న, సవ్యసాచి = అర్జునునియొక్క, సముపగమ = ఆగమనమున, వియోజిత = పోఁగొట్టఁబడిన, వ్యథత్వము, ఒదవన్, దుఃఖముపోవఁగాననుట; నృపకులోత్తముండు, వైవస్వత సంతతి= యమపుత్రుఁడు, ధర్మరాజనుట; మీఁదిపద్యముతో నన్వయము.

తా. అర్జునుఁడు పాశుపతాస్త్రముంబొంది రాఁగ,నతని సమాగమము వలన దుఃఖముదీఱి ; ధర్మజుఁడు

సీ. తిరిగివచ్చి యొకప్డు దీర్ఘకాలాదర్శ
నావస్థఁజెందని యతివశకలి
తాత్రిఁబావనిఁగాన కడవుల వెదకుచు
నంతఁ గానంబడి యాత్మహితత

నెరపుజటాయుర్వి ♦ నేతపదంబుల
  జాడను జనిచని ♦ సకలకాన
నోగ్రజంతుత్రాస ♦ యోజనాయతదోః ప్ర
  భావభీమాంగక ♦ బంధ మర్ద
తే. నాతిదీప్తబలాధిక్యుఁ ♦ డగుచునున్న
దారుణాహితాద్భుతదేహుఁ ♦ దత్ప్రదుష్ట
రూపభరణనిమిత్తర్షి ♦ శాపశంసిఁ
త్రిదశపదవాసిఁ జూచి పార్థివనరుండు. 100

**రామాయణ.** తిరిగివచ్చి = పర్ణశాలకు మరలవచ్చి, ఒకప్డు = ఒకనాఁడు, దీర్ఘకాలాపర్యనావస్థఁ చెందని = చాలకాలము గాన్పింపని యవస్థను చెందకుండినట్టి, అంగనఁ = స్త్రీని, సీతననుట; శకలితార్తిఁ = ఖండింపఁబడిన యార్తిసిగలదానిని, పావనిఁ=పవిత్రమైన దానిని, కానక= పర్ణశాలయందుఁగానక, అడవులఁ, వెదకుచుఁ, అంతఁ, కానఁ పడి=అడవులంబడి, ఆత్మహితతఁ నెరపు=వీరికి హితమునెరపునట్టి, జటాయుర్వినేత= జటాయువనుపక్షీశ్వరుని, పదంబులజాడను=వచనసరణిని, చనిచని, సకల... బలాధిక్యుఁడు; సకలకానన=అన్నియడవులనుండు, జంతు = జంతువులకు, త్రాస=భయమునుగల్గించు, యోజనఆయత=యోజనమువఱకువిస్తారితములైన, దోఃప్రభావ = బాహువులప్రభావమున, భీమాంగ=భయంకరాంగమునుగల, కబంధుని, మర్దన = మర్దించుటచే, అతిదీప్త=మిక్కిలి ప్రకాశించుచుండు, బలాధిక్యుఁడు అగుచుఁ = మిక్కుటమగు బలముగలవాఁడగుచు, ఉన్న, దారుణ + అహిత + అద్భుతదేహుఁ = ఘోరమై, అద్భుతమై, అహితమైన దేహముగలవానిని, తత్ప్రదుష్టరూపభరణ = ఆదుష్టరూపముండుటకు, నిమిత్త=కారణమగు, ఋషిశాప, శంసిఁ = తెలుపుచున్నవానిని, త్రిదశపదవాసిఁ = స్వర్గలోకవాసిని, చూచి, పార్థివవరుండు=రాజశ్రేష్ఠుఁడు, రాముఁడనుట; మీఁది పద్యముతో నన్వయము.

" దుష్టరూపభరణత్వ నిమిత్తర్షిశాప." దనువు క్రౌర్యమున, వికృతాకారమునంది, స్థూలశిరుఁడను మహర్షి నిసమీపించి యాతని హింసింపఁ బోవనతఁడు నీయీవికృతాకారము స్థిరముగానుండునని శపించెనని పురాణగాథ.

భారత. తిరిగివచ్చి, ఒకప్డు, దీర్ఘకాల అదర్శనావస్థన్ చెందన్ = చాలకాలము గాన్పింపనట్టియవస్థను జెందఁగా, భీముఁడు చాలసేపుదాఁక రాకతడయఁగాననుట; నియతివశ=దైవవశమున, కలితార్తిన్, పావనిన్ = భీముని,కానక,అడవులన్,వెదకుచున్,అంతన్, కానంబడి=ఆత్మహితతన్= తమకమేలుకల్గుటను, నెరపు=కల్గించు, జటxఆయుర్వినేతపదంబులజాడను= జటుని యాయువునుపోఁగొట్టిన భీముని యడుగుల జాడ , చని చని = పోయి పోయి, సకల......బలాధిక్యుఁడు;సకల = సమస్తమైన, కానన = అడవియందుండు, ఉగ్రజంతు= క్రూరజంతువులను, త్రాస = భయమును, యోజన = పుట్టించుటయందు, ఆయత = విస్తారమైన, దోఃప్రభావ = బాహుబలముయొక్క మహిమచే, భీమాంగక = భీముని శరీరము యొక్క, బంధ = బంధించుటయందును, మర్దన = పీడించుట యందును, అతిదీప్తబలాధిక్యుఁడు, అగుచున్, దారుణ = భయంకరమైన, అహితా = సర్పత్వమువలని, అద్భుతదేహున్ = ఆశ్చర్యమగు దేహము గలవానిని, తత్, ప్రదుష్ట రూపభరణ నిమిత్త = అట్టిదుష్టరూపము భరించుటకు. కారణమగు, ఋషిశాపశంసిన్ = ఋషిశాపముందెల్పెడి, త్రిదశపదవాసిన్=చూచి,పార్థివవరుండు = ధర్మరాజు;

" దుష్టరూపకరణనిమిత్తర్షిశాపశంసిన్ " పూర్వము ఇంద్రుని స్థానమునకు శతమఖుఁడైననహుషుఁడు వచ్చి,గర్వమున శచింగూడఁదలఁచి సప్తర్షులంబిల్చి మీరునాకు శచీగృహమునకరుగుటకుఁ బల్లకి మోయవలయు ననఁగావారట్లేయొనర్చుచుండ శచీదర్శనత్వరతన్నుప్రేరేపింపఋషులంబిల్చి 'సర్పసర్ప' [పరువెత్తు పరువెత్తు] అనియాడ నందగస్త్యుఁడుకోపాతిశయమున 'సర్పో భవ' [సర్పముగమ్ము] అని శాపముపెట్టెనని పురాణగాథ.

తే. అతని పూర్వనామాదికఁ బడిగి వినుచు
సరవితోడఁ దచ్ఛాపమోచన నిమిత్త
ములగుప్రశ్నోత్తరములు పొల్పలరఁ బ్రీతి
జరిపెఁ గృతకృత్యత నతండు సనియె దివికి. 101

రామాయణభారతార్థములుసమము. అర్థము. అతని=[రామా యణ- ఆకబంధునియొక్క, భారత, ఆయజగరముయొక్క,]పూర్వనామాదికము=శాపముగల్గుటకుమున్నున్న పేరు మొదలగు వానిని, అడిగి, వినుచున్, సరవితోడన్=వరుసతో, క్రమముగాననుట; తచ్ఛాపమోచననిమిత్తములగు ప్రశ్నోత్తరములు = [రామాయణ. వానిశాపము పోవుటకుఁ గారణములగు సంభాషణములు, భారత. అతనిశాపము పోవుటకుఁ గారణమగు నాతని ప్రశ్నలును వానియుత్తరములును,] పొల్పలరన్-పొలుపొందునట్లు, ప్రీతిన్ జరిపెన్, అతండు = [రామాయణ. దనువు, భారత, నహుషుఁడు,] కృతకృత్యతన్, ధన్యతతో, దివికిన్ = స్వర్గమునకు, చనియెన్ = వెళ్లెను.

తాత్పర్యము సుగమము.

క. వనదేవత లర్చించిరి
పనుపడఁదచ్ఛాపమోక్షపరిమోచితభీ
మునిజననుతు నానృపనం
దనుని శుభానిలతఁ జలలతాకుసుమములన్. 102

రామాయణ భారతార్థములు సమము. అర్థము, తత్ = [రామాయణ. ఆదనువుయొక్క, భారత. ఆ నహుషునియొక్క, శాపమోక్ష పరిమోచిత = శాపమోక్షముచే విడిపింపఁబడిన [రామాయణ] భీ = భయముగల, మునిజననుతున్ = మహర్షి జనులచే నుతింపఁబడినవానిని, [భారత.] భీమునిన్ = భీమసేనుని, జననుతున్ జనులచేఁ బొగడఁబడినవానిని, ఆనృపనందనుని = [రామాయణ-ఆరాముని

భారత. ఆధర్మజుని,] శుభానిలతః = చక్కని గాలికలుగుటచే, చలలతాకుసుమములః = కదలుచున్నతీవెలయందలిపూలను, పనుపడః = ఒప్పునట్లు, వనదేవతలు, అర్చించిరి. వనదేవతలు పూలవానగురిపించిరని భావము.

తాత్పర్యము సుగమము-

వ. ఇవ్విధంబునః. 103

తే. అడవులఁ జరించు నాభవ్యునరయవచ్చె
నంతటను శివ తేజోమయస్వరూపుఁ
డై వెలయుహరి యాత్మేశుఁ డనుపమహిత
బుద్ధివర్తన మెంతయుఁ బొల్పుమీఱ. 104

**రామాయణ.** అంతటను = ఆవల, అడవులః చరించు ఆభవ్యుః = అడవులందిరుగుచుండు భవ్యుఁడగు నారాముని, శివ తేజోమయ స్వరూపుఁడై-శివుని తేజఃప్రాచుర్యముతోఁ గూడిన స్వరూపముగలవాఁడై, వెలయు = ప్రకాశించు, ఆహరి = ఆవానరుఁడు, హనుమంతుఁడనుట; ఆత్మేశుఁడు = తనకు రాజగుసుగ్రీవుఁడు, అనుపః, మహిత = శ్రేష్ఠమైన, బుద్ధివర్తనము= బుద్ధిచాతుర్యము, ఎంతయుః = మిక్కిలి, పొల్పుమీఱః = ఒప్పారఁగా, అరయవచ్చెః,

తాత్పర్యము సుగమము.

హనుమంతుఁడు శివుని తేజమున జనించెననుటకు; "పవనుండా శివవీర్యము, జవమునఁగొని గౌతమాత్మజాకరపుటమందు వసింపఁజేసె నపుడా, జవరాలదిఫలమనికొని, చయ్యనమ్రింగెః. అదిమొదలుగ గౌతమసుత, కుపరం బభివృద్ధినొందె." విచిత్రరామాయణము. బాలకాండము.

**భారత.** అంతటః = పిమ్మట, అడవులః, చరించు, ఆభవ్యుః = భవ్యుఁడగు నాధర్మజుని, శివ = మంగళకరమైన, తేజోమయ = కాంతి

ప్రచురమగు, స్వరూపుఁడై, వెలయు, హరి = విష్ణువు, కృష్ణుఁడనుట; అనుపమ = సాటిలేని, హితబుద్ధి = హితమైనబుద్ధియొక్క, వర్తనము = ఉనికి, ఎంతయుఁన్, పొల్పుమీఱన్, అరయన్ = విచారింప, వచ్చెన్,

తాత్పర ము సుగమము.

క. వచ్చి యఁగురీతి దర్శన
మిచ్చి తదీయమగువృత్తి మెల్లవినియెఁ దాఁ
జెచ్చెరఁ గుశలప్రశ్న స
ముచ్చారణపూర్వకముగ నుచితప్రౌఢిన్. 105

రామాయణ భారతార్థములు సమము. అర్థము. వచ్చి=[రామాయణ. హనుమంతుఁడువచ్చి, భారత = కృష్ణుఁడువచ్చి,] తగురీతిన్ = యుక్తప్రకారము, దర్శనమిచ్చి, తాన్, చెచ్చెరన్ = శీఘ్రముగా, కుశలప్రశ్నసముచ్చారణ పూర్వకముగన్ = కుశలప్రశ్నమడుగుట మున్నుగా, గల్గునట్లు, ఉచితప్రౌఢిన్, తగిన ప్రౌఢిమతోడ, తదీయమగు [రామాయణ = రాముననుసంబంధించిన, భారత = పాండవులకు సంబంధించిన] వృత్తము ఎల్లన్ = వృత్తాంతమంతయును, వినియెన్.

తాత్పర్యము సుగమము.

క, విని తనదువృత్తమంతయు
వినిపించి పరస్పరార్హవిధి నిష్టాలా
పనిరూఢిజరుగ నపుడా
తనిమది మాట బడిఁ దెలిసి తనమదిలోనన్. 106

రామాయణ భారతార్థములు సమము. అర్థము. విని,[రామాయణ. హనుమంతుఁడు విని, భారత. కృష్ణుఁడు విని,] తనదువృత్తము అంతయున్, వినిపించి, పరస్పర అర్హవిధిన్ = ఒండొరులకుఁ దగులాగున, ఇష్ట ఆలాపనిరూఢిజరుగన్ = ఇష్టమగు పల్కులాడుకొను

చుండఁగా, అపుడు, ఆతనిమది = అతనిబుద్ధి, మాటలబడిన్ = మాటల వెంబడి, తెలిసి, తనమదిలోనన్.

తాత్పర్యము సుగమము.

చ. అనిమిషరాట్తనూభవ భుజాతిశయ ప్రతికార నిత్యచిం
తను రవినందనుం దనకు నచ్చినబంటుగ నేలి తత్ప్రియం
బనయము సల్పుచున్ ప్రబలు నాత్మరిపుం దుదిఁ దా జయింపఁ జా
లననుమతిన్ భజించుట యలంఘ్యత నీతనియందుఁ దోఁచెడున్.

**రామాయణ.** అనిమిష.........చింతను, అనిమిషరాట్ = దేవేంద్రునియొక్క, తనూభవ = కుమారుఁడగువాలియొక్క, భుజాతిశయ = బాహుబలాధిక్యమునకు, ప్రతికార = బదులుచేయుటయందలి, నిత్య చింతను = ఎల్లప్పుడు చింతించుటచే, రవినందనున్ = సూర్యపుత్రుని, తనకున్, రామునకనుట; నచ్చినబంటుగన్, ఏలి, తత్ప్రియంబు = ఆ సుగ్రీవునకుప్రియము, అనయము = ఎల్లప్పుడు, సల్పుచున్ = చేయుచు, ప్రబలున్ = మిక్కిలిబలవంతుఁడగు, ఆత్మరిపున్ = తనశత్రువగు రావణుని, తుదిన్ = కడను, తాన్ = రాముఁడు, జయింపన్, చాలన్ = మిక్కిలి, అనుమతిన్ = అనుసరించిన చిత్తముతో, భజించుట = పొందుట, అలం ఘ్యతన్ = అనివార్యముగా, ఈతనియందున్ = ఈ రామునియందు, తోఁచెడున్ = తోఁచును;

తా. వాలిభుజాబలమునకు బదులు సేయఁ జింతించెడి సుగ్రీవునిం దనకు నచ్చినబంటుగా నొనర్చుకొని అతని కెల్లప్పుడు ప్రియము చేయుచుఁ, దుదను దనశత్రువగు రావణుని, జయింపఁ దాను సుగ్రీవునిపొందుట తప్పదని తోఁచెడిని.

**భారత.** అనిమిష.........చింతను, అనిమిషరాట్ = దేవేంద్రుని, తనూభవ = కుమారుఁడగు నర్జునుని, భుజాతిశయ ప్రతికార్యచింతను, రవి

నందనుఁ = సూర్యపుత్రుఁడగుకర్ణుని, తనకుఁ, దుర్యోధనునకనుట ; నచ్చినబంటుగఁ, ఏలి, తత్ప్రియంబు = ఆకర్ణునకుఁ బ్రియము, అనయము, చలువుచుఁ, ప్రబలు, ఆత్మరిపుఁ = తనశత్రువగు దుర్యోధనుని, తుదిఁ తాఁ జయింపఁజాలఁ = కడను తాను జయింపఁజాలను, అనుమతిఁ = అనెడిబుద్ధిచే, అలంఘ్యుతఁ, తనను భజించుట, ఈతనియందుఁ=ఈధర్మజునియందు, తోఁచెడుఁ.

తా. అర్జునునిబాహుబలమునకు బదులుసేయుచింతచేఁ గర్ణునకు సదాప్రియముసేయుచున్న దుర్యోధనుని జయింపవలయునని నన్ను భజింపవలయుననుబుద్ధి ధర్మజునందుఁగలదని తోఁచెడిని ;

వ. అని యూహించి యతనితోడ. 108

మ. నలువొప్పన్పవమానసూతియనియె న్నందన్మనస్స్థైర్యభం
గులు భావింపఁగ భూవరప్రవరమీకున్మాకువర్ధిల్లు ని
శ్చల సౌహార్ద విశేషవర్తన లిఁకం జర్చింపఁగా నెట్టిశ
త్రులనుంద్రుంచుటయెంతకార్యమనిచేతోవృత్తిఁదర్కించెదన్.

రామాయణ. నలువొప్పఁ = అందమొప్పఁగా, పవమానసూతి = వాయునందనుఁడగు హనుమంతుఁడు, అనియెఁ = ఇట్లుచెప్పెను, భూవరప్రవర = ఓరాజశ్రేష్ఠా! ఇది రామునిసంబోధన, నందత్............ భంగులు; నందత్=సంతోషించు, మనః = మనస్సునందలి, స్థైర్య = స్థిరత్వముయొక్క, భంగులు = రీతులు, భావింపఁగఁ = ఆలోచింపఁగా, మీకుఁ, మాకును, నిశ్చలసౌహార్ద విశేషవర్తనలు = స్థిరమగు స్నేహవర్తనలు, వర్ధిలుఁ = వృద్ధిపొందును, ఇఁకఁ, చర్చింపఁగాఁ = విచారింపఁగా, ఎట్టిశత్రులనుఁ = ఏలాటిశత్రువులను, త్రుంచుట ఎంతకార్యము అని = సంహరించుట ఎంతటికార్యమని, చేతోవృత్తిఁ = మనస్సునని కిచే, తర్కించెదఁ = ఊహించెదను ;

తా. హనుమంతుఁడు రామునితో నిట్లనెను. మీమనస్థైర్యరీతు లరసిం పఁగా మీకునుమాకును స్నేహము వర్ధిల్లును, ఎంతటిశత్రుల నేనింద్రుంచుట యెంతటికార్యమని నా మానసమున నూహించెదను ;

భారత. నలువొప్పన్, పవమానసూతి = భీమునియొక్క, అని = యుద్ధము, ఎన్నన్ =తలంపఁగా, తత్ = ఆభీముని, మనఃస్థైర్యభంగులు, భావింపఁగన్ భూవరప్రవర = ఓధర్మరాజా, మీకున్, మాకున్, నిశ్చల సౌహార్ద విశేషవర్తనలు, వర్ధిలున్, ఇఁకన్, చర్చింపఁగా=విచారింపఁగా, ఎట్టిశత్రులనున్ త్రుంచుట, ఎంతకార్యము, అని, చేతోవృత్తిన్, తర్కించెదన్ = ఊహించెదను,

తా. కృష్ణుఁడు ధర్మజునితో నిట్లనెను. ఓధర్మజుఁడా భీముని యుద్ధమును మనస్థైర్యముందలంప మీకుమాకును స్నేహము వర్ధిలును. ఇంక నెట్టి శత్రువులైనను సంహరించుటయెంతపనియని మనమునఁదర్కించెదను ;

మ. ఇటుమున్నుర్వరఁబర్వుచున్న విజయోదీర్ణప్రతాపాద్భుతో
త్కటవార్తల్ రిపుకోటికిం బిడుగులై గర్జిల్లెడున్నీకు నెం
తటివాఁడైన నెదిర్చి ప్రాణములతోఁ దాఁ గ్రమ్మఱన్నేమి ప్ర
స్ఫుటమో భూపయరాతిచేష్టలు భవదోర్దండభంగపర్యంతముల్.

రామాయణ. ఓభూప = ఓరాజా, రాముఁడాయనుట ; ఇటు, మున్నున్ = పూర్వమును, ఉర్వరన్ = భూమియందు, పర్వుచున్న = వ్యాపించుచున్న, విజయ...... .....వార్తల్ ; విజయ = విజయములవలని, ఉదీర్ణప్రతాప = గొప్ప పరాక్రమముయొక్క, అద్భుత ఉత్కటవార్తల్ =ఆశ్చర్యకరములగు నతిశయ వృత్తాంతములు, తాటకా సంహారము మొదలు కబంధసంహారమువఱకునుండు విజయవార్తలనుట ; రిపుకోటికిన్ = శత్రుసమూహమునకు, రావణాదులకనుట; పిడుగులై = పిడు

గులతో సమానములై, గర్జిల్లెడుఁ = గర్జనచేయుచున్నవి, నీకుఁ, ఎంతటివాఁడైనఁ, ఎదిర్చి=ఎదిరించి, నిన్నెంతటివాఁడైనను నెదిరించియనిభావము; [నీకుఁ అని ద్వితీయార్థమునషష్ఠి] ప్రాణములతోఁ దాఁ గ్రమ్మఱఁ లేమి = ప్రాణములతోఁదాను తిరిగిచనలేకుండుట, ప్రస్ఫుటము=స్పష్టము, నిన్నెదిరించినవాఁడు ప్రాణముతో మరలలేఁడనుట స్పష్టమని భావము; అరాతిచేష్టలు = శత్రుచేష్టలు = భవత్ భ్రూభఙ్గపర్యంతముల్ = నీయొక్క కనుబొమలు కదల్చునంతవఱకుండునవే, నీవు క్రోధమున భ్రూభంగము గావించిన నీశత్రువుయొక్క చేష్ట లుడుగునని భావము.

తా. నీయసమానపరాక్రమవార్తలు శత్రువులకుఁ బిడుగులవలె వినవచ్చుచున్నవి. ఎంతటివాఁడైనను నిన్నెదిరించి ప్రాణములతో మరలలేఁడనుట స్పష్టము. నీవు క్రోధమున భ్రూభంగముగావించిన, నీ శత్రువుల చేష్టలుడుగును.

"ఉర్వర" "ఉర్వరాసర్వసస్యాఢ్యా" అమరము.

".అరాతిచేష్టలు భవద్భ్రూభఙ్గపర్యంతము" లని కారణప్రసక్తి మాత్రముననే కార్యోత్పత్తిం దెల్పుటచేఁ జపలాతిశయోక్త్యలంకారము.

లక్షణము. "చపలాతిశయోక్తిస్తు కార్యే హేతు ప్రసక్తిజే." చంద్రాలోకము.

**భారత.** ఓభూప = ఓధర్మరాజా, ఇటు, మున్ను = పూర్వము, ఉర్వరఁ, పర్వుచున్న, విజయ = అర్జునుని, ఉదీర్ణప్రతాప+అస్ఖత+ఉత్కట, వార్తల్=వృత్తాంతములు, రిపుకోటికిఁ, దుర్యోధనాదులకనుట; పిడుగులై, గర్జిల్లెడుఁ, నీకుఁ, ఎంతటివాఁడైనఁ, ఎదిర్చి, ప్రాణములతోఁ, తాఁ, క్రమ్మరఁ, లేమి, ప్రస్ఫుటము = స్పష్టము, ధర్మసూతిమెత్తనిపులియనుటయెఱుఁగక వారుత్రుళ్లిపడుచున్నారుగాని. నీవెదుర్కుదిరిగిన వారెంత మాత్రము! ఇదిసుస్పష్టమనిభావము ; అరాతిచేష్టలు భవద్భ్రూభంగ పర్యంతముల్ = నీశత్రువుల చేష్టలు నీవుక్రోధమునబొమముడి వేయువఱకు

నుండునవియే యగును; లేక, భవద్భ్రూభంగపర్యంతములే = నీకనుబొమల సైఁగనాజ్ఞ యొసఁగుపర్యంతములు, నీవించుక సైఁగ చేసినవెంటనే భీముఁ డొకవైపు గదాప్రహారములచేతను, నర్జునుఁ డస్త్రప్రహారములచేతను, నకుల సహదేవులును శస్త్రప్రహారములచేతను, తత్క్షణమున శత్రువుల సంహరింతురని భావము.

తా. విజయునివిజయవార్తలు శత్రువులయొద్దఁ బిడుగువలె గర్జిల్లుచున్నవి. నిన్నెట్టివాఁ డెదిర్చినను బాణములతో మరల లేఁడనుట విస్పష్టము, నీ శత్రువుల చేష్టలెల్ల నీ భ్రూభంగపర్యంతములే యగును.

క. అనిపలికి యంత రవిన
న్దనచింతాభార నిరసనని మిత్తములై
తనరారెడువాక్యము లా
యన పలుక న్వినుచు నలరె నజ్జనవిభుఁడున్. 111

రామాయణ భారతార్థములు సమము. అర్థము. అని, పలికి, అంతన్, రవినన్దన = [రామాయణ. సుగ్రీవుని, భారత. కర్ణుని,] చింతాభార, నిరసన = పోఁగొట్టుటకు, నిమిత్తములై = కారణములై, తనరారెడు = ఒప్పెడు, వాక్యములు, ఆయనవలనన్ [రామాయణ. హనుమంతునివలన, భారత. కృష్ణునివలన,] వినుచున్, అజ్జనవిభుఁడున్ [రామాయణ. రాముఁడు, భారత. ధర్మరాజు,] అలరెన్ = సంతోషించెను.

తాత్పర్యము సుగమము ;

చ. మనమలరారఁగాఁ దనరు మామాధవు న్మైత్రికి యుక్తమైనప
ల్కనయఁగఁ బల్కి వీడ్కొలిపి యాహనుమంతుఘనార్యధర్మవ
ర్తనభృశ ఖిన్నునన్నుఁగడు రంజిలఁ జేసెనితండు వచ్చియి
ట్లనుఁగుఁ దనంబుసూపు నెయ మంటనుఁ దదుత్సుకతం బ్రవర్తిలెన్.

**రామాయణ.** మనము = మనస్సు, అలరారఁగాన్ = సంతసింపఁగా, తన, రుమాధవు మైత్రికిన్ = రుమయొక్క భర్తయగు సుగ్రీవుని చెలిమికి, యుక్తమైన పల్కు = తగినమాట, ఎనయఁగన్ = తగునట్లు, పల్కి, వీడ్కొలిపి = అంపి, ఈ హనుమంతు ఘన + ఆర్యవర్తన = ఈ హనుమంతుని గొప్ప న్యాయవర్తనము, భృశఖిన్నున్ నన్నున్ = మిక్కిలి దుఃఖించుచున్న నన్ను, కడున్ రంజిలన్ చేసెన్ = మిక్కిలి రంజింపఁ జేసెను, ఇతండు = ఈ హనుమంతుఁడు, వచ్చి, ఇట్లు, అనుఁగుఁదనంబున్ = ప్రియకరత్వగుణము, చూపునె = చూపునా, ఇచ్చటి యవధారణ మాశ్చర్యార్థకము; అటంచున్, తత్ = ఆ హనుమంతునియందు, ఉత్సుకతన్ = వేడ్కచే, ప్రవర్తిలెన్ ;

తా. మది కానంద మొదవులాగున సుగ్రీవునిస్నేహమున కనువగు మాటలాడి హనుమంతుని వీడ్కొల్పి " ఈతని శ్రేష్ఠమగు న్యాయవర్తనము మిక్కిలి దుఃఖితుఁడగు నన్నుంగూడ రంజిలఁజేసెను. ఇట్లు ప్రియమును జూపుట ను లోకమునఁ గలదే" యని యా హనుమంతు నెడల వేడ్కతో నా రాముఁడు ప్రవర్తిలెను.

**భారత.** మనము, అలరారఁగన్, తనరు, మాధవున్ = కృష్ణుని, మైత్రికిన్, యుక్తమైనపల్కు, ఎనయఁగన్, పల్కి = ఆడి, వీడ్కొలిపి, ఈహాను = కోర్కిచే, మంతున్ = కోపముచేతను, ఘన, అరి = శత్రువుయొక్క, దుర్యోధనునియొక్క యనుట; అధర్మవర్తనన్, భృశఖిన్నున్ = మిక్కిలి దుఃఖించిన, నన్నున్, ఇతండు = ఈ కృష్ణుఁడు, వచ్చి, కడున్, రంజిలన్, చేసెను, ఇట్లు, అనుఁగుఁదనంబు, చూపునె, అటంచున్, తత్ = ఆ కృష్ణు నందుఁగల, ఉత్సుకతన్, ప్రవర్తిలెన్.

తా. మనస్సునకు సంతస మొదవున ట్లాకృష్ణుని పల్కులకుఁదగు మాటలాడి యాతని నంపివైచి, కోర్కిచేతను, గోపముచేతను దుర్యోధనుని యకార్యప్రవర్తనమున ఖిన్నుఁడయిన నన్నితఁడువచ్చి కంజిలఁజేసెను,

ఇట్లు ప్రియయుచూపునే యంచు నాతనియెడ నుత్సుకుఁడై ధర్మజుఁ డుండెను.

తే. అంతటను భవ్య నవ్యసఖ్యప్రకటన
భృశసుఖిత కర్ణ శకునవాగ్వశగుఁడగుచు
వాలితమ్ముఁడు నిజకార్యవర్తనలకుఁ
గడుఁ బ్రధానమంత్రిస్థితి నడుపుచుండ. 113

**రామాయణ.** అంతటను, భవ్య............వశగుఁడు; భవ్య = కాఁదగిన, నవ్య = నూత్నమైన, సఖ్య = మైత్రినిగూర్చి, ప్రకటన = తెలుపుటచే, భృశ = మిక్కిలి, సుఖిత = సుఖింపఁబడిన, కర్ణ = చెవులుగల, శకుని = పక్షులయొక్క, వాక్ = శబ్దములకు, వశగుఁడు = వశమైనవాఁడు, అగుచున్, వాలితమ్ముఁడు = సుగ్రీవుఁడు, నిజకార్య ప్రవర్తనలకున్ = ఆత్మ కార్యాచరణములకు, ప్రధానమంత్రిస్థితిన్ = ప్రధానమంత్రులతో నాలోచించు స్థితిని, నడుపుచుండఁగ్ = జరుపు చుండఁగా.

తా. సుగ్రీవుఁడు రామమైత్రిం దెల్పు పక్షినాదమునం దాదరముగల వాఁడై స్వకార్యా చరణమునకై మంత్రులతోడ నాలోచించుచుండఁగా.

**భారత.** అంతటను, భవ్య, నవ్య = పొగడఁదగిన, సఖ్యప్రకటన, సుఖిత, కర్ణ =కర్ణునియొక్కయు, శకుని=శకునియొక్కయు, వాగ్వశగుఁడు, అగుచున్, దుర్యోధనుఁడను కర్తముంపరి పద్యమునుండి తెచ్చి కొనవలయును; వాలి = మిాఱి, తమ్ముఁడు=దుశ్శాసనుఁడు, నిజకార్యవర్తనలకున్= ఆత్మ కార్యాచరణములకు, ప్రధాన మంత్రిస్థితిన్=ప్రధాన మంత్రిగానుండుటను, నడుపుచుండఁగ్ = జరుపుచుండఁగా;

తా. దుర్యోధనుఁడు నిజస్నేహ ప్రకటనచేఁ గర్ణశకునుల మాటలకు వశుఁడైమిాఱి తన తమ్ముఁడగు దుశ్శాసనుఁ డాత్మకార్యా చరణములకుఁ బ్రధానమంత్రి యగుచుండ;

"నవ్య" "ణస్తుతౌ" అను ధాతువునుండి కల్గుటచే నుతింపఁదగిన యని యర్థమగుచున్నది.

"వాగ్వశుఁడు." "కచటతపలకు అచ్చులుపరమైన; వర్గప్రథమద్వితీయాక్షరములకంటెను, శషసవర్ణములకంటెను నన్యములైన హల్లులు పరమైనను గజడదబలు క్రమముగా నగును." అస్మదీయమగు నాంధ్ర విజ్ఞానచంద్రిక.

సీ. ఎలమిఁబొంగుచు మహాశబలసంతతి సమగ్ర
సంభ్రమ మొప్పఁగఁ జని వినిశ్చ
లతరాఘవేశుఁ డుద్ధతహృదయారి దు
ర్యోధనుండుగళత్ర యుతుఁడు ననుజ
యుతుఁడునై నిజనితాంతోజ్జ్వల తేజోమ
హాస్ఫూర్తి భీమనరాదుల నుఃి
కింపఁ దదాస్పదీకృత వనంబులఁ బ్రవ
ర్తిలుచుండు నతని దేవులఁ జెఱయును

తే. దారుణార్తి చెందుటయు నాధర్మసూతి
తద్వియుక్తికై తమ్ము లసద్విధినల
రించి యప్పుడు ఘనయశశ్శ్రీలనేల
వచ్చుటయు యుక్తమగుటయు వరుసఁ దెలిపె. 114

**రామాయణ.** మహాబల సంతతి = వాయు పుత్రుఁడు, హనుమంతుఁ డనుట; సమగ్రసంభ్రమము=పూర్ణ సంభ్రమము; ఒప్పఁగఁ, చని=సుగ్రీవు నొద్దకువెళ్లి, ఇంక హనుమంతుఁడాడెడు మాట; రాఘవేశుఁడు = రాముఁడు, ఉద్ధత.........దుర్యోధనుండు; ఉద్ధతహృదయ= ఔద్ధత్య యుక్తమగు చిత్తముగల, అరి=శత్రువులచే, దుర్యోధనుండు = దుఃఖముతో యుద్ధము

చేయఁదగిన వాఁడు, యుద్ధము సల్ప శక్యముగాని వాఁడనుట; కళత్రయు తుఁడు = భార్యాయుక్తుఁడు, అనుజయుతుఁడునై = తమ్మునితోఁగూడిన వాఁడునై; సీతాలక్ష్మణ సహితుఁడనుట; ఇవి రాఘవేశుఁడను దానికి విశేష ణములు; నిజ..............స్ఫూర్తి; నిజ = తనయొక్క, నితాంత = మిక్కిలి, ఉజ్జ్వల = ప్రకాశించు, తేజః=తేజముయొక్క, మహాస్ఫూర్తి = గొప్ప స్ఫూర్తి, భీమ = భయంకరులగు, నరాదులన్ = రాక్షసులను, ఉడికింపన్ = ఓడించునట్లుగా, తదాస్పదీకృతవనంబులన్ = వారికి స్థాన ముగా నొనర్పఁబడిన యడవుల, నిశ్చలతన్ = మిక్కిలి నిశ్చలత్వముతో, ప్రవర్తిలుచుండన్ = వసించుచుండఁగా, అతని దేవులన్ = అతని భార్యను, సీతననుట; ఇటబహువచనము పూజార్థమున వచ్చినది; చెఱయను, దారు ణార్తి=క్రూరమగుబాధ, చెందుటయున్=పొందుటయును, సీతకు రావణుని చేఁజెఱ యనుభయంకరార్తి కలుగఁగాననుట; అధర్మనూతి = అధర్మమున కునికిపట్టగువాఁడు, రాముఁడనుట; తద్విముక్తికై =ఆ చెఱయందుండు బాధ దొలఁగుటకొఱకు, తమ్ములన్=తమను, సుగ్రీవాదులననుట; ఒనన్, విధిన్ = ప్రకాశింపు విధముగా, అలరించి= సంతోషింపఁజేసి, అప్పుడు, ఘనయశ శ్శ్రీలన్= గొప్పకీర్తిచేత, ఏలవచ్చుటయున్ = రక్షింప వచ్చుటయు, యుక్తమగుటయు=తగిన దగుటయు, ఎలమిన్, పొంగుచున్=సంతోషము ననుభవించుచును, వరుసన్, తెలిపెను.

**భారత.** ఎలమిన్, పొంగుచున్, మహా.........సంభ్రమము; మహా బల=గొప్పసేనయొక్క, సంతతి= సమూహముచే, సమగ్ర సంభ్రమము = పూర్ణ సంభ్రమము, ఒప్పఁగన్, చని=వెడలి, వినిశ్చలతర=మిక్కిలిస్థిరము లైన, అఘవేశుఁడు=పాపముల ప్రవేశముగలవాఁడు, ఉద్ధత, హృదయారి= అంతశ్శత్రువులను గలవాఁడు, దుర్యోధనుండు, కళత్రయుతుఁడు = భార్యల తోఁగూడినవాఁడు, అనుజయుతుఁడునై = తమ్ములతోఁ గూడిన వాఁడునై, నిజ=తనయొక్క, నితాంత, తేజః, మహాస్ఫూర్తిన్, భీమనరాదులన్=భీమ

సేనుఁడు, అర్జునుఁడు మున్నగు వారిని, ఉడికింపన్ = దుఃఖింపఁజేయుటకై, తదాస్పదీకృత = ఆ పాండవులచే స్థానముగాఁ జేసికొనఁబడిన, వనంబులన్ = ప్రవర్తిలుచుండన్, అతనిన్ = దుర్యోధనుని, దేవులన్ = అతని యంతఃపుర కాంతావర్గమును, చెఱ, అను, దారుణార్తి, చెందుటయున్ = పొందఁగాన్, అధర్మసూతి = అధర్మజుఁడు, తద్విముక్తికై = వారి చెఱవిడిపించుటకై, తమ్ములన్ = సోదరులను, సద్విధిన్ = మంచి హితోపదేశాది విధులచే, అలరించి, అప్పుడు, ఘన యశశ్శ్రీలన్ = గొప్పకీర్తి సంపదను, ఏలవచ్చుటయున్ = పాలింపనరుగుటయును, శత్రువుల యాపద దీర్చుటచేఁ గీర్తి కలుగుటయు నని భావము; యుక్తమగుటయున్ = శరణాగత రక్షణము యుక్తమగుటయును, వరుసన్ = క్రమముగా, తెలిపెన్.

వ. తెల్పి యిట్లనియె. 115

మ. మునుతత్పార్థివుచేసినట్టి చరితంబుల్ రాక్షసోద్ధత్యఖం
డన పాండిత్యధురంధరంబు లవియెన్నంబెక్కు తాదృక్ప్రవ
ర్తను కార్యంబునకిట్టివేళ మనకార్యప్రస్తుతత్వంబెల
ర్పనొగింగూడుకొనంగఁగల్గుటమహాభాగ్యంబుగాకల్పమే.

**రామాయణ.** ఇదియును హనుమంతుని మాటయే. మును తత్పార్థివు చేసినట్టి చరితంబుల్ = పూర్వము రాముఁడొనర్చిన కార్యములు, రాక్షసోద్ధత్య = రాక్షసులయుద్ధతత్వముయొక్క, ఖండనపాండిత్య ధురంధరంబుల్ = ఖండింపఁజేయుట యందలి సామర్థ్య ధౌరేయతలు, అవి ఎన్నన్ పెక్కు = అవి గణింపసాధ్యము గానివనుట; తాదృక్ ప్రవర్తను కార్యంబునకున్ = అట్టి ప్రవర్తనముగల రామునికార్యమునకు, సీతాన్వేషణ కార్యమునకని భావము, కార్యముతోననుట; [ఇటఁదృతీయార్థమున షష్ఠి] ఇట్టివేళన్ = అతఁడేమన యొద్దకువచ్చిన తరుణమున, మనకార్య ప్రస్తుతత్వంబు = మనకార్యముయొక్క ప్రసక్తి, వాలివధరూపకార్య ప్రసక్తియనిభావము; ఎలర్పన్ =

ఒప్పునట్లు, ఒకో=క్రమముగా, కూడుకొనంగఁ గల్గుట=కూడుకొనులాగునఁ గల్గుట, మహాభాగ్యంబుగాక=గొప్పభాగ్యముగాక, అల్పమే=సామాన్యమా?

తా. మున్ను రాముఁడొనర్చిన ఘనకార్యములుండెను, రాక్షసుల యుక్కడఁగించుటయును లెన్నశక్యముగానివి; అట్టి రామునియొక్క సీతాన్వేషణ కార్యమునకు మనపనియగు వాలివధరూపకార్యముం జంటించి యేర్పఱచుట మన యదృష్టమే కాని యన్యముగాదు.

భారత. మును, తత్పార్థివు చేసినట్టి చరితంబుల్ = ఆ దుర్యోధనుఁడాచరించిన యట్టికార్యములు, రాక్షసౌద్ధత్య ఖండన పాండిత్య ధురంధరంబులు= రాక్షసుల యుద్ధతి నతిక్రమించిన సామర్థ్య భారము వహించినవి, రాక్షసుల కృత్యములకంటె మించినవనుట; అవి, ఎన్నఁగ, లెక్క, తాదృక్ ప్రవర్తను = అట్టి దుష్కార్యప్రవర్తకుఁడగు దుర్యోధనుని యొక్క, కార్యంబునకుఁ = రక్షణరూపకార్యమునకు, ఇట్టివేళఁ = ఈ తరుణమున, మనకుఁ, ఆర్యప్రస్తుతత్వంబు = ఆర్యులనెడి ప్రఖ్యాతి, గొప్పవారనెడి ప్రసిద్ధియనుట; ఎలర్పఁ, శత్రువునుగూడ రక్షించెడి వీరెంతటి గొప్పవారోయను ప్రజలలోఁగల్గు ప్రసిద్ధియని భావము; ఒకో, కూడుకొనంగఁ, కల్గుట, మహాభాగ్యంబుగాక, అల్పమే.

తా. దుర్యోధనుఁడు గావించిన కృత్యములు రాక్షసకృత్యముల మీఱినవనుట నిశ్చయము. అవి లెక్కింప శక్యముగానివి. అయినను అట్టివాఁడాపదలో నుండునప్పుడు రక్షింపవలయుట భావ్యము. దీన గొప్పవారమను ఖ్యాతిగలుగును. మనకిట్టి ప్రఖ్యాతిగల్గుట యదృష్టముగాని సామాన్యమా.

తే. అని యనుపమానదోర్బలశ్రీఘనతఁ జేసి
యొకఁడయా చెఱవిడిపింప నోపు సమర
శూరుఁ డాదిత్యకులరాజసూనుఁ డేమి
చెప్పనయిదోడుప్రాపు సుస్థిరతఁ దనర. 117

**రామాయణ.** అనుపమాన దోర్బలఘనతన్ = సాటిలేని బాహుబలముచలని గొప్పతనమున, అసమశూరుఁడు = సాటిలేని శూరుఁడు, ఆదిత్యకుల రాజసూనుఁడు = సూర్యవంశ రాజపుత్రుఁడు, రాముఁడనుట, అని = యుద్ధము, ఒకఁడ చేసి = ఒక్కఁడేయొనర్చి, అచెఱ విడిపింప నోపును = సీతయొక్క యాచెఱ విడిపింప సమర్థుఁడు, (అట్లుండఁగా) సయిదోడు ప్రాపు=సోదరుఁడగు లక్ష్మణుని సహాయము, సుస్థిరతన్ తనరన్=స్థిరముగ నుండఁగా, ఏమిచెప్పన్ = ఏమని చెప్పఁగును? వేఱ చెప్పవలయునా యనుట;

తా. రాముఁ డొక్కఁడే యుద్ధమొనర్చి సీత చెఱవిడిపింపఁ గలఁడు. అట్లుండ నింక లక్ష్మణసహాయమునుండ వేఱ చెప్పవలయునా. ఇట నర్థాపత్త్యలంకారము.

**భారత.** అని = ధర్మజుఁ డీలాగునఁ జెప్పి, అనుపన్ = పంపఁగా, మానదోర్బల ఘనతన్ చేసి = ధైర్యబాహుబలముల గొప్పవాఁ డగుటచే, ఒకఁడ, ఆచెఱ = ఆ దుర్యోధనునిచెఱ, విడిపింపనోపు సమరశూరుఁడు = విడిపింప సమర్థుఁడగు యుద్ధశూరుఁడగు, ఆదిత్యకుల = దేవసమూహమునకు, రాజ = నాయకుఁడగు నింద్రునియొక్క, సూనుఁడు = కుమారుఁడగు నర్జునుఁడు, సయిదోడుప్రాపు = సోదరుఁడగు భీమునిసాయము, సుస్థిరతన్, తనరన్, ఏమిచెప్పన్, విడిపించెనని ముందుపద్యమునన్వయము.

తా. ధర్మరాజట్లానతిచ్చి యనుప నర్జునుఁడు ధైర్యబాహుబలసమగ్రతచేఁ దానొక్కఁడయా చెఱవిడిపింప సమర్థుండయ్యును సోదరుఁడగు భీముని ప్రాపుగాంచఁగ నింక నాతని యుద్ధవిహారము విషయము వేఱ చెప్పఁగలయునా?

"ఘనతఁజేసి." ఇటఁ జేతయను తృతీయావిభక్త్యర్థమునఁ జేసి యనుప్రయుక్తమాయెను.

శా. దుర్వారస్వచమూఘన ధ్వజమరుద్ధూతాభ్రతిగ్మాంశుగం
ధర్వున్ దర్పితుఁ జిత్రసేనుఁ ఖరునిన్ దండించి విడ్పించె హృ
ద్గర్వాసాధుసుయోధనున్ నిజభుజౌద్ధత్యప్రథల్ దిక్కులం
బర్వంగా సకలత్రసోదరపరిప్రాప్తవ్యథాసంగమున్. 118

**రామాయణ.** దుర్వార ......... గంధర్వున్; దుర్వార = అడ్డగించుట కశక్యమగు, స్వ = తనయొక్క, ఖరునియొక్కయనుట; చమూ = సేనయందలి, ఘన = గొప్పదగు, ధ్వజమరుత్ = ధ్వజముల వలన జనించినగాలిచే, ధూత = ఎగురఁ గొట్టఁబడిన, అభ్ర = ఆకాశము నందలి, తిగ్మాంశు = సూర్యునియొక్క, గంధర్వున్ = గుఱ్ఱములు గల వానిని, దర్పితున్ = గర్వితుఁడగువానిని, చిత్రసేనున్ = చిత్రమైన సేన గలవానిని, ఖరునిన్ = ఖరుఁడను నసురుని, దండించి = శిక్షించి, సంహ రించియనుట; హృద్గర్వ.........యోధనుల్; హృద్గర్వ = హృదయము నందలిగర్వముచే, అసాధు = దుష్టులయిన, సుయోధ = గొప్పయుద్ధవీరు లను, నుత్, = విరియఁగొట్టెడి, నిజ = తనయొక్క, రామునియొక్క యనుట; భుజ = బాహువులయొక్క, ఔద్ధత్యప్రథల్ = గొప్పదనము యొక్క ప్రఖ్యాతులు, నిజబాహుబల ప్రఖ్యాతియనుట; దిక్కులన్ = పర్వఁగాన్ = దిగంతవ్యాప్తముకాఁగా, సకల = సమస్తమైన, [ఇటలళ లకభేదమగుటచే సకలయనుఁది సకళయనియాయెను.] త్రస = ప్రాణుల యొక్క, ఉదర = కడుపునందు, పరిప్రాప్త = కలిగిన, వ్యథాసంగముల్ = దుఃఖసంగములు, విడ్పించెన్ = పీఁడునట్లొనర్చెను.

తా. దుర్వారమగు నిజసేనలోని ధ్వజవాయువుచే నాకాశము నందలి సూర్యునిగుఱ్ఱముల నెగురఁగొట్టువాఁడును, గర్వితుఁడగువాఁడును, జిత్రమగు సేనలుగలవాఁడును నగుఖరుని సంహరించి, గర్వాంధులగుభటుల విరియఁగొట్టెడి భుజబలము దిగంతవ్యాప్తముకాఁగ ఖరుఁడుచచ్చెనని ప్రాణి వర్గములకుఁదెలిసెను. తన్మూలమునవారి గర్భములనున్నవ్యథలు తీర్చెను.

ఇట ముద్దరాజు రామన్న; "సకళత్రసోదర = కళత్రసోదరుల యందు, పరిప్రాప్త = పొందిన, వ్యధయొక్క, అసంగముఁ = పొందమిని విడిపించెను, ఖరునిఁజంపి వానిసోదర కళత్రాదులసంతోషమును బోఁగొట్టె ననుట;" అని యొకయర్థమును గల్పించెఁగాని యయ్యది యంతస్వారస్యముగు నదికాదు. రామాయణమున "జనస్థానేహతస్థానే" యనిచెప్పియుండ నిఁక సోదరాదుల ప్రసక్తికిస్థలమెటఁగలదు. మఱియు "వ్యధ+అసంగముఁ" అనుట గాఢప్రాణాయామమునవలెఁ దలఁచుట్టివచ్చినట్లు స్పష్టముగఁ గోచరించెడిని. ఇట్టిక్లిష్టప్రయోగము కవ్యాశయముగాఁ జాలదనుట యీతని కవిత్వము నారసినవారెల్లం గ్రహింపవచ్చును. లళలయభేదము తెచ్చుకొనుటకుఁ బ్రాలుమారి యిట్టియర్థాంతరమాశ్రయించెడు గావించెను. "అసాధు యోధనుత్" "షదప్రేరణేయను ధాతువుయొక్క కృదంతము.

"సకలత్రప." "త్రసలింగంచలాచరే." అమరము.

**భారత.** దుర్వార, స్వ = తనయొక్క, చిత్రసేనుఁడనెడి గంధర్వుని యొక్కయనుట; చమూ, ఘన, ధ్వజ, మరుత్, ఘాత, అభ్ర, తిగ్మాంశుఁ = సూర్యునిగల వానిని, ఈతనిధ్వజము బు సూర్యమండలము వఱకు వ్యాపించి యటనుండు సూర్యునెగురఁ గొట్టుచున్నవని భావము; గంధర్వుఁ = గంధర్వుఁడగువానిని, దర్పితుఁ = గర్వితుఁడగువానిని, చిత్రసేనుఁ = చిత్రసేనాఖ్యుని, ఖరునిఁ = క్రూరుఁడగువానిని, ఇది చిత్రసేనునకు విశేషణము; దండించి = శిక్షించి, హృద్గర్వాసాధుఁ = మనోగర్వముననసాధువగు వానిని, కళత్రసోదర పరిప్రాప్తవ్యధాసంగముఁ = భార్యతోడఁ దమ్మునితోడను బొందఁబడిన దుఃఖసంగముగల వానిని, సుయోధనుఁ = దుర్యోధనుని, నిజ = తనయొక్క, అర్జునుని యొక్కయనుట; భుజ + ఔద్ధత్యప్రథల్, దిక్కుల్, పర్వంగాఁ, విడిపించెఁ = విడిపించెను.

తా.॥ అర్జునుఁడు స్వసేనాధ్వజములచే, సూర్యునెగురఁ గొట్టుచు నాకసమున నిలువలేనట్లు సేయుచుండుచిత్రసేన గంధర్వునిశిక్షించి సోదర కళత్రసహితముగా సంప్రాప్తవ్యధుఁడగు దుష్టసుయోధనుని విడిపించెను.

"ఘనధ్వజమరుద్ధూతాభ్రతిగ్మాంశుక్ " ఇట నసంబంధమున సంబంధరూపమగు నతిశయోక్త్యలంకారము.

సీ. అతనిమహితబలో ॥ దగ్రత్వమునవాలి
క్రొవ్విననతనయసంకోచితమగు
మహిమఁబేర్చినవాఁడు ॥ మను జేశవర్యుఁడూ
ర్జితశాసనప్రౌఢి ॥ సింధురాజు
తద్భార్యయొకనాఁడు ॥ దళసాలనొంటిను
న్నపుడుగోరికు చేష్ట ॥ నాక్రమించి
ఘనమనోవిభ్రాంతి ॥ గాకవయోరూప
ధారణంబునమించు ॥ దానవుండు

తే. ద్దానవానిమిషావార్య ॥ తన్మహాశు
గానలజ్వాల వెనుకొనఁ ॥ గానటవిని
వర్తనకునొండుగతిలేక ॥ వందురుచును
గావుననార్యుు! నన్నేలు ! ॥ కరుణననుచు. 119

**రామాయణ.** అతని = ఆరాముని, మహిత = శ్రేష్ఠమైన, బల + ఉదగ్రత్వమునన్ = బలాతిశయమున, ఇనతనయ = సూర్యపుత్రుఁడా, సుగ్రీవుఁడాయనుట ; వాలిక్రొవ్వు = వాలియొక్కగర్వము, సంకోచిత మగున్ = అణఁగును, మహిమన్ పేర్చినవాఁడు = మహాత్మ్యమున గొప్ప వాఁడైనవాఁడు, మనుజేశ్వరుఁడు = రాజశ్రేష్ఠుఁడు, రాముఁడనుట; ఊర్జిత శాసన ప్రౌఢిసింధురాజు = దృఢమగు శాసించుటయొక్క ప్రాగల్భ్యము

నందు సముద్రునివంటివాఁడు, ఒకనాఁడు = ఒకదినమున, దళశాలన్ = పర్ణశాలయందు, ఒంటినున్నప్పుడు=ఒంటరిగానున్నప్పుడు, తద్భార్యన్ = అతనిభార్యను, సీతననుట; గోరికుచేష్టన్ = నఖములయొక్క దుశ్చేష్టచే, ఆక్రమించి = చీరి, ఘనమనోవిభ్రాంతి = గొప్పదగు చిత్తవిభ్రమముగలవాఁడు, కాకవయోరూపధారణంబునన్ = కాకియను పక్షిరూపముదాల్చుటచే, మించుదానవుండు = మించుచున్నయసుర, కాకాసురుఁడనుట; దానవ........జ్వాలన్ ; దానవ = అసురులచేతను, అనిమిష=దేవతలచేతను ; అవార్య = అడ్డగింపరాని, తత్=ఆరాముని, మహాశుగానలజ్వాల, వెనుకొనంగాన్ = వెన్నంటంగా, అటన్ = అప్పుట, వివర్తనమున్ = నివర్తింపఁజేయుటను, ఒండుగతిలేక = వేఱుదిక్కులేక, వందురుచును = విచారపడుమను, రామ = రాముఁడా, నన్ కావుము = నన్నురక్షింపుము, కరుణన్ నన్నేలుము = దయచే నన్ను బాలింపుము, అనుచున్ ; శరణాగతుఁడయ్యెనని ముందన్వయముగలదు.

తా. సుగ్రీవా! ఆరామునిబలమున వాలి నశింపఁగలఁడు. ఆరాముఁడు, అత్యంత మహిమగలవాఁడు, రాజశ్రేష్ఠుఁడు, పృథుశక్తి ప్రౌఢియుక్తుఁడు, అట్టివానిభార్య సీతయొకనాఁడు పర్ణశాలనొంటినుండఁగా కాకాసురుఁడు, గోరిచేగీరనంత నాగ్రహించిన రాముఁడమోఘమగునస్త్రమేయ నదిజ్వలించుచు వెనుకొన దానినాఁపువారెవరును లేనందున రామునే రక్షింపుమనుచు. ఊర్జితశాసనప్రౌఢినాధారము గావించుకొని సముద్రసామ్యము చెప్పుట సరికాదని కొందఱభిప్రాయపడెదరుగాని ఊర్జితశాసనప్రౌఢి యనెడిరత్నములకు రత్నాకరుఁడని కవి యాశయమగును. ఇది మనుజేశ్వరుఁడనుదానికి విశేషణము; వాలిక్రొవ్వు సంకోచితమగుట కిది హేతువగును; రాముఁడూర్జితశాసనప్రౌఢి సింధురాజగుటచే వాలిక్రొవ్వు సంకోచితమగునని భావము; సంఅనునుపసర్గ పూర్వకమగు కుంచధాతువువలని కర్మణి క్త ప్రత్యయము.

"ఇనతనయ." "ఇనో భగో ధామనిధిః." అమరము.

"కాకవయోరూప." "ఖగ బాల్యాదినోర్వయః." అమరము.

కాకవయోరూపధారణంబునమించు దానవుండని కవియాడుటలో దానవశబ్దమసురపర్యాయముగ నెత్తికొనె నంతియకాని దనువంశసంభూతుఁడని యర్థముకాదు. కాకాసురుఁడని యాతనికీయసుర నామ మాసుర కార్యమాచరించుటచేఁ గలిగినదికాని యాసురజాతిసంభూతుఁడుకాఁడని యెఱుఁగనగును. ఏలన? రామాయణమున; పుత్రఃకిల స శక్రస్య వాయసః పతతాంవరః." అని వాల్మీకియాడెను. గోవిందరాజీయవ్యాఖ్యాతయు, "ఇంద్రపుత్రత్వేన ప్రసిద్ధోజయంతఏవ వాయసరూపేణాగత ఇత్యాహుః. వాయసరూపోన్యః పుత్రఇత్యప్యాహుః." అని నొడివెను. ఉభయథాపి మనకీతఁడసురుఁడుగాఁడనుట సుస్పష్టమగుచున్నది.

**భారత.** అతనిమ = తగ్గని, హితబలో దగ్రత్వమునన్ = హితమగు బలముచేఁగల్గిన గొప్పదనమున, వాలి = మీఱి, క్రొవ్విన, తన = సైంధవునియొక్క యనుట; అసంకోచితమగు, మహిమన్, పేర్చినవాఁడు = అతిశయించినవాఁడు, మనుజేశవర్యుఁడు = రాజశ్రేష్ఠుఁడు, ఊర్జిత = దృఢమైన, శాసన = శిక్షావిధియొక్క, ప్రౌఢిమగలవాఁడు, సింధురాజు = సైంధవుఁడు, తద్భార్యన్ =వారిభార్యను, పాండవుల భార్యయగు ద్రౌపదిననుట; ఒకనాఁడు, దళశాలన్, ఒంటినున్నపుడు, కోరి=అబిడం గామించి, కుచేష్టన్ =కుచ్ఛితచేష్టచే, ఆక్రమించి, ఇంక సైంధవుఁడు ద్రౌపదితోననెడి మాట; ఘనమనోవిభ్రాంతిగాక=దట్టమగు మనోవిభ్రమముగాని, వయోరూప ధారణంబునన్ = వయస్సుయొక్కయు, రూపముయొక్కయు ధరించుట యందు, మించుదానవు=అతిశయించుదానవు, నిమిషావార్యతన్ =నిమిషమేని వారింప శక్యముకానిదైన, తత్ =ఆ, మహాశుక్ =గొప్పదుఃఖమనెడి, అనల జ్వాల=అగ్నిజ్వాల, వెనుకొనంగాన్, అటవిని = అడవియందు, ఒండుగతి లేక=వేఱుదిక్కులేక, వందురుచును, ఉండుదానవా = వసించెదవా, కావు

నన్=కాఁబట్టి, రామ = ఓయింతీ, ద్రౌపదీయనుట; కరుణన్=దయచే, నన్నేలుము = నన్నుపాలింపుము, అనుచున్. ముందుపద్యముతో నన్వయము.

తా. మహాబలాఢ్యతచేఁ గ్రొవ్విన రాజశ్రేష్ఠుఁడగు సైంధవుఁ డొకనాఁడు ద్రౌపది పర్ణశాల నొంటినుండ నామెను మోహించి కుత్సితచేష్టలు చేయ నుపక్రమించుచుఁ, "జక్కనివయస్సును రూపమును గలదానవు, నిమిష మేనివారింపఁదగని గొప్ప దుఃఖములు వెనుకొన వేఱుగతిలేక యేటవిని వందురుచు నున్నదానవా? కావుననో ద్రౌపదీ! నన్నేలుము, దయచే నన్నుఁ బాలింపుము;" అనుచు;

సీ. అసమాస్త్రశిఖిని దయాదృష్టి నార్చి హృ
త్తాప మెల్లనుదీఱఁ దన్ను మనుచు
నాథులు లేమి నెంతయుఁ బ్రేలుచును సాధ్వ
సమ్మతిపిక్రుతో క్తి ముమ్మరముగ
శరణాగతుం డను సరగునఁ దద్రామ
ఘనఘృణార్ణవమున మునుఁగఁ బట్టి
కొనిపోయె నాత్మీయతనువును మగుడ నా
వింటిబల్మిఁ బరిభవించి త్రిప్పఁ

ఆ. గలఁడె భీముఁడైన బలభేదిసుతుఁడైన
నితరుఁడైనవీరుఁ డెవ్వఁడైన
నని కడంక నమ్మహాబలాన్వితుఁడు రా
జన్యవరుఁడు యాత్ర సలుపునపుడు. 120

రామాయణ. అసమాస్త్రశిఖిని = సాటిలేని బాణాగ్నిని, దయాదృష్టిన్ = కృపావర్షముచే, ఆర్చి, హృత్తాపము ఎల్లను తీఱన్ = మనస్సునందలితాపమెల్లను దీఱునట్లు, తన్నున్ మనుచు=తన్నురక్షించు,

సాధులు, లేమిన్, ఎంతయున్ = మిక్కిలి, ప్రేలుచున్, అతివిక్రి తోక్తిన్ = మిక్కిలి వికారమగుమాటలచే, అత్యంతదైన్యమునంగల్గినవిక్రి తోక్తులచేతనుట; సాధ్వసమ్ము= భయము, ముమ్మరముముగన్=ఉద్రేకింపఁ గా, దైన్యాతిశయమునఁ గల్గినవిక్రితోక్తిచేభయముద్రేకించినట్లు గాన రాఁగనని భావము; శరణాగతుండయి = శరణుపొందిన వాఁడయి, సరగునన్ = శీఘ్రముగా, తద్రామ.........అర్ణవమునన్ = తత్ = ఆ, రామ = రాముని, ఘన = గొప్పదగు, ఘృణార్ణవమునన్ = కారుణ్య సముద్రమున, మునుఁగన్ పట్టి = మునుఁగుటవలన, (ఆకాకాసురుఁడు) ఆత్మీయ=తనయొక్క, తనువున్ = శరీరమును, మగుడన్ కొనిపోయెన్ = మరలఁబొందెను, రామునికరుణగల్గిం బ్రదుకుదెరువుగాంచెనని భావము; అమ్మహాబలాన్వితుఁడు = మిక్కిలి బలముతోఁగూడిన యాతఁడు, రాజన్య వరుఁడు = రాజశ్రేష్ఠుఁడు, రాముఁడనుట; అనికడంకన్ = యుద్ధప్రయ త్నమున, యాత్రసేయునపుడు = యాత్రసలుపునప్పుడు, యుద్ధయాత్ర సేయునపుడనుట; భీముఁడైన=భయంకరుఁడైన, ఆబలభేది సుతుఁడైనన్ = ఆయింద్రపుత్రుఁడగు వాలియైనను, ఇతరుఁడైన, వీరుఁడు = పరాక్రమ వంతుఁడు, ఎవ్వఁడైనన్, ఆవింటిబల్మిన్ = ఆరామునిధనుర్బలమును, పరి భవించి=అవమానించి, తిరస్కరించియుననుట; త్రిప్పఁగలఁడే=ఆధనుర్బల మును ద్రిప్పఁజాలునా, "తన్నమనుచునా ఘులులేమిన్.........శరణా గతుండయి" ఇవ్విషయమునకు, "సపిత్రాచపరిత్యక్తస్సురైశ్చసమహర్షిభిః। త్రీన్ లోకాన్ సంపరిక్రమ్య రాఘవంశరణంగతః" అనువాల్మీకి వచనమే ప్రమాణము.

"సాధ్వసమ్ము." "భీతిర్భీస్సాధ్వసంభయం- "అమరము.

**భారతము.** అసమాస్త్రశిఖిని = మన్మథాగ్నిని, దయావృష్టిన్ = కృపావర్షమున, ఆర్చి, హృత్తాపమెల్లను, తీఱన్, తన్నుము = పాదతాడన మొనర్పుము, అనుచున్=సైంధవుఁడిట్లాడుచును, పాదతాడనము శృంగార

రసమునకుఁ బరాకాష్ఠయగును; అనుచున్, నాథులు లేమిన్ = భర్తలగు పాండవులు లేమిని, ఎంతయున్, ప్రేలుచును, సాధు + అసమ్మతి=సత్పురుషులకుసమ్మతి లేని, వికృతోక్తి = వికారపుమాటలు, ముమ్మరముగన్ = ఉద్రేకింపఁగా, శరణాగతుండయి = గృహాగతుండయి, సరగునన్, తద్రామన్ = ఆస్త్రీని, ద్రౌపదిననుట; ఘృణార్ణవమునన్ = జుగుప్సయనెడి సముద్రమున, మునుఁగన్ = మునుఁగునట్లు, పట్టికొనిపోయెన్ = గ్రహించికొని వెళ్లెను, ఇదిమొదలు సైంధవుఁడాడెడు పలుకులు; నావింటిబల్మిన్, పరిభవించి, = అవమానించి, అణఁచియనుట; భీముఁడైనన్ = భీమసేనుఁడైనను, బలభేదిసుతుఁడైనన్ = ఇంద్రపుత్రుఁ డగునర్జునుఁడైనను, ఇతరుఁడైన వీరుఁడు ఎవ్వఁడైనన్ = తక్కినధర్మజనకులసహదేవులలో నెవ్వఁడైనను, ఆత్మీయతనువును=తనస్త్రీని, ద్రౌపదిననుట; కడంకన్, మగుడన్-త్రిప్పఁగలఁడే=మరలఁద్రిప్పుకొనిరాఁగల్గునా, పాండవులలో నేరేని నన్నెదిర్చి ద్రౌపదిని దీసికొనిపోఁగల్గుదురే యనిభావము; అని, అమ్మహాబలాన్వితుఁడు, రాజన్యవరుఁడు = రాజశ్రేష్ఠుఁడు, సైంధవుఁడనుట; యాత్ర, సల్పునపుడు = ప్రయాణమొనర్చుచుండఁగానపుడు; ముందుపద్యముతో నన్వయము;

"తన్నుమనుచు;" పాదతాడనము శృంగారపరాకాష్ఠయగుటకు; "సాలక్తకేన నవపల్లవకోమలేన పాదేన నూపురవతామదలాలసేన, యస్తాడ్యతే దయితయా ప్రణయాపరాధాత్ సోఽంగీకృతో భగవతా మకరధ్వజేన;" అమరుకము.

"శరణాగతుండయి" "శరణంగృహరక్షిత్రోః" అమరము.

"ఆత్మీయతనువును." "బహ్వాదిభ్యశ్చ" అనుసూత్రమున "ఏభ్యోవాఙీష్స్యాత్ బహ్వీబహుః," అనివార్తికకారుఁడువివరించినచొప్పున,తన్వీ తనుః. అని ఙీష్పుయొక్క వికల్పమున రూపద్వయ మునుగలదని యెఱుంగునది."సాధ్వసమ్మతి" "యణాదేశసంధి. ఇకోయణచి" పాణిని.

క. అనివారితవ్యథాసం
జననంబగు రామవార్త నె స్వజనము చెప్పన్
విని సంభ్రమ మొదవఁగఁ జ
య్యనవాసుగ్రీవ కపి హితాధికచింతన్. 121

**రామాయణ.** అని, వారితవ్యథాసంజననంబు అగు = నివారింపఁబడిన దుఃఖముయొక్క పుట్టువుగల, రామవార్త = రాముని వృత్తాంతము, స్వజనము = తనజనము, హనుమంతుఁడనుట; చెప్పన్ = చెప్పఁగా, విని= ఆలకించి, సంభ్రమము ఒదవఁగన్ = ఆశ్చర్యము గలుగఁగా, చయ్యనన్ = శీఘ్రముగా, ఆ సుగ్రీవకపి = సుగ్రీవుఁడను నా వానరుఁడు, హితాధిక చింతన్ = హితమునం దధికమగు చింతగలవాఁడై, అరిగియనిముందు పద్యముతో నన్వయము;

తాత్పర్యము సుగమము.

**భారత.** అనివారిత=అడ్డగింపరాని, వ్యథాసంజననంబగు=దుఃఖమును గలిగించునట్టి, రామవార్త = ద్రౌపదీ వృత్తాంతము, స్వజనము చెప్పన్ = తమవారు చెప్పఁగా, విని, సంభ్రమము ఒదవఁగన్ = తొట్రుపాటు గలుగఁగా, చయ్యనన్, ఆ సుగ్రీవకున్ = మంచి కంఠము గల యా ద్రౌపదికి, లక్షణచేఁ గంఠధ్వనియని యగును; అపిహిత = మాయఁబడని, ప్రకటమైనయనుట; ఆధికిన్ = దుఃఖముగలదానికి, అచింతన్ = సంతోషముచే; ఎంచుచునని ముందన్వయము.

తాత్పర్యము సుగమము.

సీ. శుభమగు చందమొంకెచుచుమంగళావహా
స్వనపత్ర రథగతి నె సౌష్ఠవమునఁ
జిత్తంబు రంజిల్ల నె శీఘ్రయానంబున
నరిగి యానృపునిఁ బ్రహర్ష మొప్పఁ

గనియప్డు భీమవి ◊ క్రమశక్రసుతదర్ప
యమనవరణనిష్ఠ ◊ సమధికమగు
తద్బలవిభవంబు ◊ దాఁజూడఁగామించి
వర్తిల్లమానవే ◊ శ్వరవరుండు

గీ. ధర్మరాజిత జయమహో ◊ త్సాహుఁడగుచు
నుగ్రజవనైక బాణప్ర ◊ యోగ మహిమ
నచలసంఖ్య తాలంబుల ◊ నధికసార
తరుల ధరఁగూల్చెఁ జూపఱు ◊ వెరఁగుపడఁగ. 122

**రామాయణ.** శుభమగు చందము = శుభమగు విధము, ఎంచుచున్ = తలఁచుచు, మంగళావహ...సౌష్ఠవమునన్; మంగళావహ = శుభావహమగు, స్వన = శబ్దముగల, పత్రరథ = పక్షులయొక్క, గతి = గమనముయొక్క, సౌష్ఠవమునన్ = సుష్ఠుత్వముచే, మంచినడకచే ననుట; శుభావహమగు పక్షులధ్వనిచేతను, గమనముచేతను నని భావము; చిత్తంబు=మనసు, రంజిల్లన్=సంతోషింపఁగా, శీఘ్రయానంబునన్ = శీఘ్రగమనమున, అరిగి = వచ్చి, ఆనృపునిన్ = ఆరాజును, రామునననుట; ప్రహర్షము = ఒప్పున్, కని = చూచి, అప్డు, భీమ.........నిష్ఠన్; భీమవిక్రమ = భయంకర శౌర్యుఁడగు, శక్రసుత = వాలియొక్క, దర్పము = గర్వము యొక్క, యమ=అణఁచుటతోడి; నవ = నూత్నమైన, రణనిష్ఠన్ = యుద్ధమందలి స్థైర్యముచే, సమధికమగు = మిక్కిలి యధికమగు, తద్బల విభవంబు = ఆబలాతిశయము, ఇచ్చట విభవశబ్ద మతిశయపర్యాయమగు నది; తాన్ = సుగ్రీవుఁడు, చూడన్ కామించి = పరీక్షింపఁగోరి, వర్తిల్లన్, మానవేశ్వరవరుండు=రాముఁడు, ధర్మ......ఉత్సాహుఁడగుచున్; ధర్మరాజిత = వింటిచేఁ బ్రకాశించుచుండు, జయ = జయమునందలి మహోత్సాహుఁడగుచున్ = మిక్కిలి యుత్సాహము గలవాఁడగుచు,

ఉగ్రజవన = తీక్ష్ణవేగములగల; ఏక = ఒక్కటగు, బాణప్రయోగమహిమన్ = బాణము వేయుటయందలి మహిమచే, అచలసంఖ్యా = పర్వతసంఖ్యగల, సప్తకులాచలముల సంఖ్యగలయనుట; ఏడగునట్టి యని భావము; తాలంబులన్ = త్రాళ్లను, సప్తసాలములను; అధికసారతరులన్ = మిక్కిలి బలముగల వృక్షములను, చూపఱు = వీక్షించువారు, వెఱఁగుపడఁగన్ = ఆశ్చర్యపడఁగా, ధరన్ కూల్చెన్ = నేలఁబడునట్లొనర్చెను; రాముని వాలింజంపునట్టి బలముగలఁడే యని సుగ్రీవుఁడు పరీక్షింపఁదలంప సప్తసాలముల నొక్క బాణముచే రాముఁడు గూల్చెనని భావము;

"అచలసంఖ్య తాలంబులు" ఇటనయ్యచలము లేవు నెవ్వియనిన? "హిమవాన్నిషధో విన్ధ్యోమాల్యవాన్పారియాత్రికః. గంధమాదన మన్యేచ హేమకూటా దయోనగాః." అమరము.

భారత. శుభమగు చందమొందుచున్, షంగళావహ = శుభావహములగు, స్వన = ధ్వనిగల, సకిలింతలుగల యనుట; పత్ర = గుఱ్ఱములుగల, రథ = రథములయొక్క, గతిసౌష్ఠవమునన్ = గమనమునందలి సుష్ఠుత్వముచే, చిత్తంబు, రంజిల్లన్, శీఘ్రయానంబునన్ = త్వరితగమనమున, అరిగి, ఆనృపునిన్ = ఆరాజును, సైంధవుననుటః; ప్రహర్షమొప్పన్, కని = చూచి, భార్యాపహారణో ద్యుక్తుఁడైనను మఱఁదియగుటచే బాంధవదర్శన మూలమగు హర్షముగలవాఁడగుచునని భావము; ఈగుణమే యీతని యజాతశత్రుత్వమును వెల్లడించుచున్నది; ఇటఁ గొందఱు యుద్ధము శిక్షింపనున్నఁడకదా యని ధర్మజుఁడు హర్షమొందెనని యభిప్రాయపడెదరుగాని యది ధర్మజుని స్వభావమున కనుగుణముగానిదగుటం గవియాశయముగాదని యెఱుఁగవలయును; అప్పు, భీమ......నిష్ఠ; భీమవిక్రమ = భీమసేనుని పరాక్రమము, శక్రసుతదర్ప = అర్జునునిగర్వము, యమ = కవలయొక్క, నకుల సహదేవులయొక్క యనుట; నవ = నూత్నమైన, రణనిష్ఠ=

యుద్ధనిష్ఠ, సమధికమగుచుఁ = మిక్కిలి యెక్కుడగుచు, తద్బలవిభవంబు= ఆభీమాదుల పరాక్రమము, తాఁ=ధర్మరాజు, చూడఁగఁ మించి వర్తిల్లఁ = చూచుటకు మీఱియుండ, భీమాదుల బాహుబలము సైంధవునిబలమును మించునదిగాఁదోఁప ననుట;మానవేశ్వరవరుండు=రాజశ్రేష్ఠుఁడు, ధర్మరాజు; ఇతజయమహోత్సాహుఁడు = పొందఁబడిన జయముపలని మహోత్సాహము గలవాఁడు, అగుచుఁ, ఉగ్రజవన, ఏక = ముఖ్యమగు, బాణప్రయోగమహిమఁ = బాణము ప్రయోగించుటవలని మహిమచే, అచలసంఖ్యతా = చలింపని యుద్ధము గలుగుటను, స్థిరయుద్ధతననుట; ఆలంబులఁ = అవలంబించినవారిని, అధికసారతరులఁ = మిక్కిలి శ్రేష్ఠమైన బలముగలవారిని, చూపఱు, వెఱఁగు, పడఁగఁ, ధరఁ కూల్చెను = నేలపైఁ గూల్చెను, ధర్మజుఁడును సైంధవుని బలమునెదిరించి పెక్కురవీరులం జంపెనని భావము; కోటికాస్యాదులు దనసోదరులపైఁ గవియుటచే నలిగి యాతఁడు యుద్ధమొనర్చెఁగాని లేనన్న యుద్ధప్రసక్తి గలిగించుకొనువాఁడుగాఁడని విశదమగుచున్నది.

ధర్మజుఁడు వీరభటుల సంహరించెననుటకు; "అలిగి యుధిష్ఠిరుఁడును నగ్గలికం బ్రతివీరులడరఁ గార్ముకవిద్యా, విలసనము మిగుల సౌవీరుల నూర్వుర నధికబలుల రూపడఁగించెఁ." అని మహాభారతమున నరణ్యపర్వమున నెఱ్ఱాప్రగ్గడ వచించెను.

"మంగళావహాస్వనపత్ర" "పత్రంవాహన పక్షయోః" అమరము.

"ఏకబాణప్రయోగ-" "ఏకే ముఖ్యాన్యకేవలాః-" అమరము.

సీ. అకలుషాత్మప్రమ ♦ దా ప్తినుబ్బుచు వాలి
తమ్ముఁ డాసింధుభూ ♦ ధవకుమారు
సఖ్యాతిబలము ప ♦ సందగుల్పడఁ జేసి
యన్నయహీన ద ♦ర్పాధికతలు

మనుజాధినాథు సత్సమ్యక్ప్రయుక్తవిశిఖ
త్వంబున భంగించి తప్పక తన
పనుపునఁ గ్రమ్మఱఁ దనకీశబలమెందుఁ
గడునమకూలమై నడచుటకును

గీ. రంజిలుచు రామకార్యవర్తనకుఁ దగిన
యట్టిపాటల నొప్పారె నాచరించె
నంత నురువనవాసాంత మగుడునప్పు
డుపరికృత్యంబునకు మహోద్యోగుఁడయ్యె. 123

రామాయణ. అకలుష.........ఆప్తిన్; అకలుష = నిర్మలమైన, ఆత్మ = తనయొక్క; సుగ్రీవునియొక్క యనుట; ప్రమద = సంతోషము యొక్క, ఆప్తిన్ = పొందుటచే, ఉబ్బుచున్ = ఆనందించుచు, వాలితమ్ముఁడు = వాలియొక్క సోదరుఁడు, సుగ్రీవుఁడనుట; ఆసింధు...... పసన్; ఆ, సింధు భూధవకుమారు = చతుస్సముద్రముద్రిత భూమండలనాయకుఁడగు దశరథుని కుమారునియొక్క, రామునియొక్క యనుట; సఖ్య = స్నేహమువలని, అతిబలము పసన్ = అత్యంతబలముతోడిపస యందు, తగుల్పడన్ చేసి = తగులుకొనునట్లు చేసి, అత్యంతస్నేహము చేసి యనుట; అన్న... ..అధికతలు; అన్న = అన్నయగు వాలియొక్క, అహీన = తగ్గని, దర్పాధికతలు = గర్వము నాధిక్యమును, మనుజ...... విశిఖత్వంబునన్ ; మనుజాధినాథు = రామునియొక్క, సమ్యక్ప్రయుక్త = చక్కఁగాఁ బ్రయోగింపఁబడిన, విశిఖత్వంబునన్ = బాణము గలవాఁడగుటచే, బాణము చక్కఁగాఁ బ్రయోగించువాఁడగుటచేననుట; భంగించి=భంగముగావించి, రామబాణమున వాలినిజంపించి యనుట; తప్పక=తానొనర్చిన సమయము తప్పక, తనపనుపునన్ = తనయాజ్ఞచే, క్రమ్మఱన్ = మరలుటకును, తనకీశబలము = తనవానరబలము; ఎందున్ = సర్వత్ర,

కడుఁ౯ అనుకూలమై, నడచుటకును = మిక్కిలి యనుకూలముగా యుద్ధ యాత్ర సల్పుటకును, రంజిలుచుఁ౯ = సంతసించుచు, రామకార్యవర్తనకుఁ౯ = రాముని కార్యవర్తనకు, తగినయట్టిమాటలఁ౯ = యుక్తమైనట్టి మాటలచే, మనము సేనలతోఁడ వెడలి సీత నపహరించిన వానింజంపి యామెం దెత్తమనెడి మాటలచేనని భావము; ఆహ్లాదము ఆచరించెఁ౯ = సంతోష మొనర్చెను, అంతఁ౯, ఉరు = గొప్పదగు, వనవాసకాల = జలము యొక్క వాసముగల కాలముయొక్క, వర్షకాలముయొక్క యనుట; అంతము = కడ, అగుటఁ౯ = కాఁగనే, వర్షకాలము పూర్తియై శరత్కాలమురాఁగనే యని భావము; ఉపరికృత్యంబునకుఁ౯ = పై నాచరింప వలసిన కార్యమునకు, మహోద్యోగుఁడయ్యెఁ౯ = గొప్పప్రయత్నముగల వాఁడయ్యెను; వర్షాంతమువఱకు వేచియుండుఁడనిచెప్పి యకాలమంత మంది శరత్కాలము రాఁగనే సీతాన్వేషణ ప్రయత్నమునకుఁ బూనుకొనె నని భావము;

"సింధు;" "స్యందతేసింధుః; స్యందూప్రస్రవణే" గురుబాలప్రబోధిక. "కీశ" "మర్కటో వానరః కీశః" అమరము.

భారత. అకలుష......ఆప్తిఁ౯ = అకలుష = శుద్ధమైన, పతివ్రతయైన యని భావము; ఆత్మ = తనయొక్క, ప్రమదా=భార్యయొక్క ద్రౌపదియొక్క యనుట; ఆప్తిఁ౯ = పొందుటచే, ద్రౌపదిని మరలఁ బొందుటచే ననుట; ఉబ్బుచుఁ౯, వాలి = మీఱి, తమ్ముఁడు = భీముఁడు, ఆసింధు భూధవకుమారుఁ౯ = ఆసైంధవుని, సఖ్యాతి = కీర్తితోఁగూడిన, బలముపసఁ౯ = పరాక్రమాతిశయముచే, తగుల్పడఁ౯ చేసి = తగులుకొనునట్లొనర్చి, లోఁబఱచికొని యనుట; అన్యాయహీన దర్పాధికతలుఁ౯ = నీతి విహీనమగు గర్వముచే నధికమైన స్వరూపముగల, మనుజాధినాథుఁ౯ = రాజును, సైంధవుననుట; సమ్యక్ప్రయుక్త = చక్కఁగా నుపయోగింపఁబడిన, విశిఖత్వంబునఁ౯ = శిఖారాహిత్యముచే, భంగించి =

భంగముగావించి, జుట్టుగోసి భంగపాటొనరించి యనుట; తప్పక, తన పనుపునన్ = తనయాజ్ఞచే, క్రమ్మఱన్ = తిరిగిరాఁగ, ధర్మజునాజ్ఞచే వానిఁజంపక బంధించుకొనిరాఁగ, తనకున్, ఈశబలము = దేవునిబలము, ఈశ్వరానుగ్రహమనుట; ఎందున్, కడున్, అనుకూలమై నడచుటకును = తనకు దైవానుగ్రహము మిక్కిలి యనుకూలించుటకును, రంజిలుచున్ = సంతసించుచు, రామకున్ = ద్రౌపదికి, ఆర్యవర్తనకున్ = శుద్ధవర్తనగల దానికి, ఇది రామకు ననుటకు విశేషణము; తగినయట్టిమాటలన్ = తగిన మాటలచే, ఆహ్లాదము, ఆచరించెన్, అంతన్=ఆవల, ఉరువనవాసకాల= క్రూరమగు వనవాసకాలముయొక్క, అంతము అగుడున్ = పండ్రెండు వత్సరములు పూర్తికాఁగనే, ఉపరికృత్యంబునకున్ = పైని జరుపఁదగిన యజ్ఞాతవాసచర్యకు, మహోద్యోగుఁడయ్యెన్ = మిక్కిలి ప్రయత్నించెను. వనవాసము పూర్తియగుటచే నజ్ఞాతవాస సత్సరము గడపఁదగిన విషయమునుగూర్చి ప్రయత్నించెనని భావము.

"దర్పాధికతలున్" "అథస్వరూపయోర స్త్రీతలం" అమరము.

వ. అప్పుడు. 124

క. చూపట్టి నిర్నిరోధది
శాపతితాభినుతభాను సంతతిచోద్యం
బై పరఁగ హారిణభావము
కైపువడసి మిగులవింత గతినెలయించెన్. 125

అవతారిక. ఇదిమొదలు విప్రకార్య యను పద్యమునఱకు మూఁడు పద్యముల శరత్కాల వర్ణనము గావింపఁబడుచున్నది.

**రామాయణ.** చూపట్టి =కనుపించి, శరత్కాల మరుదెంచి ము;నిర్నిరోధ........సంతతి; నిర్నిరోధ = అడ్డములేక, అవిచ్ఛిన్నముగాననుట; దిశా = దిక్కులయందు, పతిత = పడిన, వ్యాపించినయనుట; అభినుత =

పొగడఁబడిన, భానుసంతతి = కిరణముల సమూహము, చోద్యంబై = ఆశ్చర్యమై, పరఁగన్ = విస్తరింపఁగా, నెల = చంద్రుఁడు, హారిణభావము కైపు = తెల్లవన్నెయొక్క విలాసము, పడసి = పొంది, మిగులన్ = మిక్కిలి, వింతగతిన్ = ఆశ్చర్యమగువిధమున, ఇంచెన్ = ఇంపొందెను; శ్లేషార్థసంఘటనము గావింపవలసి వచ్చుటచేతనే దిశాపతితమని మరల చోద్యంబై పరఁగననియు, అశ్లే మరల వింతగతినని చెప్పవలసివచ్చెను. అయినను నిది దోషముగాఁ బరిగణింపఁదగదు, దిశావ్యాప్తమగు భాను సంతతి చోద్యముగాఁ బరఁగెననియు నాకారణముననే చంద్రునకు వింత గతి గలిగెననియు సమన్వయించుకొనవలయుననియే కవి యాశయము;

తా. శరత్కాలమురాఁగనే యవిచ్ఛిన్నముగా దిశల వ్యాపించిన చంద్రకిరణములు చోద్యమొసఁగుచుండెను. కావునఁ జంద్రుఁడు వింతగతిఁ దోఁచెను.

"భానుసంతతి" "భానూరశ్మి దివాకరౌ" అమరము.

"హారిణభావము;" "హారిణః పాండురః పాండుః;" అమరము.

అవతారిక-ఈపద్యము మొదలు అజ్ఞాతవాసమహిమ యను పద్యము వఱకు నాల్గుపద్యములు ధర్మదేవత హారిణరూపమున బ్రాహ్మణునరణి గొనుట మొదలు పాండవులకు వరమొసఁగు వఱకుఁగల కథాభాగము వర్ణింపఁబడుచున్నది.

భారత. నిర్ణిరోధ.........సంతతి; నిర్ణిరోధ = అడ్డములేని, దిశాపతితా = దిక్పతిత్వముచే, అభినుత, భానుసంతతి = యముఁడు, చోద్యంబై, పరఁగన్, హారిణభావము కైపు = జింకరూపుయొక్క విలాసమును, పడసి, మిగులన్, మిక్కిలి, వింతగతిన్, ఎలయించెన్ = వంచించెను; బ్రాహ్మణుని మోసపుచ్చెననుట;

తా. దిక్పాలకత్వముచేఁ బొగడ్తగాంచిన యముఁడు జింకరూపు దాల్చి యొక బ్రాహ్మణుని వంచించెను.

సీ. భాసురశృంగలీలాసముత్కృష్టమ
హారణితాఖిన్న సారసద్వి
జప్రార్థిత వ్యవస్థాపనంబై కడు
నాహారిణము దిరం బగుపొలుపున
విలసిల్లుచున్న యా వేళయందును రాజు
దమ్ములనతులితో త్కర్షశాలి
బాణాసన శరప్రపంచంబు విస్ఫూర్తిఁ
బరఁగంగఁ దవిలివెం బడి నలసిరి

గీ. మిపులవర్తిల్లెదచ్ఛర దవసరభస
లీల సత్కృష్ణసార రత్నాలఘుమహి
మసుఁ దృణకణాయమానమై మానసంబు
గడుఁజలింపంగ నిర్వ్యాజవడియె నృపుఁడు. 126

రామాయణ. భాసుర..........వ్యవస్థాపనంబై; భాసుర = ప్రకాశించుచున్న, శృంగ = ప్రాధాన్యముగల, లీలా = విలాసమున, మిక్కిలి శ్రేష్ఠములైన, మహారణిత = గొప్పధ్వనిగల, అఖిన్న = దుఃఖింపని, సంతోషపడుచున్నయనుట; సారసద్విజ = బెగ్గురుపక్షులయొక్క, ప్రార్థిత = కోరఁబడిన, వ్యవస్థాపనంబై = స్థిరముగా నిలుపుటకలదై, ప్రాధాన్యముచే ధ్వనించుచున్న బెగ్గురుపక్షు లింకను నీశరత్కాలమిట్లే యుండవలయునని కోరుచున్నవని భావము; హారిణముదిరంబగు పొలుపునన్ = తెల్లవన్నెగల మేఘములు గలుగువిధమున, కడున్ = మిక్కిలి; విలసిల్లుచున్న = ప్రకాశించుచున్న, ఆవేళయందును = ఆశరత్కాలమునందు, శరత్కాలమేఘము లుదకగర్భములు గాకుండుటచేఁ దెల్లపడెనని భావము; రాజు = చంద్రుఁడు, తమ్ములు = తామరలు, అతులితోత్కర్ష = సాటి

లేని యుత్కర్షముగల, శాలి = రాజనముయొక్కయు, బాణా = గోరంట యొక్కయు, ఆసన = వేగిమ్రాఁకులయొక్కయు, శర = రెల్లుయొక్క యు, ప్రపంచంబు= మహిమయొక్క, విస్ఫూర్తిన్ = వికాసముచే, పరఁగం గన్ =విస్తరింపఁగా, తవిలి=లగ్నమై, వెంబడిన్ = తోడనే, అలసిరి = ఆ లక్ష్మి, ఆకాంతియనుట; మివులన్ వర్తిల్లెన్ = అధికముగా నుండెను, కడుంగడు రమణీయముగా నుండెనని భావము; తచ్ఛరదపసర = ఆశర త్కాలమునందలి, భసలీ = భృంగాంగన యనెడి, లసత్ = ప్రకాశించు చున్న, కృష్ణ = నీలవర్ణముగల, సారరత్న = శ్రేష్ఠమగు రత్నము యొక్క, అలఘుమహిమన్ = గొప్పమహిమచే, తృణకణాయమానమై = తృణమువలె నగుచున్నదై, మానసంబు = మనస్సు, కడున్ చలింపఁగన్ = మిక్కిలి చంచలమగుచుండ, నీలము తృణగ్రాహకమగుటచే నాఁడు తు మ్మెదలనెడి రత్నములు మానసమనెడి తృణమును గ్రహించుటచే నది చంచల మయ్యెనని భావము; నృపుఁడు = రాముఁడు, నివ్వెఱపడియెన్ = భయ పడెను, విరహియగుటచే భయపడెననుట ; అలంకారము రూపకము.

"కృష్ణసారరత్నా లఘుమహిమచుఁ దృణకణాయమాన;" ఇటనీల మహిమనుగుఱించి; "సారంబగు నీలము గో, క్షీరములందిడఁగ నదియుఁ గృష్ణముసైనన్, క్షీరగ్రాహి యనంబడు, నారలోన్నత్తమనుదాల్ప నమ రుల కమరున్. కనవున సారగునఁగనమున, నెసఁగగు నీలంబుమీఁద నిడి యూదంగన్, వెస నెగసిపోక నిలచిన, వసుధఁ దృణగ్రాహి యనఁగ వచ్చునుదానిన్." రత్నపరీక్ష.

"భాసురశృంగ." "శృంగం ప్రాధాన్యసాన్వోశ్చ." అమరము.

"సారసద్విజ" "సరసి భవస్సారసః" గురుబాలప్రబోధిక.

"ముదిర" "ఘనజీమూతముదిరజల ముగ్ధూమయోనయః"అమరము.

"శాలి" "శ్యాలంతే శ్లాఘ్యంతే జనైరితిశాలయః-" శాలశ్లాఘా యాం-" గురుబాల ప్రబోధిక.

"బాణా" "నీలీఝుంటీ ద్వయోర్బాణా" అమరము.

"ఆసన" "సర్జకాసనబంధూక పుష్పప్రియక జీవికాః" అమరము.

"శర" "శృణాతిరోగం శరః. శౄహింసాయాం" గురుబాల ప్రబోధిక.

"భసలీ" "బంభరశ్చ మిళిందశ్చ హింవోళ భసలౌసమా" హలాయుధ నిఘంటువు.

**భారత.** భాసుర........వ్యవస్థాపనంబై; భాసుర, శృంగ = కొమ్మునయొక్క, లీలా = చేష్టచే, సముత్ = సంతోషముతోఁ గూడునట్లు, కృష్ట=అపహరింపఁబడిన, మహాఅరణితా=గొప్ప యరణిని గలవాఁడగుటచే, జింక తనకొమ్మున రాచుకొనుటచే సంతసముగలదై బ్రాహ్మణునరణిని హరించెనని భావము; లేక జింక తనకొమ్మచేఁ జెట్లును రాచుకొనుచుండ నావిలాసమును జూచుచు బ్రాహ్మణుఁడు సంతోషించుచుండఁ దటాలున నయ్యరణి నాజింక హరించెననియు భావమగును; ఖిన్న = దుఃఖించిన, తనయరణి హరింపఁబడుటచే యజ్ఞాదికర్మలు నిలిచిపోవుచున్నదికదా యని బ్రాహ్మణుఁడు దుఃఖించెనసుట; సార = శ్రేష్ఠుఁడైన, సత్+ద్విజ = సద్బ్రాహ్మణునిచే, ప్రార్థిత = వేఁడుకొనఁబడినదై, వ్యవస్థాపనంబై = నిలుచుటగలదై, బ్రాహ్మణ ప్రార్థనచే నాజింక యట్లే నిలచెననిభావము; ఆహరిణము = ఆజింక, తరమగు పొలుపునన్ = స్థిరమగు పొలుపున, కదున్ విలసిల్లుచున్న యావేళయందున్ = మిక్కిలి ప్రకాశించుచుండు నాసమయమున, రాజు = ధర్మజుఁడు, తమ్ములు = సోదరులు, భీమాదులనుట; అతులిత = సాటిలేని, ఉత్కర్షశాలి = ఉత్కర్షముచే నొప్పుచున్న, బాణాసన = విండ్లయొక్కయు, శర = బాణములయొక్కయు, ప్రపంచంబు = వ్యాపారము, విస్ఫూర్తిన్ పరఁగంగన్ = కాంతిచే నొప్పారుచుండ, వెంబడిన్, తవిలి = ఆజింకవెంటఁదవిలి, అలసిరి = శ్రాంతులైరి, తత్ = ఆపాండవుల, శరదవ = కార్చిచ్చువంటి యాబాణ

ములయొక్క [ఉపమానోత్తరపద కర్మధారయము.] సరభసలీల = శీఘ్రతతోడికార్యము, అతివేగమున బాణముల విడుచునట్టి కార్యమనుట; సత్ = తెల్లనైన, కృష్ణసారరత్న = మృగశ్రేష్ఠముయొక్క, అలఘు = గొప్పదగు, మహిమకున్ = మాహాత్మ్యమునకు, తృణకణాయమానమై = తృణప్రాయమై, మిక్కుటముగ వర్తిల్లెన్ = మిగుల నొప్పుచుండెను, పాండవుల యొక్క బాణమోక్షణాదులు మృగమహిమచే వ్యర్థములాయెనని భావము; నృపుఁడు = ధర్మజుఁడు, మానసంబుకడున్ చలింపంగన్ = మనస్సు చాల చలింపఁగా, నివ్వెఱపడియెన్ = మిక్కిలి భయపడెను, తమబాణములట్లు వ్యర్థములగుటచేఁ జిత్తచాంచల్యమంది భయపడెనని భావము.

సీ. విప్రకార్యముగాని • నెతఁ జేసి కరము దు
    స్సహమైన కాండవర్ష ప్రశమమున
నదలేదికలఁక నీ • రానితమ్ములు ఘన
    కాలమహిమచేత • నోలిఁ బొలియ
మగుడంగ మనిపె వా • రిగురుప్రసాదంబు
    దనయుక్తిసామర్థ్య • ఘనతచేతఁ
జాలంగఁబడసి తె • త్సుమయుంబునందిత
    కామాళియోగఁణ • ఘనతనుండు
గీ. విరహితాపకారంబు తద్భవమతను
వికసనము నెవ్వరిమనముకును నొనర్ప
దారయుఁగ నది యట్లుండె • నపుడు నృపుని
యుపరికృత్యంబునకుఁ దగఁ • దపనసుతుఁడు. 127

**రామాయణ.** విప్రకార్యముకాని = మాన్ప సాధ్యముకాని, వెతఁజేసి = దుఃఖముచే, కరము = మిక్కిలి, దుస్సహమైన = ఓర్చుటకు శక్యము

కాని, కాండవర్ష శ్రమమునన్ = జలవర్షమువలని శ్రమముచే, అవటు+ఏది = బిరుదుచెడి, కలఁకన్=కలఁతతో, నీరాని = నీరుపొంది, తమ్ములు=తామరలు, ఘనకాలమహిమచేతన్ = వర్షాకాలమహిమచే, ఓలిన్=వరుసఁగా, పాలియన్=అణఁగిపోవఁగా, వర్షాధిక్యమున నీరునిండుటచే నానీటిలోఁ దామరలు మునిఁగిపోయెనని భావము; వారి = నీటియొక్క, గురు = లెస్సయగు, ప్రసాదంబు=తేటుట, తన=శరదృతువుయొక్క, యుక్తిసామర్థ్య=యుక్తిసామర్థ్యముయొక్క, ఘనతచేతన్ = గొప్పదనముచే, చాలంగన్ పడసి = విశేషముగాఁ బొంది, నందితకామాళి = సంతసింపఁజేసిన మన్మథుని తుమ్మెదలనుగల, తత్సమయంబు = ఆసమయము, శరత్కాలమనుట; (ఆతామరలను) మగుడంగన్ = మరల, మనిపెన్ = రక్షించెను, నీటిలో మునిఁగిన తామరలను మరల నీఋతువు రక్షించెననిభావము; ఇట్టి పద్మపోషణము మూలముననే మన్మథుఁడు తుమ్మెదలను మనిపెననుట; (ఆసమయము) గుణఘనతనుండు = గొప్పగుణముతోఁ జేరియుండును, విరహితాపకారంబు = విరహులకుఁ దాపముచేసెడి, తద్విభవము = ఆశరదృతు వైభవము, అతను వికసనముల్ = మన్మథ విలసనమును, ఎవ్వరిమనంబునకున్ = ఎవరిమానసమునకు, ఒనర్పదు = చేయదు, ఎల్లరకు నీఋతువు మన్మథోద్రేకమొసఁగుననిభావము; అరయఁగన్ = విచారింపఁగా, అది, అట్లుండెన్, అపుడు, నృపుని = రామునియొక్క, ఉపరికృత్యంబునకున్ = మీఁదటిపనికి, రావణునిపై దండయాత్రకనుట; తగన్, తపనసుతుఁడు = సుగ్రీవుఁడు; అనిపెనని ముందరిపద్యమునందలి క్రియతో నన్వయము;

భారత. విప్రకార్యముకాని వెతఁజేసి = బ్రాహ్మణకార్యముకాని దుఃఖముచే, కరము, దుస్సహమైన, కాండవర్షశ్రమమునన్ = బాణవర్షమువలని శ్రమచే, అవశేది = బిరుదుసెడి, తామువూనిన బ్రాహ్మణునరణి తెచ్చుట యను కార్యమట్లు విఫలమగుటచేత వెతఁజెందినవారు గాన

శక్తిహీనులై బాణవర్షము గురిపించిన యలయికచేఁ బడలినవారై యని భావము; కలఁకన్ = కలఁతచే, నీరాని = నీరుద్రావి, ధర్మదేవత దన ప్రశ్నకు సమాధానమొసఁగక నీరానరాదనినను గలఁత నొందినవారగుటచే నది పాటింపక నీరుద్రావిరని భావము; తమ్ములు = సోదరులగు భీమాదులు, ఘనకాలమహిమచేతన్ = గొప్పవాఁడగు యముని మాహాత్మ్యమున, ఓలిన్ = వరుసగా, సొలియన్ = నొచ్చిపోవఁగా, మూర్ఛిల్లఁగాననుట; తత్సమయంబునన్ = ఆతరుణమున, దితకామాళి = ఖండింపఁబడిన కోర్కెల సమూహము గలవాఁడు, యోగితుల్యుఁడనుట; ఆగుణఘనతనుండు = గుణములచేఁ ఘనమూర్తి యగువాఁడు, ధర్మరాజనుట, తనయుక్తిసామర్థ్యఘనతచేతన్ = నిజవాక్చాతుర్యమున, యక్షుఁడడిగిన ప్రశ్నములకు సమాధానము చెప్పియనుట; గురుప్రసాదంబు = తండ్రియగుయముని యనుగ్రహము, చాలంగన్, పడసి = పొంది, వారిన్ = ఆ తమ్ములను, భీమాదులననుట; మగుడంగన్ మనిపెన్ = మరల రక్షించెను, ధర్మదేవతానుగ్రహమున మరల భీమాదులు బ్రదుకఁగల్గిరని భావము; విరహిత+అపకారంబు = అపకారహీనమైన, తద్విభవము = ఆధర్మజుని వైభవము, అజాతశత్రుఁడగుటచే నీతఁడెవ్వరికిని గీడుసేయఁడుగాన నీతనివైభవము విరహితాపకారమయ్యెనని భావము; ఎవ్వరిమనంబునకున్, అతను = తగ్గని, వికసనమున్ = విలాసమును, ఒనర్పదు, ఎల్లర మానసంబులకు నానందమొసఁగునని భావము; ఆరయఁగన్, అది, అట్లుండెన్, అపుడు, నృపుని = ధర్మజునియొక్క, ఉపరికృత్యంబునకున్ = అజ్ఞాతవాసాది కార్యములకు, తగన్, తపనసుతుఁడు = యముఁడు; అనిపెనని ముందరిపద్యమునందలి క్రియతో నన్వయము.

క. అజ్ఞాతవాస సుహి తన
యాజ్ఞాపన రామభాషకైణార్పిత కార్య

ప్రజ్ఞులను జేసి యనిపెని
జాజ్ఞాకరణైకశరణు లగువారిఁదగన్. 128

**రామాయణ.** అజ్ఞాత........ప్రజ్ఞలను; అజ్ఞాతవాస = ఎఱుఁగఁబడని యునికిగల, మహీతనయా = సీతకు, జ్ఞాపన = గుఱుతులు తెలిపెడి, రామభాషణ = రాముని మాటలచే, అర్పిత = పెట్టఁబడిన, కార్య= పనియందు, ప్రజ్ఞులఁజేసి= తెలివిగలవారినిగా నొనర్చి; సీత నెఱుఁగుటకుఁ దగిన గుఱుతులం దెల్పి, రాముఁడు సీతాన్వేషణ రూపమగు కార్యమేర్పఱచి యందుఁ బ్రజ్ఞావంతులుగా నొనర్చియనుట; నిజాజ్ఞా కరణ = తన యానతిం జేయుటయే, ఏక = ముఖ్యమగు, శరణులగువారిన్ = ఆధారము గాఁ గలవారిని, తన యధీనులగు వానరులను, తగన్, అనిపెన్ = పంపెను.

తా. సీతయునికి దెలియుటకు నామెను వెదుకఁ బంపువారా రామెంగుఱించుటకై కొన్ని చిహ్నముల రాముఁడు దెల్ప సుగ్రీవుఁడంత వారి ననిపెను.

**భారత.** అజ్ఞాతవాస........ప్రజ్ఞులను; అజ్ఞాతవాస = అజ్ఞాతవాసమందలి, మహిత=గొప్పదగు, నయ=నీతియొక్క, ఆజ్ఞాపన=ఉపదేశించుటచేత, రామ = మనోజ్ఞమగు, భాషణ = పలుకులచే, అర్పిత, కార్య, ప్రజ్ఞులను చేసి = బుద్ధిమంతులుగా నొనర్చి, అజ్ఞాతవాస మొనర్పవలనగు నీతిఁ జెప్పి తగిన వరమిచ్చియనుట; నిజాజ్ఞాకరణ = తనయానతిని జేయుటయే, ఏక = ప్రధానమగు, శరణులగు, వారిన్ = ఆపాండవులను, తగన్, అనిపెన్ = పంపెను;

తా. అజ్ఞాతవాస మొనర్పందగు నీతుల నుపదేశించి నిజాజ్ఞైకశరణులగు పాండవుల ననిపెను.

ఆ. అపుడు వారు మహిజకైనావిదితస్థితి
జేయుటకుఁ దరు కిఁ కై జే కొని కడు

నుల్లముల నుదంచితోత్సాహు లగుచును
వివిధదిక్పురములఁ వెదకి చూచి. 129

రామాయణ. అపుడు = జనకజను వెదికిరండని సుగ్రీవునాజ్ఞ యయినపుడు, వారు = ఆవానరులు, మహిజన్ = సీతను, [ఇది సాధ్య సమాసము] అవిదితస్థితిన్ = చక్కఁగాఁ దెలియఁబడిన యునికిఁగలదానింగా, చేయుటకున్, తదుక్తిన్ = ఆరామునిమాటను, చేకొని = గ్రహించి, ఉల్లములన్ = మనస్సులందు, కడున్ = మిక్కిలి, ఉదంచిత = అతిశయితమయిన, ఉత్సాహులు అగుచును = ఉత్సాహము గలవారగుచు, వివిధదిక్ = నానాదిక్కులంగల, పురములన్ = పట్టణములను, వెదకి, చూచి; ముందుపద్యముతో నన్వయము;

తా. సీత యునికిపట్టు దెలియుటకై రామసంభాషణములను గ్రహించి మిక్కిలి యుత్సాహముతోఁ బెక్కుదిక్కులు చూచి;

భారత. అపుడు = ధర్మదేవతయాజ్ఞ యయినప్పుడు, వారు = పాండవులు, మహిజన = భూమియందలిజనులచే, అవిదిత = తెలియఁబడని, స్థితిన్ = వాసమును, అజ్ఞాతవాసముననుట; చేయుటకున్, తదుక్తి = ఆధర్మదేవతమాట, కడున్, చేకొని, ఉదంచితోత్సాహు లగుచును, వివిధ దిక్పురములన్ = నానాదిక్కులనుండు పురములను, ఉల్లములన్ = మనస్సులచేతనే, వెదకిచూచి; పైపద్యముతో నన్వయము.

తా. అజ్ఞాతవాసమొనర్ప ధర్మదేవతా వాక్యములంగ్రహించి తమ వాసమున కనుకూలములగు ప్రదేశముల మనస్సులచేతనే వెదకి;

క. అతిసత్వస్థవిరాటవి
తతసగరచితప్రచార తనుమది కెక్కన్
ధృతి నరసి రామభార్యను
సతిఁ గానక కాంతిభంగ చణతనుశీలన్. 130

**రామాయణ.** అతిసత్త్వ......ప్రచారతను; అతిసత్త్వ = మిక్కుటమగు జంతువులుగల, స్థవిరాటవి = జీర్ణములైన యరణ్యముల చేత, తత = వ్యాప్తమైన, నగ = పర్వతములయందు, రచిత = చేయఁబడిన, ప్రచారతను = సంచారము గల్గుటచే, మదికెక్కన్ = ఇష్టమగునట్లు, ధృతిన్ = ధైర్యముతో, సతిన్ = పతివ్రతయగు, రామభార్యను = సీతను, అరసి = వెదకి, కానక = చూడక, కాంతిభంగచణ = కాంతిహానిచేఁ దెలియఁబడని, తను = శరీరముయొక్క, లీలన్ = విలాసముచే, సీతగాన్పింపమివివర్ణులైరని భావము; చనిరని ముందన్వయము;

తా. ఆవానరులు పలుసత్త్వములం గల్గిన జీర్ణాటవులతో వ్యాప్తమైన పర్వతప్రదేశములం దిరిగి వెదకి వెదకి సీతంగానక వివర్ణులైరి.

"కాంతిభంగచణ" "తేనవిత్తశ్చుఞ్చుప్చణపౌ-" అనుపాణిని సూత్రము చొప్పున, 'విద్య యావిత్తో విద్యాచుఞ్చుః, విద్యాచణః, అనులాగున,భంగచణ' యనురూపము నిష్పన్నమయ్యెను.

**భారత.** అతిసత్త్వస్థ........ప్రచారతను; అతిసత్త్వస్థ = మిక్కిలి సత్త్వగుణవర్తియగు, విరాట = విరాటరాజుచే, వితత = విస్తరింపఁబడిన, పోషింపఁబడినదనుట; నగర = మత్స్యపురమునందు, చిత = సంపాదితమైన, ప్రచారతను = సంచారముగలవారగుటను, తత్పుర నివాసమునుటనుట; మదికెక్కన్, ధృతిన్, అరసి=విచారించి, మత్స్యనగరమునకుఁబోవ నిశ్చయించియనుట; సతిన్ = పతివ్రతను, రామన్ = స్త్రీని, కానక కాంతి = స్వర్ణసంబంధమగు కాంతియొక్క, భంగచణ = జయించుటచేఁ బ్రసిద్ధమైన, తనులీలన్ = శరీరవిలాసము గలదానిని, భార్యన్ = ద్రౌపదిని, కనుఁగొనియనిమీఁద నన్వయము;

తా. తమవాసమునకు విరాటరాజుచేఁ బాలింపఁబడు మత్స్యనగరమే శ్రేష్ఠమగునదని భావించి ద్రౌపదిని,

క. వనితామణి నురుశుభగుణఁ
గనుఁగొని దాస్యోచితవిధిఁ గరిమము మిగులం
జన లేమ యకట యిఁకఁ దద
వనిపాల పురస్థితిం బ్రవ_ర్తిల్లు టెటో. 131

**రామాయణ.** వనితామణిన్ = స్త్రీశ్రేష్ఠురాలగు సీతను, ఉరుశుభగుణన్=గొప్ప శుభగుణముగలదానిని. [ఇది సీతకు విశేషణము.] కనుఁగొని = చూచి, దాస్యోచిత = దాస్యమునకుఁ దగిన, విధి=కార్యమువలని, గరిమము = గొప్పదనము, మిగులన్ = అతిశయించులాగున, చనలేమ = పోలేముగదా, సేవకధర్మము యజమానునాజ్ఞ పూ_ర్తిసేయుటకాఁబట్టి రామ సుగ్రీవుల యానతిచొప్పున సేవకధర్మమునిర్వ_ర్తించి దానంగల్గిన గౌరవము నందలేకుంటిమి గదాయని భావము; అకట=అయ్యో! ఇఁకన్, తత్, అవనిపాలపురస్థితిన్ = ఆ రామసుగ్రీవుల యెదుటనుండుటచేత, ప్రవ_ర్తిల్లుట ఎటో = ఏలాగుఁ బ్రవ_ర్తించుటో;

తా. రామసుగ్రీవులయానతిచొప్పున సీతంగాంచి మన సేవకధర్మములు నిర్వ_ర్తింప లేకుంటిమికదా? ఇంక వారియెదుట కెట్లు పోవఁగలము?

**భారత.** వనితామణిన్, స్త్రీశ్రేష్ఠురాలగు ద్రౌపదిని, ఉరుశుభగుణన్, [ఇది ద్రౌపదికి విశేషణము;] కనుఁగొని, దాస్యోచితవిధిన్=దాస్యమునకుఁదగినవ్యాపారముచే, గరిమము = గౌరవము, మిగులన్ చనన్, మిక్కుటముగా నశింపఁగా, అకట, ఇఁకన్, తదవనిపాల పురస్థితిన్ = ఆ విరాటరాజు నగరముననునికిని, లేమ= స్త్రీ, ద్రౌపది; ప్రవ_ర్తిల్లుటెటో;

తా. ద్రౌపదిం గాంచి, దాస్యమున గౌరవమునశింప నీ ద్రౌపది యా విరాట నగరమున నెట్లుండఁగలదో;

"లేమ." "చాన తెఱవ వెలందుక చామలేమ, చెఱవ యొలనాఁగ చిలుకలకొలికికలికి, తలిరుఁబోఁడి యలరుఁబోడి నెలఁతపా_ర్తి, గరితయతివ వా స్త్రీ సమాఖ్యలు మహేశ;" ఆంధ్రనామసంగ్రహము.

తే. ఏమి పనివార మనుచుఁ దద్భూమిపాలు
కడకు మన మేఁగువారమే కరణి నతని
యుల్లమున కెడయక ప్రవర్తిల్లనేర్తు
మనువిచారంబుచే నాకులాత్ము లగుచు 132

రామాయణ భారతార్థములు సమము. అర్థము. ఏమి పని వారమనుచున్=[రామాయణ; ఏమిపని చేసితిమనుచు. భారత ; ఏయేపనులు చేయఁగలవారమనుచు] తద్భూమిపాలు కడకున్=[రామాయణ; ఆసుగ్రీవుని సమీపమునకు, భారత ; ఆ విరాటరాజు నొద్దకు,] మనము, ఏఁగువారము, ఏకరణిన్=ఏవిధమున, అతని యుల్లమునకున్=[రామాయణ ; ఆ సుగ్రీవుని మానసమునకు, భారత ; ఆ విరాటునిమానసమునకు;] ఎడయక = తొలఁగక, ప్రవర్తిల్ల నేర్తుము = నడచుకొనఁగలము, అను విచారంబుచేన్ = అనెడి యాలోచనచే, ఆకులాత్ములు అగుచున్ = వ్యాకులచిత్తులగుచు ;

తాత్పర్యము సుగమము ;

వ. పదంపడి తమతోఁచిన యుత్తరంబులచే నొండొరులచింత డిందుపఱుచుచుం దద్దిశాభిముఖులై చని రప్పుడు. 133

క. మరుదాత్మజముఖ్యులు ధ
ర్మరాజుదెస నరయువారు మగుడక యంతః
కరణములఁ బర్వుచింతా
భరములతోఁ జలిపి రగ్రపథగమనంబున్. 134

రామాయణ. మరుదాత్మజముఖ్యులు = హనుమంతుని ముఖ్యముగాఁ గల వానరులు, ధర్మరాజు దెసన్ అరయువారు = దక్షిణదిక్కును వెదకు వారు, మగుడక = తిరుగక, అంతఃకరణములన్ = మనస్సులందు, పర్వు= వ్యాపించు, చింతాభరములతోన్ = చింతాభారములతో, అత్యంతచింతతో ననుట; అగ్రపథ గమనంబున్ చలిపిరి = ముందుమార్గమునుబట్టి వెళ్లిరి.

తా. హనుమదాదులగు దక్షిణమున కరిగినవారు సీతంగానక చింతిలుచును నింకను ముందుకుఁ జనిరి.

భారత. మరుదాత్మజముఖ్యులు = భీమాదులు, ధర్మరాజు దెసన్ అరయువారు = ధర్మజుని విషయమున విచారించువారు, ఈ ధర్మజుఁ డెట్లన్యునిం గొల్వఁగలవాఁడని చింతించువారైయని భావము ; మగుడక = ఉడుగక, అంతఃకరణములన్, పర్వ చింతాభరములతోన్, అగ్రపథగమనంబున్ చెలిపిరి = ముందుమార్గమును బట్టి నడచిరి ;

తా. భీమాదులు ధర్మజుఁ డెట్లన్యునిం గొలుచువాఁడో యని చింతించి మిక్కిలి ఖిన్నులగుచు ముందు నడచుచుండిరి.

క. ఈ తెఱఁగునఁ జనునంతటఁ
 జేతోవీథిన్నిజార్థసిద్ధ్యనుగుణసం
 పాతిఖగోక్తులముద ము
 ద్భూతంబుగ వింతలగు వపురభిఖ్యలతోన్. 185

రామాయణ. ఈ తెఱఁగునన్ చనునంతటన్ = ఇట్లుపోవుచుండు నంత, చేతోవీథిన్ = మనస్సున, నిజార్థసిద్ధ్యనుగుణ = తమకార్యము సిద్ధించుటకుఁ దగిన, సంపాతిఖగోక్తులన్ = సంపాతియను పక్షియొక్కమాటలచే, సీతయుండు ప్రదేశము తెలుపుమాటలచేననుట ; ముదము = సంతోషము, ఉద్భూతంబుగన్, కలుగఁగా, వింతలగు, వపురభిఖ్యలతోన్ = శరీరసౌందర్యములతో ; చనిచనియని యున్వయము ;

తా. వానరు లిట్లు వెడలుచుండ సంపాతివచనములచే సంతసించి వింతలగు శరీర సౌందర్యములతో ;

భారత. ఈ తెఱఁగునన్ ' చనునంతటన్ ' చేతోవీథిన్ = మానసమునందు, నిజ = తమయొక్క, పాండవులయొక్కయనుట ; అర్థసిద్ధి = కార్యసిద్ధికి, అజ్ఞాతవాసము నిర్విఘ్నముగా జరుగుననుటకు ; అనుగుణ = తగినట్లు, సంపాతి = సంచరించుచున్న, ఖగ=పక్షులయొక్క, ఉక్తులచేన్ =

పలుకులచే, పక్షులు గమనమున శకున మొసఁగుచున్నవనుట ; ముదము, ఉద్భూతంబుగ౯, వింతలగు = ఆశ్చర్యకరములగు, వపురభిఖ్యలతో౯ = శరీరములతోడను, నామములతోడను, చనిచనియని ముందన్వయము ;

తా. పాండవు లిట్లు వెడలుచుండఁ బక్షులు వీరికి శుభశకునము లొసఁగుచుండ సంతసించి తమకనుగుణమగు రూపములతోడను, నామములతోడను,

వ. ముందరికిం జనిచని. 186

క. వారలు గనుఁగొని రతివి
స్తారాద్భుతమత్స్యరాజధానిని లవణాం
భోరాశిఁ గాళిమగుణో
దారతచే మించువనచయము గలదాని౯. 137

రామాయణ. వారలు = ఆవానరులు ; అతి.........ధానిని ; అతి విస్తార = మిక్కిలి విస్తారమై, అద్భుత = ఆశ్చర్యకరములైన, మత్స్య రాజ = మత్స్యశ్రేష్ఠములకు, ధానిని = స్థానమగుదానిని, కాళిమగుణోదారతచే౯ = నీలతాగుణముయొక్క గొప్పదనముచే, మించు=అతిశయించు, వనచయము = జలసమూహము, కలదాని౯, లవణాంభోరాశి౯ = సముద్రమును, కనుఁగొనిరి.

తా. గొప్ప మత్స్యములతోఁగూడి, నల్లనివన్నెగల నీటితోఁగూడిన సముద్రము నావానరులుగాంచిరి.

" కాళిమ " " వర్ణదృఢాదిభ్యః ష్యఞ్ ; " పాణిని.

భారత. వారలు = ఆపాండవులు, కాళిమగుణోదారతచే౯ = నీలతాగుణముయొక్క గొప్పదనముచే, లవణాంభోరాశి౯ = సముద్రమును, మించు = మీఱు, వనచయముగలదాని౯ = అటవీసమూహములుగలదానిని, అతి విస్తార, అద్భుత, మత్స్యరాజధానిని = మత్స్యనగరమును, కనుఁగొనిరి = చూచిరి.

తా. పాండవులు నల్లనివన్నెచే సముద్రముం దిరస్కరింపఁజాలు నడవులతోఁగూడిన విస్తారమగు నామత్స్యనగరముఁ గాంచిరి.

వ. అంత 138

ఉ. ఆవనరాశిదాఁటి తగునట్టిక్రమంబున విశ్వవిద్విష
ద్రావణపాలితంబగు పురంబు జనాంతరదుర్గమస్వతే
జోవిభవాభిగుప్తిమయిఁజొచ్చి మరుత్తనయుండు తద్విభుం
డేవెత లేకయుండఁ బ్రజ నేలు తెఱంగున కాత్మ మెచ్చుచున్.

రామాయణ. మరుత్తనయుండు=హనుమంతుఁడు, ఆవనరాశిదాఁటి= ఆసముద్రముదాఁటి, తగునట్టిక్రమంబునన్ = తగినవిధమున, తనపెద్ద రూపు నుపసంహరించి చిన్నరూపుగలవాఁడై, యనుట, విశ్వవిద్విషత్= లోకులకు శత్రువయిన, రావణపాలితంబగు=రావణునిచేఁ బాలింపఁబడిన, పురంబున్ = నగరమును, లంకననుట ; జనాంతర.........మయిన్ - జనాంతర = ఇతరులచే, దుర్గమ = భేదించుటకసాధ్యముకాని, స్వతేజో విభవ = తనతేజోవైభవమున- అభిగుప్తిమయిన్ = గోపనముచే, రక్షణము చేననుట; చొచ్చి= ప్రవేశించి, తద్విభుండు = ఆలంకారాజగు రావణుఁడు, ఏవెతలేకయుండన్=ఎట్టివ్యథయు లేకుండఁగా, ప్రజన్ ఏలు తెఱంగునకున్= ప్రజాపాలనముగావించువిధమునకు, ఆత్మన్ = మనస్సునందు, మెచ్చుచున్; ముందుపద్యముతో నన్వయించును.

తా. హనుమంతుఁడా సముద్రముదాఁటి రావణపాలితంబగు నాలంకను దా నితరులకంటెఁ బడకుండులాగున సమయమునకుఁ దగినట్లు మార్జారమంతటి చిన్నరూపముదాల్చి నిజతేజముచేతనే నిజరక్షణముకలవాఁడై చొచ్చి యచ్చటి ప్రజలకెట్టి కష్టములులేక రావణుఁడు పాలించుటకాశ్చర్యపడుచు; హనుమంతుఁడులంకాప్రవేశసమయమునఁ జిన్నరూపు ధరించెననుటకు; "పృషదంశకమాత్రస్సన్" అని వాల్మీకి యప్పటి యాతనిరూపము మార్జారమంతటిదని చెప్పెను.

భారత. అవనరాశి = ఆయడవి దాఁటి, తగునట్టిక్రమంబునన్ = తగినవిధమున, వేషాంతరములతో ననుట; విశ్వవిద్విషత్ = సమస్తశత్రువుల యొక్క, రావణ = పాఱఁద్రోలుటచే, పాలితంబగు = పాలింపఁబడుచున్న, పురంబు = విరాటనగరమును, జనాంతర = ఇతరులచే, దుర్దమ = అభేద్యమయిన, స్వతేజోవిభవ = తమతేజోవైభవముయొక్క, అభిగుప్తిమయిన్ = గోపనముచే, స్వతేజముననే స్వరక్షణము గావించుకొనుటచేననుట; చొచ్చి = ప్రవేశించి, మరుత్తనయుండు = మరుత్తుఁడనెడిరాజునొక్క నీతి వంటి నీతిగలవాఁడు, తద్విభుండు = ఆవిరాటరాజు, ఏవెతలేకయుండన్, ప్రజన్, ఏలుతెఱంగుననున్, ఆత్మన్ = తమలో, మెచ్చుచున్, ఆశ్రయించిరని ముందుపద్యముతో నన్వయము ;

తా. పాండవులు వేషాంతరముదాల్చి యడవులుదాఁటి సర్వశత్రుదుస్సాధమగు మత్స్యనగరమును దమతేజముచేతనే తమరక్షణము గావించుకొనుచుఁ జొచ్చి నీతిమంతుఁడగు నావిరాటరాజు ప్రజలకెట్టివెతలేక పాలించుటకు మానసమున మెచ్చుకొని ;

సీ. అతనిలీలాద్భుత ♦ రతిరాజనీతి శా
స్త్రప్రసంగాములు ♦ సలుపునెడలు
నభిమతభక్ష్యభో ♦ జ్యాదిపాకవిశేష
చణసూదకర్మప్ర ♦ సక్తియెడలు
శుద్ధాంతకన్యల ♦ సురుచిరనాట్యాశి
క్షణవినోదంబులు ♦ జరుపునెడలు
గాంధర్వగతి శిక్ష ♦ గావించునెడలు న
త్యంత మాహారక్ష ♦ ణాదివిధులు

గీ. గ్రాలునెడలును గ్రమమునఁ ♦ గాంచి తత్త
దర్హగతి నాశ్రయించి రక్షయంబు మీఱ

నవనిజాతను నైపుణీకవిస్మృతి మెఱసి
పరులెఱుఁగకుండ నే గురుభవ్యధృతిని. 140

రామాయణ. అతని = ఆరావణుని, లీలాద్భుత = విలాసములచే నబ్బురములగు, రతిరాజనీతిశాస్త్ర = శృంగారశాస్త్రములయొక్క, ప్రసంగాదులుసలుపునెడలు = ప్రసంగమున్నగునవి గావించుప్రదేశములు, అభిమత = ఇష్టమైన, భక్ష్యభోజ్యాదిపాకవిశేషచణ = భక్ష్యభోజ్యాదులగుపాకవిశేషములతోఁగూడిన, సూదకర్మప్రసక్తియెడలు = వంటసాలలు, శుద్ధాంతకన్యలన్ = అంతఃపురమునందలికన్యలను, సురుచిర = మిక్కిలి మనోహరములగు, నాట్యశిక్షణవినోదంబులుసలుపునెడలు = నర్తనము నేర్పు ప్రదేశములు, గాంధర్వగతి = సంగీతముయొక్క, శిక్షగావించునెడలు = అభ్యాసముచేయుస్థలములు, అత్యంతము = మిక్కిలి, ఆహార = భోజనము యొక్కయు, క్షణ = ఉత్సవాములయొక్కయు, విధులు = కార్యములచే, క్రాలునెడలును = ప్రకాశించెడిప్రదేశములును, క్రమమునన్ = వరుసగా, తత్తదర్హగతిన్ = దానిదానికిఁదగునట్లుగా, కాంచి = చూచి, రయంబుమీఱన్ = వేగమతిశయింపఁగా, అవనిజాతనుఆశ్రయించి = సీతాదేవినాశ్రయించి, సీతయుండుతావునుద్దేశించియనుట ; నైపుణీ = నిపుణత వలని, విస్మృతి = వికాసముచే, మెఱసి = ప్రకాశించి, పరులుఎఱుఁగకుండనే = ఇతరులు తెలిసికొనకుండునట్లు, గురు = గొప్పదగు, భవ్య = మనోజ్ఞమగు, ధృతిని = ధైర్యముతో; చరియించునని ముందుపద్యమునందలి క్రియతోనన్వయించును.

తా. హనుమంతుఁడు శృంగారశాస్త్రప్రసంగాదులు గావించుస్థలములును, పాకశాలలును, నాట్యశాలలును, సంగీతశాలలును, ఆహారోత్సవాదులు సల్పునెడలును గ్రమముగాఁగాంచి సీతనుద్దేశించి మిక్కిలినైపుణ్యమున నితరులకుం దెలియరాకుండ ధీరతతో;

భారత. అతని = విరాటరాజుయొక్క, లీలాద్భుతంబైన = విలాసముచేనబ్బురమైన, రతి = క్రీడలు, రాజనీతిశాస్త్రప్రసంగాదులు = రాజ

నీతిశాస్త్రములయందలిప్రసంగమున్నగునవి, సలుపునెడలు = చేయు ప్రదేశములు, చేయునట్టిపదవులనుట ; ఇదిధర్మజునకులభించినపదవి ; అభిమత, భక్ష్యభోజ్యాది, ఇట నాదిశబ్దము లేహ్యచోష్యాదులందెల్పును; పాకవిశేషచణ, సూదకర్మప్రసక్తియెడలు=వంటచేయుప్రదేశములు, వంటలవాని పదవియనుట ; ఇది భీమునకు లభించినపదవి యగును; శుద్ధాంతకన్యల, సురుచిర = మిక్కిలిమనోజ్ఞమయిన నాట్యశిక్షణవినోదంబులుజరుపునెడలు; అంతఃపురకన్యకలకు నాట్యశిక్షణమొనర్చుపదవి ; ఇది యర్జునునకు లభించిన పదవియగును ; గాంధర్వ = గుఱ్ఱములకుసంబంధించిన, గతిశిక్షగాంచు నెడలు = గమనాభ్యాసములు గావించుప్రదేశములు, గుఱ్ఱములకు నడక నేర్పునట్టిపదవి, ఇది నకులునకు లభించినపదవియగును ; అత్యంత, మాహా= గోవులయొక్క, రక్షణాదివిధులు = రక్షణాదికార్యములు, ప్రకాశనెడలును = ప్రకాశించుప్రదేశములు, ఇది సహదేవునకు లభించినపదవి, క్రమమునన్ = వరుసగా, తత్తదర్హగతిన్ = వారివారికిఁదగినలాగున, ఆయంబు= శుభావహవిధి, మీఱన్ = అతిశయింపఁగా, నవ=నూతనమయిన, నిజ = తమయొక్క, అతను = తగ్గని, నైపుణీ = నిపుణత్వముయొక్క, విస్పృతి = విశేషగోపనముచేత, మెఱసి, పరులుఎఱుఁగకుండన్, ఏగురు = ఏవురు, పాండవులనుట; భవ్యధృతిని ; ఆశ్రయించిరి = విరాటరాజునాశ్రయించిరి ;

తా. ధర్మజుఁడు నీతిశాస్త్రాది ప్రసంగములుగావించువాఁడుగాను, భీముఁడు వంటలవాఁడుగాను, అర్జునుఁడు నాట్యాచార్యుఁడుగాను, నకులుఁడశ్వరక్షకుండుగాను, సహదేవుఁడు పశుపాలకుండుగాను రాజునాశ్రయించిరి.

"సూదకర్మ" "సూదాఔదనికాగుణాః" అమరము.
"మాహారక్షణ" "గౌరుస్రామాహాచశృంగిణీ" అమరము.

క. అంతటఁ దద్రామనృపతి
కాంతాసందర్శనాభికాంక్షాసహిత

స్వాంతతఁ జరియించుచు శు
ద్ధాంతక్రీడావనస్థ యగు తద్దేవిన్. 141

రామాయణ. అంతటన్ = ఆవల, తద్రామనృపతికాంతా = ఆ సీతయొక్క, సందర్శనాభికాంక్షాసహిత = చూడవలయునని యపేక్ష తోఁగూడిన, స్వాంతతన్=మనస్సుగలవాఁడౌటచే, చరియించుచున్ = సంచరించుచు, శుద్ధాంతక్రీడావనస్థయగు = అంతఃపురకాంతావర్గముయొక్క క్రీడావనమునందుండునట్టి. అశోకవనమునను న్నయనుట; తద్దేవిన్ = ఆ సీతను, పొడగాంచియని ముందుపద్యముతోన న్వయము :

తా. సీతజాడ దెలియ నరయుచుఁడ నంతఃపురకాంతాక్రీడావనమున నాదేవిని ;

భారత. అంతటన్, తద్రామ = ఆద్రౌపది, నృపతికాంతా = సుధేష్ణయొక్క, దర్శనాకాంక్షాసహితస్వాంతతన్ = చూచుటయందలి కోర్కెతోఁగూడిన మనస్సుకలదౌటచే, చరియించుచున్ = తిరుగుచు, శుద్ధాంతక్రీడావనస్థయగు = అంతఃపురముచెంగట విహారవనమునందు, తద్దేవిన్ = ఆసుధేష్ణను; పొడగాంచియని ముందన్వయము,

తా. ద్రౌపది సుధేష్ణం జూడఁదలఁచి తిరుగుచు నంతఃపురముచెంగట విహారవనమున నామెను ;

క. చేరి పొడఁగాంచి యాయమ
చేరిక నతిగూఢతను భజించి వసించెన్
సైరంధ్రీభావమునఁ ద
దారూఢప్రీతి మొగము దగఁ గై సేయన్. 142

రామాయణ. చేరిపొడగాంచి = అసీతనుసమీపించి చూచి, సైరంధ్రీభావమున్ = సైరంధ్రియొక్కభావముచే, మలినవస్త్రాది ధారణములచే

సైరంధ్రీభావముననామె యుండెననుట; తదా = అప్పుడు, రూఢప్రీతి = స్థిరమగుప్రీతి, మొగము=మోము, తగఁ=యుక్తమగుగునట్లు, కైసేయఁ= అలంకరింపఁగా, ఆయమచేరికఁ = ఆ సీతయొక్క సామీప్యమును, అతి గాఢతను=మిక్కిలిగాఢముగా, భజంచి=పొంది, వసించెఁ = ఉండెను.

తా. హనుమంతుఁ డాసీతనుగాంచెను. ఆమె సైరంధ్రివలె మలిన వస్త్రాదిధారిణియై యుండినను నామె ముఖము ప్రకాశించుచుండఁగా గుప్తముగా నామె సమీపమునుజేరెను.

**భారత.** ఆయమఁ = ఆసుధేష్ణను, చేరి పొడగాంచి = చేరి చూచి, సైరంధ్రీభావమునఁ=సైరంధ్రీత్వమున, తదారూఢప్రీతిఁ=ఆమెకు సంతసముదయించునట్లు, మొగముకైసేయఁ = ముఖమును దిలకాదులచే నలంకరింప, చేరికఁ=చేరియుండుటను, ఆమెయొద్దనేయుండుట ననుట; అతిగాఢతను భజించి = మిగుల గాఢప్రవృత్తింబూని, వసించెఁ;

తా. సుధేష్ణంజూచి సైరంధ్రీ భావమున నాబిడ ముఖమును దిలకాదులచే నలంకరించునట్లు చెప్పి యామెయొద్దనే ద్రౌపది వసించెను;

శా. పారేమాయ విజృంభమాణపరమబ్రహ్మాత్మ మధ్యేహృద
బ్జారాధ్యామలదివ్యమంగళనిజాంగాజస్రసాహిత్యచా
ధౌరంధర్యమహత్త్వపాత్రితగుణా ధనకారితాష్టాంగయో
గారూఢింబ్రథమానమానిజనభాగ్యశ్రీసముజ్జృంభణా.

అవతారిక. కవి యీ క్రింది మూఁడు పద్యములచేఁ గృతిపతియగు విరూపాక్ష దేవుని వర్ణించుచున్నాఁడు.

అర్థము. పారేమాయ = మాయనతిక్రమించిన యావల, విజృంభమాణ = ప్రకాశించుచున్న, పరమబ్రహ్మాత్మస్వరూపుఁడా, మధ్యేహృదబ్జ........సముజ్జృంభణా; మధ్యేహృదబ్జ = మనఃకమల మధ్యము నందు, ఆరాధ్య = భజింపఁదగిన, అమల = శుద్ధమైన, దివ్యమంగళ =

దివ్యశుభాకారముగల, నిజాంగ = స్వస్వరూపముయొక్క. అజస్రసాక్షా త్కార = నిత్యసాక్షాత్కారముయొక్క, సౌందర్య = భారవహనము చే నైన, మహత్త్వ = మహిమకు, పాత్రిత = పాత్రముగాఁ జేయఁబడిన, గుణాధఃకారితా = త్రిగుణముల ధిక్కరించుటచే, అష్టాంగయోగ = అష్టాంగయోగమునంగల యనుట; ఆరూఢి = అతిపరిచయమువలన, ప్రధమాన = ప్రసిద్ధమైన, మానిజన=మహర్షి జనులయొక్క, భాగ్యశ్రీ=అదృష్ట విశేషమును, సముజ్జృంభణా = ప్రకాశింపఁజేయువాఁడా;

తా. మాయాతీతుఁడై పరబ్రహ్మ స్వరూపముగలవాఁడవైన నీవు నిర్గుణ స్వరూపుఁడవయ్యు ధ్యానముసేయువారికై దివ్యమంగళ విగ్రహ రూపముగలిగి యష్టాంగయోగము గావించు సాంఖ్యమతముగల మహర్షుల యదృష్టమును వృద్ధిపఱచువాఁడా.

క. ఆధునికసాధునికరస
మాధిదురారాధితామహత్తరవార్తా
రోధార్థవిహితమచ్చి
త్తాధిగమా! పెద్దవేంకటాధిపసుగమా. 144

అర్థము. ఆధునిక = ఈ కాలపువారగు, సాధునికర = సాధుసమూహముయొక్క, సమాధి = ధ్యానముచే, దురారాధిత = ఆరాధింప శక్యముగాని, మహత్తర వార్తా = అధికమైనప్రసంగముయొక్క, రోధార్థ = నిరాకరణమున, విహిత = చేయఁబడిన, మచ్చిత్తాధిగమా = నామానసముతోడసంగముగలవాఁడా, పెద్దవేంకటాధిపసుగమా= పెద్దవేంకటాద్రిచేఁ జక్కఁగా నెఱుఁగఁబడినవాఁడా,

తా. ఇప్పటివారెంత తపమొనర్చినను సిద్ధింపదను వార్తను నిరాకరించుటకై నాహృదయసాంగత్యము గలవాఁడా పెదవెంకటాద్రిచే నెఱుఁగఁబడినవాఁడా;

మ త్తకోకిల. భూధరాధిపకన్యకామణిశ్రీపుణ్యపాదపయోజ లా
క్షైధితారుణగై రికద్యుతిశ్రీహేమకూటవిహారలీ
లాధికాదర సాధుసాధిత శ్రీ హైమవత్యనురంజనా
రాధితస్మరమోచితాత్మపురాతనాపకృతిస్మృతీ. 145

గద్యము. ఇది నిఖిలసూరిలోకాంగీకార తరంగిత, కవిత్వవై భవ
యమరనార్యతనూభవ, సౌజన్యజేయ, సూరయ
నా మ ధే య ప్ర ణీ త ం
బై న రాఘవ పాండ
వీయంబు నందుఁ
ద్వితీయాశ్వాసము.

అర్థము. భూధరాధిప కన్యకామణి = హిమవంతుని పుత్రికయగు పార్వతియొక్క, పుణ్యపాదపయోజ = పవిత్రములైన పాదతామరసముల యందుండు, లాక్షా+ఏధిత = లత్తుకరసముచే వృద్ధిపొందఁబడిన, అరుణ= ఎఱ్ఱనగు, గైరికద్యుతి = జేగురుకాంతిగల, హేమకూట విహారలీలా = హేమకూట పర్వతమునందలి క్రీడావిలాసమునందు, అధికాదర = మిక్కిలి ఆదరముగలవాఁడా, సాధుసాధిత = సత్పురుషులచే సాధింపఁ బడినవాఁడా, సత్పురుషులకు వశుఁడగువాఁడా యనుట ; హైమవతీ=గౌరీ దేవి యొక్క, అనురంజన = రంజనముచే, ప్రేమపురస్సరముగ నడుగుకొను టచే ననుట ; ఆరాధిత = ఆరాధింపఁ బడినవాఁడవై, స్మరమోచిత = మన్మథునికొఱకై విడువఁబడిన, ఆత్మపురాతనాపకృతిస్మృతీ= తనయెడఁ బూర్వమొనర్చిన యపకారముయొక్క స్మృతిగలవాఁడా, పార్వతీ ప్రా ర్థనచే మన్మథుఁడు దనయెడల నొనర్చిన యపరాధమును మన్నించి మరల వానిం బ్రదికించెననుట ;

తా. పార్వతి పాదములలోని లత్తుకరసముచే కేగురు కాంతిగల హేమకూటమునందలి విహారమున నధికాదరముకలవాఁడా, సత్పురుషులచే సాధింపఁబడినవాఁడా, పార్వతీప్రార్థనమున మన్మథుని యపరాధమును విస్మరించినవాఁడా ;

పైమూఁడు పద్యములు నాశ్వాసాంత రూపములు.

గద్యము. ఇది శ్రీహయగ్రీవ కరుణావలబ్ధ సారస్వతసారో, భయ
భాషాకవిత్వత త్త్వజ్ఞ, చెన్నపురీ విశ్వవిద్యాలయసమా
సాదితవిద్వద్బిరుదాంచిత, కవికులతిలక, భారద్వాజ
గోత్ర పవిత్ర, శ్రీ శ్రీనివాసార్యానూజ, మంగ
మాంబాగర్భశు క్తి ముక్తాఫల, భాష్యకార
కవివిరచితం బైన, కవిభావప్రకాశికా స
మాఖ్యంబగు రాఘవపాండవీయ వ్యాఖ్య
యందుఁ దృతీయాశ్వాసము.



శ్రీ ర స్తు.

# రాఘవపాండవీయము

## చతుర్థాశ్వాసము.



రుచిర తుంగభద్రా
తీరాస్పదయాకువీటి తిమ్మాగ్రతనూ
జారాధిత నిత్యదయాం
కూరవిరూపాక్ష హేమకూటాధ్యక్షా.

అవతారిక - ఆశ్వాసాదింగవి కృతిపతియగు విరూపాక్ష దేవుం జేరొక్కనుచున్నాఁడు.

అర్థము. శ్రీరుచిర = సంపదచే నందగించువాఁడా, తుంగభద్రా తీరాస్పద = తుంగభద్రానదీతీరము నునికిపట్టుగాఁ గలవాఁడా, ఆకువీటి తిమ్మాగ్రతనూజారాధిత = ఆకువీటి తిమ్మరాజుయొక్క జ్యేష్ఠపుత్రుఁడగు పెదవేంకటాద్రి రాజుచే నారాధింపఁబడినవాఁడా, నిత్యదయాంకూర = నిత్యమగు కృపాంకురము గలవాఁడా, హేమకూటాధ్యక్షా = హేమకూటమునకు నాయకుఁడగువాఁడా, విరూపాక్ష = విరూపాక్షదేవుఁడా; అవధరింపుమని ముందన్వయము;

వ. అవధరింపు మక్కాలంబున. 2

క. తనయేలికసాని కడకుఁ
దనరు ఘనైశ్వర్య రక్షి తదనుజుఁడఘువ
ర్తనుఁడే తెంచిన నప్పా
వని పతిహితవృత్తి నడఁగి వర్తిలె మిగులన్. 3

అవతారిక. అశోకవనికలోన రావణుఁడు సీతను సమీపించు కథాభాగమును, సుధేష్ణామందిరమునఁ గీచకుఁడు ద్రౌపదిని సమీపించు కథాభాగమును గవి సంఘటించి పలుకుచున్నాఁడు.

**రామాయణ.** తనయేలికసాని కడకున్ = తన యజమానుఁడగు రాముని పత్నియగు సీతయొద్దకు, తనరు=ఒప్పెడి, ఘన+ఐశ్వర్య = గొప్పయైశ్వర్యముచే, రక్షిత = రక్షింపఁబడిన, దనుజుఁడు = అసురుఁడు, రావణుఁడనుట ; అఘవర్తనుఁడు = పాపవర్తనుఁడు, [ఇది రావణునకు విశేషణము.] ఏతెంచినన్ = రాఁగ, అప్పావని = ఆ హనుమంతుఁడు, పతిహితవృత్తిన్=యజమానుఁడగురామునకుమేలు కలుగు నునికిచే,మిగులన్= ముక్కిలి, అడఁగి = అణఁగి, వర్తిలెన్ = వర్తించెను; తాను బయలుపడినచో నింతదనుకఁ దానొనర్చినదెల్ల వ్యర్థమై రామకార్యము చెడునుగాన నట్లుగాకుండ గుప్తముగాఁ గార్యము సాధించుట యుక్తమని తా నణఁగి యుండెనని భావము ;

తా. రావణుఁడు సీతం గాంచరాఁగ హనుమంతుఁ డాతనికిఁ దెలియకుండు భాగున దాఁగియుండెను.

ముద్దరాజు రామన్న 'పతిహితవృత్తి యైనవానికిఁ దద్భార్య చిత్తశుద్ధిని శోధించెడుచోట నణఁగియుండుట ధర్మమనెనుగాని పతివ్రతయగు సీతవిషయమున నిట్టి పరిశోధనముగావించుట కవి యాశయము గానేరదు. కాన నాయభిప్రాయము సమంజసము గాదు.

**భారత.** తన యేలికసానికడకున్ = తనకు రక్షకురాలగు సుధేష్ణయొద్దకు, తనరు, ఘనైశ్వర్యరక్షి = గొప్ప యైశ్వర్య రక్షగలవాఁడు, తదనుజుఁడు = ఆవిడ సోదరుఁడు, కీచకుఁడనుట ; అఘవర్తనుఁడు, ఏతెంచినన్ = రాఁగ, ఆ+పావని = పవిత్రురాలగు నా ద్రౌపది, పతిహిత

వృత్తిన్=భర్తయగు ధర్మజుఁ డుపదేశించిన హితముచొప్పున, మిగులన్ అణఁగియుండెన్ = మిక్కిలి వినయవతియై యుండెను.

ధర్మజుఁడు ద్రౌపదికుపదేశించిన హితముచొప్పున ననుటకు; "మన వంశంబున వృత్తం,బును బెంపును గానఁజాలుపుణ్య సతివి దు, ర్జను లగు తలువలతలఁపులు, గనుఁగొని యేమఱక మెలఁగఁ గావలయుఁ జుమీ" భారతము. విరాటపర్వము.

వ. అప్పుడు. 4

చ. అతనుఁడుతత్సతిద్యుతిసహాయత నెంతయుఁ గ్రొవ్వియవ్వని
ర్జితరిపునింద్రజిద్గురు విజృంభితవైభవు దేహసార త
ర్జితశతకోటి సింహబలుఁ సిగ్గుసెడంగడుగాసి సేసె న
ద్భుతముగదా! యెసంగునెడఁ బొల్లగునెవ్వరియెట్టి పెంపులున్.

**రామాయణ.** అతనుఁడు=మన్మథుఁడు, తత్సతిద్యుతి సహాయతన్= ఆ సీతాదేవియొక్క కాంతి సహాయమున, తన యైదుబాణములును రావణు నెడల వ్యర్థములుగాఁగ నిఁకఁ జేయునది లేక చింతించుచుండ దైవవశమునఁ జిక్కిన సీతాదేవిరూపము నాధారము గావించుకొని స్వకార్యసిద్ధియగు నని మరల నుత్సాహవంతుఁ డయ్యెనని భావము. దీన సీతాదేవితనువాతని కాఱవబాణముగా నుండుననుట వ్యంజితము; ఎంతయున్ = మిక్కిలి, క్రొవ్వి = గర్వించి, అవ్వనిర్జితరిపున్ = జయింపఁబడిన శత్రువులను గల వానిని, శత్రువుల జయించినవానిననుట; ఇంద్రజిద్గురున్ = ఇంద్రజిత్తుని తండ్రియగువానిని, రావణుననుట; విజృంభితవైభవున్ = అతిశయితవిభ వుని, దేహసార తర్జిత శతకోటి సింహబలున్ = దేహబలముచేఁ దిరస్క రింపఁబడిన పలుసింహములవలె బలము గలవానిని, సిగ్గుసెడన్ = లజ్జ నశించునట్లు, కడున్ = మిక్కిలి, గాసిచేసెన్ = బాధపెట్టెను, ఎసంగు నెడన్ = అభివృద్ధియగు తరుణమున, [అతనుఁడనుకర్త యధ్యాహార్యము;]

ఎవ్వరి ఎట్టిపెంపులున్ = ఎట్టివారియొక్క యెట్టిపెంపులేనియు, పొల్లగున్ = వ్యర్థమగును, మన్మథాక్రాంతుఁ డెట్టివాఁడైనను నెట్టిపెంపుగలవాఁడైనను నాతని పెంపెల్ల వ్యర్థమేయగునని భావము; మదనాక్రాంతుఁడు దన పెంపుంజూడక సమయము వచ్చినప్పుడెట్టి నీచకార్యమునకును వెను దీయఁడనుట; అద్భుతముగదా = ఇది యాశ్చర్యముగదా; గొప్పవాఁడు మదనాభిభూతుఁడై లాఘవమందుట యాశ్చర్యముగదా యని భావము.

తాత్పర్యము సుగమము.

"తత్ప్రతిద్యుతి సహాయతనెంతయుఁ గ్రొవ్వి." మదనుఁడు సీతా సహాయమునఁ దనకార్యము పూర్తియగునని మరల ధైర్య మవలంబించుట చేతనే యాదిని ప్రయత్నించునపుడుండిన గర్వముగూడ మరల వచ్చెనని భావము. ఇదేయర్థమును, శివతపోభంగ ప్రయత్నసమయమున నష్టధైర్యుఁడగు మన్మథుఁడు పార్వతింగాంచి స్వకార్యసిద్ధియగునని మరల నుత్సాహవంతుఁ డయినట్లు కాళిదాసుఁడు కుమారసంభవమున; తృతీయసర్గమున; "తాంవీక్ష్య సర్వావయవానవద్యాం, రతేరపిహ్రీపదమాదధానాం, జితేంద్రియేశూలిని పుష్పచాపః, స్వకార్యసిద్ధిం పునరాశశంసే;" అని చెప్పెను.

"సింహబలున్" "సింహస్యేవబలోఽస్య సింహబలః." అని సమాసము, "ఉపమానాచ్చ" పాణిని.

**భారత.** అతనుఁడు, తత్ప్రతిద్యుతి సహాయతన్ = ఆద్రౌపదీ కాంతి సహాయముచే, ద్రౌపదీ శరీరకాంతి నండగావించుకొని యని భావము; ఎంతయున్, క్రొవ్వి = గర్వించి, నిర్జితరిపున్, ఇంద్రజిత్ = ఇంద్రుని జయించిన, ఇంద్రునిమీఱిన యని భావము; గురు = అధికమగునట్లుగా, విజృంభిత = అతిశయించిన, వైభవున్ = విభవముగల వానిని, అత్యతిశయిత స్వవైభవమున నింద్రుని వైభవముంగూడ మీఱినవానినని భావము; దేహసారతర్జిత శతకోటిన్ = స్వదేహబలమునఁ దిరస్కరింపఁబడిన వజ్రాయుధము గలవానిని, వజ్రాయుధముకంటెఁ బాటవము గలవాని ననుట;

సింహాబలుఁ = కీచకుని, సిగ్గుసెడన్, కదుర్, గాసిచేసెన్ = కష్ట పఱచెను, [అతనుఁడు] ఎపంగు సెడన్, ఎవ్వారి, ఎట్టిపెంపుర్, పొల్లగుఁ = వ్యర్థమగును ;

తాత్పర్యము సుగమము.

అర్థాంతరన్యాసాలంకారము.

సీ. అట్లనంగుఁడునొంప ♦ నద్దురాత్ముండు పా
తివ్రత్యనిధినాసతీలలామ
ననుచితోక్తులు పెక్కు ♦ లాడి యల్గించియు
దీనినెట్లైన సాధించి నాదు
ప్రాణంబు రక్షింపుఁ ♦ డని దూతికలస్వస
నాన్నగాంభీర్య హీనత నెరఁగుచుఁ
దా వెండియును జెప్పఁ ♦ దగునట్టి సద్బుద్ధు
లప్పని వారించి ♦ చెప్ప వెఱచి

తే. తనకు ననుకూలమైన చంద్రంబునడువెఁ
జెచ్చు వెరిఁగెడు తమకంబు ♦ పేర్మిఁ దాన
యాకెఁ బలుమాఱుఁ జేరిపే ♦ దఱపు లఱచి
యును మనోజవికార వర్తనలుసలిపె. 6

**రామాయణ.** అట్లు, అనంగుఁడు = మన్మథుఁడు, నొంపర్ = నొప్పింపఁగా, బాధగల్గింపఁగానుట; అద్దురాత్ముండు = దుష్టుఁడగునా రావణుఁడు, పాతివ్రత్యనిధిర్ = పాతివ్రత్యమునకునిధియగు, ఆసతీ లలామర్ = ఆస్త్రీశ్రేష్ఠురాలగు సీతాదేవిని, అనుచితోక్తులు పెక్కులు ఆడి= అనుచితములగు పలుపల్కులాడి, అల్గించియుర్ = కోపింపఁజేసియును, దీనిర్ = సీత తనకు భార్యగానగునట్టి యీకార్యమును, ఎట్లైనను

సాధించి = ఏలాగునైననిసాధించి, నాదుప్రాణంబు = నాప్రాణమును, ఇటనస్మదర్థకమగు షష్ఠీసమాసమగుటచే వైకల్పికముగా దుగాగమంబు; రక్షింపుఁడు అని = కాపాడుఁడని, దూతికలన్ = స్వసన్మాన గాంభీర్య హీనతన్ = తన గౌరవగాంభీర్యములు నశించుటచే, ఎరఁగుచున్ = నమస్కరించుచును, క్రిందిపద్యమునఁ దెల్పినలాగున; "వతనుఁ డెసంగు నెడ బొల్లగు నెవ్వరియొట్టి పెంపులు" ననుదానికిది ప్రత్యక్ష నిదర్శనమగుచున్నది. 'కామాతురాణాం నభయం నలజ్జా'యనుట నిక్కువమనుట దీన సూచితము. తాన్ = రావణుఁడు, వెండియున్ చెప్పన్ = మరలఁజెప్పఁగా, మాటి మాటికింజెప్పి నిర్బంధింపఁగానని భావము, అప్పనిన్ వారించి = అకృత్య మును నివారించి, తగునట్టి సద్బుద్ధులు చెప్పన్ = యుక్తమగు సద్బుద్ధులు చెప్పఁగా, అకామను గామించినఁ దృప్తిజనింపదుగావున నీవు నాతో సుఖింపుము. సీతతో నేమిపని యను నిట్టివాక్యములు ధాన్యమాలిన్యాది సఖీ జనము చెప్పఁగా, వెఱచి = భయపడి, ప్రత్యక్షమున వారిమాటల నిరాక రింప సంకోచించి యని భావము; తనకున్ అనుకూలమయిన చందంబు నడపెన్ = తన కనుకూలమగు విధమును నడపెను, ఇంక వీరితోఁజెప్పి ప్రయోజనములేదు. మనమే యామెం బల్కరింతమని యట్లొనర్చెననుట; పెచ్చు పెరిఁగెడు తమకంబుపేర్మిన్ = మిక్కిలి అభివృద్ధ మగుచుండు త్వరాతిశయమున, తాన = తానే, ఆకెన్ = ఆమెను, చేరి, పలుమాఱున్ = పెక్కు పర్యాయములు, పేదఱపులు అఱచియును = నీచతరోపం బ్రబల పించియు, మనోజవికార వర్తనలు = మన్మథవికారవర్తనలు, చలిపెన్ = చేసెను, మన్మథాభిభూతుఁడగుటం దదనుగుణ దుర్విలాసముల రచించె ననుట;

తా. మన్మథుఁడిట్లు నొంప నా దురాత్ముఁడు సీతయొద్ద కరుదెంచి పెక్కు నీచోక్తులాడి యామెకలుక గలిగించియు,నికార్యమెట్లేని సాధింపుఁ డని దూతికలతో నాడి నిజగౌరవ గాంభీర్యములవీడి వారి పాదములపెఁబడి

యును, వారు నీకిక్కార్యంబు దగదని నివారించిచెప్ప దాక్షిణ్యమునఁ బ్రత్య క్షమున వారిని నిరాకరింపఁజాలక సంకోచించి, ఇంక నాకార్యము నేనే నడపు కొందునని యందులకువలయు యత్నములఁ దానే చేయఁ బూను కొనెను. మదనుఁ డతిశయముగా బాధించుటచేఁ దానయామెను సమీపించి నీచత దోఁపఁ బ్రలపించి మన్మథ దుర్విలాసము లొనర్చెను.

"అప్పనిక్, వారించి, చెప్ప, వెఱచి." ఇటఁ గొందఱు ; "అప్పని వారు, ఇంచి, చెప్పక్, వెఱచి" యని పదచ్ఛేదముగావింపఁ జూచెదరు కాని, అప్పనిక్, వారించి, చెప్పక్ = అని పదచ్ఛేదము చేయుటయే సమంజసము ;

"అప్పని వారించి చెప్పక్." రావణునితో ధాన్యమాలిని యకా ర్యము వారించి చెప్పినందులకు ; "అకామాం కామయానస్య, శరీరము పత్ ప్యతే, ఇచ్ఛంతీంకామయానస్య, ప్రీతిర్భవతి శోభనా." రామాయణము. సుందరకాండము.

భారత. అట్లు, అనంగుఁడు, నొంపక్ = నోవఁజేయఁగా, అద్దురా త్ముండు = దుష్టుఁడగు నాకీచకుఁడు, పాతివ్రత్యనిధిక్ = పతివ్రతాత్వ మునకు స్థానమగు నాద్రౌపదిని, అసతీలలామక్,అనుచితోక్తులు, పెక్కులు, ఆడి, అల్గించియుక్ = కోపముగలిగించియు, దీనిక్, ఎట్లైనక్ సాధించి నాదుప్రాణంబు, రక్షింపుఁడు, అని, దూతికలక్ = చేటికలను, స్వసక్ = సోదరియైన సుధేష్ణను, మానగాంభీర్యహీనతక్ = మానమును గాంభీర్య మును హీనమగుటచేత, ఎరఁగుచుక్, తాక్, వెండియుక్ = మఱియును, చెప్పక్, అప్ప=అక్కయగు సుధేష్ణ, నివారించి=ఆపని వలదని నివారించి, తగినట్టి సద్బుద్ధులు చెప్పక్ వెఱచి=తగినట్లుగా మంచిబుద్ధులుచెప్పుటకు భయ పడి,సుధేష్ణ దాసద్బుద్ధులుబోధించియు నుపయోగ శూన్యమగుటచేఁ బైపైనఁ జెప్ప వెఱచియని భావము; తనకుక్ అనుకూలమగు చందంబుక్ నడపెక్ = కీచకున కనుకూలమగు విధము నడపెను, పెచ్చుపెరిఁగెడు తమకంబు

పేర్మిన్, తాన, ఆకెన్ = ఆద్రౌపదిని, పలుమాఱున్, చేరి, పేదఱపులు, అతిచియును, మనోజవికారవర్తనలు, చలిపెన్ = చేసెను ;

తా. మదనబాధితుఁడగు కీచకుఁడు ద్రౌపదింజేరి యనుచితోక్తులాడి యామె నలిగించియు, దూతికలకును సోదరికిని నమస్కరించి యెట్లే నీ కార్యము సాధింపవలెననియునాడఁగఁ, దోడఁబుట్టువగు సుధేష్ణసామాన్య ముగ వారించియు నుపయోగము లేకపోవుటచేఁ బూర్ణముగా వారింపఁ జాలక యాతనియిష్ట మంగీకరింపఁ గీచకుఁడు మదనపరాభూతుఁడై యా ద్రౌపదింజేరి నీచతవోఁప మనోజదుర్విలాసములం గావించెను. "ప్రాణంబు రక్షింపుఁడని దూతికల." ఇటఁ బ్రాణశబ్దమునకు "ప్రకర్షేణ అనంత్యనేనే తి ప్రాణః. అన ప్రాణనే." అని గురుబాల ప్రబోధికాకారుఁడు వ్యుత్పత్తి గావించుటచే; ప్ర అనునది యుపసర్గ యగుచున్నది. కావున నిది ప్రాది యతులకు సంబంధించినది. ప్రాదియతు లుభయవళులుగాన నిట; 'అని దూతి కల ;' నని, అకారముతో యతిచెల్లెను. దీనికి లక్షణము ; "ఆంధ్రమునఁ జేరని పరాజపులు మూఁడు, గాక తక్కిన యుపసర్గకములతలల, స్వరముల దికినవాని కవ్వలననిలుచు, నచ్చయిన హల్లయినఁ బ్రాదియతియనఁదగు." అప్పకవీయము. మూఁడవ యాశ్వాసము.

"స్వసన్." "భగినీస్వసా" అమరము.

"అప్పని వారించి చెప్పన్." సుధేష్ణ కీచకుని నివారించెననుటకు ; "ఆయురైశ్వర్యకీర్తుల నపహరించు, పరసతీసంగమము ధర్మపథము నందుఁ, బరఁగువారలు పరిహరింపంగఁ గనియు, వినియుఁ దెలియవె యిది దుర్వివే కము." భారతము. విరాటపర్వము.

"చేరిపేదఱపులఱచి." ఇట నత్వసంధి యగునుగదాయని కొంద ఱభిప్రాయపడి "చెఱచిపో నఱపులఱచి" యని దిద్దియున్నారుగాని యత్వసంధి యకార్యలమున దూష్యము గాకుండెను.

వ. అప్పుడప్పతివ్రతాతిలకంబు. 7

తడయక = ఆలసింపక, తదంఘ్రితామరసములకున్ = పాదపద్మములకు, శరణుచొరుము;

తా. ఓరిమూఢా ! నీవిట్లుత్రుళ్లుటయకాని బ్రదికెడు విధమెంతయు నెఱుఁగవు, నాభర్తలేవురు గంధర్వులుగలరు, వారాగ్రహించినచో నెందఱు రాక్షసు లెందఱు యక్షులేనియు వారిబాహుబలమునకుఁ జిక్కియణఁగక మానరు, వారి పరాక్రమము నీ మదమణఁపఁగలదు, బ్రదుకనిచ్చయుండిన చో నీ వొనర్చిన తప్పుగావ వారిపాదముల శరణుచొరుము.

వ. అనుమాటలు విని వాఁ డనాదరదుర్విలాసంబున వెడనవ్వు నివ్వటిల్ల నవ్వరవర్ణినిం గనుంగొని. 9

రామాయణ భారతార్థములు సుగమము. [వాఁడు=రామాయణ. రావణుఁడు, భారత. కీచకుఁడు.] అవ్వరవర్ణినిన్ = [రామాయణ. సీతను, భారత. ద్రౌపదిని.]

ఉ. బేలవుగావె నీవు వెఱపించెదు వీరిని వారిఁబోలె న
న్నోలలితాంగి! నాకునిల నోపరు రుద్రముఖాఖిలామరు
ల్లోలుఁ గుయుక్తు లిందులఁ దలంకిఁ దలంకెదఁగాని తావక
భ్రూలతి కాధనుస్స్ఫురదపూర్వవిజృంభణ మన్మథోద్ధతిన్.

రామాయణ భారతార్థములు సమము. నీవు బేలవుగావె = ముగ్ధురాలవు గావా, వీరినివారిన్ పోలెన్ = వీరిని వారినివలె, నన్నున్, వెఱపించెదు = భయపెట్టెదవు, ఓలలితాంగి [రామాయణ; సుందరాంగియగునో సీతా, భారత; సుందరాంగియగునో ద్రౌపదీ,] రుద్రముఖాఖిలామరుల్ = రుద్రుఁడుమున్నగు సర్వదేవతలును, ఇలన్ = భూమియందు, నాకున్ = [రామాయణ; రావణునకు, భారత; కీచకునకు,] ఓపరు = శక్తులుగారు, నన్నెదిరింపశక్తులుగారనుట; కుయుక్తులు = నన్ను బేలుపు

చ్చుటకుగాఁ జేయునీకుత్సితప్రయుక్తులు, చాలుఁ, ఇందులకు, తలంకక = వీనిచే భీతిలువాఁడనుగాను, నన్నువంచించుటకుఁగా నీవేవియో కుయుక్తులు నల్పుచున్నదానవుగాని యిట్టివానికి నే భీతిలువాఁడను గానని భావము; తావక.........మన్మథోద్ధతికి; తావక = నీకుసంబంధించిన [రామాయణ సీతకుసంబంధించిన, భారత; ద్రౌపదికి సంబంధించిన,] భ్రూలతికా = లతవంకటికను బొమలనెడు; ధనుః = విండ్లచేత, భ్రూలతికాధను రాధారముచేసనుట; స్ఫురత్ = ఒప్పుచున్న, అపూర్వ = నూత్నమగు, విజృంభణ = విజృంభణముగల, మన్మథోద్ధతికి = మన్మథుని పరాక్రమముచే నీకనుబొమ లనెడివిండ్లసాయముగల్లుటచే మన్మథుని పరాక్రమ మపూర్వ విజృంభణముగలదై యొప్పుచున్నదని భావము; తలంకెదన్ కాని = భయపడెదనుగాని, తక్కిన నీకుయుక్తులకు భీతిలు వాఁడఁ గానని పూర్వముతో నన్వయము.

తా. ఓముగ్ధురాలా! వారివీరివలెనన్ను భయపెట్టకుమా, రుద్రాది దేవతలు గూడ నాయెదురనిలువఁ జాలరు. ఈకుయుక్తులు చాలును, వీనికి నే జంకువాఁడను గాను. అయినను నీభ్రూలతికాచాపమునాధారము గావించుకొని విజృంభించెడి మన్మథుని శౌర్యమునకు మాత్రము భీతిలువాఁడను.

ఒకానొక ప్రతిలో; "రుద్రముఖానిలామరుల్" అనిపాఠ భేదముండెనుగాని పెక్కుప్రతులలో "రుద్రముఖా ఖిలామరు"లని పాఠముండుటచేతను, నయ్యాది సందర్భశుద్ధముగాను నుండుటచేతను నాపాఠమే యంగీకరింపఁబడెను.

"చాలుకుయుక్తులు." కొందఱీస్థలమున, కు+ఉక్తులు అని పదచ్ఛేదముగావించి సాధ్యసమాసముగా, కుయుక్తులని యభిప్రాయపడెదరుగాని "కుయుక్తులు = కుత్సితములగు యుక్తు"లని సులభముగా నర్థమగుచుండ నీక్లిష్టకల్పన మంతరసవంతముగాదు.

చ. వినుమికఁ బెక్కు లేల? యలివేణి నిజంబుగ నీకృపావలో
కన మిపు డబ్బకున్న రతికాంతునిచే నిమిషంబు నిల్వనో
పనని రసోద్ధతిం బలుకఁ బావని యాసతి వాఁడు బల్మిఁ బ
ట్టునొ యనుశంక యప్పుడు గడుం బొడమం దనయాత్మలోపలన్.

**రామాయణ.** అలివేణి, ఇఁకన్, వినుము, పెక్కులేల = పలుమాట లేల, నిజంబుగన్ = సత్యముగా, నీకృపావలోకనము=దయతోడి నీచూపు, ఇపుడు, అబ్బకున్నన్ = కలుగకుండిన, రతికాంతునిచేన్ = మన్మథుని చే, మన్మథబాధవలననుట, నిమిషంబు = నిముసమేనియు, నిల్వన్ ఓపన్ = నిలువఁజాలను, ఇంతవఱకు రావణుని పలుకులు; అని, రసోద్ధతిన్=రసాతిశయమున, పలుకన్ = చెప్పఁగా, పావని = పవనపుత్రుఁడగు హనుమంతుఁడు, ఆసతిన్ = ఆసీతను, వాఁడు = రావణుఁడు, బల్మిన్ = బలాత్కారముగా, పట్టునో అనుశంక = గ్రహించునేమో యను సంశయము, అప్పుడు, తన యాత్మలోపలన్ = తనమదిని, కడున్ = మిక్కిలి, పొడమన్ = కలుగఁగా; ముందుపద్యముతో నన్వయము; భారతార్థపోషణమునకై హనుమంతుఁడు, ఎచ్చట సీతను రావణుఁడు బలాత్కారముగా గ్రహించునోయని సంశయించెనని తెలిపిరను రావణుని యామన్మథ పారవశ్యముగాంచిన హనుమంతుఁడు సంశయించినట్లు చెప్పుట సందర్భశుద్ధముగానే యున్నది

**తా.** ఓసీతా! వినుము. వేయిమాటలేల? నీకటాక్ష మబ్బదేని నే మన్మథుని బాధనుండి తప్పఁజాలనని రావణుఁ డాడినంత హనుమంతుఁడా రావణుఁడెచ్చట సీతం బలాత్కరించునో యని సంశయించి;

**భారత.** అలివేణి, ఇఁకన్, వినుము = ఆలకింపుము, పెక్కులేల = పలుపలుకులేల, నిజంబుగన్, నీకృపావలోకనము = దయతోడి నీచూపులు,

ఇపుడు, అబ్బకున్నన్ = కలుగకున్నయెడల, రతికాంతునిచేన్ =మన్మథుని చేత, మన్మథుని బారివలన ననుట; నిమిషంబు, నిల్వనోపన్ = నిలువఁ జాలను, ఇంతపలుకుఁ గీచకుని పలుకులు; అని, రసోద్ధతిన్, పలుకన్, పావని = పవిత్రురాలగు, ఆ సతి = ఆ ద్రౌపది, వాఁడు = ఆకీచకుఁడు, బలిమిన్, పట్టునో, అను, శంక = సందేహము, ఆత్మలోపలన్ = మనస్సు నందు, అపుడు, కదురన్, పొడమన్ = కలుగఁగా; ముందుపద్యముతో నన్వయము;

తా. ఓ ద్రౌపదీ! నాపలుకు లాలింపుము. పలుమాటలేల? నీకటాక్ష మబ్బకున్న మన్మథుని బారినుండి తప్పఁజాలను అని కీచకుఁడు రసాతిశయ ముచేనాడ నాద్రౌపది కీచకుఁడేచట దన్నుంబట్టునో యని మది సంశ యించి;

క. తతభీమ భుజబలంబున
నితని బలం బడఁపకున్న నెంతయు విపరీ
తత వచ్చుఁ దప్పదిప్పుడ
మతిఁబూని మరల్చెదమిత మన్యుత్వరతన్. 12

రామాయణ. తతభీమ భుజబలంబునన్ =హనుమంతుఁడు శత్రుభయం కరమగుచు విస్తరించియుండు తన భుజబలముచే, ఇతని మదంబు అడఁప కున్నన్ =ఈ రావణుని మదమణఁపకుండిన,ఎంతయున్ విపరీతతవచ్చున్= మిక్కిలి వైపరీత్యముగల్గును, ఇపుడు తప్పదు = ఇపుడీతని మదమణఁపక తప్పదు, అను మతిన్ = అనుబుద్ధిని, పూని, దమితమన్యుత్వరతన్ = కోపమువలని త్వరనణఁచుటచే, మరల్చెన్ = తనమదిని మరల్చెను;

తా. తన బాహుబలమున రావణుని మదమణఁపకుండిన నింక వైపరీత్యము సంభవించునని తలఁచియు మరలఁ గోపమువలని తొందరపాటు నణఁచికొనెను.

**భారత.** సతియని పూర్వపద్యమునందలి కర్తయధ్యాహార్యము, తతభీమ భుజబలంబునన్ = విస్తారమైన భీముని భుజబలముచే, ఇతనిమదంబు = కీచకుని మదము, అడఁపకున్నన్, ఎంతయున్ = మిక్కిలి, విపరీతత = వైపరీత్యము, వచ్చున్, ఇపుడు, తప్పదు=కీచకుని మదమణఁచుట తప్పదు, అనుమతిన్, పూని, దమితమన్యుత్వరతన్=తన కోపమువలని త్వరనణఁచు కొనుటచే, మరల్చెన్ = తన యా యభిప్రాయమును మరల్చుకొనెను. ఎచ్చటఁ దన యజ్ఞాతవాస విషయము ప్రకటమగునోయని యాగ్రహమువలన జనించిన త్వర నణంచుకొనెనని భావము;

తా. ద్రౌపది భీముని భుజబలమునఁ గీచకుని మదమడఁపఁ దలంచి యు నెచ్చటఁ దన యజ్ఞాతవాసవిషయము బైలుపడునోయని యాక్రోధ ముపసంహరించుకొనెను.

క. అని వార్యమాణరోషం
బున నవనిజయుక్తి ధార్ష్ట్యము దలిర్పఁగ న
మ్మనసిజవశుఖలు మగుడిం
చి నితాంతము నడలె నతనిచేఁతకు నంతన్. 13

**రామాయణ.** అని వార్యమాణరోషంబునన్ = నివారింప శక్యము గాని రోషమున, అవనిజ = సీత, ఉక్తిధార్ష్ట్యము = మాటలయందలి దిట్టతనము, తలిర్పఁగన్ = ఒప్పఁగా, అమ్మనసిజవశున్ = ఆమన్మథపరతంత్రుఁడగు, ఖలున్ = దుష్టుఁడగు రావణుని, మగుడించి = మరల్చి, అంతన్, అతనిచేఁతకున్=అతనికార్యమునకున్, నితాంతమున్=మిక్కిలి, అడలెన్ = వణఁకెను;

తా. మిక్కిలి దుఃఖమున సీత తనమాటలచే నారావణుని మరల్చెను గాని దుష్టుఁడగునాతనిచేఁత లెఱిఁగినదికావున నెచ్చట నతఁ డేయక్రమము గావించునోయని భీతిలెను.

**భారత.** అని = ఇట్లని ద్రౌపదితలఁచి, వార్యమాణరోషంబునన్ = వారింపఁబడిన క్రోధముచే, నవ = నూత్నమైన, నిజ = తనయొక్క, ధార్ష్ట్యము = దిట్టతనము, తలిర్పఁగన్, అమ్మానసిజవశున్, ఖలున్ = నీచుఁడగువా కీచకుని, మగుడించి, అంతన్, ఆతనిచేఁతకున్ = అతని కార్యమునకు, నితాంతమున్, అడలెన్ = భీతిలెను.

తా. అని యీలాగునఁ దలఁచి తనకోపము నణఁచికొని యాతని నణంచియు నతనిచేఁతలఁదలంచి భయపడెను.

ఆ. సూపకారవృత్తి దీపింప మారుతి
యున్నవాసమూర్తిఁ జెన్నుదొరుఁగు
సద్గుణాభిరామ డగ్గఱి తద్దర్శ
నము యథోచితవిధి నమరఁ జేసి. **14**

**రామాయణ.** సు+ఉపకారవృత్తి = లెస్సయగు నుపకారవర్తనము దీపింపన్ = ప్రకాశించునట్లు, మారుతియున్ = హనుమంతుఁడును, నవ= నూత్నమైన, అసమ = సాటిలేని, ఆర్తిన్ = పీడచే, చెన్నుదొరుఁగు = వ్యధితురాలగు, సద్గుణాభిరామన్ = మంచి గుణములచే మనోజ్ఞురాలగు సీతను, డగ్గఱి = సమీపించి, తద్దర్శనము = ఆమెను చూచుటను, యథోచితవిధిన్ = సమయోచితప్రకారముగా, అమరన్ చేసి = ఒప్పులాగునఁ జేసి; ముందుపద్యముతో నన్వయము ;

తా. చక్కఁగనుపకృతి గావింపవలయునని హనుమంతుఁడు సాటిలేని దుఃఖముచే ఖిన్నురాలైన సీతం డగ్గఱి ;

“ సూపకారవృత్తి.” సు+ఉపకార = సూపకార ; “ అకస్సవర్ణే దీర్ఘః.” పాణిని.

“ అసమార్తి.” “ ఆర్తిఃపీడా ధనుః కోట్యోః.” అమరము.

భారత. సూపకారవృత్తి = వంటలవాని యునికి, దీపింపఁగ = ప్రకాశింపఁగా, మారుతి = భీముఁడు, ఉన్న, వాసము = గృహమును, ఆర్తిఁ, చెన్నుదొరుఁగు, సద్గుణాభిరామ = మంచిగుణములచే మనోజ్ఞురాలగు ద్రౌపది, డగ్గఱి = సమీపించి, తద్దర్శనము = ఆభీముని దర్శనము, యథోచితవిధిఁ, అమరఁ జేసి = ఒప్పులాగున నొనర్చి, ముందుపద్యముతో నన్వయము ;

తా. వంటలవాని యునికిని భీముఁడుండు గృహమునకరిగి ద్రౌపది యాతని దర్శించి ;

వ. నిజవృత్తంబెల్ల నెఱింగించి తనరాక చందంబు వివరించి యిట్లనియె. 15

శా. కల్యాణీ భవదీశ్వరాజ్ఞ మహిమన్ గల్గెన్నిరాఘాటబా
హుళ్యాత్యుద్ధతి జంతుఘోరవన వాసోదన్వదుల్లంఘనా
కల్యాణాతిశయంబు నాకుఁదుదవా క్సంకోచనంబేల ని
స్తుల్యత్వద్వరశక్తి గల్గ మనకెంతేదుర్ లేవసాధ్యార్థముల్.

అవతారిక. సీతంగాంచి హనుమంతుఁ డిట్లాడుచున్నాఁడు.

రామాయణ. కల్యాణీ ! మంగళకరురాలగు నో సీతా, భవత్ ఈశ్వరఆజ్ఞ మహిమన్ = నీభర్తయగు రామునాజ్ఞా మాహాత్మ్యమున, నిరాఘాట............కల్యాణాతిశయంబు ; నిరాఘాట = అడ్డములేని, బాహుళ్య = విస్తృతిచే, అత్యుద్ధత = మిక్కిలి యుద్ధతమైన, జంతు = జలజంతువులచే, ఘోర = భయంకరమై, ప్రాణిహింసాకరములగు క్రూర జలజంతువుల కాశ్రయమగుటచే భయంకరమై యనుట ; వనవాస = నీటి కునికిపట్టగు, ఉదన్వత్ = సముద్రముయొక్క, ఉల్లంఘనా = దాఁటుట యనెడి, కల్యాణాతిశయంబు = శుభాతిశయము, నాకున్, కల్గెన్ ; అతని యాజ్ఞలేకుండిన నీసముద్రలంఘనమునకుఁ బ్రసక్తియే కలుగదు కావున

నీశుభాతిశయముగల్గుట కాతని యాజ్ఞయే మూలకారణమని భావము; తుదక్ = కడను, వాక్సంకోచనంబు ఏల=మాటకేల సంకోచము, నిస్తుల్య= సమానరహితమైన, త్వద్వరశక్తి కల్గక్=నీభర్తయగు రాముని శక్తిగలుగఁగా, మనకుక్, అసాధ్యార్థముల్ = సాధింపరాని కార్యములు, ఎందుక్, లేవు;

తా. ఓసీతా! నీభర్తయొక్క యాజ్ఞాప్రభావముననే పెక్కు క్రూర జలచరముల కాస్పదమైన సముద్రమును నేను దాఁటఁగల్గితిని; వేయుమాట లేల? నీభర్తయొక్క శక్తిగల్గ మనకెచ్చటను నసాధ్యమగున దేదియును లేదు.

అవతారిక. ద్రౌపది భీమునితో నిట్లాడుచున్నది.

కల్యాణీ..............మహిమక్; కల్యాణీభవత్ = శుభమగుచున్నట్టి, ఈశ్వర = దేవుని, అజ్ఞమహిమక్ = ఆజ్ఞామాహాత్మ్యమున, నిరాఘాట.......... ..కల్యాణాతిశయంబు; నిరాఘాట=అడ్డములేని, బాహుళ్య = విస్తరించిన, అత్యుద్ధత, జంతు = వనచర జంతువులచే, ఘోర = భయంకరమైన, వనవాస = అడవియందు వసించుటయనెడి, ఉదన్వత్ = సముద్రముయొక్క, ఉల్లంఘనా=దాఁటుటయనెడి, కల్యాణాతిశయంబు = శుభాతిశయము, నాకుక్, కల్గెక్, తుదక్, వాక్సంకోచనంబు, ఏల, నిస్తుల్య = సాటిలేని, త్వత్ = నీయొక్క, వర = శ్రేష్ఠమైన, శక్తిగల్గక్, మనకుక్, ఎందుక్ = ఎచ్చటను, అసాధ్యార్థముల్ = సాధింపరాని కార్యములు, లేవు;

తా. మంగళకరమైన యీశ్వరాజ్ఞా మహిమను వనవాస క్లేశ మంతరించెను. సాటిలేని నీశక్తికతమున మనకెప్పుడు నసాధ్యములగున వెవ్వియును లేవు.

“వనవాస.” “అటవ్యరణ్యం విపినంగహనం కాననంవనం.” అమరము.

సంహరించును, మన తోడఁగూడన్ = మనతోఁగూడి, భార్యయగునీతో డను, దాసులగు మాబోఁటి వానర సేనలతోడను గూడియనుట; క్రమ్మఱన్ = మరల, అగణ్య................సంచారములకున్; అగణ్యా = లెక్కింప శక్యముగాని, అధికమైన యనుట; మహావనీ రాజ్య = గొప్పదగు నీ వసు మతీ రాజ్యకుపలని, భూపరిపాలనము వలని యని భావము; సౌఖ్యసంచార ములకున్ = సౌఖ్యవర్తనములకు, చనుట, ధ్రువంబు = నిశ్చయము, ఇది సమయంబు = ఇది తగిన తరుణము, పదునాలు గేండ్లు కావచ్చెనుగనుక నింక రావణుని సంహరించినిన్ను గ్రహించి మాతోడఁగూడి రాజ్యపట్టాభిషేక మునకై యయోధ్యకేఁగఁ గలఁడని భావము; ఓయ వార్యమాన సతీవ్రతా ధిక్య = వారింపఁదగని మానముయొక్కయు పాతివ్రత్యము యొక్కయు నాధిక్యముగల యో సీతాదేవీ, కావునన్, నీవు, అంతవట్టును = అంతి వఱకును, నెమ్మనమునన్ = మనస్సునందు, మఱవక = మఱచిపోవక, మేలిమీఱు = అతిశయించిన, తెగువకున్ = సాహసమునకు, మరణసాహ సమున కనుట; ఇపుడు, చొరక = ప్రవేశింపక, సంతోషముఁగలుగ సిద్ధ ముగ నుండు నీసమయమున మరణసాహసము మానవలయునని భావము; లోలోనన్ = మనస్సునందే, అత్యంత.........అతిశయము; అత్యంత = అధికమైన, మన్యు = శోకరోషములవలని, ఇటమన్యుశ్చ మన్యుశ్చ మన్యూ అని సరూపైక శేషవృత్తి; సంభ్రమ = తీవ్రతయొక్కయు, అతిశయము= ఆధిక్యము, తునుమవలయున్ చుమ్మీ = ఖండింపవలయును సుమా, శోక రోషములవలని యావేగమును మానవలయునని భావము;

తా. నా యీమాటంగ్రహింపుము. రాముఁడు నీవార్త యెఱిఁగిన వెంటనే వానరసైన్యముతోడ నరుదెంచి బలదర్పితుఁడగు నీద్రోహిని రావ ణుని సంహరించును. వనవాసకాల పరిమితి తీఱుటచే నింకఁ బట్టాభిషేక మునకై మనతోడ నయోధ్యకుఁజనును; ఇదినిశ్చయము; ఈ విషయము మఱువకయుండి యంతవఱ కోపికవట్టి యీమరణోద్యోగమునుండి విర మింపుము. నీ యీశోకరోషముల మానుము.

"వార్త" "వార్తాప్రవృత్తి ర్వృత్తాంతః." అమరము "మన్యు."
"మన్యుర్దైన్యే క్రతౌ క్రుధి." అమరము "సంభ్రమాతిశయము." "సమౌ సం
వేగసంభ్రమౌ." అమరము.

భారత. ఇది యొండు నామాట, మదిన్ జేర్పుము = మనస్సునఁ
జేర్పుము, ఆత్మ............సంపదల్ = ఆత్మ = నీయొక్క, బల =
పరాక్రమము వలని, ఖ్యాతిసంపదల్ = ప్రసిద్ధ్యాతిశయము, తనరన్,
వచ్చి, దృఢదర్పున్ = దృఢమగు గర్వము గలవానిని, పూర్ణగర్వుననుట,
ఈద్రోహిన్ = ద్రోహియగు నీ కీచకుని, తెగటార్చు = సంహరించునట్టి,
ఈ వార్త వినఁబడినప్పుడ = ఈ మాటవినిన వెంటనే, ఉదంత తద్ధార్తరక
ముల కచ్చుపరమగుటచే నిటనగాగమ ప్రాప్తిగల్గెను. మన విభుండు =
మనరాజగు ధర్మజుఁడు, మనతోడన్ కూడన్ = మనతోఁ జేరి,
క్రమ్మఱన్ = మరల, అగణ్య........సంచారములకున్; అగణ్య =
అధికమైన, మహావనీరాజి = గొప్ప యడవుల సమూహము లందలి,
అసౌఖ్యసంచారములకున్ = సౌఖ్యములేని త్రిప్పటలకు, చనుట,
ధ్రువంబు, ప్రకటముగా నీవు శత్రు సంహారమునకుఁబూనిన మరల మనమెల్ల
రమరణ్యవాస మొనర్పవలసి యుండును. ఇది సమయంబు = ఇది మనప్రతి
జ్ఞ, పండ్రెండేఁడు లరణ్యవాసమును సల్పి, పదమూఁడవ యేఁడజ్ఞాతవాస
మునాచరించుచు నందుఁ బయలువడినచో మరలఁ బండ్రెండేఁడు లరణ్య
వాసము నొక్క యేఁడజ్ఞాతచర్యయుజరుపవలసినట్లు మనము చేసికొనిన కట్టడ
యని భావము; కావునన్, ఓ దుర్వార్య మానస తీవ్రతా ఆధిక్య = వారింప
శక్యముగాని మానసమందలి తీవ్రతాతిశయముగలవాఁడా, భీముని సంబోధిం
చుట; మేరమీఱు తెగువకున్ = హద్దుమీఱు నట్టిసాహసమునకు,
ఇపుడు చొరక, ప్రతిజ్ఞా భంగముగాకుండునట్లనిభావము; లోలోనన్ =
గుప్తముగా, అత్యంతము = మిక్కిలి, అన్యసంభ్రమాతిశయము = పరుఁ
డగు కీచకునియొ వేగాతిశయమును, తునుమవలయున్ చుమ్మ = ఖండింప

వలయునుసుమా, పరులెఱింగిన మరల వనవాసమున కరుగవలయును గావున గుప్తముగానే వానిని సంహరింపవలయునని భావము;

తా. నామాట యిది నీమదింజేర్పుము. నీ బలము సుప్రసిద్ధమగు లాగున నీద్రోహిని గీచకుని సంహరింపఁబూనినచో నీ వార్త వినిన వెంటనే యుధిష్ఠిరుఁడు మరలమనతోఁగూడి పూర్వమువలె నరణ్య వాసమునకరుగ వలసియుండును. ఇది నిశ్చయము. మనమాది నొసర్చిన ప్రతినయు నిట్టిదే కదా? నీవీవిషయమును మఱువక మన ప్రతిజ్ఞ బయలుపడనిలాగున గుప్తముగా వానిని సంహరింప వలయునుసుమా.

"అవార్య మానసతీవ్రతాధిక్య" ఇటఁగొందఱు "అవార్యమాన, సతీవ్రతాధిక్య = తీవ్రత్వాధిక్యముతోఁ గూడినవాఁడాయని యర్థము గావించెదరు కాని, రామాయణ; అవార్యమాన, సతీవ్రతాధిక్య, భారత; అవార్య, మానస, తీవ్రతాధిక్య," అని సభంగశ్లేష గావించుటయే సందర్భశుద్ధముగా నున్న యది.

"ఇది సమయంబు." "సమయాశ్శపథాచార కాలసిద్ధాంత సంవిదః." అమరము.

ఆ. తగదు మిగుల నిచటఁ దడయంగ సంకేతి
తంబగు సమయంబుఁ దప్పకుండ
నేఁదిరిగి యరిగెద నీవు నావెంబడి
నడువవలయుఁ దాల్మి సడలనీక. 19

రామాయణ. ఇచటన్ మిగులన్ తడయన్ తగదు = నేనిచట చాలకాల మాలసింపఁదగదు, సంకేతిత సమయంబు = నీ భర్త మితియిడిన సమయము, తప్పకుండన్, నేన్ తిరిగియరిగెదను = నేను తిరిగివెళ్లెదను, ఇట భారతార్థ సంఘటనకై సంకేతిత సమయము తప్పకుండనని కవియాడెను గాని రామాయణమున సుగ్రీవుఁడిడినకాలపరిమితి మీఱినట్లున్నది. అయినను సీతంగని పెట్టి రమ్మనినందున నెంతకాలమైనను సీతం గాంచివచ్చుటయే

సంకేతమను సూక్ష్మాంశమునుగని పెట్టి కవి యిట్లాడుటయెంతయు రసవంతముగనే యున్నయది; నీవుక్, తాల్మిక్ = ఓర్పును, సడలనీక = జాఱనీయక, ఓర్పునువీడక యనుట; ఆ వెంబడిక్ = నేను జెప్పిన హితము చొప్పున, నడుపవలయుక్ = నడుచుకొనవలయును.

తా. నేనిటఁజాలకాల మాలసింపరాదు. రాముని యానతి చొప్పున సంకేతిత కాలముదాఁటకుండ నరుగవలయును. నీవోర్పుగలిగి నేఁజెప్పిన హితము చొప్పున నడుచుకొనుము.

భారత. ఇచటక్ మిగులక్ తడయఁగక్ తగదు = ఇచ్చట చాల సేపు నే నాలసింపఁదగదు, సంకేతితంబగు సమయంబు తప్పకుండక్ = అతనితో నేవచ్చెదనని చెప్పిన సమయము తప్పకుండునట్లు, నేక్ అరిగెదక్ = నేవెడలెదను, నీవు, తాల్మిసడలనీక = ఓర్పుదిగజాఱకుండ, తొందర పడక యనుట; నావెంబడిక్ నడువవలయుక్ = నావెంట నడువవలెను; కోపమున విజృంభించి పరాక్రమము చూపిన బయలుపడుదువు గనుక నామఱుఁగున రావలయుననుట;

తా. శేఁగీచకునితో నాడిన సమయమునకట కరుగవలయునుగావున నిటనింకఁ దడయఁదగదు. కాఁబట్టి నే నరిగెదను. నీవును గోపమున బయలు పడక యోర్పుగల్గి నామఱుఁగునరమ్ము.

ఆ. అని పలికి భవద్వి రాత్మకు నామాట
యొప్పగుట కొకగుఱు తొసఁగు మనియె
నిచ్చెఁ దత్పతి ప్ర హితమైన నమ్మిక
యుంగరంబు సతికి నుబ్బుమెఱయ. 20

రామాయణ. అని పలికి = ఇట్లనియాడి, భవద్భర్తాత్మకుక్ = నీభర్తయగు రాముని మానసమునకు, నామాట = నే నీతనుగాంచితి ననెడి మాట, ఒప్పగుటకుక్ = సరియగుటకు, నమ్మికయగుట కనుట; ఒక గుఱుతు ఒసఁగుము అనియెక్ = ఒకగుఱుతు నిమ్మనెను, తత్పతి ప్రహితమైన =

ఆబిడభర్తయగు రామునిచే నంపఁబడిన, నమ్మిక యుంగరంబుఁ = నమ్మకము కొఱకగు నుంగరము, నమ్మికకొఱకై యుంగరమని యాచ్ఛికముగుచతుర్థీతత్పురుషము; సతికిఁ = సీతకు, ఉబ్బ మెఱయఁ = సంతసమొప్పారఁగా, ఇచ్చెఁ = హనుమంతుఁ డొసఁగెను;

తా. హనుమంతుఁడిట్లాడి నీభర్తకు నమ్మకముగలుగుట కొఱకేదే నడయాల మిమ్మని, రాముఁడు తనచే నంపిన యుంగర మామెకు సంతసముగలుగులాగున నిచ్చెను.

భారత. అనిపలికి = ద్రౌపది యిట్లాడి, భవద్వరాత్మకుఁ = నీదగు శ్రేష్ఠమైన మానసమునకు, నామాట ఒప్పుగుటకుఁ = నేనాడినమాట నమ్మకమగుటకు; గుఱుతు ఒసఁగుము, అనియెఁ, గుప్తముగా శత్రునింజంపవలయునను నామాట నీవంగీకరించినందులకు గుఱుతుగా నేదేనిం బాసచేయుమనెననుట; తత్పతి = ఆ బిడభర్తయగు భీముఁడు, ప్రహితమైన = మిక్కిలిహితమైన, నమ్మికయుఁ = విశ్వాసమును, సతికిన్ = ద్రౌపదికి, కరంబు మిక్కిలి, ఉబ్బ మెఱయఁ = సంతోష మతిశయింపఁగా, ఇచ్చెఁ, ద్రౌపదికి సంతసముగల్గు లాగున బాసచేసెననుట; రామాయణార్థమున హనుమంతుఁడు గుఱుతడుగుటయు నుంగరము నిచ్చుటయు సంఘటించుటకై యిట ద్రౌపది గుఱుతడుగుటయు భీముఁడొసఁగుటయు నివి గవికల్పితము లగుచున్నవి. అతికోపనుఁడగు భీముఁడు దాబయలువడక గుప్తముగా శత్రువధగావించునాయని ద్రౌపదికి సంశయముగలిగియే యాబిడయందులకై బాసచేయించుకొనుట సందర్భశుద్ధముగ నున్నది.

తా. ద్రౌపది యిట్లుపలికి నీవునే నాడినట్లు గుప్తముగా శత్రువును వధించుట కంగీకరించినచో నందులకు గుఱుతుగా నాకుబాస సేయుమనెను, భీముఁడునామెకు హితమగులాగున సంతోషకరమగు బాస చేసెను.

ముద్దరాజు రామన్న, "తత్పతి ఆ భీమునిచేత, ప్రహితమైన = ఇయ్యఁబడిన," అని యర్థముగావించెను, తత్పతి యని కర్త యిటనుండ

దానిని సమస్తపదము గావించుకొని ఇచ్చెననుటకుఁ గ్రొత్తకర్తృపదముం దెచ్చుకొనుట సమంజసముగనుండలేదు. మఱియు "తత్ప్రతి ప్రహితమైన నమ్మిక" యని, మరల "ఇచ్చెనని క్రిందటికన్వయ" మని క్లిష్టాన్వయము గావించుట సరికాదు కావున, "తత్ప్రతి, ప్రహితమైన = మిక్కిలి హితమైన, నమ్మిక, ఇచ్చె"ననుట యెంతయు సమంజసము; ఎచ్చటనో తప్పని సరియగు స్థలములందుగాని క్లిష్టాన్వయము గావించుట యోకవి యాశయముగాదు.

క. అనిలజుఁ డధికతమస్థితి
నొనరెడి తమి రామదుఃఖ ముడుపుటకు నయం
బునఁ దత్సతీ శిరోమణి
గొని చనఁ గని యమితదర్ప గురుసంభ్రముఁడై. 21

రామాయణ. అనిలజుఁడు = భీముఁడు, అధికతమస్థితిన్ = మిక్కిలియధికమైన మర్యాదచే, ఒనరెడి = ఒప్పెడి, తమిన్ = కోర్కెచే, రామదుఃఖము = రామునిశోకమును, ఉడుపుటకున్ = పోఁగొట్టుటకై, నయంబునన్, తత్సతీశిరోమణిన్ = ఆ సీతయొక్క చూడా రత్నమును, కొని = గ్రహించి, చనన్ కని = పోవనుపక్రమించి, అమిత.........సంభ్రముఁడై; అమిత = మిక్కుటమగు, దర్ప = గర్వముచే, గురు = గొప్పదగు, సంభ్రముఁడై = సంభ్రమముగలవాఁడై; అరిగెనని ముందరి పద్యము నక్రియ.

తా. హనుమంతుఁడు మిక్కిలి యధికమగు వేడ్కతో రాముని దుఃఖముడుపుటకై యాబిడ చూడారత్నముం గ్రహించియరుగ నుపక్రమించి మిక్కిలి గర్వోద్రేకముగల వాఁడయి;

"అధికతమస్థితి." "మర్యాదాధారణాస్థితిః." అమరము.

భారత. అనిలజుఁడు = భీముఁడు, అధికతమఃస్థితిన్ = అధికమగు చీఁకటియొక్క యునికిచే, ఒనరెడి, తమిన్ = రాత్రియందు, రామ = స్త్రీ యగు ద్రౌపదియొక్క దుఃఖము, ఉడుపుటకున్, నయంబునన్,

తత్ప్రతీశిరోమణిన్ = ఆ స్త్రీశ్రేష్ఠురాలిని, ద్రౌపదిననుట; కాని, చనంగన్
పోవుటకై, నియమిత = అణఁపఁబడిన, దర్ప = గర్వమువలని, గురు =
ఘనమైన, సంభ్రముఁడై, ఇటనియమితపదము సంభ్రమ పదమునకు విశేష
ణము; అరిగెనని ముందరి పద్యమునక్రియ;

తా. భీముఁడు చిమ్మఁ జీఁకటిగలయా రాత్రియం ద్రౌపదిదుఃఖ
ముడుపఁదలఁచి, యామెననుసరించిపోవ నిజగర్వము సంభ్రమ మణఁచికొనిన
వాఁడై;

"అధికతమస్థితిన్." రామాయణార్థమున, 'అధికతమస్థితిన్ అని
యు, భారతార్థమున, 'అధికతమస్స్థితి' నని సకారద్విత్వ రూపముగను రావ
లసి యుండ శ్లేషార్థ సంఘటనమునకై 'అధిక తమస్థితి' యని సకారద్వి
త్వము లేక ప్రయోగించెను. అదియు "ఖర్పరేవిసర్జనీయః." అనుపాణిని
సూత్రము నాధారము గావించుకొని యుపయోగింపఁ బడుటచే సాధుతరము
యగును.

"ఒనరెడితమిన్." "తమియనఁగ రాత్రికిఁదమికి నమరు." సాంబ
నిఘంటువు.

క. పోరికిఁదివిరి యరిగె బ
ల్బీరముచే వనవిఘాతలీలనెఱపుచున్
ధీరతతనరఁగ లంకా
ద్వారగతుండగుచుఁ బేర్చి వైరివధరతిన్. 22

రామాయణ. బల్బీరముచేన్ = మిక్కుటమగు పరాక్రమముచే,
వనవిఘాతలీలన్ = అశోక వనభంగరూప కార్యమును, నెరపుచున్ = నిం
డించుచు, అశోకవనభంగ రూపక్రియను జరుపుచునని భావము; పోరికిన్ =
యుద్ధమునకు, తివిరి = కోరి, అరిగెన్ = వెడలెను, ధీరత = ధైర్యము,
తనరఁగన్ = ఒప్పఁగా, లంకాద్వార గతుండగుచున్ = లంకాద్వారము

నందినవాఁడగుచు, వైరివధరతిన్ = శత్రువధమునందలి వేడ్కచే, పేర్చెను = విజృంభించెను;

తా. మిక్కిలి పరాక్రమముచే హనుమంతుఁడశోకవనికా భంగము గావించి యటనుండియరిగెను, పిదప లంకాద్వార గతుఁడై వైరివధాపేక్షను విజృంభించెను.

"తివిరి." తివురుట యభిలషించుట దేవదేవ. ఆంధ్రనామశేషము.

భారత. బల్మిరముచేతన్ = అధిక పరాక్రమసారముచే, అవిఘాత = అడ్డములేని, లీలన్, నెరపుమన్, పోరికిన్, అరిగెన్ = ఆ భీముఁడు వెడలెను, ధీరత, తనరన్, కలంక = అపవాదమునకు, అద్వార= ప్రవేశకారణముగాని, గతుండు = గమనముగలవాఁడు, అగుచున్. భీముని మూలమునఁ బాండవులకు మరలవనవాస ప్రాప్తియయ్యెనను నపవాదమురానట్లు గుప్తగమనముగల వాఁడగుచునని భావము; వైరివధరతిన్ = శత్రువగు కీచకుని వధించువేడ్కను, పేర్చెన్ = పెనిచెను;

తా. భీముఁడు పరాక్రమ స్ఫూర్తితోఁ బోరికరిగెనుగాని యట్లరుగుట నిజప్రకటగమనముచే బయలుపడి మరల వనవాసమున కరుగవలసి వచ్చునట్టి యపవాదమునకుఁ బాత్రుఁడుగాక గుప్తముగనరుగుచు వైరివధాపేక్షం బెంచెను.

వ. అంత. 23

ఉత్సాహ. తమముచే నొకించుకయును దలముగానమిన్నితాం
తము నిజాంగనాశనఫల దర్పశోపక్లప్తసం
భ్రమముతోడఁ దన్నుఁ జెనకెఁ బరఁగు సింహబలుల స
త్సమరమతుల లీలమెఱయఁ జంపెఁ జిత్రవధరతిన్. 24

రామాయణ. తమముచేన్ = తమోగుణముచే, అజ్ఞానముచే ననుట; ఒకించుకయును = కొంచెమేనియు, తలముగానమిన్ = స్వరూప

ము దెలియమిచే, అజ్ఞానమునఁ దాము హనుమంతునకంటె బలహీనుల మను టదెలియమిచేనని భావము; నితాంతము =మిక్కిలి, నిజ........తోడన్;
నిజ = తమయొక్క, అంగ = శరీరముయొక్క, నాశన = నశించుటయే, ఫల = ఫలముగాఁగల, దర్ప = గర్వమువలని, కోప=క్రోధముచే, క్షప్త= చేయఁబడిన, సంభ్రమముతోడన్ = త్వరతో, తన్నున్, హనుమంతు ననుట; చెనకన్ పఱఁగు = ఎదిరింపనున్న, సింహబలులన్ = సింహము యొక్క బలమువంటి బలముగలవారలను, సత్వమరమతులన్ = లెస్సైన యుద్ధమునందు బుద్ధిగలవారగు రాక్షసులను, లీలమెఱయన్ = విలాసము పొ్పరఁగా, చిత్రవధరతిన్ = చిత్రవధగావించుట యందలి యపేక్షచే, చంపెన్ = సంహరించెను;

తా. అజ్ఞానమున దాము హనుమంతునకంటె బలహీనులనుట దెలి యనివారై, తమశరీరనాశమే ఫలముగాఁగల కోపమువలని త్వరతో, తన్నెదిరింపనున్నట్టియు, సింహ విక్రములగునట్టియు, యుద్ధాసక్తులగు నట్టి యురాక్షసుల నా హనుమంతుఁడు చిత్రవధాసక్తుఁడై చంపెను.

"సంభ్రమ." "సంభ్రమస్త్వరా." అమరము;

"సింహ." హింసాశబ్దము వర్ణవిపర్యయమున 'సింహ' యని యయ్యె ననుటకు; "భవేద్వర్ణాగమాద్ధంసః సింహోవర్ణవిపర్యయాత్, గూఢోత్మా వర్ణవికృతేః వర్ణనాశాత్పృషోదరం." సిద్ధాంతకౌముది.

సింహాదులు సాధువులగుటకు; "పృషోదరాదీని యథోపదిష్టం." పాణిని.

ఉత్సాహవృత్త లక్షణము. "సాహచర్య మమరసప్త సవితృవర్గము నునము, త్సాహమెక్క నొక్కగురుఁడు చరణములు భజింపఁగా, నీహిత ప్రదానలీల లెసఁగుకమతమూర్తిను, త్సాహరీతులుల్ల సిల్లసంస్తుతింతు రచ్యుతున్." ఛందో దర్పణము;

భారత. తమముచేన్ = చీఁకటిచేత, ఒకించుకయును, తలముగా వమిన్ = స్వరూపముదెలియమిచే, స్త్రీపురుష స్వరూపము గానఁబడ

మిచే, నితాంతము, నిజాంగనా ఆశక్ = తన [భీముని] భార్యయగు ద్రౌపదియందలి యాశచే, అఫల + నిష్ఫలమైన దర్పక = మన్మథునిచే, ఉపక్లృప్త = చేయఁబడిన, సంభ్రమముతోడక్=అత్యంత సంభ్రమముతోడ, తన్నుక్, భీముని, చెనకక్ = చెందుటకు, పరగు, ద్రౌపది యనుభ్రాంతిచే భీముని సమీపించునట్టి, సింహబలుక్ = సింహబలుని, కీచకుననుట; లసత్సమరము = ప్రకాశించెడు యుద్ధము, అతులలీలక్ = సాటిలేనివిధముగా, మెఱయక్, చిత్రవధరతిక్, చంపెక్ = భీముఁడు సంహరించెను;

తా. చీఁకటిచే నించుకేని స్త్రీపురుష స్వరూపము దెలియమిచే ద్రౌపదియను నపేక్షచే భ్రమచెంది తన్నుసమీపించెడి కీచకుని భీముఁడు యుద్ధమునందుఁ జిత్రవధమునఁ జంపెను.

"తలము." అధస్స్వరూప యోరస్త్రీతలంస్యాత్." అమరము.

"చిత్రవధరతిక్." "తస్యపాదౌచపాణీచ శిరోగ్రీవాంచసర్వశః, కాయేప్రవేశయామాస పశోరివపినాకధృత్, తంసమ్మథిత సర్వాంగం, మాంసపిండోపమంకృతం. కృష్ణాయాదర్శ యామాస, భీమసేనో మహాబలః." మహాభారతము, విరాటపర్వము.

వ. తదనంతరంబ మఱియును. 25

ఆ. శక్తిమత్తదనుజ సంఘముదొరాంతమై
పొలిసెఁ బవనపుత్త్రు భుజబలమున
నతని కాంత కాగ్రహ ప్రేరణంబుచేఁ
గరము కీడొనర్చు కడఁకఁ జేసి. 26

రామాయణ. అంతకాగ్రహ ప్రేరణంబుచేక్ = యమునికోపము వలని ప్రేరణచేత, విధిప్రేరణచే ననుట; అతనికిక్=ఆహనుమంతునికి, కీడు ఒనర్చుకడఁకక్ చేసి = కీడుచేయవలయునను ప్రయత్నముచే, శక్తిమత్తదను జసంఘము = పరాక్రమముచే మదించిన రాక్షస సమూహము, అత్యం

తమై = అక్షకుమారునంతముగాఁ గలదై, పవనపుత్రు భుజబలమునన్ = హనుమంతుని బాహుబలమున, పొలిసెన్ = చచ్చెను;

తా. విధిప్రేరణచే హనుమంతునకుఁ గీడొనర్పవచ్చిన రాక్షసు లక్షకుమార పర్యంతము హనుమంతుని బాహుబలముచే మరణించిరి.

**భారత.** శక్తిమత్ తదనుజసంఘము = పరాక్రమముగల యా కీచకుని సోదరసమూహము, ఉపకీచకులనుట; అశాంతమై = ఓర్పులేనిదై, ఆగ్రహప్రేరణంబుచేన్ = కోపమువలని ప్రేరణమున, అతనికాంతకన్ = ఆ భీముని భార్యయగు ద్రౌపదికి, కరము, కీడు ఒనర్చు కడఁకన్ = ప్రయత్నమును, చేసి = ఆచరించి, పవనపుత్రు భుజబలమునన్ పొలిసెన్ = భీముని బాహుబలమున మరణించెను.

తా. ఉపకీచకులు క్రోధాతిరేకమున ద్రౌపదికి హానిసేయ నరుదెంచినవారై భీమునిచే నిహతులైరి.

**తే.** విబుధకంటక కీచక విపినమునకు
దావవహ్నిగా నాత్మ ప్రతాపమహిమ
నెఱపె వాయుజుఁ డన్యుల కెఱుక పడక
యుండ లోలోనఁ బొగడె బుధోత్కరంబు. 27

**రామాయణ.** విబుధకంటక = దేవాహితులైన రాక్షసులనెడి, కీచకవిపినమునకున్ = వెదురుటడవికి, దావవహ్నిగాన్ = దావాగ్నిగా, వాయుజుఁడు=హనుమంతుఁడు, ఆత్మప్రతాప మహిమ = తనయొక్క పరాక్రమమహిమ, నెఱపెన్, బుధోత్కరంబు = దేవసమూహము, అన్యులకున్ ఎఱుకపడక యుండన్ = ఇతరులకుఁ దెలియని లాగున, లోలోనన్ = మనస్సులలోనే, పొగడెన్ = స్తుతించెను, రావణునివలని భీతిచేమానసము నందే స్తుతించెనని భావము;

తా. రాక్షసులనెడి వెదురు టడవికి దావదహనముగా వాహబలము నా హనుమంతుఁడు నెఱపెను. దేవతలు రావణ భీతులై ప్రకటముగాఁగావింపక మానసముననే యా హనుమంతుని స్తుతించిరి.

"బుధోత్కరము." జ్ఞాతృచాంద్ర సురాబుధాః. వైజయంతి.

అలంకారము. రూపకము,

భారత. వాయుజుఁడు = భీముఁడు, అన్యులకెఱుకపడక యుండన్ = ఇతరులకుఁ దెలియకుండఁగా, లోలోనన్ = రహస్యముగా, విబుధకంటక = సజ్జనులకు విరోధులయిన, కీచకవిపినమునకున్ = కీచకులనెడి యరణ్యమునకున్, ఆత్మప్రతాప మహిమన్ = తన శౌర్యమాహాత్మ్యమును, దావవహ్నిగాన్ = కార్చిచ్చుగా, నెఱపెన్, బుధోత్కరంబు = దేవతల సమూహము, పొగడెన్;

తా. భీముఁడొరు లెఱుఁగకుండ రహస్యముగా నా కీచకుల సంహరించెను. దేవతలాతని పరాక్రమమును బొగడిరి.

"విబుధకంటక." "సూచ్యగ్రే క్షుద్రశత్రౌచ రోమహర్షేచ కంటకః." అమరము.

తే. తత్సహోదర సంప్రవర్తనము జరిగె
నప్పురములోనగూఢమై యంతి నేఁడు
ముగిసివచ్చె దానవరాజి మోదకాల
మనుచు సంతసమొందె వాతాత్మజుండు. 28

రామాయణ. తత్ = ఆహనుమంతుని, సహః = శౌర్యమువలని, దర = భీతియొక్క, ప్రవర్తనము = వృత్తాంతము, అప్పురములోన్ = ఆ లంకాపట్టణమున, అగూఢమై=రహస్యముకానిదై, జరిగెన్, లంకయందెచ్చటఁజూచినను నాతని శౌర్యవార్తయే ప్రవర్తిల్లుచుండెనని భావము; అంతన్, వాతాత్మజుండు = హనుమంతుఁడు, దానవరాజిమోదకాలము = రాక్షస సమూహముయొక్క సంతోషసమయము, నేఁడు = ఈదినము,

ముగిసివచ్చెన్ = పూర్ణమయ్యెను, రాక్షసులనెల్ల నేఁడే చంపెదనని భావము; అనుచున్, సంతసమందెన్ = సంతోషించెను ;

తా. లంకాపట్టణమున నెటుఁజూచినను హనుమంతుని శౌర్యవార్త యే జరుగుచుండెను. హనుమంతునితో రాక్షసుల సంతోషము ముగియు నట్లు వారిని నేఁడే సంహరించెదననుచు సంతసించెను.

"సహః" "ద్రవిణంతరస్సహోబలశౌర్యాణి." అమరము.

"దర." "దరోఽస్త్రియాం భయే శ్వభ్రే." అమరము.

భారత. తత్సహోదర = ఆ భీముని సోదరులగు ధర్మజార్జుననకుల సహదేవుల, సంప్రవర్తనము = ఉనికి, అప్పురములోనన్ = ఆ విరాటనగర మున, గూఢమై = ప్రచ్ఛన్నమై, జరిగెన్. అంతను, ఏఁడు = అజ్ఞాత వాస వత్సరము, ముగిసివచ్చెన్ = పూర్ణము కాఁజొచ్చెను, దానన్ = ఆకారణమున, పర ఆజిమోదకాలము=శత్రువులతోఁ గూడిన యుద్ధమువలని సంతోష కాలము కదా, అనుచున్, వాతాత్మజుండు=భీముఁడు, సంతసమందెన్= సంతోషించెను, ఇపుడజ్ఞాతవాసకాల మతిక్రమింపనున్నది, ఇంక యుద్ధము జరుగఁగలదని భీముఁడు సంతోషించెననుట ;

సీ. వ్యథఁజేయు తత్సత్వోవార్తాశ్రుతిని గ్లేశ
పడుచుఁ దత్సంగర 1 భంగపరత
ను త్తమద్రవిణ సం1పత్తి పౌలస్త్యుండు
దుర్యోధనుఁడు రోష 1 దూషితుండు
తత్పురిలోపల 1 ధర్మజ భీము సం
క్రందన జయముల 1 కలిమి నెంచి
జనులు మెచ్చఁగఁ బేర్చు 1 శౌర్యాధ్యునాహవ
కృతినుశర్మబలోప 1 చితధను గ్ర

ఆ. నాదతులితాంబునిధి మేఘనాదుఁ బనిచె
నతఁడు నేఁగిహరిన్నుతో క్రాఁజెఁబట్టె
నవ్విరటుఁడాసి గెలువునఁ గ్రొవ్వ్రభటులు
దన్నవాగ్గోగణాగ్రహణోద్భటత నడువ. 29

అవతారిక. ఇంద్రజిద్యుద్ధమును గోగ్రహణకథనుగవి యొక్కటిగా సంఘటించుచున్నాఁడు.

రామాయణ. వ్యథఁ జేయు = దుఃఖమునుగల్గించు, తత్ = ఆ హనుమంతుని, సత్త్వ = బలముయొక్క, వార్తాశ్రుతిని = వృత్తాంతము వినుటచే, క్లేశపడుచుఁ = దుఃఖించుచు, తత్ = ఆ హనుమంతుని, సంగర = యుద్ధముయొక్క, భంగపరతఁ = భంగపాటొదవించుట యందాసక్తిచే, ఉత్తమ = గొప్పదగు, ద్రవిణ సంపత్తి = సేనాసంపత్తి గలవాఁడు, దుర్యోధనుఁడు = యుద్ధముచేయ శక్యముగానివాఁడు, పరులచే సులభముగా యుద్ధముసేయ సాధ్యపడనివాఁడనుట; రోషదూషితుఁడు = రోషముచే దూషింపఁబడినవాఁడు, ఇవి పౌలస్త్యునకు విశేషణములు; పౌలస్త్యుఁడు = రావణుఁడు, తత్పురిలోపలఁ = ఆ లంకాపట్టణమున, ధన్వజ = వింటివలన జనించిన, భీమ = భయంకరమైన, సంక్రందన జయములకలిమి = ఇంద్ర విజయములకల్మి, ఎంచి = తలఁచి, జనులు, మెచ్చఁగఁ = మెచ్చుకొనఁగా, పేర్చు = అతిశయించు, శౌర్యాఢ్యుఁ = పరాక్రమయుక్తుని, ఆహవకృతి = యుద్ధకార్యమునందు, సుశర్మున్ = లెస్సయగుసుఖముగల వానిని, బల............అంబునిధిఁ; బల+ఉపచిత = బలిమిచే వృద్ధిపొందింపఁబడిన, ధనుః ప్రణాద = వింటిచప్పుడుచే, తులిత = సమముగా నొనర్పఁబడిన, అంబునిధిఁ = సముద్రముగల వానిని, సముద్రముఘోషించునట్లితని ధనుష్టంకారము ధ్వనించుచున్న దనుట;

ఇవి మేఘనాదునకు విశేషణములగుచున్నవి. మేఘనాదుఁడ్ = ఇంద్రజిత్తును, పనిచెన్ = పంపెను, అతఁడున్ = ఆ మేఘనాదుఁడును, ఏఁగి = వెళ్లి, నుత ఉగ్రఆజిన్ = స్తుతింపఁబడిన భీకరాహవమున, హరిన్ = వానరుని, హనుమంతుని, పట్టెన్, గెలపునన్ = జయముచే, క్రొవ్వ = మదించు, భటులు = రాక్షసభటులు, తత్.........ఉద్భటతన్; తత్ = ఆ హనుమంతుని యొక్క, ఆగః = అపరాధముయొక్క, గణ = సమూహము వలని, ఆగ్రహోద్భటత = ఆ గ్రహాతిశయము, నడువన్ = ప్రవర్తింపఁగా, ఇంతవును న్నాతఁడొనర్చిన యుద్ధాములవలనఁ గల్గిన యా గ్రహమతిశయింపఁగానని భావము; అటు, డాసి = హనుమంతుని సమీపించి, నవ్విరి = పరిహసించిరి;

తా. రాక్షసులకెల్ల దుఃఖముఁ గల్గించు నా హనుమంతుని పరాక్రమ ముక్లేశపఱుపఁగా, రావణుఁడాతనికి భంగపాటు గల్పింపఁదలఁచి, వింటిబలిమి నింద్రుని జయించి యా పురిలోని వారలచేఁ బొగడఁబడు చుండు మేఘనాదుని బంపెను. అతఁడు సంగ్రామమున హనుమంతుని బట్టెను. అంతనాతని భటులీవఱకు హనుమంతుఁ డొనర్చిన కార్యములచే నాగ్రహించిన వారయి యా తని సమీపించి పరిహసించిరి.

ముద్దరాజు రామన్న 'గ్రహోద్భటతన్ = ప్రాప్త్యతి శయమున' నని యర్థముగావించెనుగాని యదిసమంజసముకాదు, "ఆగోగణ+ఆగ్రహోద్భటతన్," అని యటబదముండఁగా, "గోపాతిశయము" నని యర్థము గావించుట యెంతయు సందర్భ శుద్ధముగనున్నది. గ్రహోద్భటతనిన, అజ్ఞానకుంబ్రబయో జనమేమియని యాలోచింపక యిట్లాతఁడు పొరపడెను.

"మహాగః." "ఆగోపరాధో మంతుశ్చ." అమరము.

"క్లేశపడుచు." "ప్రథమావైభక్తిక మోర్బిందుశ్చమహాన్ పతిక్రియార్థేషు." ఆంధ్రశబ్ద చింతామణి.

భారత. వ్యథఁ చేయు = దుఃఖముగల్గించు, తత్ = ఆపాండవుల యొక్క, సత్త్వ = ఉనికియొక్క, వార్తా = వృత్తాంతముయొక్క, అశ్రుతిని = వినమిచే, క్లేశపడుచుఁ = దుఃఖించుచు, పాండవులు గాప్పించిన వారిని మరల నడవులందఱుమఁ దఱివేచి యున్నవాఁడగుట నట్లు వారి వృత్తాంతము దెలియమి యాతనికిఁ గ్లేశకారణమయ్యెనని భావము, తత్ = ఆ పాండవుల, సంగర = శపథముయొక్క, భంగపరతఁ = భంగమొద, వించుట యందాసక్తిచేతన, ఉత్తమ ద్రవ్యసంపత్తి = విశేష ద్రవ్యసంపత్తిని, పౌలస్త్యుండు=కుబేరునంతటివాఁడును, రోషదూషితుండు, దుర్యోధనుండు = సుయోధనుఁడు, తత్పురిలోపలఁ = ఆవిరాటునగరమున, ధర్మజ = యుధిష్ఠిరునియొక్కయు, భీమ = భీమునియొక్కయు, సంక్రందనజ = అర్జునునియొక్కయు, యముల = కవలయొక్కయు, నకులసహదేవులయొక్కయు; కలిమి= కలుగుట, ఉనికియనుట; ఎంచి = తలఁచి, పాండవులట నుందురేమోయని శంకించి యనిభావము; జనులు, మెచ్చఁగఁ, పేర్చు =అతిశయించు, శౌర్యాఢ్యుఁ, ఆహవకృతి = యుద్ధమునందలి చాతుర్యముగలవానిని, బలోపచిత, ధనుః ప్రణాద = వింటి యొక్క ధ్వనిచే, తులిత = సాటిసేయఁబడిన, అంబుధి మేఘ = సముద్రముయొక్కయు, మేఘములయొక్కయు, నాదుఁ = శబ్దముగలవానిని, ఇవి సుశర్మకు విశేషణములు ; సుశర్ముఁ = సుశర్మను, పనిచెఁ=పంపెను, అతఁడు = సుశర్మ, ఏఁగి = విరాటనగరమునకువెడలి, గెలుపునఁ గొవ్వు = జయముచే గర్వించు, భటులు = ఆ సుశర్మయొక్క భటులు, తత్ మహాగోగణ + ఆ + గ్రహోద్భటతఁ = ఆవిరటుని గొప్ప గోవులను జక్కఁగా గ్రహించుటవలని యౌద్ధత్యమున, నడుపఁ = పోవుచుండఁగా, ఆ సమంతాత్ గ్రహః అనుట; హరిన్ముత ఉగ్రాజిఁ = దిక్కుల, యందుఁ బొగడఁదగిన భయంకరయుద్ధమున, అవ్విరటుఁ = ఆవిరాట రాజును, డాసి = సమీపించి, పట్టెఁ.

తా. పాండవులవార్త తెలియరామింగుందుచుండు దుర్యోధనుఁడు విరాటనగరమునఁ బాండవులున్నట్లనుమానించి సుశర్మనంపెను. సుశర్మ యొక్క భటులు విరటునిగోవులం గ్రహించుకొని పోవుచుండ నతఁడు యుద్ధమునకురాఁగ సుశర్మ యాతనిం డాసిపట్టెను.

"సంగర." "సంవిద్ జ్ఞానే ప్రతిజ్ఞాయాం, సంకేతాచారనామసు, సంభాషణేతోష ణేచ, క్రియాకారేచసంగరః." ప్రతాప నిఘంటువు.

వ అంత 30

ఉత్సాహ. సర్వపూజ్యమై నిజాజ్ఞ జరుగనాతనిం జటా
యుర్విఘాతి యమరణక్రియోత్కటా సహాయుఁడై
పర్వుచు విడిపించెఁ దద్విపక్షమృత్యువాలము
ద్గర్వుఁడగుచు శుష్కదీపికామగఁ జేసి వేడ్కతోన్. 31

రామాయణ. సర్వపూజ్యమై = సకలజనపూజ్యమై, నిజాజ్ఞ = తన యానతి, జరుగన్, రావణునాజ్ఞ సర్వపూజ్యముగా జరుగుచుండఁగా ననుట; జటాయుర్విఘాతి = జటాయువును సంహరించిన రావణుఁడు, అమరణ = మరణరహితమైన, క్రియా = కార్యమునందు, సంహారరూప దండనఁ దక్కనింకేదేనొక దండన విధించుటయందని భావము; ఉత్కటా= ఉత్సుకతయె, ప్రియమైనవస్తు వెప్పుడు కల్గునోయని త్వరపడు వాఁడుత్కుఁడు, వానిభావము తత్కత; సహాయుఁడై=సహాయముగాఁ గలవాఁడై, ఔత్సుక్యయుక్తుఁడై యనుట; పర్వుచన్ = పెలయుచు, తత్ = ఆ, విపక్షమృత్యు = శత్రువులకు మృత్యువైన హనుమంతు, వాలము = తోఁకను, లేక; తత్ ఆ హనుమంతుని, విపక్షమృత్యు = శత్రువులకు మృత్యువగు, వాలము, అనినైన నర్థము గావించుకొనవచ్చును; తోఁకతో శత్రువులఁ జుట్టి నేలపైఁ గొట్టుట, తోఁకచేఁగొట్టి శత్రువుంజంపుట వీని మూలమున

వాలము విపక్షమృత్యు వగుచున్నది. పై రెండింట ద్వితీయోపాత్తమగు నర్థ మెంతయు రసవంతము; ఉద్ధర్వుఁడగుచున్ = మిగుల గర్వించినవాఁ డగుచు, వేడ్కతోన్, శుష్మ = అగ్నిచే, దీపితముగఁజేసి, విడిపించెను, తోఁకకు నిప్పంటించి విడిచెననుట;

తా. రావణుఁడు తనయాజ్ఞ జనసమ్మత మగుచుండఁగా హనుమం తునింజంప నిష్టపడక యాతని వాలమునం దగ్ని నిడెను.

"జటాయుర్విఘాతి." జటాయుశబ్దము కారాంతముగను సకారాంత ముగను నుండుటచే నిట నీవిసర్గసంధి గు క్తతరమగును. "ఇత్యుక్తస్యయథా న్యాయం రావణస్య జటాయుషః." అనియు; తలేనాభిజఘానాథ జటాయుంక్రోధమూర్ఛితః." అని రామాయణమునఁ ద్వివిధముగానుం బ్రయోగము గలదు.

భారత. సర్వపూజ్యము = సర్వజనపూజ్యము, ఐనిజ = యమ పుత్రుఁడగు ధర్మరాజుయొక్క, ఆజ్ఞ = ఆనతి, జరుగన్, జటాయుః విఘాతి = జటాసురునాయువుం దీసినవాఁడు, భీముఁడనుట; యమ...... సహాయుఁడై; యమ = కవలయొక్క, నకుల సహదేవులయొక్క; రణ క్రియా = యుద్ధ వ్యాపారమునందలి, ఉత్కతా = ఉత్సాహమే, సహాయుఁడై = సహాయముగాఁ గలవాఁడై, నకుల సహదేవులును ఆ యుద్ధ మున నుత్సాహముతోఁ దనకుఁ దోడ్పడఁగానని భావము; పర్వుచున్, తద్విపక్షమృత్యువు = ఆవిరటుని శత్రువులకు మృత్యురూప మైనవాఁడు, ఆలము = యుద్ధమును, ఉద్ధర్వుఁడగుచున్, వేడ్కతోన్, శుష్మ = పరా క్రమముచే, దీపితముగన్ చేసి = వెలయించి, ఆతనిన్ = ఆవిరటుని, విడి పించెన్;

తా. భీముఁడు ధర్మజునానతిచే నకుల సహదేవులు దనకుఁ దోడ్పడ సుశర్మతోఁ బోరి విరటుని విడిపించెను.

"ఆలము" 'పెనకువ జగడముకయ్యం' బని బవరముకలను చివ్వ
యాలముపోట్లా, టనదురము పోరునాఁగాఁ, జను యుద్ధంబునకుఁ బేళ్లు
చంద్రార్ధధరా" ఆంధ్రనామ సంగ్రహము ;

సీ. మహితధర్మనియమ ♦ మాహాత్మ్య భూతన
యానుగ్రహాభి గు♦ప్తాంగుఁడుచు
శూరోత్తముఁడు వాయు♦సుతుఁడంత నిల కతి
గాఢప్రమోద సం♦ఘటనదారక
లారఁ బెంపెల్ల డీ♦ల్వఁటిచె నిశ్చల జయ
వైభవోదయ మహా♦వాలహస్త
చండహేతివిలాస ♦ సరభసగ్రస్తస
మస్త విద్వేషిధా ♦ మాఘుఁడగుచు

ఆ. సత్యనల్ప దర్ప ♦ మమర విపక్షయూ
థపునిఁబట్టి బలక♦దంబకమును
సరకుఁగొనక ప్రజల ♦ సత్వసాహసములు
చూపటకుఁ గరంబు ♦ చోద్యపటుప. 32

**రామాయణ.** మహిత............అంగుఁడు ; మహిత = ఒప్పి
దమగు, ధర్మ = ధర్మముయొక్క, నియమ = ఏర్పాటుయొక్క, మాహా
త్మ్యము=మహత్త్వముగల, పాతివ్రత్య మహిమగల యనుట; భూతనయా=
సీతయొక్క, అనుగ్రహ = దయచే, అభిగుప్తాంగుఁడు = రక్షింపఁబడిన
శరీరము గలవాఁడు, అగుచున్, శూరోత్తముఁడు = వీరశ్రేష్ఠుఁడు, వాయు
సుతుఁడు = హనుమంతుఁడు, అంతన్, ఇలకున్, భూమికి, అతిగాఢ =
మిక్కిలి దట్టమైన, ప్రమోద = సంతోషముయొక్క, సంఘటన = చేరిక,
దారకన్ = దిక్కుఁగా, భూమికి మిక్కిలి సంతసముగలుగఁగా ననుట;

నిశ్చల............ఓఘుఁడు; నిశ్చల = స్థిరమైన, జయ = గెలుపు యొక్క, వైభవ = విభవముయొక్క, ఉదయ = ఉదయముగల, మహా వాలహస్త = గొప్పదగు పుచ్ఛమునందున్న, చండ = తీవ్రమైన, హేతి = జ్వాలయొక్క, విలాస = ప్రకాశముచే, సరభస = వేగముగా, గ్రస్త = గ్రహింపఁబడిన, లేక, మింగఁబడినయని యైననర్థము గావింపవచ్చును; "గ్రసు అదనే." అనియు, "గ్రసు గ్రహణే" అనియు రెండువిధములు గాను నీధాతువుగలదు. శీఘ్రముగా దహింపఁబడినయని భావము; సమస్త విద్వేషి = సర్వశాత్రవుల, ధామ = గృహములయొక్క, ఓఘుఁడు = సమూహము గలవాఁడు, అగుచున్, అత్యనల్పదర్పము = మిక్కిలి తగ్గని తనగర్వము, అమరవిపక్షయూధపునిన్ = దేవశత్రువులగు రాక్షసయూధ మునకు రక్షకుఁడగు రావణుని, పట్టిన్ = కుమారుఁడగు నింద్రజిత్తును, బలకదంబకమును = సైన్యసమూహమును, సరకుగొనక = లక్ష్యముసేయక, ప్రబలన్ = అధికముకాఁగ, దీనికిఁ గర్తయత్యనల్పదర్ప మనుపదము; సత్త్వసాహసములు = బలసాహసములు, చూపఱకున్ = చూచువారికి, కరంబు = మిక్కిలి, చోద్యపఱుపన్ = ఆశ్చర్యపఱుపఁగా, లంకపెంపు ఎల్లన్ = లంకానగరముయొక్క యభివృద్ధియంతయును, దీవ్రటిచెను = నశింపఁజేసెను;

తా. పాతివ్రత్యనిధియగు సీతయొక్క యనుగ్రహవిశేషముచే శరీర మగ్నిచే దహింపఁబడక యుండఁ దనతోఁకయందుండు నగ్నిచే రాక్షసుల గృహములెల్ల దహించి, రావణునింగాని యాతని కుమారుఁడగు నింద్రజిత్తునుంగాని, వారి సేనలంగాని లక్ష్యముసేయక తన శౌర్యసాహసములు చూచువారల కాశ్చర్యము గలుగఁజేయుచుండ లంకాపట్టణ మంతయు నాశము గావించెను.

"భూతనయానుగ్రహాభిగుప్తాంగుఁడగుచున్," సీతానుగ్రహమున హనుమంతుని శరీరము రక్షింపఁబడెననుటకు; "యస్యాస్తిపతిశుశ్రూషా,

యద్యస్తి చరితం తపః, యదిచాస్త్యేక పత్నీత్వం, శీతో భవ హనూమతః." రామాయణము.

"వాలహస్త." వాలహస్తశ్చ వాలధిః." అమరము.

భారత. మహిత............అంగుఁడు; మహిత = గౌరవింపఁబడిన, ధర్మ = యమునియొక్క, నియమ = ఆజ్ఞయొక్క, మాహాత్మ్య = మహిమవలన, భూత = పొందఁబడిన, "భూ। ప్రాప్తౌ." అనుధాతువున నీయర్థమగు చున్నది. నయ = నీతియొక్క, అను।గహ = అనుకూల్యమున, అభిగుప్త = దాఁపఁబడిన, అంగుఁడగుచుఁ = శరీరముగలవాఁడగుచు, శూరోత్తముఁడు, వాయుసుతుఁడు = భీముఁడు, అంతనిలక = అంతటితోఁ జాలింపక, విరటుని విడిపించినమా।తమున నిలువకయంటు; నిశ్చల ..........ధామౌఘుండు, నిశ్చలజయ = స్థిరమగు జయము యొక్క, వైభవ = విభవముయొక్క, ఉదయ = ఉదయించుటకు, మహాత్ + ఆవాల = గొప్పవాఁడయిన, స్థానమయిన యనుట; హస్త = చేతియందలి, చండ = భయంకరమైన హేతి = ఆయుధముయొక్క, విలాస = చేష్టచే, సరభస = వేగముతోఁ గూడునట్లు, గ్రస్త = మింగఁబడిన, సమస్తవిద్వేషి = ఎల్లశ।తువుల, ధామ = ।పతాపముయొక్క, ఓఘుఁడు = సమూహముగలవాఁడు, అగుచుఁ, అత్యనల్పదర్పము = అత్యంతగర్వము, అమరఁ = ఒప్పఁగా, బలకదంబకమును = శ।తువు యొక్క సేనాసమూహమును, సరకుగొనక, ।పబల = అతిశయించిన, సత్త్వ, సాహసములు, చూపఁజుఁ, కరంబు = మిక్కిలి, చోద్య పఱుపఁ = ఆశ్చర్యపఱుపఁగా, విపక్షయూధపునిఁ = శాత్రవులనాయకుఁడగు సుశర్మను, పట్టి, దొరకలంక పెంపెల్లఁ = రాజగు విరటునికలఁకనంతయు, డీల్పడిచెఁ = తగ్గించెను.

తా. ధర్మదేవతా నుగ్రహమున నభిగుప్తమగు శరీరముగల భీముఁడతి సంతోషమునఁ దనచేతియాయుధమున శత్రుసంహారముగావించి, శత్రు

పేనల సరకుగొనక శౌర్యసాహసములతో సుకర్మనుబట్టి విరటుని మాన సమునందలి కలంకనెల్ల దీర్చెను;

"హేతి;" "రవేరర్చిశ్చశస్త్రంచ, వహ్నిజ్వాలాచ హేతయః" అమరము

"ఆవాలము." "స్యాదాలవాలమావాలం." అమరము,

క. ఈగతి దక్షిణదిశయం
దాగోగ్రహదుష్టచేష్టు నధిపప్రమదా
కాగారికుని నిర్ధాముని
గా గర్వమడంచివిడిచె గాడ్పుకొడుకొగిన్. 88

రామాయణ. గాడ్పుకొడుకు = హనుమంతుఁడు, ఈ గతిన్ = ఈలాగున, దక్షిణదిశయందున్ = దక్షిణపుదిక్కున, అనఁగా దక్షిణపు దిక్కునంగల లంకయందనుట; ఆగః = పాపమనెడి, గ్రహ = భూతా వేశముచే, దుష్టచేష్టున్ = దుష్కార్యములు చేయువానిని, అధిప ప్రమదా = రామపత్నియనుసీతకు, ఐకాగారికునిన్ = చోరుఁడగువానిని, సీతనపహరించిన వానిని, రావణుననుట; ఒగిన్ = క్రమముగా, నిర్ధా మునిన్ కాన్ = గృహవిహీనునిగా, గర్వము అడంచి = వానిగర్వము నణఁచి, విడిచెన్ = లంకను విడెను;

తా. లంకంగాల్చియట సీతాచోరుఁడగు రావణునకు గృహము లేనట్లు చేసివానిగర్వమడఁచి హనుమంతుఁడు తాను లంకా పురమును వదలెను.

"ఐకాగారికున్," "చోరైకాగారిక స్తేనదస్యుతస్కర మోష కాః" అమరము

భారత. గాడ్పుకొడుకు=భీముడు; ఈగతిన్ = దక్షిణదిశయందున్ = దక్షిణపుదిక్కున, ఆగోగ్రహదుష్టచేష్టున్ = గోవులంగ్రహించినదుశ్చేష్టుఁడగు

వానిని,దక్షిణగోగ్రహణముగావించినసుశర్మ్మననుట; అధిప=రాజగువిరటుని,
ప్రమద = సంతసమునకు, ఐకాగారికన్ = చోరుఁడగు వానిని, దక్షిణగో
గ్రహణరూపదుష్కార్యమాచరించుటచే విరటునకు వెతగల్పించిన సుశర్మ
నని భావము ; ఒగిన్ ; నిర్ధామునిగాన్ = తేజోహీనునింగా, గర్వము
అడంచి = గర్వమణఁచి, విడిచెన్;

తా. దక్షిణగో గ్రహణరూపపాపకార్యాచరణమున విరటునకువెత
గలిగించిన సుశర్మ్మను భీముఁడు నిస్తేజస్కునింగా నొనర్చి విడిచిపుచ్చెను.

తే. ఇట్లు రిపుభయంకర బలోద్దీర్ణుఁ డగుచు
నవనిజ శుభప్రవృత్తిమా నవవిభునకుఁ
బరమసంతోష మొనరింప మరలెఁ బురికి
హర్ష మొదవంగ సప్రభుం డగుచు నతఁడు. 34

రామాయణ. అతఁడు = ఆహనుమంతుఁడు, ఇట్లు, రిపుభయంకర
బల = శత్రుభీకరమగు విక్రమముచే, ఉద్దీర్ణుఁడు అగుచున్ = భయంకరుఁ
డగుచు, అవనిజశుభప్రవృత్తిన్ = సీతయొక్కశుభవార్తచే, మానవవిభు
నకున్ – రామునకు, పరమసంతోషము ఒనరింపన్ = మిక్కిలి సంతోషము
గల్గింపఁగా, పురికిన్ = లంకాపురమునకు, హర్షమొదవంగన్ = సంతోష
ముగలుగఁగా, శత్రువీపురమును వీడెఁగదా యనిలంకా పురవాసులు సంత
సిలుచుండఁగా నని భావము, సప్రభుండు అగుచున్ = కాంతియుక్తుఁడ
గుచు, మరలెన్ = లంకనుండి మరలెను ;

తా. హనుమంతుఁడిట్లు శత్రుభయంకరుఁడగుచు సీతావృత్తాంతకథ
నమున రాముని సంతసింపఁజేయనెంచి, తనపోకచే లంకాపురవాసులుసంత
సిలుచుండ నటనుండి మరలెను.

భారత. అతడు = ఆభీముఁడు, ఇట్లు, రిపుభయంకర బలోద్దీర్ణుఁడు
అగుచున్, నవ = నూతనమైన, నిజ = తనయొక్క, ప్రవృత్తి = ప్రవర్త

నము, సూదవృత్తి నైపుణ్యమును; పరాక్రమకౌశలమువనుట, మానవవిభు నకుఁ=విరటునకు, పరమ సంతోషము, ఒనరింపఁ, హర్షమొదవంగఁ = = సంతోషముగలుగఁగా, స్వప్రభుండు అగుచుఁ = రాజగు విరటునితోఁ గూడినవాఁడగుచు, పురికిఁ = విరాటనగరమునకు, మరలెఁ;

తా. భీముఁడు శత్రుభయంకరుఁడగుచు నిజకార్యములచే విరటునకు సంతోషముగలుగఁచుండ నాతనితోఁడ మరలఁ బురమునఁ బ్రవేశించెను.

వ. అట్టిసమయంబున. 35

క. ఉత్తరగోగ్రహరిపునుమ
హాత్తర వార్తాప్రచార ॥ మప్పురిప్రజకుఁ
దత్తామోదంబై బల
వత్తరతాపమును మదిని ॥ వర్తిలఁ జేసెన్. 36

రామాయణ. ఉత్తరగ = ఉత్తరపుదిక్కును గురించి వెళ్లుచుండు ఉగ్ర - భయంకరుఁడైన, హరిపు = వానరశ్రేష్ఠుఁడైన హనుమంతుని యొక్క " హరీఁ పాతీతిహరిపః " అనివ్యుత్పత్తి; సుమహత్తర = గొప్ప దగు, వార్తాప్రచారము = ప్రసంగము, అప్పురిప్రజకుఁ = ఆలంకా పట్టణ మునందలి ప్రజకు, ఇటఁబ్రజాశబ్దము జాత్యేకవచనము; దత్తామోదంబై = సంతసముగలిగించినదై, బలత్తర తాపమును = మిక్కిలి యుక్తమైన పరితాప మును, మదిఁ = మనస్సున, నివర్తిలఁ చేసెఁ = నివర్తింపఁ జేసెను;

తా. ఆంజనేయుండుత్తరపుదిక్కుగ నేఁగఁగనే లంకయందలి ప్రజలు మానసమున కానందముగలుగఁ జేసి యంతకుమున్నున్న దుఃఖమును మాన్పెను.

" దత్తామోద " " ఆమోదోహర్షగంధయోః " అమరము.

భారత. ఉత్తరగోగ్రహ = ఉత్తరగోగ్రహణమొనర్చిన, రిపు = దుర్యోధనాది శత్రువులయొక్క, వార్తాప్రచారము, వృత్తాంతము, అప్పురి

ప్రజకున్ = ఆపట్టణమునందలిప్రజకు, దత్త = ఇయ్యఁబడిన, అమోదంబై = సంతోషరాహిత్యముగలదై, బలవత్తరతాపమును = మిక్కిలియధికమగు పరితాపమును, మదిని = మానసమున, వర్తిలన్ చేసెన్ = ఉండులాగునఁ జేసెను;

తా. దుర్యోధనాదు లుత్తర గోగ్రహణము గావించిరనవార్త విరాటనగరమువారి చెవిఁబడినంతనే వారు సంతోషరహితులై పరితాప మందిరి.

ఉ. ఆతతవేగయానమున నంతటనావిలసద్బలుఁడు గో
త్రాతనయాభిదర్శన విధానముదంచితవృత్తియై సము
ద్ద్యోతిల నేఁగి కాంచిరయమొప్పఁగఁ బల్కెనృపాలసూనుని
ర్ధూతతరాఘునుత్తరుగుకుస్ఫుటసంభ్రమచిత్తుఁ జేయుచున్.

రామాయణ. అంతటన్ = పిమ్మట, ఆవిలసద్బలుండు = ప్రకాశించుచుండు నాబలవంతుఁడగు హనుమంతుఁడు, ఆతతవేగయానమునన్ = విస్తారమైన వేగముగల గమనముచే, మిక్కిలి వేగగమనమున ననుట; గోత్రాతనయాభిదర్శనవిధాన = భూపుత్రికయగు సీతందర్శించిన ప్రకారమువలననైన, ముత్ = సంతోషము, అంచిత = ఒప్పుచున్న, వృత్తియై = వర్తనముగలవాఁడై. సముద్ద్యోతిలన్ = ప్రకాశింపఁగా, ఏఁగి = వెడలి, నిర్ధూతతర = విశేషముగాఁ దొలఁగింపఁబడిన, చక్కఁగాఁ దొలఁగింపఁబడిన యనుట; అఘున్ = పాపముగలవాని, నృపాలసూనున్ = రాజపుత్రుఁడగు రాముని, కాంచి = చూచి, నుత్తి = పోమొత్తఁబడిన, రుక్ = శోకముగలదగుచు, ఉరు = అధికముగా, స్ఫుట = స్పష్టమైన, సంభ్రమ = ఆశ్చర్యముగల, చిత్తున్ చేయుచున్ = మనస్సుగలవానినిగాఁజేయుచు, రయము = త్వర, ఒప్పగన్, పల్కెన్ = చెప్పెను; తనపలుకులచే నాతని

శోకమును బోఁగొట్టుచు నతని మానసమున కాశ్చర్యము గల్గించెనని భావము ;

తా. హనుమంతుఁడు సముద్రముదాఁటి సీతావృత్తాంతము చెప్ప నుత్సుకుఁడై మరల రామునిసమీపమున కరిగి, యాతని వ్యసనమును దగ్గించుచు మానసమున కాశ్చర్యము గల్గించుచు నిట్లనెను.

"గోత్రాతనయా" "గోత్రాకుః పృథివీ పృథ్వీ" అమరము.

భారత. ఆతత = విస్తారమైన, వేగ = వడిగల, యానమునన్ = రథముచే, ఆవిల = నిర్మలమైన, సద్బలుండు = గొప్పబలము కలవాఁడు, గోత్రాత = గవాధ్యక్షుఁడు, పసులకాపరులపై నధికారియనుట; నయ = న్యాయముచే, అభిదర్శనవిధానము = చూచుకట్టిప్రకారము, రాజులం గాంచవలయు నెడల నారాజులయొద్దఁగల ద్వారపాలకులు మున్నగువారి యనుగ్రహము సంపాదించి వారిమూలమునఁ గాంచవలయునను రాజానుసరణ న్యాయప్రకారమనుట ; ఉదంచిత = మిక్కిలి యొప్పుచుండు, వృత్తిమై = వర్తనముగలవాఁడై, సముద్ద్యోతిలన్ = ప్రకాశింపఁగా, ఏఁగి = వెళ్ళి, నిర్ధూతతర = మిక్కిలి యెగురఁగొట్టఁబడిన, మిక్కిలిలేనియనుట ; అఘున్ = దుఃఖముగలవానిని, దుఃఖమనుటయే యెఱుఁగనివానిననుట ; నృపాలసూనున్ = రాజపుత్రుఁడగువానిని, ఉత్తరున్ = ఉత్తరకుమారుని, గురుస్ఫుటసంభ్రమచిత్తున్ = మిక్కిలి స్పష్టమగు నాశ్చర్యముగల మనస్సుగలవానినిగా, చేయుచున్ కాంచి, రయమెుప్పఁగన్, వేగముగాననుట, పల్కెన్ = చెప్పెను.

తా. దుర్యోధనుని గోగ్రహణ వృత్తాంతము దెల్పవచ్చిన గవాధ్యక్షుఁడు ద్వారపాలుర లోఁబరచుకొని యుత్తరుంగాంచి తొందరగా నిట్లనెను.

సీ. వ్యథ లెల్లఁ దీఱ దేవరమహామహిమ వి
లోకింపఁ గంటి నశ్లోకగుణతఁ
బరఁగుభూజనాధి పతనయాకలంక
నున్నది శాంతద్వీపన్ని కాయ
వెనమన మొదవు లాలసమాన కరుబల
యత్నావరుద్ధంబు లగుచుఁ జనని
తాంతాకులీభవ త్ప్రాణవాయువులతో
వన రెడునేను నవ్వార్త సెప్పఁ
ఆ. బారు తెంచితి నని ప్రత్యభిజ్ఞాన స
మర్పణమున నతని మది యొడఁబడఁ
దా నెఱిఁగినకొలఁది నానారివృత్తాభి
ధానకథ లోకింత తడవు నడపె. 38

**రామాయణ.** వ్యథలెల్లన్ = దుఃఖములన్నియును, తీఱన్ = నశించునట్లు, దేవరమహామహిమన్ = మీగొప్పమాహాత్మ్యముచే, అస్తోక గుణతన్ పరఁగు = తగ్గనట్టి గుణసమూహములచేఁ బ్రసిద్ధురాలగు, భూమిజన్ = సీతను, విలోకింపఁగంటిన్ = చూడఁగలిగితి, "దృష్టాసీతా" యని రామాయణమున మున్నుదర్శించితినని క్రియంజెప్పి సీతనని యావలఁ జెప్పుటచే నిక్కవియు "విలోకింపంగంటి" నని క్రియనుమున్నుజెప్పెను; మొట్టమొదట సీతయనినచో నెచ్చటఁ గాన్పింపలేదని చెప్పునోయని రాముఁడు సందేహించి దుఃఖించునోయని యాతనికట్టిదుఃఖము గల్గింపఁ గూడదని భావించియే హనుమంతుఁడు విలోకింపగంటినను క్రియను మున్న జెప్పెను; ఆధిపతన=మనోవ్యథయందలి పాటుగలది, వ్యధానిమగ్నయనుట, ఆ క = ఆసీత, లంకన్ = లంకాపట్టణమునందు, ఉన్నది, శాంతద్వీప

న్నికాయ = అడఁపఁబడిన శత్రువులనుగలవాఁడా, ఇది రాముని సంబుద్ధి; వెసన్ = శీఘ్రముగా, మనము, ఒదవు=ఉపయోగింతుమనెడి, లాలసన్ = ఔత్సుక్యముచే, మానక = విడువక, ఉరుబలయత్న అవరుద్ధంబులు అగుచున్ = మిక్కిలిబలవంతమగు ప్రయత్నమున నడ్డు పెట్టఁబడినవగుచు, చనని = పోవని, తాంతఆకులీభవత్ ప్రాణవాయువులతోన్ = బడలినవై యాకులభావమునందెడి ప్రాణవాయువులతో, మనమాబిడకు సహాయపడెదమనెడి యాసతో నాకులములగు ప్రాణముల సీత నిలువఁబెట్టుకొని యున్నదని భావము. వనరెడున్ = విలపించుచున్నది, ఏను, ఇవ్వార్త చెప్పన్ = ఈమాటచెప్పుటకై, పాఱుతెంచితిని=పర్విత్తివచ్చితిని, అని = ఇట్లాడి, ప్రత్యభిజ్ఞాన సమర్పణమునన్ = గుఱుతగు చూడామణినిచ్చుటచే, అతని మది = ఆరామునిమానసము, ఒడఁబడన్ = అంగీకరింపఁగా, రాముఁడు వనమాటలలో విశ్వాసము గలిగింపఁగాననుట; తాన్ = హనుమంతుఁడు, ఎఱిఁగిఁకొలఁదిన్ = తెలిసినంతవఱకు, అన్నారి = ఆసీతయొక్క, వృత్త= ఉనికియొక్క, అభిధాన=చెప్పెడు, కథల్ = కథలను, ఆమెయునికిఁ దెల్పెడి కథలనసుట; ఒకింతతడవు = కొంతసేపు, = నడపెన్ = జరిపెను;

తా. సీతావలోకనమునకై పడిన కష్టమెల్ల దేవరయనుగ్రహవిశేషముచేఁ దీఱఁగా మహాగుణవంతురాలగు సీతంగంటిని. అత్యంతదుఃఖితయగుచు నామె లంకనున్నయది. మనమువచ్చి యామెను రక్షింపఁగలమను నాసచే మిక్కిలి ఖిన్నయయ్యు నాబిడ ప్రాణములు నిలుపుకొని యనారతమేడ్చుచున్నది. నేను దేవరతో నీమాటచెప్పఁ బర్విత్తివచ్చితినని యాడి యామె యిచ్చిన శిరోరత్నము రామునకొసఁగి యాతనికిఁ దన వార్తయందు విశ్వాస ముదయింపఁ జేసెను. పిదప నామెయునికిమనుకులను గుఱించి కొంత నేపు మాటలాడుచుండెను.

"లాలస" "లాలసే ప్రార్థనాచిత్యే" అమరము.

భారత. వ్యథ లెల్లన్, తీఱెన్, దేవరమహామహిమన్ = మీయొక్క గొప్పమహిమను, విలోకింపన్ కంటిన్ = చూడఁగలిగితిని, నిన్నుఁజూచినంతన యింక జయము గలుగునని తోఁచుటచే వ్యథ లెల్లఁ దీఱెనని భావము; అస్తోకగుణతన్, పరఁగు, భూమిజనాధిపతనయా = రాజపుత్రుఁడా, ఇదియుత్తరుని సంబోధించుట; అకలంక = కలంకములేనట్లు, మన్న = పోమొత్తఁబడిన, దిశాంత = దిగంతములవఱకుఁగల, ద్విషన్నికాయ = శత్రుసమూహములుగలవాఁడా, ఇది భూమిజనాధిపతనయాయను దానివిశేషణము; స్తోత్రరూపమున యుద్ధమునకుఁ బురిగొల్పుటకుఁగా నిట్లనెను; వెసన్ = శీఘ్రముగా, మనమొదవులు = మనయావులు, అలసమాన = మిక్కిలిప్రకాశించుచుండు, కురుబల = కౌరవసైన్యముయొక్క, యత్నాక్రుష్టంబులు = ప్రయత్నముచే నడ్డగింపఁబడినవి, అగుచున్, చనన్ = వెళ్లఁగా, నితాంత = మిక్కిలి, ఆకులీభవత్ = కలఁతచెందుచున్న, ప్రాణవాయువులతోన్, వనరెడు నేనున్ = దుఃఖించుచున్న నేను, ఇవ్వార్తన్, చెప్పన్ = ఈమాటచెప్పుటకు, పాఱుతెంచితిన్ = పరువెత్తివచ్చితిని, అని, ప్రత్యభిజ్ఞాన = గుఱుతుయొక్క, సమర్పణమునన్ = ఇచ్చుటచే, గుర్తుతెలుపుటచేననుట; అతనిమది, ఒడఁబడన్ = అంగీకరించుటకొఱకు. తాన్, ఎఱిఁగినకొలఁది; నానా = పెక్కువిధములగు, అరి = శత్రువులయొక్క, వృత్తి = వర్తనలయొక్కయు, అభిధాన = పేళ్లయొక్కయు, కథలు, ఒకింతతడవు = కొంతసేపు, నడపెన్ = జరిపెను, ఉత్తరునకు నమ్మకముగలిగి యతఁడు యుద్ధమున కుత్సాహవంతుఁడగుటకయి యిట్లు గవాధ్యక్షుఁ డభిజ్ఞానముం దెల్పెనని భావము;

తా. రాజకుమారా! నిను జూచినంతన నాదుఃఖము లెల్లను దీఱెను. మనగోగణముల నెల్లం గురుబల మడ్డగించి గ్రహించుకొని పోవుచున్నది. ఇంకను మసలుట సరికాదని వెంటనే పర్వెత్తి వచ్చితిని. నీవును నాలోకిం

పకుమని యాతనికి యుద్ధాభిలాష యినుమడించునట్లుగాఁ గొన్ని గుర్తులు సెప్పుచు నచ్చటి శత్రువులఁగూర్చిన కథలనే కొంతవఱకుఁ జెప్పుచుండెను.

ఇటఁ "ప్రత్యభిజ్ఞాన సమర్పణ" మ్మనునది రామాయణార్థమునకై తెచ్చిపెట్టుకొనినదైనను నుత్తరునకు రణాభిముఖ్యము గల్గింప గవాధ్యక్షుని చే నిట్లు చెప్పించుటయే కవి యాశయమగుటచే సందర్భ శుద్ధము గనున్నది.

వ. పదంపడి యిట్లనియె. **39**

ఆ. అలఘుమాననీయకబల విడిపింపు మా
యావులబలుమేటి కైన తదప
హారిఁ గలుష కలుషితాత్మసుయోధను
న్మద విమూఢు దురమునను వధించి. **40**

**రామాయణ.** అలఘుమాన=గొప్పమానము గలవాఁడా, మానవంతులలో శ్రేష్ఠుఁడా యనుట; ఇది రాముని సంబోధనము; మాయావులబలుమేటి= మాయావులలో మిక్కిలి గొప్పవాఁడగు, తదపహారిన్ = ఆసీతాపహారిని, రావణుననుట; కలుషకలుషితాత్మన్ = పాపముచేఁ గళంకితమూర్తియగు వానిని, సుయోధనున్ = చక్కఁగాయుద్ధ మొనర్చువానిని, మదవిమూఢున్ = మదముచే మూఢుఁడగువానిని, ఇవి తదపహారిన్ అనుపదమునకు విశేషణములు; దురమునను = యుద్ధమున, వధించి = సంహరించి, నీయబలన్ = నీభార్యను, సీతననుట; విడిపింపు.

తా. ఓరామా! మాయావులలో మేటియై పాపాత్ముఁడై చక్కఁగా యుద్ధమొనర్చువాఁడై మదాంధుఁడైన యాసీతాపహారిని రావణుని యుద్ధమున సంహరించి సీతనువిడిపింపుము.

**భారత.** అలఘుమాననీయబల = మిక్కిలిగౌరవింపఁదగిన బలముగలవాఁడా, ఇది యుత్తరుని సంబోధన; బలుమేటియైన, తదపహారిన్ =

ఆయావుల నపహరించినవానిని, కలుషకలుషితాత్ముఁగన్, మదవిమూఢున్, సుయోధనున్ = దుర్యోధనుని, తురమునన్, వధించి; ఆవులన్ = పశువులను, విడిపింపుమా;

తా. ఓ యుత్తరకుమారుఁడా ఆమాయావియగు సుయోధనుని యుద్ధమునవధించి యావులను విడిపింపుము.

ఆ. వినుమొకింత తడసినను గార్యమిఁకఁ దప్పుఁ
గాన వేగఁ గదలి వానిఁ గెలుము
గర్వయుక్తదనుజకర్ణభీష్మేష్వాస
గురురణాతిమహిమఁ గరము మించి. 41

రామాయణ. వినుము = ఓరామచంద్రా! ఆలకింపుము, ఇఁకన్, ఒకింతతడసినను = కొంచెమాలసించినను, కార్యముతప్పున్ = కార్యము తప్పిపోవును. పనిచెడుననుట; కానన్, వేగన్ = శీఘ్రముగా, కదలి, గర్వ........మహిమన్; గర్వయుక్త = గర్వముతోఁగూడిన, దనుజకర్ణ = రాక్షసులచెవికి, భీష్మ = భయంకరమైన, ఇష్వాస = వింటియొక్క, గురు = గొప్పదగు, రణ = ధ్వనియొక్క, అతిమహిమన్ = అత్యంతమహిమచే, కరము = మిక్కిలి, మించి, వానిన్ = ఆరావణుని, గెలుము = జయింపుము ;

తా. ఇంక నీ వాలసించుటతగదు. వెంటనే యిటనుండి కదలి యా రావణుని గెలువవలయును.

"రణాతిమహిమ" రణో స్త్రీ యుద్ధనాధ్వనా." నానార్థరత్నమాల.

భారత. వినుము, ఇఁకన్, ఒకింత, తడసినను, కార్యము తప్పున్, కానన్, వేగన్, కదలి, గర్వ......మహిమన్; గర్వయుక్; గర్వము

తోఁగూడిన, తదనుజ = వానితమ్ములగు దుశ్శాసనాదులయొక్కయు, కర్ణ = కర్ణునియొక్కయు, భీష్మ = భీష్మునియొక్కయు, ఇష్వాసగురు = ధనురాచార్యుఁడగు ద్రోణునియొక్కయు, రణాతిమహిమన్ = యుద్ధము నందలి గొప్పమహిమను, కరము = మిక్కిలి, మించి = అతిశయించి, వానిన్ = ఆదుర్యోధనుని, గెలుము = జయింపుము.

తా. ఇంక నాలసించినఁ గార్యముచెడును గాన కదలి గర్వితులగు కర్ణభీష్మ ద్రోణాదుల యుద్ధమునమీఱి యాదుర్యోధనుని గెలువుము.

క. అకట ! భవద్గురు సేనా
దిక మిపు డేమియుఁ బురస్స్థితిం బరఁగమి ని
న్నొకయించుక యును గుఱిసే
యక యిమ్మెయిఁ జెనకి తలఁకఁ డతఁడు చెడుమదిన్. 42

రామాయణ. అకట, భవత్ = నీయొక్క, రాముని యొక్క యనుట; గురు = గొప్పదగు, సేనాదికము = సేనయున్నగునవి, ఏమియున్ = ఏదియును, ఇపుడు, పురస్స్థితిన్ పరఁగమిన్ = ముందర లేకుండుటచే, అతఁడు = ఆరావణుఁడు, నిన్నున్ ఒకయించుకయున్ గుఱిసేయక = నిన్నుగొంచెమేనియు సరకుసేయక, ఇమ్మెయిన్ = ఈలాగున, చెనకి, చెడు మదిన్ = దుర్బుద్ధిచేత, తలఁకఁడు = కలఁతచెందఁడు.

తా. ఆరావణుఁడు నీకుసేనాదిక మెద్దియును సమీపమున లేనందున నిన్ను సరకుగొనక నీకపకృతిగావించియు భీతిలఁడు.

"ఇమ్మెయిఁ జెనకి." ఇటఁ జెనకియనుటకుఁ గొందఱు తాఁకియని యభిప్రాయపడెదరు. రావణుఁడు యుద్ధము ననింకను దాఁకలేదుగావున నపకృతిగావించి యనియే భావమగుచున్నది.

**భారత.** అకట, భవత్ = నీయొక్క, గురు = తండ్రియు, విరటుఁ డనుట ; సేనాదికము = సేనలున్నగునవియు, ఇపుడు, ఏమియున్,

పురస్థితిఁ పరఁగమిఁ = పట్టణమున లేకుండుటచే, నిన్నుఁ ఒక యించుకయును గుఱిసేయక = నిన్నించుకేనియు లక్ష్యము సేయక, అతఁడు = ఆదుర్యోధనుఁడు, ఇమ్మెయిఁ చెనకి = ఈలాగునఁ దాఁకి, వంచన చేఁదాఁకి యనుట; తలఁకఁడు = భీతిలఁడు.

తా. నీతండ్రియు నేనలునూరలేమినిదుర్యోధనుఁడు నిన్ను లక్ష్యము సేయక యిట్లసమీపించియుఁ భీతిలకున్నాఁడు.

ఆ. అని యతండు దీపితౌద్ధత్యభాషలు
పలుకఁ దనబలంబు పొలఁదిఁగాన
కధికమైన తనర్పు నాహవోత్సాహంబు
పూనె రాచపట్టి మేనువ్రెంగ. 43

రామాయణ. అని అతండు = ఆ హనుమంతుఁడు, దీపితౌద్ధత్య భాషలు = ఔద్ధత్యోద్దీపకములగు మాటలు, పలుకఁ, తనబలంబు = స్వశరీరబలము, పొలఁదిగానక = పరిమాణము గానక, పరిమితి రహితమై యనుట; అధికమై తనర్పఁ = అధికముకాఁగ, రాచపట్టి = శ్రీరాముఁడు, మేను, పొంగఁ = శరీరముప్పొంగఁగా, ఆహవోత్సాహంబు పూనెఁ = రణోత్సుకతనందెను.

తా. ఆంజనేయుఁడు గర్వోద్రేకము గలుగునట్లుపల్కఁగ రాముని బలము పరిమితరహితమై యతిశయింపనంత నా శ్రీరాముఁడు రణోత్సుకుఁ డయ్యెను.

"దీపితౌద్ధత్య." వృద్ధిసంధి. "వృద్ధిరాదైచ్." పాణిని.

ఇటకొందఱు, "తనబలంబుపొలఁది కానకధికమై తనర్ప" నను టకుఁ దన బలము యొక్క పొలఁది యడవికధికముగాఁగ యని యభిప్రాయ పడెదరు గాని యదియంత రసవంతముగాదు.

భారత. అని, అతఁడు = ఆ గవాధ్యక్షుఁడు, దీపితౌద్ధత్య భాషలు, పలుకఁగ, తన బలంబుకొలఁది గానక = తనబలముయొక్క పరిమాణ మెఱుఁగక, అనేకమైతనర్పఁగ, రాజపట్టి=ఉత్తరుఁడు, మేనుపొంగఁగ, దేహము పొంగఁగా, ఆహవోత్సాహము, పూనెను.

తా. ఆగవాధ్యక్షుని గర్వోద్రేకములు గల్గించుమాటలచే తన బలముకొలఁది యెఱుఁగక యుత్తరకుమారుఁడు రణోత్సాహమందెను.

సీ. ఈరీతిఁ బగఱపై । నేఁగ ససంభ్రమ
  స్వాంతుఁడై తద్వేళ । యంత నరయ
జోఁకనై దొరకెఁ దచ్ఛుభలగ్న మతి జిష్ణుఁ
  డాయుత్తరుఁడు జయ । యాత్ర గదలె
మహనీయశుద్ధాంత । మంజులాస్య ప్రవ
  ర్తన గురుభావార్హ । తనువికారు
ననఘు క్షత్రాచార । మునకు నానాకీశ
  సంతతిఁగొని యాత్ర । సలుపువాని
తే. నానృపాలకుమారకు । నంతట రణ
సాధ్వసమశక్తికతమున । సంశ్రయించె
దృష్టికరుడైన యొకవింత । తేజ మమర
రిపుల యౌద్ధత్యపద్బల । శ్రేణిమెఱయ 44

అవతారిక. రాముని జైత్రయాత్రను, నుత్తరుని గోగ్రహణయాత్రను జంటించి కవి యాడుచున్నాఁడు.

రామాయణ. ఈరీతిఁ = ఈలాగున, పగఱపైఁ ఏఁగఁ = శత్రువులపై దాడివెడలఁగ, ససంభ్రమస్వాంతుఁడై = సంబరముతోఁడి మదిగలవాఁడై, తద్వేళ = ఆయుద్ధమునకు వెడలునట్టివేళ, అంతఁ అరయఁ = అంత విచారింపఁగా, తచ్ఛుభలగ్నము = శుభమైన యా

లగ్నము, జోఁకమై = బలయుతమై, దొరకెన్ = చిక్కెను, అతిజిష్ణుఁడు= అత్యంత జయశీలుఁడు, ఆయుత్తరుఁడు= శ్రేష్ఠుఁడైన యారాముఁడు, జయ యాత్ర, కదలెన్ = చైత్రయాత్రగదలెను, మహనీయ......... వికారున్ ; మహనీయ, శుద్ధాంత = అంతఃపురముయొక్క, భార్య యగు సీతయొక్క యనుట ; మంజుల = మనోహరమగు, ఆస్యప్రవర్తన = వదనప్రవర్తనముచే, గురు = వేఁగైన, భావ = అభిప్రాయమునకు, అర్హ = తగిన, తనువికారున్ = శరీరవికారము గలవానిని, సీతాముఖము మానసమునకుఁ బొడఁగట్టుటచే, వేదనాభరమధికమై శరీరము కృశించి వైవర్ణ్యము గలిగెనని భావము ; అనఘున్ = పాపరహితుఁ డగు వానిని, క్షత్రాచారమునకున్ =క్షత్రియులయొక్క యాచారమునకు, యుద్ధమునకై యనుట ; చతుర్థ్యర్థమునషష్ఠి ; నానాకీశ సంతతిన్ = పెక్కు వానరసమూహమును, కొని, యాత్రసలుపువానిన్ = చైత్రయాత్ర యొనర్చు వానిని, ఆ నృపాలకుమారకున్ = రాముని, అంతటన్, రణ......... కతమునన్ ; రణ = యుద్ధమునకు, సాధు = సమర్థమైన, అసమశక్తి కతమునన్ = సాటిలేని శక్తికారణమున, అమర.........శ్రేణి ; అమరరిపు = రాక్షసుల, లయ = నాశమందు, ఔద్ధత్యవత్ = ఉద్ధతిఁగల, బలశ్రేణి = సేనాసమూహము, మెఱయన్=ప్రకాశింపఁగా, దృష్టికిన్ = చూపులకు, అరుదైన, ఒకవింత తేజము = ఒక యద్భుతతేజస్సు, ఆశ్రయించెను ;

తా. రాముఁడు శాత్రవులపై దండయాత్రవెడల నుద్దేశింపఁగనే యొక సన్నాహార్థము దొరకెను. అంత శ్రేష్ఠుఁడగు రాముఁడు చైత్రయాత్ర గదలెను. అపుడు సీతాముఖము మానసమునకుఁ బొడఁగట్టుటచే నా విరహవేదనచే వైవర్ణ్యము నందినవానిని, పెక్కు వానరసేనలతో యుద్ధయాత్ర బయలుదేరినవాని నారాముని యుద్ధమునందలి సాటిలేనిశక్తి గల్గుకారణమున రాక్షస నిర్మూలనకరమగు సేనలు మెఱయుచుండ నొక దివ్యతేజ మాశ్రయించెను.

"జోఁక." కొమరుబోఁకాకుట్టమ్ముగొనబుచోఁకారము చొక్కము చెలిమి' జోఁకపోలుపు." సాంబనిఘంటువు.

"శుద్ధాంతమంజులాస్య." శుద్ధాంతశబ్దమున కంతఃపురస్త్రీ) 'యను నర్థము గలుగుటకు; "శుద్ధాంతసంభోగ నితాంతతృప్తే నసైషధే కార్య మిదం నిగాద్యం." నైషధము.

"నానాకీశ సంతతి." "మర్కటో వానరః కీశః." అమరము.

భారత. ఈరీతిన్, పగఱపైన్ = శత్రువులపై, ఏఁగన్, ససంభ్రమ స్వాంతుఁడై, తద్వేళ = ఆకాలమునందు, సప్తమ్యర్థమునఁ బ్రథమ, యంతన్ = సారథిని, అరయన్, తచ్ఛుభలగ్నమతి = ఆ యుత్తరుని శ్రేయమునందు లగ్నమైన బుద్ధిగల, = జిష్ణుఁడు = అర్జునుఁడు, జోఁకమై దొరకెన్ = ఉత్తరుఁడు సారథికొఱకు విచారింప నర్జునుఁడు సారథ్యమునకు దొరకెను, ఆ యుత్తరుఁడు = ఆ యుత్తరకుమారుఁడు, జయయాత్ర కదలెన్ = (వెంటనే) జైత్రయాత్ర వెడలెను, మహనీయ.......... వికారున్; మహనీయ = పూజనీయమైన, శుద్ధాంత = అంతఃపుర కన్యా జనమునకు, మంజు = మనోహరమగు, లాస్యప్రవర్తన గురుభావ = నృత్తము నేర్పించుటకు గురువౌటకు, అర్హ = తగిన; తనువికారున్ = శరీరముయొక్క మార్పుగలవానిని, పేడిరూపముదాల్చినవాని ననుట అనఘున్ = పాపరహితుఁడగువానిని, అనాకీశ సంతతిన్ = దేవేంద్రుని కుమారుఁడగు నాయర్జునుని, క్షత్తృ=సారథియొక్క, ఆచారమునకున్, కొని = గ్రహించి, అర్జునుని సారథిగాఁగొని యనుట; యాత్రసలుపు వానిన్ = జైత్రయాత్ర కదలువానిని, ఆ నృపాలకుమారకున్ = ఉత్తర కుమారుని, రిపుల = దుర్యోధనాదులయొక్క, ఔద్ధత్యవత్ = ఉద్ధతితోఁ గూడిన, బలశ్రేణి = సేనాసమూహము, దృష్టికిన్, అరుదైన, ఒకవింత తేజము = ఒక యద్భుతతేజస్సు, అమరన్, మెఱయన్ = ప్రకాశించుచుండ, అంతటన్ = పిమ్మట, తత్సేనాదర్శన సమనంతరమున ననుట; ఆ

శక్తికతమునన్ = బలహైన్యము గల్గుకారణమున, రణసాధ్వసము = యుద్ధమునందలిభీతి, సంశ్రయించెను = ఆశ్రయించెను ;

తా. ఉత్తరకుమారుఁడు శత్రువులపై దాడివెడలఁ దలఁచి సారథిని విచారింప నర్జునుఁడు సారథ్యమునకు దొరకెను. అంత నాయుత్తరుఁడు చైత్రయాత్ర గదలెను. ఇట్లింద్రతనూజుఁడగు నర్జునుని సారథిగాఁగొని చైత్రయాత్ర కదలుచుండు వాఁడు శాత్రవసేనం గాంచినంతన వారి యౌద్ధత్యముంగాంచి శక్తిహీనుఁడగుట రణభీరుఁ డయ్యెను.

“యంత నరయన్.” “క్షత్తాచారమునకున్.” ఇటయంతృ, క్షత్తృశబ్దములకు సారథియని యర్థమగుటకు ; “యంతా సూతః క్షత్తాచ సారథిః.” అమరము.

సీ. అతని సముద్వేగ । తత చేష్టమాన నా
　　నాకీశసంతతి । నలువు మెఱసి
పంతంబులాడియు । నెంతయు నాత్మస్వ
　　భావ ప్రభావ సం । ప్రకటనోక్తి
సలరించియును ముదితాత్ముఁ గావించుచు
　　నా రాచకొమరుని । యంతగాఁగఁ
గైకొని ప్రస్తుత । ఘన యుద్ధకార్యంబు
　　నిజబాహుబలమున । నిర్వహించు
తే. ప్రాన్కృత్తో వీరరసలక్ష్మి । వెదలనడచె
నా యనఘవర్తను నిశివాక్షిత్రరుని హిత
మైన నిజధర్మనునుజూపి । యధికమోద
సహితుఁ జేయుచుఁ దత్పరిగ్రహము మెఱయ. 45

రామాయణ. అతని=ఆ రామునియొక్క, సముత్=సంతోషముతోఁ గూడిన, వేగ=వేగముచే, తత=విస్తృతమై, చేష్టమాన=సంచరించుచున్న,

నానాకీశసంతతి = పెక్కువానరులసమూహము, నలువు మెఱసి=అందగించి, పంతంబులు ఆడియుఁ = పంతములు పలికియు, ఆత్మ... ప్రకటనోక్తిఁ; ఆత్మ = తమయొక్క, స్వభావ = శీలముయొక్క ప్రభావ = మహిమను, సంప్రకటనోక్తిఁ = ప్రకటించుమాటలచే, ఆరాచకొమరుఁ = ఆరాజ కుమారుని, రామునననుట; ఎంతయుఁ = మిక్కిలి, అలరించియును = సంతోషింపఁ జేసియును, పంతములాడుచుఁదమ బలమహిమలం దెల్పి రామునిసంతసింపఁ జేయుచునని భావము ; (తన్మూలమున) ముదితాత్ముఁ గావించుచుఁ = సంతుష్టస్వాంతుం గావించుచు, నియంతఁ గాఁగఁ గైకొని = నియామకునిగా గ్రహించి, రాముండమకుఁ బ్రధాన నాయకునిగా నొనర్చికొని యనుట; ఆయనఘవర్తనునిఁ = పాపరహిత వర్తనుఁడగు నాతని, శివాఖ్యతరునిఁ = మిక్కిలి మంగళకరమైన నామముగలవానిని, హితమైన = ఇష్టమైన, నిజధర్మమును చూపి = తమమర్కటధర్మమును చూపి, అధికమోదసహితుఁ చేయుచుఁ = మిక్కిలి సంతోషము గలవానినిగానొనర్చుచు, తత్పరిగ్రహము మెఱయఁ = అతనికైకోలు మెఱయఁగా, ప్రస్తుతఘన యుద్ధకార్యంబు = ప్రస్తుతమగు రాక్షసులతోడి గొప్పయుద్ధవ్యాపారము, నిజబాహుబలమునఁ = తమ బాహు శౌర్యముతో, నిర్వహించు పూనికతోఁ = జరుపునట్టి పూనికతో, వీరరసలక్ష్మి పొదలఁ = పరాక్రమరసమనెడి సంపదవృద్ధికాఁగ, నడచెఁ.

తా. వానరసేన రామునిరణోత్సాహమున వర్ధమానసముత్సాహమై పంతములాడుచు నిజబలము ప్రకటింపుచు నాతని సంతసింపఁజేయుచు నాతని నిజనాయకునిగాఁ గావించుకొని, స్వమర్కట జాతిధర్మములంజూపుచు నాతనికానంద మొసఁగుచుఁ బ్రస్తుతఘనయుద్ధవ్యాపారమాత్మ భుజబలమున నిర్వహించు పూనికతో వీరరసలక్ష్మి పొదలముందునకు నడచెను

ఇచ్చటఁ గొందఱు; స్తుత్యర్హమైన గొప్పయుద్ధకార్యము తమభుజముల బలిమిచే నీర్చునట్టి యత్నముచే శౌర్యరససంపద వృద్ధికాఁగఁ దమ

మర్కటస్వభావమును వృద్ధిపఱచియుని యభిప్రాయపడెదరుకాని, ప్రస్తుత శబ్దమునకుఁ బ్రకర్షేణస్తుత యనియర్థముగావించుట కంటెఁ బ్రకృతమైన యనియర్థము గావించుట రసవంతము. మఱియు వీరరసలక్ష్మి పొదలన్ అను దానిని నిజధర్మమును జూపి యనుదానితో నన్వయించుట సరికాదు. మర్కటస్వభావము చూపినంతవీరరసలక్ష్మి పొదల నేరదు. కావున వీరరసలక్ష్మి పొదలనను దానిని నడచెనను క్రియతోడనే యన్వయింపవలయును.

భారత. అశని = ఆ యుత్తరుని, సముద్వేగతత = భయముచేఘనమగు, చేష్ట,మానన్ = మానునట్లుగా, ఆనాకిశసంతతి = ఆ యింద్రనందనుఁడగు నర్జునుఁడు, నలువు, మెఱసి,పంతంబులాడియున్,ఆత్మ........ ప్రకటనోక్తిన్ = ఆత్మ = తనయొక్క, ప్రభావ = మహిమను, ప్రకటనోక్తిన్ = ప్రకటించుమాటలచే, తానర్జునుఁడగుటం బ్రకటించియుండనచేఁబూర్వమాచరింపఁబడిన ఘనకార్యములం దెల్పియు ననిభావము; అలరించియును = సంతసింపఁ జేసియును, ముదితాత్మన్, కావించుచున్, ఆరాచశాముమరున్ = ఆయుత్తరకుమారుని, యంతగాఁగన్ కైకొని = సారథిగాను గ్రహించి, ఆయనఘవర్తనునిన్ = నిర్మల హృదయుని, ఏకాపట్యములేయుఁగని ముగ్ధవనుట, శివాఖ్యతరువినిహితమైన = జమ్మిచెట్టునందునిచిన, నిజధర్మమును జూపి = తనగాండీవమును జూపి, అధికమోదసహితున్ చేయుచున్ = మిక్కిలి సంతుష్టుంగావించుచును, తత్పరిగ్రహము = ఆవిల్లుఁగొనుట, మెఱయన్ = ప్రకాశింపఁగా, ప్రస్తుతఘనయుద్ధకార్యంబు = ప్రస్తుతమగుదుర్యోధనాదులతోడి ఘనమగునీయుద్ధవ్యాపారము, నిజబాహు బలమునన్, నిర్వహించు పూనికతోన్. వీరరసలక్ష్మి, పొదలన్ = అభివృద్ధముకాఁగ, నడచెన్.

తా. అర్జునుఁడుత్తరుని భయముమానునట్లు పలుపంతములాడునఁ తానర్జునుఁడగుటం బ్రకటించి, తనచేఁబూర్వమాచరింపఁబడిన ఘనకార్య

ములందెల్పి యాతనిసంతసింపఁ జేసి, తనకాతని సారథింగావించుకొని శమీవృక్షస్థితమగు నిజగాండీవముం జూపి దానింగ్రహించి యుద్ధ వ్యాపారమునునిజబాహు బలమున నిర్వహించు పూనిక నివీరరసలక్ష్మీ పాదలంగదలెను.

"అనఘవర్తనుని" ననుస్థలమున నేకపటము నెఱుఁగని ముగ్ధస్వభావముగలవాని ననుటకు నిదర్శనము; "చిత్రే యుద్ధంవిలో క్యాహంచాపలాదేత్య వంచితః। తత్రాసద్భిరిహాోద్యక్భిః త్త్వేళాహేషితబృంహితైః." అనంతభట్టు.

ఆ. రామవిభుఁడు జిష్ణుఁ డీనూడ్కిఁజని యను
    సృతమనోరథ హరి గతి కలరుచుఁ
    ద్వరితగతి విరోధి వాహినీవర విజృం
    భణము గరము గానఁబడఁగ డాసె. 46

**రామాయణ.** జిష్ణుఁడు = జయశీలుఁడు, లేక విష్ణుమూర్తియగువాఁడు, రాముఁడు = శ్రీరాముఁడు. ఈమాడ్కిన్ - ఈవిధమున, చని, అనుసృత = తన్ననుసరించుచున్న, మనోరథ = కోర్కినిగల, తనయిష్టము చొప్పుననుండు వారనుట; హరిగతిన్ = వానరులగమనముచే, అలరుచున్ = సంతసిలుచు, త్వరిత..........విజృంభణము = త్వరితగతి = తనయొక్క త్వరితగమనమునకు, విరోధి = విరోధియగునట్టి, తనత్వరితగమనబున కడ్డంము దవిలెనని భావము; వాహినీవర = సముద్రము యొక్క, విజృంభణము = చెలరేఁగుట, కరము = మిక్కిలి, కానంబడఁగన్ = కాన్పించుచుండ, డాసెన్ = (ఆసముద్రమును) సమీపించెను.

తా. రాముఁడు వానరుల సేనాగమనమున కలరుచుఁదనత్వరితగమనమున కడ్డుపడిన సముద్రమునుడాసెను.

భారత. రామవిభుఁడు = రాముని వలెవైభవము గలవాఁడు, జిష్ణుండు = అర్జునుఁడు, ఈమాడ్కిన్, చని, అనుసృతమనోరథ = స్వేచ్ఛానువర్తనములగు, హరిగతిన్ = గుఱ్ఱముల గమనముచే, అలరుచున్, త్వరితగతి విరోధి వాహినీ = దుర్యోధనుని సేనలయొక్క, వరవిజృంభణము, కరమున్, కానఁబడఁగన్, డాసెన్ = సమీపించెను.

తా. అర్జునుఁడు దనయిష్టమునను సరించినడచుచుండు నాహాయములగమనమున కలరుచు దుర్యోధనునిసేనలసమీపించెను.

సీ. ఇట్లుసువ్యక్తిఁ బొ - ల్పెసఁగు నాతనిరాక
పొల్పుమీఱఁగ లంకఁ - బుణ్యజనులు
వెరవిడిగాఁడె యీ - నరుఁ డల్కఁజేసి దు
ర్ణయమున వచ్చు చు - న్నాఁడు సమయ
రక్షోపహతిసేయ - రామికానం డక
టా! నియతియలంఘ్య - మని వగచిరి
మఱికొంద ఱిది యేమి - మాటలు మనపాటి
వరికింపనేరఁడే - యురువివేక

ఆ. శాలి యతఁడు యుద్ధ - కేళికాలంబని
నిజభుజబలలక్ష్మి - నెగడఁ బగఱ
నుక్కడంపవచ్చు - చున్నాఁడుగాని యీ
తలఁపు ధృఢము గాదు - తెలియుఁడనిరి. 47

రామాయణ. ఇట్లు, సువ్యక్తిన్ = మిక్కిలి వ్యక్తముగా, పొల్పెసఁగు = ఆనందించునట్టి, ఆతనిరాక = ఆరాముని రాక, పొల్పుమీఱఁగన్ = అతిశయింపఁగా, లంకన్, పుణ్యజనులు = లంకయందలి రాక్షసులు, ఈనరుఁడు = ఈమనుష్యుఁడు, రాముఁడనుట; వెరవిడిగాఁడె = ఉపాయహీనుఁడు గాఁడె, అల్కచేసి = కోపముతో, సమయన్ = చచ్చుటకై,

దుర్ణయమునన్ = అవినీతిని, వచ్చుచున్నాఁడు=అరుదెంచుచున్నాఁడు, రాముని యీరాక యాతని మరణమునకే కాని క్షేమమునకుఁగాదని భావము; రక్షోపహతి = రాక్షససంహారము, చేయరామి = కాదు = తెలియుఁడు, అకటా = అయ్యో, నియతి = దైవనిర్ణయము = అలంఘ్యము = దాఁటఁదగనిది = దైవవిధి యనునల్లంఘనీయమగుట చేతనే యీతనికిట్టి బుద్ధి యుదయించె ననుట; అనిపగచిరి = చింతించిరి, మఱికొందఱు = ఇంకఁగొందఱు, ఇది ఏటిమాటలు, ఉరువివేకశాలి = మిక్కిలి జ్ఞానముగలవాఁడు, అతఁడు మనపాటి = మనకొలఁది, పరికింప నేరఁడే = విచారింపఁజాలఁడా, యుద్ధకేళికా = యుద్ధవిహారమునకు, ఆలంబని = ఆధారమగు, నిజభుజలక్ష్మి = తనభుజబలమను సంపద, నెగడన్ = వర్ధిలఁగా, పగఱన్ = శత్రువులను, ఉక్కడంపన్ = ధ్వంసము చేయుటకై, వచ్చుచున్నాఁడుగాని, ఈతలఁపు = మీయాయాలోచన, దృఢముగాదు = నిశ్చయముగాదు, తెలియుఁడు, అనిరి.

తా. రాముని రాకలంకకుఁ దెలిసి యచ్చటి రాక్షసులుపాయహీనుఁడగుటచేఁ దనమరణమునకై యాతఁడే ప్రవేశమునకు వచ్చుచున్నాఁడు. రాక్షసంహార మశక్యమనుట దెలియుఁడు, పాపము! దైవవిధియలంఘ్యముగదా యనిచింతించిరి. మఱికొందఱాతఁడు బుద్ధిమంతుఁడు మనశక్తియెఱుఁగఁజాలఁడా, యుద్ధకేళీ సహకారమగు భుజబలముకలిమినే శత్రులవిధ్వంసముగావింప వచ్చుచున్నాఁడు కావునమీయాయాతలంపులు దృఢములుగావని తెలియుఁడనిరి.

"యుద్ధకేళి కాలంబని నిజభుజలక్ష్మి" యను నెడఁ గొందఱు "యుద్ధకేళికిన్, ఆలంబని = ఉపేక్షగా" నని యర్థమగునని యభిప్రాయపడెదరుగాని యిటనాలంబని యనుపదమును వచ్చుచున్నాఁడని క్రియతోఁ జేర్చుట దూరాన్వయమగును గావున నది సందర్భ శుద్ధముగాదు.

"నియతి." "దైవం దిష్టం భాగధేయం భాగ్యం స్త్రీ నియతిః పుమాన్." అమరము.

"పుణ్యజనులు. "యాతుధానః పుణ్యజనః" అమరము.

**భారత.** ఇట్లు, సువ్యక్తిన్ పొల్పెసఁగు = వేషాంతరము లేకుండఁగ వ్యక్తముగాఁ బ్రకాశించు, అతనిరాక=ఆ యర్జునునిరాక, పొల్పుమీఱన్ = అతిశయింపఁగా, కలంకన్ = కలంతచే, పుణ్యజనులు = పుణ్యవంతులగు జనులు, ద్రోణాదులనుట ; ఈ నరుఁడు = ఈ యర్జునుఁడు, వెరవిఁడి గాఁడె = ఉపాయహీనుఁడుగదా, అల్కచేసి = కోపముతో, దుర్నయమునన్ = అవినీతిచే, వచ్చుచున్నాఁడు, ఇప్పుడు వచ్చుట దనకు హానికరమనుట క్రోధమునఁ దెలియక పోరికివచ్చుచున్నాఁడని భావము; సమయరక్షా = తనయజ్ఞాతవాసరూప ప్రతిజ్ఞాపోషణముయొక్క, ఉపహతి = నాశము, చేయరామి = చేయఁదగని దనుట; కానఁడు = తెలియఁడు, తమప్రతిజ్ఞచొప్పున నజ్ఞాతవాసవత్సరమునఁ, దాముబయలు వడిన మరలనరణ్యమునకుఁ జనవలయునుగానఁ బ్రతిజ్ఞారక్షణమావశ్యకమనుట క్రోధపరవశుఁడై కానఁడనుట;అకటా=అయ్యో,విషాదార్థకము;నియతి = విధినిర్ణయము, అలంఘ్యము =మీఱరానిది, అని, మఱికొందఱు = భీష్మాదులు, ఇది, ఏమిమాటలు, మనపాటి, పరికింప నేరఁడే = మనయంత విచారింప నేరఁడా. ఉరువివేకశాలి = మిక్కిలి బుద్ధిమంతుఁడగు, అతఁడు = ఆయర్జునుఁడు, యుద్ధకేళి కాలంబని = రణవిహారమునకుందగినకాలమని, అజ్ఞాతవాసవత్సరము పూర్తియగుటచేని స్తీర్ణప్రతిజ్ఞుఁడు కావున నేయిది యుద్ధవిహారమునకుందగు కాలమని భావము; నిజభుజలక్ష్మి=తనబాహుబలమనెడి సంపద, నెగడన్ = అభివృద్ధముగాఁగ, పగఱన్ = శత్రువులగు కర్ణాదుల, ఉక్కడంపన్ = గర్వమునణఁచుటకై, వచ్చుచున్నాఁడుగాని, ఈతలంపు = ఇట్టితలంపు, ప్రతిజ్ఞాపోషణమొనర్పక కేవలక్రోధపర

వశుఁడై యిట్లువచ్చెనను తలంపనుట; దృఢముగాదు = నిశ్చయముగాదు, మీయీ యూహసరిగాదనుట; తెలియుఁడు, అనిరి.

తా. వేషాంతర హీనుఁడై సువ్యక్తముగా వచ్చిన యర్జునుం గాంచి ద్రోణాదులుగలఁతనంది ప్రతిజ్ఞానిర్వహణము గావింపక క్రోధాంధుఁడై యిట్లువచ్చుట దనకుహాని కరమనుట దెలియక వీఁడేలవచ్చెననిరి. అంత భీష్మాదు లిదేటిమాటలు? అర్జునుఁడు దెలివిలేని వాఁడుగాఁడు; ప్రతిజ్ఞాపూర్తి యగుటచే శత్రుభంగ మొనర్పయుద్ధ విహారమునకిది తరుణమనుట దెలిసి యేవచ్చియున్నాఁడు గానమీయూహలు సరిగావనిరి.

“వెరవిఁడిగాఁడై యానరుఁడు......కానందు.” అనుటకు

“వెరవిఁడిగాక వీఁడుకురువీరులకుం బొడచూపువాఁడై యచ్చరువున నొకమ్రాని పెరనిట సేరఁగవచ్చుచున్నవాఁడహంకరణము కాని యొండొకటి గానఁడు మూర్తివిశేషమారయఁగ సురపతియట్లవీని మదిచొప్పది యెట్లొ యెఱుంగనయ్యెడుఁగా” అని ద్రోణవాక్యము. భారతము, విరాట పర్వము. ఇట్లు భారతార్థ ముపపాదించుట కొఱకే రామాయణార్థమున లంకాజనులసంభాషణముగల్పితము.

అర్జునునకు నరుఁడను పేరు గల్గుటకు; “ వినుము దంభోద్భవుండను రాజుతన కెనరెవ్వరు లేరంచుఁ గ్రొవ్వినరుఁడు, నారాయణుండను వారలుగంధమాదన మనునగమునఁ దపముసేయ, వారిపైఁజని యాహవము నకుఁ బిలిచిన నమ్మునీంద్రులు వలదనియునేక, విధములఁ జెప్పంగ వెండి యుఁబోకున్నఁ గుశముష్టిను జ్వాలవిశిఖవృష్టి గురిసినరుఁడు నేనఁగూల్చి యాతని భంగపెట్టి పట్టి విడిచెనట. యమ్మహాత్ములిప్పుడు పార్థుఁ డనఁగృష్ణుఁ డనఁగ, లీలార్థజన్మకలితులైరి, నూవె” భారతము, ఉద్యోగ పర్వము.

వ. ఇత్తెఱంగున. 48

తే. మునఁగినలఁబోరుగురుభీష్మ ముఖుల సఖుల
నాత్మసైన్యరత్న శ్రేష్ఠులైనవారిఁ

జూచి యధిపతి యెక్కడి కై సుద్దు లనుచు
నడిగి వారందులోఁ దగినంత చెప్ప. 49

రామాయణ. మునగెసలన్ = ప్రీతిపూర్వకమగు సంభావణలతో, పోరు=యుద్ధమొనర్చు, కాపట్యముతోఁ బ్రీతిపూర్వకసంభావణము సల్పు లాగున నభినయించుచుఁ బిటాలున పైఁబడియుద్ధ మొనర్చువారని భావము; ఇది రక్కసుల వంచనాశీలమును నిరూపించుచున్నది; గురుభీష్మముఖులన్ = మిక్కిలి భయంకరములగు ముఖములు గలవారిని, సఖులన్ = మిత్రులగు వారిని, ఆత్మసైన్య రక్షశ్శ్రేష్ఠులైన వారిని = తనసేనలోనంగలరాక్షసులలో శ్రేష్ఠులగు వారిని, చూచి, అధిపతి = రావణుఁడు, ఎక్కడిసుద్దులను చున్ = ఏమిసంగతియనుచు, అడిగి, వారు = ఆరాక్షసులు, అందు లోన్ = ఆ సుద్దులలో, తగినంతచెప్పన్ = చెప్పఁదగినంత చెప్పఁగా, రాక్షసరాజునెదుట సమభీతిం జెప్పసాహసించి విక్రమమును మాత్రము చెప్పఁగానని భావము ; లేక స్వబలపరబలములనాలోచించి సీతార్పణము చేసి నీ కులమును నిల్పుకొమ్మని తగినంత చెప్పఁగాననియు భావమగును.

తా. మాయావులగు నా రాక్షససేనసలంగాంచి వారాడుచుండిన విషయమెద్దియనియడిగి తెలిసికొనిన రావణుఁడు వారుదనకుఁ దగినంత చెప్పఁగా.

కొన్నిప్రతులలో ముసముసలనని పాఠము గాన్పించుచున్నది. కాని ప్రాచీన ప్రతులలో మునగెసలనను పాఠము గానవచ్చుటచే దాని నంగీక రించితిని.

“ మునగెసలన్ ” “ మునగెస = ప్రీతిచేఁబరస్పరము పల్కు కొను వాక్యము. ” ఆంధ్రపదపారిజాతము.

“ ఆత్మసైన్య రక్షశ్శ్రేష్ఠులన్ ” ఇటరక్షః + శ్రేష్ఠులనని పద చ్ఛేదము గావింపక, “ రక్ష +శ్రేష్ఠులన్ ” అని పదచ్ఛేదము గావిం

చి, రక్షించుటయందు శ్రేష్ఠమగువారినని కొంద అభిప్రాయ పడెదరు గాని "రక్షః + శ్రేష్ఠులన్" అని పదచ్ఛేదము గావించుటయే సందర్భ శుద్ధముగ నున్నది.

"రక్షశ్శ్రేష్ఠులన్" సూర్యరాజామన్న దీనిని విశేషణోత్తర పదము గావించెనుగాని యిది సప్తమీ తత్పురుషయే యగును.

భారత. ముసగెసలన్ = పరస్పరప్రీతిపూర్వక సంభాషణములచే, సేనలోనివా రొండొరులం బ్రీతిపూర్వకముగా నాహ్వాన ప్రత్యాహ్వానములు గావించుచునని భావము; పోరు = యుద్ధముసేయఁగల, గురుభీష్మముఖులన్ = ద్రోణుఁడు భీష్ముఁడు మున్నగువారలను, సఖులన్ = మిత్రులగు కర్ణాదులను, ఆత్మసైన్యరక్ష శ్రేష్ఠులైనవారిన్ = తన సేనను రక్షించు వారిలో శ్రేష్ఠులగు వారిని, చూచి, అధిపతి = దుర్యోధనుఁడు, ఎక్కడి సుద్దులు = ఏమి సంభాషణములు, అనుచున్, అడిగి, వారు, అందులోన్ = ఆ సంభాషణములో, తగినంత చెప్పన్ = యుక్తమయిన దానిం జెప్పఁగా;

తా. దుర్యోధనుఁడు భీష్మద్రోణాదులం గాంచి మీ సంభాషణ మేమన వారు చెప్పఁదగిన యంశముం జెప్పిరి.

వ. ఆకర్ణించి వెండియుం బలువురు పలు తెఱంగుల గుజగుజలాడు చందంబును భావించి యందఱకు నిట్లనియె. 50

రామాయణ భారతార్థములు సమము. సుగమము.

ఆ. ఎన్నఁగానరాద్య పేక్షితార్థము కాదె
నరునిరాక ; యిది మతినంబులందుఁ
దక్కఁగతిగఁ గొనుట దగదేరికిని మన
యర్థసిద్ధి యగుట కలరవలయు. 51

రామాయణ. నరునిరాక = మనుష్యునిరాక, ఎన్నఁగాఁ = తలంచి చూడఁగా, నరాద్యపేక్షితముకాదె = మనుజ భక్షకులగు మన కపేక్షితము కదా, ఇది = ఈరాక, మనంబులందుఁ = మానసముల, తక్కఁగతిగఁ = ఇతరవిధముగ, కొనుట = గ్రహించుట, ఏరికిని = ఎవ్వరికిని, తగదు = యుక్తముకాదు, మన యర్థసిద్ధి యగుటకుఁ = మనకార్యము సిద్ధించుటకు, అలరవలయుఁ = సంతసింపవలయును, మనకయత్న సాధ్యమగు నాహారము లభింపనుండ సంతసింటకుమాఱు శంకల నంగనగునా యనిభావము;

తా. మనుజాదులకు మనకు మానవుఁరాక యపేక్షింపఁదగినదియగుటం దీని నన్యథాగ్రహింపక సంతసిల వలయును.

భారత. ఎన్నఁగానరు = విచారింపఁజాలరు. నరునిరాక = అర్జునునిరాక, ఆద్యపేక్షితార్థముకాదె = మనమాదినిం గోరినవిషయమే కదా, మనమిట గోగ్రహణమునకు వచ్చునప్పుడు పాండవాగమన మపేక్షించియేకదావచ్చితి మనుట; ఇది = ఈ యర్జునాగమనము, ఏరికిఁ = ఎవ్వరికిని, మనంబులందుఁ = మనస్సులందు, తక్కఁగతిగఁ = ఇతరవిధముగా, కొనుట = గ్రహించుట, తగదు = అయుక్తము, మన యర్థసిద్ధి యగుటఁ అలరవలయుఁ, మన యిష్టప్రాప్తి యయినందులకు సంతసిలుటకు మాఱు విరోద్ధి శంకల నందవలదనుట ;

తా. బాగుగ విచారింపఁజాలరు గదా? మన మిచటికి వచ్చునప్పుడే పాండవుల రాకం బ్రతీక్షించితిమి కదా? అట్లే అర్జునుఁడు వచ్చియుండ వేఱేశంకలేల? సంతోషింప వలయును ;

తే. అసమయాత్మోద్ధతి పిశాచి యన్నుకొల్ప
బుద్ధిసెడివచ్చుచున్నాఁడు పాఁడవడంగి
పొఁగలాఁడిదిగో తన పోతరమునఁ
గ్రమ్మఱంగాన కితఁడు సద్భ్రాతృకముగ. 52

**రామాయణ.** అసమ = సరిలేని, ఆత్మోద్ధతిపిశాచి = తన గర్వ మనెడి పిశాచము, అన్నుకొల్పఁగ = మత్తుకొలుపఁగా, తనపోతరమునఁ = తనక్రొవ్వుచే, బుద్ధిచెడి, ఇప్పుడువచ్చిన తాను జీవింపలేఁడను బుద్ధి దెలియక, వచ్చుచున్నాఁడు, ఇదిగో, ఇతఁడు=ఈ రాముఁడు, క్రమ్మఱఁ బోనక = తిరిగిపోలేక, సభ్రాతృకముగఁ = సోదరునితోఁ గూడ, పాడవ డంగి పోఁగలాఁడు = నశించి పోఁగలఁడు.

తా. తనయుద్ధతియను గ్రహముచే నావిష్టుఁడై శరీర మెఱుఁగక గర్వముతో వచ్చుచున్నాఁడు, ఇటనుండి తిరిగిపోలేక సోదరయుతముగా నశింపఁగలఁడు.

"అసమయాత్మోద్ధతి." సమముగాని యుద్ధతియన మనతో సరియగు నుద్ధతిలేని వాఁడనియే యర్థము గావింపవలయును. ఇది రావణ వాక్యమగుటచే నట్టియర్థమే సందర్భశుద్ధమగును. కొందఱు నిరుపమానమగు నుద్ధతి యని యభిప్రాయపడుట సరికాదు.

మఱియుఁ "దనపోతరమున" ననువాని వచ్చుచున్నాఁడను క్రియతో నన్వయించుట సమంజసముగాని, "తనపోతరమునం గ్రమ్మఱం గానక" యని కొందఱన్వయము గావించుటయు శుద్ధముగాదు.

ముద్దరాజు రామన్న "పాడవడంగి...సభ్రాతృకముగఁ గ్రమ్మఱం గానక... పోఁగలాఁడని యన్వయించుటయు సరిగాదు. పాడవడంగి యను దానిం బోఁగలాఁ డనుక్రియతోడ నన్వయించుటయే సందర్భశుద్ధముగా నున్నయది.

**భారత.** అసమయ = అసమయమునందలి, అజ్ఞాతవాసవత్సరము పూర్తిగాక మున్నె యనిభావము; ఆత్మోద్ధతి పిశాచి = తన యౌద్ధత్య మనెడి పిశాచి, అన్నుకొల్పఁగ = మత్తుగొల్పఁగా, పోతరమునఁ, బుద్ధి చెడి, గర్వాతిశయముచేఁ దానిప్పుడు బయల్పడిన రల నరణ్యము

కరుఁ వలయునను తెలివిలేక, వచ్చుచున్నాఁడు, ఇతఁడు = ఈ యర్జునుఁడు, పొడవడఁగి = అభివృద్ధితగ్గి, యుద్ధమున నపజయము పొందియనుట; సభ్రాతృకముగన్ = ధర్మరాజాదులతోడ, క్రమ్మఱన్, కానకున్ = అడవికి, పోఁగలాఁడు ;

తా. అజ్ఞాతవాస వత్సరములో బయల్పడుట దమకు హానికరమనుట దనయుద్ధతిచేఁ దెలియక గర్వితుఁడై వచ్చుచున్నాఁడు. ఇతఁడిట నపజయము పొందుటయేకాక మరల సోదర యుతముగ నరణ్యావాసమున కరుగఁ గలఁడు ;

"అన్నకొల్పన్." "అన్నుకొనుట, మత్తుగొనుట." ఆంధ్రపద పారిజాతము.

"కాన." "అడవి కానయనంగ నటవికిఁదగు." సాంబనిఘంటువు.

"సభ్రాతృకముగన్." సహార్థమున సకారమువచ్చుటకు "వోపసర్జనస్య." పాణిని.

సీ. అననవ్వు డెస్కెక § సమరశత్రు విభీష
ణుఁడు భీష్ముఁడనుశంక § నులిమివైచి
ఱుఱుఁ బంతనుమీఱఁ § గలనికి నాయిత
పడువారమెల్లను § బడుటగాని
మనకింక సమయము § న్నాట లే దిదియెంచ
వలదు నీ వజ్ఞాత § వాసముచిత
మగునీతి ముగియించి § యాజికనఱమొద
వాఖిలరణతేజుఁ § డాతఁ డతని

ఆ. మార్కొనుట భరంబు § మహితనయాత్యాగ
మునఁ జలింపక మన § మనికిసిలువ

యత్నమాచరింపు మనుష్యులబుద్ధిచే
సరకుఁగొనక యునికి జాడగాదు. 58

అవ. రావణుని యీ గర్వోక్తుల కచ్చటివా రెదురాడ వెఱచి యూరకుండ విభీషణుఁ డిట్లనుచున్నాఁడు.

రామాయణ. అనన్ = రావణుఁ డిట్లాడఁగా, అప్పుడు = తద్వాక్య సమనంతరముననే, ఎన్నికన్ = తలంపుతో, సాలోచనముగా ననుట ; అమరశత్రున్ = దేవశత్రువును, రావణుననుట; విభీషణుఁడు, భీష్ముఁడు అను శంకన్ = భయంకరుఁడనెడి శంకను, నులిమివైచి = మాని, తక్కినవారివలెఁ గాక యాతని భీకరాకారముగాంచి వెఱవకయని భావము ; పలుకున్ = చెప్పును, ఇదిమొదలు విభీషణవాక్యము ; పంతము, మీఱన్ = అతిశయించులాగున, కలనికిన్ = యుద్ధమునకు, ఆయితపడు వారము ఎల్లను = సిద్ధపడువార మందఱమును, పడుటగాని, నశించుటయే కాని, మనకున్, ఇంకన్, పసుము = చావను, అన్మాట = అనెడి మాట, లేదు, మనమింక చావకుండెదమను మాటలేదు, తప్పక చావవలసిన వారమే యనుట ; ఇది = ఇట్లు యుద్ధమున రాముని గెలుతమనుమాట, ఎంచవలదు = తలంపవలదు, తప్పక మరణింప వలసినదే కాని యాతని జయించెదమనుమాట యడియాసయగుననుట; నీవు, అజ్ఞాతవా = తెలివిలేని వాఁడవా, సముచితమగు = యుక్తమగు, నీతి = న్యాయమును, మఱియించి = వీడి, ఆజికిన్ = యుద్ధమునకు, ఆఱమెదవు = ప్రయత్నమొనర్చెదవు, సామాద్యుపాయములలోఁ గ్రమముగా మొదటి మూఁడింటిం బ్రయోగించి కడను దండోపాయముం బ్రయోగింపవలసియుండ నట్లొనర్పక యాదినే దండోపాయ ప్రయత్నము నీతి దూరమని భావము ; [మఱియు] అతఁడు = ఆ రాముఁడు, అఖిలరణతేజుఁడు = అనుత భయంకరమగు పరాక్రమము గలవాఁడు, రాక్షసాంతకుఁడగు విష్ణుఁడని

భావము; ఆతనిన్ = ఆరాముని, మార్కొనుట = ఎదిరించుట, భరంబు = దుస్సాధము, మహితనయా త్యాగమునన్ = భూపుత్రికయగు సీతను వీడుటయందు, చలింపక = స్థిరుఁడవై, సీతనిచ్చి యనుట; మనిమనికి = మన బ్రదుకు, నిలువన్ = నిలుచునట్లు, యత్నము ఆచరింపుము = ప్రయత్నింపుము, అన్యులబుద్ధిచేన్ = ఇతరుల బుద్ధిచేత, సరకుగొనక యునికి = (నామాట) లక్ష్యపెట్టకుండుట, జాడగాదు = తగదు, దుర్గర్వితులగు నన్యులమాటవిని నామాటలు లక్ష్యము సేయకుండుట దగదని భావము;

తా. రావణుని మాటలువినిన విభీషణుఁడు రావణునివలని భీతిని వీడి యిట్లనెను. పంతమునకై మనము యుద్ధమున కరిగిన నట్లరిగినవార మెల్లరమును బ్రదికెదమను నాశవదలుము. మనకు మరణింపమనుమాట యిఁక లేదు. మఱియు నీ వింతజ్ఞాన సంపన్నుఁడవయ్యు సామాద్యుపాయత్రయము వీడి ప్రారంభముననే దండోపాయమునకుఁ గడంగుట సరికాదు. అదియునుంగాక యారాముఁ డసురభీకరపరాక్రమసంపన్నుఁడగు విష్ణుఁడుగాని సామాన్యుఁడు గాఁడు. అట్టివాని నెదిరించుట కష్టము. కావున సీత నాతనికి సమర్పింపుము. దాన మనము సుఖముగా బ్రదుకఁగలము. హితముచెప్పు నామాటల వినక ప్రియముసెప్పువారల మాటలువినుట యయుక్తము.

"సముచితమగు నీతి మగియించి యాజికి నఱమెద వాభీలరణ తేజుఁ డాతని మార్కొనుట భరంబు మహితనయా త్యాగమునఁ జలింపక మన మనకి నిలుపయత్న మాచరింపుము." అనుటకు తే. "తొలుతమూఁ డుపాయంబులు గొలుపకున్నఁ, దుదిగదా విక్రమోద్యోగము." అనియు; తే. సురవరుఁడుగాఁడు కిన్నరేశ్వరుఁడు గాఁడు, పావకుఁడుగాఁడు పితృలోక పతియుఁగాఁడు, ఆహవక్రీడ నీక్రోడనాదివిష్ణుఁ, డైనరాముని గెల్వనీకలని యగునె." యనియు, "పుచ్ఛమరలన్ వేవేగ పృథ్వీసుతన్." అనియు భాస్కరరామాయణమునఁ గలదు.

"మఱియు ;" సీతాంచ రామాయ నివేద్య దేహం వసేమ రాజన్నిహ వీతశోకాః." అని రామాయణమునను గలదు.

భారత. అనన్ = దుర్యోధనుఁ డిట్లు చెప్పఁగా, అప్పుడు, ఎన్నికన్ అమరన్ = ఎంచి చూచినవాఁడై, లెక్కపెట్టినవాఁడై యనుట ; శత్రు విభీషణుఁడు శాత్రవభయంకరుఁడగు, భీష్ముఁడు = భీష్మాచార్యులు, శంకన్ నులిమి వైచి = సందేహము వీడి, అనున్ = ఇట్లు పలుకును ; పలుకున్ = మాటయును, పంతమున్, మీఱన్ = అతిశయింపఁగా, కలనికిన్ = యుద్ధమునకు, ఉద్యతపడువారము ఎల్లన్ = సిద్ధపడువారమందఱమును, పడుటగాని = ప్రయత్నించుటయే కాని, మనకున్, ఇంక, సమయమన్ మాటలేదు = అజ్ఞాతవాసము మీఱక వచ్చెనుమాట లేదు, అజ్ఞాతవాసవత్సరము మీఱకయే వచ్చెనుమాట మనమాడఁ బనిలేదని భావము ; ఇది = ఇట్టి సమయదోష శంక, నీవు, ఎంచవలదు = తలఁపవలదు, దవాభీల రణతేజుఁడు = కార్చిచ్చువలె భయంకరమైన శౌర్యతేజశ్శాలియగు, అతఁడు = ఆ యర్జునుఁడు, అజ్ఞాతవాసము = అజ్ఞాతవాసమర్యాదను, ఉచితమగు రీతిన్ = యుక్తమగు విధమున, ముగియించి= పూర్తిగావించుకొని, ఆజికిన్ = యుద్ధమునకు, అఱిమెన్ = ప్రయత్నించెను, మొట్టమొదటఁ గావించుకొనినశపథము మేర కజ్ఞాతవాసవత్సరము పూర్తి గావించుకొనియే వచ్చెనని భావము ; అతనిన్ = ఆ యర్జునుని, మార్కొనుట, భరంబు = కష్టము, మహిత = ఒప్పిదమైన, నయ = నీతి యొక్క, అత్యాగమునన్ = విడువకుండుటయందు, చలింపక = స్థిరుఁడవై, అనికిన్ =యుద్ధమునకు, మనము, నిలువన్ యత్నము ఆచరింపుము= నిలుచుటకుఁ బ్రయత్నింపుము, వెనుకంజవేయక స్థిరుఁడవై నిలిచి యుద్ధమొనర్పం బ్రయత్నింపుమని భావము ; అన్యులబుద్ధిచేన్ = ఇతరులగు కర్ణాదులబుద్ధిచే, సరకుగొనక యునికి = (నామాట) లక్ష్యపెట్టకుండుట, జాడగాదు = యుక్తముకాదు.

తా. దుర్యోధనుం డిట్లు చెప్పఁగా క్షాత్రవభీకరుండగు భీష్ముఁడు సంవత్సరములు లెక్కపెట్టిచూచి సందేహము దీఱి యిట్లనెను. మాట నుఁ బంతముమీఱఁగా మనము యుద్ధమునకు నిలువవలసినదే కాని నిలిచినవారమెల్ల గెలుతుమను మాటలేదు. అజ్ఞాతవత్సరమనుమాట యిఁక లేదు. ఇట్టి శంకవలదు. అజ్ఞాతవాసవత్సరము దీఱ్చియే యీ యర్జునుఁడు యుద్ధమునకుఁ బ్రయత్నించెను. అతని మార్కొనుట యసాధ్యము. యుద్ధమునకే ప్రయత్నించెడిచో స్థిరమై నిలువవలయునుగాని యశ్రద్ధతో నుండఁ జనదు. కర్ణాదుల మాటవిని నామాట సరకుసేయకుండుట సరికాదు.

చ. తొలుతటినుండియుం వలదు దుర్జయవైరము మానుమంచు ని
చ్చలుఁ జెవి నిల్లుగట్టుకొని చాటితి నన్ను గణింపవైతి వె
న్బలియునితోడి పోరిదియు నుపస్థితమయ్యె నగర్వబుద్ధినా
పలుకిఁకనైనఁ గైకొనుము పాయముగుం దురహంక్రియోద్ధతిన్ ॥

రామాయణ భారతార్థములు సమము తొలుతటి నుండియుం = ఆదినుండియు, వలదు, దుర్జయ = అజేయునితోడి, వైరము = ద్వేషము, మానుము అంచుం = విడుమనుచు, నిచ్చలుం = నిత్యమును, చెవినిల్లు గట్టుకొని = చెవికెక్కునట్లు, చాటితిం = ప్రకటించితిని, "చెవి నిల్లు గట్టుకొనుట యనునది జాతీయము ; నన్నుం, గణింపవైతివి = నన్ను లెక్కపెట్టవైతివి, వెన్బలియుని తోడిపోరు = గొప్ప బలవంతునితోడి యుద్ధము, ఇది, ఉపస్థితమయ్యెం = తటస్థించెను, అగర్వబుద్ధిం = గర్వరహితమగు బుద్ధిని, ఇఁకనైనం నాపలుకు గైకొనుము = ఇంకనైన నామాట నంగీకరింపుము, దురహంక్రియోద్ధతిం = దురహంకారాతిశయమున, అపాయమగుం = అపాయముగల్గును.

తా. మొట్ట మొదటినుండియు దుర్జయవైరము మానుమని చాటించి చెప్పియు నామాట వినవైతివి. ఇప్పుడు బలవద్ద్వేషము సంభవించెను. ఇప్పుడైన నామాట వినుము, దురహంకార మపాయకరము.

వ. అనుట యు నతనిం గటాక్షించి. 55

తే. ఇనతనూభవుఁ డధిపున కిచ్చకముగ
బలికె 'నెప్పుడును రిపుపక్షపాతభాష
లుడుగవైతి వింకేమని యొడిద నిన్ను
నాప్తుఁడని యున్న దొర వెఱ్ఱి యనుట గాక.' 56

**రామాయణ** ఇనతనూభవుఁడు = రాక్షసరాజపుత్రుఁడగు నింద్రజిత్తు, అధిపునకున్ = రావణునకు, ఇచ్చకముగన్ = ఇంపుగా, పలికెన్ = ఇట్లు పలికెను, ఎప్పుడును, రిపుపక్షపాతభాషలు = శత్రువునందలి పక్షపాతము తోడి మాటలు, ఉడుగవైతివి = విడవైతివి, నిన్నున్, ఆప్తుఁడని యున్న = ఆప్తుఁడనియుండు, దొర = రాజు, రావణుఁడనుట; వెఱ్ఱి = వెఱ్ఱివాఁడు, అనుటగాక, నిన్నున్, ఏమని యొడిదన్ = ఏమందును;

తా. ఇంద్రజిత్తు రావణునకింపగులాగున నిట్లనెను, ఎల్లప్పుడును శత్రుపక్షపాతివిగనే మాటలాడెదవు, ఆమాటలు మానవైతివి, నిన్నాప్తుఁడని తలఁచెడి రావణునవలయుంగాని నిన్నేమందును ?

**భారత.** ఇనతనూభవుఁడు = సూర్యపుత్రుఁడు, కర్ణుఁడనుట; అధిపునకున్ = రాజగు దుర్యోధనునకు, ఇచ్చకముగన్, పలికెన్, ఎప్పుడును, రిపుపక్షపాతభాషలు, = శత్రువులయెడ, పక్షపాతము గల్గునట్టి భాషణములు, ఉడుగవైతివి = మానవైతివి, పాండవులయెడ పక్షపాతము గల్గునట్లు పల్కుట మానకున్నావు, నిన్నున్, ఆప్తుఁడనియున్న, దొర = దుర్యోధనుఁడు, వెఱ్ఱియనుటగాక, నిన్నున్ ఏమనియొడిది = నిన్నేమన వలయును ;

తా. కర్ణుఁడు దుర్యోధనుఁడు సంతసించునట్లుగ నిట్లనెను. ఎల్లప్పుడు పాండవపక్షపాతివగుచునే పలుకుచుందువు, నిన్నాప్తుఁడని తలంచిన దుర్యోధనునవలయుంగాని నిన్నేమందును ?

క. "ఆప్తుఁడని యున్న దొర వెట్టియగునుగాక" యనుటకు మాఱు కొన్ని ప్రతులలో, "ఆదరించెడి యధిపతి ననఁగవలయు" నని పాఠాంతరము గన్పట్టుచున్నది. అయినను మత్పరిశోధిత ప్రాచీనగ్రంథములఁ బెక్కింట "నాప్తుఁడనియున్న దొర వెట్టియనుటగాక." యను పాఠమే కన్పట్టుచున్నది. మఱియు బ్రాహ్మణాదరణ మెట్టివానికి నవశ్యకరణీయ మగుట నాదరించెడి యధిపతిననుటలో విశేషములేదు. యజ్ఞాదులయందు గౌరవింపఁదగిన వారిని దనకు యుద్ధసహాయు లగుదురని తలఁచుటయే వెట్టితన మగుట నీపాఠము సందర్భశుద్ధముగనున్నది. భారతములోని "జన్నములు సేయునెడఁ బక్వాన్నంబులు గుడుచు చుండు మధిపతి నిన్నుఁగన్, జన్నియవిడిచె రణముతఱి, మిన్నక కినుపడక పొమ్ము మీ గృహమునకున్." అను కర్ణవాక్య మిందులకు సాధకమగుచున్నది.

క. ఒకనరుని విక్రమము మా
టికిఁ బొగడెద వింత కడుఁ గడిందిగ మనయే
లికకుఁ గల యోధవీర
ప్రకరము నీకేలదృష్టి పట్టదు చెపుమా? 57

**రామాయణ.** ఒకనరుని విక్రమము = ఒకమనుష్యుని పరాక్రమము, మనుష్యమాత్రుఁడగు నొక రాముని పరాక్రమమనుట ; మాటికిన్ ఇంత పొగడెదవు = పెక్కుతడవలిట్లు స్తుతించెదవు, కడున్ కడిందిగన్ = మిక్కిలి యధికముగ, మన యేలికకున్ కల = మనరాజునకుండు, యోధవీరప్రకరము = వీరభటనికరము, నీకున్ ఏలదృష్టిపట్టదు = నీకేల కనఁబడదు, చెపుమా = చెప్పుము ;

తా. మనుష్యమాత్రుఁడగు రాముఁడొక్కఁడు, అతని పరాక్రమమును నీవింత పొగడుచున్నావు కాని మనరాజునకుండు వీరభటనికరము నీకేల దృష్టిగోచరము కాకున్నదో చెపుమా. ఇటఁగొందఱు ఇంతకడుం

గడిందిగఁ బొగడెదవని యన్వయము గావింపనగునని యభిప్రాయపడెదరు కాని, ఒకనరుని విక్రమము మాటికి నింతపొగడెదవు కాని యింతకడుం గడిందిగ మనయేలికకుంగల యోధవీరప్రకరము గనుఁగొనకున్నావని యన్వయము గావించుట సందర్భశుద్ధముగా నున్నది.

**భారత.** ఒకనరుని = ఒక్కఁడగు నర్జునుని, విక్రమము = పరాక్రమును, మాటికిన్, ఇంతపొగడెదవు = స్తుతించెదవు, కడుంగడిందిగ, మన యేలికకున్ కల = మనరాజగు దుర్యోధనునకుఁ గల, యోధవీరప్రకరము, నీకున్, ఏల దృష్టిపట్టదు = కాన్పింపదు, చెప్పుమా;

తా. అర్జును నొక్కనిం బొగడెదవంతియ కాని మనరాజునకుండు నపారసైన్యము నీకేల కనంబడదయ్యెను.

ఆ. ఇట్టిమాటలాడు నట్టి మాన్యులయిండ్ల
కడనయుండి మనకుఁ గార్యసిద్ధి
గలుగఁ గోరుఁ డనుట గాకిటువంటి క
ర్జములకు బిలిపింపఁ జనునె దొరకు. 58

**రామాయణ.** ఇట్టి మాటలాడునట్టి మాన్యులన్ = ఈలాటిమాటలాడునట్టి గౌరవనీయులను, విభీషణుననుట, ఇట మాన్య శబ్దము స్తుతినింద యగును; ఇండ్లకడన యుండి = గృహముల నివసించియె, మనకున్, కార్యసిద్ధి కలుగన్ కోరుఁడనుట కాక = మనకుఁ గార్యసిద్ధియగు నట్లాశీర్వదింపుఁడనట తగుఁగాని, దొరకున్ = రావణునకు, ఇటువంటి కర్జములకున్ = ఇట్టి మంత్రాలోచనలకు, పిలిపింపన్ చనునె = పిలిపింపనగునా;

తా. పిఱికిపందలై యిటువంటి మాటలాడెడి ఘనులను [నీచుని] ఇండ్లయొద్ద నుండియే మనకుఁ గార్యసిద్ధియగు నట్లాశీర్వదింపుఁడనక రావణుఁడు నిండోలగమున నుండ నాలోచనా కార్యమునకు రానీయనగునా;

ఇప్పద్యము మూలానుసృతము గాకున్నను భారతార్థ సంఘటనకై రచితమగు చున్నది.

భారత. ఇట్టి మాటలాడునట్టి. మాన్యులన్ = గొప్పవారిని, ద్రోణాచార్యులననుట; ఇందును మాన్యశబ్దము స్తుతినిందయే యగుచున్నది; ఇండ్లకడన యుండి, మనకున్, కార్యసిద్ధి కలుగన్, కోరుఁడు అనుటగాక = మనకుఁ గార్యసిద్ధియగు లాగునఁ గోరుచుండుఁ డనుటయేకాని, దొరకున్ = దుర్యోధనునకు, ఇటువంటి కర్జములన్ = ఇట్టిఘోర సంగ్రామములన్, పిలిపింపన్ చనునె = పిలిపింపనగునా;

తా. ఇట్టి మాటలాడెడి ద్రోణాచార్యుల నింటికడ నిలుపక యుద్ధము రావించుట దుర్యోధనునకుఁ దగదు.

"బుద్ధిమంతు లిండ్లకడనుండి భోజనావసరంబుల నాయుధ శ్రమ సమయముల నీతిశాస్త్ర గోష్ఠీకాలంబుల నుచితాలాపంబులు పలుకుచుండుగాని పోట్లాడెడి వారుగారు. వారింగలనంగలసి నిలుపనీక పిలిచింది దెస నిలిపి నను నాకు వారువిజయంబు గోరుచుండుట లెస్స." యని భారతమునందలి సుయోధనవాక్య మిటఁగవి కర్ణునినోటఁ బల్కించెను.

వ అనవుడు నతం డతని నధిక్షేపించి యధిపతి కిట్లనియె. 59

రామాయణ భారతార్థములు సమము. అనవుడు [రామాయణ; విభీషణుఁ డిట్లు చెప్పఁగా నప్పుడు; భారత; కర్ణుఁడిట్లు చెప్పగా నప్పుడు,] అతండు = [రామాయణ; విభీషణుఁడు, భారత; భీష్ముఁడు,] అతనిన్ = [రామాయణ = ఆఇంద్రజిత్తును, భారత = ఆకర్ణుని,] అధిక్షేపించి = తిరస్కరించి, అధిపతికిన్ = [రామాయణ; అధిపతియగు రావణునకు, భారత; రాజగు దుర్యోధనునకు,] ఇట్లనియెన్ ;

ఆ. ఇట్టిపడుచుమాట యెడదఁ గైకొనక నీ
వాత్మ రక్షకొఱకు నాశ్రయింపు

గురుకృపాదులైన 5 గుణములప్రోకల
రాజనందనుల మహాజిచణుల. 60

రామాయణ. ఇట్టి పడుచుమాటలు = ఈలాటిబాలుని మాటలు, ఎడదన్ = మనస్సునందు, కైకొనక = గ్రహింపక, బాలుఁడు మంత్రాలోచన గావింప నశక్తుఁడగుటచే నట్టి యీ యింద్రజిత్తునిమాటలం గైకొనక యని భావము ; నీవు, గురు కృపాదులైన = గొప్పదయయున్నగు, గుణముల ప్రోకలన్ = గుణముల రాసులగువారిని, మహాజిచణులన్ = గొప్ప యుద్ధమునందలి సమర్థులగువారిని, రాజనందనులన్ = రామలక్ష్మణులను, ఆత్మరక్షకొఱకున్ = స్వరక్షణము కొఱకు, ఆశ్రయింపుము ;

తా. బాలుఁడతఁడు తెలివిలేక పల్కినఁ డీతనిమాటలు మంత్రాలోచనకుందగునవికావుగావున వీనిపలుకులం బాటింపక దయాది సద్గుణోపేతులగు నారామ లక్ష్మణుల స్వరక్షణము కొఱ కాశ్రయింపుము ;

ఇట నింద్రజిత్తుని మాటలం బడుచుమాటలనుటకు ; "నతాతమంత్రే తవ నిశ్చయోస్తి బాలత్వమద్యాప్యవిపక్వబుద్ధిః" అని రామాయణమున విభీషణుని వాక్యముగలదు.

భారత. ఇట్టి పడుచుమాటలు = ఇట్టి బాల్యపుపల్కులు, లోకానుభవశూన్యతచే నిట్లుపల్కు కర్ణునిమాటలనుట ; ఎడదన్, కైకొనక = గ్రహింపక, నీవు, గురుకృపాదులైన = ద్రోణుఁడు కృపాచార్యులు మున్నగు, గుణముల ప్రోకలన్ = గుణరాసులగు వారిని, రాజనందనులను= రాజును సంతోష పఱచువారిని, మహాజిచణులన్ = గొప్పయుద్ధములందు సమర్థులగువారిని, ఆత్మరక్షకొఱకున్ = స్వరక్షణముకొఱకు, ఆశ్రయింపుము, లోకానుభవ శూన్యుఁడగు నీకర్ణునిమాట సరకుగొనక ద్రోణాదుల మాట నంగీకరింపుమని భావము.

తా. పడుచుదనమున నోరికి వచ్చినట్లెల్లఁబల్కు నీతనిమాటల పాటింపక నీవు నీయాత్మరక్షణార్థము సద్గుణ నిధులై రాజు నానందింపఁ జేయువారగు వీరి నాశ్రయింపుము.

వ. వారలిట్లి యవివేకి వచనంబులకు వశవర్తివై వర్తిల్లు నీ యపరాధంబునం గ్రోధించివచ్చుచున్న వా రమ్మహాను భావులు గానరేనిఁ దత్తాదృగ్దివ్యబాణ ధనంజయ ప్రతా పంబున భవద్బలాంగంబులకుం గరంబు కీడ్పాటు వాటిల్లెనని తలంచెదననిపల్కి వెండియుం బెక్కుదెఱం గుల బుద్ధిసెప్పి యప్పుడు. 61

రామాయణ. వారలు = ఆ రామలక్ష్మణులు, ఇట్టి, అవివేకి వచనం బులకున్ = బుద్ధిహీనులమాటలకు, వశవర్తివై = లోఁబడినవాఁడవై, వర్తిల్లు, నీ యపరాధంబునన్ = నీ దోషముచే, క్రోధించి = కోపించి, వచ్చు చున్నవారు = అరుదెంచుచున్నవారు, అమ్మహానుభావులు = గొప్పవా రగు నా రామలక్ష్మణులు, కానరేనిన్ = రక్షింపనియెడల, తత్...... ప్రతాపంబునన్ ; తత్తాదృక్ = అలాటి, దివ్యబాణ ధనంజయ=శ్రేష్ఠము లైన బాణములవలని యగ్నియొక్క, ప్రతాపంబునన్ = తాపముచే, భవద్బలాంగంబులకున్ = నీయొక్క చతురంగసేనలకు, కరంబు, కీడ్పాటు వాటిల్లెన్ = చేటుగల్గెను, అని, తలంచెదన్, అని, పల్కి = చెప్పి, వెండియున్ = మఱియు, పెక్కు, తెఱంగులన్, బుద్ధిసెప్పి = పలువిధములుగా హితము సెప్పి, అప్పుడు; పైపద్యములో నన్వయము.

తా. ఆ రామలక్ష్మణులు బుద్ధిహీనుల యాలోచనకు వశవర్తియగు నీయెడ మిక్కిలి కోపించివచ్చుచున్నవారు. వారు రక్షింపనిచో వాం

బాణాగ్ని నీసేనల భస్మముసేయునని తలంచెదనని చెప్పి మఱియుం బలు తెఱంగుల హిత ముపదేశించి.

భారత. వారలు = ఆ ద్రోణాదులు, ఇట్టి యవివేకవచనంబుల కుఁ = ఇట్టి తెలివిలేనివారి మాటలకు, వశవర్తివైవర్తిల్లు = లోఁబడి యుండు, నీ యపరాధంబునఁ = నీ తప్పుచేత, క్రోధించి వచ్చు చున్నారు = క్రోధము దెచ్చుకొనుచున్నారు. అమ్మహానుభావులు కావ రేనిఁ = వారు రక్షింపనిచో నెడల, తత్తాదృశ, దివ్యబాణ = అట్టి శ్రేష్ఠ మగు బాణములుగల, పాశుపతాస్త్రము గలయదనుట; ధనంజయ ప్రతాపం బునఁ = అర్జునుని పరాక్రమమున, భవద్బలాంగంబులకుఁ = నీ చతు రంగ సైన్యమునకు, కరంబు, కీడ్పాటు వాటిల్లెఁ = మిక్కిలి చేటు గల్గెను, అని తలంచెదఁ, అనిపలికి, పెండియుఁ = మఱియు, వెక్కు తెఱంగులఁ = పలువిధములుగా, బుద్ధిసెప్పి, అప్పుడు;

తా. ద్రోణాదులు నిట్లు వివేకహీనుల యాలోచనకు లోంగి యుండుటచే నీయెడ నెంతయు నాగ్రహము గొనియున్నారు. వారు రక్షింపనిచోఁ బాశుపతాది దివ్యాస్త్రములుగల యా యర్జునుని బాణముల నీసైన్యము నశించునని తలంచెదనని చెప్పి యింకను బలువిధముల బుద్ధిసెప్పి.

"కీడ్పాటు వాటిల్లెఁ" ఇటఁగొందఱు "పాటిల్లుఁ" అని వ్రాసిరికాని ప్రాచీనప్రతులలో పాటిల్లెనని యుండుటచే నే నప్పాఠము నే గ్రహించితిని. చేటు గలుగఁ బోవుచున్నదని యర్థము గావించి వారు పాటిల్లునని వ్రాసిరికాని యంతకంటెఁ బాటిల్లెననుట రసవంతము. చేటు గలుగఁ బోవుచున్నదని తలంపకుము. కలిగెననియే భావింపుమని యిట నర్థవిశేషము గావించియే కవిపాటిల్లెనని రచించియుండ నోపును.

తే. అతని బహుకర్ణ పరుష వాక్యముల నెడసి
యున్నతనుతాచలోత్సాహ యుక్తధర

గురుని రఘువీరవరుఁ జేరి కొలిచి తత్కృ
పాదరము చెంద నంచితామోద మొందె. 62

**రామాయణ.** అతని........వాక్యములన్ ; అతని = ఆ రావ
ణుని, బహు = అనేకములగు, కర్ణపరుష = కర్ణకఠోరమైన, వాక్యము
లన్ = మాటలచే, ఎడసి = తొలఁగి, ఉన్నత..........యుక్తున్ ;
ఉన్నత = గొప్పదైన, నుత = పొగడఁబడిన, అచల = చలింపని, స్థిర
మైన యనుట ; ఉత్సాహయుక్తున్ = ఉత్సాహముతోఁగూడిన, ధర్మ
గురునిన్ = కోదండ దీక్షాగురుఁడైనవానిని, రఘువీరవరున్ = రాముని,
చేరి, కొలిచి = సేవించి, తత్కృపాదరము = ఆ శ్రీరామునియొక్క
దయవలని యాదరమును, చెందన్ = పొందఁగ, అంచితామోదము,
ఒందెన్ = ఒప్పుచున్న సంతోషము పొందెను.

తా. విభీషణవాక్యముల కలిగి రావణుఁ డాతనిం గర్ణకఠోరముగాఁ
బల్కినందున నతని వీడి జనస్తుత్య నిత్యోత్సాహ యుక్తుఁడగుచుఁ గోదండ
దీక్షా గురుఁడగు రాముం గొలిచి యాతని యనుగ్రహము పొంద నభిల
షించెను.

**భారత.** బహుకర్ణ.........వాక్యములన్ ; బహు = అనేకములగు,
కర్ణ = కర్ణుని, పరుషవాక్యములన్ = కఠోరవాక్యములచే, అతఁన్ =
ఆ దుర్యోధనుని, ఎడసియున్న = విడిచియున్న, తనుతా.........
యుక్తున్ ; తనుతా = చులుకదనమువలన, చల = చలించిన, ఉత్సాహ
యుక్తున్ = ఉత్సాహముతోఁ గూడినవానిని, కర్ణుఁడు దనకట్లు చులుక
దనము గల్పించుటచే యుద్ధమునందు విగతోత్సాహుఁడైన వాఁడనుట ;
నిరఘున్ = పాపరహితుని, వీరవరున్ = వీరశ్రేష్ఠుని, ధర్మగురున్ =
ధనుర్విద్యాగురుని, ద్రోణుననుట ; చేరి = సమీపించి, కొలిచి, తత్కృ
పాదరము చెందన్ = ఆ ద్రోణుని దయవలని యాదరము చెందఁగా,

అంచితామోదము బొందెన్ = ఒప్పుచున్న సంతోషము నందెను. దుర్యోధనుఁడనుకర్త యధ్యాహార్యము.

తా. కర్ణుని కఠోరవాక్యములచే ద్రోణుఁడు యుద్ధమునందు శిథిలోత్సాహుఁడు గాఁగనే దుర్యోధనుఁడు నిజధనుర్విద్యాగురుఁడగు నా ద్రోణుంజెంది యాతని యనుగ్రహము పొందఁ దలంచెను.

వ. అంత. 63

తా. సుగమము.

తే. మృదుతఁబనిరామిఁగని రోసి పొదివె నంప
వాన నాదిత్యకులరాజవరసుతుండు
తనయెదుట గోత్ర నరికట్టుకొని విడువని
వాహినులఱేని గుండియ వడిఁ గలంగ. 64

రామాయణ. ఆదిత్యకులరాజసుతుండు = సూర్యవంశ రాజవర కుమారుఁడు, రాముఁడనుట; మృదుతన్=మృదుత్వముచే, పనిగామిన్ = కార్యము సాఁగకుండుటను, కని=చూచి, రోసి, తనయెదుటన్, గోత్రన్= భూమిని, అరికట్టుకొని = పరివేష్టించుకొని, విడువని = దారివీడని, వాహినులఱేనిగుండియ = సముద్రునిగుండె, వడిన్ = వేగముచే; కలంగన్ = కలఁతచెందఁగా, అంపవానన్ = బాణవర్షముచే, పొదివెన్ = కవిసెను.

తా. రాముఁడు భూమినావరించి, మార్గమీనిసముద్రముఁగాంచి దాని గుండెలు గలఁతఁజెందులాగున బాణవర్షము గురిపించెను.

“పొదివెన్” కవిసెననుటకు; “ఓష్ఠరిపొహరించెనఁగి విచ్చుచుం బొదువుచుండిరి; వాసిష్ఠరామాయణము అ. 3. “అరికట్టుకొని” పరివే

క్షించు అనుటకు; "ఆ కుశద్వీపంబు నరికట్టుకొనియుండు నెనిమిదిలక్షల ఘనఘృతాబ్ధి." భాగవతము సం. 5.

భారత. ఆదిత్యకులరాజి వరసుతుండు = దేవకులమునను రాజగు నింద్రునిపుత్రుండు. అర్జునుడనుట ; మృదుతన్ = మార్దవముచే, మెత్తదనముచేననుట; పనిగామిన్ కని=కార్యము సాగనేరదనటను దెలిసి, కోసి, తనయెదుటన్, గోత్రన్ = పశుసమూహమును, అరికట్టుకొని = అడ్డగించుకొని, నిర్బంధించుకొని యనుట; విడువని = వీడని, వాహినుల కేనిగుండియు = దుర్యోధనునిగుండె, వడిన్, కలంగన్=కలతనొందగా, అంపవానన్ పొదివెన్ = శరవర్షముచేఁ గ్రమ్మెను.

తా. అర్జునుఁడు తనయెదుట గోవుల నడ్డగించుకొని విడువకయున్న దుర్యోధనునిగుండె కలతవాఱఁగా బాణవర్షము గురిపించెను. "అంప వాన" నామ్న్యాదులకువలె నిటసమాసమున పకారాదేశము. అమ్ము వాన, అంపవాన. "గోత్ర" గోవులసమూహమునకు గోత్రయనియగుటకు. 'ఇనిత్ర కట్యచశ్చ.' పాణిని. పైసూత్రమున సమూహార్థమునఁ గ్రమముగా ఖలినీ, గోత్రా రథకట్యా మున్నగునవియగుచున్నవి.

"అరికట్టు" నిర్బంధించనుటకు, "దీనికి వృత్తియందు నిర్బంధము లోనగు నర్థములు గలుగుచున్నవి." శబ్దరత్నాకరము.

వ. అప్పుడు. 65

సుగమము.

క. అవిదిత విఘ్ననరవరా
స్త్రవిభగ్నాంగమ్ములగుచు రహితమహాగో
నివహాతనాకులగతిఁ జెం
దె వెలయుఁగాఁ దదుగ్రకాండ దృఢునత్వంబున్. 66

**రామాయణ.** అవిదిత ......అంగమ్ములు అగుచున్; అవిదిత = తెలియనట్టి, విఘ్న = విఘాతములుగల, ఈవఱకు రాముఁడు దనకార్యములకు విఘ్నముగలుగుటయను మాట యెఱుఁగఁడనుట; నరవర=మనుష్య శ్రేష్ఠుఁడగు రామునియొక్క, అస్త్ర విభగ్న = అస్త్రములచేఁ దునిఁగిన, అంగమ్ములు అగుచున్ = అవయవములుగలవగుచు, తత్......... సత్త్వంబుల్; తత్ = ఆ సముద్రమునందు, ఉగ్ర = భయంకరములైన, కాండ = జలము, నందలి దృఢసత్త్వంబుల్ = దృఢములగు జలజంతువులు, [ఇటనుగ్రశబ్దము సత్త్వశబ్దమునకు విశేషణము:] రహిత.....నివహాతన్; రహిత = పోయిన, మహత్=ఘనమైన, అఘ = పాపములయొక్క, నివహాతన్ = సమూహముగల వగుటచే, వెలయఁగన్ = ప్రకాశింపఁగా, నాకులగతిన్ = దేవతలగతిని, చెందెన్ = పొందినవి, మరణించెననుట.

తా. రామాస్త్రముచే భగ్నాంగములగు సముద్రమునందు జంతువులు మరణించెను.

"కాండ." "కాండోస్త్రీ దండబాణార్వ వర్గావసరవారిషు." అమరము.

**భారత.** అవి = ఆసేనలు, [ఇది కర్తృపదము.] దిత...అంగమ్ములు అగుచున్; దితవిఘ్న = ఖండితములగు విఘ్నములుగల, విఘాతరహితములనుట; నర = అర్జునుని, వర = శ్రేష్ఠమైన, అస్త్ర విభగ్న = అస్త్రములచే భేదింపఁబడిన, అంగమ్ములు అగుచున్ = రథగజ తురగ పదాతిరూపములగు నంగములుగల వగుచు, రహిత......నివహాతన్; రహిత = విడువఁబడిన, మహత్ = మిక్కుటమగు, గోనివహాతన్ = పశుసమూహములుగల వాట చేత, తత్......సత్త్వంబుల్; తత్ = ఆయర్జునని, ఉగ్ర = క్రూరమైన, కాండ = బాణములయొక్క, దృఢసత్త్వంబుల్ = దృఢమయినపరాక్రమములు, వెలయఁగన్ = ప్రకాశింపఁగా, ఆకులగతిన్ చెందెన్ = వ్యాకులత్వముచెందెను;

అర్జునుని బాణములచేత భగ్నాంగములగుచు. నా సేనలర్జునుఁడు గోవుల విడిపించుటచే నాకులములయ్యెను.

వ. తదనంతరంబ. 6

సుగమము.

సీ. మఱియు నుద్ధతచేష్ట మాన కురుబలాబ్ధి
యసదృశాశ్చర్యపదాతిబహుల
హరివారణాధిక పరిపూర్ణ దిఙ్ముఖం
బగుచుఁ బైపయిఁ బేర్చు పొగరుఁ జూచి
యలుక హెచ్చ గురుభీష్మ హిమకర సంత
తులు మొదల్గాఁగడు దుర్దమగతిఁ
దనరారు వారి సత్త్వము లెల్ల బొలియఁద
దంతరాత్మ భృదవయవములు
తే. ఛేదిల నతండు దనదైన బెట్టిదంపు
టంపజడిఁ పెంపుఁజూపి యే పణఁచె నతని
తీవ్రతకు నోడి యంతన ద్వీప్రభుండు
గళితధైర్యుండు నతిభయాకులుఁడు నగుచు. 68

రామాయణ. మఱియున్, ఉద్ధతచేష్ట = గర్వముతోడి చేష్ట, మానక=వదలక. ఉరుబల = గొప్పబలముగల, అబ్ధి = సముద్రుఁడు, అసదృశ......... దిఙ్ముఖంబు అగుచున్; అసదృశ = సాటిలేని, ఆశ్చర్య = అచ్చెరువునకు, పద = స్థానమైన, అతిబహుల = మిక్కిలి తఱుచైన, లహరి = కరుళ్లుగల, వారి = నీటియొక్క, రణ = మ్రోఁతచేత, అధిక = మిక్కుటముగా, పరిపూర్ణ = నిండిన, దిఙ్ముఖంబు అగుచున్ = దిక్కులముఖము గలదగుచు, కరళ్లతోడి నీటి మ్రోఁతదిగంతములవఱకు

వ్యాపించెనని భావము; పైపయిన్ పేర్చు = అప్పటికప్పటి కతిశయించు చుండు, పొగరు = గర్వము, చూచి, అలుక హెచ్చన్ = కోపమతిశయింపఁగా, సముద్రుని యీ గర్వముచూచి రామునకుఁ గోపముగ్గెననుట; ఇటనుండి యేపణఁచె'ననువఱకు రామునికోపకార్యము వివరింపఁబడుచున్నది. గురు.........సంతతులు; గురు = అధికమైన, భీష్మ = భయంకరమైన, అహి = సర్పములయొక్కయు, మకర = మొసళ్లయొక్కయు, సంతతులు=పంక్తి దైర్ఘ్యములు, సమూహములనుట; మొదల్ కాన్ = మొదలగునట్లు, కడుదుర్గమగతిన్ = మిక్కిలియణఁపరానివిధమున, తనరారు = ఒప్పుచుండు, వారిసత్త్వములెల్లన్ = జలచరజంతువులెల్లను, పొలియన్ = చచ్చునట్లుగా, తత్.........అవయవములు; తదంతర్గత = ఆ సముద్రములోనుండు, క్ష్మాభృత్ అవయవములు = మైనాకాదిశైలముల యొక్క యవయవములు, భేదిలన్ = భగ్నములగునట్లు అతండు = ఆ రాముఁడు, తనదైన బెట్టిదంపుటంపజడిపెంపు = భయంకరమగు తన బాణవృష్టియొక్క యతిశయము, మాపి, ఏపుఅణఁచెన్ = గర్వమునణఁచెను. అంతన్, అతని = ఆ రాముని, తీవ్రతకున్ ఓడి = తీవ్రత్వమునకు వెనుదీసి, రామునితీవ్రతవలన భీతిలి యనిభావము; నదీప్రభుండు = సముద్రుఁడు, గళితధైర్యుండున్ జారిన ధైర్యముగలవాఁడును, ధైర్యహీనుఁడై యనుట; అతిభయాకులుఁడున్ = అత్యంతభయమువలన నాకులుఁడును, అగుచున్, కానిపించెనని ముందరిపద్యముతో నన్వయము.

తా. సముద్రుఁడు నిజగర్వము మనక భయంకరాకారమునఁ జెలంగుచుండ రాముఁడత్యంతము క్రుద్ధుఁడై సముద్రమునందలి జంతువులు నశించునట్లును, నందలిపర్వతములు భేదిలునట్లును బాణవర్షము గురియింపనా రాముని యాతీవ్రతకోర్వఁజాలక యబ్ధిరాజు ధైర్యహీనుఁడును భయాకులుఁడునగుచు; "లహరి" "ఈ కారాన్తస్త్రియాం. మహాత్తరంగే" శబ్దార్థకల్పతరువు. ఇటలహరి వారణయని సాధ్యసమాసము. "వారణ"

"రణ" "రవేరణః.". అమరము.

"ఖేదిలక్" ఇట లకారద్విత్వము రామికి ; "తత్రోభయోరర్భవే దేశో లకార ఇతి కేచన." ఆథర్వణుఁడు.

" బెట్టిదంపుటంప " ఇటఁబుంపులు, టు గాగమమును వచ్చుటకు; "మోస్తువిధ త్త్యేకవచన కేపుంపూ." అనియు, "సామానాధికరణ్యే ఘూదంతానాం టుగాగ మోఽస్యాత్." అనియును నాంధ్రశబ్ద చింతామణి.

"రణాధిక పరిపూర్ణ" ఇట ముద్దరాజు రామన్న ' రణముయొక్క యాధిక్యముచేఁ బరిపూర్ణమైన యని యర్థముగావించెను గాని యధికశబ్దమునకు భావార్థముగా నర్థముగావించుటకంటె "నధికం యథాతథాపరిపూర్ణ" మ్మని యర్థముగావించుట యుక్తతరము.

భారత. మఱియుక్, ఉద్ధత .........బలాబ్ధి; ఉద్ధతచేష్టమాన = ఉద్ధతమగులాగున వ్యాపించుచున్న, కురుబలాబ్ధి =కౌరవబలమనెడి సముద్రము, అసదృశ.........దిఙ్ముఖంబు అగుచుక్; అసదృశ=నిరుపమమగు, ఆశ్చర్య = ఆశ్చర్యకరమగు, పదాతి = కాల్బలముచేతను, బహులహరి = మిక్కుటమగు గుఱ్ఱములచేతను, వారణ = ఏనుఁగులచేతను, అధికపరిపూర్ణ = మిక్కిలినిండియున్న, దిఙ్ముఖంబుఅగుచుక్ = దిశలముఖములుగలదగుచు, కురుబలములు దిఙ్ముఖములవఱకు వ్యాపించెననుట; పై పయిక్ = అంతకంతకును, పేర్చు = అతిశయించు, పొగరుచూచి = గర్వమునుగాంచి, అలుక హెచ్చ = కోపమతిశయింపఁగా, గురు భీష్మ అహిమకరసంతతులు = ద్రోణుఁడు, భీష్ముఁడు, కర్ణుఁడును, మొదల్ కాక్ = ఆదిగా, కడుక్ = మిక్కిలి, దుర్దమగతిక్=దమింప శక్యముగానివిధమున, అని వార్యగతితో ననుట; తనరారు = ఒప్పుచుండు, వారిసత్త్వములు ఎల్లక్ = వారిబలమంతయును, పొలియక్ = నశించునట్లును, తత్.........అవయవములు; తత్ అంతర్గత = ఆసేనలలోనుండిన, క్ష్మాభృత్ = రాజుల, అవయవ

ములు = అంగములు, భేదిలన్ = ఖండితములగునట్లు, అతండు = ఆయర్జునుఁడు, తనదైన, బెట్టిదంపు = భయంకరమైన, అంపజడిపెంపు = బాణవర్షాతిశయత్వము, చూపి, ఏపు అణఁచెన్ = వారిగర్వ మడంచెను, అంతన్ = పిమ్మట, అదీప్రభుండు = ప్రకాశింపని కాంతిగలవాఁడు, దుర్యోధనుఁడనుట; అతని తీవ్రతకున్ ఓడి=ఆయర్జునునితీవ్రత్వమున కోడి, అతిభయ ఆకులుఁడు అగుచున్=మిక్కిలిభయముచే నాకులుఁడు నగుచు; ముందరిపద్యములో నన్వయము.

తా. కౌరవసేనలు మిక్కుటముగా గర్వింప నర్జునుఁడిది చూచి కోపముచెంది, ద్రోణ భీష్మ కర్ణాదులబల ముడుఁగునట్లు తన బాణవృష్టిచే నొచ్చులాగునను మఱియు నటఁగల పలు రాజులయవయవములు భిన్నములగులాగునను జేయ నాసుయోధనుఁడు ధైర్యహీనుఁడును భయాకులుఁడును నగుచు; "సంతతి" పంక్తి విస్తారమనుటయును సుతుఁడనుటయును; "సన్తతిః పంక్తివిస్తారే పారంపర్యసుతాన్వయే." నానార్థరత్నమాల.

ఆ. పురుషమూర్తితోడఁ । బ్రోవైన దైన్యంబు
పోలెఁ గానుపించి । భూవరుండ
నీక సాధ్య మొకటి । లేకున్కి యారసి
బెట్టిదంపుగుండె । బెదరఁ బాఱె. 69

రామాయణ. పురుషమూర్తితోడన్=పురుషాకృతితో, ప్రోవైన దైన్యంబుపోలెన్ = రాశిగా నేర్పడిన దీనత్వమువలె, కానుపించి, (ఆ సముద్రుఁడు) కన్పడి, భూవరుండ = రాజశ్రేష్ఠుఁడా, రామాయనుట; నీకున్ అసాధ్యము =నీకు సాధ్యముగానిది, ఒకటిలేకున్కి = ఒక్కటియు లేకుండుట, అరసి = విచారించి, బెట్టిదంపుగుండె = భయదమగునాగుండియ, బెదరఁ బాఱెన్ = భీతిలెను.

తా. మూర్తమగు దీనతవలెఁ బురుషరూపమున దోఁచు సముద్రుఁడు రామునెదుటఁ గన్పడి "యో రామ! నీకసాధ్యమగు నదేదియు లేకుండుట యెఱిఁగి నాగుండె భీతిల్లెను.

భారత. భూవరుండు = రాజు, దుర్యోధనుఁ డనుట, పురుష మూర్తితోడన్ ప్రాపైన దైన్యంబుపోలెన్ = పురుషాకారముగల్గిన రాశియగు దీనత్వమువలె, కానుపించి = కన్పడి, అనీకసాధ్యము=యుద్ధముచే సాధ్యమగునది, ఒకటిలేకునికి = ఒక్కటియు లేకుండుట, ఆరసి = విచారించి, బెట్టిదంపుగుండె = భయదమగుగుండియు, బెదరఁ జాలెన్ = బెదరసాఁగెను.

తా. దుర్యోధనుఁడు మూర్తమగు దీనతవోలెఁ దోఁచుచు యుద్ధసాధ్యమెద్దియు లేకుండుటఁ దెలిసి భీతిలసాఁగెను.

వ. దానం జేసి. 70

సీ. ఇదె నీకు శరణు సొ ౯ చ్చెద శాంతుఁడవుగమ్ము
వెదక నీ కెవ్వరు ౯ నెదురు లేర
పార్థదర్పమున నీ ౯ పసగాన కిల్లిది
ర్చిన వారిదోషంబు ౯ గనియె ఫలము
నిఁకఁ గావు మర్థింతు ౯ నే నోయఖండద
యానముద్రుండ నా ౯ యందుఁ గరుణ
నడవఁ గట్టిపగర ౯ నడఁగించితే నేమి
చెప్ప నమోఘవాం ౯ ఛితుఁడ నగుచు
ఆ. హరివి గాక నీవు ౯ నరమాత్రుఁడ వెటుని
యంత వినయభక్తు ౯ లతిశయిల్లఁ

పాదపద్మములకుఁ బ్రణతిఁ గావించిన
నమ్మహాత్ముఁ డతని నాదరించె. 71

అవతారిక. రామాయణార్థమున సముద్రవాక్యముగాను భారతార్థమున నుత్తరవాక్యముగానుం జెప్పంబడెను.

రామాయణ. ఓయఖండదయా = సంపూర్ణదయగల యోరామా, ఇదె నీకుఁ శరణు చొచ్చెదన్ = ఇదె నీకు శరణాగతుఁడనగుదును. నిన్ను శరణుపొందెదననుట ; [ఇట ద్వితీయార్థమునఁ బష్ఠి] శాంతుఁడవు గమ్మ = శాంతిపొందినవాఁడ వగుము, త్యక్తకోపుఁడవు గమ్మనుట ; వెదకఁన్ = పరిశీలింపఁగా, ఎవ్వరున్ నీకున్ ఎదురు లేరు = నీకెవ్వరుం బ్రతియగువారు లేరు, నిన్నెదిరింపఁ దగువారెవరును లేరని భావము; అపార్థదర్పమునన్ = వ్యర్థగర్వముతో, నీ పస కానక = నీసారము దెలియక, ఇట్టు లెదిర్చిన = ఇట్లెదిరించిన, వారిదోషంబు=ఉదకదోషము, ఫలముకనియెన్ = ఫలమునందెను, ఇఁకన్ కావుము = ఇంక రక్షింపుము, అర్థింతున్ = యాచింతును, నేన్ సముద్రుండన్ = నేను సముద్రుఁడను, నాయందున్ కరుణ నడపన్ = నాయందు దయవర్తిల్లఁగా, గట్టిపగఱన్ = క్రూరశత్రువులను, అడఁగించితేన్ = అణఁగించినయెడల, ఏమిచెప్పన్ = ఏమని చెప్పుదును, అమోఘవాంఛితుఁడన్ అగుదున్ = వ్యర్థముగాని యపేక్షగలవాఁడ నగుదును, సిద్ధసంకల్పుఁడ నగుదుననుట; నీవు హరివి కాక నరమాత్రుఁడవే=నీవు సాక్షాన్నారాయణుఁడవుగాని మనుష్యమాత్రుఁడవా, అని = ఇట్లు చెప్పి, అంతన్. వినయభక్తులు = అడఁకువయు, భక్తియు, అతిశయిల్లన్ = అతిశయింపఁగా, పాదపద్మములకున్ = ఆ శ్రీరాముని పాదపద్మములకు. ప్రణతి కావించినన్ = నమస్కరింపఁగా, అమ్మహాత్ముఁడు = ఆ శ్రీరాముఁడు, అతనిన్ = ఆ సముద్రుని, ఆదరించెన్ ;

తా. సముద్రుఁడు నేనిదెనిన్ను శరణుచొచ్చెదను, శాంతుఁడవు గమ్ము. నిన్నెదిరింపఁగలవారెవరునులేరు. వ్యర్థగర్వమున నీప్రభావ మెఱుఁగఁజాలక నాయుదక మాచరించిన దోషమునకు ఫలము వెంటనే పొందెను. ఇంక నన్ను రక్షింపుము, నిను బ్రార్థించువాఁడను నేనే సముద్రుఁడను, నన్ను గరుణించి నా శత్రువుల నశింపఁజేసితివేని నేను సిద్ధసంకల్పుఁడ నగుదును, నీవు సాక్షాన్నారాయణుఁడవు కాని మనుష్యమాత్రుఁడవుగావు, అని వినయభక్తులతో నా శ్రీరాముని పాదముల నమస్కరింప నారాముఁడాతని నాదరించెను.

సముద్రుఁడు దనపైఁ బ్రయోగింపనుండు బాణము దన శాత్రవులపైఁ బ్రయోగించి వారిని నశింపఁజేయు మనినందులకు, "ఉత్తరేణావకాశోస్తి కశ్చిత్పుణ్యతమోమమ, ద్రుమకుల్య ఇతిఖ్యాతో లోకే ఖ్యాతో యథా భవాన్, ఉగ్రదర్శనకర్మాణో బహవస్తత్ర దస్యవః, ఆభీరప్రముఖాః పాపాఃపిబంతిసలిలంమమ, తైస్తు సంస్పర్శనం ప్రాప్తైర్నసహే పాపకర్మభిః, అమోఘః క్రియతాంరామ తత్ర తేషుశరోత్తమః." రామాయణము, యుద్ధకాండము.

భారత. ఇదెనీకున్, శరణు చొచ్చెదన్ = ఇదిగో నీకు శరణుచొచ్చువాఁడను, శాంతుఁడవుకమ్ము = శాంతింబొందినవాఁడ వగుము, పార్థ = ఓయర్జునుఁడా, వెదకన్ = పరిశీలింపఁగా, నీకున్ ఎవ్వరున్, ఎదురులేర = నీకెవ్వరు నెదురులేరు, [లేరు + అ. ఇట నవధారణము నిన్నెదురించువారే లేరనుదానిని సూచించెకిని] దర్పమునన్ = గర్వముచే, నీ పసకానక = నీ సారమెఱుఁగక, ఇట్లు ఎదిర్చినవారి దోషంబు= ఇట్లు నిన్నెదిర్చిన యీ కౌరవులదోషము, ఫలముకనియెన్ = తగినఫలము నందెను, ఓ యఖండ దయాసముద్రుండ = సంపూర్ణదయాపయోనిధి వగు నో యర్జునా, ఇఁకన్ కావుము = ఇంక వీరింజంపక రక్షింపుము, నేన్, అర్థింతున్ = ఇట్లానరప నర్థించెదను, నాయందున్ కరుణ నడ

వఁ = నాయందుఁ గరుణప్రవర్తిల్లులాగున, పగఱఁ గట్టి అడఁగించి తేఁ = శత్రువులను బంధించి వారి బలమణఁచినయెడల, ఏమిచెప్పఁ = ఏమని చెప్పుదును, అమోఘవాంఛితుఁడఁ అగుదుఁ = పూర్ణమనోరథుఁడ నగుదును, వారివికాక నీవు నరమాత్రుఁడవె = సాక్షా దింద్రుఁడవుకాని మనుష్యమాత్రుఁడవా, [ఆత్మావై పుత్రనామాసియను నట్లింద్రపుత్రుఁడగుట చేతనే యీతని యందింద్రత్వ మారోపితమయ్యెను.] అని = ఉత్తరుఁడు ఇట్లుచెప్పి, అంతఁ, వినయభక్తులు అతిశయిల్లఁ = అడఁకువభక్తియు నధికముకాఁగ, పాదపద్మములకుఁ = అర్జునుని పాదపద్మములకు, ప్రణుతి కావించినఁ = నమస్కారముసేయఁగా, అమ్మహాత్ముఁడు = ఆమహాత్ముఁడగు నర్జునుఁడు, అతనిఁ = ఆ యుత్తరుని, ఆదరించెఁ.

తా. ఇదెనీకు శరణుచొచ్చెదను. శాంతక్రోధుఁడవగుము, ఇట నీకడు రెవ్వరును లేరు, నీబలమెఱుంగక నిన్నెదిర్చినట్టి కౌరవులదోషమునకుఁ దగినఫలమబ్బెను. ఓ దయాసముద్రుఁడా! ఇఁకఁ గావుము, నిన్ను బ్రార్థించెదను. నాపైఁ గరుణించి పగరఁజంపక బంధింపుమంతయ చాలును, ఇదియే నాపూర్ణవాంఛితము. నీ వింద్రునంశమున జనించినవాఁడ వగుట సాక్షా దింద్రుఁడవేకాని సామాన్య మానవుఁడవుగావని యుత్తరుఁడాతని పాదముల పైఁబడి నమస్కరింప నయ్యర్జునుఁడు వానిని నాదరించెను.

"నడవఁగట్టి." రామాయణ పర్యాయమున "నడవఁ + గట్టి పగఱఁ అనియు; భారతార్థమున, నడవఁ + కట్టి" యని పదవిభాగము గావించుట రసవంతముగాని రెండు స్థలములందును నడవగట్టి యనుట బాగుగాదు.

ఇట రామాయణార్థమున గట్టిపగరనని సరళాదియగుటచే నడవనను స్థలము నిర్బింధుకము. భారతార్థమున, కట్టియని పరుషాదియగుటచే సరళాదేశమును వాదేశసరళమునకు మున్నున్నద్రుతమునకు బిందుత్వముం గల్గుటచే సబిందు నిర్బింధు సమ్మేళనమయ్యెను.

ఇందులకుఁ బ్రమాణము. "శ్లేషేసబిందు నిర్బిందోః శ్లేషనం కుత్ర చిన్మతం." అథర్వణకారికావళి.

కథాద్వయ సంఘటనమునకై భారతార్థమున నుత్తరవాక్యములుగవి తెచ్చి పెట్టుకొనెను.

గీ. తదభిమతపద్ధతిని వారితరణలీల
పెంపుమీఱఁగ దక్షిణాభి ముఖగమన
మాచరించె మున్నెట్లట్ల యంతబలి
యింతనైయె నడపుచు నిజావ్యాహతేచ్ఛ. 72

రామాయణ. తత్ అభిమత పద్ధతిని = ఆ సముద్రుని యిష్టప్రకారము, సముద్రుఁడు సెప్పినట్లు సేతువుగట్టియని భావము; వారి తరణలీల= నీటినిదాఁటుట యందలి లీల, పెంపుమీఱంగన్ = పెంపొందునట్లు, మున్ను ఎట్లు అట్ల = పూర్వమునంబోలె, నియంతనై = నియామకుఁడై, హరివితతిన్ = వానరసమూహమును, నడపుచున్, నిజ = తనయొక్క, అవ్యాహతేచ్ఛన్ = వ్యర్థముగానియపేక్షచే, దక్షిణాభిముఖగమనము = దక్షిణదిశాభిముఖగమనమును, ఆచరించెన్ = ఒనర్చెను.

తా. సముద్రుని యిష్టముచొప్పున సేతువుగట్టిమున్నుపోలె వానరసేనను నడపుచునవ్యాహతేచ్ఛతో దక్షిణాభిముఖుఁడై చనెను.

భారత. తదభిమతపద్ధతిన్ = ఆయుత్తరునభీష్టముచొప్పున, నివారితరణలీల = నివారింపఁబడిన యుద్ధలీల, పెంపుమీఱంగన్ = పెంపొందఁగా, ఉత్తరుఁడు తాను, మున్ను, ఎట్లు అట్ల = పూర్వమువలె, హరివితతిన్ = గుఱ్ఱములసమూహమును, యంతనైనడపుచున్ = సారథియై నడపుచు, నిజ అవ్యాహతేచ్ఛన్, దక్షిణాభిముఖ = దక్షిణదిశాభిముఖమైన, గమనము, ఆచరించెన్ = ఒనర్చెను.

తా. ఆ యుత్తరుని యిష్టానుసారము యుద్ధమున నిలిచిపోఁగా నాతఁడు సారథియై పూర్వమువలె గుఱ్ఱముల నడపుచు దక్షిణ దిశాభిముఖుఁడై చనెను.

సీ. సముచితసరణి నిశాటమరవైరాటన
గరిమ నశ్లాఘ్యంబుగాఁ గొని కడు
నెఱితలిర్వఁగ లంక నిర్ముక్తధీరత
నంద నభిద్యోతితాత్మసత్ప్ర
భావతఁ బరఁగుచు బాండురాజసుతు లా
తతకీర్తివిభవుండు దద్విభుండు
తీర్ణాతిక్రమభ్రమహార్ణవుండు గవిని
వారితరిపుదర్పభారులైన
తే. వారి నాప్తులఁ గడు నంత గారవించెఁ
దత్పురీనాయకుఁడు నిజాస్థాన మండ
పమున నలఘు ప్రగల్భవాక్ప్రకటిత స్వ
భావవర్తనులై పేర్చు ప్రథితబలుల. 73

రామాయణ. సముచితసరణిన్ = యుక్తమార్గమున ఇట్లు, అమరవైర అటనగరిమన్ = రాక్షసుల సంచారాధిక్యమును, అశ్లాఘ్యంబుగాన్ కొని = అలక్ష్యముగా గ్రహించి, కడున్, నెఱి తలిర్పఁగన్ = మిక్కిలి పరాక్రమము ఒప్పుచుండఁగా, లంక = లంకాపట్టణము, నిర్ముక్తధీరతన్ అంచన్ = తల్లడిలఁగా, [ఇట లంక తల్లడిలుట యన లక్షణచే లంకాపుర వాసులు తల్లడిల్లుట యని భావము.] అభిద్యోతిత = ప్రకాశించుచుండు, ఆత్మ = తనయొక్క, సత్ ప్రభావతన్ = గొప్పప్రభావము గలుగుటచే, పరఁగుచున్ = ఒప్పుచు, పాండు.........విభవుండు; పాండు = తెల్ల

మైన, రాజ = చంద్రుఁడు, సుతుల = మంచిపోలికగాఁగల, ఆతత=విస్తార మైన, కీర్తివిభవుండు = యశోవైభవముగలవాఁడు, తద్విభుండు = ఆ శ్రీరాముఁడు, తీర్ణ........అర్ణవుండుగఁ; తీర్ణ = దాటఁబడిన, అతి కృచ్ఛ = మిక్కిలికష్టయుక్తమైన, మహార్ణవుండుగఁ = సముద్రముగల వాఁడుగను, విని = ఆకర్ణించి, తత్పురీనాయకుండు = ఆ లంకాధిపతి. రావణుఁడనుట; అంతఁ నిజ ఆస్థానమండపమునఁ = తన కొల్వుకూట మునఁ, అలఘు........వర్తనులై; అలఘు=తగ్గనట్టి, ప్రగల్భవాక్ = ప్రౌఢవచనములచే, ప్రకటిత = ప్రసిద్ధపఱుపఁబడిన, స్వభావవర్తనులై = స్వభావముయొక్క యునికిగలవారై, పేర్చు, అతిశయించు, ప్రథితబ లులఁ = ప్రసిద్ధబలముగలవారిని, వారిత........వారిఁ; వారిత = అడ్డగింపఁబడిన, రిపు = శత్రువులయొక్క, దర్ప = గర్వముచే, భాసుర లైనవారిఁ = ప్రకాశించువారిని, ఆప్తులఁ = హితులను, కడుఁ = మిక్కిలి, గారవించెఁ = గౌరవించెను.

తా. అసురసంచారము సరకుసేయక మిక్కిలి పరాక్రమ మొప్పా రఁగా, లంకావాసులు ధైర్యముగోలుపోవఁగా, స్వప్రభావ మతిశయించు చుండఁగా, తెల్లని చంద్రునిబోలిన కీర్తివైభవముగల రామచంద్రుఁడు సముద్రము దాఁటెనని విని రావణుఁడు శాత్రవగర్వనాశకులై, ప్రసిద్ధబలు లునగు నాప్తుల నిజాస్థానమండపమునకురాఁ బనిచి వారినెంతయు గౌర వించెను. "నెఱి" పరాక్రమమనుటకు; " నెఱినుఱుకవైరి వీరుల నెఱుకులు తూఁటంగనేయు నృపపుంగవుఁ " భారతము. ఉద్యోగపర్వము.

" కృచ్ఛ " కష్టమనుటకు " కృచ్ఛంసాంతపనాదౌచ కష్టే దుఃఖైనసోఽరపి, " నానార్థరత్నమాల " కృచ్ఛమహార్ణవ ; " ఇట యుక్తశబ్దము లోపించియుండుటచే లుప్తమధ్యమపదమగు కర్మధారయము.

" నాయక " " నయతి వినియుక్తేక్క నేవకానితినాయకః " గురుబాలప్రబోధిక.

భారత. పాండురాజ సుతులు=పాండవులు, సముచితసరణిన్ = ఉచితమగువిధమున, ఇట్లు = ఈలాగున, అమరన్ = ఒప్పఁగా, వైరాటి నగరీ = విరాటరాజునకు సంబంధించిన నగరము, మనః శ్లాఘ్యంబుగాన్ కొని = మానసమునస్తుతింపఁ దగినదిగా గ్రహించి, విరటుపురముదమకు వాసమునకను కూలమని మానసమునఁ దలంచి యనిభావము; కడున్ నెఱి తలిర్పన్ = మిక్కిలి క్రమమొప్పఁగా, పాండవులు నిజసంకేతానుసారము గానుండఁగానని భావము; కలంక.........ధీరతన్ = కలంక = కలఁత వలన, నిర్ముక్త = విడువఁబడిన, ధీరతన్ = ధైర్యముచే, తమ్మునొరులు దెలిసికొందురేమో యనుభీతివీడుటచే ధైర్యవంతులైయని భావము; అందున్ = ఆపట్టణమున, అభిద్యోతిత = ప్రకాశించుచుండు, ఆత్మ ప్రభావున్ = తమప్రభావముగల్గుటచే, పరఁగుచున్ = ఒప్పుచు, ఆతతకీర్తి విభవుండు = విస్తారమైన యశోవిభవముగల, తద్విభుండు = అపట్టణపు రాజగు విరాటుఁడు, తీర్ణ......అర్ణవుండుకన్; తీర్ణ=దాఁటిన, అతికృచ్ఛ్ర= మిక్కిలికష్టమనెడి, మహార్ణవుండుకన్ = గొప్పసముద్రముగలవాఁడగుట, కౌరవుల దాడియను నాపద దాఁటునట్లనుట ; తత్పురీనాయకుఁడు = విరటుఁడు, వినివారిత......వారిన్; వినివారిత = నివారింపంబడిన, రిపు = శత్రువులగు కౌరవుల యొక్క, దర్ప = గర్వముచే, భాసురులైన వారిన్ = ప్రకాశించువారిని, ఆప్తులన్ = హితులగువారిని, అలఘు... వర్తనులై; అలఘు = తగ్గని, ప్రగల్భవాక్ = ప్రౌఢవచనములచే, ప్రకటిత = ప్రకటింపఁబడిన, స్వభావవర్తనులై, పేర్చు, ప్రథితబలులన్ = ప్రసిద్ధబలులగు పాండవులను, అంతన్ = వారు పాండవులగుట దెలిసిన పిమ్మట, నిజాస్థాన మండపమునన్ = తనకొలువుకూటమున, కడున్ = మిక్కిలి, గారవించెను = గౌరవించెను.

తా. పాండవులు విరాటనగరావాసము మానసమున యుక్తమని తలంచి స్వసంకేతిత రీతినుండుచు నిర్ముక్తశంకులై ధైర్యమునంది యట

నిజప్రభావము ప్రకాశింప వసించుచుండ యశోవంతుఁడగు విరటుఁడు కౌరవులతోడి దాడియను నాపద దాఁటునట్లు దుర్యోధనాదుల గర్వభంగము గావింపఁగా నా విరాటుఁడు ప్రగల్భవచనములచేఁ బ్రకటితమగు స్వభావవర్తనములు గల యాప్తులగు నా పాండవుల వారివాస్తవరూపము లెఱిఁగినంతనే తనయాస్థానమున నెంతయు గారవించెను.

"నెఱి" క్రమమనుటకు; "నెఱిఁదప్పంబడి పెల్లుగ, నొఱలెడి నరవాజికరులన్" భారతము. ద్రోణపర్వము.

"మనశ్శ్లాఘ్య." శ్లేషార్థసంఘటనకొఱకు భారతార్థమున విసర్గలోపమైనను "శర్పరేవి సర్జనీయః" అను సూత్రముచొప్పున సాధువే యగుచుండ నిది యెఱుఁగక కొందఱిట విసర్గలోపము గల్గు నట్టిట్టి యర్థమనుచితమని భావించి 'మనస్-శ్లాఘ్య' యని యభిప్రాయపడెదరు గాని యది రసవంతము గాదు.

వ. ఇట్లు వివిధసంభావనాసంతోషితస్వాంతులం గావించి వారికిఁ
దనకు నక్కాలంబున. 74

సుగమము.

క. సమరాగమనస్ఫూర్తికి
నమరు వచోగతుల నరవరాత్మజుని ప్రసం
గమయి తనకన్యనయు యు
త్తమహితనయ నొసఁగ ననుమతి దలిర్పంగాన్. 75

రామాయణ. సమర........స్ఫూర్తికిన్; సమర = యుద్ధము యొక్క, ఆగమనస్ఫూర్తికిన్; కలుగుటయొక్క, అమర = ఒప్పునట్టి, వచోగతులన్ = మాటలవిధమున, నరవరాత్మజుని రాముని గుఱించి, ప్రసంగమయి, ప్రస్తాపమయి, యుద్ధసందర్భము ప్రస్తాపము రాఁగ రాముని పేరు

ప్రసక్తమయ్యెనని భావము; తనకున్ = రావణునకు, అన్యనయయుక్తిన్ = నీతికంటె నన్యమగుయుక్తిచే, అనీతిగలయుక్తిచేననుట ; మహితనయన్ = సీతను, ఒసంగన్ = ఈయను, అను, మతి = బుద్ధి, తలిర్పంగాన్ = ఒప్పఁగా, సీతనీయరాదని తనకుఁ దోఁపఁగాననుట; ముందరిపద్యముతో నన్వయము.

తా. యుద్ధసందర్భము ప్రస్తాపమునకు రాఁగ రామునిమాట ప్రసక్తమయ్యెను. అప్పుడు రావణునకు సీత నొసఁగుట కిష్టములేకుండఁగా;

భారత. సమ........మస్స్ఫూర్తికిన్ ; సమ = సమానమైన, రాగ = అనురాగముగల, మనస్స్ఫూర్తికిన్ చిత్తసంతుష్టికి, అమరు = యుక్తమగు, వచోగతులన్ ; నర... ......ప్రసంగము; నర = అర్జునుని, వరాత్మజుని = శ్రేష్ఠుఁడగు కుమారునియొక్క అభిమన్యునియొక్క యనుట; ప్రసంగమ్ము = ప్రసక్తికలిగి, మహితనయున్ = నుతింపఁబడిన నీతిగలదానిని, తన కన్యన్ = విరటునికూఁతురగు నుత్తరను, అయయుక్తిన్ = భాగ్యసంగతిచే, ఒసంగన్ అనుమతి తలిర్పఁగాన్ = ఇచ్చుటకు నంగీకారము గలుగఁగా; ముందరిపద్యముతో నన్వయము.

తా. సమానానురాగముగల చిత్తసంతుష్టి కొప్పుగువాగ్ధోరణిని నభిమన్యుని ప్రసక్తి కలుగఁగా విరటుఁడు వానికిఁ దనకూఁతునీయ సమ్మతింపఁగా;

క. తనదు హితకార్యపథ వ
ర్తనులగువారుఁ దనకోర్కెఁ దమిగని యింపుల్
దనరార సుభద్రానం
దన వరణోత్సవము నడపఁ దగునని పలుకన్. 76

రామాయణ. తనదు = తనయొక్క, హితకార్య పథవర్తనులగు వారున్ = హితకార్యములయొక్కమార్గమున వర్తించువారును, తన

కోర్కి తమిఁ కని = రావణుని కోర్కియొక్క త్వరంగాంచి, ఇంపుల్ తనరారఁ = సంతుష్టితనరఁగా, సుభద్ర......ఉత్సవము; సుభద్ర = శైస్సైన్యశుభముగల, ఆనంద = సంతోషముగల, నవ = నూతనమైన, రణోత్సవము = యుద్ధమనెడియుత్సవము, నడపందగుఁ అనిపలుకఁ = నడపవచ్చునని పలుకఁగా ;

తా. రావణుని యిష్టముచొప్పుననడచుకొను వారుకొందఱు కాని యిష్టము దెలిసి యుద్ధముజరుపఁదగినదని యనుమతింపఁగా

భారత. ఆర్యపథవర్తనలు = సన్మార్గమునం జరించెడివారు, అగు, వారఁ = ఆ ధర్మజాదులు, తనకోర్కి తమిఁ, కని, ఇంపుల్, తనరారఁ, తన దుహితకుఁ = తనకూఁతురగు నుత్తరకు, సుభద్రానందన = సుభద్రయొక్క కొడుకగు నభిమన్యునియొక్క, వరణోత్సవము=వివాహము నడుపఁదగుఁ అని పల్కఁ = జరుపఁదగునని చెప్పఁగా.

తా. పాండవులు దన యిష్టముదెలిసి సంతోషమొదవున ట్లభిమన్యునకుత్తరనిచ్చి వివాహము గావింపనగునని పలుకఁగా.

తే. తద్విధానంబునకు దృఢోత్సాహుఁడయ్యెఁ
దనయ కల్యాణవిధి ప్రయత్నమునఁ జేసి
రయముతో వారునాత్మీయ మయిన మిత్ర
బంధు పరివారతతిఁ గూర్చి ప్రౌఢిమెఱయ. 77

రామాయణ. వారును, రయముతోఁ = వేగముతో, ఆత్మీయ = తమవాండ్రగు, మిత్ర = హితులయొక్కయు, బంధు = బంధువులయొక్కయు, పరివారతతిఁ = సమూహమును, కూర్చి = చేర్చి, ప్రౌఢిమెఱయఁ = ప్రౌఢత్వమతిశయింపఁగా, తన = రావణుని, అకల్యాణవిధి = అదృష్టహానియొక్క, ప్రయత్నమునం జేసి, యత్నమున, తద్విధానంబునకుఁ =

ఆ యుద్ధవిధానమునకు, దృఢోత్సాహుఁడు = దృఢమగు నుత్సాహము గలవాఁడు, అయ్యెన్, తత్పురీనాయకుండని క్రిందటిపద్యమునఁగ ర్తగలదు.

తా. ఆ ప్లవగ్గమువారు తమ మిత్ర బంధు పరివారమునుగూర్చి సన్నద్ధులు కాఁగ రావణుఁడు దన యదృష్టహానిచే యుద్ధమున నుత్సాహయుక్తుఁడయ్యెను.

**భారత.** (తత్పురీ నాయకుండు = విరటుఁడు), తద్విధానంబునకున్ = ఆ వివాహ విధానమునకు, దృఢోత్సాహుఁడు అయ్యెన్ = నిశ్చితోత్సాహుఁ డయ్యెను, వారును = ఆ పాండవులును, ఆత్మీయమయిన, మిత్ర, బంధు, పరివార, తతిన్, కూర్చి = చేర్చికొని, ప్రౌఢి, మెఱయన్ = ప్రకాశింపఁగా, తనయకల్యాణవిధి = కుమారుఁడగు నభిమన్యుని వివాహవిధిని, అయముతోన్ = శుభావహవిధితో, ప్రయత్నమునన్ = పూనికతో, చేసిరి.

తా. విరటుఁడు తానభిమన్యున కుత్తర నీయ నిశ్చయించెను. పాండవులును మిత్ర బాంధవాదులం గూర్చికొని తనకుమారుని వివాహవిధానమును బూనికతో నొనర్చిరి.

"అయముతోన్." "అయశ్శుభావహోవిధిః." అమరము.

వ. అంతఁ బ్రతిపక్షవిజయంబునకు నుచితసమయం బగుట భావించి. 78

**రామాయణ భారతార్థములు** సమము. అంతన్, [ప్రతిపక్ష విజయంబునకున్ = (రామ) రావణాదుల జయించుటకు, (భారత) దుర్యోధనాదుల జయించుటకు,] ఉచితసమయంబు = తగినసమయము, అగుటన్, భావించి;

తా. సులభము.

క. అతులిత తేజుఁడు వై వ
స్వతసంతతి రాజవరుఁడు చతుర నయ సమా
హృత ఘనతర హరికుంజర
శతాంగవిస్ఫూర్తిశోభి సైన్యముతోడన్. 79

**రామాయణ భారతార్థములు** సమము. **అతులితతేజుఁడు**=నిరుపమాన తేజముగలవాఁడు, [వైవస్వతసంతతి రాజవరుఁడు=(రామా)సూర్యవంశ సంభూతుఁడగు రాజశ్రేష్ఠుఁడైన రాముఁడు, (భారత) ధర్మతనయుఁడగు రాజశ్రేష్ఠుఁడైన యుధిష్ఠిరుఁడు;] చతుర = సమర్థమైన, నయసమాహృత = నీతిచేఁ గూర్పఁబడిన, ఘనతర = మిక్కిలి గొప్పదైన, [హరికుంజర శతాంగ విస్ఫూర్తిన్ = (రామా) వానరశ్రేష్ఠులయొక్క యనేక శరీర స్ఫూర్తిచేత, (భారత) హరి = గుఱ్ఱములయొక్కయు, కుంజర = ఏనుఁగులయొక్కయు, శతాంగ = రథములయొక్కయు, విస్ఫూర్తిన్ = స్ఫూర్తిచే,] శోభి = ప్రకాశించుచున్న, సైన్యములోడన్ = సేనతో; విడియించెనని ముందరి పద్యముతో నన్వయము.

తాత్పర్యము సుగమము.

"వైవ, స్వతసంతతి రాజవరుఁడు చతురనయ." ఇట సకారము నకుఁ జకారముతో యతిచెల్లుటచే నిదియితరేతరవర్గజవళి. "ఇతరేతరవర్గజవళి, తతికిఁజవర్గువును శషస దగు నొకగమిమై, కృతులకు నయ పాలునేక, స్థితినొకవంగళము న ణలుఁ జెలఁగు నొకటిమై." కావ్యాలంకారచూడామణి.

క. నడచి యుపప్లావ్యపురం
బు డగ్గఱి వనప్రదేశ ములబలచయముల్
విడియించి తనప్రతాపము
కడునఖిల దిగంచలములఁ గ్రమ్మఁగొనంగన్. 80

**రామాయణ భారతార్థములు** సమము. నడచి, [ఉపప్లావ్య = (రామా)పీడింపఁదగిన, (భారత) ఉపప్లావ్యమను పేరుగల,] పురంబు=పట్ట ణమును, దగ్గఱి = సమీపించి, వనప్రదేశములన్ = ఆ ప్రాంతమునఁ గల యటవీప్రదేశములయందు, బలచయముల్ విడియించి = సేనాసమూహ మును దింపి, [తనప్రతాపము = (రామా) రామునిప్రతాపము, (భారత) ధర్మజునిప్రతాపము,] అఖిల దిగంచలములన్ = సకల దిగంతముల, క్రమ్ముకొనంగన్ = వ్యాపింపఁగా ; ముందరిక్రియతో నన్వయము.

తాత్పర్యము సుగమము.

"పురం, బుడగ్గఱి వనప్రదేశముల;" ఇట మువిభక్తికయతి. "పుంనపుంసక తత్సమంబుల కడపలఁ, దత్సమాంధ్ర దేశ్యశబ్దముల తుదలఁ, గదిసిన మకారశృంగముల్ కావ్యములను, బొసఁగు మువిభక్తి యతులనఁ బుఫు బుభులకు." అప్పకవీయము.

వ. అమ్మహానుభావుం డప్పుడు. 81

సుగమము.

క. నీతిమెయిఁ దనకు భూమి జ
నాతతపరివాదభర నిరాతంకాత్ముం
డై తిరుగవిడువ కాజికిఁ
గాతూహలియగు విపక్షుఁ గర్వమువినియెన్. 82

**రామాయణ.** ఆతత...ఆత్ముండై ; ఆతత = విస్తారమైన, పరివాద భర = నిందాతిశయమున, నిరాతంక = భయవిహీనమైన, ఆత్ముండై = ఆత్మగలవాఁడై, (రావణుఁడు నిందవలని భీతిలేనివాఁడయి యనిభావము;) తనకున్ = రామునకు, నీతిమెయిన్ = న్యాయమార్గమున, భూమిజన్ = సీతను, తిరుగన్ విడువక, ఆజికిన్ = యుద్ధమునకు, కాతూహలియగు=

కుతూహలము గలవాఁడగు, విపక్షు = శత్రువుయొక్క, రావణునియొక్క యనుట ; గర్వము, వినియెన్ ;

తా. శ్రీరాముఁడు, నిందకు జంకనివాఁడై రావణుఁడు తనకు సీత నర్పింపక యుద్ధోత్సాహము గల్గి గర్వించియున్న వాఁడని వినెను.

భారత. జన......ఆత్మండై ; జన = జనులవలని, ఆతత = విస్తారమైన, పరివాదభర = నిందాతిశయమున, నిరాతంక = భయరహితమైన, ఆత్మండై = ఆత్మగలవాఁడై, దుర్యోధనుఁడు నిందవలన భయములేని వాఁడయి యని భావము; తనకున్ = ధర్మజునకు, భూమిన్ నీతిమెయిన్, తిరుగన్, విడుపక = వీడక, అరణ్యవాసాజ్ఞాతవాసములు జరిపిన యనంతరమునఁ బాండవుల భాగము మరల వారికీక యనిభావము ; ఆజికిన్, కౌతూహలియగు, విపక్షు = శత్రువుయొక్క, దుర్యోధనునియొక్క, గర్వమున్, వినియెన్ ; అమ్మహానుభావుండనుకర్త యుభయార్థములందధ్యాహార్యము ;

తా. దుర్యోధనుఁడు జనాపవాదము సరకుసేయక తనకు మరల రాజ్యభాగమీక యుద్ధోత్సాహము గల్గి గర్వించియున్నవాఁడని ధర్మజుఁడు వినెను.

"కౌతూహలి." ఇట మతుబర్థకమున నిని ప్రత్యయము వికల్పముగా వచ్చెను. కౌతూహలవంతుఁడని మతుబర్థకమున రావచ్చును.

మతుబర్థములు వచ్చుస్థలములు ; "భూమనిందా ప్రశంసాసు, నిత్యయోగేతిశాయనే, సంసర్గేస్తి, వివక్షాయాం, భవన్తి మతుబాదయః." సిద్ధాంత కౌముది.

చ. సదయతఁ జేసి హింసలకుఁ జాలకయింకను మంచిమాటఁ దే
ర్చెదనని రాయబార మనిచెం దగ సంధివిధానచింత నం
గదు రుచిరాభివర్ణ్య శమ గౌరవ కీర్తిజగంబునిండఁ గో
విదనుతనీతిదక్షు హరివీరవరేణ్యు వచోవిచక్షణున్. 83

అవతారిక. కృష్ణాంగదుల రాయబారము కవి యొక్కటిగా సంఘటించుచున్నాఁడు.

**రామాయణ.** సదయతఁ జేసి = దయా యుక్తుఁడగుటచే, హింసలకుఁ జాలక = హింసాకార్యములకోడి, ఇంకను మంచిమాటలఁ దేర్చెదను అని = యింక మీఁదను సామవాక్యమున శత్రుచిత్తము దేర్చువాఁడనని, తగఁ, సంధివిధానచింతఁ = సంధి యొనర్చుటలోని చింతచే, రుచిర......కీర్తి; రుచిర = ఒప్పిదమగు, అభివర్ణ్య = వర్ణింపఁదగిన, శమ = ఓర్పువలన, గౌరవ = గొప్పదనముగల, కీర్తి = (రాముని) కీర్తి, జగంబునిండఁ = లోకమునిండునట్లుగా, కోవిద......దక్షుఁ, కోవిద= పండితులచే, నత = స్తుతింపఁబడిన నీతిదక్షుఁ = నీతి యందు సమర్థుఁడగు వానిని, వారి చరవరేణ్యుఁ = వానర వీరులలో శ్రేష్ఠుఁడగు వానిని, వచోవిచక్షణుఁ = పలుకుటయందు నేర్పరి యగు వానిని, అంగదుఁ = అంగదుని, రాయబారము అనిచెఁ = రాయబారమంపెను ;

తా. రాముఁడు దయాళుఁడగుటచే హింసలకోడి సంధి యొనర్ప నిచ్చగలవాఁడయి తన కీర్తి లోకమున నిండునట్లు, నీతి దక్షుఁడగు వానిని, వానరశ్రేష్ఠుఁడగు వానిని. మాటలయందు నేర్పరి యగు వానిని, అంగదుని, నా రావణునొద్దకు రాయబారిగా నంపెను.

**భారత.** సదయతఁ జేసి, హింసలకుఁ, చాలక, ఇంకను, మంచి మాటలఁ = సామ వాక్యములచే, తీర్చెదఁ, అని, తగఁ, సంధి విధాన చింతనఁ = సంధి విధానము నందలి చింతచే, కదురు = పొందెడి, చిర ......కీర్తి = చిర = బాలకాలము, అభివర్ణ్య = వర్ణింపఁదగిన, శమ గౌరవ = ఓర్పువలని గొప్పదనము, జగంబు, నిండఁ, కోవిదనుత నీతి దక్షుఁ = పండితులచేఁ బొగడఁబడిన నీతియందు సమర్థుఁడగు వానిని

వీరవరేణ్యుఁ = వీరశ్రేష్ఠుని, వచోవిచక్షణుఁ, హరిఁ = కృష్ణుని, రాయబారము, అనిచెఁ = పంపెను;

తా. ధర్మజుఁడు దయావంతుఁడగుటచే హింసలకోడి, సంధి జరుప దలంచిన వాఁడై, తన కీర్తి లోకమున నిండునట్లు నీతి దక్షుఁడగు వానిని. మాట నేర్పరియగువానిని, శ్రీ కృష్ణుని, రాయబారిగా నంపెను. "కోవిదనుత నీతి దక్షుఁ." "విద్వాన్విపశ్చిద్దోషజ్ఞ స్సంత్సుధీః కోవిదో బుధః" అమరము.

తే. అతఁడు నుచితగతి భ్రాజిష్ణుఁడై చని ప్రభు
చరితదుర్ణయవ్యథమాన కరిపురజను
లనిశమును గుందువారంతఁ దనదురాక
కార్యమెంచి యానీతిక కరముమెచ్చ. 84

రామాయణ. అతఁడును = ఆ యంగదుఁడును, భ్రాజిష్ణుఁడై = ప్రకాశించువాఁడై, ఉచితగతిఁ చని = తగిన రీతిని వెడలి, ప్రభు......వ్యథఁ; ప్రభు = తమ ప్రభువగు రావణునిచే, చరిత = నడచుకొనఁబడిన, దుర్ణయ = అనీతివలని, వ్యథఁ = దుఃఖమును, మానక = విడువక, అరిపుర జనులు = శత్రుపురమునందలి జనులు, లంకా జను లనుట ; అనిశమును = ఎల్లప్పుడును, కుందువారు = చింతిలువారు, అంతఁ, తనదు = అంగదుని, రాక = వచ్చుట యొక్క, కార్యము, ఎంచి = తలఁచి, ఆ నీతిక = ఆ సంధి నీతికే, కరము = మిక్కిలి, మెచ్చఁ; పై పద్యములో నన్వయము;

తాత్పర్యము సుగమము.

భారత. అతఁడును = ఆ కృష్ణుఁడును, భ్రాజిష్ణుఁడై, ఉచితగతిఁ, చని = వెడలి, ప్రభు.............జనులు; ప్రభు = తమ ప్రభువగు దుర్యోధనునిచే, చరిత = ఆచరింపఁబడిన, దుర్ణయవ్యథమాన = అవినీతిచే దుఃఖించుచున్న, కరిపురజనులు = హస్తినయందలి జనులు, అనిశమును

కుందుకారు, అంతట౯, తనను రాక = కృష్ణుని వచ్చుట వలని, కార్యము౯, ఎంచి = తలఁచి, ఆ నీతిక, కరము = మిక్కిలి, మెచ్చ౯;

తాత్పర్యము సుగమము.

ఉ. సాధు కృతప్రవేశుఁడయి సాహసవత్తరచిత్త శత్రు దు
ర్బోధను నింద్రజిద్గురు మహోజ్జ్వలవైభవగర్వితు న్బలో
త్సేద సముద్ధతుం దగువిధిం గృతదర్శనుఁడైనవాని మా
నాధికుఁ జూచి యిట్లను మహాసభలో జనులందఱు న్వినన్.

**రామాయణ** సాధు = చక్కఁగా, కృత ప్రవేశుఁడయి = చేయఁబడిన ప్రవేశముగలవాఁడయి, సాహస......దుర్బోధను౯ ; సాహసవత్తర = మిక్కిలి తెగువతోఁ గూడిన, చిత్త = మనస్సుగల, శత్రుదుర్బోధను౯ = శత్రువులకుఁ బోర శక్యముగానివానిని, ఇంద్రజిద్గురు౯ = ఇంద్రజిత్తుని తండ్రియగువానిని, మహోజ్జ్వల వైభవ గర్వితు౯ = మిక్కిలి ప్రకాశించుచున్న వైభవముచే గర్వించిన వానిని, బలోత్సేద సముద్ధతు౯ = బలౌన్నత్యముచే మిక్కిలి యుద్ధతుఁడగు వానిని, తగువిధి౯ = తత్కాలోచిత విధిని, కృతదర్శనుఁడైన వాని౯ = చూచిన వానిని, దురవృష్టముం గాంచిన వాని ననుట; మానాధికు౯ = మితిమీఱిన వానిని, (రావణుని) చూచి, మహాసభలో జనుల్ = ఆ గొప్ప యోలగములో జనులు అందఱు౯, విన౯, ఇట్లను౯ = ఇట్లనును.

తా. రావణసభలో నంగదుఁడు ప్రవేశించి యతి సాహసవంతుఁడై శాత్రవాజేయుఁడై యతి విభవ గర్వితుఁడై సేనాధిక్యమున నుద్ధతుఁడై యుండు రావణు నంగదుఁడు చూచి యాసభలోనివారెల్లరు విన నిట్లనెను.

**భారత.** సాధు = సత్పురుషులచే, కృతప్రవేశుఁడయి = చేయఁబడిన ప్రవేశము గలవాఁడయి, సాహసవత్తర = మిక్కిలియుద్ధతములైన, చిత్తశత్రు౯ = అంతశ్శత్రువులు గలవానిని, ఇంద్రజిత్...గర్వి

తుఁ ; ఇంద్రజిత్ = ఇంద్రునిజయించునట్టి, గురు = గొప్పదగు, మహః = ఉత్సవముచే, ఉజ్జ్వల = ప్రకాశించు, వైభవ = విభవముచే, గర్వితుఁ = గర్వించినవానిని, బలోత్సేద సముద్ధతుఁ, తగువిధిఁ = తగులాగున, కృతదర్శనుఁ = చేయఁబడిన నిజదర్శనము గలవానిని, మానాధికుఁ, దుర్యోధనుఁ = దుర్యోధనుని, చూచి, మహాసభలో జనుల్, అందఱుఁ, వినఁ = ఆలకించునట్లు, ఇట్లనుఁ.

తా. ఆ కృష్ణుఁడు సాధువులమూలమున రాజసభామందిరప్రవేశముగలవాఁడై మిక్కిలి యుద్ధతములైన యంతశ్శత్రువులఁగలవానిని నింద్రుని జయింపఁజాలునట్టి గొప్పవైభవము వలన గర్వితుని దుర్యోధనుంగాంచి సభలోనివారెల్ల విన నిట్లనియెను.

"బలోత్సేధ." "ఉత్సేధశ్చోచ్ఛ్రయశ్చసః." అమరము. "మానాధికుఁ జూచి యిట్లను మహాసభలో" ఇటసరసపళి, "హాయలత్వమునకు శషసలు, నయవర్తన చ ఛ జ ఝులకు నలిమధ్యమవ, ర్గయుతాను నాసికముని, శ్చయముగ ద్రుతమునకుఁజెల్లు సరసవళులుఁ." అప్పకవీయము.

తే. క్షాంతి జయశోభి రాముఁ డనంతబలుఁడు
ధర్మసూతి యిప్పుడును నీదౌష్ట్యమాత్మ
నెన్నక నయోక్తినినుఁ దేర్ప నెన్నఁబనిచె
వినుము నామాట దుర్మదావేశముడిగి. 86

రామాయణ. క్షాంతిఁ = ఓర్పువలన, జయ = జయమువలన, శోభి = ప్రకాశించు, రాముఁడు = రామచంద్రుఁడు, అనంతబలుఁడు = మిక్కిలి బలముగలవాఁడు, ధర్మసూతి = ధర్మమున కాకరమగువాఁడు, ఇప్పుడును = ఈ సమయమునందును, క్షమించుటకు శక్యముగానంతటి యపరాధమొనర్చిన యీ సమయమునను ననుట ; నీదౌష్ట్యము = నీ దుష్టత్వము, రావణాచరితపాప మత్యుత్కటమగుటచే దానిం

వేరొక్కనుటయుఁ గవికిష్టపడకయే యంగదునిచే దౌష్ట్యమని మాత్రము చెప్పించెను ; ఆత్మన్ = తనలో, ఎన్నక = తలంపక, రాముఁడు నీదౌష్ట్యము తలఁపకయనుట ; నయోక్తిన్ = నీతిపూర్వకోక్తితో, నినున్, తేర్పన్ = కలుషహీనునిగా నొనర్ప, నన్నున్, పనిచెన్ = పంపెను ; దుర్మదావేశము = చెడుమదముఁగలని యావేశము, ఉడిగి = వీడి, నామాట వినుము ;

తా. రాముఁడు తానోర్పుగలవాఁడగుటచే దౌష్ట్యముం దలఁపక యిట్టి సందర్భమునను సామవాక్యముల నిను దేర్పఁదలఁచి నన్ను బంపెను. నీ యీ దుర్మదావేశము వీడి నామాటవినుము.

భారత. క్షాంతిజ = ఓర్పువలనఁ జనించిన, యశః = కీర్తిచే, అభిరాముఁడు = ప్రకాశించువాఁడు, అనంతబలుఁడు, ధర్మసూతి = ధర్మజుఁడు, ఇప్పుడును = ఈ సమయమునను, అరణ్యవాసాజ్ఞాతవాసముల యనంతరమున, పాండవుల భాగము వారికీయవలసియుండ నన్యాయమాచరించిన యట్టిసమయమునను ననుట ; నీదౌష్ట్యము = నీ దుష్టత్వము ; ఆత్మన్, ఎన్నక, నయోక్తిన్, నినున్, తేర్పన్ = తేర్చుటకై, నన్నున్, పనిచెన్ = పంపెను, దుర్మదావేశము, ఉడిగి, నామాట, వినుము = ఆలకింపుము ;

తా. శాంతముగల ధర్మజుఁడు నీయపరాధమును గణింపక యిప్పుడును మంచిమాటలచే నిను దేర్పదలఁచి నను బంపెను. కావున గర్వముడిగి నామాటవినుము.

చ. నియతముగాఁగ నీవిపుడు శ్రీ నిన్నును నీవిభవంబు నీమహా
న్వయమును గాచికోవలసితేనన్నగుడన్ విడు మట్లవిక్రమ
క్రియమెయి మాయచే నపహరించిన భూమిజనాదరార్థాని
శ్చయుఁడగు నన్న రేశ్వరునికిశాసనమిట్టిదనీకుఁ జెప్పితిన్.87

**రామాయణ.** నియతముగాఁగన్ = నిర్ణయముతోడ, నీవు, ఇది రావణుని సంబుద్ధి ; ఇపుడు, నిన్నును, నీవిభవంబును = నీయైశ్వర్యమును, నీమహాన్వయమును = నీవంశమును, కాచికోవలసినన్ = రక్షించుకొనవలసినయెడల, అట్లు, అవిక్రమక్రియమెయిన్ = పరాక్రమహైన్యముతో, మాయచేన్ అపహరించిన, భూమిజన్ = సీతను, మగుడన్ విడుము = మరల వదలుము, ఆదరార్హనిశ్చయుఁడగు = ఆదరమునకుం దగిన నిశ్చయముగల, అన్నరేశ్వరుని శాసనము = ఆ రామునాజ్ఞ, ఇట్టిద = ఈలాటిదే, నీకున్, చెప్పితిన్ ;

తా. ఓరావణా, నిన్ను, నీయైశ్వర్యమును, నీవంశమును రక్షించుకొనవలసిన యెడల రామునకు మరల సీతనిమ్ము. ఇది రామునాజ్ఞ. నీకు వివరించి చెప్పితిని ;

**భారత.** నియతముగాఁగన్, నీవు, ఇది (రావణునకు సంబుద్ధి) ఇపుడు, నిన్నును, నీ విభవంబును ; నీ మహాన్వయమును = నీ గొప్పవంశమును, కాచికోవలసినన్, అట్లు, అవిక్రమ క్రియమెయిన్ = పరాక్రమహైన్యముతో, మాయచేన్ = వంచనచే, యుద్ధము సేయఁజాలక కేవలము మాయాద్యూతమున ననుట, అపహరించిన, భూమిన్ = రాజ్యమును, మగుడన్ విడుము = మరలవదలుము, జనావరార్హ నిశ్చయుఁడగు, అన్నరేశ్వరుని = ఆ రాజుయొక్క, ధర్మజునియొక్క యనుట, శాసనము, ఇట్టిద, నీకున్ చెప్పితిన్.

తా. ఓదుర్యోధనా, నిన్ను నీయైశ్వర్యమును, నీవంశమును రక్షించుకొనఁ దలఁచినయెడల మాయాజూదమున హరించిన పాండవుల రాజ్యభాగము వారికిమ్ము. ఇది యా ధర్మజునాజ్ఞ.

"కాదికో." ఇటఁ గొనునకుఁగో యుయ్యెను.

“క్రియమెయి మాయచే నపహరించిన,” వెఱయతి, “గుడుసుపైఁ గ్రియనడుమ నాగుడుసువచ్చి, భిన్నయతి యగు రాఁచోఁ బెఱయతియగు.” అప్పకవీయము.

క. భీమార్జున బాహుబలో
 ద్దామత నీ వెఱిఁగినదియ తజ్జయశాలిన్
 దా మిక్కిలి శౌర్యోన్నతి
 చే మించిన మేటి యతనిఁ జెనకి బ్రదికెదే. 88

**రామాయణ.** భీమ......ఉద్దామత ; భీమ = భయంకరుఁడైన, అర్జున = కార్తవీర్యార్జునని, బాహుబలోద్దామత = భుజబలమువలని గొప్పతనము, (రావణుఁడు కార్తవీర్యార్జునితోఁ బోరనరిగి యాతనిచెఱఁ జిక్కెననుట యిటసూచితము ;) నీవు, ఎఱిఁగినదియ = తెలిసినదియే, తజ్జయశాలిన్ = అట్టివానిని జయింపఁగలవానిని, పరశురామునను; తాన్ = రాముఁడు, మిక్కిలి, శౌర్యోన్నతిచేన్ = బలిమిచే, మించిన మేటి = అతిశయించిన గొప్పవాఁడు, అతనిన్ = అట్టి శ్రీరాముని, చెనకి = తాఁకి, బ్రదికెదే = జీవింతువా ;

తా. నీవీవఱకే కార్తవీర్యార్జునునకోడినందున వానిపరాక్రమ మెఱిఁగినవాఁడవు ; అట్టివాని జయించిన పరశురామునకంటె నీతఁడు మించినవాఁడు ; అట్టి శ్రీరామచంద్రునిం దాఁకి నీవు బ్రదుకఁగలవా?

**భారత.** భీమ...ఉద్దామత ; భీమ = భీమునియొక్కయు, అర్జున = పార్థునియొక్కయు, బాహుబలోద్దామత, నీవు, ఎఱిఁగినదియ = తెలిసినదియే, పలుతడవలు వారిబలము నీవు చూచియున్నాఁడవని భావము. తజ్జయశాలిన్ = ఆ భీమార్జునుల విజయతో నొప్పుచుండువానిని, తాన్ = ఆ ధర్మజుఁడు, మిక్కిలి శౌర్యోన్నతిచేన్ మించిన మేటి = మిక్కిలి

క. తదనుజుని బాహుబల సం
పదయును సాయకవిహార ధ పాండిత్యమహా
భ్యుదయమును బంటుతనమును
మదిఁదలఁచిన గుండెపగులు ధ మార్తురకెల్లన్. 90

**రామాయణ.** తదనుజుని = ఆ రాముని తమ్ముఁడగు లక్ష్మణుని, బాహుబల సంపదయును=భుజబల మనెడి యైశ్వర్యమును, సాయక...... అభ్యుదయమును; సాయక విహార = బాణ విహారమందు, పాండిత్య = పాండిత్యమనెడి, మహాభ్యుదయమును, గొప్ప యభివృద్ధియు, బంటుతనమును, మదిన్, తలఁచినన్, మార్తురకెల్లన్ = శత్రువుల కందఱకును, గుండెలు పగులున్.

తా. లక్ష్మణుని బాహుబలమును బాణప్రయోగప్రావీణ్యము దలఁచిన శత్రువుల గుండె లవియును.

**భారత.** తత్=ఆ నకులుని, అనుజ=సోదరుఁడైన సహదేవునియొక్క, బాహుబల సంపదయును = భుజబల శ్రీయు, సాయకవిహార, పాండిత్య, మహాభ్యుదయమును, మదిన్ = మనస్సున, తలఁచినన్, మార్తురకెల్లన్, గుండె పగులున్;

తా. సహదేవుని బాహుబలమును బాణ ప్రయోగ చాతుర్యమును దలంచిన శత్రువుల గుండె లవియును.

ఉ. నీవు మదుక్తనీతి మదిధనిల్పుము జీవితరక్షణార్థివై
రావణ దంతివాహను సురప్రభు గెల్చిన గెల్వవచ్చు దు
ర్భావవిచేష్టమాన కురుధరాజ కుమారక భీము బాహులీ
లావిధికగ్గమైన నవిధలంఘ్యము నాకము సంధిమేలగున్. 91

**రామాయణ.** రావణ, నీవు=ఓ రావణా! నీవు, మదుక్త నీతిన్ = నాచేఁ జెప్పఁబడిన నీతిని, మదిన్, నిల్పుము; నేనింతదనుకఁ దెల్పిన నీతిని

మానసమున నిల్పి దాని ననుసరింపుమని భావము; దంతివాహనుఁ = ఐరావతమును వాహనముగాఁగల, సురప్రభుఁ = దేవేంద్రుని, గెల్చినఁ, గెల్వవచ్చుఁ = జయింపవచ్చును, దుర్భావవిచేష్ట = దుష్టస్వభావము యొక్క చేష్ట, మానక, ఉరు.........విధికిఁ; ఉరు = శ్రేష్ఠుఁడైన, రాజకుమారక = రాముని యొక్క, భీమ = భయంకరమైన, బాహు లీలా విధికిఁ = రణమునకు, అగ్గమైనఁ = అధీనమైన, నాకము = స్వర్గము = అవి లంఘ్యము, తప్పక చావు గల్గు నని భావము. సంధి మేలగుఁ = కాఁబట్టి సంధి యొనర్చుకొనుటయే మేలగును.

తా. రావణా! నే నింతదనుకఁ దెల్పిననీతి ననుసరింపుము. దేవేంద్రుఁ నేనిం గెల్వవచ్చునుగాని రాముని పరాక్రమమునకుఁ జిక్కిన మరణము దప్పదు. కాఁబట్టి సంధి యొనర్చుకొనుట మేలగును.

భారత. దుర్భావ విచేష్టమాన = దుష్ట భావముచే వ్యాపరించెడు, కురురాజ కుమారక = దుర్యోధనుఁడా, నీవు, జీవిత రక్షణార్థివి = ప్రాణ రక్షణాపేక్షివి, (కాఁబట్టియే), మదుక్త నీతిఁ మదెఁ, నిల్పుము, ఐరావణదంతివాహనుఁ, ఐరావత గజమును వాహనముగాఁగల, సురప్రభుఁ, గెల్చినఁ, గెల్వవచ్చుఁ, (కాని) భీమ = భీమసేనుని, బాహు లీలా విధికిఁ, అగ్గమైనఁ = అధీనమైన, నాకము, అవిలంఘ్యము, (కావున) సంధి, మేలగుఁ;

తా. ఓ దుర్యోధనుఁడా! దేవేంద్రునేని గెల్వవచ్చునుగాని భీముని భుజబలమున కధీనుఁడవైనచోఁ దప్పక మరణింపఁ గలవు; కావున నామాట విని సంధి కంగీకరింపుము.

"ఐరావణదంతి:" "ఐరావతో భ్రమాతంగై రావణా భ్రము వల్లభాః." అమరము.

వ. అనుపల్కులాకర్ణించి యా దురాగ్రహాగ్రస్తుండు తత్స
మయ సముద్దీపిత కోపాటోపంబు లోలోపలన యడంచి
కొనుచు శుష్కహాసితంబు ముఖంబునకుం దెచ్చుకొని. 92

రామాయణ భారతార్థములు సమము. సుగమము.

క. కొలఁదిఁ గనకెట్టివారును
బెలుచన దవ్వుదవ్వులందు బెదరించియు మూ
లల వేయించికొనంగాఁ
దలఁచెద రిది కాలగుణమొ దైవఘటనయో. 93

రామాయణ భారతార్థములు సమము. కొలఁదిన్ కనక=మేర దెలియక, ఎట్టివారును = ఏలాటివారును, పెలుచనన్ = మిక్కిలి, దవ్వు దవ్వులందున్ = దూరదూరమునుండి, బెదరించియు మూలలవేయించు కొనంగాన్ = మొదట వేయించుకొనఁగా, తమ కార్యము ముందు సాఁగించుకొనుటకని భావము; తలఁచెదరు, ఇది, కాల గుణమో = ఈ కాలముయొక్క గుణమో (కాక), దైవఘటనయో;

తా. ఎట్టివారును స్వశక్తి పరశక్తులను విచారింపక దూర దూరము నుండియే యెదుటివారిని బెదరించి తమ కార్యములు ముందు జరిపించుకొనఁ జూచెదరు. ఇది ఈ కాలమహిమయో లేక దైవ ఘటనయో యగును.

"మూలల వేయించుకొనఁగా" ననుటకు మొదట వేయించుకొనఁగా నని యర్థమగుటకు; "మూలము. సం. వి. అ. న. 1 వేరు; 2. మెట్ట దామర దుంప, 3. ఊడ; 4. మొదలు; 5. సంచి మొదలు; 6. సమీపము 7 ఒక నక్షత్రము." శబ్దరత్నాకరము.

వ. అని యా దూత కృత్యధారేయు నుపలక్షించి. 94

రామాయణ భారతార్థములు, సమము సుగమము.

చ. బలుములుసూపి యిట్టునటుఁ బల్కితి వెఱ్ఱిహరీ? పరోక్తము
ల్వలుకనె కాని బుద్ధిమతిఁ బోఁడదు నిన్నతఁ డుర్విపాలు గా
వలసి యిటాడఁ బంపె విడు వన్మహిజన్నముఁ బౌరుషంబు ని
ర్మలధృతియుం బొగడ్తఁ గనఁ గమ్మార్కొనరమ్మను చూచెదన్నియున్.

**రామాయణ.** వెఱ్ఱిహరీ = వెఱ్ఱి వానరుఁడా, బలుములు = పరాక్రమములు, చూపి, ఇట్టున్, అటున్, పల్కితి=ఆడితివి, పరోక్తముల్= ఇతరులు చెప్పినవి, పలుకనెకాని = పల్కుటకే కాని, బుద్ధి = నీ బుద్ధి, మతి పోఁడదు = ఇతర విషయములందుఁ బ్రవేశింపదు, అతఁడు = ఆ రాముఁడు, నిన్నున్, ఉర్విపాలు కావలసి= నేలపాలగుటకై - ఇటు ఆడన్ పంపెన్ = ఇట్లు పల్కుట కంపెను, మహిజన్ = సీతను [ఇది సాధ్య సమాసము] పౌరుషంబు, నిర్మల ధృతియున్= శుద్ధ ధైర్యమును, పొగడ్త, కనన్, మనున్, మార్కొనన్ = ఎదురించుటకు, రమ్మను, అన్నియున్, చూచెదు = వీక్షించెదవు;

తా. ఓ వెఱ్ఱి వానరుఁడా! పరాక్రమ యుక్తములగు మాటలు చెప్పితివి. ఇతరులాడిన మాటల నిటఁబల్కుటయకాని యింకేమియు నెఱుఁగవు, రాముఁడు నిన్నిట కనుపుట నిన్ను జంపించుటకే కాని వేఱుకాదు. నేనా సీతనువీడను. పౌరుషము, ధైర్యము, పొగడ్తయు గనులాగున మమ్మెదిరింపుమని యాతనితో నాడుము.

**భారత.** ఓ వెఱ్ఱిహరీ! వెఱ్ఱి కృష్ణుఁడా, బలుములు చూపి, ఇట్టున్, అటున్, పల్కితి, పరోక్తముల్=ఇతరులాడిన వానిని, పలుకనెకాని బుద్ధి మతిపోదు = ఇతరుఁడాడినదట్లే పల్కుట దప్ప వేఱొక విషయమునను నీ బుద్ధి ప్రవేశింపదు, అతఁడు = ఆ ధర్మజుఁడు, నిన్నున్, ఉర్విపాలు = రాజ్యభాగము, కావలసి, ఇటు, ఆడన్, పంపెన్, మహి=భూమిని, విడువన్,

జన్మముఁ = పుట్టుకయు, పౌరుషంబు, నిర్మలధృతియుఁ, పౌగడ్త స్తుతియు, కనఁ, మాఱొకనఁ, రమ్మను, అన్నియుఁ, చూచెదు = కాంచెదవు.

తా. ఓ వెఱ్ఱి కృష్ణుఁడా ఏవో కొన్ని విక్రమవాక్యములు చెప్పితివి. నీ పితరులాడినమాటల నాడెడువాఁడవె కాని యింక నే విషయమునను బుద్ధి చొన్నవు; నిన్నా ధర్మజుఁడు రాజ్యభాగము గోరి పంపెను గాని నే వారికి భాగమీను; తమ జన్మము, పౌరుషము, ధైర్యము పౌగడ్తయుం గల్గులాగున నన్ను మాఱొకన రమ్మనుము.

ఒకానొక ప్రతియందు 'మాఱొకన' అని యలఘురేఫము గాన వచ్చుచున్నది కాని ద్విత్వమునం దక్క సంయుక్తమున నలఘురేఫ ముండ రాదు. మఱియుఁ బలు గ్రంథములు లఘురేఫ యుక్తములుగ నే యున్నవి. నిఘంటువులందు సైఁతము లఘురేఫమే కన్పట్టు చున్నది.

ఉ. కొండొకయుండుచోటువలెఁ గొంకక బింకముతో నరుండు భీ
మ్ముండని నీవు మాటికి సకమున్నతి నెన్నెదు కర్ణ భీష్మ కో
దండ గురుప్రతాప వితతప్రథనప్రథనొప్పు మద్బలో
ద్దండత యుంచుకై సమదిఁ గదాన్పవిదేమిటి నేర్పు సెప్పుమా.

రామాయణ. కొండొక = ఇంచుక, ఒండుచోటువలెఁ = ఇతర స్థలమువలె, సాధారణ స్థలములలోఁ జెప్పులాగున ననుట; కొంకక = భయపడక, బింకముతోఁ = గర్వముతో, నరుండు = మనుష్యమాత్రుఁ డగు రాముఁడు, భీముండు అని = భయంకరుఁడని, నీవు, మాటికిఁ, సమున్నతిఁ = గొప్పదనముతో, ఎన్నెదు = తలంచెదవు, నరాదియెదుట నరుఁడు గొప్పవాఁడవని చెప్పెదవే యని భావము; కర్ణ........ప్రథఁ; కర్ణ = చెవులకు, భీష్మ = భయంకరమైన, వినుటకుఁ గఠినమైనయనుట ; కోదండ = వింటిచేత, గురు = గొప్పదగు, ప్రతాప = పరాక్రమము

చేత, వితత = విస్తారమైన, ప్రథన = రణమునందలి, ప్రథన్ = ఖ్యాతిని, ఒప్పు, మత్ బాహోద్దండతన్ = నాయొక్క బలాతిశయము, ఇంచుకైనన్ = కొంచెమేనియు, మదిన్ = మనస్సునందు, తార్పవు = చేర్పవు, ఇది ఏమిటినేర్పు = ఇదియేమి సామర్థ్యము, చెప్పుమా ;

తా. సామాన్య స్థలములందువలె జంకులేక నాయెదుటనే మనుష్య మాత్రుఁడగు రాముని యౌన్నత్యము పల్కెదవు, శాత్రవకర్ణముల విద ళించు ధ్వనిగల వింటిమహిమచే యుద్ధమునఁ గల నా ప్రసిద్ధిని మానస మునం జేర్పవు, ఇదేటి సామర్థ్యము.

'బింక' మునకు గర్వమనుటకు ; "కాలమను మావటీఁడు బింకంబు తోడ, సరకుసేయక భీకరతరతమిస్ర, వారణముఁ గూల్పఁజూచు కటారి కోల, వెండిబొట్టియవశ్చెదోఁచె వేగుఁజుక్క," పరమయోగి విలాసము.

భారత. కొండొక, ఒండు చోటువలెన్, కొంకక = సంకోచింపక, నరుండు = అర్జునుఁడు, భీముండు అని = భీమసేనుఁడు అనియు, నీవు, మాటికిన్, సమున్నతిన్, ఎన్నెదు, కర్ణ...ప్రథన్ ; కర్ణ = రాధేయుని యొక్కయు, భీష్మ = భీష్మునియొక్కయు, కోదండగురు = ద్రోణుని యొక్కయు, ప్రతాప, వితత = విస్తారమైన, ప్రథన = యుద్ధమునందలి, ప్రథన్ = ప్రసిద్ధిచే ఒప్పున్, మద్బలోద్దండతన్ = నాబలాతిశయమును, ఇంచుకైనన్ = కొంచెమైనను, మదిన్ తార్పవు, ఇదేమిటినేర్పు, చెప్పుమా.

తా. బలవంతుఁడగు నాయెదుటనే భీమార్జునుల గొప్పగాఁజేసి భాషించెదవు, నాప్రసిద్ధి యించుకైనఁ దలంపవు. ఇదేటి సామర్థము.

చ. అనుటయునన్నదాంధునకు నాహరియిట్లను నాదుమాటనీ
మనమున కిప్పుడొప్పగునె మత్తవిరోధి వరూథినీపతుల్
వెనుకవఁ దక్కి చిక్కువడ భీమధనంజయ భాసురప్రతా
ప సవసమృద్ధితోఁగదియు బల్లిదునావిభుఁ జూచునంతకున్.

రామాయణ. అనుటయుఁ = ఆరావణుఁ డట్లనినంతన, అమ్మదాంధునకుఁ = మదముచేఁ గన్నుగానని యారావణునకు, ఆ హరి = ఆ వానరుఁడు, అంగదుఁడనుట; ఇట్లు, అనుఁ = ఈలాగునఁ జెప్పెను, మత్తవిరోధి వరూథినీపతుల్ = మదించిన శత్రుసేనాపతులు, వెనకువ దక్కి = యుద్ధమువదలి, చిక్కుపడఁ = తొట్రిలఁగా, భీమ...... సమృద్ధిలోఁ; భీమ = భయంకరమైన, ధనంజయ = అగ్నితో సమానముగ, భాసుర = ప్రకాశించుచున్న, ప్రతాప = పరాక్రమముయొక్క, నవ = నూతనమైన, సమృద్ధిలోఁ = అతిశయముతో, కదియు = సమీపించు, బల్లిదుఁ=బలాఢ్యుని, ఆవిభుఁ = ఆరాముని, చూచునంతకుఁ = చూచువఱకుఁగాని, ఇప్పుడు, నాదుమాట = నాయీ సంధివాక్యము, నీమనమునకుఁ, ఒప్పగునె;

తా. రావణుఁ డిట్లనినంతన యంగదుఁడు బదులిట్లుపల్కెను. ఓ రావణా! మదించిన విరోధిసైన్యములు యుద్ధమునఁ జిక్కువడులాగున భీకరమగుచు నగ్నితో సమానముగనున్న ప్రతాపముతో నా రాముని జూచినప్పుడుకాని యిప్పుడు నామాట నీమనసున కెక్కదు.

భారత. అనుటయుఁ = దుర్యోధనుఁ డిట్లనినంతన, అమ్మదాంధునకుఁ = మదముచేఁ గన్నుదెలియని యాదుర్యోధనునకు, ఆహరి = ఆ కృష్ణుఁడు, ఇట్లుఅనుఁ, మత్తవిరోధి వరూథినీపతుల్, వెనకువదక్కి = యుద్ధమువదలి, చిక్కుపడఁ, భీమ......సమృద్ధిలోఁ ; భీమ = భీముని యొక్కయు, ధనంజయ = అర్జునునియొక్కయు, భాసుర = ప్రకాశించుచున్న, ప్రతాపనవ సమృద్ధిలోఁ, (కూడి) కదియుఁ, బల్లిదుఁ = బలవంతుఁడగు, ఆవిభుఁ = ఆ ధర్మజుని, చూచునంతకుఁ, కాని, ఇప్పుడు నాదుమాట = నా యీ రాయబారపుమాట, నీమనమునకుఁ, ఒప్పగునె ;

తా. దుర్యోధనుఁ డిట్లాడినంతన శ్రీకృష్ణుఁడు బదులిట్లాడెను. విరోధి సేనాపతులు యుద్ధముదక్కి కలంగునట్లు భీమార్జునుల ప్రతాప

సమృద్ధితోఁగూడి యాధర్మజుఁడు సమీపించినప్పుడు కాని యిప్పుడు నా మాట నీమనమున కెక్కదే;

"సమృద్ధి." సం + వృద్ధి = సమృద్ధియని యగుటకు "ఉరణ్రిపరః." సిద్ధాంతకౌముది.

చ. అమితచమూసమూర్జితుఁడ నంచు నహంకృతిమానవేమొ న
వ్యమదవిభూతి నీ వెఱుఁగ వానరనాయకులాజిచేఁతకై
యమరినవార నేకులు మహాబలు లవ్విభునొద్ద నీయధ
ర్మమయిటమీఁద నెల్లెడల మాకు సహాయము నిన్నుఁ ద్రుంపఁగన్.

రామాయణ. అమిత...ఊర్జితుఁడన్; అమిత = మిక్కుటమగు, చమూ = సేనలచే, సమూర్జితుఁడన్ = మిక్కిలిదృఢుఁడను, అంచున్ = అనుచు, అహంకృతి మానవేమొ = అహంకారమును మానవేమో, నవ్యమద విభూతి = నూతనమగు నీ మదాతిశయము, నీవు ఎఱుఁగవ్ = నీవు తెలియ లాగున, నీ కెఱుకపడునట్లు గానను; మహాబలులు = మిక్కిలి బలముగల వారు, వానర నాయకులు = వానరశ్రేష్ఠులు, అనేకులు, ఆజిచేఁతకై = యుద్ధ వ్యాపారమునకై, అవ్విభునొద్దన్, అమరినవారు = ఆ రామునొద్ద నమరియున్నవారు, నీ యధర్మము = నీ వొనర్చిన యధర్మ కార్యమే, ఇటమీఁదన్ = ఇంకను, నిన్నున్, త్రుంపఁగన్, నిన్ను సంహరించుటకు, ఎల్లెడలన్ మాకు సహాయము = ఎల్లప్పుడును మాకు తోడ్పడును.

తా. మిక్కుటమగు సేనలఁగలవాఁడ నని గర్వింతువేమో, మిక్కిలి గర్వాతిశయముతోడి వానరు లనేకులతి బలశాలు రారామునొద్ద నమరియున్నవారు, ఇంక నీ వొనర్చిన యధర్మమే నిన్ను ద్రుంప మాకుఁ దోడ్పడఁగలదు.

భారత. అమితచమూసమూర్జితుఁడను అంచున్ = మిక్కిలి సేనలచే దృఢతరుఁడననుచు, నవ్య మద విభూతిన్ = నూత్నమదాతిశయముచే,

అహంకృతి మానవేమొ, అవ్విభునొద్దన్ = ఆ ధర్మజునొద్ద, మహా బలులు, నరనారాయణులు = రాజులు, విరాటాదులనుట; అనేకులు, ఆజిచేతకై, అమరినవారు = అమరియున్నారు, నీవు ఎఱుఁగవా=ఇది నీవు దెలియవా, నీ కిది తెలియదాయనట; నీ యధర్మమ, = ఇటమీఁదన్, నిన్నున్ ద్రుంపఁగన్, ఎల్లెడలన్, అంతటను, మాకున్, సహాయము;

తా. మిక్కుటమగు సేనాబలము గలదని గర్వముమానవేమో, ఆ ధర్మజు నొద్దను విరాటాదు లనేకులు రాజశ్రేష్ఠులు యుద్ధార్థమమరి యున్నవారు, ఇంక నీ యధర్మమే నిన్ను ద్రుంపమాకుఁ దోడ్పడఁగలదు.

వ. అని మఱియు ననేక ప్రకారంబుల నీతియు బలిమియు
మహోద్ధతియుఁ దోఁప హితంబు దెలిపి విఫల ప్రయ
త్నుండై. 99

**రామాయణ భారతార్థములు** సమము, సుగమము.

తే. అకట నెరయనీ యాత్మ నాశకుని కర్ణ
దౌష్ట్యమెట్టిదో నామాట కి దగులదనుచు
విసివి యీదర్పదుష్ట మానసుని గురుని
వారణోద్యుక్తి పెండియు కి పఱలఁబలికె. 100

అవతారిక. భారతార్థము సరిపడుటకై ఇట రామాయణార్థము తెచ్చిపెట్టుకొనిన దగును.

**రామాయణ.** అకట, నెఱయన్, ఈ యాత్మ నాశకుని = ఆత్మ ఘాతుకుఁడగు రావణుని, కర్ణదౌష్ట్యము = చెవులదుర్గుణము, యెట్టిదో, నా మాట = నా పలుకు, తగులదు, అనుచున్, విసివి = విసుగుచెంది, విభీషణుని మాటలు చెవులఁ దగులమికి రావణుని చెవుల దుర్గుణము హేతు వగుచున్నది; ఆ దర్ప దుష్టమానసు ని = గర్వమున దుష్టమగు మానసము

గలవానిని, గురునివారణోద్యుక్తి = మిక్కుటమగు నివారింపవలయు ననెడి ప్రయత్నము, వెండియుఁ = మరల, వలుకఁ, పలికెఁ.

తా. నా మాట శీతని చెవిం దగులకుండుట శీతని చెవులంగల దోష మెట్టిదో, అయినను నే నీతని మఱలించెద నని యీ ప్రయత్నమున నిట్లు పలికెను.

భారత. అకట, శకుని......దౌష్ట్యము; శకుని కర్ణ = శకుని యొక్కయుఁ, గర్ణునియొక్కయు, దౌష్ట్యము = దుష్టత్వము, ఎట్టిదొ, నా మాట, నీ యాత్మఁ = నీ మనస్సున, నెఱయఁ, తగులదు, అనుచుఁ, వినివి = విని, ఆ దర్పదుష్ట మానసుని = గర్వ దూషిత చిత్తుఁడగు నా దుర్యోధనుని, గురుని = తండ్రియగు ధృతరాష్ట్రుని, గురు...ఉద్యుక్తి; గురు=గొప్పదగు, నివారణోద్యుక్తి= వారించునట్టి ప్రయత్నము, యుద్ధము మాన్పించునట్టి ప్రయత్నమనుట; వెండియుఁ = మఱలఁ, పలికెఁ.

తా. ఔరా! నా మాటలు నీ చెవిం దగులకుండుట కా శకుని కర్ణ= దౌష్ట్య మెట్టిదో కదా యని, యీ ధృతరాష్ట్రుని యుద్ధప్రయత్నము నుండి మాన్పు ప్రయత్నమున మరల నిట్లు పల్కెను.

దౌష్ట్యము, భావార్థక తద్ధితము.

తే. నీదు పిన్నతమ్ముండు సునీతి విదురుఁ
డతని బుద్ధి మార్గంబు నీకభిమతంబు
గాని యప్పుడ మఱిమానసగలదె నిన్నుఁ
దెలుపఁబూనుట నోరి చాపలముగాక. 101

రామాయణ. నీదు పిన్నతమ్ముండు = నీ కనిష్ఠ సోదరుఁడు, విభీషణుఁడు, సునీతి విదురుఁడు = మంచి నీతి యెఱిఁగినవాఁడు, అతని బుద్ధి మార్గంబు=ఆ విభీషణుని బుద్ధిమార్గము, నీకుకే అభిమతంబుకాని యప్పుడు

నీ కిష్టముగానపుడు, నిన్నుకా తెలుపకా పూనుటకా = నీకుఁ దెలుపఁ బ్రయ త్నించుటయందు, ఓరి = ఓ రావణా, ఓరి; ఇది నీచ సంభోధనము. చాప లముగాక = నోటి చపలత్వమే కాని, మఱి ఆస కలదె=ఇంక నీ కార్యము నెఱవేఱు నను నపేక్ష కలదె.

తా. నీ తమ్ముఁడీ విభీషణుఁ డెంతయు నీతి యెఱిఁగినవాఁడు; అతని మాట నీ కభిమతముగానప్పుడు నా పలుకులు ఫలించునను నాస గలదే! నే నిప్పుడు పలుకుటెల్ల చాపలమే యగును.

"సునీతి విదురుఁడు;" "జ్ఞాతాతు విదురోవిదుః;" అమరము.

"తెలుపఁబూనుటకా;" ఇట సప్తమ్యర్థమున ద్వితీయవచ్చుటకు; "విను తద్ద్వితీయ సప్తమి, కిని మఱి మూఁడవ విభక్తికిని నిడఁగానా, విన నింపు పుట్టుపట్టున, నను నెఱిఁగి ప్రబంధములఁ బయోంబుధిశయనా;" తాతంభట్టు.

"ఓరి చాపలముగాక" ఇట నోరి యనుట నీచతను సూచించును. "నీచతాయాం రినీస్యాతాం;" అధర్వణకారిక.

భారత. నీదు పిన్నతమ్ముండు, విదురుఁడు, సునీతి = మంచి నీతిగల వాఁడు, అతనియొక్క, బుద్ధిమార్గంబు, నీకుకా, ధృతరాష్ట్రనకనుట; అభి మతంబుకాని యప్పుడ, నిన్ను, తెలుపకా పూనుట, నీకు హితముపదేశింపఁ బూనుట, యని భావము, నోరి చాపలముగాక = వాక్చాపల్యముకాని, మఱి, ఆస కలదె = సంధి జరుగునను నాస గలదా;

తా. నీ చిన్నతమ్ముఁడు విదురుఁడు మంచి నీతి యెఱిఁగినవాఁడు; అట్టివాని మాట నీ వంగీకరింపనప్పుడు నీకు హితము బోధింపం బ్రయత్నిం చుట కేవలము వాక్చాపల్యమ యగును గాని సంధి జరుగు నను నాసలేదు.

వ. అతండే తదుపద్రవ ప్రారంభకాలమున. 102

రామాయణ భారతార్థములు సమము.

**అతండే** = [రామా; ఆ విభీషణుఁడే, భారత; ఆ విదురుఁడే;] **తన్**,
**ఉపద్రవ ప్రారంభకాలమునన్** = ఆ కష్టముల యారంభసమయమునందు;
తాత్పర్యము సుగమము.

క. అన్నవటుమీఁద రాజవు
నిన్నాఁగాదనుట నాదు ✽ నేరమియైనం
గన్నది యన కున్నను విన
కున్నను గపట మది మనకు ✽ నొండొరులయెడన్. 103

**అవతారిక.** రావణునకు విభీషణుఁడును, ధృతరాష్ట్రునకు విదురుఁడును బోధించిన హితము నీ క్రింది పద్య పంచకమున నుగ్గడించుచున్నాఁడు.

**రామాయణ భారతార్థములు సమము.**

అన్నవు=భ్రాతవు, **అటుమీఁదన్**, రాజవు = ప్రభుఁడవు, నిన్నున్ **కాన్** కాదు అనుట = ఇది యాచరింపఁ దగినదౌను, ఇది తగదని నీకుఁ **జెప్పుట**, విధినిషేధములం దెల్పుట యనిభావము; నాదునేరమి = నా బుద్ధిహీనతయే యగును, ఐనన్ = అట్లయ్యును, కన్నది = చూచిన దానింగూర్చి, అనకున్నను = నేను చెప్పకున్నను, వినకున్నను = నీవు వినకుండినను అది, మనకున్, ఒండొరులయెడన్ = పరస్పరము, కపటము = కాపట్యమగును.

తా. నీవు నాకన్నవు, అదియునుగాక రాజవు, అట్టి నీయెడ దోషము లెన్నుట నాదు బుద్ధిహీనతయే యగును, అయినను నేఁగాంచిన దానింగూర్చి చెప్పకుండినను నీవు దానిని వినకుండినను నది మనకుఁ బరస్పరము కాపట్యమగును.

తే. అరయ నేరికి నిట్టట్టని ✽ యాడుకొనఁగ
రానియట్టిది శ్రీరామ ✽ రామ నీకు

మారుదుశ్చేష్టితంబు నిర్వారితముగఁ
జేయకునికి యొప్పదు దానఁ జేటువ్రొందు. 104

**రామాయణ.** శ్రీరామరామ = శ్రీరామునిభార్య, సీతయనుట; అరయన్ = విచారింపఁగా, ఏరికిన్ = ఎవ్వరికిని, ఎంతటిధన్యులకైన నుట; ఇట్టు అట్టు అని = ఇట్టిది అట్టిదియని, ఆడుకొనఁగన్ రాని యట్టిది = చెప్పుకొనుటకుఁ గానియట్టిది, ఆమె విషయమగు దూషణవాక్య ములం బల్కుటఁ బాపము వచ్చు నని భావము; నీకున్, మారు దుశ్చేష్టితంబు = మదనవికారము, నివారితముగన్ = వారింపఁదగినదిగా, చేయ కునికి = ఆచరింపకుండుట, ఒప్పదు = తగదు, దానన్ = అట్టివికార ముచే, చేటువొందుదున్ = కీడుమూడును.

తా. సీత యట్టివారిచేతఁ గాని చులకనగాఁ జూడఁదగని దగును. అట్టి పతివ్రతాశిరోమణి యెడ నీయీమన్మథ వికార మణఁచికొనుట భావ్యము, అట్లుసేఁచి కొనకుండినఁ దప్పక నీకుఁగీడుమూడును.

**భారత.** శ్రీరామరామ = అక్కటకటా, [ఇది ఖేదాశ్చర్య సూచక మగును.] నీ కుమారు దుశ్చేష్టితంబు = నీ పుత్రుఁడగు దుర్యోధనుని దుష్కృత్యము, అరయన్ = విచారింపఁగా, ఏరికిన్ = ఎంతటివారికిని, ఎట్టినీచులకైన నగుట; ఇట్టట్టని యాడుకొనఁగన్ రానియట్టిది = ఇట్టి దట్టిదని చెప్పనలవిగాని నీచాతినీచమగునది, నివారితముగన్ చేయకునికి= దానిని నీవు నివారింపకుండుట, ఒప్పదు = తగదు, దానన్ = అట్లువా రింపక పోవుటచే, చేటువొందున్ = కీడుమూడును, దుర్యోధనుని దుష్కృత్యముల నీవిప్పుడే నివారింపనిచో నది వంశనాశమునకుఁ గారణ మగునని భావము.

తా. ఆహా! నీ పుత్రుని దుష్కృత్యము నీచులుగూడ నిర్దేశింపఁ జాలనంతటి నీచాతినీచమగునది. నీవిప్పుడు దానిని వారింపకుండుట సరి గాదు. అట్లు వారింపక యుపేక్షించినచో దప్పక కీడుమూడును.

ఉత్సాహ॥ అనయవృత్తిఁదనకుఁదానె యహితుఁడగుచుసర్పదం
శన మొనర్చు టన్నమున విషంబునిడుట సింధుపా
తనము సేఁత సతికిఁ గీడు దలఁచు టరసిచూడు పా
వనికి నింత కినుక నెనుచు వానికులము ద్రుంగదే. 105

అవతారిక. ఇట భారతార్థము నడచుటకై రామాయణార్థమునఁ బాములచేఁ గఱపించుకొనుట, విషము దినుట, సముద్రమునఁబడుట, పరస్త్రీవాంఛ మున్నగుపనులు యూరక యంగీకరింప వలసెను.

**రామాయణ.** అనయవృత్తిన్ = అవివేకపు నడవడికచే, తనకుఁదాన = తనకుఁదానే, అహితుఁడగుచున్ = విరోధియగుచును, ఆత్మద్రోహియగుచు ననుట; సర్పదంశనము ఒనర్చుట = పాములచేఁ గఱపించుకొనుట, అన్నమున విషంబునిడుట = ఆహారమున విషమిడికొనుట, సింధుపాతనము సేఁత = సముద్రమునంబడుట, సతికిన్ కీడుదలఁచుట = పతివ్రతకు మానభంగ మొనర్ప నెంచుట, అరసిచూడుము = విచారించి చూడుము, పావనికిన్ = పవిత్రురాలకు, సీతకనుట, ఇంతకినుక పెంచు వానికులము = ఇంతకోపము గలిగించువాని కులము, త్రుంగదే = నశింపదా, దీన నీకులనాశమగునని భావము.

తా. జ్ఞానహీనతచే నాత్మద్రోహమునకుఁ బాల్పడి పాములఁగఱపించుకొనుట, విషమన్నమునం గలుపుకొని భుజించుట, సముద్రమునం బడుట, పరస్త్రీకి భంగము గల్పింపఁబూనుట యిదియెట్టిదో విచారించి చూడుము, ఇట్లుండఁ బతివ్రతామతల్లికయగు సీత కింతకోపము గల్గించుట నీ కులనాశమునకుఁ గారణమగును.

**భారత.** అనయవృత్తిన్ = నీతిరహితమగు నడవడిచే, తనకుఁదాన అహితుఁడగుచున్ = తనకుఁదానే విరోధియగుచును, అకారణ విరోధియగుచునని భావము; పావనికిన్ = భీమునకు, సర్పదంశన మొనర్చుట =

పాములచేఁ గఱపించుట, అన్నమున విషమునిడుట = ఆహారమున విసము పెట్టుట, సింధుపాతనము నేఁత = గంగలోఁ బడఁద్రోయించుట, సతికిన్ కీడుదలఁచుట = పతివ్రతాతిలకమగు ద్రౌపదికి మానభంగము గావింపఁ బూనుట, అరసిచూడుము = విచారించిచూడుము, ఇంత = ఇట్టినేఁత లన్నియును, పావనికిన్=వాయుపుత్రుఁడగు భీమునకు, కినుక పెనుచున్= కోపమును వృద్ధిపఱచును, వానికులము = ఇట్టిద్రోహియగు నీసుతుని వంశము, ద్రుంగదే = నశింపదా, భీమునకింతటి కోపము గల్గించినపిమ్మట వీనివంశము నశింపకుండునా యని భావము.

తా. నీతి రహితమగు నడవడిగల్గి యకారణవిరోధమూని భీమునిఁ బాములచేఁ గఱపించుట, యతనికన్నమున విసమిడుట, యతనిఁ గంగలోఁ బడఁద్రోయుట బతివ్రతాతిలకమగు ద్రౌపదికి మానభంగము గావింపఁ బూనుట ఇట్టి వెట్టికార్యములో యాలోచించి చూడుము. ఇట్టి ద్రోహ కార్యములచే భీమునకాగ్రహము పుట్టకుండునా, అతఁడు క్రుద్ధుఁడైన నీ పుత్రుఁడు సమూలముగ నశింపకుండునా.

క. విను వెక్కలేల విడువుము
జనసమ్మతమతి విదేహ । జననామయమున్
దనయుదితకీర్తిఁ గులవ
ర్తనఁ బ్రజలనులక్ష్మిఁ బ్రోచు । ప్రభునకిదిదగున్. 106

రామాయణ. విను. వెక్కలేల = పలుమాటలేల, జనసమ్మత మతిన్ = జనులకు సమ్మతమగుబుద్ధిచే, విదేహజన్ విడువుము = సీతను విడువుము, అనామయమున్ = సుస్థితిని, తనయుదితకీర్తిన్ = తనయొక్క ప్రసిద్ధమైనకీర్తిని, కులవర్తనన్, ప్రజలను=తనప్రజలను, లక్ష్మిన్ = ఐశ్వ ర్యమును, ప్రోచు = రక్షించునట్టి, ప్రభునకున్ = రాజునకు, ఇది = ఇట్లొనర్చుట, తగున్ = యుక్తమగును;

తా. వినుము వేయిమాటలేల? జనసమ్మతమగు బుద్ధిచే నీతను వీడుము. సుస్థితిని, కీర్తిని, కులవర్ధనమును, ప్రజలను, నైశ్వర్యమును గాపాడు కొను రాజున కిట్లు వదలుట యుక్తమగును.

భారత. వినుము, పెక్కులు (మాటలు), ఏల, జనసమ్మత = జనులకు సమ్మతమైన, మతివి = బుద్ధిగలవాఁడవు, (నీవు) దేహజనన =దేహమునఁ బుట్టిన, ఆమయమున్ = రోగమును, రోగరూపుఁడగు దుర్యోధనుననుట; దితకీర్తిన్=ఖండితమగు కీర్తిగలవానిని, లుప్తయశుననుట; విడువుము, ఇది= ఇట్లు నీచపుత్రునివీడుట, కులవర్తనన్, ప్రజలను, లక్ష్మిన్, ప్రోచుప్రభు నకున్, తగున్. కొందఱు పుత్రుని వీడుటకు ధృతరాష్ట్రుని జనసమ్మత మతియుక్తతను గారణమగునని యభిప్రాయపడెదరు కాని, దుర్యోధనుని కీర్తి హీనతం గారణముగాఁ జెప్పుట యెంతయు సమంజస మగు చున్నయది.

తా. పలుమాటలేల, బుద్ధిమంతుఁడవగు నీవు, దేహమునందలి యామ యసదృశుఁడును గీర్తిహీనుఁడు నగు నీ దుర్యోధనుని వీడుము, కులవర్తన మును, ప్రజలను, నైశ్వర్యమునుం బ్రోచువాని కిట్లువదలుట యుక్తమగును. "కులవర్తనమును బ్రోచువాని కిది తగుననుటచే, "త్యజేదేకంకులస్యార్థే," యను నంశము నిరూపితమగుచున్నది. "(వి) దేహజననామయమున్" అనుచోట భారతార్థమున నామయముగానివాని నామ యమని చెప్పుట యా శ్రయదూషణశ్రమాపాదనాది గుణనిమిత్తకమగుటచే నా మయసదృశత్వ మారోపించుటవలన నిది గౌణవృత్తియు, రామాయణార్థమున వ్యాధిపర ముగ నర్థమగుటచే ముఖ్యావృత్తియు నొప్పుటచే నిచ్చట ముఖ్యగౌణ వృత్తిశ్లేష ప్రతిపాదింపఁబడెను.

క. మనకురువంశ క్రోధము
గనికని వారింపకునికి కే కార్యముగా దొ

క్కనిరూఢదురాగ్రహ బు
ద్ధినివిడుచుట మేలొ కులము దెగుటయ మేలో? 107

**రామాయణ.** మనుకుఁ, ఉరు = గొప్పదగు, వంశశోభము=వంశ మునకాపద (కల్గనుండుట), కనికని, [విప్పియందుద్విర్భావము,] వారింప కునికి = నివారింపకుండుట, కార్యముగాదు = యుక్తముగాదు, ఒక్క, నిరూఢ = రూఢికెక్కిన, దురాగ్రహబుద్ధిఁ = చలముతోడిబుద్ధిని, విడు చుట మేలో, (కాక) కులముతెగుటయు = వంశము ఖండింపఁబడుటయే, మేలో.

తా. మనవంశమునకు గొప్పయాపద గలుగనుండుటం జూచుచుఁ దన్మూలకారణము నుజ్జగించి, యది రాకుండ నివారింపకుండుట యుక్తము గాదు. కేవల దురాగ్రహబుద్ధిని విడచుట మేలా, కులము నశించుట మేలా?

**భారత.** మన, కురువంశశోభము = కౌరవవంశమునకుం గల్గుకలఁత, కనికని, వారింపకునిక, కార్యముగాదు. రూఢదురాగ్రహబుద్ధిని = నిరూఢ మగు దురాగ్రహబుద్ధిం గల వానిని, ఒక్కని=దుర్యోధనుని, విడుచుట మేలా, కులము, దెగుటయ మేలో; దుర్యోధనునిమాటలు వినక కులము రక్షించు కొమ్మని భావము.

తా. మన కురువంశమునకుఁ గలఁత గలుగఁబోవుట దెలిసియు దాని నడ్డగింపకుండుట భావ్యముగాదు. దురాగ్రహపరుఁడగు నీ దుర్యోధనుని విడుట మేలా, కులము నశింపఁజేసికొనుట మేలా?

క. అని మఱియుఁ దఱిమి చెప్పఁగ
ననువైనటులెల్ల జెప్పు నది యాతనికం

టెను మఱియెవ్వఁడు నేమని
నినుఁదెలిపెడిఁ జెడియెఁ గులము నీకతనఁదుదన్. 108

**రామాయణ భారతార్థములు సమము.**

అర్థము. అని, మఱియుఁన్, తఱిమిచెప్పఁగన్ = ఊనిచెప్పఁగా, అను వైనటులెల్లన్=తగినరీతుల నన్నిటను, చెప్పునది, అతనికంటెను = [రామా. విభీషణునికంటెను, భార. విదురునికంటెను,] మఱియెవ్వఁడును = ఇతరుఁడెవ్వఁడును, ఏమని, నినున్, తెలిపెడిన్ = నిన్నుఁదెల్పును, తుదన్ = కడకు, నీకతనన్= నీ కారణమున, [రామా. రావణుని కారణమున, భార. ధృతరాష్ట్రుని కారణమున ననుట] కులము చెడియెడిన్=వంశమునశించును.

తా. అని యూనిచెప్పఁదగు నీతులెల్లం దెల్పి నిన్ను దేర్చుటకాతనికంటె నింకెవ్వఁడు గలఁడు? కడకు నీ మూలముననే వంశము నశింపఁగలదు.

కొన్ని ప్రతులలో; "తరిమి"యని లఘురేఫముగాన వచ్చెడిని కాని, "తఱుమరు నా మీఁద నత్యుదగ్రతవారున్, అనియు, మన యోధావళి చిచ్చవడియె వారిమొనఁదఱిమికొనివచ్చె." ననియు నిట్టివి పెక్కు భారత ప్రయోగముల మూలమున నలఘురేఫమే సాధువగునదగుటచేతను, ప్రాచీన తాళపత్రప్రతియందును నలఘురేఫమేయుండుటచేతను నిది సమంజసమని యలఘురేఫమునే యంగీకరించితిని.

క. అనిపలికి వెండియును నా
తనిపట్టిన చలము రాజ్య దర్పవికారం
బును సైఁపక యుడికించుట
కనయము నుద్ధత మనస్కుఁ డగుచుం బలికెన్. 109

**రామాయణ.** అనిపలికి, వెండియును = మఱియును, ఆతనిపట్టిన చలముఁ = అతఁడు పొందినమాత్సర్యమును, రాజ్యదర్పవికారంబును = రాజ్యమదమువలనిమార్పును, సైఁపక = సహింపక, ఉడికించుటకుఁ = తపింపఁజేయుటకై, అనయముఁ, ఉద్ధతమనస్కుఁడగుచుఁ=గర్వితమనస్కుఁడగుచు, పలికెఁ. అంగదుఁడను కర్త యధ్యాహార్యము.

తా. అంగదుఁ డిట్లుచెప్పియు నా రావణునిచలమును, రాజ్యమదాంధతయుం గాంచి సైఁపక యాతనిం బరితపింపఁజేయ నిట్లు పలికెను.

**భారత.** అనిపలికి, అతనిపట్టిన = ఆ ధృతరాష్ట్రకుమారుని, దుర్యోధనునే యనుట; చలము, రాజ్యదర్పవికారంబును, సైఁపక, ఉడికించుటకుఁ, ఉద్ధతమనస్కుఁడగుచుఁ = ఉద్వృత్తితోడి చిత్తముగలవాఁడగుచు, పలికెఁ. కృష్ణుఁడను కర్త యధ్యాహార్యము.

తా. కృష్ణుఁ డిట్లుచెప్పియు నా దుర్యోధనుని చలము రాజ్యమదాంధతయుం గాంచి సైఁపక యాతనిం బరితపింపంజేయ నిట్లు పలికెను.

క. సుబలాత్మజమాయాద్యూ
తబలంబున నమరసంప దలు గొని యెంతేఁ
బ్రబలితది నేఁడు నిలువదు
ప్రబలాహవభీమ నరవ రభుజోద్ధతిచేఁ. 110

**రామాయణ.** సుబల ఆత్మజమాయాది = బలవంతుఁడగు నింద్రజిత్తుని మాయాదులచేత, ఊత = క్రమ్మఁబడిన, బలంబునఁ, అమర=దేవతల, సంపదలు, కొని, ఎంతేఁ, ప్రబలితివి, ప్రబలాహవభీమ = ప్రబలయుద్ధమున భయంకరుఁడగు, నరవర = రాముని, భుజోద్ధతి చేఁ, అది = ఆ యమరసంపద, నేఁడు, నిలువదు.

తా. నీ కుమారుని మాయాదిసహాయమున నీవు గ్రహించిన యమరైశ్వర్యము రణభీకరుఁడగు రాముని బాహార్గతిచే నేఁడు నిలువదు.

**భారత.** సుబలాత్మజ = శకునియొక్క, మాయాద్యూతబలంబునన్ = మాయజూదముయొక్క బలమువలన, అమరన్ = ఒప్పునట్లుగా, సంపదలు, కొని, ప్రబలితివి, ప్రబలాహవ = గొప్పయుద్ధముచేయు, భీమనర = భీమార్జునుల, వరభుజోద్ధతిచేన్, అది = ఆ సంపద, నేఁడు, నిలువదు.

తా. శకునికల్పిత మాయాద్యూతమునఁ బాండవుల సంపదలైకొంటివి, భీమార్జునుల బాహుబలముచే నది నిలువదు.

చ. ఘనముగ నాత్మ నాఁటి తనకాంత పరాభవ మల్కఁ బెంపఁగా
ననయముఁ బేర్చు రాజమణి యాశుగసంతతి నీదు పెద్దత
మ్ముని నడుమొమ్ము నెత్తురు సముద్ధతిఁ గ్రోలనినుం గృతోరుభం
గుని నొనరింపఁ జూచె దిదిగో కలహాంబ యభీష్టమేనియున్.

**రామాయణ.** ఘనముగన్ = గొప్పఁగా, తనకాంత పరాభవము = సీతావిషయకమగు నవమానము, ఆత్మన్, నాఁటి, అల్కన్ = కోపమున, పెంపఁగాన్, పేర్చు = విజృంభించు, రాజమణి = రాజశ్రేష్ఠుఁడగు రాముని, ఆశుగ = బాణముల, సంతతి = సమూహము, నీదుపెద్దతమ్ముని = కుంభకర్ణుని, నడుమొమ్మునెత్తురున్ = వక్షోమధ్యమునందలి రక్తమును, సముద్ధతిన్, క్రోలన్ = త్రాఁగుటకును, నినున్, కృత, ఉరు = గొప్పనగు, భంగునిన్ = భంగముగలవానినిగా, ఒనరింపన్, కలహాంబ = యుద్ధమే, అభీష్టమేనియున్, ఇదిగో, చూచెదు = చూడఁగలవు.

తా. సీతావిషయక పరాభవము మానసమున నాఁటి యలిగియుండు రాముని బాణజాలములు నీపెద్దతమ్ముఁడగు కుంభకర్ణుని నడుమొమ్మునెత్తు

టిని గ్రోలుటకును, నీకు గొప్పభంగము గల్గుటకును యుద్ధమే యిష్టమైన
నిదె చూడఁగలవు.

**భారత.** ఘనముగన్, నాఁటి తన కాంతపరాభవము = జూదము
నాఁటి ద్రౌపదివిషయక పరాభవము, ఆత్మన్, అల్కన్, పెంపఁగాన్,
అనయము, పేర్చు = ఉగ్రుఁడగు, రాజమణి = రాజశ్రేష్ఠుఁడైన, ఆశుగ
సంతతి = వాయుపుత్రుఁడు, భీముఁడనుట; నీదు పెద్దతమ్మని = దుశ్శాస
నుని, నడుంకొమ్మునెత్తురు, సముద్ధతిన్, గ్రోలన్, నినున్, కృత, ఊరు
భంగునిన్ = తొడల విఱుగఁగొట్టుట గలవానినిగా, ఒనరింపన్, కల
హంబ = అభీష్టమేనియున్, ఇదిగో, చూచెదు.

తా. జూదమునాఁటి ద్రౌపదీ పరాభవమున మానసమున మిగుల
నలుక యభివృద్ధికాఁగా నావాయుసూనుఁడగు భీముఁడు దుశ్శాసనుని నడుం
కొమ్మునెత్తురు గ్రోలి నీయూరుభంగము గల్పింప యుద్ధమే యభీష్టమై
నచో నిదె చూచెదవు.

చ. అని నమిత్రప్రతాపుఁడగునాతని తమ్ముని మేఘనాద భం
జన కృతి దేవదత్త జయశబ్దవివర్ధిత సింహనాద మెం
దును గొదలేక నీకు నిదె దుస్సహకర్ణనిపాతసూచియై
వినఁబడుగుండె దిగ్గురన వేగిర మేలదురంబకోరినన్. 112

**రామాయణ.** దురంబ = యుద్ధమే, కోరినన్, అనిన్ = యుద్ధ
మున, అమిత్రప్రతాపుఁడగు=మిక్కిలి పరాక్రమవంతుఁడగు, ఆతనితమ్మని=
ఆరాముని సోదరుఁడగు లక్ష్మణుని, మేఘనాద భంజనకృతి = ఇంద్ర
జిత్తునివధచేఁ గృతార్థుడైన, దేవదత్త జయశబ్ద వివర్ధిత సింహనాదము =
దేవత లొనర్చు జయశబ్దముచే వృద్ధినందిన సింహనాదము, ఎందును
గొదలేక = కొఱవడక, గుండె, దిగ్గురనన్ = ఝల్లుమనఁగా, నీకున్,

దుస్సహా, = ఓర్వరాని, కర్ణనిపాత = చెవులంబడునట్టి, సూచియై = సూదియై, ఇది, వేగిరము, వినఁబడుఁగా, ఏల = కావున నీ యుద్ధచింతన మేల.

తా. నీవు యుద్ధమేకోరినచో నమిత్రప్రతాపుఁడగు లక్ష్మణుఁడొనర్చు నింద్రజిత్తుని వధచేఁ గృతార్థులైన దేవతలచే నొనర్పఁబడు జయశబ్దము వలన వృద్ధిపొందిన సింహనాదము నీకుఁ గర్ణకఠోరమై నీగుండె ఝల్లుమన నిదె వినఁ బడఁగలదు.

భారత. దురంబకోరినఁగా, అనిఁగా, అమిత్రప్రతాపుఁడగు, ఆతని తమ్ముని = ఆ భీముని తమ్ముఁడగు నర్జునుని, మేఘనాద భంజనకృత్ = మేఘముయొక్క నాదమును భంజించుటయందు సమర్థమైన, దేవదత్త = దేవదత్తమనెడి శంఖముయొక్క, జయశబ్ద = విజయసమయ సంజనిత శబ్దముచే, వివర్ధిత, సింహనాదము, అర్జునుని దేవదత్తధ్వనిచే భీముని సింహనాదము వృద్ధియగుననుట ; గుండెదిగ్గురనఁగా, దుస్సహా = నీతమ్ముఁడగు దుస్సహునియొక్కయు, కర్ణ = కర్ణుని యొక్కయు, నిపాత = పడుటను, సూచియై = సూచించునదై, అర్జునుఁడు గర్ణుని సంహరించి దేవదత్తము పూరించునపుడె భీముఁడు దుస్సహుంజంపి సింహనాదము చేయునని భావము ; వేగము, నీకుఁగా, వినఁబడుఁగా, ఏల.

తా. నీవుయుద్ధమే కోరునెడల నర్జునుఁడు కర్ణునింజంపి యొనర్చు దేవదత్త ధ్వనియు భీముఁడు నీతమ్ముని దుస్సహునింజంపి యొనర్చు సింహనాదమును నీగుండె ఝల్లుమన వేగిరమే వినఁ బడును.

క. వారల సంగర మిట్టిది
యూరీతిం దెలుప నేల! యెఱుఁగం బడదే
యారయ నిది నీకు నతి
క్రూరమహా కపటభవదురోదర వేళన్. 113

రామాయణ. వారలసంగరము = ఆ రామలక్ష్మణుల యుద్ధము, ఇట్టిది = పైన వివరింపఁబడి నట్టిది, ఈరీతిఁ, తెలుప నేల, అతిక్రూర, మహాకపట = గొప్పకపటము గలవాఁడా, భవత్ = నీయొక్క, ఉరః = ఱొమ్మునొక్క, దరవేళఁ = చీల్చు సమయమున, ఇది, అరయఁ, నీకుఁ, ఎఱుఁగఁబడదే.

తా. వారియుద్ధ మీరీతియని నీకుం దెలుప నేల, నీఱొమ్ము చీల్చు నప్పుడు నీకుఁ దెలియదా.

భారత. వారలసంగరము = ఆ భీమార్జునుల ప్రతిజ్ఞ, ఇట్టిది, ఈ రీతిం దెలుపంగ నేల, అరయఁ, అతిక్రూర మైన, మహాకపటమువలన, భవ= కలిగిన, దురోదరవేళఁ = ద్యూతసమయమున, ఇది, నీకుఁ, ఎఱుఁగం బడదే = తెలియదా.

తా. ఆ భీమార్జునుల ప్రతిజ్ఞ యిట్టిదగును. అది నేఁ దెలుప నేల? నీకపట ద్యూతసమయమున నీ కెఱుఁగఁ బడినదే కదా!

"దురోదరవేళఁ." "పణోద్యూతే దురోదరః." అమరము.

వ. అనిపలికి యప్పుడు దన్నుం జుట్టుముట్టుకొని పట్టి నిగ్రహిం చుటకు నుగ్రయోధుల నాగ్రహంబున నియోగించు నద్దు రాత్మునదుర్వివేకంబునకు నవ్వి నిర్విశంక సమాకులిత సంరం భ విజృంభితుం డై మేను వెంచి. 114

రామాయణ భారతార్థములు సమము.

అర్థము, అని, పలికి, అప్పుడు, తన్నుఁ = [రామా. అంగదుని, భార. కృష్ణుని,] చుట్టుఁ, ముట్టుకొని, పట్టి, నిగ్రహించుటకుఁ, ఉగ్ర యోధుఁ = క్రూరులగు యుద్ధవీరులను, ఆగ్రహంబునఁ, నియోగించు= ఆజ్ఞాపించు, అద్దురాత్ము. [రామా = ఆరావణుని, భార. దుర్యోధ

నని] దుర్వివేకంబునకున్ = అజ్ఞానమునకు, నవ్వి, నిర్విశంక = జంకు లేని, సమాకులితసంరంభ = చెదర్పఁబడిన సంరంభమువలని, విజృంభితుండై, మేను పెంచి = [రామా. అంగదుఁడు శరీరము పెంచి; భార. కృష్ణుఁడు విశ్వరూపము ధరించి];

తాత్పర్యము సుగమము.

చ. తనువునసర్వలోకచయదర్శనచిత్రమహత్త్వమెంతయుం
దనరవిరాట్స్వరూపసముదంచితుఁడై తనుఁబట్టఁగమ్మువాం
డ్రనుఘనఘోరహుంకృతినిరస్తులఁజేసినభోఽర్ధ్వగామితా
భినుతయశోవిశేషమునఁబేర్చుచు నేఁగెనియోక్తృపాలికిన్.

రామాయణ. తనువునన్ = (అంగదుని) శరీరమునందు, సర్వలోకచయ దర్శనచిత్రమహత్త్వము = అన్నిలోకముల సమూహముల చూపునకు చిత్రమగు నతిశయము, ఎంతయున్, తనరన్, విరాట్స్వ కారసముదంచితుఁడై = పక్షీంద్రుఁడగు గరుఁడుని విధమున మిక్కిలి యొప్పునట్టివాఁడయి, తనున్ పట్టన్ గమ్మువాండ్రను = తన్ను పట్టుటకు మూఁగువారిని, ఘనఘోర హుంకృతిన్ = మిక్కిలి క్రూరమగు హుంకార ముచే, నిరస్తులన్ చేసి = నిరసింపఁబడిన వాండ్రనుగాఁ జేసి, నభోఽర్ధ్వ గామితాభినుత యశోవిశేషమునన్ = ఆకాశమార్గ సంచారముచేఁ బొగ డఁబడిన కీర్తివిశేషముచే, పేర్చుచున్ = అతిశయించుచు, నియోక్తృ పాలికిన్ = తన్ను నియోగించిన రాముని పాలికి, ఏఁగెన్.

తా. శరీరము పెంచుటచే నందఱు చూపులకుఁ జిత్రము దనరఁగా, గరుఁడుని విధమున నొప్పువాఁడయి, తన్ను బంధింపవచ్చు రాక్షసుల హుంకారమున వదిల్చి యాకాశమార్గమున రాముని సమీపించెను.

భారత. తనువునన్ (కృష్ణుని) శరీరమునందు, సర్వలోకదర్శన = అన్నిలోకముల చూపులచే, చిత్రమహత్త్వము = చిత్రమగు నతిశయము,

ఎంతయుఁన్, తనరన్, విరాట్ప్రాకార సముదంచితుఁడై = విరాట్స్వరూపుని విధమున నొప్పువాఁడయి, తనన్, పట్టన్, క్రమ్మువాంద్రను, ఘనఘోర హుంకృతిన్ = హుంకారముచే, నిరస్తులన్ చేసి, నభోధ్వగ = ఆకాశమార్గమున సంచరించు దేవతలచే, అమిత, అభినుత, యశోవిశేషమునన్, పేర్చుచున్, నియోక్తృపాలికిన్ = ధర్మజునొద్దకు, ఏఁగెన్.

తా. తనశరీర మందఱచూపులకుఁ జిత్రముగాఁ దనర విరాట్స్వరూపము దాల్చి తన్నుబట్టఁ జూచువారి నదలించి దేవతలచేఁ బొగడఁబడువాఁడయి కృష్ణుఁడు ధర్మజుని పాలికేఁగెను.

వ. ఏఁగియున్న రేంద్రునకుఁ దనపోయివచ్చిన కార్యంబు తెఱంగెఱింగించి యిట్లనియె. 116

కవిరాజ విరాజితము.

తిరము విపక్షుమదోద్ధతి నీవు దుకిందిందెగఁజాలవుగాని వెసం
గురుకృపశాంతనవప్రోక్తులఁ దేర్చియుఁ గొంకకయే నితవుందగవుం
బిరుసునుజూపి యనేక విధంబులఁ గెక్కులువల్కియుఁ జూచితినీ
కరుణకుఁబాత్రుఁడుగాఁడుపదింబదిగాఁగనివచ్చినవాఁడదుదక్

రామాయణ భారతార్థములు సమము.

అర్థము. విపక్షుమదోద్ధతి = [రామా. రావణుని గర్వాతిశయము, భార. దుర్యోధనుని గర్వాతిశయము,] తిరము, నీవు, తుదిన్, తెగఁజాలవు కాని = సాహసింపఁ జాలవుగాని, సాహసమున యుద్ధమునకుపక్రమింపవుగాని, వెసన్, గురుకృపశాంతనవోక్తులన్ = [రామా. గొప్ప దయతోడి శాంతమై మనోహరమగు మాటలచే, భార. ద్రోణ, కృప, భీష్మాదులపలుకులచే] తేర్చియున్, ఏన్, కొంకక, ఇతవున్, = హిత

మును, తగవుక్ = న్యాయమును, బిరుసునుక్ = కాఠిన్యమును, చూపి, అనేకవిధంబులక్, పెక్కులు, పల్కియుక్, చూచితిక్ [రామా. ఆ రావణుఁడు, భార. ఆ దుర్యోధనుఁడు], నీకరుణకుక్ = నీదయకు, పాత్రుఁడుకాఁడు, తుదక్, పదింపదిగాక్ = బాగుగా, కనివచ్చిన వాఁడక్.

తా. శత్రుని గర్వము స్థిరమగునది. నీవు తెగువకుఁ బూనకున్నాఁడవుకాని [రామా. మంచిమాటలచేతను, భార. ద్రోణాదుల వచనముల చేతను], తేర్చియు హితమును న్యాయమును గాఠిన్యమునుం జూపి నే నెన్ని విధములం జెప్పియుఁ జూచితిని. నీదయకుం బాత్రుఁడుగాఁడు, ఈవిషయము బాగుగాఁ గనివచ్చినాఁడను.

వ. అనిన విని మనకు నుచితంబైన వర్తనంబు నడపితి మిట మీఁద నతని పాపఫలం బెట్లు గావలయు నట్లయ్యెడు మని పలుకుచు నొక్క శుభముహూర్తంబున. 118

సుగమము.

తే. తన కుదార సోదర భావమునను రణ స
హాయముగఁ దివిరెడు వీరు ననలజాతు
మిగులఁ గాననీలసమాఖ్య మెఱయువాని
భూనుతాజి ధృష్టద్యుమ్ను సేనగావ. 119

రామాయణ. తనకుక్, ఉదారసోదర భావమునను = గొప్పసోదరునివలె, రణసహాయముగక్ తివిరెడువీరుక్ = యుద్ధ సహాయుఁడగుటకుఁ బ్రయత్నించెడు వీరుని, అనలజాతుక్ = అగ్నిసుతుని, కానక్ మిగులక్, నీలసమాఖ్యక్ = నీలుఁడను పేరున, మెఱయువానిక్, భూనుత= జనులచేఁ బొగడఁబడిన, ఆజి = యుద్ధమున, ధృష్ట = దిట్టమయిన,

ద్యుమ్నుఁ = సత్వముగలవానిని, సేనఁ కావఁ; అభిషిక్తుంజేసి యని ముందటి పద్యముతో నన్వయము.

తా. తనకు సోదరునితో సమానుఁడును, నగ్నికుమారుఁడును, నల నాముఁడుగువానిం దనసేనను రక్షించుటకై,

**భారత.** తనకుఁ, దారసోదరభావమునఁ = భార్యయొక్క తోఁబుట్టువుదనముచే, సహాయునకుఁ, తివిరెడునికుఁ, అనలజాతుఁ = అగ్నియందుఁబుట్టినవానిని, [ద్రోణునంచలివిరోధమున నాతనిం జంపఁగల కుమారుని నర్జునుం బరిగ్రహింపఁజాలు తనయునుం గోరి ద్రుపదుఁడు యజ్ఞము సేయ నా యజ్ఞకుండమున ద్రౌపదీ ధృష్టద్యుమ్ను లుదయించిరని పురాణగాథ]. మిగులఁగాఁ, అసిలసమాఖ్యుఁ = తెల్లనికీర్తిచే, మెఱయువానిఁ, ధృష్టద్యుమ్నుఁ, సేనఁ, కావఁ; అభిషిక్తుం జేసి యని ముందటిపద్యముతో నన్వయము.

తా. తనభార్యకు సోదరుఁడైనట్టియు, తనకు యుద్ధమున సహాయముగా నున్నట్టియు, నగ్నికుండమునఁ బుట్టినట్టియు, ధృష్టద్యుమ్నుని సేనురక్షింప.

వ. అభిషిక్తుం జేసి సంవిహిత సకల సన్నాహుండై. 120

సుగమము.

ఆ. అనికి నుగ్రమై మహారిపురాజిరా
నంతవనచయంబు లన్నియుఁ జెఱు
నుగ్గు గాఁ బదహతికినుఁబుమాడు సేనతో
నాజిరంగమునకు నతఁడు నడచె. 121

**రామాయణ** అనికిఁ, ఉగ్రమై, మహత్, అరిపుర = శత్రువు యొక్క నగరమగు లంకయొక్క, అజిర = ప్రాంగణ భూములందుంను,

అనంత = మిక్కుటమైన, వనచయంబులంతయుఁన్, చిఱునుగ్గుగాన్ = పొడిపొడిగా, పదహతిన్, నఱుమాడు సేనతో = హతమొనర్చు సేనతో, ఆజిరంగమునకున్, అతఁడు = ఆ రామచంద్రుఁడు, నడిచెన్.

తాత్పర్యము సుగమము.

భారత. అనికిన్, ఉగ్రమై, మహారిపురాజ = గొప్పశత్రువుల సమూహము, రాన్ = రాఁగ, అంతన్, వనచయంబులన్నియు = ఉద్యాన వనముల సమూహములన్నియు, చిఱునుగ్గుగాన్, పదహతిన్, నఱుమాడు సేనతోన్, ఆజిరంగమునకున్ = రణరంగమునకు, అతఁడు = ఆ ధర్మజుఁడు, నడచెన్.

తాత్పర్యము సుగమము.

ఆ. తెగున నిట్లు నడచి ꠶ మిగులఁ జేరిక లంక
ముక్తధృతివిలాస꠶ముగఁ గడంకఁ
బోరునడపె దృఢ మ꠶నోరథ హరికుంజ
రోగ్రబలముఁగొలిపి ꠶ యాగ్రహమున. 122

రామాయణ. ఇట్లు, లంక = లంకాపురము, ముక్తధృతివిలాస మునకున్ = విడఁబడిన ధైర్యవిలాసముగలదికాఁగ, కలఁతచెందఁగా ననుట; మిగులన్, చేరికన్, తెగువన్ = సాహసమున, నడచి, దృఢమనోరథ= స్థిరమైన మనోరథములుగల, హరికుంజర = వానరశ్రేష్ఠుఁడగు సుగ్రీవుని, ఉగ్రబలమున్ = భయంకరమగు సేనను, ఆగ్రహమునన్, కొలిపి = ప్రేరేచి, కడంకన్, పోరునడపెన్.

తా. లంకకలఁగునట్లు నడచి వానరసేనలఁబురిగొల్పి పోరునడపెను.

భారత. తెగువన్, ఇట్లు, మిగులన్ చేరి = దగ్గఱించి, కలంక ముక్త = కళంకహీనమైన, ధృతి= ధైర్యముచేత, విలాసముగన్ = ఒయ్యారముగా, నడచి, దృఢమనః = దృఢమనస్కులగు, రథహరికుంజర = రథ

ములతోడను, గుఱ్ఱములతోడను, ఏనుఁగులతోడను గూడిన, ఉగ్రబలముల్, ఆగ్రహమునన్, తాలిమి, కడఁకన్, పోరు, నడపెన్.

తా. ఇట్లు నడచి ధైర్యయుక్తుఁడై చతురంగ బలములను రేచి యుద్ధము చేసెను.

"కుంజర" "ఖముఖకుంజేభ్య ఉపసంఖ్యాన" మ్మనువార్తికమువలనఁ గుంజరపదము గల్గెను.

వ. అందు. 123

క. అమ్మనుజేంద్రుని బలవ
ర్గమ్మున్ మొదలినాఁడు భీష్మరక్షార్జిత ద
ర్పమ్ములఁ గవియు సుయోధను
తమ్ములఁ జతురంగసైన్యతతుల జయించెన్. 124

**రామాయణ.** అమ్మనుజేంద్రుని = ఆ రాముని, బలవర్గమ్ము, మొదలినాఁడు, భీష్మ = భయంకరమగు, రక్షః = రాక్షసులచేత, ఆర్జిత = సంపాదింపఁబడిన, దర్పమ్ములన్ = గర్వములచే, కవియు = క్రమ్మునట్టి, సుయోధ = సద్భటులచే, నుతమ్ములన్ = పొగడఁబడువానిని, చతురంగ సైన్యతతులన్ = చతురంగసైన్యముల సమూహమును, జయించెన్.

తా. ప్రథమదివసమున రామసైన్యము రాక్షసుల చతురంగసైన్యమును జయించెను.

**భారత.** అమ్మనుజేంద్రుని = ఆ ధర్మజుని, బలవర్గమ్ము, మొదలినాఁడు, భీష్మరక్షార్జితదర్పమ్మునన్ = భీష్మునిరక్షచే సంపాదింపఁబడిన గర్వముచే, కవియు, సుయోధనతమ్ములన్ = సుయోధనుని సోదరులను, చతురంగసైన్యతతులన్, జయించెన్.

తా. మొదలినాఁడు ధర్మజునిసైన్యము భీష్మరక్షాగర్వమునఁ దఱుఁగవియు సుయోధనుని సోదరులను జతురంగబలములం గూడ జయించెను.

సీ. ఆ నృపాలశ్రేష్ఠుఁ డవ్వేళ నురుమాధ
వప్రేమ కృతవిజయప్రకర్ష
మరయుచు నంగద శరభ కేసరి గజ
ర్షభ శతబలి సమీరణసుతాజి
కేళి మహత్త్వ మీక్షించుచు నుగ్ర సం
పాతి దస్రసుతాచ్ఛభల్లరాజ
వేగదర్శితనూర్జితాగణ్యదర్పంబు
చూడ్కుల కొనఁగుచు శూరతావి
తే. భాసినుత్తమోజు బరాసు ఫణిశిఖండి
ననలసంభవు సైన్యేశుననిఁ గరంబు
మగతనముసూపఁ గనుఁగొంచు మఱియు ద్రుపద
ముఖ్యులగణంబుఁ గనుచు సమ్మోద మందె. 125

**రామాయణ.** అ నృపాలశ్రేష్ఠుఁడు = ఆరాముఁడు, అవ్వేళను, రుమాధవ = రుమభర్తయగు సుగ్రీవుని, ప్రేమకృత = ప్రీతిచేనొనర్పఁబడిన, విజయప్రకర్షమున్ అరయుచున్ = జయాతిశయమును విచారించుచు, అంగద, శరభ, కేసరి, గజ, ఋషభ, శతబలి, సమీరణసుత = వాయుపుత్రుఁడైన హనుమంతుఁడు, వీరియొక్క, ఆజికేళిమహత్త్వము = యుద్ధవిహారాతిశయము, ఈక్షించుచున్ = చూచుచు, ఉగ్ర = భయంకరులైన సంపాతి = సంపాతియొక్కయు, దస్రసుత = అశ్వినులపుత్రులగు మైన్దద్వివిదులయొక్కయు, అచ్ఛభల్లరాజ = భల్లూకనాథుఁడగు జాంబవంతుని యొక్కయు, వేగదర్శి = వేగదర్శియొక్కయు, తను = శరీరముచే, ఊర్జిత = అంగీకృతమైన, అగణ్యదర్పంబు = అమితబలమును, చూడ్కుల కొనఁగుచున్ = చూచుచు, శూరతావిభాసిన్ = శూరతచేఁ బ్రకా

చువానిని, ఉత్తమోజుఁ = శ్రేష్ఠమగు తేజముగలవానిని, పర అసుఫణి శిఖండిన్ = శత్రువులప్రాణములనెడి పాములకు నెమలివంటి వానిని, అనల సంభవున్ సైన్యేశున్ = అగ్నిపుత్రుఁడగు సేనాపతియైన నలుని, అనిన్, కరంబు, మగతనము=పౌరుషము, చూపన్, కనుఁగొంచున్, మఱియున్, ద్రుపద = వృక్షములనే స్థానముగాఁగల వానరులలో, ముఖ్యులయొక్క, రణంబున్, కనుమన్, సమ్మోదమందెన్.

తా. రాముఁడు సుగ్రీవుని విజయమునారయుచు, అంగదాదుల రణ ప్రాఢిమంజూచుచు, నలునిపౌరుషముం దిలకించుచు, వానరుల రణవిహా రము నీక్షించుచు నానందించెను.

"అచ్ఛభల్ల." ఋక్షాచ్ఛభల్లభల్లూకాః." అమరము.

భారత. ఆ నృపాలశ్రేష్ఠుఁడు = ధర్మపుత్రుఁడు, అన్వేశన్, ఉరు= గొప్పవాఁడగు, మాధవ = కృష్ణుని, ప్రేమకృత, విజయ = అర్జునుని, ప్రక ర్ష ము, అంగదన్,=వేడ్కచే, అలయించున్, శరభ, కేసరి, గజ, ఋషభ = వీరియొక్క, శత = అనేకముల, బలి = బలముగల, సమీరణ సుత = వాతాత్మజుఁడగుభీముని, ఆజికేళిమహత్త్వము, ఈక్షించుచున్, ఉగ్రముగా, సంపాతి = పాఱుచున్న, దస్రసుత = అశ్వినీపుత్రులగు నకులసహదేవులయొక్క, అచ్ఛ, భల్లరాజ = బాణశ్రేష్ఠములయొక్క, వేగ దర్శిత = వేగమును జూచువాఁడగుటచే, ఊర్జిత = వ్యాప్తమగుచున్న, అగణ్యదర్పంబు, చూడ్కులకొనఁగుచు, శూరతావిభాసిన్,ఉత్తమోజున్, పరాసుఫణి=శత్రువులప్రాణవాయువునకు సర్పంబునుంబోలిన, శిఖండిన్ = శిఖండియనువానిని, అనలసంభవున్, సైన్యేశున్ = ధృష్టద్యుమ్నుని, అనిన్, కరంబు, మగతనంబు, చూపన్, కనుఁగొంచున్, మఱియున్, ద్రుపదముఖ్యుల రణంబు = ద్రుపదాదులయుద్ధమును, కనుచున్, సమ్మో దమందెన్.

తా. ధర్మజుఁడు, కృష్ణునిచేఁ జేయఁబడిన యర్జునుని నతిశయముం గాంచుచు, శరభాదులతో సమానమగుబలముగల భీముని యుద్ధముం గాంచుచు, నకులసహదేవుల బాణవేగంబునీక్షించుచు, శిఖండి ధృష్టద్యుమ్న ద్రుపదాదుల యుద్ధముంగాంచుచు, సంతుష్టుఁడయ్యెను.

శా. క్షుత్త్రాచార విహారియై విజయ రక్షాసక్తిఁ బెంపొందు వి
శ్వత్రాతన్విభు విష్ణునారయుచు నాశ్చర్యంబు లిద్దేవుచా
రిత్రంబుల్ హరియూథచోదకత నీరీతిన్వినోదించునే!
చిత్రంబే గెలు పీబలాలి కని చూచెన్ ఖేచరవ్రాతముల్.

రామాయణ. ఖేచరవ్రాతముల్ = ఆకాశసంచారుల సమూహములు, ఇది చూచెన్ అనుక్రియకుఁ గర్తృపదము; క్షుత్త్రాచారవిహారియై= క్షత్త్రియాచారముల విహరించువాఁడయి, విజయరక్షాసక్తిన్ = జయమును రక్షించుటయందలి యాసక్తితో, పెంపొందు, విశ్వత్రాతన్ = లోకరక్షకుని, విభున్, విష్ణున్, అరయుచున్ = చూచుచు, ఇద్దేవుచారిత్రముల్ =ఈ రామచంద్రుని చరిత్రములు, ఆశ్చర్యంబుల్, హరి = వానరుల, యూథమునుయొక్క, చోదకతను = పంగొనుటచే, ఈరీతిన్, వినోదించునే, ఈ బలాలికిన్ = ఈ వానరసేనాసమూహమునకు, గెలుపు చిత్రంబే, అని, చూచెన్, విష్ణుచోదకతామూలమున నీ వానరసేనకు జయము సిద్ధమనిభావము.

భారత. క్షుత్తృ =సారథియొక్క, ఆచారమున, విహారియై, విజయరక్షాసక్తిన్ = అర్జునునిరక్షించుటయం దాసక్తిచే, పెంపొందు, విశ్వత్రాతన్, విభున్ = విష్ణున్, అరయుచున్, ఇద్దేవుచారిత్రముల్ = ఈ కృష్ణునిచరిత్రములు, ఆశ్చర్యంబుల్, హరి = గుఱ్ఱముల, యూథముల, చోదకతన్ = తోలుటచే, ఈరీతిన్, వినోదించునే, ఈబలాలికిన్ =

ఈ ధర్మజుని బలముఁకు, గెలుపుచిత్రంబే, అని, ఖేచరవ్రాతములేఁ, చూచెన్.

తాత్పర్యము సుగమము.

వ. అంత. 127

సీ. శింజినీ నిర్ఘోష ✱ జితసముద్రధ్వని
మేఘనాదుండు స✱మిద్ధశక్తి
భీష్ముండు సందీప్త ✱ పృథుశౌర్యగుణమణి
వాహినీశుండు ని ✱ జాహవదశ
దివసాంత రచితాతి ✱ తీవ్రవిక్రమత శో
భిల్ల నెంతయు విజృం✱భించి వాఁడు
తనమధ్యమునఁ బుట్టు ✱ తనసేనభంగంబు
నరిసేన గర్వంబు ✱ నడఁచి యడఁగి

తే. నాగభీషణ బాణప్ర✱యోగములను
భీమ నరవరచేష్టలు ✱ బెండువడఁగఁ
దదనుజుల సత్ప్రతాపంబు ✱ లొదుఁగువడఁగఁ
గట్టువఱచెఁబల్మెఱు నాజి ✱ ఘనులు వ్రెగడ. 128

**రామాయణ.** శింజినీ నిర్ఘోషజితసముద్రధ్వని = అల్లెత్రాటి చప్పుడుచే జయింపఁబడిన సముద్రధ్వనినిగల, **మేఘనాదుండు** = ఇంద్రజిత్తు, సమిద్ధశక్తిన్ = ప్రకాశించుశక్తిచే, **భీష్ముఁడు** = భయంకరుఁడు, సందీప్త = ప్రకాశించు, పృథుశౌర్యగుణమణి = గొప్పపరాక్రమగుణములనెడి మణులకు, వాహినీశుండు = సముద్రమువంటివాఁడు, నిజాహవదశ = తనదగు యుద్ధావస్థ, దివసాంతరచితాతి తీవ్రవిక్రమతన్ = రాత్రియందు జరుపుటవలని మిక్కుటమగు తీవ్రత్వమువలన, శోభిల్లన్ =

ప్రకాశింపఁగా, రాత్రిజరుపుటచేఁ దన యుద్ధనైపుణి ప్రకాశించెనని భావము.
ఎంతయుఁన్, విజృంభించి, తన్మధ్యమునన్ = ఆ నడుమన, పుట్టు, తన
సేనభంగంబు = తనసేనయొక్క భంగమును, అరిసేనగర్వంబున్, సేన
భంగంబు, సేనగర్వంబునునవి సాధ్యసమాసములు; అడఁచి, అడఁచి,
భీమ = భయంకరుఁడైన, నరవర = రాముని, చేష్టలు, జెంము వడఁగన్:
నశింపఁగా, తదనుజు = లక్ష్మణుని, లసత్ = ప్రకాశించు, ప్రతాపం
బుల్, ఒదుగుఁ డఁగన్ = అణఁగిపోఁగా, ఆజిఘనులు, పల్మాఱున్;
పొగడన్, నాగభీషణ బాణప్రయోగములను = నాగములచే భయంకర
మైన బాణములం బ్రయోగించుటచే, నాగపాశములం బ్రయోగించుటచే
ననుట ; కట్టువఱచెన్ = బంధించెను.

తా. శౌర్యగుణమణి రత్నాకరుఁడగు నింద్రజిత్తు తనసైన్యము
యొక్క దీనత్వమును, నరుల గర్వంబునుం గాంచి, శత్రువుల యుద్రేక
ము నణఁచినైన, రామలక్ష్మణుల పరాక్రమ సంపద జెండుపడులాగున
నొకరాత్రి యుద్ధమున నాగపాశములతో వారిని గట్టివైచెను.

"శింజినీ," "మౌర్వీ జ్యా శింజినీ గుణః." అమరము.

భారత. శింజినీ నిర్ఘోషముచే, జితమైన, సముద్రధ్వనియు, మేఘ
నాద = మేఘముయొక్క ధ్వనినిగలవాఁడు, సమిద్ధశక్తి = ప్రకాశించు
శక్తిగలవాఁడు, సందీప్త ప్రథుశౌర్యగుణమణి = ప్రకాశించునట్టి గొప్ప
శౌర్యగుణమనెడి మణింగలవాఁడు, వాహినీశుండు = సేనాపతియునైన,
భీష్ముండు = భీష్మాచార్యుఁడు, నిజ = తనయొక్క, ఆహవ = యుద్ధము
యొక్క, దశ దివసాంతరచిత = పదిదినములలోపల సంపాదింపఁబడిన,
తీవ్రవిక్రమతన్ = తీక్ష్ణమగు పరాక్రమమున, శోభిలన్ = ప్రకాశిం
పఁగా, ఎంతయుఁన్, విజృంభించి, వాఁడు = ఆభీష్మాచార్యుఁడు, తన్మ
ధ్యమునన్ = ఆ యుద్ధమధ్యమున, పుట్టు, తనసేనయొక్క, భంగంబున్,

అరిసేనగర్వంబుఁ, అడఁచి, అడఁచి, నాగ = సర్పములవలె, భీషణమైన, బాణప్రయోగములను, భీమ = భీమునియొక్కయు, నర = అర్జునునియొక్కయు, వరచేష్టలు, బెండుపడఁగఁ, తత్ = వారి, అనుజ = సోదరులైన నకుల సహదేవుల, సత్ప్రతాపంబులు = మంచిపరాక్రమములు, ఒదుగుపడఁగఁ = అణఁగిపోవునట్లు, ఘనులు, పల్మఱుఁ, పొగడఁ, ఆజిఁ, కట్టువఱచెఁ ;

తా. సముద్రమువలెను, మేఘమువలెను అస్త్రౌఘాటి చప్పుడు గావించుచుండువాఁడు, ప్రకాశించు బలముగలవాఁడు, అధికశౌర్యము గలవాఁడు, కౌరవ సేనానాయకుఁడునగు భీష్ముఁడు తానాచరించిన దశదివసయుద్ధకాలమునఁ దన సేన సంగపడుటయు, శత్రుసేన విజృంభించుటయుం గాంచి, నాగుఁబాములం బోలిన భీకరశరముల భీమార్జునుల, వారితమ్ములగు నకుల సహదేవుల బలము కుంటువడునట్లు వారింగట్టువఱచెను.

చ. దొర ననుజాన్వితంబుగను దుర్దమదుర్దశఁగుందఁ జేసి యి
ట్లురువడిఁ బేర్చుశాత్రవు రణోద్ధతి పెంపు సహింపలేక తా
సరగున దానిమాన్ప హరిచక్రముపూని యెదిర్చెనంత నే
మరలెనరాతి యత్నగరిమం దనపూఁపు నివారితంబు గన్

రామాయణ. దొరఁ = రాముని, అనుజాన్వితంబుగఁ = తమ్ముఁడగు లక్ష్మణునితోఁగూడినట్లు, దుర్దమ, దుర్దశఁ కుందఁ చేసి, చెడుదశచే హైన్యమొందించి, ఇట్లు, ఉరువడిఁ పేర్చు శాత్రవు = మిక్కిలి గర్వించు నింద్రజిత్తుని, రణోద్ధతిపెంపుఁ సహింపలేక = యుద్ధమునందలి గర్వాతిశయము నోర్వలేక, సరగునఁ = శీఘ్రముగ, దానిఁ, మాన్పఁ, హరిచక్రము = వానరసమూహము, తాను, పూని, ఎదిర్చెఁ, అంతనే, అరాతియత్నగరిమఁ = శత్రువగు నింద్రజిత్తుని ప్రయత్నాతిశ

యము చే, తనపూఁపు = ఆ వానర సమూహముయొక్క పూనిక, నివారితంబుగన్ ; మరలెన్.

తా. ఇంద్రజిత్తు రామలక్ష్మణుల దుర్దశపాలుచేసి యతిశయించుచున్న నాతని రణోద్ధతి నోర్వనివారై, వానర సేన దానిమానవ్వందలఁచి యెదిర్చెంగాని యింద్రజిత్తు తన ప్రయత్నాతిశయమున వాపూనిక నడఁపఁగా నా సేన మరలెను.

**భారత.** దొరను = ధర్మజాను, అనుజాన్వితంబుగన్ = సోదరులతోఁ గూడినట్లు, దుర్దమదుర్దశన్, కుందన్ చేసి, ఇట్లు, ఉరువడిన్, పేర్చు = గర్వించు, శాత్రవు = శత్రువగుభీష్ముని, రణోద్ధతి పెంపున్, సహింపలేక = ఓర్వలేక, సరగునన్, దానిన్, మాన్పన్, హరి = కృష్ణుఁడు, తాను చక్రమున్, పూని, ఎదిర్చెన్, అంతనే = వెంటనే, నరాతిగరిమన్=అర్జునుని ప్రయత్నాతిశయము చే, తనపూఁపు=తనపూనిక, నివారితంబుగన్, మరలెన్.

తా. ధర్మజాని నాతనిసోదరులం గుందఁజేయు నాభీష్ముని గర్వమణంపఁ గృష్ణుఁడు చక్రమెత్తెను ; వెంటనే యాయుధము నెత్తననిన కృష్ణుని ప్రతినకు భంగముగల్గకుండ నర్జునుఁడు ప్రార్థింప నంతఁగృష్ణుఁడా ప్రయత్నమును మానెను.

వ. అంత 130

సీ. అట్లువార్యప్రౌఢి నలరుపితామహు
పరశక్తిప్రబలు డీ వ్యత్ప్రతాప
గుణశాలి విజయుండు కోదండ ఘననాద
సంపదుల్లాసిత సకల నిజచ
మూసంతతి శిఖండి యేసె నారచిత స
చ్ఛద్మసంగ్రామ ప్రచారుఁడగుచు

వైరినృపాలకు మారుల హృదయంబు
లెంతయు ఛేదిల్ల నిద్ధవివిధ
ఆ. విశిఖవిసరనిబిడ వివిధసమస్త మ
ర్మతను జేసి యుద్ధ మహిఁబడంగ
నేసి గురు మనోవి కాస సంపాదియై
యాప్తబంధుజనుల నలరఁ జేసె. 131

**రామాయణ.** అట్లు, అవార్యప్రౌఢిక్ = అనివార్య ప్రౌఢిమను, అలరు, పితామహు = బ్రహ్మయొక్క, వరశక్తిక్, ప్రబలు, దీప్యత్ = ప్రకాశించుచున్న, ప్రతాపగుణశాలి = పరాక్రమ గుణములుగలవాఁడు, విజయుండు = జయముగలవాఁడు, కోదండ ఘననాదసంపత్ = విల్లనెడి మేఘముయొక్క నాదమనెడి సంపదచే, ఉల్లాసిత = సంతసింపఁబడిన, సకలచమూసంతతి శిఖండి = సర్వసేనా సమూహమనెడి నెమళ్లుగలవాఁడు, ఆరచిత = చేయఁబడిన, సచ్ఛద్మ సంగ్రామ = కపటముతోఁ గూడిన యుద్ధమునందు, ప్రచారుఁడగుచుక్ = సంచరించువాఁడగుచు, మాయాయుద్ధ మొనర్చుచునుట ; వైరినృపాలకుమారుల హృదయంబుల్ = శత్రువులగు రాజపుత్రుల [రామలక్ష్మణుల] వక్షములు, ఎంతయుక్, ఛేదిల్లక్, ఇద్ధ వివిధవిశిఖ = ప్రవృద్ధములయిన నానావిధబాణముల, విసర = సమూహముచే, నిబిడ = దట్టమైన, వివిధ = పలువిధములగు, సమస్తమర్మతను = సకలమర్మస్థానములు గలవారౌటను, చేసి, యుద్ధమహిక్, పడంగ్, ఏసి = (బాణములం) బ్రయోగించి, గురు = రావణుని, మనోవికాస = మనస్సునకు వికాసమును, సంపాదియై = సంపాదించువాఁడై, ఆప్త, బంధుజనులక్, అలరక్, చేసెక్.

తా. పితామహ వరశక్తిం బ్రబలుచు, జయశీలుఁడగు నింద్రజిత్తు, ధనుష్టంకారమనెడి మేఘధ్వనిచే, దనసేనలనెడి నెమిళ్లసంతసింపఁ జేయు

వాఁడై మాయాయుద్ధమున రామలక్ష్మణుల మర్మములు గాఁడ నస్త్రములం బ్రయోగించి రణరంగమునఁ బడవైచి, తనతండ్రికిని నాప్తజనులకును సంతోషము నొసఁగెను.

"విసర;" "సందోహ విసరవ్రజాః;" అమరము.

అలంకారము రూపకము.

భారత. అట్లు, అవార్య ప్రాభవ, అంత, పితామహున్ = భీష్ముని వరశక్తిన్ = శివసంయమహిమంగల్గిన శక్తిచే, ప్రబలు, దీవ్యత్ప్రతాప గుణ శాలి, విజయుండు = అర్జునుఁడు [వరశక్తిన్, ప్రబలున్, అని కొందఱు పితామహశబ్దమునకు విశేషణముగా నుండనగునని యభిప్రాయపడెదరు కాని, పితామహునని విశేష్యమును ముందుఁజెప్పి యావల విశేషణములం దెల్పి యన్వయక్లిష్టము గావించుట సూరనార్యునియాశయముగా నుండ నోపదు]. కోదండఘనరావ సంపత్ = వింటివలని గొప్పశబ్దమనెడి సంపదచే, ఉల్లాసిత సకల నిజసమూసంతతి = సంతసింపఁబడిన సమస్తమగు తనసేనా సమూహముగలవాఁడయి, శిఖండి ఏసెనాన్ = శిఖండియే ప్రయోగించెనా యనునట్లు, రచిత, సచ్ఛద్మ, సంగ్రామ, ప్రచారుఁడ గుచున్, వైరి నృపాలకుమారుల హృదయంబుల్ = శత్రురాజకుమారుల హృదయములు, కౌరవుల హృదయములనుట; ఎంతయున్, భేదిల్లన్ = మిక్కిలి చెదరునట్లుగా, ఇద్ధ, వివిధ, విశిఖ, విసర, నిబిడ = దట్టమైన, వివిధ, సమస్త, మర్మతనున్ చేసి = మర్మస్థలములు గల శరీరముగలవానిఁ గాఁజేసి, యుద్ధమహిన్, పడంగన్, ఏసి, గురు = అధికమైన, మనో వికాస సంపాదియై = సంతోషము పొందినవాఁడయి, ఆప్తబంధుజనులన్, అలరన్, చేసెన్.

తా. తనతాతను భీష్ముని శిఖండియే బాణములువేసెనా యనులా గునఁ దోఁచునట్లు మాయాయుద్ధమొనర్చి కౌరవుల మానసము చెదరున

ట్లానర్చి బాణములచే భీష్మునిగాఁడనేసి యర్జునుఁడు దానెంతయు సంత
సించి యా ప్రజనులకును సంతస ముదయింపఁజేసెను.

క. దీనత తత్ప్రతిపక్ష బ
లానీకము గుందుచుండె నారాత్రిఁ గడున్
మానసము లార్తిఁ బొగులం
గానిఁక నేదిబ్రదుకేది గతియో యనుచున్. 132

రామాయణ భారతార్థములు సమము.

అర్థము. తత్ప్రతిపక్ష బలానీకము = [రామా. రాముని సేనాస
మూహము, భార. దుర్యోధన సేనాసమూహము] దీనతన్, ఆరాత్రిన్,
మానసమునన్, కడున్ ఆర్తిన్ పొగులగాన్ = మిక్కిలి వ్యసనమున
గ్రుస్సుచుండఁగా, ఇంకన్, ఏది, బ్రదుకు, ఏది, గతియో, అనుచున్,
కుందుచుండెన్ = దుఃఖించుచుండెను.

తాత్పర్యము సుగమము.

ఉ. అంతట నద్భుతంబు గరుడాగమనంబు నిరాకృతాహితా
త్యంతసమార్జితోర్జిత జయాభ్యుదయంబయి భీష్మపాతసం
క్రాంతిఘనవ్యథ న్నెఱియఁగా మఱపింపఁ బునర్మహాజి వి
క్రాంతికుపక్రమించువిభుఁగాంచిదినేశసుతాదులుబ్బుచున్.

రామాయణ. అంతటన్, అద్భుతంబు, ఇదివిశేషణము; గరుడాగ
మనంబు = గరుత్మంతుని రాఁక, నిరాకృత=నిరాకరింపఁబడిన, అహితా=
సర్పములగఁడాటచే, అత్యంత, సమార్జిత = సంపాదింపఁబడిన, ఊర్జిత
జయాభ్యుదయంబయి = స్థిరమైన జయోదయము గలదయి, జయాతిశ
యముం గల్గించినదైయని భావము; భీష్మ = భయంకరమైన, పాత =
(రామలక్ష్మణుల) పాటుయొక్క, సంక్రాంతి = కూడికచే, (కలిగిన)

ఘన, వ్యథన్ = దుఃఖమును, నెఱయఁగా = నిండుగా, మఱపింపన్, రామలక్ష్మణుల పాటువలని దుఃఖమును బూర్ణముగా మఱపింపనని భావము; పునర్మహాజివిక్రాంతికిన్ = మరల గొప్పయుద్ధముకొఱకయిన విక్రమణమునకు, ఉపక్రమించు = ప్రయత్నించునట్టి, విభున్ = రాముని, కాంచి, దినేశసుతాదులు = సుగ్రీవాదులు, ఉబ్బుచున్, చేరిరని ముందటి పద్యముతో నన్వయించును.

తా. గరుత్మంతుని రాకచే నాగపాశబంధములు వీడ రాముఁడు మరల యుద్ధమునకుఁ బ్రయత్నింప నట్టి రామునింగాంచి సుగ్రీవాదు లెంతయు సంతసించుచు;

భారత. అంతటన్, అద్భుతంబుకన్, రుట్ = రోషముయొక్క, ఆగమనంబు, నిరాకృత, అహిత = శత్రువులచే, అశ్యం తనమూర్జితమైన, ఊర్జిత జయాభ్యుదయంబయి, భీష్మపా = భీష్మునిపాటువలని, సంక్రాంతమైన, ఘనవ్యథన్, నెఱయఁగాన్, మఱపింపన్, భీష్మునిపాటువలని దుఃఖము తత్పూర్వజయమువలని సంతసము మఱపింపఁగాననిభావము; పునర్మహాజి విక్రాంతికిన్, ఉపక్రమించు, విభున్ = దుర్యోధనుని, కాంచి, దినేశసుతాదులు = కర్ణాదులు, ఉబ్బుచున్; ముందుపద్యముతో నన్వయము ;

తా. రోషముచే దుర్యోధనసేనలు జయమునుబొందుచుండ భీష్ముని పాటువలని దుఃఖము తత్పూర్వజయమును మఱపింపఁగా, దుర్యోధనుఁడు మరలయుద్ధమున కుపక్రమింపం గాంచి కర్ణాదు లుబ్బుచును;

"రుట్;" "ప్రతిఘారుటుక్రీ ధౌ స్త్రియాం." అమరము ;

వ. చేరి పొడఁగాంచి ప్రస్తుత సమరసన్నాహ సముచిత ప్రకారంబున సంభ్రమించి రంత నరుణోదయం బగుటయు 134

సుగమము.

క. గురురక్షోర్జితదర్ప
స్ఫురణముచే శత్రుసైన్యములు మార్కొనఁజె
చ్చెరవైవస్వత సంతతి
నరవరుఁ డొగి నద్దుర మొనర్చెసబలుఁడై. 135

రామాయణ భారతార్థములు సమము.

అర్థము. గురురక్షోర్జిత దర్పస్ఫురణముచేన్ = [రామా. గొప్పదగు రాక్షసునిచే సంపాదింపఁబడిన గర్వస్ఫురణమున, భారత. ద్రోణునిరక్షచే సంపాదింపఁబడిన గర్వస్ఫురణముచే] సైన్యములు, మార్కొనన్ = ఎదిరింపఁగా, చెచ్చెరన్, వైవస్వతసంతతినరవరుఁడు = [రామా. సూర్య వంశమున జనించిన రాముఁడు, భార. యమసుతుఁడగు ధర్మరాజు] ఒగిన్, సబలుఁడై = సేనతోఁ గూడినవాఁడై, అద్దుర మొనర్చెన్ = ఆ యుద్ధము చేసెను;

తాత్పర్యము సుగమము.

వ. అప్పుడు. 136

క. అత్యంతము నవనిసుతా
పత్యతను బలంబులోనఁ బసమీఱిమహా
దైత్యుఁ డనఁబరఁగు శూర
స్తుత్యుఁ డసమరోషవికృతి ధూమ్రాక్షుఁడనిన్. 137

రామాయణ. అత్యంతము, అవనిసుతాపతి = రాముఁడు, అతను బలంబులోనన్ = తగ్గనిబలమున, పస = సారము, మీఱి, మహాదైత్యుఁడ నంబరఁగు, శూరస్తుత్యుఁడు = శూరులచేఁ బొగడఁబడువాఁడు, అసమ రోషవికృతి = సాటిలేని రోషవికారముగల, ధూమ్రాక్షుఁడు = ధూమ్రాక్షుఁడనువాఁడు, అనిన్ = యుద్ధమున ; ముందుపద్యములో నన్వయించును

తా. రాముఁడును, బలాధికుఁడని ప్రఖ్యాతిఁజెంది, వీరలోక శ్లాఘ్యమానుఁడగు ధూమ్రాక్షుఁడును యుద్ధరంగమున;

**భారత.** అత్యంతము, అవనిసుతాపత్యతను = భూపుత్రుఁడగు నరకుని కుమారుఁడగుటచే, బలంబులోనన్ = శక్తిని, పసమీఱి, మహాదైత్యుండనంబరఁగు, శూరస్తుత్యుండు = వీరులస్తోత్రపాత్రుఁడగు భగదత్తుఁడు, అసమకోపవికృతిన్ = సాటిలేనికోపవికారమున, ధూమ్రమఅక్షుఁడు = ఎఱ్ఱవారినకన్నులు గలవాఁడగుచు, అనిన్. ముందన్వయము గలదు.

తా. నరకపుత్రుఁడగు భగదత్తుఁడు సాటిలేనికోపమున నెఱ్ఱవారినకన్నులుగలవాఁడయి యుద్ధమున; "అపత్యం" నపతత్యనేననరకమిత్యపత్యం పత్ ఇగతా." గురుబాలప్రబోధిక.

తే. దళితహరికుంజర శతాంగకములధరిత్రిఁ
గప్పుచు యథామనోరథగతిఁజరించె
నవనిజారూఢ మదవారణక్రియలకు
నిలువలేక పార్థబలయోధులు దొలంగ. 138

**రామాయణ.** దళిత = చీల్పఁబడిన, హరికుంజర = వానరశ్రేష్ఠుల శతాంగములన్ = పెక్కువయవములచే, ధరిత్రిన్, కప్పుచు, యథామనోరథగతిన్ = మనస్సునను సరించిన రథగమనముచే, నవ నిజ ఆరూఢ మద వారణక్రియలకున్ = నూతనమగు దనయొక్క స్థిరమైన మదము నడగించు కార్యములకు, నిలువలేక, అపార్థబల = వ్యర్థమైనబలముగల, యోధులు, తొలంగన్, చరించెన్ = విహరించెను.

తా. తనచేఁ జీల్పఁబడిన వానరులయంగములచే భూమిని గప్పుచుండ నతని యౌద్ధత్యమునకు వానరులు నిలువలేక పాఱిరి.

**భారత.** దళితహరి = గుఱ్ఱములచేతను, కుంజర = ఏనుఁగులచేతను శతాంగములన్ = రథములచేతను, ధరిత్రిన్, కప్పుచు, నవ, నిజా

రూఢ = తానెక్కిన, మదవారణ = సుప్రతీకమనెడి మదగజముయొక్క,
క్రియలకున్ = కార్యములకు, నిలువలేక, పార్థబలయోధులు = ధర్మజుని
సైన్యములోని వీరలు, తొలంగన్, యథామనోరథగతిన్ = యథేచ్ఛగా,
చరించెన్.

తా. శత్రువుల చతురంగబలములం జీల్చి భూమింగప్పుచుఁ దా
నెక్కిన యేనుఁగుయొక్క కార్యములకు ధర్మజసైనికులు నిలువలేక వెను
దిరిగి పాఱునట్లు భగదత్తుఁడు యుద్ధమొనర్చెను. "నవనిజారూఢమదవార
ణక్రియలకు" నను స్థలమున నణలకుయతి గల్గుట కభేదవిరతి యగును.
"వేదమునవబయో రభేదయునుట,వలన వబలొక్కటొక్కటి నిలుమవిరతి,
కవనిబవలకు లశలకు నట్లు కలిమిఁ, జేసి తమలోన నివియును జెల్లుచుండు"
అప్పకవీయము.

వ. అంత నంతయుం గనుంగొని. 139

క. తమకమున మరుద్వరసుతుఁ
డమితవ్యథఁజెదరు నిజబలాళిమగుడ దు
ర్గమరణజయశోభగద
త్తమహాశుండాలమునకుఁ దానెదిరించెన్. 140

రామాయణ భారతార్థములు సమము.

అర్థము. తమకమునన్ = తమిచే, మరుద్వరసుతుఁడు = [రామా
యణ] వాయునందనుఁడగు హనుమంతుఁడు, [భారత] దేవరాజగు నింద్రుని
కుమారుఁడగు నర్జునుఁడు, అమితవ్యథన్, చెదరు, నిజబలాళిన్,మగుడన్ =
మరలునట్లుగా, దుర్గమరణవిజయశోభగదత్తమహాశుండాలమునకున్ =
[రామాయణ]అణఁప శక్యముగాని యుద్ధమునందలి జయశోభ యగునట్లుగా
నీఁబడిన యాశయముగలవాఁడగుచు రణమునకు, [భారత] అణఁపశక్యముగా

యుద్ధమువలనఁ గల్గిన జయశోభగల భగదత్తుని గొప్ప యేనుఁగునకు, తాన్, ఎదిరించెన్.

తాత్పర్యము సుగమము.

"మరుద్వరసుతుఁడు;" "మరుతాపసనామదా," అమరము. ఆల మున కెదిరించెనని సప్తమ్యర్థమున షష్ఠియు, శుండాలమునకని తృతీయార్థ మున షష్ఠియుఁ గల్గుటకు; షష్ఠీస్థానికమగు కువర్ణకము ద్వితీయాదివిభక్తుల యందగుటయే కారణము.

తే. తొలఁగ కెడసొచ్చు మానవాశిదులసుశర్మ
యోధులను బాఱఁదోలి యిట్లురుభుజావి
భూతి నెదిరించు నా కపికేతను నతఁ
డాజి నొప్పించి మడసె వాహనముతోడ. 141

**రామాయణ.** తొలఁగక, ఎడసొచ్చు = నడుమసఁబడునట్టి, మాన వాదులన్ = రాక్షసులను, సుశర్మయోధులను = సుఖముగా యుద్ధము చేయువారిని, పాఱన్ తోలి = తఱిమి, ఇట్లు, ఉరుభుజావిభూతిన్ = గొప్పభుజబలైశ్వర్యముచే, ఎదిరించు, ఆ కపికే = ఆ హనుమంతునకే, అతఁడు = ఆ ధూమ్రాక్షుఁడు, తనున్, ఆజిన్, ఒప్పించి, వాహనము తోడన్, మడిసెన్ = మరణించెను.

తా. రాక్షసులఁ బాఱఁదఱుము నా హనుమంతునకే యా ధూమ్రా క్షుఁడు తన్నప్పగించి యుద్ధమున నిజవాహనముతోడ మరణించెను.

**భారత.** తొలఁగక, ఎడసొచ్చు, మానవాసులన్ = తమపౌరుష ము నుద్ఘాటించువారిని, సుశర్మయొక్క, యోధులను, పాఱన్, తోలి, ఇట్లు ఉరుభుజావిభూతిన్, ఎదిరించు, ఆ కపికేతనున్ = ఆ యర్జునుని,

అతఁడు = ఆ భగదత్తుఁడు, ఆజిన్, నొప్పించి, వాహనముతోడన్ = తన సుప్రతీకమను గజముతో, మడిసెన్ = మరణించెను.

తా. నడుమవచ్చి పోఁబట్టి సుశర్మాదులఁ బాఱఁద్రోలి తన్నెదిర్చిన భగదత్తుని నర్జునుఁడు వాహనముతోడఁ గూల్చెను.

వ. మఱియును. 142

క. బహు రక్షోభయసేనలు
విహితాజిని ద్రెళ్ళ నంత విలసిల్లె జగ
న్మహితాహవరుచి రక్షి
ప్రహస్త కోదండ గురుతరస్ఫూర్తిగడున్. 143

రామాయణ భారతార్థములు సమము.

అర్థము. బహురక్షోభయసేనలు [రామాయణ] పెక్కురాక్షసుల భయరహితమైన సేనలు, [భారత] పలురక్షలుగల యుభయసేనలు, విహితమైన, ఆజిని, త్రెళ్ళన్ = కూలఁగా, అంతన్, జగన్మహిత..... స్ఫూర్తి = [రామాయణ] జగన్మహిత = జగత్ప్రసిద్ధమైన, ఆహవరుచి రక్షి = యుద్ధమునందలి రుచిని రక్షించెడి, ప్రహస్త = ప్రహస్తుని, కోదండముయొక్క, గురుతరమైన, స్ఫూర్తి = స్ఫురణము, [భారత] జగన్మహితమైన, ఆహవమునందు, రుధిరమగు, క్షి పహస్త = వేగవంతమగు హస్తమునుం గల, కోదండగురు = ద్రోణుని, తర = బలిమియొక్క, స్ఫూర్తి, కడున్, విలసిల్లెన్.

తాత్పర్యము సుగమము.

సీ. ఆమేటి తనదుసైన్యమును పద్మవ్యూహ
భంగిఁజూపట్టంగఁ బన్నిహాతి క
రప్రహార ప్రవర్తనముచేఁ జీకాకు
పఱచుచుఁ గడుఁజొచ్చి నుఱిచియాడు

వీరకుంజరు జగద్వినుతవిక్రము ధనం
జయతనూజు సుభద్రసంతతి నవ
రోధించి బహుమహాయోధన వ్యాపార
శూరతప్రాపుగాఁ బోరిపోరి

తే. గెలువనోపక మిక్కిలి నలఁగి యంత
నతని ధర్మవిహీనయుద్ధాతిశయము
చేతఁ జంపించెఁదనుఁ దన సేనవారిఁ,
గాచుకొన నొండుమార్గంబు గాన లేక. 144

**రామాయణ.** తనదు సైన్యమును, పద్మవ్యూహభంగిన్ = తామరల గుమివలె, చూపట్టంగన్, పన్నిహాతి = కాలితాఁపుల యొక్కయు, కరప్రహార = చేతుల చఱపులయొక్కయు, ప్రవర్తనలచేన్, చీకాకుపఱచుచున్, కడున్ చొచ్చి = (సేనలో) మిక్కుటముగాఁ బ్రవేశించి, నుఱిచియాడు = నురుమాడునట్టి, వీరకుంజరున్ = వీరశ్రేష్ఠుని, జగద్విదితమైన, విక్రమున్ = పరాక్రమముగలవానిని, ధనంజయతనూజున్ = అగ్నిసుతుఁడైననీలుని, సుభద్రసంతతిన్ = లెస్సయగు శుభసముదాయములు గలవానిని, ఆమేటి = ఆప్రహస్తుఁడు, అవరోధించి = అడ్డగించి, బహు = అనేకములగు, మహాత్ = గొప్పదగు, ఆయోధనవ్యాపార = యుద్ధవ్యాపారములయందలి, శూరత = శౌర్యము, ప్రాపుగాన్ = సహాయముకాఁగ, పోరిపోరి, గెలువనోపక, మిక్కిలి, నలఁగి, అంతన్, అతని = ఆ నీలుని, ధర్మవిహీన = విల్లులేని, యుద్ధాతిశయముచేతన్, కాచుకొనన్ = రక్షించుకొనుటకు, ఒండుమార్గంబు = ఇతరమార్గము, కానలేక, తనున్, తన సేనవారిన్ = తన సైన్యములోనివారిని, చంపించెన్, ఆ నీలునివలనఁ దప్పుటకు వేఱుమార్గముగానక తానును దన సేనలోనివారుగూడఁ జచ్చిరని భావము.

తా. ప్రహస్తునిసైన్యము తామరల సమూహమువలెఁ గన్పట్టఁగ నీలుఁడువీరకుంజరుఁ డగుటచే దానినుఱుమాడుచుండ నాతనిబారినుండి తప్పఁజాలక తానుం దననేరోడ మడిసెను.

భారత. ఆ మేటి = ఆ ద్రోణాచార్యుఁడు, తనదు సైన్యమును, పద్మవ్యూహభంగిన్ = పద్మవ్యూహమువలె, చూపట్టంగన్ = కాన్పించునట్లు, పన్ని, హతికర = నాశకరమైన, ప్రహారప్రవర్తనలచే, చీకాకుపఱుచుచున్, కడున్, సొచ్చి = ఆ పద్మవ్యూహమునం బ్రవేశించి, నుఱుచియాడు, వీరకుంజరున్, జగద్విదితవిక్రమున్, ధనంజయతనూజున్ = అర్జునపుత్రుని, సుభద్రసంతతిన్ = సుభద్రాతనూజుఁడగు నభిమన్యుని, అవరోధించి, బహు = పెక్కురగు, మహాయోధవ్యాపార = గొప్ప వీరుల కృత్యమగు, శూరత = శౌర్యము, ప్రాపుగాన్ = సహాయముకాఁగ, పోరిపోరి, గెలువన్, ఓపక, మిక్కిలిన్, అలఁగి, అంతన్, ధర్మవిహీన యుద్ధాతిశయముచేతన్ అధర్మయుద్ధమునందలి యతిశయముచే, తన్నున్ = ద్రోణుని, తనసేనవారిన్, కాచుకొనన్, ఒండుమార్గంబు, కానలేక, అతనిన్ = ఆ యభిమన్యుని, చంపించెన్.

తా. ఆ ద్రోణుఁడు తనసైన్యమును పద్మవ్యూహముగాఁ బన్ని యుండ నభిమన్యుఁడా వ్యూహమునం బ్రవేశించి యందలిశూరులను జీకాకుపఱచుచుండ నాతనితోఁ బోరిపోరి గెలువఁజాలక తన్నుందన సేనను గాపాడుకొన వేఱుమార్గములేక తుదకధర్మయుద్ధమున నాతనిం జంపించె.

సీ. అతిశౌర్యపర సుశర్మాకృష్టవిజయతఁ
జేసి నానాపార్థ సేనలపుడు
రౌద్ర వహోల్లాస రాజితు నతఁడయ
ధృతి సింధునాయకుఁ గదీవ్రవశ క్తి

నాకీశు దృఢరణోꠂత్సేకునిమించి తో
డ్పడలేక యెదుగనాꠂబలియుఁ డట్లు
త్రుంగెను విరథుఁడై ꠂతుదను దుశ్శాసన
తనుజగదాహతి ꠂ ననయముఁ బ్రతి
ఆ. కోటిలేనినాదు ꠂకొమరున కిప్పాటు
వలసె నకట! యిది యꠂవార్య మనుచు
వేఁగె వానిచావు ꠂవినియంత జిష్ణుండు
ఖండితారి పఙ్క్తిꠂకంధరుండు. 145

**రామాయణ.** అతిశౌర్యపర = మిక్కిలి పరాక్రమముగల శాత్రవులచే, వానరులచేననుట; సుశర్మ=మిక్కిలి సుఖముగల్గులాగున, ఆకృష్ట= ఆకర్షింపఁబడిన, విజయతన్ చేసి=జయముగలుగుటచే, నానా= పెక్కువిధములగు, అపార్థసేనలు = వ్యర్థమైన రాక్షససేనలు, అపుడు, రౌద్రవర ఉల్లాసముచేన్, ప్రకాశించువానిని, అక్షయధృతి సింధునాయకున్ = క్షీణింపని ధైర్యమున సముద్రముబోలువానిని, తీవ్రశక్తిన్, దృఢరణోత్సేకుని = దృఢమైనయుద్ధగర్వము గలవానిని, ఆకీశున్=ఆ వానరుని, నీలుననుట; మించి = మీఱి, తోడ్పడలేక = ప్రహస్తునకు సహాయపడలేక, ఒదుగన్= విచ్చిపోఁగా, ఆ బలియుఁడు = బలవంతుఁడగు నా ప్రహస్తుఁడు, విరథుఁడై = రథవిహీనుఁడై, అట్లు, త్రుంగెను=చచ్చెను, తుదను, దుశ్శాసనతను = శిక్షింపఁగానివాడగుటచేత, జగదాహతిన్ = జగత్సంహారమునందు, అనయమున్, ప్రతికోటిలేని = ఎదిరిమొనలేని, నాదు కొమరునకున్ = నాయొప్పిదమునకు, ఇప్పాటు = ఇట్టిభంగపాటు, వలసెన్ = అనుభవింపవలసెను, అకట, ఇది, అవార్యము, అనుచున్, వానిచావు = ఆప్రహస్తునిచావు, విని, అంతన్, జిష్ణుఁడు = జయశీలుఁడైన, ఖండితారి =

ఖండిత శాత్రవుఁడగు, పంక్తికంధరుండు = రావణుఁడు, వేఁగెన్ = పరితపించెను.

తా. రాక్షససేనలు వానరసేనలతో నెదిరినిలువఁజాలక పాఱిపోవఁగ విరథుఁడై ప్రహస్తుఁడు మరణించెను. రావణుఁ డిది తెలిసి ప్రతికోటి లేని తన యభివృద్ధి కిప్పుడిట్టి భంగపాటొదవెఁగదా యని దుఃఖించెను.

భారత. అతిశౌర్యపర, సుశర్మాకృష్ట = సుశర్మచే నాకర్షింపఁబడిన, విజయతన్ చేసి = అర్జునుఁడు గలవవుటచేత, నానాపార్థసేనలు = పలువిధములగు పాండవుల సేనలు, అపుడు, రౌద్రవరోల్లాసరాజితున్ = రుద్రసంబంధమైన వరమువలని సంతోషముచేఁ బ్రకాశించువాని, అక్షయధృతిన్, సింధునాయకున్ = సైంధవుని, తీవ్రశక్తిన్ = తీవ్రమైనశక్తిచే, నాకీశున్ = ఇంద్రునిం బోలువానిని, దృఢరణోత్సేకునిన్ = దృఢమయిన యుద్ధాతిశయము గలవానిని, మించి, తోడ్పడలేక, ఒదుగన్, ఆబలియుఁడు = ఆయభిమన్యుఁడు, అట్లు, విరథుఁడై, తుదను, దుశ్శాసనతనుజ = దుశ్శాసనుని కుమారుని, గదాహతిన్ = గదాప్రహారమువలన, త్రుంగెను, అనయమున్, ప్రతికోటిలేని, నాకొమరునకున్ = నాకుమారుఁడగు నభిమన్యునకున్, ఇట్టిపాటు = ఈలాటి మరణరూపపుఁబాటు, వలసెన్, అకట, ఇది, అవార్యము, అనుచున్, వానిచావువిని = ఆ యభిమన్యుని చావువిని, అంతన్, ఖండితమైన శత్రుపంక్తుల కంఠముగల, జిష్ణుండు, వేఁగెన్.

తా. అర్జునుఁడు సుశర్మతోఁ బోరుసల్పనేఁగఁగ నీశ్వరునివలన వరముపొందిన సైంధవునిమీఁది పాండవసేనలు పద్మవ్యూహములోనికిఁ జొరనేరకుండునప్పుడు దుశ్శాసన పుత్రుని గదాహతిచే నభిమన్యుఁడు మరణింప నిది తెలిసి యర్జునుఁడు ప్రతికోటిలేని నా కుమారునకా యిట్టిగతి కలిగెనని విలపించెను.

వ. ఇట్లు శోకసంతప్యమాన మానసుండగునతనిం గనుంగొని.

ఉ. ఊహ గలంగి యిట్లడర నూరక యేటికి నాహవక్రియా
సాహసవర్తనంబు తఱిఁ జావులుక్రొత్తలె చాలునిట్టి దు
ర్మోహమిఁకం ద్యజింపుము సముత్కటశోక విషాద హేతువై
దేహిఁ గరంబు గీడ్వఱచు దీనితగుల్మదినెంచిచూచినన్.

అవతారిక. పెద్దలైన యాప్తులు కొందఱిట్లనుచున్నారు. రామాయణ భారతార్థములు సమము.

అర్థము. ఊహ కలంగి = కలఁతపెంది, ఊరక, ఇట్లు అడర నేటికి = ఇట్లాప్పియుండ నేల, ఆహవక్రియా సాహసవర్తనంబుతఱిన్ = యుద్ధకార్యమునందలి సాహసముతో వర్తించునప్పుడు, చావులు క్రొత్తలె, ఇట్టి దుర్మోహము = ఇట్టి చెడ్డమోహము; చాలున్, [రామాయణ] సముత్కట దుఃఖ విషాదములకు, హేతువైన, వైదేహిన్ = సీతను, త్యజింపుము, దీని తగుల్ = దీనితోడి తగులము, తలంచి చూచినన్, కరంబు, కీడ్వఱచున్ = నైచ్యమునిచ్చును.

భారత. దీని తగుల్మదిన్, ఎంచి, చూచినన్, సముత్కట దుఃఖ విషాదహేతువై, దేహిన్ = శరీరిని, కడున్, కీడ్వఱచున్ (కావున) త్యజింపుము = ఈ పుత్రవ్యసనము వీడుము.

తాత్పర్యము సుగమము.

క. అని పెద్దలైన యాప్తులు
దనుఁదేర్పఁగ నుస్సురనుచుఁ దలయూచి మనం
బునఁ దత్తదహిత నృపవ
ర్తన చింతం గినుక బలిసి రాఁ దనలోనన్. 148

రామాయణ భారతార్థములు సమము.

అర్థము. అని, పెద్దలైన యాప్తులు, తిన్నక్ = [రామా. రావణుని, భార. అర్జునుని] తేర్పఁగన్, ఉస్సురనుచున్, తలయూఁచి, మనంబునన్, తత్తదహితనృపవర్తన చింతన్ = ఆయా శాత్రవరాజుల వర్తన చింతచే, కినుక, బలిసిరాన్ = అతిశయింపఁగా, తనలోనన్.

తాత్పర్యము సుగమము.

ఉత్సాహ. ఆదుకొన్న కావరమున ♦ నకట మనుజమాత్రుఁడీ
మేదినిపయి సింధురాజు ♦ మీఁటివచ్చి భీమసే
నాది బహు సహాయచయము ♦ నాఁగిచెఱచువాఁడెహా!
నాదుపట్టినట్టి చలము ♦ నన్గణింపఁ డేమియున్. 149

రామాయణ. ఆదుకొన్న కావరమునన్ = తన్నాశ్రయించిన గర్వముచే, అకట, మనుజమాత్రుఁడు = సామాన్యమనుజుఁడగు నీరాముఁడు ఈ మేదినిపయిన్, సింధురాజున్ = సముద్రమును, మీఁటివచ్చి = దాఁటివచ్చి, భీమ = భయంకరమైన, సేనాదిబహుసహాయ చయమున్, ఆఁగి = ఆపి, చెఱచువాఁడె, హా, నాదుపట్టినట్టిచలమున్, నన్, ఏమియున్ = ఎంతయును, గణింపఁడు.

తా. మానవ మాత్రుఁడగు రాముఁడు గర్వముచే నీ సముద్రము దాఁటివచ్చి నా సేనలం జెఱచుచున్నాఁడుగా, నాపట్టిన చలముగాని నన్నుగాని నేమియు గణింపఁడు.

భారత. ఆదుకొన్న కావరమునన్, ఈ మేదినిపయిన్, అకట, మనుజమాత్రుఁడు, సింధురాజు = సైంధవుఁడు, మీఁటివచ్చి, భీమసేనాది బహు సహాయచయమున్ = భీమసేనుఁడు మున్నగు పెక్కు సహాయ సమూహమును, ఆఁగి = అడ్డుపెట్టి, నాపట్టిన్ = నాకుమారుని, చెఱచువాఁడె, అట్టిచలమున్, నన్, ఏమియున్, గణింపఁడు.

తా. మానవ మాత్రుఁడగు సైంధవుఁడు గర్వముచే భీమసేనాది బలములనాఁగి నా కుమారునిం జెఱుచువాఁడే, నాద్వేషముగాని నన్నుగాని గణింపఁడు.

ఉత్సాహ వృత్తలక్షణము. "సాహచర్యమమర సప్తసవితృవర్గమును సను, త్సాహమొక్క నొక్కగురుఁడు చరణములు భజింపఁగా, నీహితప్రచారలీల లెసగు కమఠమూర్తిను, త్సాహరీతులుల్లసిల్ల సంస్తుతింతురచ్యుతున్" అనంతుని ఛందము.

వ. అని యుగ్గడించి యందుల కేమి యన్నియుంజక్కనయ్యెడుమని రోషవేగంబున రోజుచు నందఱు విన నిట్లనియె 150

క. ధృతి నేన కూల్తు నరిసం
హతిఁబాఱఁగఁ దరిమితరిమి యాసింధుమహీ
పతితలసద్బలవత్సై
న్యతనూఖండములజంబుకాదులు దనియన్. 151

రామాయణ భారతార్థములు సమము.

అర్థము. ధృతిన్, నేన, అరిసంహతిన్ = శత్రుసమూహమును, పాఱఁగన్, తఱిమితఱిమి, [రామాయణ] ఆసింధుమహీ = సముద్రపర్యంతమైన భూమియందు, పతిత = పడిన, లసత్ = ఒప్పుచున్న, బలవత్ సైన్యతనూఖండములన్ = బలముగల్గినట్టి సేనలశరీరఖండములను, [భారత.] ఆసింధుమహాపతితలన్ = ఆసైంధవుని తలను, సత్ = మంచి, బలవత్ సైన్యతనూఖండములన్, జంబుకాదులు, తనియన్ = తృప్తిపడునాగున, కూల్తున్.

తాత్పర్యము సుగమము.

తే. వినుఁడు నాపంతమిదె నేఁడు వేదయుక్త
గతి నరిగి యానృపుని నేలఁగలుపువాఁడ

నలినమిత్రు నస్తమయంబుకెనకుమునుపుగ
భానుపుత్త్రాది తత్పక్షబలము దఱిమి. 152

**అవతారిక.** మఱియు రావణార్జునుల వాక్యములంజోడించి కవి యాడుచున్నాఁడు. రామాయణ భారతార్థములు సమము.

**అర్థము.** ఇదె, నాపంతమున్, వినుఁడు, నేఁడు, వేగయుక్తగతిన్ = వేగముతోఁగూడినగమనమున, అరిగి, [రామాయణ] నలిన్ = వేడ్కతోఁగా, అమిత్రునస్తమయంబునకు మునుపుగన్ = శత్రుఁడగు రాముని నాశమునకు మున్నుగా, [భారత] నలినమిత్రునస్తమయంబునకు మునుపుగన్ = సూర్యునస్తమయమునకు మున్నుగా, భానుపుత్త్రాది = [రామా. సుగ్రీవుఁడు మున్నగు, [భార. కర్ణుఁడుమున్నగు] తత్పక్షబలమున్ = ఆ పక్షపు సేనను, తఱిమి, ఆ నృపుని=[రామా. ఆరాముని, భార. ఆసైంధవుని] నేలన్, కలుపువాఁడన్.

**తా.** ఇదెనాపంతము, వినుఁడు. [రామాయణ] రాముని నాశమునకుమున్న సుగ్రీవాదులందఱిమి [భారత] సూర్యాస్తమయమునకు మున్న కర్ణుఁడు మున్నగువారిందఱిమి [రామాయణ] ఆరాముని, [భారత] ఆ సైంధవుని జంపువాఁడను.

"పక్షబలము;" "పక్షః పార్శ్వ గరుత్సాధ్య సహాయబల భిత్తిషు" విశ్వము.

తే. ఏఁగడఁగి యిట్లు గావింపకేనేని బెలుచఁ
జత్తు రుగ్రాజిభానురకజ్వాలనమునకు
శలభతవహించి యస్మాకసైన్యపతులు
విద్విషత్సైనికులు సముకద్వీక్షఁజూడ. 153

**రామాయణ భారతార్థములు సమము.**

వీఁకన్, కడఁగి = ప్రయత్నించి, ఇట్లు, కావింపనేరన్, [రామాయణ.] ఉగ్ర,ఆజి = యుద్ధమునందు, [భారత.] రుక్ = దీప్తులయొక్క, రాజి! = పంక్తులచే, భాసుర, జ్వలనమునకున్ = అగ్నికి, శలభతన్ = మిడుతవగమును, వహించి, అస్మాక = మాకు సంబంధించిన, సైన్యపతులు, విద్విషత్సైనికులు = శత్రుసేనలోని వారు. [రామాయణ] సముద్వీక్షన్ = సంతోషముతోఁ గూడిన చూపులతోఁ జూడఁగా, [భారత] సముద్వీక్షన్ = చూడన్ = తలలు పైకి నెత్తి చూడఁగా, [రామా. చత్తురు = మరణింతురు, భార. చత్తున్ = మరణింతును.]

తాత్పర్యము సుగమము.

వ. అనిపలికి, పలికినట్లు బెట్టిదంపు పెంపుసొంపు పొంపిరివోవ సన్నద్ధుండై యుద్ధయాత్రగావించి, యావీరకంఠీరవుం డకుంఠ విక్రమోత్సేకంబున ననేకయోజన విస్తారదారుణంబుగా బన్నిన పరబలవ్యూహంబునందు సాహసోల్లాసిత భాసిత శరాసన కళావిశేషంబున నీను నెఱపుచుం దెఱపిగొని రథంబు వఱపించియొఱపు వరపున నడ్డగించు పగఱయొడ్డు గడ్డుఱికి చించుకొని తనతోనచొచ్చు నిచ్చలంపు టెచ్చరిక చాలక యక్కడక్కడఁ దలపడి, వెలివెలినపోరు నిజ యోధవరులకు దూరదృశ్యమాన కేతనద్యోతనంబునఁ బ్రీతియొసంగుచు నిశాతనిజశరవ్రాత పాతంబుచేత భూతలంబున నవిరళంబుగా నొరగిన హరికుంజర శతాంగ శకలంబులచేత వికలత్వంబునొందక యమంద స్యందన ప్రచారంబు సారథ్యాశ్చర్య చర్యామహిమ మహనీయ హరినైపుణోద్దీపితాటోపంబై యేపు చూపం బ్రతాపంబు మెఱసి రణవిహరణ రణరణిక విజృంభణా

స్తంభ సంభ్రమ బంభ్రమ్యమాణ చండకోదండ కుండలీ
భావ వినాభావ సుభగంభావుక శరప్రయోగ వేగచాతు
ర్యాశ్చర్య దశభుజ యుగళ విగళితాగళిత జయదర్ప
విభవుండగుచు నభినవనరణి నురువడించె, అప్పుడప్పర
బలంబులందుఁ గొందఱు. 154

రామాయణ భారతార్థములు సమము.

అర్థము. అనిపలికి, పలికినట్లు, జెట్టిదంపు పెంపుసొంపు, పొంపిరి
వోవన్ = అతిశయింపఁగా. నన్నద్ధుండై, యుద్ధయాత్రగావించి=యుద్ధ
మునకై వెడలి, ఆవీరకంఠీరవుండు =[రామా. ఆవీరశ్రేష్ఠుఁడు, రావణుఁడు
భార. ఆవీరశ్రేష్ఠుఁడగు నర్జునుఁడు,] అకుంఠిత = తగ్గని, విక్రమోత్సే
కంబునన్ = శౌర్యగర్వముచే, అనేకయోజనవిస్తారంబుగాన్, పన్నిన,
పరబల వ్యూహంబునందున్ = శత్రుసేనావ్యూహమునందు, సాహసోల్లా
సముచే, భాసితమగు, శరాసనకళావిశేషంబునన్ = ధనుస్సాండి
త్యాతిశయంబున, ఈసు, నెఱపుచున్, తెఱపిగొని = ఎడఁగొని, రథం
బువఱపించి = తేరుదోలించి, ఒఱప్రవరపునన్ = శౌర్యాతిశయమున,
అడ్డగించు పగఱయొక్క, ఒడ్డుగడ్డుతికి = వ్యూహమునకు మిక్కిలిగా
దూఱి, చించుకొని = ఛేదించుకొని, తనతోన, చొచ్చు, నిచ్చలంపు
టెచ్చరికచాలక = నిశ్చలమయిన హెచ్చరిక చాలక, అక్కడక్కడన్,
తలపడి, వెలివెలినపోరు = వ్యూహముఖముననే యుద్ధమొనర్చు, నిజయోధ
వరులకున్, దూరమున, దృశ్యమాన=కన్పట్టునట్టి, కేతనద్యోతనంబునన్,
ప్రీతియొసంగుచున్, నిశాత = వాఁడియైన, నిజశర వ్రాతపాతంబుచేతన్,
ఘాతలంబునన్, అవిరళంబుగాన్ = దట్టముగా, ఒరగిన, హరికుంజర
శతాంగశకలంబులచేతన్ [రామా. వానరశ్రేష్ఠుల శకటాంగముల
ముక్కలచే, భార. గుఱ్ఱములయొక్కయు, ఏనుఁగులయొక్కయు,

రథములయొక్కయు శకలములచే,] వికలత్వంబు నొందక, అమందస్యందన ప్రచారంబుయొక్క, సారధ్యాశ్చర్యచర్యా = [రామా. సార = శ్రేష్ఠమైన, ధీ = బుద్ధికి, ఆశ్చర్యమైన, చర్యా = గతియొక్క, భార. సారథియొక్క, ఆశ్చర్యమైన, చర్యయొక్క] మహిమచే, మహనీయ, హరి = [రామా. గుఱ్ఱములయొక్క, భార = కృష్ణునియొక్క] నైపుణముచే, ఉద్దీపితమైన, ఆటోపంబై = [రామా. సంభ్రమముగలదై, భార. వేగిరపాటుగలదై] ఏపు చూపక, ప్రతాపంబు మెఱసి, రణవిహరణము నందలి రణరణిక = కాంక్షాతిశయముయొక్క, విజృంభణముతోడి, అస్తంభసంభ్రమ = మ్రాన్పాటులేని సంభ్రమణముచే, బంభ్రమ్యమాణ = తిరుగుడు వడుచుండు, చండకోదండము యొక్కయు, కుండలీభావ = గుడుసువడుటయొక్కయు, వినాభావముయొక్కయు, సుభగంభావుకశరప్రయోగ = మనోజ్ఞతతోడి భవికతగల్గిన బాణ ప్రయోగముయొక్క, వేగము, చాతుర్యము, నాశ్చర్యమునుగల, దశభుజయుగళ [రామా. ఇరువదిచేతులచేత, భార. స్థితితోడి భుజయుగ్మముచే] విగళిత=వదలఁబడిన, అగళిత జయదర్ప విభవుండగుచుం = తొలఁగని జయమువలని గర్వవైభవము గలవాఁడగుచు, అభినవమైన, సరణిం = పద్ధతిని, ఉరువడించెం = నెఱవేర్చెను, అప్పుడు, అప్పరబలంబులయందుం, కొందఱు.

తాత్పర్యము సుగమము.

క. వేమఱు మనగురుర్వశ్వ
త్థామలకీ ఘోరవీర కేతరుబాణకదం
బామితవర్షము దుస్తర
మై మెఱసెఁ దదప్రభేద్యుఁడయ్యె నితండున్. 155

రామాయణ. వేమఱుం, మన = మనయొక్క, గురు=శ్రేష్ఠమైన అశ్వత్థ = రావియొక్క, అమలక = ఉసిరికయొక్క, ఘోరమైన, వీర

తరు = మద్దియొక్క, బాణ = గోరంటయొక్క, కదంబ=కడిమియొక్క అమితవర్షము, అమితమగు నీ వృక్షవర్షమనుట ; దుస్తరమై, మెఱసెన్ ; ఇతండున్ = ఈరావణుఁడును, తత్ = అవృక్షవర్షముచేత, అప్రభే ద్యుఁడయ్యెన్.

తా. పెక్కువిధములగు వృక్షములంగొని వర్షించినను నీ రావణుఁ డభేద్యుఁడయ్యెను.

"ఆమలకీ;" " తిష్యఫలా త్వామలకీ త్రిషు. " "వీరతరు;" "నదీ సర్జో వీరతరు రింద్రద్రుః కకుభోర్జునః." "బాణ;" " నీలీఝుంటీర్ద్వయోా ర్బాణ" "కదంబ;" " నీపప్రియక కదంబాస్తు హలిప్రియే. " అని యమరము.

"ఆమలకీ" అనుశబ్దమున 'ఆ' యనెడి యుపసర్గముండుటచే యతి స్థానమునకు, తకారమే చెల్లును. ఇది ప్రాదియతి. "ధాత్రిఁ బ్రాదియోాగ మాత్రంబు గలిగినను భయమును వచింప నొనరుయతికి, సాతిరిక్తభక్తి శక్రసేవిత కమ, లాలయానివాస లక్ష్యమిదియె." కవిలోకచింతామణి. ఇందుకుసోమయాజిప్రయోాగము; "భద్రాయుతమూర్తియై హరిహ, రంబ గురూపము దాల్చి;" అనియుండుటచే నిది యుభయవళిలోఁ జేరును.

భారత. మమతున్, మన, గుర్వశ్వత్థామలకున్ = ద్రోణాశ్వత్థా మలకు, ఈఘోర, వీరతరు = వీరశ్రేష్ఠుఁడైన యర్జునుని, బాణ, కదంబ = సమూహములయొక్క, అమితవర్షము, దుస్తరమై, మెఱసెను ఇతండున్, తత్ = వారిచే, అప్రభేద్యుఁడయ్యెన్.

తా. మన ద్రోణాశ్వత్థామలకే భీకరుఁడగు నీయర్జునుని బాణ వర్షము దుస్తరమయ్యెను. ఈ యర్జునుఁడు వారిచే నప్రభేద్యుఁడయ్యెను.

వ. అని పలుకుచుండ. 156

తే. కొండలతిరయప్రేరిత స్యందనాశ్వ
కర్ణముఖ్యోగ్రతరులమో ఘతకుఁ దలఁకఁ
గొండలు మననృపాలుని గురుకృపకృత
వర్మ ధర్మ వర్తనగాచు వగవ మనఁగ. 157

రామాయణ. కొండలు, అతిరయ, ప్రేరిత = ప్రయోగించిన, స్యందన = నెమ్మిచెట్లు, అశ్వకర్ణ = మద్దియు, ముఖ్య = మొదలగు, తరుల = చెట్లయొక్క, మోఘతకున్ = వ్యర్థతకు, తలఁకన్ = చలింపఁగా, కొండలు, మననృపాలుని = మనరాముని, గురుకృప = గొప్పదయ, కృత = చేయఁబడిన, వర్మధర్మవర్తన = కవచముయొక్క ప్రకారముగల వృత్తిగలదై, ఇది కృపకు విశేషణము; కాచును, వగవము అనఁగన్.

తా. రావణుని పెక్కువృక్షములం బ్రయోగించి యవి వ్యర్థములు గాఁగ భయపడుచుండ, గొండలు రాముని దయ మనక భేద్యకవచమగును గాన వగవనేల యనుచుండఁగా;

"స్యందన;" "తినిశే స్యందనో నేమిః." అమరము.

"అశ్వకర్ణ" "సాలేయసర్జ కార్శ్యాశ్వకర్ణ కాః;" అమరము.

భాగవత. కొండలు, అతిరయప్రేరిత, స్యందనాశ్వ = రథములు గుఱ్ఱములుగల, కర్ణముఖ్య = కర్ణుఁడుమున్నగు, ఉగ్రతరుల = మిక్కిలి క్రూరులగువారల, మోఘతకున్ = వ్యర్థులగుటకు, తలఁకన్, కొండలు, మన, నృపాలుని = దుర్యోధనుని, గురు = ద్రోణుని, కృప = కృపాచార్యుని, కృతవర్మ = కృతవర్మయొక్కయు, ధర్మవర్తన = ధనుర్వ్యాపారము, కాచున్, వగవము, అనఁగన్.

తా. కొండలు కర్ణాదులోడుటకుఁ దలఁకుచుండఁ, గొండలు ద్రోణాదుల ధనుష్పాండిత్యముండ మనకు వగవనేల యనుచుండఁగా.

తే. కొంద ఱినతనూజాదులక్రొ క్రోవిలోనఁ
బ్రాణములుగల్గఁ దెలియుండి ప్రబతి కెదనున
నీలగజముఖ్యబలమదె నిగుడిపొదివె
శాత్రవుని నంచుఁ గొందఱు సంతసిలఁగ. 158

**రామాయణ భారతార్థములు సమము.**

**అర్థము.** కొందఱు, ఇనతనూజాముల క్రోవిలోనన్ = [రామా. సుగ్రీవాదుల మార్గమున, భార. కర్ణాదులమార్గమున] ప్రాణములు, కల్గన్, తెలియుండి, బ్రబికెదము, అనన్, కొందఱు, నీలగజముఖ్య = [రామా. నీలుఁడు, గజుఁడుమున్నగు, భార. నల్లనైన యేనుఁగులుమున్నగు,] బలము, అదె, నిగుడి = అతిశయించి, శాత్రవుని, పొదివెన్ = ఎదుర్కొనెను, అంచున్, సంతసిలఁగన్.

తాత్పర్యము సుగమము.

వ. మఱియు ననేకుల నేక ప్రకారంబులం దత్త్రణసమయసము దయ జయపరాజయప్రతీతివశంబునం బలుకుచుండ నతండు సర్వదుర్వార దోర్విలాస గర్వంబున నుల్లసిల్లుచు. 159

సుగమము.

వనమయూరము. సారనిజచాపగుణశబ్ద సమను ప్రవ
జ్యారసిక శూరతర సాత్యకిరణాగ్ర
క్రూరశరశాత్కృతిని రూప్యగమనుండై
చేరి యవికారధృతి సింధునృపుఁజూచెన్. 160

**రామాయణ.** సార = శ్రేష్ఠమైన, నిజ, చాపముయొక్క, గుణ = నారియొక్క, శబ్ద = ధ్వనిని, టంకారమునను టు; సమనుప్రవజ్యా = వెను కొనుటకు, రసిక = రుచిగల, శూరులయొక్క. తరస = మాంసముచేత

అతి, అకిరణ = కిరణ శూన్యములైన, అగ్ర = ములుకులు గలవియునైన, గాత్రవమాంసమున శరముల ముఖములు కప్పఁబడెనని భావము; క్రూరములైన, శరములవలనఁ గల్గిన, శాత్కృతిని = శత్రుధ్వనులచే, శరపాతము వలనఁ శబ్దముచేసెననుట; నిరూప్య=నిరూపింపఁదగిన, గమనుండై, చేరి, అవికార ధృతిసింధుఁ = మార్పులేని ధైర్యమున సముద్రము పోలువానిని, నృపుఁ = రాజైనరాముని, చూచెఁ.

తా. బాణపాతమువలనఁ గల్గినశత్రువుల చప్పుడుచే నెఱుఁగఁదగిన నిజగమనము గల రావణుఁడు సముద్రమువోలె గంభీరుఁడగు రాముం గాంచెను.

భారత. సారమైన, నిజచాపగుణముయొక్క, శబ్దమును, సమనుప్రజ్యా = వినుకొనుటకు, రసిక = సమర్థుఁడై, శూరతరుఁడగు, సాత్యకి యొక్క, రణాగ్ర = యుద్ధముఖమునందగుచుండు, క్రూరములగు, శరములయొక్క, శాత్కృతిచే, నిరూప్య గమనుండై = నిరూపింపఁదగిన సంచారము గలవాఁడయి, చేరి, అవికారధృతిఁ = మార్పులేని ధైర్యమున, సింధునృపుఁ = సైంధవుని, చూచెఁ.

తా. తన్ను వినఁకొనివచ్చు సాత్యకిని గలవాఁడయి యర్జునుఁడు సైంధవుం గాంచెను.

ఇట రామాయణార్థమున, "శూరతనస+అత్యకిరణ" యని స్వర యతియు, భారతార్థమున, "శూరతర×సాత్యకిరణ" యని వ్యంజనయతి యుఁ గలుగుటచేత, తదనుగుణముగఁ, బాదాదిని, "జ్యారసికత" యనీ కూర్పుటచే స్వరయతికి యకారమును, వ్యంజన యతికి సకారమునుగూడి సరిపడుచున్నది.



వ. అంత.

తే. తివిరిగురు కృతవర్మాది ♦ ధృతివిలసిత
విగ్రహస్ఫూర్తిఁ గడుమించి ♦ విజయసత్స
హాయతాలోలుఁడై వచ్చు ♦ నలఘుమన్యు
దశముఖుని భీము నర్కనం ♦ దనుఁడు దాఁకె. 162

రామాయణ. తివిరి = ప్రవర్తించి, గురు = అధికమగునట్లుగా, కృత = చేయఁబడిన, వర్మాదిధృతి = కవచాదిధారణముచే, విలసిత = ప్రకాశించుచున్న, విగ్రహ స్ఫూర్తిన్ = శరీరస్ఫూర్తిచే, కడున్, మించి, విజయ సత్సహాయతా = విజయమే మంచి సహాయముగాఁ గలవాఁడౌ టచే, అలోలుఁడై =అచలుఁడై, వచ్చు, అలఘుమన్యున్ =అధిక క్రోధముగల వానిని, భీమున్ = భయంకరుని, దశముఖుని = రావణుని, అర్కనంద నుఁడు = సుగ్రీవుఁడు, తాఁకెన్.

తా. దృఢమైన కవచాది సాధనములు గల్గి ప్రకాశించు జయ సహాయమున స్థిరుఁడై వచ్చు రావణుని సుగ్రీవుఁడు దాఁకెను.

భారత. తివిరి, గురు = ద్రోణాచార్యుఁడు, కృతవర్మ, ఆది = మున్నగాఁ గలవారి, ధృతి = ధైర్యముచే, విలసితమైన, విగ్రహ= యుద్ధము యొక్క, స్ఫూర్తిన్, కడున్ మించి = మిక్కిలి మీఱినవాఁడయి, విజయ సత్సహాయతా = అర్జునుని మంచి సహాయముగా నుండుటయందు, లోలుఁడై = ఆసక్తి గలవాఁడై, వచ్చు, అలఘుమన్యుదశ=అధిక కోపావస్థ గల, ముఖున్ = ముఖముగలఁ, భీమున్ = భీముని, అర్కనందనుఁడు = కర్ణుఁడు, తాఁకెన్.

తా. ద్రోణ కృతవర్మాదుల యుద్ధ స్ఫూర్తిని మీఱి యర్జున సహా యమునకై వచ్చు భీముని గర్ణుఁడు తాఁకెను.

**మ.** మిహిరప్రోద్భవుఁడిట్లు శాత్రవునిలక్ష్మిఁ గైకొనం బోవఁగా నుగ్రాచలా
గ్రహతం జేసి కడుంగలంచుటకు వీఁకం దాఁకి తద్ఘోరబా
ణహతిన్ సాధనహీనతం బొరసి ప్రాణత్యాగ పర్యంత దు
స్సహపీడన్భజియించెఁ బల్మఱు సుహృజ్జాలంబు జాలింబడన్.

**రామాయణ భారతార్థములు సమము.**

అర్థము. మిహిరప్రోద్భవుఁడు [రామా. సుగ్రీవుడు, భార=కర్ణుఁడు,] ఇట్లు, శాత్రవుని=[రామా. రావణుని భార. భీముని] లక్ష్మిని = విజయలక్ష్మిని, గైకొనఁ బోవఁగ, [రామాయణ] ఉగ్ర = క్రూరమైన, అచలాగ్ర = కొండ మొనచే, హతంజేసి = ధ్వంసముజేసి, [భారత] అచల = చలింపని, స్థిరమైన యనుట ; ఆగ్రహతంజేసి = కోపము గల్గుటచే, కడున్, కలంచుటకున్, వీఁకన్ = గర్వముతో, తాఁకి, తత్ = వానియొక్క, [రామా. రావణునియొక్క, భార. భీమునియొక్క ] బాణహతిన్, సాధనహీనతన్ = యుద్ధ పరికర హీనతను, పొరసి=కలిగి, పల్మఱున్, సుహృజ్జాలంబు, జాలిన్, పడన్, ప్రాణత్యాగ పర్యంత దుస్సహ పీడన్ = ప్రాణత్యాగ పర్యంతమగు నోర్వరాని బాధను, భజియించెన్.

తాత్పర్య సుగమము.

"సుహృత్ ;" అను స్థలమున హృదయ శబ్దమునకు సుహృద్భావము నిపాతమగుటకు ; "సుహృద్దుర్హృదౌ మిత్రామిత్రయోః" పాణిని.

వ. అంత. 164

**తే.** వాయుసూనుండు ధృతకరవాలహస్త
విహృతి చాతురిఁ బ్రతివీరువిశిఖవృష్టి
దోలఁగఁ జేయుచు సాహసంబలర నతని
యరదమునకు లంఘించి శౌర్యంబు మెఱయ. 165

**రామాయణ భారతార్థములు సమము.**

అర్థము. వాయుసూనుండు = [రామా. హనుమంతుఁడు భార. భీముఁడు,] [రామాయణ.] ధృత = ధరింపఁబడిన, కర = చేతులయొక్క యు, వాలహస్త = తోఁకయొక్క యు, [భారత] ధృతమైన, కరవాల = ఖడ్గముగల, హస్త = చేతియొక్క, విహృతి చాతురిన్ = విహారచాతుర్యముచే, ప్రతివీరు = ఎదిరియొక్క [రామా. రావణునియొక్క, భార.కర్ణుని యొక్క, విశిఖవృష్టిన్ = బాణవర్షమును, తొలఁగఁజేయుచున్, సాహసంబు, అలరన్, అతని = [రామా. రావణుని, భార. కర్ణుని,] అరదమునకు లంఘించి = రథముపైఁ దూఁకి, శౌర్యంబు, మెఱయన్ ; ముందు పద్యము నందలి వీలు వఱచెనను క్రియతో నన్వయించును.

తాత్పర్యము సుగమము.

"వాలహస్త;" వాలహస్తస్తువా లధిః ; " అమరము.

"కరవాల ;" "కరవాలః కృపాణవత్ ;" అమరము.

క. అహితుని నాశ్చర్యకర
ప్రహరణవిధిఁ జాలడీలు ౯ వఱిచె నతండున్
రహిఁ దిసుగఁ దెచ్చుకొని వి
గ్రహచేష్ట లడంగ నొంచెఁ ౯ గరువలిపట్టిన్. 166

**రామాయణ భారతార్థములు సమము.**

అర్థము. అహితునిన్ = [రామా. శత్రువైన రావణుని, భార. కర్ణుని] ఆశ్చర్యకర ప్రహరణవిధిన్ = [రామా. ఆశ్చర్యమైన కరములయొక్క, చఱపులచే, భార. ఆశ్చర్యమైన చేతియందలి యాయుధ వ్యాపారముచే] చాలన్, డీలువఱిచెన్ = కలఁతనొందించెను, అతండున్ = [రామా.రావణుఁడు, భార. కర్ణుఁడు,] రహిన్ తిసుగఁ దెచ్చుకొని =

తిరుగఁ దెల్వి దెచ్చుకొని, కరువలిపట్టిక్ = [రామా-హనుమంతుని, భార. భీముని] విగ్రహ చేష్టలు = శరీర చేష్టలు, అడఁగక్, నొంచెన్.

తాత్పర్యము సుగమము.

క. నొంచి తదవసర జాతా
చంచల ఘన మన్యువహ్ని సంతతి దనుఁగా
రించుచు నపుడెంతయు నల
యించు మహాశత్రుభీము నిట్లని పలికెన్. 167

రామాయణ. నొంచి, తత్ అవసరజాత = ఆ సమయమునఁ గల్గిన, అచంచల ఘనమన్యుక్ = స్థిరమైన గొప్పకోపము గల వానిని, తనుక్ = తన్ను, రావణు నట; కారించుచుక్ = కష్టపఱచుచు, అపుడు, ఎంతయుక్, అలయించు = అలసట పొందించు, మహాశత్రు భీముక్ = గొప్పశత్రువులకు భయంకరుఁడగు, వహ్ని సంతతికిక్ = అగ్నిపుత్రుఁడగు, నీలుని ఇట్లని పలికెను.

తాత్పర్యము సుగమము.

భారత. నొంచి, తదవసరజాత, అంచలమైన, ఘన, మన్యువహ్ని = కోపాగ్నియొక్క, సంతతక్ = సమూహముచే, తనుక్ = శరీరమును, కారించుచుక్, అపుడు, ఎంతయుక్, అలయించు, మహాశత్రుక్ = భీముని, ఇట్లని పలికెను.

తాత్పర్యము సుగమము.

క. కానలఁ గాయలుఁ బండ్లు న
నూనముగా మెసఁగి బ్రదుక కోరినీలా
వానరునకు నీకనుగుణ
మైనను మద్బలము నోరయ నర్హంబగునే? 168

**రామాయణ.** ఓరీ, నీలా, కానలన్ = అడవులయందు, కాయలున్ పండ్లున్, అనూనముగాన్ = తగ్గనట్లు, మెసఁగి = తిని, బ్రదుకక, వానరునకున్ = కోఁతియైన నీకును, గుఱిగా = యుద్ధవీరుని గుఱిగల్గి, ననున్, మద్బలమున్, ఒరయన్ అర్హంబగునే = చెనకఁ దగునా?

తా. అడవులలోఁ గాయలు పండ్లును దినుచు బ్రదుకక వానరుఁడవగు నీకు నన్నును నా బలమును జెనకఁ దగునా?

**భారత.** ఓరీ, కానలన్, కాయలన్, పండ్లున్, అనూనముగా, మెసఁగి, బ్రదుకక, మరల నరణ్యమున వసించి జీవింపక యనుట; నీ లావు = నీ బలము, ఆనరునకున్ = ఆ యర్జునునకున్, నీకును, గుఱి యైనను = గుఱిపడి యుండినను, మద్బలము నొరయన్, అర్హంబగునే?

తా. మరల నరణ్యవాసముచేసి బ్రదుకక నీకును నా యర్జునునకును నీ బలము గుఱిసైచెల్లినను నా బలముం జెనకనగుదా?

చ. ఒరయుటకు న్బలంబుదగఁగొంచితిపొమ్మని యమ్మహాభుజుం
బరుసపుమాటలన్దహనకబాణహతిన్హృదయంబుచాలనొం
చి రహితచేష్టుఁజేసి విడిచెన్ నికటంబున నయ్యెడన్ రిపు
స్ఫురణకృశానుజక్రియలుగనూచుచురామునితమ్ముఁడెంతయున్

**రామాయణ.** ఒరయుటకున్, ఫలంబు, తగన్, ఒందితి = పొందితివి, పొమ్ము, అని = మరణింపుమని, అమ్మహాభుజున్ = నీలుని, పరుసపుమాటలన్ = పరుషోక్తుల చేతను, దహన బాణహతిన్ = ఆగ్నేయాస్త్రమునం గొట్టుటచేతను, హృదయంబు = ఱొమ్ము, చాలన్, నొంచి, రహితచేష్టున్ = చేష్టలుడిగినవానిఁగా, చేసి, విడిచెన్, అయ్యెడన్, నికటంబునన్, రిపుస్ఫురణ = రావణుని స్ఫూర్తిని గల కృశానుజ = అగ్నిపుత్రుఁడైన నీలుని; క్రియలు = మూర్ఛాదులనుట ; రాముని తమ్ముఁడు, ఎంతయున్, చూచుచు; ససంభ్రమాకులుం డయ్యెనని యన్వయము.

తా. రావణుని యాగ్నేయాస్త్రప్రయోగమున నీలుఁడు మూర్ఛిల లక్ష్మణుఁ డాతని యవస్థం గాంచుచు;

భారత. ఒరయుటకున్, ఫలంబుగ, తగన్, ఒందిటి, పొమ్మని, అమ్మహాభుజున్ = ఆసాత్యకిని, పరుసపుమాటలు, అన్ = అనునట్టి, దహన = అగ్నియొక్కయు, బాణముయొక్కయు, హతిచే, హృదయంబు, చాలనొంచి, రహిత చేష్టున్; చేసి, విడిచెన్, అయ్యెడన్, నికటంబునన్, రిపుస్ఫురణచేన్, కృశమైన, అనుజ = తమ్ముఁడగు సాత్యకి యొక్క, క్రియలు = చేష్టలు. ఎంతయున్, చూచుచున్, రాముని తమ్ముఁడు = కృష్ణుఁడు; ససంభ్రమాకులుండై యని ముందరికన్వయము.

వ. ససంభ్రమాకులుండై 170

తే. చూడు మటు నరవరజయస్ఫూర్తి నార్చె
వైరిసేన భూరిశ్రవోదారుణరణ
మహిమ దనుజ బలశ్రీలు మడఁగ నింత
టను రిపుఁ గరంబు దెగవ్రేయ కునికి గీడు. 171

అవతారిక. రామాయణపర్యాయమున రామునితో లక్ష్మణుఁడును, భారతపర్యాయమున నర్జునునితోఁ గృష్ణుఁడు నిట్లనుచున్నారు.

రామాయణ. నరవర = ఓరామా, అటుచూడు, వైరిసేన, భూరిశ్రవోదారుణరణమహిమన్ = అధికమై శ్రవణభీకరమగు శబ్దాధిక్యముచే, జయస్ఫూర్తిన్, ఆర్చెన్, ఇంతటను = ఇంకనైనను, దనుజుల బలశ్రీలు, మడఁగన్ = అడఁగునట్లు, రిపున్=రావణుని, కరంబు, తెగ వ్రేయకునికి, కీడగును.

తాత్పర్యము సుగమము.

భారత. నర = అర్జునుఁడా, అటు, చూడు, భూరిశ్రవునియొక్క,

దారుణమైన, రణమహిన్ = యుద్ధరంగమున, మత్ = నాయొక్క, అనుజ = తమ్ముఁడగు సాత్యకియొక్క, బలశ్రీలు, మడఁగన్, వైరిసేన, జయశ్లాఘర్తిన్, ఆర్చెన్, ఇంతటను, రిపున్ = భూరిశ్రవుని, కరంబు తెగవ్రేయుకునికి = చేయితెగవ్రేయుచుండుట, కీడు.

తాత్పర్యము సుగమము.

తే. అనుచుఁ దానన్నమాటఁ జేకొని తడయక
ఘనభుజుండు సుమిత్రానందనుఁడు జిష్ణుఁ
డరిఁ గరము గుంటువడ నేయ ననుజు గెలుపుఁ
గాంచి మోదించె నరత నటించు చక్రి. 172

రామాయణ. అనుచున్, తాన్=లక్ష్మణుఁడు, అన్నమాటన్ = రామునిమాటను, చేకొని = గ్రహించి, రామునంగీకారముపడసి యని భావము; ఘనభుజుండు, జిష్ణుఁడు = జయశీలుఁడు, సుమిత్రనందనుఁడు = సుమిత్రాపుత్రుఁడగు లక్ష్మణుఁడు, అరిన్ = రావణుని, కరము, తడయక, కుంటువడ నేయన్=కుంటుపఱుపఁగా, అనుజుని గెలుపున్, కాంచి, నరతన్ = మనుష్యత్వమును, నటించుచక్రి = విష్ణువు, రాముఁడనుట, మోదించెన్.

తా. లక్ష్మణుఁడు రామునినుమతిచే రావణుంగుంటువఱుప రాముఁ డెంతయు సంతసించెను.

భారత. అనుచున్, తాన్ = కృష్ణుఁడు, అన్నమాటన్ = చెప్పిన మాటను, చేకొని, ఘనభుజుండు, సుమిత్రనందనుఁడు = బంధుప్రియుఁడగు, జిష్ణుఁడు = అర్జునుఁడు, తడయక, అరిన్ = భూరిశ్రవుని, కరముకుంటువడ నేయన్ = చేయితెగవ్రేయఁగా, అనుజ = తమ్ముఁడగు సాత్యకి యొక్క, గెలుపుంగాంచి, అరతన్ = సమీపమున, నటించునట్టి, చక్రి = కృష్ణుఁడు, మోదించెన్.

తా. అర్జునుఁడు కృష్ణునిమాటల నంగీకరించి భూరిశ్రవుని చేయి తెగ నేయుఁగ సాత్యకిజయమునుం గాంచి యతఁడు సంతసించెను.

వ. మఱియుం దద్రణం బతిభయంకరం బయి ప్రవర్తిల్లె. 173

ఉ. అంతట రాముతమ్ముఁడు దిగంతసమీపగుఁడైన యట్టిభా
స్వంతు తెఱంగుఁ గాంచితనశత్రునికాయముసొంపుమీఱన
త్యంతము నేసి యేసితదుదగ్రశరంబుల రేసి రేసి య
శ్రాంతతఁ బోరు జిష్ణురిపుసత్త్వము నారయుచున్మనంబునన్.

రామాయణ. అంతటన్, రాముతమ్ముఁడు = లక్ష్మణుఁడు, దిగంతసమీపగుఁడైన = దిక్కులకొనకుఁ బోవుచున్న, భాస్వంతు = సూర్యుని, తెఱంగును, రక్తవర్ణమునుటు; కాంచి = పొంది, సొంపుమీఱన్, తన శత్రువుల, నికాయమున్ = సమూహమును, అత్యంతమున్, ఏసియేసి, తత్ = ఆ శాత్రవుల, ఉదగ్రములగు, శరంబులన్, రేసిరేసి = ఖండించి, అశ్రాంతతన్ = శ్రమలేకుండఁగ, పోరుచుట్టి, జిష్ణురిపు = ఇంద్రశాత్రవుం డగు రావణుని, సత్త్వమున్ = బలమును, మనంబునన్, ఆరయుచున్. ముందన్వయము గలదు.

తా. లక్ష్మణుఁడు సాయంసమయ సూర్యునివలె రక్తవర్ణతనంది, రావణునిసైన్యమును గొట్టుచుఁ, దమబాణముల ఖండించుచు, నలయని రావణుని బలమును మదినారయుచు;

భారత. అంతటన్, రాముతమ్ముఁడు = కృష్ణుఁడు, దిగంతసమాగతుఁడైన భాస్వంతు తెఱంగు = సూర్యుఁడస్తమించుటను, కాంచి = చూచి, సొంపుమీఱన్, తన శత్రునికాయమునన్, అత్యంతమున్, ఏసి యేసి,

తత్ = ఆ శాత్రవుల, ఉదగ్రశరంబులన్, రేసిరేసి, అత్రాంతతన్, పోరు, జిష్ణు = అర్జునునియొక్కయు, రిపుల = అతని శాత్రవులయొక్కయు, సత్వ్యమున్, మనంబునన్, ఆరయుచున్.

తా. కృష్ణుడు సూర్యుడస్తంగతుడుగా నుండుట చూచి శత్రువులతోఁ బోరుచు, వారిశరముల ఖండించుచుండు నర్జునునియొక్కయు, నాతనిశాత్రవులయొక్కయు బలంబును మనంబున నారయుచు;

తే. సమదరోషాహితుల ఘోరసాయకముల
వానరానీకమును మున్నుగా నలుకుచు
గెలిచె భానుతాదియోధుల నరాతి
విపుల భుజశక్తి కోడ గానక వెదకియైన. 175

రామాయణ. సమసరోషాహి = క్రూరములగు సర్పములే, తుల = సాటియైన, సాయకములన్, వానరానీకములన్, మున్నుగాన్, నలుకుచున్, భానుసుతాదియోధులన్ = సుగ్రీవాదియోధులను, గెలిచెన్, వెదకియైనన్, అరాతి = శత్రువగురావణుని, విపుల = విస్తారమగు, భుజశక్తియొక్క, కోడ, కొలది, కానన్.

తా. సర్పసమములగు బాణములతో వానరుల నలుకుచు సుగ్రీవాది యోధుల గెలిచెను. ఈ రావణుని భుజశక్తికెందును గొదలేదు.

భారత. సమదులై, రోషయుక్తులైన, అహితులయొక్క, ఘోర సాయకముల వాన = బాణవర్షము, మునుమున్నగాన్, రానీక, నలుకుచున్, భానసుతాది=కర్ణాది, యోధులన్, గెలిచెన్, వెదకియైనన్, నర =అర్జునుని, అతివిపులమగు నిజభుజశక్తికొద, కానన్.

తా. శత్రువుల బాణవర్షమును మున్ను రానీక ఖండించుచుఁ, గర్ణాదియోధులం గెలిచెను. ఎంత వెదకినను, నీయర్జునుని భుజశక్తి కొక్కకొదగానను.

తే. హరులు దగఁదొట్టి మెలఁగ లేవనిన వాజి
తృష్ణ వారించె నిపు డీయతిప్రతాపుఁ
డద్భుతంబుగ నవని శాతాస్త్ర నిహతి
గ్రొచ్చి కీలాలములు వెల్లిగొన వెలార్చి. 176

**రామాయణ.** హరులు = కపులు, తగన్ తొట్టి = ఎదిరించి, అనిన్, మెలఁగలేవు, ఇపుడు, ఈయతిప్రతాపుఁడు = అతి శౌర్యశాలియగు రావణుఁడు, అద్భుతంబుగన్, నవ, నిశాత = తీక్ష్ణములగు, అస్త్రనిహతిన్, గ్రొచ్చి = గ్రుచ్చి, కీలాలములు = రక్తములు, వెల్లిగొనన్, వెలార్చి, నవమైన, ఆజి = యుద్ధమునందలి, తృష్ణన్, వారించెన్.

తా. వానరులు యుద్ధమున నిపుడు సరిగా మెలఁగఁజాలకున్నారు. రావణుఁడు తనయస్త్రములం బ్రయోగించి రక్తముప్రవహింపఁజేసి వానికి యుద్ధవాంఛల మాన్పెను.

**భారత.** హరులు = గుఱ్ఱములు, తగన్, తొట్టి మెలఁగలేవు = జరుగఁజాలవు, అనినన్, ఇపుడు, ఈ యతిప్రతాపుఁడు = అర్జునుఁడు, అద్భుతంబుగన్, అవనిన్ = భూమిని, శాతాస్త్రనిహతిన్, గ్రొచ్చి, కీలాలములు = నీరములు, వెల్లిగొనన్, వెలార్చి, వాజితృష్ణన్=గుఱ్ఱములదప్పిని, వారించెన్.

తా. గుఱ్ఱములు దప్పిగొని సరిగా నడువఁజాలవనినంతనే వాఁడిబాణముల నేలఁగ్రొచ్చి నీటివెల్లువం గూర్చి వాని దప్పిం బాపించెను.

సీ. మును పిమ్మహాయోధు ఘనసంగరోత్సాహ
సన్నాహసంపత్తి విన్నది మొద
లాప్తసేనాది సహాయసంగత్య వి
రతినిబిడౌజుండు రాజరాజు
సింధురాజు బ్రదుకు సెడకుండ రక్షించు
కొనుటకు నతియత్నమునఁ బరఁగుట
దెలిసియు నిబ్బలాధికుని జయద్రథు
సద్యోవధార్హునిఁ జంపుటకును

తే. బ్రతినయం బేనొనర్పకపార్థ బాణ
ములనె ప్రొద్దుగ్రుంకెడు దాఁకఁ బోరుజరుపు
చున్న విజయహాని జనింప కున్నె యకట
శత్రునకు దర్పకాలన్మై సత్వమెక్క. 177

**రామాయణ.** మునుపు, ఇమ్మహాయోధు = మహావీరుఁడగు నీరావణుని, సంగర = యుద్ధమునందలి, ఉత్సాహముయొక్క, సన్నాహసంపత్తి = ప్రయత్నసంపద, విన్నదిమొదలు, ఆప్తులగు సేనాసహాయసంగతియందు, అవిరతిని = ఎడతెగమిని, బిడౌజుండు = ఇంద్రుఁడు, రాజరాజు=కుబేరుఁడు, సింధురాజు=వరుణుఁడు, బ్రదుకుజీవనము, చెడకుండన్, రక్షించుకొనుటకు, అతియత్నమునఁ బరఁగుట = మిక్కిలి ప్రయత్నములో నొప్పియుండుట, ప్రచ్ఛన్నులైయుండుట యనుట; తెలిసియున్, ఇబ్బలాధికుని, జయద్రథున్ = సర్వోత్కృష్టముగ వర్తింపుచున్న రథము గలవానిని, సద్యోవధార్హునిన్ = వెంటనే చంపఁదగినవానిని, ప్రొద్దుగ్రుంకకమున్నే చంపఁదగిన రావణునని; చంపుటకును, ప్రతినయుంబు= యుక్త్యంతరము, ఏన్, ఒనర్పక, అపార్థ= వ్యర్థములైన, బాణములనె,

ప్రొద్దుగ్రుంకెడుదాఁకన్ = సూర్యుఁడస్తమించువఱకు, పోరు, జరుపుచు నున్నన్, శత్రునకున్=రావణునకు, దర్పకాలమై = దర్ప మతిశయించు కాలమై, సత్వము, ఎక్కు, రాత్రుల నసురులకు దర్పకాలమగుటచే బలము హెచ్చుననుట; అకట, విజయహాని = జయభంగము, జనింపకున్నె.

తా. రావణుని పరాక్రమాతిశయము విన్నదిమొద లింద్రాదులు బ్రదుకు రక్షించుకొనఁ బ్రచ్ఛన్నులై యుండిరని తెలిసియుఁ బ్రొద్దుగ్రుంకకమున్న చంపఁదగిన వీనిం జంపుట కుపాయాంతరము వెదుకక వ్యర్థముగా బాణములతోఁ బ్రొద్దుగ్రుంకెడు నందాక పోరుసల్పుచుండిన శత్రువునకు దర్పకాల మాసన్నమై బలమెక్కిన మనకు విజయహాని గలుగదే!

భారత. మునుపు, ఇమ్మహాయోధు=అర్జునుని, ఘనమైన, సంగర=ప్రతిజ్ఞ యందుఁ ఉత్సాహముయొక్క, సన్నాహసంపత్తి, విన్నదిమొదలు = అర్జునుఁడు సైంధవుం జంపెదనని ప్రతిజ్ఞ గావించినది మొదలనిభావము; ఆప్త సేనా సహాయముయొక్క సంగతియందలి విరతిన్, నిబిడ ఓజుండు=నిబిడమైన పరాక్రమము గలవాఁడు, రాజరాజు=దుర్యోధనుఁడు, సింధురాజు = సైంధవుని, బ్రదుక, చెడకుండన్, రక్షించుకొనుటకున్, అతి ప్రయత్నమునన్, పరఁగుట, తెలిసియున్, ఇబ్బలాధికునిన్, జయద్రథునిన్ = సైంధవుని, సద్యోవధార్హునిన్ = వెంటనే చంపఁదగిన వానిని, చంపుటకున్, ఏన్, ప్రతినయంబు = ఉపాయాంతరము, ఒనర్పక, పార్థ = అర్జునుని, బాణములనే, ప్రొద్దుగ్రుంకెడు దాఁకన్, పోరు, జరుపుచునున్నన్, శత్రునకున్ = శత్రువైన సైంధవునకు, దర్పకాలమై = గర్వ మతిశయించు కాలమై, సత్వము, ఎక్కన్, విజయ = అర్జునునకు, హాని, జనింపకున్నె.

తా. అర్జునుని ప్రతిజ్ఞాతిశయము విని దుర్యోధనుఁడు సైంధవుని రక్షింప నతిప్రయత్న మొనర్చుట దెలిసియు సూర్యాస్తమయము లోపలఁ జంపఁ దగిన యా సైంధవుని చంపుట కుపాయాంతరము నే నొనర్పక యర్జునుని బాణములచేతనే ప్రొద్దుపుచ్చిన సాయంకాల మగుటచే శత్రువునకు బలము హెచ్చిన నర్జునునకు హాని గల్గకుండునా !

వ. అని తలపోసి, 178

తే. కరము భానుబింబము మాయఁ గ్రమ్మె నభము
నంబకముల రాగమునఁ బెంపొందఁ జూడ్కిఁ
బ్రతిభటుఁడు సూచి నరుఁ డింకఁ బ్రమ్మ గెట్టుఁ
బూన్కి విడఁ డని సంరంభమును వహింప. 179

రామాయణ. రాగమునన్ = ఎఱ్ఱదనముచే, పెంపారుచున్న, చూడ్కిచే, ప్రతిభటుఁడు = రావణుఁడు, చూచి, నరుఁడు = లక్ష్మణుఁడు, ఇంకన్, ప్రమ్మక = చావక, ఎట్టున్ = ఏ విధమునను, పూన్కి, విడఁడని, సంరంభము = పూన్కిని, వహింప, కరము, భానుబింబము, మాయన్ = మాయునట్లు, అంబకములన్ = బాణములచే, నభము = ఆకాశము, కప్పెన్.

తాత్పర్యము సుగమము.

భారత. అంబకముల = నేత్రముల, రాగమునన్ = పెంపొందునట్టి, చూడ్కిన్, ప్రతిభటుఁడు, నభము = ఆకసము, చూచి, నరుఁడు = అర్జునుఁడు, ఇంకన్, ప్రమ్మక, ఎట్టున్, పూన్కిని, విడఁడు, అని, సంరంభము వహింపన్ = వేగిరపాటు చెందఁగా, కరము, మాయన్, భాను బింబమును, కప్పెన్.

తాత్పర్యము సుగమము.

వ. ఇట్లు గప్పిన, 180

సీ. మదిలోన మిత్రాస్తమయకాంక్ష మిక్కిలి
కలిమిఁ దద్దిశ నంబక ప్రయుక్తి
సలుపుచుఁ దత్కాల చాపలోపహతాత్మ
రక్షణుం డగువానిఁ బ్రచురబంధు
సింధురాజును బలోర్జితు మేఘనాదగు
రున్యక్రియాసహ క్రూరభీమ
సేనాతిమాత్రోరు సింహనాదములచే
నతివిశ్రుతంబుగ నాక్రమించి

తే. బిట్టు సమయించె ధృతిఁ బాక భేది ముఖ్య
ఖేచరులు గన్నులారంగఁ జూచి మెచ్చ
నప్రగల్భ రామావరజప్రయుక్త
విజయపటు శరవ్యాపార విలసనంబు. 181

**రామాయణ.** మదిలోన్ = మనస్సునందు, అమిత్ర = శత్రువుల, అస్త
మయకాంక్ష = నాశమందలి యిష్టము, మిక్కిలిన్, కలిమిన్ = కల్గు
టచే, తద్దిశన్ = శత్రువైన లక్ష్మణుఁ డుండుదెసను, అంబక ప్రయు
క్తిన్ = బాణప్రయోగమును, చలుపుచున్, తత్కాల = ఆకాలమున,
చాపలోప = విల్లుపోవుటచే, హతమైన, ఆత్మరక్షణుండగు వానిన్,
ప్రచురబంధు సింధురాజు = అధిక బంధువైన సముద్రము గల వానిని,
సముద్ర మా పట్టణము చుట్టి యాతనికి రక్షగా నుండుటచే నిట బంధుత్వ
మారోపింపఁబడెను ; బలముచే, ఊర్జితుఁడైన వానిని, మేఘనాద= ఇంద్ర
జిత్తునకు, గురున్ = తండ్రియైన వానిని, న్యక్రియా = తిరస్కారమును,
అసహ = ఓర్వని, క్రూరమై, భీమ = భయంకరమైన, సేనా=వానరసేనల,

అతిమాత్ర ఉరు=మిక్కిలి విస్తారమైన,సింహనాదములచేఁ, అతి విశ్రుతంబుగఁ, ఆక్రమించి, పాకభేద ముఖ్య = ఇంద్రుఁడు మున్నగు, ఖేచరులు, కన్నులారంగఁ, చూచి, మెచ్చఁ, సప్రగల్భుఁడగు, రామావరజ= లక్ష్మణునిచే, ప్రయుక్తమైన, విజయ = జయశీలమైన, పటు, శరవ్యాపారముయొక్క, విలసనంబు, ధృతిఁ = రావణుని ధైర్యమును, బిట్టు సమయించెఁ = అధికముగా నశింపఁజేసెను.

తా. శత్రునాశము గోరి లక్ష్మణుని దెస బాణములు ప్రయోగించుచుఁ దనవిల్లు భగ్నముగాఁగ నాత్మరక్షణ హీనుఁడైన రావణు నింద్రాదులు మెచ్చ లక్ష్మణుని బాణవ్యాపారము లుప్తధైర్యుం గావించెను.

భారత. మదిలోన, మిత్రాస్తమయకాంక్ష = సూర్యాస్తమయమునందలి కాంక్ష, మిక్కిలిఁ, కలిమిఁ, తద్దిశఁ = సూర్యుఁ డస్తమించు నా దిక్కున, అంబక ప్రయుక్తిఁ నలుపుచుఁ = నేత్రవ్యాపారము ఘటింపుచుఁ, చూచుచు నునుట; తత్కాలమునందలి, చాపలముచే, ఉపహతమైన, ఆత్మరక్షణుఁ డగువానిని, ప్రచుర బంధుఁ = ప్రసిద్ధులగు బంధువులు గలవానిని, సింధురాజుఁ = సైంధవుని, బలోర్జితుని మేఘముల నాదములకంటె, గురువైన, న్యక్కృతి=తిరస్కారయింందు, సహ= సమర్థములైన, క్రూరములైన, భీమసేనుని, అతిమాత్ర, ఉరు, సింహనాదములచే, అతివిశ్రుతంబుగఁ, ఆక్రమించి, పాకభేదముఖ్య ఖేచరులు, కన్నులారంగఁ, చూచి, మెచ్చఁ, సప్రగల్భుఁడగు, రామావరజ = కృష్ణునిచే, ప్రయుక్త = ప్రేరేపింపఁబడిన, విజయు = అర్జునుని, పటు, శర వ్యాపారముయొక్క విలసనంబు, ధృతిఁ = ధైర్యముచే, బిట్టు, సమయించెఁ = చంపెను.

తా. సూర్యాస్తమయముం గోరుచుండువాఁడు గాన నా దిక్కును జూచుచు స్వరక్షణమున జాగరూకత లేక నచ్చిన సైంధవు నర్జునుఁడు కృష్ణ ప్రేరితుఁడై చంపెను.

"గురున్నుభ్రక్రియా" "అనచిచ" అను సూత్రముచే భారతార్థమునంగూడ నకారపుఁ బొల్లున్నది.

తే. సరగునఁ బునఃప్రకాశిత ♦ చండధాముఁ
డగుచు విజయప్రతిజ్ఞ చొప్పవియకుండ
నిలిపె నానురకుల వైరి ♦ నిజవిచిత్ర
శక్తి నట్లు మున్నేచిన ♦ శత్రు నడఁచి. 182

రామాయణ. సరగునన్ = శీఘ్రముగా, పునః ప్రకాశిత = మరలం బ్రకాశింపఁబడిన, చండధాముఁ డగుచున్ = తీక్ష్ణ ప్రతాపుఁడగుచు, ఆ సురకులవైరి = రావణుఁడు, నిజ, విచిత్రమైన, శక్తిన్ = శక్తి యను నాయుధముచే, అట్లు, మున్ను, ఏచిన = విజృంభించిన, శత్రున్=లక్ష్మణుని, అడఁచి, నిజ పతిజ్ఞ చొప్పున = లక్ష్మణుని జంపెదననిన ప్రతిజ్ఞారీతి, అవియకుండన్ = నశింపని లాగున, నిలిపెన్.

తా. రావణుఁడు లక్ష్మణుని, శక్తిచే నడఁచి, తాను లక్ష్మణుని జంపెదననిన ప్రతిజ్ఞను గాపాడుకొనెను.

భారత. సరగునన్ = పునఃప్రకాశిత చండధాముఁ డగుచున్ = మరలం బ్రకాశింపఁ జేయఁబడిన సూర్యునిగలవాఁ డగుచు, ఆసురకులవైరి = అసురాంతకుఁ డగు కృష్ణుఁడు. అట్లు, మున్ను, ఏచిన, శత్రున్ = సైంధవుని, నిజవిచిత్రమైన, శక్తిన్ = సామర్థ్యమున, అడఁచి, విజయు = అర్జునుని, ప్రతిజ్ఞచొప్పు = సూర్యాస్తమయములోఁగ సైంధవుంజంపెదనను ప్రతిజ్ఞావిధము, అవియకుండన్, నిలిపెన్.

తా. కృష్ణుఁడు తనశక్తిచే సూర్యునిమరలం బ్రకాశింపఁజేసి సైంధవుని జంపించి యర్జునుని ప్రతిజ్ఞను గాపాడెను.

వ. అప్పుడు. 183

మ. నను మేచాయలనాదుకూర్మియనుజన్మన్బాధస్వప్నంబునం
గనకొప్పారెడు పుణ్యమూర్తిఁ బ్రియునిన్ గ్రద్వేషి చేనివ్విధం
బున నేయించి మునుంగఁ జేసితిఁగడున్ శోకాబ్ధిలోనక్కటా
యనుచున్ రాజులరాజుగుందెరవిపుత్రాదుల్దనుం దేర్పఁగన్.

రామాయణ భారతార్థములు సమము.

అర్థము. నను మేచాయల = నిద్దపుశరీరచ్ఛాయగల, [రామాయణ] నాదుకూర్మియనుజన్మన్ = నాప్రియానుజుని=లక్ష్మణుననుట; [భారత] కూర్మియనుజను, ముకుళలననుట, మున్=మున్ను, బాధ, స్వప్నంబునన్ = కలలోనైన, కనక, ఒప్పారెడు నట్టి పుణ్యమూర్తిని, ప్రియునిన్= [రామా. ప్రియమైన వానిని, భార. భర్తను, సైంధవుననుట;] ఉగ్రుఁడైన=ద్వేషి చేన్, [రామా. రావణునిచే, భార. అర్జునునిచే,] ఇవ్విధంబునన్; ఏయించి, శరాహతుంగావించి, కడున్, శోకాబ్ధిలోన్, మునుంగంజేసితిన్, అక్కటా, అనుచున్, రాజులరాజు=[రామా. రాముఁడు, భార. దుర్యోధనుఁడు] రవిపుత్రాదుల్ = [రామా. సుగ్రీవాదులు, భార. కర్ణాదులు] తనున్, తేర్పఁగన్, కుందెన్.

తాత్పర్యము సుగమము.

వ. తదనంతరంబ తద్దయు నుద్దీపితంబగు కోపాటోపంబున.

క. వాయుజ వనచరవాహనుఁ
డై యేపున నిజచమూచక్రంబు గడచి రాఁ
బోయెఁ బరిపంథిబలము న
పాయము వొందింతు నేన యని తమకమునన్. 186

రామాయణ భారతార్థములు సమము.

అర్థము. [రామాయణ.] వాయుజ = హనుమంతుఁ డనెడి వన చర = వానరుని, వాహనుఁడై = వాహనముగాఁ గలవాఁడై, [భారత] వాయుజవన = వాయువేగముగల్గి, చర = సంచరించు, వాహనుఁడై = గుఱ్ఱములు గలవాఁడై, ఏపునన్ = గర్వమున, నిజచమూచయంబుఁ గడ చిరాన్ =[రామా. తనసేనలు బలసి తన వెంట నచ్చుచుండఁగా; భార. తన సేనల నతిక్రమించిరాఁగ] పరిపంథిబలమున్ = [రామా. రావణు బల మును, భార. శాత్రవసైన్యమును] నేన, అపాయము, ఒందింతున్, అని, తమకమునన్ = తమితో, పోయెన్.

తాత్పర్యము సుగమము.

క. ఆవీరుఁడు మును దన బా
ణావలిఁ బవనసుతు నొంచి యాత్మబలజయ
శ్రీ వెలయించిన నెంతయు
వైవస్వతసంతతి నృపవర్యుఁడు గినిసెన్. 187

రామాయణ భారతార్థములు సమము. అర్థము. ఆ వీరుఁడు= [రామా. ఆ రావణుఁడు, భార. ఆ దుర్యోధనుఁడు] మును=ముందుగా, తన బాణావలిన్, పవనసుతున్ = [రామా. హనుమంతుని, భార. భీముని] నొంచి, ఆత్మ = తనయొక్క, బలమువలని, జయశ్రీని, వెలయించినన్, వైవస్వతసంతతి నృపవర్యుఁడు = [రామా. సూర్య కులమునంబుట్టిన రాముఁడు, భార. యముని పుత్రుఁడగు ధర్మజుఁడు] ఎంతయున్, కినిసెన్.

తాత్పర్యము సుగమము.

ఉ. ఈవిధినల్గి యానృపతి యేయుశరంబులఁ దద్విరోధి దాఁ
జేవదొఱంగి సాధన విశేషవిహీనతఁజెంది కుందె మూ

ర్ఛావృతిచేత మేనెఱుఁగక కుంతటఁ దత్ప్రతిబోధలబ్ధిచే
భావములోఁగలంకచొరఁబాఱెఁదదీయులకార్తిహెచ్చఁగన్

రామాయణ భారతార్థములు సమము.

అర్థము. ఘనిధన్, అగ్ని,అప్రకృతి = [రామా. రాముఁడు, భార. ధర్మజుఁడు] ఏయునట్టి, శరంబులన్, తత్ప్రరోధి = [రామా. రావణుఁడు, భార. దుర్యోధనుఁడు], తాన్, చేసలోఁబుంగి = సారసువీడి, సాధన విశేషవిహీనతన్ చెంది = ఆయుధభంగమునొంది, మూర్ఛావృతిచేతన్ = మూర్ఛ యావరించుటచేత, మేను, ఎఱుఁగక, కుందెన్, అంతటన్, తత్ప్రతి బోధలబ్ధిచేన్ = ఆమూర్ఛ తేఱుటచే, తదీయులకున్ = వానివారికి, ఆర్తిహెచ్చఁగన్, భావములోన్=మనస్సునం, కలంకచొఱఁ బాఱెన్ = కలఁతగలిగెను.

తాత్పర్యము సుగమము.

ఆ. అంతలోఁ బ్రదీప్తమైన యక్షపితృశ
క్తిని గరంబు మూర్ఛ మునిఁగినట్టి
రాకొమరుఁడు లేచి రణముత్తుఁ డయ్యెఁ గూ
ల్చిన యతండు వెఱఁగుకొనను మునుంగ. 189

రామాయణ భారతార్థములు సమము.

అర్థము. అంతలోన్, ప్రదీప్తమైనట్టి, అక్షపితృశక్తిని=[రామా. అక్షు(ని) తండ్రియగు రావణుని శక్తిచే, భార. చెఱుపఁబడని బలముచే,] శరంబు, మూర్ఛమునిఁగినట్టి, రాకొమరుఁడు = [రామా. లక్ష్మణుఁడు, భార. దుర్యోధనుఁడు,] లేచి, కూల్చినయతండు = [కూల్చినట్టివాఁడు, [రామా. రావణుఁడనుట; భార. ధర్మజుఁ డనుట;[ వెఱఁగునను

మునుంగఁగ, రణ మత్తుఁడయ్యెఁగ = యుద్ధమునకైన మదముచెందిన వాఁడయ్యెను.

తాత్పర్యము సుగమము.

తే. తెలివి చేకొని యతఁడంతఁ * బలువురఁ గడుఁ
బేరుకలయట్టి తనయొక్క * వీరయోధ
వరులనుక్కు మడఁగఁ దత్త * ద్వంద్వయుద్ధవిధిని
బిరుదులై రిపులడఁచుచుఁ * బేర్చుటరసి. 190

రామాయణ భారతార్థములు సమము.

అర్థము. అతఁడు = [రామా. రావణుఁడు; భార. దుర్యోధనుఁడు] తెలివి చేకొని=ప్రబోధమునంది, అంతఁగ, పలువురఁగ, రిపులఁగ, బిరుదులై, కడుఁగ, పేరుకలయట్టి = ప్రసిద్ధులైన, తనయొక్క; వీరయోధవరులఁగ, దత్త=ఈయఁబడిన, ద్వంద్వయుద్ధ విధిని = ద్వంద్వయుద్ధ రూపకార్యమున, ఉక్కు = బలము, మడఁగఁగ = నశించులాగున, అడఁచుచుఁగ, పేర్చుట = అతిశయించుట, అరసి = విచారించి, పనిచెనని ముందుపద్యమున కన్వయము.

తా. [రామా. రావణుఁడు, భార. దుర్యోధనుఁడు] ప్రసిద్ధులైన తనయోధులను శత్రువులు ద్వంద్వయుద్ధమున బలముడిగించుట యాలోచించి ;

వ. ప్రతివిధానం బన్వేషించి, 191

ఆ. అతివిశాలధృతి మహాద్రినిభానుజు
బహురణప్రయత్న * భరవినిద్రుఁ
జేసి యరులద్రుళ్లు * చెఱుపఁ బంచెద నని
యాత్మ నెంచియతని * నట్లు పనిచె. 192

రామాయణ. అతివిశాలమైన, ధృతి = ధైర్యమువలన, మహాద్రి నిభ = గొప్పపర్వతమువలెనుండు, అనుజున్ = తమ్ముఁడగు కుంభకర్ణుని బహురణ ప్రయత్నభర = పెక్కుమోఁతలయొక్క ప్రయత్నభారముచే, గొప్పచప్పుడు గల్గించి యని భావము; వినిద్రున్ చేసి = నిద్రారహితు, నిగా నొనర్చి, అరులు = శత్రువులయిన రామాదులయొక్క, త్రుళ్లు, చెఱుపన్, పంచెదన్, అని, ఆత్మన్, ఎంచి, అతని = ఆ కుంభకర్ణుని, అట్ల = తా వనుకొన్న రీతినే, నిద్రించుచున్న కుంభకర్ణునొద్ద పెక్కు ధ్వనులు గావించి, యాతని నిద్రనుండి లేపి యని భావము; పనిచెన్.

తాత్పర్యము సుగమము.

భారత. అతివిశాలమైన, ధృతిని, మహాద్రిని = గొప్పపర్వతము వంటివాని, భానుజున్ = కర్ణుని, బహు, రణ = యుద్ధమునందలి, ప్రయత్నభరమున, వినిద్రున్ = జాగరూకునిగా, చేసి, అరుల త్రుళ్లు, చెఱుపన్, పనిచెదను = అంపెదను, అని, ఆత్మన్, ఎంచి; అతనిన్ = ఆ కర్ణుని అట్ల, పనిచెన్.

తాత్పర్యము సుగమము.

వ. పనిచిన నతండును నతిభయంకర సన్నాహంబుతోడ
నాహవక్రీడ నుపక్రమించె నప్పుడు తత్పరివారంబు, 193

చ. ప్రకటత నేఁడు నీవనిభశీరంబు వహించితె! కించిదంచిత
భ్రుకుటివిమాక్తీకృతవిరోధిపధూకుచకుంభ కర్ణ యా
జికిటుల భీష్మరోషముసఁ జేరకతద్దళ వాసరంబు లూ
రకచనఁ జేసి తక్కడ తిరంబుగ మమ్మిఁక నైనఁ గావవే.

అవతారిక. రామాయణ పర్యాయమునఁ గుంభకర్ణునితో వానిని పరివారము వారును, భారతపర్యాయముఁ గర్ణునితో రాతని పరివారము వారును నిట్లనుచున్నారు.

**రామాయణ.** ప్రకటతన్ = ప్రసిద్ధముగా, నేఁడు, నీవు, అని భరంబు=యుద్ధభారము [ఇది మిశ్రసమాసము ;] వహించితె, కించిత్ = కొంచెము, అంచిత = ఒప్పుచుండు, భృకుటి = బొమముడిపాటు చేతనే, విముక్తికీకృత = ముక్తాహార వర్జితముగాఁ జేయఁబడిన, విరోధి వధువుల కుచములు గలవాఁడా, శత్రునాశమున శాత్రవ స్త్రీలు ముక్తాహార వర్జిత లైరని భావము ; [కించి దంచిత భ్రుకుటి యన నీ కించుక బొమ ముడిపాటు గల్గినంతనె శాత్రవులు చత్తురుగాన యుద్ధమునకుఁ బ్రసక్తి య యుండదని భావమగును.] కుంభకర్ణ, ఆజికిన్ = యుద్ధమునకు, ఇటు, భీష్మ = భయంకరమైన, రోషమునన్ = క్రోధమున, చేరక, ఇద్దశన్ = ఈ యవస్థను; ప్రహస్తాదులు చచ్చినట్టి యవస్థ ననుట; వాస రంబులు = దినములు, ఊరక చనన్ + చేసితి = వ్యర్థపఱచితివి, అక్కట, ఇంకనైనన్, మమ్మున్, తిరంబుగన్, కావవే = రక్షింపవే.

తా. అశ్రమముగా శాత్రవుల నిర్జించు నీ వీ దినము యుద్ధభారము వహించితివి కావే, అతి క్రోధమున యుద్ధమునకు రాక నిద్ర నింతకాల మూరక పుచ్చితి వింకనైన మమ్ముఁ గావుము.

**భారత.** ప్రకటతన్, నేఁడు, నీవు, అనిభరంబు, వహించితె = తాల్చితివే, కించిత్, అంచిత, భ్రుకుటిచే, విముక్తికీకృతమైన, విరోధి వధువుల, కుచకుంభములు గలవాఁడా, కర్ణ, ఆజికిన్, ఇటు, భీష్మరోష మునన్ చేరక = భీష్మునందలి క్రోధమునం జేరక, తత్ దశవాసరం బులు = ఆ పదిదినములు, ఊరక, చనన్, చేసితి, అక్కట, ఇంకనైనన్, మమ్మున్, తిరంబుగన్ = స్థిరంబుగా, కావవే.

తా. భీష్మునిపైఁ గ్రోధమున యుద్ధభారము వహింపక యీ పది దినము లూరక పుచ్చితివి. ఇంకనైన మమ్ము రక్షింపుము.

చ. నరుఁడని లెక్కసేయఁడు మహీనంబున శాత్రవునమ్మహాత్ముచే
యురణముఁ బెక్కుచోట్లఁ గనియున్నననాయకుఁడేమి చెప్పని

ద్ధురమును మున్నుగాఁ దెలిపితోడుగనిన్నెటులైనఁదేక యి
ట్లరికృత భీష్మహానిననయంబును దుర్బలుఁడయ్యె నక్కటా.

**రామాయణ.** మననాయకుఁడు = రావణుఁడు, అమ్మహాత్ము చేయురణము = ఆ రాముఁడొనర్చుయుద్ధము, పెక్కుచోట్లన్, కనియున్, నరుఁడు = మనుష్యమాత్రుఁడె కదా, అని, లెక్కసేయుఁడు, ఏమి చెప్పన్, మునుమున్నుగాన్ నిద్దుర తెలిపి = ప్రారంభముననే నిద్దురం దెల్పి, నిద్రలేపియునట ; ఎటులైనన్, నిన్నున్, తోడుగన్ తేక = తనకు సహాయముగాఁ దెచ్చుకొనక, ఇట్లు, అరి = శత్రువులచే, కృతమైన, భీష్మ = భయంకరమైన, హానిచే, అనయంబును, దుర్బలుఁడయ్యెన్, అక్కటా.

తా. రాముని యుద్ధాతిశయ మెఱిఁగియు మనయేలిక నరుఁడని యలక్ష్యముచేసి, నిన్ను ప్రారంభముననే నిద్దురలేపి తనకు సాయముగా నొనర్చికొనక, శాత్రవు లొనర్చిన హానిచే మిక్కిలి దుర్బలుఁడయ్యెఁగా !

**భారత.** ఏమిచెప్పన్, నరుఁడు = అర్జునుఁడు, అనిన్ = యుద్ధమున, శాత్రవున్ = శత్రువును, మనంబునన్, లెక్కసేయఁడు, అమ్మహాత్ము చేయు రణమును = ఆ యర్జునుఁడొనర్చుయుద్ధమును, పెక్కుచోట్లన్, కనియున్, ఇద్దురమును = ఈ యుద్ధమును, మున్నుగాన్ తెలిపి = నీకు మున్నె తెలిపి, నిన్నున్, ఎటులైనన్, తోడుగాన్, తేక, ఇట్లు, అరికృత = శత్రునిచే నొనర్పఁబడిన, భీష్మహానిన్ = భీష్ముని పోకడచే, అనయంబున్, దుర్బలుఁడయ్యెన్.

**తా.** అర్జునుని యుద్ధ ప్రావీణ్య మెఱిఁగియు మనరాజు నిన్ను ప్రారంభముననే తోడుగాఁ బిలువక, యిట్లు భీష్ముని పోకడచే నెంతయు దుర్బలుఁ డయ్యెను.

వ. అని మఱియుఁ దమవారలచావు లుగ్గడించి, యవి యన్ని యు మనప్రభునకుం బ్రభవించుట నీయనాదరంబునం జేసి కాక నీవు గావలయునని యని యొనర్చిన ననిమిషుల కయిన ననివార్యంబుగాదె యని ప్రస్తుతించుచుం బరివేష్టించి యుత్సాహంబు దీపింపం జేయఁ బెంపొంది, యమంద విక్రమంబున నెందును నెదురులేక యా కడింది జోదు పరబలంబుల నేలం గలుపుచు బలిమిం జూపె నప్పుడు. 196

రామాయణ భారతార్థములు సమము.

వ. అని, మఱియున్, తమవారలచావులు, ఉగ్గడించి = చెప్పి, అవి యన్నియున్, మన ప్రభునకున్, సంభవించుట, నీ యనాదరంబునం జేసి గాక = నీవొనర్చు ననాదరముచేఁ గాని, నీవు, కావలయునను = చేయుటే తీఱవలయునని, శ్రద్ధవహించియనుట; అని యొనర్చినన్ = యుద్ధము చేసిన, అనిమిషులకైనన్ = దేవతలకైనను, అనివార్యంబు కాదె అని, ప్రస్తుతించుచున్ = స్తోత్రము చేయుచు, పరివేష్టించి, ఉత్సాహంబును, దీపింపన్, చేయన్, పెంపొంది = విజృంభించి, అమంద = తగ్గని, విక్రమంబునన్, ఎందును, ఎదురులేక, ఆకడిందిజోదు = ఆకఠినయోధుఁడు = [రామా. = కుంభకర్ణుఁడు, భార. కర్ణుఁడు=] పరబలంబులన్, నేలం గలుపుచున్ = ధ్వంసము సేయుచు, బలిమిన్ చూపెన్ = శౌర్యము చూపెను, అప్పుడు.

తాత్పర్యము సుగమము.

సీ. ప్రత్యర్థిభద్రవారణఘటోత్కటచల స
త్కంఠీరవమురీతిఁ గడుబొదలెడు

నీ వీరుఁ గుదియించి కావుము మన సేన
ననుహరిసార్థవాక్యములు రవిజుఁ
దలపడఁ దెలుపునంతనయానిశాటుఁ డం
గదధర్మనందన గంధవహజ
నాసత్యసుతచమూనాథాదికపులక
స్ఫూర్తికారణమైన పొలుపుతోడ

తే. దివసనాయకు పట్టిపైఁ గవిసి తత్ప్ర
హారయత్నంబు వైఫల్యమందఁ జేసి
దివ్యబాణచక్రప్రాసతీక్ష్ణశక్తి
శూలముఖ్య ప్రయోగవిస్ఫురణ నెఱసె. 197

అవతారిక. ఇది మొదలు పదునొకండు పద్యముల వఱకు కుంభకర్ణుఁడు సుగ్రీవాదులతోఁ జేయు యుద్ధభాగంపుఁ గథను, ఘటోత్కచుఁడు కర్ణునితో నొనర్చు యుద్ధభాగంపుఁ గథను జంటించి కవి చెప్పుచున్నాఁడు.

**రామాయణ.** ప్రత్యర్థి ... కంఠీరవమురీతిన్ ; ప్రత్యర్థిభద్రవారణఘటా = శాత్రవులనెడి మత్తగజసమూహములపై, ఉత్కచల = వేడ్కతో లంఘించు, సత్కంఠీరవమురీతిన్ = సింహమువలె, కడున్, పొదలెడు, ఈ వీరున్ = కుంభకర్ణుని; కుదియించి = చంపి, మనసేనన్, కావుము, అను, హరిసార్థ = వానరసమూహముల, వాక్యములు, రవిజున్ = సుగ్రీవుని, తలపడన్ = ఎదురింప, తెలుపునంతన, ఆ నిశాటుఁడు = కుంభకర్ణుఁడు, అంగదుఁడు, ధర్మనందన = సుషేణుఁడును, గంధవహజ = హనుమంతుఁడును, నాసత్యసుత = మైందద్వివిదులును, చమూనాథాది = సేనాపతియగు నలుఁడు మున్నగు, కపులకున్, అస్ఫూర్తి కారణమైన = వికార

హేతువైన, పౌలుపులోద్గత్ = అందముతో, దివసనాయకు పట్టిపైన్ = సుగ్రీవునిపై, కవిసి = తాఁకి, తత్ = ఆ సుగ్రీవునియొక్క, ప్రహార యత్నంబున్, వైఫల్యమందఁ జేసి = వ్యర్థముగావించి, దివ్యబాణచక్ర = దేవతల బాణ సమూహముల, ప్రాస = పో మొత్తుటయందు, తీక్ష్ణమైన, శక్తిని గల, శూలముఖ్యముయొక్క, [ముఖ్యమైన శూలమని విశేషణోత్తర పదకర్మధారయము.] ప్రయోగ విస్ఫురణము, నెఱపెన్.

తా. కుంభకర్ణుని బారినుండి మనసేనం గాపాడుమని వానరులు మొఱలిడువంతలోఁ గుంభకర్ణుఁడంగదాదులకు దుఃఖము గల్గు లాగున సుగ్రీవునిపైకి యుద్ధమునకు వెడలి, యాతని ప్రహారముల వ్యర్థ మొనర్చి, శూలముం బ్రయోగించెను.

భారత. ప్రత్యర్థులయొక్క, భద్ర = శుభములను, వారణ = నివారించువాఁడా, ఘటోత్కచ, లసత్ = ప్రకాశించుచున్న, కంఠీర వమురీతిన్ = సింహమువలె, పొదలెడు, ఈ వీరున్ = ఈ కర్ణుని, కుది యించి, మనసేన, కావుము, అను, హరి = కృష్ణుని, సార్థములైన, వాక్య ములు, రవిజున్ = కర్ణుని, తలపడన్, తెలుపునంతన, ఆ నిశాటుఁడు = ఘటోత్కచుఁడు, అంగదన్ = వేడ్కచే, ధర్మనందన=ధర్మజుని, గంధవ హాజ = భీముని, నా సత్యసుత = నకుల సహదేవుల, చమూనాథాదిక = సేనాపతియగు ధృష్టద్యుమ్నుఁడు మున్నగువారి, పులకస్ఫూర్తి = రోమాంచమునకుఁ గారణమైన, పౌలుపులోద్గత్, దివసనాయకుప ట్టిపైన్ = కర్ణునిపై, కవిసి, తత్=ఆ కర్ణుని, ప్రహారయత్నంబు, వైఫల్య మందన్ చేసి, దివ్య = శ్రేష్ఠములగు, బాణచక్ర = బాణసమూహమును, ప్రాస = ఈటెలును, శూలమును, ముఖ్య = మొదలగు వానియొక్క, ప్రయోగవిస్ఫురణన్ = ప్రయోగస్ఫూర్తిని, నెఱపెన్.

శా. కర్ణునివలన మననేనంగావుమను విష్ణుని మాటచే ఘటోత్క చుఁడాకర్ణుంజేరి, ధర్మజాదులకుఁ బులకలు మొలవఁగఁజేయుచు నాతని ప్రహారయత్నము వ్యర్థపఱపి ప్రాసాద్యాయుధముల నాతనిపై నెఱపెను.
వ. అతండును దానికిఁ జలింపక సుస్థిరుండయ్యె నప్పుడు. 198

తే. అంతరమునంద యాశుగ సంతతివడి
నందికొని త్రుంచె దైత్యారి తాయుధమును
దనుజుఁ డపరిమేయపలాశి ఘనశిలాభి
హతి నినజు నుగ్రమన్యుమూర్ఛితునిఁ జేసె. 199

**రామాయణ భారతార్థములు సమము.**

అర్థము. అంతరమునంద = నడుమన, [రామాయణ] ఆశుగసంతతి = హనుమంతుఁడు, వడిన్ = వేగముచే [భారత] ఆశుగసంతతి = బాణసమూహము యొక్క, వడిన్ = వేగముచే, అందికొని, దైత్యారిత = [రామా. కుంభకర్ణునిచే విడువఁబడిన, భార. ఘటోత్కచునిచే విడువఁబడిన, ఆయుధమును = శూలమును, త్రుంచెన్. [భారతార్థమునఁ గర్ణుఁడనుకర్త యధ్యాహార్యము.] దనుజుఁడు = [రామా. కుంభకర్ణుఁడు, భార. ఘటోత్కచుఁడు,] [రామాయణ] అపరిమేయపలాశి = మిక్కుట మగు మాంసముదినువాఁడు, ఘనశిలాభిహతిన్ గొప్పఱాళ్లచేఁ గొట్టుటను, [భారత] అపరిమేయమైన, పలాశి = వృక్షములయొక్కయు, ఘన శిలలయొక్కయు, అభిహతిచేతను [రామాయణ] ఉగ్రమన్యున్, ఇన జున్ = సుగ్రీవుని, మూర్ఛితునిం జేసెను = మూర్ఛనందులాగొనర్చెను. [భారత] ఇనజున్ = కర్ణుని, ఉగ్రమగు మన్యువుచే, మూర్ఛితునిగన్ = వ్యాపించినవానినిగా, చేసెన్.

తాత్పర్యము సుగమము.

ఆ. అంత నిలక యమ్మహాబలునిగృహీతుఁ
జేసి శత్రుబలవిజృంభణంబు
రూపుసెడ హరింతు నేపున నావార
లెల్ల జూచి సంతసిల్ల ననుచు. 200

**రామాయణ భారతార్థములు సమము.**

అర్థము. అంతనిలక = నిలువక, [రామాయణ.] అమ్మహాబలుని = ఆ గొప్పబలముగల సుగ్రీవుని, గృహీతుఁజేసి = గ్రహించి, [భారత], అమ్మహాబలున్ = ఆ కర్ణుని, నిగృహీతుఁజేసి = నిగ్రహించి, శత్రుబల విజృంభణంబుచేసి, రూపుచెడునట్లుగా, ఏపునన్, నావారలెల్లన్, చూచి, సంతసిల్లన్, హరింతున్.

తాత్పర్యము సుగమము.

తే. రాక్షసుండు ఖేలాగతి భ్రాజియగుచు
నర్కనందను నెత్తి బాహాంతరమున
నానఁగ మహాశుగంబులవానఁ గురిసెఁ
దద్బలంబుల మనములు దల్లడిలఁగ. 201

**రామాయణ.** రాక్షసుండు = కుంభకర్ణుఁడు, ఖేలాగతి భ్రాజియగుచున్ = లీలాగమనమున నొప్పువాఁడగుచు, అర్కనందనున్ = సుగ్రీవుని, ఎత్తి, బాహాంతరమునన్ = చంకను, ఆనఁగన్ = నిల్పుకొనఁగ, తన్ = ఆ సుగ్రీవుని, బలంబుల యొక్క, మనంబులు, తల్లడిలఁగన్, మహాశుక్ = గొప్పశోకముపలని, అంబులవాన = జలవర్షము, కురిసెన్, కన్నీరు గారెననుట.

తాత్పర్యము సుగమము.

**భారత.** రాక్షసుండు = ఘటోత్కచుఁడు, ఖ + ఇలాగతి భ్రాజియగుచున్ = ఆకసమునను, నేలనుందిరుగుటచే నొప్పువాఁడగుచు, అర్క

నందను = కర్ణుని, నెత్తిన్ = శిరమునను, బాహాంతరమునన్ = వక్షము
నను, అనఁగన్ = అనునట్లుగా, తత్ = ఆకర్ణుని, బలంబులయొక్క,
మనములు = మనస్సులు, తల్లడిలఁగన్, మహా ఆశుగంబులవాన = గొప్ప
బాణవృష్టి, కురిసెను.

తాత్పర్యము సుగమము.

సీ. అరికినట్లగపడి ♦ యనిషేధనీయమా
నుండై వివస్వత్తనూభవుండు
గడునంతఁ దెలివొంది ♦ కటకటా! వీఁడింత
చేయునే యేనిదె ♦ చెండివైతు
వెసవీని నత్యంత ♦ విశ్రుతి నాసత్వ
మును జెందునట్లుగా ♦ ననుచు రేసి
సరభసోత్థానుఁడై ♦ కరముల సద్దశ
నమ్ముల నైపుణి ♦ ముమ్మరముగఁ

ఆ. దనతలఁచినయట్లు ♦ దనుజశార్దూలు న
వార్య మన్యువికృత ♦ వదనుఁగాఁగ
నవయవములు వ్రచ్చి ♦ యభ్రమ్మునకుఁ బ్రాఁకి
నడఁచె వాఁడు పిడుగు ♦ నట్లు మ్రోయు. 202

**రామాయణ.** అరికిన్ = కుంభకర్ణునకు, అట్లుకనుక్, అగపడి =
చిక్కి, అనిషేధ = అడ్డులేనట్లు, నీయమానుండై = కొనిపోవఁబడు
చుండువాఁడై, వివస్వత్తనూభవుండు = సుగ్రీవుఁడు, అంతన్, తెలి
వొంది = మూర్ఛదేఱి, కటకటా, వీఁడు = కుంభకర్ణుఁడు, ఇంత చేయునే,
ఏన్, వీనిన్, అత్యంత = మిక్కిలి, విశ్రుతి నాసత్వమును చెందు
నట్లుగాన్ = విగతమైన కర్ణనాసికములు గల్గుటం జెందునట్లుగా, ముక్కు
చెవులులేని వాఁడగునట్లనుట; ఇదె వెసన్, చెండివైతున్ = త్రెళ్లింతును,

అనుచున్, రేసి = చెలఁగి, సరభసోత్థానుఁడై = వేగముతోఁ గూడిన పైకెగయుట గలవాఁడై; వేగముగాఁ బైకెగిసి యనుట; కరములన్, సద్ధ శనమ్ముల్ = వాఁడిపండ్లను, నైపుణి, నుమ్మరముగన్=అతిశయింపఁగా, తన తలఁచినయట్లు = తాను దలఁచినలాగున, అవార్యమగు, మన్యున్ = కోపముగల, దనుజశార్దూలున్ = రాక్షసశ్రేష్ఠుఁడగు కుంభకర్ణుని, వికృతవదనున్, కాఁగన్ = వికారమునందిన ముఖముగలవానినిగా, అవయవములు = కర్ణనాసములు, వ్రచ్చి = ఛేదించి, అభ్రమ్మునకున్ = ఆకసమునకు, పాఱన్, వాఁడున్ = ఆ కుంభకర్ణుఁడును, పిడుగునట్లు మ్రోయన్ = పిడుగువలె శబ్దింపఁగా, అడఁచెన్ = గ్రుద్దెను.

తా. కుంభకర్ణుఁడు సుగ్రీవునెత్తికొనిపోవుచుండ నాతఁడు మూర్ఛ దేఱి వేగముగానెగసి, చెలంగుచు నాతని చెవులను, ముక్కును, గోళ్లచేతను, పండ్లచేతను ఛేదించి వికృతవదనుంగావించి యాకసమున కెగయఁగా నా కుంభకర్ణుఁడు పిడుగువలె మ్రోయుచుఁ బిడికిట వానిం గ్రుద్దెను.

భారత. అరికిన్ = ఘటోత్కచునకు, అట్లు, కడున్, అగ పడి = చిక్కి, అనిషేధనీయ = అడ్డగింపశక్యముగాని, మానుండై = అభిమానము గలవాఁడై, రోషావేశపరవశుఁడైయనుట; వివస్వత్తనూ భవుండు = కర్ణుఁడు, తెలివొంది = ధైర్యముతెచ్చికొని, కటకటా, వీఁ డింతచేయునే, వీన్, వీనిన్=ఈ ఘటోత్కచుని, అత్యంతము, విశ్రుత = ప్రసిద్ధమైన, నా సత్త్వమును=నా బలమును, చెందునట్లుగాన్, నాబలము నకుఁ గీర్తికల్గులాగున ననుట; ఇదె వెసన్, చెండివైతున్=సంహరింతును, అనుచున్, రేసి, సరభస=వేగముతోఁ గూడిన, ఉత్థానుఁడై=ఉత్సాహము గలవాఁడయి, కరము = మిక్కిలి, లసద్దశన్ = ఒప్పిదమైన స్థితిచే, అమ్ములనైపుణి=బాణచాతుర్యము, ముమ్మరమ్మునగన్, తనతలఁచినయట్లు, దనుజశార్దూలున్ = ఘటోత్కచుని, అవార్యమన్యువున, వికృతమైన వద

నన్, కాఁగన్, అవయవములు, వ్రచ్చి, వాఁడు = ఘటోత్కచుఁడు, పిడుగునట్లు, మ్రోయన్, అభ్రమ్మునకున్, పాఱనడఁచెన్ = ఆకసమునకుఁ బాఱఁగొట్టెను.

తా. శత్రువున కిట్లు చిక్కి రోషావేశ పరవశుఁడై కర్ణుఁడు ధైర్యమున వీని సంహరింతునని తలఁచి వాని యవయవముల బాణములచే భేదించి యాకసమ్మునకు పాఱనడఁచెను.

రామాయణార్థమున, నాసత్వమునవియు, భారతార్థమున నాసత్త్వమునని తకార ద్విత్వమును గల్గుటకు; "అనచిచ" యను సూత్రమాధార మగును.

వ. అప్పుడప్పద్మబంధునందనుఁడు. 203

తే. ఈతెఱంగున ఘనదైత్యుచేత నొవ్వఁ
బొదువఁబడియునుఁ గ్రమ్మఱఁ బొదువనీక
చనియె ననిభృతప్రీతితోఁ బ్రనుతి సేయఁ
దన బలము గూడ దనుజుండు గనలె మిగుల. 204

రామాయణ. ఈతెఱంగునన్, ఘనదైత్యుచేతన్ = కుంభకర్ణునిచే, నొవ్వన్ పొదువఁబడియునున్ = నొచ్చునట్లు పట్టువడియును, క్రమ్మఱన్, పొదువనీక = పట్టనీయక, అనిభృతప్రీతితోన్ = వ్యక్తమైన ప్రీతితో, వినుతి, చేయన్, తనబలము, గూడన్, చనియెన్, [సుగ్రీవుఁడను కర్త యధ్యాహార్యము.] దనుజుండు కుంభకర్ణుఁడు, మిగులన్, కనలెన్.

తా. సుగ్రీవుఁడు కుంభకర్ణునకుఁ జిక్కియుఁ దప్పి మరలఁ దన్నుఁ బట్టనీక, ప్రీతితోఁ దనబలము స్తుతించుచుండ దాఁటిపోయెను. కుంభకర్ణుఁడు కెంతయు నలిగెను.

భారత. ఇత్తెఱంగునన్, ఘనదైత్యుచేతన్ = ఘటోత్కచునిచే, నొవ్వన్, పొదువఁబడియునున్, క్రమ్మఱన్ = మరల, పొదువన్ =

జయింప, నీక = నీకే, చనియెన్ = చెల్లెను, అని, భృత = భరింపఁబడిన, ప్రీతితోన్, వినుతి, చేయన్, తనబలము, కూడన్ = చేర, చనియెన్, [కర్ణుడనుకర్త యధ్యాహార్యము.] దనుజుండు = ఘటోత్కచుఁడు, మిగులన్, కనలెన్.

తా. ఇట్లు శత్రువునకుంజిక్కి తప్పి మరలవానికిం జిక్కకుండుట నీకె చెల్లెనని తనసేన నుతింపఁ గర్ణుఁడు దానిఁజేరెను. కావున ఘటోత్కచుఁడు మిక్కిలి కోపించెను.

ఉత్సాహ. కనలి యసుర ప్రళయకాలుకరణిఁబేర్చి పగఱ బ
 లౌఘనల కుటికియుటికి చదియ మోది యాశు భక్షణం
 బునమదించు తనకుజడిసి పోటుదొరలు దెరలఁగా
 వనజమిత్రు సంతతి ననవద్యుఁ జేరెఁ బోరికిన్. 205

రామాయణ భారతార్థములు సమము.

అర్థము. కనలి, అసుర. [రామా. కుంభకర్ణుఁడు, భార. ఘటోత్కచుఁడు] ప్రళయమునందలి, కాలుకరణిన్, పేర్చి=విజృంభించి, పగఱ = శాత్రవుల, బలౌఘనలకున్, ఉటికి, ఉటికి, చదియన్, మోది = కొట్టి [రామాయణ] ఆశు=శీఘ్రమునుగా, భక్షణంబునన్=తినుటచే, [భారత] ఆ, శుభమైన, క్షణంబునన్ = ఉత్సవముచే, మదించునట్టి, తనకున్, జడిసి = భీతిలి, పోటుకొరలు = రణశూరులు, దొరలఁగాన్, అనవద్యున్, వనజమిత్రు సంతతిన్ = [రామా. సూర్యవంశమున జనించినరాముని, భార. కర్ణుని, పోరికిన్, చేరెన్.

తాత్పర్యము సుగమము.

వ. చేరి యిట్లనియె. 206

సీ. వినునీవు వాంద్రవీంద్రుడను జయించితినని
 క్రొవ్వకుమిచట నకొక్కఁలఁదిఁబోదు

భూరిప్రతాప సిం ధూర యశశ్చామ
రాత్యలంకృత కకు బంతదంతి
కుంభకర్ణుఁడు రణ క్రూరుండు భీమసు
తుం డాహుత త్వదు ద్దండబలుఁడు
బలిరక్కసుఁడు పోరఁ బ్రబ్బినాఁ డిట్టి న
న్నెఱిఁగి మార్కొను మిప్పు డేఁబృథురణ
తే. వైభవాలంబ సదనుజ వధవిధి నినుఁ
గలఁచి ఝుదె ప్రమింగఁ గడిసితి నిలునిలు మని
ప్రౌఢిఁ గనుటకుఁ దగ దాశ రథివరేణ్య
కర్ణకఠినముల్ నీశౌర్య కథలు సభల. 207

రామాయణ. దాశరథివరేణ్య = ఓరాముఁడా, నీవు, వినుము, వాంద్రక్, పీంద్రను, జయించితివని = సామాన్యులను జయించితివని, క్రొవ్వకుము = గర్వపడకుము, ఇచటక్ = నాయెడ, అక్కాలఁదిక్ పోదు = అట్లుపోవదు, నాయెడ వాంద్ర పీంద్రను జయించినట్లు సాఁగదని భావము; భూరిప్రతాపమనెడి, సిందూరముచేతను, యశస్సనెడి, చామరములచేతను, అత్యలంకృతమైన, కకుబంతదంతి = దిగంతము లందలి గజములఁగలవాఁడు, రణమునందుఁ, క్రూరుండు, భీమ = భయంకరమైన, సు = శ్రేష్ఠమైన, తుండ = ముఖమున, ఆహుత = వ్రేల్వఁబడిన, త్వత్ = నీయొక్క, ఉద్దండమైన, బలుఁడు = బలమును గలవాఁడు, బలిరక్కసుఁడు, కుంభకర్ణుఁడు, [ఇటఁ దన నామము దాను జెప్పికొనుట యహంకృతిమూలకమగును.] పోరక్, ప్రబ్బినాఁడు = అబ్బినాఁడు, ఇట్టి నన్ను; ఎఱిఁగి, మార్కొనుము = ఎదిరింపుము, ఇప్పుడు, ఏక్, పృథు = అధికమైన, రణమును, ఆలంబముగాఁగల, సత్ = లెస్సైన, అనుజ = తమ్మునియొక్క, లక్ష్మణునియొక్కయనుట; వధవిధిక్ = చంపువట్టి

శౌర్యముచే, నినుఁ, కలఁచి = కలఁతపెట్టి, ఇదె, క్రమింగన్, కదిసితిని,
అని=యుద్ధమునందలి, ప్రౌఢి, కనుటకున్, తగన్, నిలునిలుము, సభలన్,
నీశౌర్యకథలు, కర్ణకఠినముల్=వినఁగూడని వగుచున్నవి.

తా. ఓరామచంద్రా! సామాన్యుల నేరినో జయించితినని గర్వింపకుము; నాయొద్ద నట్లు, జయించుట సాఁగదు. దిగంతవ్యాప్త ప్రతాపకీర్తులు గలవాఁడను, కుంభకర్ణుఁ డనువాఁడను, ఘోర నాహుతి గావింపఁబడు నీ బలముగలవాఁడను, యుద్ధమునకు వచ్చితినిగాన నన్నెఱిఁగి యెదిరించుము, ఇదె నీతమ్మునింజంపి నీ మనస్సును గలఁతపఱచి నిన్ను క్రమింగెదను యుద్ధమునందలి ప్రౌఢతఁగాంచ నిలువుము, నీ కథలు కర్ణపరుషము లగునవి.

భారత. రథివరేణ్య = రథికశ్రేష్ఠుఁడగు, కర్ణ = ఓకర్ణుఁడా, నీవు వినుము, వాంద్రకన్, సింద్రడను, జయించితినని, క్రొవ్వకుము, ఇచటన్, అక్కొలఁదిన్ పోదు = ఆలాగుసాఁగదు, ప్రతాపమనెడి సిందూరము చేతను, యశస్సనెడి చామరములచేతను, అత్యలంకృతమైన, కకుబంతదంతి= దిగ్గజముల, కుంభకర్ణుఁడు=కుంభస్థలములును జెవులునుంగలవాఁడు, రణమునందుఁ, క్రూరుఁడు, భీమసుతుండు = భీమునికుమారుఁడు, ఆహుత = భస్మమొనర్పఁబడిన, తృత్, ఉద్దండ, బలుఁడు, బలురక్కసుఁడు,పోరన్ ప్రబ్బినాఁడు =యుద్ధము సేయ నబ్బినాఁడు, ఇట్టినన్నున్, ఎఱిఁగి= తెలిసికొని, మార్కొనుము, ఇప్పుడు, ఏన్, పృథు, రణవైభవముగల, ఆలంబస = ఆలంబసునామకుఁడగు, దనుజ=అసురుని, నీ పక్షపువాఁడగు నాలంజనుఁడను నసురుని యనుట; వధవిధిన్, నినున్, కలఁచి, క్రమింగన్, ఇదే, కదిసితిన్ = ఇదె సమీపించితిని, నిలునిలుము, అని, ప్రౌఢికనుటకున్ అశతగదు = దిట్టతనమంద నీకాశవలదు, పూర్వవలె యుద్ధప్రౌఢిమను ముందరఁ దగదనుట; నీ శౌర్యకథలు, సభలన్, కఠినములు=దుర్యోధనుని సభలలోనైన నీశౌర్యకథ లుగ్గడించువా రుండుటచే నటఁ గఠినములు

గాఁవచ్చునుగాని, లేక, సభల నాడికొనుటమాత్రములోఁ గఠినములుగా నుండవచ్చును గాని, నాయెడ నవి చెల్లవనిభావము.

క. అని చూపఱ కద్భుతముగ
దనుజుఁడు యుద్ధంబుచేసి తచ్ఛక్తిఁ దుదన్
దనువు తగు లుడుపుకొనియెం
దనవారలు గలఁగఁబగరదళములు సెలఁగన్. 208

## రామాయణ భారతార్థముల సమము.

అర్థము. అని, చూపఱకున్ = చూచువారికి, అద్భుతముగన్, దనుజుఁడు = [రామా. కుంభకర్ణుఁడు, భార. ఘటోత్కచుఁడు] యుద్ధంబు, చేసి, తుదన్, తచ్ఛక్తిన్ = [రామా. రాముని బలముచే, భార = కర్ణుని శక్తిచే] తనవారలు = తనపక్షపువారు, కలఁగన్, పగరదళములు = శత్రుసేనలు, చెలఁగన్ = సంతసింపఁగా, తనువుతగులుడుపుకొనియెన్ = ప్రాణము వాసెను.

తాత్పర్యము సుగమము.

తే. అంత నత్యుగ్రమగుపోరు గొంతజరుగ
నశ్రముఁ డతికాయాభిఖ్యుఁ డఖిలరణక
ళాధికారి గాంభీర్యతోయధిఘటోద్భ
వుండు ద్రుపద ముఖ్యులఁ బలువుర వధించె. 209

భారత. అంతన్, అత్యుగ్రమగు పోరు, కొంత, జరుగన్, అశ్రముఁడు = శ్రమరహితుఁడు, అతికాయ అభిఖ్యుఁడు = అత్యంత దేహకాంతి గలవాఁడు, అఖిలమగు, రణకళకు, అధికారియగువాఁడు, గాంభీర్యమునఁ దోయధియగువాఁడు, సముద్రమువంటి గాంభీర్యము గలవాఁడనుట; ఘటోద్భవుండు=ద్రోణుఁడు, ద్రుపదముఖ్యులన్=ద్రుపదుఁడు మున్నగు, పలువురన్, వధించెన్.

తాత్పర్యము సుగమము.

మ. అనివార్యుం డతఁ డంతటం దనయమిథ్యామృత్యువార్తాప్రవ
ర్తనచేతం గురుమానసార్పిత విషాదగ్లానియయ్యెం దనుం
దను నిర్ముక్తునిఁ జేయుచు న్విశిఖసంధానాతివేగప్రపం
చన సౌమిత్రి యనేక యుద్ధకృతిధృష్టద్యుమ్నుఁ డేపారఁగన్.

అవతారిక. అతికాయ యుద్ధము, మరణమును, ద్రోణునియుద్ధమునకు
రణమును జంటించి కవి వ్రాసెను.

**రామాయణ** అనివార్యుండు = నివారింపఁగా రానివాఁడు, అతఁ
డు = ఆ యతికాయుఁడు, అంతటన్ = సర్వత్ర, విశిఖసంధాన = బాణ
ప్రయోగమునందలి, అతివేగమును, ప్రపంచన = విస్తరింపఁజేయు, అనే
కములైన, యుద్ధకృతి = యుద్ధకార్యములయందు, ధృష్టమైన, ద్యుమ్న =
సత్త్వముగల, సౌమిత్రి = లక్ష్మణుఁడు, ఏపారఁగాన్ = విజృంభింపఁగా,
తనున్ = తన్నున్, అతికాయుననుట; తనునిర్ముక్తునిన్ చేయుచున్ =
శరీరమును వీడినవానింగాఁ జేసికొనుచు, తనయొక్క, అమిథ్యా = సత్య
మైన, మృత్యు వార్తాప్రవర్తనచేతన్ = చచ్చెనను వార్త వ్యాపింపఁజేయు
టచే, గురు = తండ్రియైన రావణుని, మానస = మనస్సున, అర్పిత = ఉనుచఁ
బడిన, విషాదమువలని, గ్లాని = వైవర్ణ్యము గలవాఁడు, అయ్యెన్.

తా. అనివార్యుఁడగు నా యతికాయుఁడు, సర్వత్రఁ దనబాణవేగ
మును విస్తరింపఁజేయు లక్ష్మణుఁడు విజృంభింప నాతని విజృంభణమునకుఁ
దనప్రాణము లర్పించి, తన తండ్రియగు రావణుని మానసమున గొప్ప
దుఃఖము గల్గించెను.

"ప్రపంచన;" "పచివిస్తారే" అను ధాతువువలనఁ గల్గెను.

భారత. అనివార్యుండు, అతఁడు = ఆద్రోణుఁడు, అంతటన్ = పిమ్మట, తనయ = కుమారుఁడగు నశ్వత్థామయొక్క, మిథ్యామృత్యువార్తా ప్రవర్తనచేతన్ = అసత్యపుచావుయొక్క వ్యాపనమున, విశిఖముల సంధానముయొక్క, అతివేగమును, ప్రపంచన = విస్తరింపఁజేయుటయందు, సౌమిత్రి = లక్ష్మణుఁడగువాఁడు, బాణసంధాన వేగప్రపంచనమున లక్ష్మణునివంటి వాఁడనుట; అనేకములైన, యుద్ధకృతి=యుద్ధకార్యములుగల, ధృష్టద్యుమ్నుఁడు, ఏపారఁగాన్ = తనున్, తనునిర్ముక్తునిన్ చేయుచున్=దేహమునుండి విడుపఁబడిన వానింగాఁ జేసికొనుచు, గురు = అధికముగా, మానసమున, అర్పితమగు, విషాదమువలని, గ్లానింగల వాఁడయ్యెను.

తా. ద్రోణుఁడు దనకుమారుఁడు మరణించెనను నసత్యవార్తవ్యాపింపఁగా నాదుఃఖమున శరసంధాన వేగమున లక్ష్మణునింబోలు ధృష్టద్యుమ్నుఁడు విజృంభింపఁగాఁ, దనశరీరము వీడెను.

వ. అంత. 211

సీ. గురుదివ్య బాణచాతురిని మీఱినవాని
గారాపుఁబట్టి నఖండవిక్ర
మోగ్రు నెంతయును దుర్యోధనుం డనిగెల్పుఁ
దనకొనర్పఁగఁజాలు నని గణించి
యాతీవ్రబలు బహుభ్రాతృనాశకఘోర
తరమన్యు దశముఖుఁ డరివధమున
కత్యాదరతఁ బంచె నస్త్రనైపుణిఁ జూపె
నతఁడును బ్రతివీరులపగతఱర
తే. చేష్టలెరి తద్బృహన్నేత్ర జృంభణమున
కెదురులేక మూర్ఛన్మానమదము లడఁగఁ

దత్ప్రతివిధానకుశలాచ్యుతప్రయత్న
మున బిరుసు డింప కపు డొప్పె ననిలసుతుఁడు. 212

**రామాయణ.** గురు = అధికమైన, దివ్యమైన, బాణచాతురిని, మీఱి
నవానిన్, అఖండమైన, విక్రమముచే, ఉగ్రున్ = భయంకర మైనవానిని,
గారాపుఁబట్టిన్ = ప్రియపుత్రుఁడైన యింద్రజిత్తుని, ఎంతయున్, దుర్యో
ధనుఁడని = శత్రువులచే యుద్ధముచేయ శక్యముగాని వాఁడని, గెల్వన్,
తనకున్, ఒనర్పఁగన్, చాలునని, గణించి = తలఁచి, బహుభ్రాతృనాశ
మున, కఠోరతరమగు, మన్యున్ = కోపముగల వానిని, అతీవ్రబలున్ = తీక్ష్ణ
బలుఁడగు నాయింద్రజితుని, దశముఖుఁడు = రావణుఁడు, అరివధమునకున్,
అత్యాదరతన్, పంచెన్, అతండును = ఆయింద్రజిత్తును, అస్త్రనైపుణిన్,
చూపెన్, ప్రతివీరులు = శత్రువులు, తత్ = వానియొక్క, బ్రహ్మాస్త్ర విజృం
భణమునకున్, ఎదురులేక, మూర్ఛన్, మానమును, మదమును, అడఁగన్,
అపగత = నశించిన, రణచేష్టులైరి = యుద్ధవ్యాపారము గలవారైరి, తత్ = ఆ
యస్త్రమునకు, ప్రతివిధానమునందు, కుశల = సమర్థుఁడై, అచ్యుత =
స్థిరమైన, ప్రయత్నమునన్, బిరుసుడింపక = ఉక్కుసెడక, అప్పుడు, అనిల
సుతుఁడు = హనుమంతుఁడు, ఒప్పెన్.

తా. బాణచాతుర్యముగల ప్రియపుత్రుఁడగు నింద్రజిత్తును దనకు
విజయము సంపాదించియిచ్చునని తలఁచి శత్రువధకై రావణుఁడంపెను.
ఇంద్రజితుఁడును బ్రహ్మాస్త్రప్రయోగమున వారలసొమ్మసిలఁజేసెను. హను
మంతుఁడుమాత్రము తత్ప్రతివిధాన మెఱిఁగినవాఁ డగుటచే బిరుసుచెడక
యొప్పెను.

**భారత.** దివ్యబాణచాతురిన్, గురున్ = ద్రోణుని, మీఱినవానిన్,
గారాపుఁబట్టిన్ = ప్రియపుత్రుని, ద్రోణుని పుత్రుఁడగు నశ్వత్థామ
ననుట; అఖండ విక్రమమున, ఉగ్రుఁడైనవానిని, అతీవ్రబలున్ అనిన్ =

యుద్ధమున, ఎంతయుఁన్, తనకున్, గెల్పున్, ఒనర్పఁగన్, చాలునని, గణించి, బహుభ్రాతృనాశముచే, కఠోరతరమైన మన్యుదశగల,ముఖుఁడు= ముఖముగలవాఁడు, దుర్యోధనుండు, అరివధమునకున్, అత్యాదరతన్, పంచెన్= పంపెను, అతఁడును, అశ్వత్థామయు, అస్త్రనైపుణిన్, చూపెన్, తత్, బ్రహ్మ=బ్రాహ్మణుఁడగు నశ్వత్థామయొక్క, అస్త్ర= నారాయణాస్త్రముయొక్క, విజృంభణమునకున్, ఎదురులేక, ప్రతివీరులు, మూర్ఛత్=వ్యాపించెడు, మానమదములు, అడఁగన్, తత్=ఆయస్త్రము నకు, ప్రతివిధానమునందు, కుశలుఁడైన, అచ్యుతుని, ప్రయత్నమున, అప గత=విడువఁబడిన, రణచేష్టులై, కృష్ణునిమాటలచే నాయుధములం బడ వైచి దానికి నమస్కరించిరని భావము; అపుడు, అనిలసుతుఁడు=భీముఁడు, బిరుసుడింపక యొప్పెను, నమస్కరింపకుండెననుట.

తా. దుర్యోధనుఁ డశ్వత్థామ, దనకు జయము గల్గించునని తలంచి శత్రువధమున కాతని నంపెను. అతఁడు నారాయణాస్త్రము వైచెను. కృష్ణునీ యానతిచే భీముఁడు దక్కఁ దక్కినవా రాయుధములం బడవైచి నమస్కరించిరి. భీముఁడుమాత్రము నమస్కరింపక యుండెను.

వ. అంత. 213

ఆ. అతఁడు సకలసైన్య వితతిని సంజవ
నౌషధీసమాన యన విహితపు
నఃప్రతిష్ఠగా నొనర్చి వర్ణన కెక్కు
శౌర్య విక్రమనయ చర్యనడపె. 214

## రామాయణ భారతార్థములు సమము.

అర్థము. అతఁడు=[రామా. ఆంజనేయుఁడు, భార.భీముఁడు,] సకల మైన, సైన్యము యొక్క,వితతిని=సమూహమును, [రామాయణ.] సంజీవ నౌషధీ సమానయన=సంజీవ నౌషధిని దీసికొని వచ్చుటచే,[భారత.] సం

జీవ నౌషధితో సమాన మనులాగున, విహిత, పునః ప్రతిష్ఠగాన్=మరల నిల్పఁబడినదిగా, ఒనర్చి, వర్ణనకెక్కు, శౌర్య విక్రమనయ చర్య=[రామా.] పరాక్రమము యొక్కయు, సామర్థ్యము యొక్కయు, నీతి యొక్కయు, చర్య, [భార] శౌరియొక్క, కృష్ణునియొక్కయనుట; విక్రమ రహితమైన నీతి చర్యను,] నడపెను.

తే. అపుడుమనుజేంద్రముఖ్యు లాకహరి నుతించి
రనఘనీదు మహత్త్వమేకమని పొగడఁగ
వచ్చు నారాయణ మహాస్త్ర క వైభవమిటు
లఫలముగఁ జేసి రిపుల క్రొక్క వ్వడఁచి తనుచు. 215

**రామాయణ భారతార్థములు సమము.**

అర్థము. అపుడు,మనుజేంద్ర ముఖ్యులు=[రామా. రామాదులు, భార. ధర్మజాదులు,] అనఘ, నీదు, మహత్త్వము, =గొప్పదనము, ఏమనిపొగడఁగవచ్చున్, నారాయణ మహాస్త్రివైభవము = [రామా. ఆశ్చర్యము, మహాస్త్రిముయొక్క వైభవము, ఇటనారాయణ శబ్దమాశ్చర్యసూచకము; భార. నారాయణాస్త్రిము యొక్క వైభవము,] ఇటుల్, అఫలముగన్= ఫలహీనముగా, చేసి,రిపులక్రొవ్వు, అడఁచితి=నశింపఁజేసితివి, అనుచున్, హరిన్=[రామా. ఆహూంజనేయుని, భార. ఆకృష్ణుని,] నుతించిరి.

తాత్పర్యము సుగమము.

లోకమున నాశ్చర్య సూచకముగ సాధారణమగు వాడుకలోనుండు నారాయణశబ్ద మిటఁగూర్చుట మిక్కిలి చమత్కారకారియగుచున్నది.

చ. అలఘు విపన్మహార్ణవముక నట్లు తరించి పునర్మహోద్ధతిన్
వెలిఁగెడువారిఁదద్రజని క వేగ భయంకరలీలఁ దాఁకి వెం
పలరఁగఁబోరెవైరిచయకమర్కుజుఁడందువహించెమిక్కిలి
న్బలిమిఁబ్రకంపితస్వపృతకనాపరిపాలనకార్యభారమున్.

## రామాయణ భారతార్థములు సమము.

అర్థము. అలఘు, విపత్తి సెడి, మహార్ణవమును. అట్లు, తరించి=దాఁటి, పునః=మరల, మహోద్ధతిన్, వెలిఁగెడువారిన్, వైరిచయము, [రామాయణ] తద్రజనిన్=ఆరాత్రియందు, వేగన్=శీఘ్రముగా, [భారత.] తద్రజని=ఆరాత్రి, వేగన్=వేగఁగనే, భయంకర లీలన్, తాఁకి, పెంపు, అలరఁగన్, పోరన్=యుద్ధమొనర్చెను, అందున్=ఆయుద్ధమున, అర్కజుఁడు=[రామా. సుగ్రీవుఁడు, భార. కర్ణుఁడు,] మిక్కిలిన్, బలిమిన్, ప్రకంపితమైన, స్వపృతనాంతన సైన్యము యొక్క, కార్యభారమున్, వహించెన్;

తాత్పర్యము సుగమము.

మ. రవిపుత్త్రుండని కిట్టుపూని ప్రతిగర్జద్వీరసంహార క్ల
ప్తి విరాజచ్ఛరభీష్మకుంభజయశోభివ్యాప్తిమీఱన్ మను
ష్యవిభుం డుబ్బఁగ నంత నాప్రబలదోషాచారితోఁ బుట్టువు
న్భువిఁ గూల్చె న్బవనాత్మజుండు బలిమిన్దుశ్శాసనాభిఖ్యునిన్.

**రామాయణ.** రవిపుత్రుండు=సుగ్రీవుఁడు, అనికిన్, ఇట్లు, పూని, ప్రతి...వ్యాప్తిన్; ప్రతిగర్జత్=మాఱుమలయుచున్న, వీరసంహార=శత్రుసంహారము యొక్క, క్లప్తిన్=కార్యముచే, విరాజత్=ప్రకాశించుచున్న, శరములచే, భీష్మ=భయంకరుఁడైన, కుంభుని యొక్క జయముచే, శోభించెడి, వ్యాప్తిన్=వ్యాపారముచే, మనుష్యవిభుండు=రాముఁడు, ఉబ్బఁగన్, మీఱన్, అంతన్, ఆప్రబల దోషాచారి=రాత్రించరుఁడగు కుంభుని, తోఁబుట్టువున్=సోదరుని, నికుంభుననుట; దుశ్శాసనమైన, అభిఖ్యన్=కాంతిగలవానిని, పవనాత్మజుండు=ఆంజనేయుఁడు, బలిమిన్, భువిన్. కూల్చెన్.

తా. సుగ్రీవుఁడిట్లు యుద్ధమునకుఁబూని పరాక్రమశాలియగు కుంభుని విజయమున శోభిల్లెను, అంతనతని తమ్ముఁడగు నికుంభుని హనుమంతుఁడు గూల్చెను.

భారత. రవిపుత్రుండు=కర్ణుఁడు, ఇట్లు, ఆని౯, పూని, ప్రతిగర్జత్, వీర, సంహార, క్షిప్తి, విరాజత్, శరములుగ, భీష్మునియొక్కయు, కుంభజుని యొక్కయు, యశః=కీర్తియొక్క, అభివ్యాప్తి౯, మనుష్యవిభుండు=దుర్యోధనుఁడు, ఉబ్బఁగ౯, మీఱె౯, అంత౯, అప్రబలమగు, దోషాచారి = దోషయుక్తములగు నాచారములుగల దుర్యోధనుని, తోఁబుట్టువు౯, దుశ్శాసనాభిఖ్యుని౯, = దుశ్శాసనుఁడను పేరుగలవానిని, పవనాత్మజుండు = భీముఁడు, బలిమి౯, భువి౯, కూల్చె౯.

తా. కర్ణుఁడు దుర్యోధనుఁడు సంతసింపులాగున భీష్మద్రోణులకంటె మీఱెను. భీముఁడు దుర్యోధనుని తోఁబుట్టువగు దుశ్శాసనునిం గూల్చెను.

ఇట, 'దోషాచారి' అనునపుడు రామాయణార్థమున, దోః,షాచారి అని షకారము యతియగుట వ్యంజన యతియు, భారతార్థమున, దోష+ఆచారిఅని ఆకారము యతియగుట స్వరయతియు నగుచుండుటచేఁ బాదాదిని; మను; ష్యవిభుండని రెంటికి సరిపడునట్లు ష్య యను నది ప్రయోగింపంబడెను.

వ. అంత. 218

సీ. ఆహవమహిమకర్కరాక్షయాతు లసత్ప్ర
తాప మత్యంతమ్ముఁగదనరఁగనలి
సూర్యసంతతి నరవర్యుఁడు సాహసా
ద్ధత్యశౌర్యాదిదుర్దాంతవృత్తిఁ

ప్రబలువానిని ధర్మ రాజువీడు సొరంగఁ
దఱిమె బాణముల నెంతయుఁ గలంచి
తద్భ్రాతృభంగ మంతయు నప్పు డరసివా
సవి నిర్గతుండయి సరభసమున

ఆ. స్వాశ్రిత నికురుంబ వనశిఖి మేఘనా
దాభిధానుఁ డాబలాఢ్యుమీఁద
నడచిదుర మొనర్చె నభమున నుండి ని
ర్జరులు బెగడ నిగుడు సాయకముల. 219

**రామాయణ.** ఆహవమహిన్ = యుద్ధభూమియందు, మకరాక్షుఁడనెడి, యాతు = రాక్షసుని, లసత్, ప్రతాపము, అత్యంతమ్మతనరన్ = అతిశయింపఁగా, కనలి, సూర్యసంతతి నరవర్యుఁడు = సూర్యవంశపురాజు, రాముఁడనుట; సాహసము, ఔద్ధత్యము, శౌర్యము, ఆది = మొదలగు, దుర్దాంత = అణఁపరాని, వృత్తిన్ = వ్యాపారముచే, ప్రబలువానిని, మకరాక్షు ననుట; బలములన్, ఎంతయున్ కలంచి, ధర్మరాజు వీడు = యమలోకమును, చొరఁగన్, తఱిమెన్, చంపెననుట ; మేఘనాదాభిధానుఁడు = ఇంద్రజిత్తు, తత్ భ్రాతృ భంగమంతయున్ = మకరాక్షుని మరణమంతయు, అప్పుడు = అరసి, విచారించి, రభసమునన్, వాస=వాసభవనమునుండి,వినిర్గతుండయి,స్వాశ్రిత నికురుంబ=దేవతల సమూహమనెడి, వనమునకు, శిఖి=అగ్నియగుచు, ఆబలాఢ్యు మీఁదన్ = సేనాపరివృతుఁడగు నా రామునిమీఁద నడచి, నిర్జరులు=దేవతలు, బెగడన్, నభమునుండి, నిగుడుచుండు, సాయకములన్, దురమొనర్చెను.

**తా.** మకరాక్షుఁడు యుద్ధమునకు రాఁగ రాముఁ డాతనిం జంపెను మకరాక్షుని చావు దెలిసి యింద్రజిత్తు యుద్ధమునకు వచ్చి యాకసము న

నుండి రామునిపై బాణములు వైచుచు దేవతలు భీతిలునట్లు యుద్ధ మొనర్చెను.

భారత. ఆహవ మహిమకర = యుద్ధమునకుఁ బ్రభావము గలుగఁ జేయుచున్న, అక్షయమయిన, అతుల = సాటిలేని, సత్ప్రతాపము, తన రక్, సూర్యసంతతి నరవర్యుండు = కర్ణుఁడు, సాహస ఔద్ధత్య, శౌర్య, ఆది, దుర్దాంతమైన, వృత్తిక్ = ప్రవృత్తిచే, ప్రబలువానిని, ధర్మరాజుక్, బాణములక్, ఎంతయుక్, కలంచి = కలఁతపెట్టి, వీడు చూరంగక్. తఱిమెక్ = మరలఁ దన శిబిరము చొచ్చునట్లు తఱిమెను, వాసవి = అర్జునుఁడు, తద్భ్రాతృ భంగము = తన యన్నయొక్క భంగము, అంతయుక్, అరసి, అప్పుడు సరభసమునక్, నిర్గతుండయి = యుద్ధమునకు వెడలినవాఁడయి, స్వాశ్రిత నికురుంబ = తనయాశ్రితుల సమూహమనెడి, వనశిఖి = అడవినెమిళ్లకు, మేఘనాదమువంటి, అభిధానుఁడు = పేరుగల వాఁడగుచు, ఆబలాఢ్యు మీఁదక్ = బలాఢ్యుఁడగు నా కర్ణునిమీఁద, నడచి, నభమునుండి, నిర్జరులు, బెగడక్, నిగుడునట్టి సాయకములక్, దుర మొనర్చెను.

తా. కర్ణుఁడు తనబలమున ధర్మజుని నొప్పించి శిబిరమునకుఁ బోవునట్లు తఱిమెను. అర్జునుఁడిది తెలిసివచ్చి దేవతలు బెగడునట్లా కర్ణునిపైకి వచ్చి బాణములతో యుద్ధ మొనర్చెను.

రామాయణార్థమున న్వః + శ్రితయనియు, భారతార్థమున, స్వ+ శ్రితయనియు రూపమగుట, "శర్పరే విసర్జనీయః" అను సూత్రముచేఁ గల్గెను.

వ. ఇట్లు పోరిపోరి.

ఉత్సాహ. వెరవు నేపుఁ జూపెడు ప్రతివీరు విక్రమక్రియా
గరిమమును సహింపలేక కనులను దొఱఁగిపోయి తాఁ

దిరిగివచ్చె నీతఁ డింకఁ దెగువ మిగుల నెరప కె
ట్లొరుగుననుచు సహితబలము లలికి కలఁగఁ జెలఁగుచున్.

**రామాయణ భారతార్థములు సమము.**

అర్థము. ఈతఁడు=[రామా. ఈ యింద్రజిత్తు, భార. ఈ యర్జునుఁడు, నెరవున్ = ఉపాయమును, ఏపున్ = గర్వమును, చూపెడు, ప్రతివీరు = [రామా. రాముని, భార. కర్ణుని,] విక్రమక్రియయొక్క, [రామా. గరిమన్ = మహిమను, మును = మున్ను, భార. గరిమమును,] సహింపలేక, కనలుచు, తొలఁగిపోయి=దాఁగి, తాన్, తిరిగి, వచ్చెన్, ఇంకన్, తెగువ = సాహసము, మిగులన్, నెరపక, ఎట్లొరుగును, అనుచున్, అహితబలములు = [రామా. వానరసేనలు, భార. కౌరవసేనలు], అలికి = భయపడి, కలఁగన్, చెలఁగుచున్.

తాత్పర్యము సుగమము.

మ. బలదీప్తాశుగ సంతతి ప్రబలిత స్ఫార ప్రతాపోదయో
జ్జ్వల సంయద్రభసంబురుద్రుమఖసంచారక్రియన్ మీఱఁగా
నలఁగించె న్ప్రతివీరు నట్టియెడ నాకనాకీశ సంతానమ
య్యలఘుస్థేముఁడుతత్ప్రతాపశిఖమాకయం జేసియార్చెందగన్

**రామాయణ.** బలముచే దీప్తుఁడైన, ఆశుగసంతతి = వాయుపుత్రుఁడైన హనుమంతుఁడు, ప్రబలిత......రభసంబు; ప్రబలిత = ప్రబలముగాఁ జేయఁబడిన, స్ఫార=విస్తారమైన, ప్రతాపోదయముచే, ఉజ్జ్వలమగుచున్న, సంయత్ = యుద్ధమందలి, రభసంబు=ఆటోపము, ఉరు = అధికమైన, ద్రుమములయొక్క, ఖసంచార క్రియన్ = ఆకాశమున సంచరించు కార్యముచే, మీఱఁగాన్, అట్టియెడన్, ప్రతివీరున్ = ఇంద్రజిత్తును, నలఁగించెన్, అయ్యలఘుస్థేముఁడున్ = అతి స్థైర్యవంతుఁడగు

నా యింద్రజిత్తు, తత్=ఆ హనుమంతుని, ప్రతాపశిఖి = ప్రతాపాగ్నిని, మాయన్ చేసి = మాయచే, తగన్, ఆర్చెన్ = చల్లార్చెను.

తా. హనుమంతుఁడు వృక్షముల నాకసమున కెగురవైచుచు నా యింద్రజిత్తును నలిఁగించెను. అతఁడును మాయాయుద్ధమున నాతని పరాక్రమాగ్ని నార్చెను.

"సం యత్" "సంయత్సమిత్యా జిసమిద్యుద్ధ" అమరము.

భారత. బలదీప్తమయిన, ఆశుగ = బాణముల, సంతతి = సమూహముచే, ప్రబలితమైన, స్ఫారమైన, ప్రతాపోదయముచే, ఉజ్జ్వల = ప్రకాశించుచున్న, సంయత్=యుద్ధమునందలి, రభసంబు, రుద్రుమఖసంచారక్రియన్ = రుద్రునియొక్క దక్షాధ్వర క్రీడను, మీఱఁగాన్ = మించఁగా, అట్టిమెడన్, ఆనాకీశ సంతానము = ఆ యర్జునుఁడు, ప్రతివీరున్=కర్ణుని, నలఁగించెన్, అత్యులఘుస్థైర్యుఁడగు కర్ణుఁడును, తత్=ఆ యర్జునుని, ప్రతాపశిఖిని, మాయునట్లు చేసి, తగన్, ఆర్చెను.

తా. అర్జునుఁడు తన యాటోపము దక్షాధ్వరమునందలి రుద్రుని విలాసమును అతిక్రమింపఁగాఁ గర్ణుని నలఁగించెను. కర్ణుఁడు నర్జునుని శౌర్యాగ్నిని మాపి యార్చెను.

వ. అంత. 223

క. మాననిధి జిష్ణుఁడు సుమి
త్రానందనుఁ డన్నపను పుంగదంచిత వృత్తిన్
మానసధృతిఁ బెనుపఁగ నరి
పై నడరి శరోగ్రవృష్టిఁ బఱఁగించెవడిన్. 224

రామాయణ భారతార్థములు సమము.

అర్థము. మాననిధి, [రామాయణ.] జిష్ణుఁడు = జయశీలుఁడైన, సుమిత్రానందనుఁడు = లక్ష్మణుఁడు, [భారత.] సుమిత్రులకు, ఆనంద

నుఁడైన, జిష్ణుఁడు = అర్జునుఁడు, అన్నపనుపు = [రామా. రామునాజ్ఞ భార. ధర్మజునాజ్ఞ,] ఉపంచిత=ఒప్పుచున్న, వృత్తిన్, మానసమందలి ధైర్యమును, పెనుపఁగన్, పెంచుటకు నన్నపంపు కారణమని భావము; అరిపైన్ = [రామా, ఇంద్రజిత్తునిపైన, భార. కర్ణునిపైన] శరముల, ఉగ్రమైన, వృష్టిన్, వడిన్, పఱఁగించెన్,

తాత్పర్యము సుగమము.

క. శరవర్ష మిట్లు గురియుచుఁ
బరఁగు మహాబలజయానుభావ స్థైర్య
స్ఫురణాఢ్యునతని నతఁడున్
సరభసనారాచవృష్టి సంవృతుఁ జేసెన్. 225

**రామాయణ భారతార్థములు సమము.**

అర్థము. ఇట్లు శరవర్షము, కురియుచున్ ; పరఁగునట్టి, మహా బలజయానున్ = హనుమంతుని వాహనము గాఁగలవానిని, భావము యొక్క స్థైర్యస్ఫురణముచే, ఆఢ్యుఁడగు వానిని, [భారత.] మహాబలము గల, జయముయొక్క, అను భావ స్ఫురణముచే, ఆఢ్యుఁడగువానిని, అత నిన్ అతఁడున్ = [రామా. ఆ లక్ష్మణు నింద్రజిత్తు, భార. ఆ యర్జును నా కర్ణుఁడు,] సరభసమైన, నారాచ = బాణములయొక్క, వృష్టిచే, సంవృతున్ = మూయఁబడినవానినిఁగా, చేసెన్.

తాత్పర్యము సుగమము.

వ. ఇట్లు దలపడి. 226

ఆ. సరిగఁబోరి రక్కజపు జోదులిరువురుఁ
గరియుఁగరియుఁ బోలె గడిదిలావు

గిరియుఁ గిరియుఁ బోలెఁ గెంటని తాల్మియు
హరియు హరియుఁ బోలె నదటు వ్రేకల. 227

**రామాయణ భారతార్థములు సమము.**

అర్థము. అక్కజపు జోదులగు, అయ్యిరువురు = [రామా. లక్ష్మణుఁడు నింద్రజిత్తును, భార. అర్జునుఁడు. కర్ణుఁడును,] కరియుఁ గరియుఁ బోలెన్ = ఏనుఁగు నేనుఁగునుం బోలియు, కడిఁది=కఠినమైన, లావునన్, గిరియుఁ గిరియుఁ బోలెన్, గెంటఁ, తాల్మియున్ = ఓర్పునన్, హరియుఁ హరియుఁ బోలెన్ = సింహమును సింహమునవలె, అదటు= గర్వము పొదలన్, సరిగన్, పోరిరి.

తాత్పర్యము సుగమము.

సీ. ఒండొరులసరోషహుంకృతిఁ గెలుచుచుఁ
గెరలితూఁపులవానఁ గురిసికురిసి
శరవృష్టిఁ బ్రత్యస్త్రసమితిచే నణుచుచు
నణికి పైనమ్ములు వఱపివఱపి
సాధనవికలతఁ సాధించి మించుచు
మించి నెమ్మేనుల నొంచినొంచి
దివ్యాస్త్రములు సాలఁ దెగువమై నేయుచు
నేసి నిష్ఫలమైన సేసిసేసి
తే. లలి నొక రొకళ్ల కడఁకల లక్ష్మణేంద్ర
జిత్తు లాభీలశౌర్యులై చిత్రరణము
సలిపి రొకరొకంతతడవు వాసవవిరోచ
నాత్మజుల సామ్యవిస్ఫూర్తి యావహిల్ల. 228

**రామాయణభారతార్థములు సమము.**

**రామాయణ.** [అర్థము.] లక్ష్మణేంద్రజిత్తులు = లక్ష్మణుఁడు నింద్ర జిత్తును, అభీలశౌర్యులై = భయంకరశౌర్యులై, వాసవవిరోచనాత్మజుల= ఇంద్రబలులయొక్క, సామ్యవిస్ఫూర్తి, ఆవహిల్లన్, [భారత] వాసవ విరోచనాత్మజులు = ఇంద్రసూర్య పుత్రులగు నర్జున కర్ణులు, అసామ్య = సాటిలేని, విస్ఫూర్తి, ఆవహిల్లన్, లక్ష్మణేంద్రజిత్ = లక్ష్మణునితోడను నింద్రజిత్తుతోడను, తుల = సమానమైన, అభీలశౌర్యులై, భయంకర పరాక్రమముగలవారలై, ఒండొరులన్, సరోషమగు, హుంకృతిచేన్, కెరలుచున్ = ఆగ్రహించుచు, కెరలి, తూపులవాన = శరవర్షము, కురిసె కురిసి, శరవృష్టిన్, ప్రత్యస్త్రముయొక్క, సమితిచేన్ = సమూహముచే, వఱువుచున్, నఱికి, పైన్ = ఒకరొకరిపైన్, అస్త్రములు, పఱపిపఱపి, సాధనవికలత = ఆయుధభంగము, సాధించి, మించుచున్ = మీఱుచును, మంచినెమ్మేనులన్, నొంచినొంచి, దివ్యాస్త్రములు, చాలన్, తెగువమైన్ = సాహసముతో, ఏయుచున్, ఏసి, నిష్ఫలమైనన్ = ఆయస్త్రములు వ్యర్థమైన, రేసిరేసి = విజృంభించి, లలిన్, ఒకరొకళ్లకడఁకలన్ = పరస్పరప్రయత్నముల, ఒకకొంతతడవు, చిత్రమైన రణము, చలిపిరి.

తాత్పర్యము సుగమము.

"వాసవవిరోచనాత్మజులు" అనుస్థలమున వాసవాత్మజ విరోచనాత్మజులనుటకు, "ద్వంద్వాంతే శ్రూయమాణం పదంప్రత్యేక మభిసంపద్యతే" అని ప్రమాణము.

వ. అంత. 229

ఆ. చతురశల్యరచిత సారథ్యయోగాధి
గతమదాతిశయునఖండధైర్యుఁ
బ్రతిభటుని వధించెఁ బ్రథితాజివిజయుండు
రాముతమ్ముఁడు సురరాజు మెచ్చ. 230

## రామాయణ భారతార్థములు సమము.

అర్థము. [రామాయణ.] చతుర....... అతిశయుఁ ; చతుర=సమర్థమయిన, శల్య = బాణప్రయోగముచే, రచితమైన, సారథియొక్క, అయోగ = వియోగమువలని, ఆధి = మనోవ్యథచే, గతమైన, మదాతిశయుని, [భారత.] చతురుఁడగు, శల్యునిసారథ్యయోగమువలని, ఆధిచే, గత, మదాతిశయుని; అఖండధైర్యుని, ప్రతిభటుని = [రామా. ఇంద్రజిత్తును, భార. కర్ణుని,] [రామాయణ.] ప్రథితమైన ఆజివిజయుండు, రాముతమ్ముఁడు = లక్ష్మణుఁడు, సురరాజు, మెచ్చఁ, [భారత.] ప్రథితమైన ఆజిగల, విజయుండు, అర్జునుఁడు, రాముతమ్ముఁడు, కృష్ణుఁడు, సురరాజును మెచ్చఁ, వధించెఁ.

తాత్పర్యము సుగమము.

సీ. అతిదుర్జయుం డైన ✽ ప్రతివీరునిట్లు రూ
పణఁచి యబ్బలుమగం ✽ డన్నకడకుఁ
జని మ్రొక్క నన్న రే ✽ శ్వరుఁ డెత్తి కౌఁగిటఁ
జేర్చి యానందవి ✽ జృంభణమునఁ
బరఁగె నామఱునాఁడు ✽ ప్రౌఢిమద్రవిభుండు
ప్రదళితబహువైరి ✽ పంక్తిగళుఁడు
సేనాని యైనను ✽ శివుఁ డైనఁ గేశవుఁ
డైన నెదిర్చి నా ✽ యస్త్రములకుఁ
తే. బ్రాణములు వెచ్చపెట్టక ✽ బ్రదికిపోవ
లేఁ డకట నాకు నరుఁ డేమి ✽ లెక్క యనుచుఁ
ధనకురుబలౌఘరక్షావి ✽ ధానమహిమ
గడఁకఁ బెనుపంగ నతనివె ✽ నడచిపోరె.

రామాయణ. అతిదుర్జయుండైన, ప్రతివీరుక్ = ఇంద్రజిత్తును; ఇట్లు, రూపణంచి = చంపి, అబ్బలుమగండు = ఆశూరవరేణ్యుఁడగు లక్ష్మణుఁడు, అన్నకడకుక్ = రామునొద్దకు, చని, మ్రొక్కక్, అన్నరేశ్వరుఁడు = రాముఁడు, ఎత్తి, కౌఁగిటక్, చేర్చి, ఆనందముయొక్క, విజృంభణమునక్, పరఁగెక్, ఆమఱునాఁడు, ప్రౌఢిమక్=ప్రౌఢిమగల, రవిభుండు = సూర్యునివంటి కాంతిగలవాఁడు, ప్రదళితమైన, బహువైరియగు, పంక్తిగళుఁడు = రావణుఁడు, సేనానియైనను, కుమారస్వామియైనను, శివుఁడైనక్, కేశవుఁడైనను = విష్ణువైనను, ఎదిర్చి, నాయస్త్రములకుక్, ప్రాణములు, వెచ్చపెట్టక =వ్యయపఱుపక, మరణింపక యనుట; బ్రదికిపోవఁగక్, లేఁడు, అకట, నాకుక్, నరుఁడు = మనుష్యుఁడు, ఏమిలెక్క, అనుచుక్, తనకుక్, ఊరు = అతిశయించిన, బలౌఘము యొక్క, రక్షావిధానమహిమ, కడఁకక్ = ప్రయత్నమును, పెనుపంగక్, అతనిపైక్ = ఆరామునిపై. నడచి, పోరెక్.

తా. లక్ష్మణుఁడింద్రజిత్తుంజంపి రామునొద్దకరిగి నమస్కరింప నాతఁడాతనిం గౌఁగిలించుకొనెను. మఱునాఁడు రావణుఁడు కుమారస్వామియైనను శివుఁడైనను, విష్ణువైనను నాబాణములకెదిర్చి బ్రదుకఁజాలరన నింక నీమనుష్యుఁడొక లెక్కలోనివాఁడాయనుచుఁ దనబలమును రక్షించుకొను ప్రయత్నమున రామునిపైఁ గదిసిపోరెను.

భారత. అతి దుర్జయుండైన, ప్రతివీరుక్ = కర్ణుని, ఇట్లు, రూపణంచి, అబ్బలుమగండు = వీరశ్రేష్ఠుఁడగు నర్జునుఁడు, అన్నకడకుక్ = ధర్మజుని సమీపమునకు, చని, మ్రొక్కక్, అన్నరేశ్వరుఁడు = ఆధర్మరాజు, ఎత్తి, కౌఁగిటక్, చేర్చి, ఆనందవిజృంభణమునక్, పరఁగెక్, ఆమఱునాఁడు, ప్రౌఢిక్ = దిట్టదనముచే, మద్రవిభుండు = శల్యుఁడు, ప్రదళితమైన, బహువైరిపంక్తులయొక్క, గళుఁడు = కంఠమునుగలవాఁడై,

సేనానియై = సేనాపతియై, ననుఁ, శివుఁడైనఁ, కేశవుఁడైనఁ, ఎదిర్చి = ఎదిరించి, నాయ స్త్రములకుఁ, ప్రాణములు వెచ్చపెట్టక బ్రదికిపోవలేఁడు = ప్రాణములు పోఁగొట్టుకొనక బ్రదికిపోవఁజాలఁడు, అకట, నాకుఁ, నరుఁడు = అర్జునుఁడు, ఏమిలెక్క, అనుచుఁ, తన యొక్క, కురుబలౌఘముల రక్షావిధానముయొక్క, మహిమ, కడఁకఁ = ప్రయత్నమును, పెనుపంగఁ, అతనిపైఁ = ఆధర్మజుని మీఁదికి, నడచి, పోరెఁ.

తా. అర్జునుఁడిట్లు కర్ణునింజంపి ధర్మజునొద్దకరిగి నమస్కరింప నాతఁడతనిని కౌఁగిలించుకొనెను. మఱి నాఁడు శల్యుఁడు శివకేశవులుగూడ నాయ స్త్రములందప్పి బ్రదుకఁజాలరికఁ నీయర్జునుఁడేమి లెక్కయని ధర్మజునిపైకివెడలి యుద్ధమాచరించెను.

వ. అప్పుడు.

గీ. ఆ నృపతిసైన్యమును గద ♦ నాతిలోలు
భానుజుల సద్భుజాశక్తిఁ ♦ బ్రాపుగఁ గొని
యాఁగెఁ దచ్ఛల్యతేజంబు ♦ నతనినొంచె
నని విరూపాక్షుఁ డనఁ బర్వ ♦ నతఁడుమెఱసి. 233

రామాయణ. ఆనృపతి = ఆరాముఁడు, సైన్యమును, కదన = యుద్ధమునందు, అతిలోలుఁ = భానుజుఁ = సుగ్రీవుని, లసత్ = ప్రకాశించు, [తన] భుజాశక్తిఁ, ప్రాపుగఁ = ఆధారముగా, కొని, తత్ = రావణుని, శల్య = బాణముల, తేజంబుఁ, ఆఁగెఁ = ఓర్చెను, అనిఁ, విరూపాక్షుఁడనఁ పర్వునతఁడు = విరూపాక్షుఁడు, మెఱసి, అతనిఁ = ఆ సుగ్రీవుని, నొంచెఁ.

తాత్పర్యము సుగమము.

భారత. ఆనృపతి = ధర్మరాజు, సైన్యమును, కదనమునందు, అతిలోలుభ = మిక్కిలి ప్రియులైన, అనుజుల = భీమాదుల, సత్ భుజాశక్తిఁ,

ప్రాపుగన్, కొని = గ్రహించి, తత్, శల్యుని, తేజంబున్, ఆఁగన్, అనిన్, విరూపాక్షుఁడు = రుద్రుఁడనన్ బర్వునతఁడు = శల్యుఁడు, మెఱసి, అతనిన్ = ధర్మజుని, నొంచెన్.

తాత్పర్యము సుగమము.

వ. ఇట్లు నొప్పించిన నిప్పులు గురియుకోపంబునం జూపుదీపింప
నా పరమశూరునాలోకించి. 234

ఆ. ఇతఁడు మామకాజి చతురతఁ దెగకపోఁ
డింకననుచు నాప్తులెల్లఁ జెలఁగ
మిపులఁ గనుకఁగెరలు రవిసూను నందను
భావ మపుడు వింతదై వెలింగె. 235

**రామాయణ.** ఇతఁడు = విరూపాక్షుఁడు, మామక = నాకుసంబంధించిన, అజిచతురతన్ = యుద్ధచాతుర్యమున, ఇంకన్, తెగక పోఁడు, అనుచున్, ఆప్తులెల్లన్ = ఆప్తులగు వానరాదులందఱును, చెలఁగన్, మిపులన్ కినుకన్ తెరలు = మిక్కిలి కోపోద్రిక్తుఁడగు, రవిసూను నందున్ = సుగ్రీవునందు, అనుభావము, అపుడు, వింతమై, వెలింగెన్,

తా. విరూపాక్షుఁడు, నాచేమరణింప కుండఁడని యాప్తులు చెలంగ మిక్కిలి కోపోద్రిక్తుఁడగు సుగ్రీవునను భావము విజృంభించెను.

**భారత.** ఇతఁడు = ధర్మరాజు, మామకున్ = మామమైన శల్యునకు, ఆజిచతురతన్, ఇంకన్, తెగకపోఁడు = సహసము చూపక పోఁడు, అనుచున్, ఆప్తులెల్లన్, చెలఁగన్, మిపులన్, కినుకన్, తెరలు, రవిసూనునందను = ధర్మజుని, భావము, అపుడు, వింతమై, వెలింగెన్.

తా. ఇతఁడు శల్యుని యుద్ధచాతుర్యమున సాహసము చూపక పోఁడని యాప్తులనఁగా ధర్మజుని భావము విజృంభించెను.

వ. అవ్వీరశార్దూలంబు పెద్దయుం బ్రొద్దుఁ దద్దయు నుద్దీప్త శౌర్యుండై. 236

క. అని సేసిచేసి యంతట
మనమునఁ గడుఁగెరలి యుద్ధమహిమాతులునిన్
ఘనుఁ బ్రతివీరు విరూపా
క్షునిశక్తిప్రౌఢిచేతఁ గూల్చె చెలంగెన్. 237

రామాయణ భారతార్థములు సమము.

అర్థము. అని, చేసి, చేసి, అంతటన్, మనమునన్, కడున్ గెరలి = మిక్కిలి విజృంభించి, [రామాయణ.] యుద్ధమహిమచే, అతులునిన్ = పాటిలేనివానిని, [భారత.] యుద్ధమహియందు, మాతులునిన్ = మేనమామ యగు శల్యుని, ఘనున్, ప్రతివీరున్, [రామాయణ.] విరూపాక్షునిన్, శక్తి = బలముయొక్క, ప్రౌఢిచేతన్ [భారత.] విరూపాక్షశక్తి ప్రౌఢిచేతన్ = రుద్రుఁడిచ్చిన శక్తియొక్క ప్రౌఢిచేత, కూల్చి, చెలంగెన్.

తాత్పర్యము సులభము.

క. పరదుస్సహాశల్య మహో
దర నాశన మాచరించి తమ సైనికులన్
గర మలరించినశౌర్య
స్ఫురితు నతనిఁబొగడి రుబ్బుచున్ హరిముఖ్యుల్. 238

రామాయణ భారతార్థములు సమము.

అర్థము. పరదుస్సహమైన, శల్య మహోదర నాశనము = [రామా. బాణములుగల మహోదరుని నాశమును, [భార.] శల్యుని పరాక్రమము వలని,

దరముయొక్క, భయముయొక్క యనుట ; నాశమును,] ఆచరించి, తమ సైనికులన్, కరము = మిక్కిలి, అలరించిన, శౌర్యముచే, స్ఫురితున్, అతనిన్ = [రామా. సుగ్రీవుని, భార. ధర్మజుని,] ఉబ్బుచున్, హరి ముఖ్యుల్ = [రామా. వానరముఖ్యులు, భార. కృష్ణాదులు] పొగడిరి.

తాత్పర్యము సుగమము.

తే. అంతఁ దద్భ్రాతృ పుత్ర బలాతిశయము
దనుమహాపార్శ్వ బలనాశమున నలఁచఁగ
నుడుకుచున్న దుర్యోధను నుగ్రమన్యు
దశముఖు నులూక శకునిపాతము గలంచె. 239

**రామాయణ.** అంతన్, తత్ = సుగ్రీవుని, భ్రాతృపుత్రుఁడగు నంగదుని, బలాతిశయము, తనున్, రావణుననుట; మహాపార్శ్వబలనాశమున, నలఁచఁగన్ = బాధింపఁగా, ఉడుకుచున్నట్టి, దుర్యోధనున్ = యుద్ధముచేయ శక్యముగాని, ఉగ్రమైన, మన్యున్, దశముఖున్ = రావణుని, ఉలూక = గూబలనెడి, శకుని = పక్షుల, పాతము, కలంచెన్.

తా. అంగదుఁడు మహాపార్శ్వుని జంపఁగ బాధపడుచుండిన రావణుని మానసమును గూబలపాటు కలంచెను.

"ఉలూక" "ఉలూకస్తు వాయసారాతిః" అమరము.

**భారత.** అంతన్, తత్ = ధర్మజుని, భ్రాతలయొక్కయుఁ, బ్రతివింధ్యాదులగుపుత్రులయొక్కయు, బల = ధృష్టద్యుమ్నాది సేనలయొక్కయు, అతిశయము, మహాపార్శ్వబల = గొప్ప పక్షబలముయొక్క, నాశమునన్, తనున్ = దుర్యోధనుని, నలఁచఁగన్, ఉడుకుచున్న, దుర్యోధనున్, ఉగ్రమైన, మన్యున్, దశ = కోపావస్థగల, ముఖున్, ఉలూకునియొక్కయు, శకునియొక్కయు, పాతము, కలంచెన్.

తా. భీమాదులచేతను, ప్రతివింధ్యాదులచేతను, ధృష్టద్యుమ్నాదులచేతను దన పక్షబలము నశింప దుఃఖించుచున్న దుర్యోధనుని చిత్తము నులూకునియొక్కయు ; శకునియొక్కయు పాటు మిక్కిలి కలఁతనందించెను.

సీ. ఆ దుష్టవర్తనుఁ డప్పటితుదకు ని
జానుజపుత్ర మిత్రాదులొకఁడు
మిడివోక కలనిలో మడియుట యూహించి
వగచుచున్నప్పుడు వైరినృపతి
ననుజవిభీషణోదగ్ర విక్రమసహా
యత విజృంభించు మహాప్రతాపుఁ
దలఁపడఁజాల నితాంతధైర్యంబుతో
నరిగె ద్వైపాయనహ్రదమతల్లి
తే. కాగతిని దన్నృపతిబల శ్రీకలంగ
నరిగి మునిఁగెఁ దత్కాండచయంబులోన
మునిఁగి యాఁగెను దనమేను మోయకుండ
దానిఁ దిరమైనవాస్తంభ ధర్మపటిమ. 240

రామాయణ. ఆ దుష్టవర్తనుఁడు = రావణుఁడు, అప్పటి తుదకున్ = కడకు, నిజ ; అనుజ, పుత్ర, మిత్రాదులు, ఒకఁడు = ఒక్కఁడును, మిడివోక = తప్పిపోవక, కలనిలోన్ = యుద్ధమున, మడియుట, ఊహించి, వగచుచున్, అప్పుడు, వైరినృపతిన్=రాముని, అనుజ=తమ్ముఁడగు లక్ష్మణుని, విభీషణుని, ఉదగ్రమగు, విక్రమముయొక్క, సహాయతన్ = తోడ్పాటున, విజృంభించునట్టి, మహాప్రతాపుఁడగు వానిని, తలపడన్ = ఎదుర్కొన, చాలన్, నితాంత = అధికమగు, ధైర్యంబుతోన్,

అరిగెఁ, ద్వైప = ద్వీప సంబంధమగు, అయన=స్థానముగల, ద్వీపసంబంధమగు మార్గము గల యనుట ; హ్రద మతల్లికా = మేలైన మడుపు యొక్క, గతిని, తత్ నృపతి=ఆ రాముని, బల శ్రీ = సేనలసింగారము, కలంగఁ, అరిగి = వెడలి, తత్ = ఆ రాముని, కాండచయంబులోనఁ = బాణసమూహములో, మునిఁగి, దానిఁ = ఆ కాండచయమును, తిరమై, నవ = నూత్నమైన, అస్తంభ = జడత్వవిహీనమగు, ప్రకాశించుచున్న యనుట ; ధర్మ = వింటియొక్క, పటిమచేఁ, మేను, మోయకుండఁ, ఆఁగెను = ఓర్చెను. అస్త్రములకుఁ బ్రత్యస్త్రము వేసెనని భావము.

తా. రావణుఁడు తన వారెల్లం బోఁటగాఁ జింతించి, లక్ష్మణ విభీషణులంగూడి విజృంభించు రాము నెదిరింప నాసైన్యమునం దూటి యాతని బాణ సమూహమున మునిఁగియు, నా బాణములు దన శరీరమునం బ్రవేశింపని లాగున నస్త్రములకుఁ బ్రత్యస్త్రము వేసెను.

భారత. ఆ దుష్టవర్తనుఁడు = దుర్యోధనుఁడు, అప్పటి తుదకుఁ= అంతవఱకును, నిజ, అనుజ = తమ్ములగు దుశ్శాసనాదులును, పుత్రులును, మిత్రాదులు = కర్ణాది హితులును, ఒకఁడు, మిడివోక, కలనిలోఁ, మడియుట=చచ్చుట, ఊహించి, వగచుచుఁ, అప్పుడు, వైరి నృపతిఁ = ధర్మరాజును, అనుజ......సహాయతఁ ; అనుజ = తమ్ములైన భీమాదుల యొక్క, ఉదగ్ర = అతిశయించిన, విక్రమ = పరాక్రమముయొక్క, సహాయతఁ = సాహాయ్యమున, విజృంభించినట్టి, మహాప్రతాపుని, తలపడఁ చాలని = ఎదురింపఁజాలని, తాంత = తగ్గిన, ధైర్యంబుతోఁ, ద్వైపాయన హ్రదమతల్లికిఁ = ద్వైపాయననామక హ్రదశ్రేష్ఠమునకు, ఆగతిఁ = ఆవిధమున, ఏకాకియై యనుట ; బలశ్రీ = బలసంపద, కలంగఁ, అరిగెను, అరిగి = అట్లు వెడలి, తత్కాండచయంబులోనఁ = ఆ మడుపు నీళ్లలో, మునిఁగి, దానిఁ = ఆ నీళ్లను, తిరమైన, వాస్తంభ

ధర్మపటిమన్ = జల స్తంభన విద్యాపాటవమున, తనమేను = తన శరీరము, మోయకుండన్ = స్పృశింపకుండ, ఆఁగెను.

తా. దుర్యోధనుఁడు దనవారెల్ల యుద్ధమున మరణించుటచే నసహాయుఁడై ధర్మజు నెదిరింపలేక ద్వైపాయన హ్రదమున కరిగి యా నీట మునిఁగి జల స్తంభన విద్యా విశేషమున నా నీరు తన శరీరము స్పృశింపకుండులాగున నుండెను.

"వా స్తంభ వృత్తి" ఇట విసర్గ లోపము శ్లేషార్థ సంఘటనకై కవి యంగీకరింపవలసెను. అదియు, "శర్పరే విసర్జనీయః" అను పాణిని సూత్రాధారమున సరియగు.

వ. అట్టి సమయంబున. 241

చ. అయమితభీమశక్తి విహితానుజపాతనుఁడై కృశించుచు
న్నయహతశోకుఁడమ్మనుజనాథుఁడుభీముమహావిపక్షు నెం
తయును విముక్తవిగ్రహు నొనర్చిసహోదరపీడకేఁ బ్రతి
క్రియయొనరించు టెట్టో యనుఖేదమునన్దురటిల్లెమిక్కిలిన్.

రామాయణ. అ...పాతనుఁడై ; అయమిత = అడ్డువెట్టఁ దగని, భీమమైన; శక్తి = శక్తియనెడి యాయుధముచే, హితమైన, అనుజ = లక్ష్మణుని, పాతనుఁడై = పడుట గలవాఁడై, కృశించుచున్, నయ = నీతిచే, హతమైన, శోకుఁడు, అమ్మనుజనాథుఁడు = రాముఁడు, భీమున్ = భయంకరుని, మహావిపక్షున్ = గొప్పశత్రువును, రావణు ననుట; విముక్త విగ్రహున్ = విడఁబడిన యుద్ధము గలవానినిగా, ఒనర్చి, రణభూమినుండి పాఱంద్రోలి యనుట; సహోదర = లక్ష్మణుని; పీడకున్, ఏన్, ప్రతిక్రియ = బదులు, ఒనరించుట, ఎట్టో, అను ఖేదమునన్ = దుఃఖమునన్, మిక్కిలిన్, దురటిల్లెన్ = శోకించెను.

తాత్పర్యము సుగమము.

**భారత.** అయమిత = అడఁపఁదగని, భీముని, శక్తిచే, విహిత = చేయఁబడిన, అనుజ = దుశ్శాసనాదుల, పాతనుఁడై, కృశించుచున్న, అహిత = అణఁగని, శోకుఁడు, అమ్మనుజనాథుఁడు = దుర్యోధనుఁడు, మహావిపత్తుల్, భీముల్ = భీముని, ఎంతయుల్, విముక్త = విడువఁబడిన, విగ్రహుల్ = శరీరము గలవానినిగా, ఒనర్చి = చేసి, చంపియనుట; సహోదర పీడకుల్ = సోదర మరణమునకు, ఏల్, ప్రతిక్రియ, ఒనరించుట, ఎట్లా, అను ఖేదమునల్, సోదర సంహారకుఁడగు భీముఁ జంపిననే యందులకుఁ బ్రతిక్రియ యగునుగాన నట్టి కార్యమొనర్చు టెట్లో యనుట; మిక్కిలిల్, దురటిల్లెల్.

సీ. అంతలావునఁ జేర్చి యనిలజుండు నిజాను
జప్రాణదానంబు సలిపి తనదు
మదిలోన మోదసంపదలు నించుచునుండ
నానృపాలుఁ డిటని యాత్మ నెంచె
ఘనశౌర్య ధైర్య విఖ్యాతిమిక్కిలి నివ
ర్తిలుచుండఁ బ్రదుకుమంతుల నగమును
మానుగ వినివారితతోనతాదోష స
త్త్వారూఢిని సమానుఁ డగుచుఁ దెచ్చె

తే. వంశమున కెల్లఁ గీర్త్యభావంబుమిగుల
నీతఁ డీతనితల్లి దా నెట్టివేళ
గనియెనోయని జగతిలో నమజనాథు
మెల్ల నవగుణాధికునిఁ గా నెన్నకున్నె ? 243

**రామాయణ.** అంత, లావునల్ = బలమున, పేర్చి, అనిలజుండు = హనుమంతుఁడు, నిజ, అనుజ = లక్ష్మణుని, ప్రాణదానంబు, చలిపి = చేసి, మూర్ఛదేర్చి యనుట; తనదు, మదిలోనల్, మోదసంపదలు = సంతోష

సంపదలు, నించుచుండఁగ = నిండించుచుండఁగా, ఆ నృపాలుఁడు = రాముఁడు, ఘనమైన, శౌర్యము యొక్కయు, ధైర్యము యొక్కయు, విఖ్యాతి = ప్రసిద్ధి, మిక్కిలిని=అధికముగా, వర్తిలుచుండఁగ, బ్రదుకుమందుల నగమును = సంజీవనౌషధిగల పర్వతమును, మానుగఁ, వినివారిత= మిక్కిలి వారింపఁబడిన, ఊనతాదోష = న్యూనత్వ దోషముగల, సత్త్వరూఢిని= బలాతిశయమున, సమానుఁడగుచుఁ = మాన సహితుఁడగుచు, తెచ్చెఁ, వంశమునకెల్లఁ = ఈతని వంశమునకంతయు, కీర్త్య=పొగడఁదగిన, భావంబునఁ, ఈతనిఁ=ఈ హనుమంతుని, తల్లి=అంజనాదేవి, తాఁ, ఎట్టివేళఁ, కనియెనో, అని, జగతిలోనను,=లోకమున, జనౌఘమెల్లఁ, నవ = మనోజ్ఞమయిన, గుణములయందు, అధికునిఁగాఁ, ఎన్నకున్నె= తలంపకుండునా, ఇట్లని, ఆర్మిఁ, ఎంచెఁ, తలఁచెను.

తా. హనుమంతుఁడు లక్ష్మణుని మూర్ఛఁదేర్ప సంజీవనౌషధిగల పర్వతముం దెచ్చెను. ఇతరజనులు "ఈతనితల్లి ఎట్టివేళ నీతనింగనెనో యని గుణాధికునిగా నెన్నకుండునే" యని తలఁచెను.

భారత. అంతలావునఁ, పేర్చి, అనిలజుండు = భీముఁడు, నిజ, అనుజ= దుశ్శాసనాదుల, ప్రాణ, దానంబు= ఖండనము, చలిపి, తనదు, మదిలోఁ, అమోద సంపదలు = దుఃఖాతిశయములు, నించుచుఁ, ఉండఁ, ఆ నృపాలుఁడు=ఆ ధుర్యోధనుఁడు, ఘనమగు, శౌర్య ధైర్యముల, విఖ్యాతి, మిక్కిలి, నివర్తిలుచుండఁగ=నివర్తింపఁగా, బ్రదుకునట్టి, మందులఁ=నిర్భాగ్యులను, నగఁ=నవ్వఁగా, మును=మున్ను, విని, వారితోన, తాఁ, దోషసత్త్వరూఢిని=బలిమియొక్క ప్రసిద్ధిచే, సమానుఁడగుచుఁ, ఇతఁడు, ధుర్యోధనుఁడు, కీర్త్యభావంబు, వంశమునకెల్లఁ, తెచ్చెఁ, తానొక్కఁడు చెడుట వొకవంశమునెల్ల నపకీర్తిచే ముంచెనని భావము; ఈతనిఁ, తల్లి = గాంధారి, ఎట్టివేళఁ, కనియెనో, అని, జగతిలోఁ,

నను౯=నన్ను, జనౌఘమెల్ల౯, అపగుణాధికునిఁగా౯, ఎన్నకున్నె, ఇట్లని యాత్మ నెంచె౯.

తా. భీముఁడు దన తమ్ములంజంపి తనకు దుఃఖము గల్గింపఁగా, దుర్యోధనుఁడు, లోకులు, 'దుర్బుద్ధినిం దన సోదరులతో సమానుఁడై వంశమున కపకీర్తిఁ దెచ్చిన యీతని నీతనితల్లి యెట్టివేళం గనెనో' యని దూషింతురని తలఁచెను.

“మంద.” మూఢాల్పపటు నిర్భాగ్యమందాః” అమరము.

ఉ. ఎంతయు నిబ్బరంబయిన యీహానుమద్బలయుక్తిఁ జేసి యేఁ
బంతము మీఱ ఘోరపరిపంథులఁ ద్రుంచుట యెప్పుడింక నా
ర్జింతునొకో సమీరసుతు చేఁతకు నీడుగఁ జేసి మేలు దు
స్స్వాంతుఁడు గాఁడితండను యశస్స్ఫురణంబు జగంబులోపల౯.

రామాయణ. ఎంతయు౯, నిబ్బరంబయిన, యీహనుమత్ = ఈ హనుమంతుని, బలముయొక్క, యుక్తి౯ చేసి = కూడికచే, ఏ౯, పంతము, మీఱ౯, ఘోర=క్రూరులైన, పరిపంథుల౯ = శత్రువులను, త్రుంచుట, ఈ హనుమంతుని బలముతో డ్పాటున నే నీ శత్రువులం ద్రుంచితి నని భావము; [ఇది భావేప్రయోగము.] సమీరసుతు = హనుమంతుని, చేఁతకు౯ = కార్యమునకు, ఈడుగ౯=సమానముగా, మేలు, చేసి, ఇతండు, దుస్స్వాంతుఁడు=దుష్టమనస్కుఁడు, కాఁడు, అను, యశస్సుయొక్క, స్ఫురణంబు, జగంబులోపల౯, ఇంక౯, ఎప్పుడు, ఆర్జింతునొకో.

తాత్పర్యము సుగమము.

భారత. ఎంతయు౯, నిబ్బరంబయిన, ఈ హాను = కోకచే; మ౯, బలయుక్తి౯ చేసి, ఏ౯=నేను, పంతము, మీఱ౯, ఘోరపరిపంథుల౯= త్రుంచుట=చంపుట, ఎప్పుడు, సమీరసుతు = భీముని, చేఁతకు౯, ఈడు

గాన్, చేసి, మేలు, ఇతండు = ఈ దుర్యోధనుఁడు, దుస్సాధ్యుండగుఁడు, కాఁడు, అను, యశస్స్ఫురణంబు=కీర్త్యతిశయము, జగంబు లోపలన్, ఇంకన్, ఎప్పుడు ఆర్జింతునో కో.

తాత్పర్యము సుగమము.

వ. అని తలపోయుచు రిపుజయ ప్రయతమాన మానసుండ య్యెనంత. 245

సీ. చలపట్టి తనుఁజంప ✤ సముచితోపాయ ప
ద్ధతి వెదకుచుఁ గని ✤ ధర్మరాజు
వెడలఁద్రోయఁగ నొండు ✤ వెరవులు చాలించి
తనవారి నిర్గమో ✤ద్ధతి పగఱకు
వెరఁగొనర్పఁగ లంక ✤విడిచి బెట్టిదపు బీ
రమ్మునఁ బఱతెంచి ✤ రాజరాజు
సయిదోడు సూడు బం ✤టయి మదనుజఘాతి
నినుమున్న డెగటార్తు ✤నని నరవరు

తే. భీముఁ దాఁకె నపూర్వసం ✤ భృత రణరస
భారులై యొండొరులఁదాఁక ✤ వారు గదల
బిరుసునెరప మండలగతిఁ ✤ దిరుగఁ గదుమ
నారదున కబ్బె వేడ్కౌఱ ✤నయనతుష్టి. 246

రామాయణ. చలపట్టి = మత్సరించి, తనున్, చంపన్, సముచిత మైన, ఉపాయముయొక్క, పద్ధతిన్, వెదకుచున్, ధర్మరాజు = యముఁడు, వెడలన్, త్రోయఁగన్=ఇల్లువెడలఁ ద్రోయఁగ, ఒండు, వెరవులు= ఉపాయములు, చాలించి, తనవారియొక్క, నిర్గమోద్ధతి, పగఱకున్, శత్రువులకు, వెరఁగొనర్పఁగన్=ఆశ్చర్యము నొనర్పఁగా, లంకన్, విడచి,

కెట్టిదపు=భీకరమైన, బీరంబునన్ = పౌరుషముచే, రాజరాజు=కుబేరుని, సయిదోడు=తమ్ముఁడగు రావణుఁడు, పఱతెంచి, సూడుబంటయి = విరోధము దీర్చుకొనువాఁడయి, మత్, అనుజ ఘాతిన్ = తమ్ముఁడైన కుంభకర్ణునిం జంపినవానిని, నినున్, మున్ను, తెగటార్తున్ = సంహరించెదను, అని, భీమున్= భయంకరుఁడైన, నరవరున్=రాముని, తాఁకెన్, అపూర్వసంభృత = మున్నెన్నఁడును లేనట్లు చక్కఁగా ధరింపఁబడిన, రణము నందలి, రసభారము గలవారై, ఒండొరులన్ తాఁకన్=పరస్పరము తాఁకఁగా, వారు = ఆ రామరావణులు, కదలన్, బిరుసు=క్రౌర్యము, నెరపన్, మండలగతిచే, తిరుగన్, కదమన్=వీఁగనొత్తఁగా, నారదునకున్, వేర్వేఱన్, నయనతుష్టి = కనులపండువు, అబ్బెన్.

తా. యముఁడు పట్టి త్రోయఁగా, రావణుఁడు లంక వెడలి పౌరుషముతోఁ బగదీర్చు కొనవెంచి, నాతమ్మునిం జంపిన నిన్నుమున్ను జంపెదనని రాముం దాఁకెను. ఇట్లు వారు పరస్పరము యుద్ధ మొనర్చు చుండ నారదుని రెండు కన్నులకును విందయ్యెను.

భారత. చలపట్టి, తనున్ = దుర్యోధనుని, చంపన్, సముచిత = తగిన, ఉపాయముయొక్క, పద్ధతి, వెదకుచున్, కని, ధర్మరాజు = ధర్మజుఁడు, వెడలఁ ద్రోయఁగన్, నిందా వాక్యము లాడి వెలికి వచ్చునట్లొనర్పఁగానని భావము; ఒండు వెరవులు చాలించి=నీటిలో దాఁగుట మున్నగు నట్టి ప్రాణరక్షకములగు నితరోపాయములు చాలించి, తనయొక్క, వారి = నీటినుండి, నిర్గమోద్ధతి ; పగఱకున్, వెరఁగొనర్పన్, ప్రాణరక్షణముగూడ ముఖ్యముగాఁ దలఁపక వెలికి వచ్చుట శత్రువుల కెంతయు నాశ్చర్యకరమయ్యెనని భావము ; కలంకవిడిచి = కలఁతవీడి, కెట్టిదమైన, బీరమ్మునన్, పఱతెంచి, రాజరాజు = దుర్యోధనుఁడు, సయిదోడుసూడు బంటయి = సోదరుల పగదీర్చుకొనువాఁడై, సోదరులం

జంపిన పగదీర్చుకొనువాఁడయియని భావము ; మఱి, అనుజఘాతిన్ = తమ్ముఁడైన దుశ్శాసనుని జంపిన, నినున్, మున్ను, తెగటార్తునని, నరవరున్, భీమున్ = భీమసేనుని, తాఁకెన్, వారు-ఆ భీమ దుర్యోధనులు, అపూర్వ సంభృతరణ రసభారులై, ఒండొరులన్, తాఁకన్, గదలన్, బిరుసు, నెరపన్, మండలగతిన్, తిరుగన్, గదుమన్ ; నారదునకున్, వెర్వేఱన్, నయన తుష్టి, అబ్బెన్ = కనుల పండువు గల్గెను.

తా. ఈసుపూనిన ధర్మరాజు ద్వైపాయన హ్రదమున దాఁగియుండు దుర్యోధనునిం బెక్కు నిందోక్తులం జాతరోషుం గావించి మడువునుండి వెలికి రావింప నాతఁడు నింక గత్యంతరము లేమి సాహసమునవచ్చి తన సోదర వధవలని పగదీర్చుకొనఁ దలఁచి భీముం దాఁకెను. ఇట్లు వారి పరస్పరయుద్ధక్రమము నారదుని నేత్రములు రెంటికిని విందయ్యెను.

గీ. పొసఁగ నేఁడుగదా రణభుక్తిదొరకె
నాకుఁ గనుదనియఁగ నని నారదుండు
సమ్మదముచెందఁ దిరమైనయమ్ములపస
నొండొరుల మించిపోరి రయోధవరులు. 247

## రామాయణ భారతార్థములు సమము.

అర్థము. పొసఁగన్, నారదుండు, [రామాయణ.] నేఁడు గదా = ఈ దినము కదా, నాకున్, కనుదనియన్ = కన్నులు తృప్తిపడులాగున, రణభుక్తి = యుద్ధభోజనము, [భారత.] నేఁడు గదా రణభుక్తి = గదా యుద్ధానుభవము, కను దనియఁగన్, దొరకెన్, అని, సమ్మదమున్ = సంతోషమును, చెందన్, [రామాయణ.] తిరమైన = స్థిరమైన, అమ్ములపసన్ = బాణకౌశలముచే, [భారత.] తిరమై, నయమ్ములపసన్ = నేర్పుపసన, ఒండొరులన్, మించి = మీఱి, అయోధవరులు, పోరిరి.

వ. ఇట్లుగడంగి మహాయుద్ధంబు సేయునంత. 248

ఉ. అంచితనైపుణింబరఁగుసనంబక ఘోరతరప్రయుక్తిచే
మించుగ దానవోద్ధతి సమృద్ధి గనంబడుచుండఁబోరుసాఁ
గించుచునుండ మానగుణకీర్తితురాజులరేనిఁజూచి శం
కించిరినమ్మరాదుమనగెల్పనుచుర్ హరిముఖ్యులెంతయుర్.

**రామాయణ.** అంచిత నైపుణిర్ = ఒప్పుచున్న కౌశలముచే, పరఁగు, అంబక = బాణములయొక్క, ఘోరతరమైన, ప్రయుక్తిచేర్ = ప్రయోగించుటవలన, దానవ = రావణుని, ఉద్ధతి యొక్క, సమృద్ధి, మించుగర్ = అతిశయించినదిగా, కనంబడుచుండర్, (ఈలాగున) పోరు, సాఁగించుచుండర్, మానగుణముచే, కీర్తితుర్ = పొగడఁబడు రాజులరేనిర్ = రాముని, చూచి, హరిముఖ్యులు = వానరశ్రేష్ఠులు, మన గెల్పు = మనపక్షమునందలి గెల్పు, ఎంతయుర్, నమ్మరాదనుచుర్, శంకించిరి.

తా. యుద్ధమున రావణునుద్ధతి యతిశయించుటచే వానరులు మనకు జయము గల్గుట సంశయమని శంకించిరి.

భారత. అంచిత నైపుణిర్, పరఁగు, అంబక = నేత్రములకు, ఘోరతరమైన, ప్రయుక్తిచేర్ = వ్యాపారమువలన, మించునట్టి, గదల యొక్క, నవమైన, ఉద్ధతియొక్క, సమృద్ధి, కనంబడుచుండర్ = కానఁబడులాగున, పోరు, సాఁగించుచునుండర్, మానగుణ కీర్తితుర్, రాజుల రేనిర్ = దుర్యోధనుని, చూచి = హరిముఖ్యులు = కృష్ణుఁడు మున్నగువారు, మన గెల్పు, ఎంతయుర్, నమ్మరాదనుచుర్, శంకించిరి.

తా. దుర్యోధనుని గదా యుద్ధకౌశలము మించుటచే గృష్ణాదులు మనకిఁక జయము సంశయమని శంకించిరి.

వ. తదనంతరంబ. 250

క. చేవచెదరి భీమాశుగ
దావహతి కృతోరుభంగతాపజ్వలితుం
డై విమతుఁడడఁగ; జయమున
వైవస్వతసంతతి నృపవర్యుఁడు మించెన్. 251

**రామాయణ.** చేవ = పస, చెదరి, భీమ=భయంకరమైన, అశుగ= బాణమనెడి, దావ=కార్చిచ్చుయొక్క, హతిన్ = కాల్చుటచే, కృత = చేయఁబడిన, ఉరు = గొప్పదగు, భంగ = అపజయము వలని, తాపముచేఁ జ్వలితుండై, రాముని బాణములం దన కపజయము గల్గుటచే నెంతయుఁ, దాపముగలవాఁడై యని భావము; విమతుఁడు=రావణుఁడు, అడఁగన్ = డీల్పడ, వైవస్వత సంతతినృప వర్యుఁడు = సూర్యవంశపు రాజైన రాముఁడు, జయమునన్, మించెన్.

తా. రామబాణ హతిని రావణుఁ డడఁగ రాముఁడు గెలుపున మించెను.

**భారత.** చేవ = ఉక్కు, చెదరి = చెడి, భీమ = భీమునియొక్క, ఆశుగదా అవహతిన్ = తీవ్రమైన గదయొక్క మొత్తుటచే, కృత, ఊరు భంగతా = తొడుయొక్క విఱుగుటగలవాఁడగుట యనెడి, ఆపత్ = ఆపదచే, జ్వలితుండై, విమతుఁడు = దుర్యోధనుఁడు. అడఁగన్, వైవస్వత సంతతి నృపవర్యుఁడు=యముని పుత్రుఁడగు ధర్మరాజు, జయమునన్, మించెన్.

తా. భీముని గదాహతిచే దుర్యోధనుఁడు తొడలు విఱిగి యడఁగఁగా ధర్మజుఁడు జయమున మించెను.

ఇట రామాయణార్థమున, 'దావహతి' యను నెడలఁగల దకారమునకును, 'తాపజ్వలిత', యను నెడల గల తకారమునకును వ్యంజన యతిచెల్లు

నట్లును; భారతార్థమున, 'గ, దావహతి' అను నెడల గదా+అవహతి యని యగుటచే నిచ్చట 'అకారమునకును' 'ఊరుభంగతా, ఆపత్, జ్వలిత' అను నెడఁగల ఆకారమునకును స్వరయతి చెల్లునట్లును, యతిస్థానమున, "భంగ+తాప; భంగతా + ఆపత్" అని విఱుఁగునట్లుం గూర్చి స్వరవ్యంజన యతులు రెంటికిం దగునట్లు చమత్కారముగాఁ గవిరచించెను.

"ఆపత్+జ్వలిత" యను నప్పుడు, "ఆపజ్జ్వలిత" యని జకార ద్విత్వ 'మననిచిచ" యను విభాషాసూత్రమునం గల్గుచున్నది.

గీ. భీష్మ గురుకర్ణ శల్య రణోష్మ నమర
ఘోరమగు యుద్ధమతనితో వైరి సలుప
ననుపమ ప్రౌఢిమం బది యేడుదినములైదు
రెండునొండు విఘ్నంబు లేకుండజరిగె. 252

రామాయణ. భీష్మ = భయంకరమైన, గురు = అధికమైన, కర్ణ శల్య = చెవులకు ములుకులవలె నుండు, రణ = ధ్వనియొక్క, ఊష్మన్ = ఉగ్రతచే, అమరఘోరమగు=దేవతలకుంగూడ భయంకరమగు, యుద్ధము, అతనితోన్ = రామునితో, వైరి = రావణుఁడు, చలుపన్, అనుపమ = సాటిలేని, ప్రౌఢిమంబు = ప్రౌఢిగల, అది = ఆ యుద్ధము, ఐదురెండు దినములు = ఏడుదినములు, ఒండు = ఇతరమైన, విఘ్నంబు, లేకుండన్, జరిగెన్.

తా. కర్ణకఠోరమగు ధ్వనితో దేవతలకుం గూడ భయంకర మగు యుద్ధము రామరావణుల కేడు దినములు జరిగెను.

భారత. భీష్మునియొక్కయు, గురు = ద్రోణునియొక్కయు, కర్ణుని యొక్కయు, శల్యుని యొక్కయు, రణ = యుద్ధమందలి, ఊష్మన్ = ప్రతాపమున, అమరన్, ఘోరమగు, యుద్ధము, అతనితోన్ = భీమునితో, వైరి=దుర్యోధనుఁడు, అనుపమమగు, ప్రౌఢిమన్, చలుపన్=జరు

పఁగా, పది, ఐదు, రెండు, ఒండు = ఒకటియు దినములు, క్రమముగ భీష్మాదుల యుద్ధము పదునెనిమిది దినములును ఒకవిఘ్నంబు లేక, జరిగెఁ.

తా. భీష్మునితోఁ బదిదినములును, ద్రోణునితో నైదు దినములును, కర్ణునితో రెండు దినములును, శల్యునితో నొక్క దినమును పాండవులకుఁ బోరు జరిగెను.

వ. అంత. 253

గీ. దిగ్వధూజాల ధమ్మిల్ల ధృతవిశుద్ధ
కీర్తి గురుసూనుఁడారాజు కృత్స్నబలని
వేశమారాత్రి చరగోత్రవిభునిలీలఁ
గలఁచె స్వాపహృతోరు విక్రమతఁగుంద. 254

అవతారిక. రాముఁడు రావణుని గలఁచెననునట్టియు, నశ్వత్థామ పాండవబలముం గలఁచెననునట్టియు నర్థముల జంటించి కవి పల్కుచున్నాఁడు.

రామాయణ. దిగ్వధూజాల = దిక్కులనెడి స్త్రీల సమూహము యొక్క, ధమ్మిల్ల = కొప్పులయందు, ధృతమైన, విశుద్ధ, కీర్తి = కీర్తి యనెడి, గురు = గొప్పదగు, సూనుఁడు = పుష్పము గలవాఁడు, ఆరాజు = రాముఁడు, కృత్స్న = సమస్తమైన, బలమునకు, నివేశము = స్థానమగు వాఁడై, ఆరాత్రి చరగోత్రవిభుని = ఆ రాక్షస వంశశ్రేష్ఠుఁడగు రావణుని, స్వ = తనచే, అపహృతమైన, ఉరు = గొప్పదైన, విక్రమతఁ = పరాక్రమము గల్గుటచే, కుందఁ, లీలఁ, కలఁచెఁ.

తాత్పర్యము సుగమము.

భారత. దిగ్వధువుల, జాల = సమూహముల, ధమ్మిల్లమున, ధృతమైన, విశుద్ధ, కీర్తి = కీర్తినిగలవాఁడు, గురుసూనుఁడు = అశ్వత్థామ, ఆరాజు =

ధర్మజుని, కృత్స్నమైన, బలనివేశము = స్కంధావారమును, ఆరాత్రి = దుర్యోధనుఁడు పడినరాత్రి, చర = సంచరించెడి, గోత్రవిభుని = హిమవంతుని, లీలన్ = రీతిని, స్వాప = నిద్రచే, వ్యాప్తమైన, ఉరు, విక్రమతన్, కుందన్, కలఁచెన్.

తాత్పర్యము సుగమము.

సీ. అలఘు దోఃప్రౌఢి మాతుల కృతవర్మ సా
హాయ్యకంబున నభేద్యాత్ముఁడగుచు
నప్పుడావీర యోధాగ్రణియుగ్రంపు
భల్లవర్షంబుల బలిమినమర
శత్రుమస్తకములసంఖ్యంబులై ధరఁ
గుంపులు వడుచుండఁగొట్టికొట్టి
యంతట నత్యమోఘాస్త్ర ప్రయోగుఁడై
యూర్జితబలు నుత్తమోజుఁ గృష్ణ

గీ. తనుభవుల సద్వరోదయంబున వెలిఁగెడు
సంగరకృతి ధృష్టద్యుమ్నుశాత్రవాను
పృథుఫణిశిఖండిఁ దెగటార్చిభీమవిజయ
దీప్తమహిమచేతను దీర్ణ తేజుఁడయ్యె. 255

అవతారిక. రాముఁడు రావణుని సంహరించు కథా భాగమును నశ్వత్థామ ప్రతివింధ్యాదులఁ జంపు కథా భాగమునుం జంటింపం బడియెను.

**రామాయణ.** అలఘు = తగ్గని, దోఃప్రౌఢిమ = బాహువీర్యమున, అతుల = సాటిలేనట్లు, కృత = చేయఁబడిన, వర్మసాహాయ్యకంబునన్ = కవచముయొక్క సహాయముచే, అభేద్యాత్ముఁ డగుచున్ = భేదింపరాని యాత్మగలవాఁడగుచు, అప్పుడు, ఆవీర యోధాగ్రణి =

రాముఁడు, ఉగ్రంపుభల్లవర్షముల బలిమిన్ = క్రూరబాణవర్షబలముచే, అమరశత్రు = రావణుని, మస్తకములు = శిరములు, అసంఖ్యంబులై = లెక్కలేనివై, ధరన్, గుంపులు పడుచుండన్, కొట్టికొట్టి, రాముఁడు తెగఁగొట్టినకొలఁది మరల మొలచుటచేఁ బడిన శీర్షములిట్లసంఖ్యాకములయ్యెనని భావము; అంతటన్, అత్యమోఘాస్త్రప్రయోగుఁడై = మిగులనమోఘమగు నస్త్రప్రయోగము గలవాఁడై, బ్రహ్మశిరోనామకాస్త్రప్రయోగముగలవాఁడైయనుట; ఊర్జిత = స్థిరమగు, బలున్, ఉత్తమమగు, ఓజన్ = తేజస్సుగలవాని, కృష్ణతనున్ = నల్లనిశరీరము గలవానిని, భవు = శివుని, లసత్ = ప్రకాశించు, వరముయొక్క, ఉదయంబునన్, వెలిఁగెడు, సంగరకృతి = యుద్ధకార్యమునందు, ధృష్టమైన, ద్యుమ్నున్ = శౌర్యముగలవానిని, శాత్రవులయొక్క, అసు = ప్రాణములనెడి, పృథుఫణి = గొప్పపామునకు, శిఖండి = నెమలియగువానిని, రావణుని; శత్రుప్రాణహరుఁడనుట; తెగటార్చి = చంపి, భీమ = గొప్పదగు, విజయముచే, దీప్తమైన, మహిమచేతన్, ఉదీర్ణ = ప్రసిద్ధమైన, తేజుఁడయ్యెన్.

తా. రాముఁడు బాణవర్షములచే రావణుని శిరములు ఖండించుకొలఁది మరల మొలుచుచుండ బ్రహ్మశిరోనామకాస్త్రముచే బలవంతుఁడగు నా రావణుని సంహరించి మిక్కిలి తేజశ్శాలి యయ్యెను.

"కృష్ణతనున్" ఇందులకు "మామరాశి ప్రతీకాశం" మ్మను రామాయణ వాక్యము ప్రమాణము. "పృథుఫణి శిఖండిఁ దెగటార్చి-భీమవిజయ" ఇట ఋత్వ సంబంధ వళియగును. పెద్దనయు, "ఇచ్చి యిష్టాన్న సంతృప్తులుగాఁ జేయు"నని ప్రయోగించెను.

భారత. అలఘు, దోఃప్రౌఢి = బాహుబలముగల, మాతుల కృతవర్మల, సాహాయ్యకంబునన్ = తోడ్పాటుచే, అభేద్యాత్ముఁడగుచున్, అప్పుడు, ఆవీరయోధాగ్రణి = అశ్వత్థామ, ఉగ్రంపు భల్ల వర్షంబుల

బలిమిన్, అమరన్ = ఒప్పుగా, శత్రువుల మస్తకములు, అసంఖ్యాంబులై, ధరన్, గుంపులు పడుచుండన్, కొట్టికొట్టి, అంతటన్, అత్యమోఘముగ, అస్త్రప్రయోగుఁడై = అస్త్రములం బ్రయోగించువాఁడయి, ఊర్జితమైన, బలున్ = బలముగల, ఉత్తమోజుని, కృష్ణ = ద్రౌపది యొక్క, తనుభవులన్ = కుమారులగు ప్రతివింధ్యాదులను, సద్వరోదయంబువలనన్, వెలిఁగెడు, సంగరమున, కృతిన్ = చతురుని, ధృష్టద్యుమ్నున్, శాత్రవుల యసువులకు, పృథుఫణిన్, శిఖండిన్, తెగటార్చి, భీమవిజయ = భీముని యొక్కయు, నర్జునుని యొక్కయు, దీప్తమైన, మహిమచేతను, దీర్ణ = పోమొత్తఁబడిన, తేజుఁడయ్యెన్.

తా. కృప కృతవర్మల సహాయులుగల యశ్వత్థామ శత్రువుల మస్తకముల లెక్కలేనట్లు బాణవర్షమునఁ బడఁ గొట్టి, యుత్తమోజునిం, బ్రతివింధ్యాదులం, ధృష్టద్యుమ్నుని, శిఖండినిం జంపి, తుదకు భీమార్జునుల బాహుబల మహిమను గతతేజుఁ డయ్యెను.

ఇట "గృష్ణ తనుభవుల" ననుట సాధ్య సమాసమగుచున్నది.

వ. అంత. 256

సీ. క్రీడాపరుండైన శ్రీపరుండిటులఁ దా
 త్రప్రక్రియను విజయప్రశక్తి
నిర్వహించుచు శత్రునిర్మూలనము సల్పి
 సొంపుమీఁ దనకును శుభపదవిక
లంకాధి రాజ్యవిలాస పట్టాభిషే
 కము స్వపురసూర్జితముగ నడప
వసుధనప్పుడు దానవ ప్రభుత్వవిశేష
 పృథుతర దీప్తివిభీషణుండు

గీ. తేజరిల్లెధర్మరాజితరక్షమా
పాలదుర్లభతరభాగ్యలక్ష్మి
నేఁడు గాఫలించెనెఱయ నస్మత్పూర్వ
సుకృత మద్భుతమనిసుజనులలర. 257

అవతారిక. విభీషణ ధర్మపట్టాభిషేక సందర్భము లు జంటించి కవి యాడుచున్నాఁడు.

**రామాయణ.** క్రీడాపరుండైన, శ్రీవరుండు = లీలామానుష విగ్రహుఁడైన విష్ణుఁడగు నారాముఁడు, ఇట్లు, క్షాత్రప్రక్రియను = క్షత్రియసంబంధ వర్తనచే, యుద్ధవ్యాపారమున ననుట; విజయ ప్రశక్తిన్ = విజయమునందలి సామర్థ్యమును, నిర్వహించుచున్, శత్రునిర్మూలనము, సల్పి, సొంపుమైన్ = మనోజ్ఞముగా, తనకును, విభీషణునకనుట; శుభపదవిక = శుభమైన మార్గముగల, లంకాధిరాజ్యవిలాస = లంకా సామ్రాజ్య విలాసమునకు, పట్టాభిషేకము, స్వ = తనకును, పురః = ముందరికిని, స్ఫూర్జితముగన్ = స్థిరమగునట్లు, తనకును దనయనంతరము వారికిని స్థిరముగా నుండునట్లని భావము; నడపన్, అప్పుడు, దానవ ప్రభుత్వ విశేషముచేత, పృథుతర = మిక్కిలి యధికమయిన, దీప్తి = తేజముగల, విభీషణుఁడు, ధర్మముచే, రాజితమైన, రక్షన్ = రక్షణమున, మాపాలన్ = మాయెడ, దుర్లభతరమగు,భాగ్యలక్ష్మి, వసుధన్, నెఱయన్, నేఁడుగాం ఫలించెన్, ఈవఱకు రాక్షసులయెడ దుర్లభముగ నుండిన ధర్మపరిపాలనము నేఁడు ఫలించెననుట; అస్మత్, పూర్వసుకృతము, అద్భుతము, అని, సుజనులు = సత్పురుషులు, అలరన్ = సంతసింపఁగా, తేజరిల్లెన్ = ప్రకాశించెను.

తా. శ్రీరాముఁడు శత్రువిజయముసల్పి విభీషణునకు లంకారాజ్య పట్టాభిషేకము గావింప దానవులయెడ దుర్లభమగు ధర్మపరిపాలనము నేఁడు ఫలించెనని వారు సంతసింప నావిభీషణుఁడు దేజరిల్లెను.

భారత. క్రీడాపరుండైన, శ్రీ వరుఁడు=కృష్ణుఁడు, ఇట్లు, క్షాత్ర=క్షత్త్రసంబంధమైన, ప్రక్రియను, సారథ్యవర్తనచే ననుట; విజయ = అర్జునుని, ప్రశక్తిన్ = అధికమైన బలమును, నిర్వహించుమన్, శత్రు నిర్మూలనము సల్పి, సాంప్రమైన్, తనకును, ధర్మజునకనుట; శుభపద= శుభమునకు స్థానమైన, వికలంక= కళంకరహితమైన, అధిరాజ్య విలాస పట్టాభిషేకము= సామ్రాజ్య విలాసమునకుఁ బట్టాభిషేకము, స్వపుర= తన నగరమగు హస్తినయందు, స్ఫూర్జితముగన్, నడపన్, వసుధన్, అప్పుడు, తాన్ = ధర్మరాజు, నవ ... విభీషణుండు; నవ=నూతనమైన, ప్రభుత్వమునందలి, విశేషములని, పృథుతర దీప్తిన్=మిక్కిలి యధికమయిన తేజముచే, విభీషణుండు = భీకరుఁడు, ధర్మరాజు, ఇతర క్షమాపాలురకు దుర్లభతరమైన, భాగ్యలక్ష్మి, నేఁడు గా, నెఱయన్, ఫలించెన్ = ఈ దినముగదా పూర్ణముగా, ఫలించెను, అస్మత్, పూర్వసుకృతము, అద్భుతమని, సుజనులు, అలరన్, తేజరిల్లెను.

తా. కృష్ణుఁడు నిజసారథ్య వర్తనమున నర్జునునిబలము నిర్వహించి శత్రునాశముగావించి ధర్మజుని హస్తినాపురమున సామ్రాజ్య పట్టభద్రుంగావింప సుజనులన్యరాజదుర్లభమగు భాగ్యలక్ష్మి నేఁడు పూర్ణముగా ఫలించెనని సంతసింప నా ధర్మజుఁడు దేజరిల్లెను.

"క్షాత్ర ప్రక్రియను;" అనఁబడయను సూత్రమున నిట, తకార ద్విత్వము గాగను.

తే. విష్ణుముఖ్యావతారమై వెలయువిశ్వ
విభుఁడు ననలసహార్ద ప్రవేశమహిమ
కతనఁ దనచెల్వమతిశుద్ధిఁగాంచి యమర
వినుతి మిగులఁజేకొని యేఁగెఁ దనదుపురికి. 258

**రామాయణ.** విష్ణువుయొక్క ముఖ్యావతారమై వెలయునట్టి, విశ్వ విభుఁడు= రాముఁడు, అనల = అగ్నియందు, సహర్ష = సంతోషముతోఁ గూడునట్లు, ప్రవేశ=చొచ్చుటయొక్క, మహిమ కతనన్, తన, చెల్వ= సీతయొక్క, మతిశుద్ధి= మనశ్శుద్ధిని, కాంచి, అమర= దేవతల, వినుతి, మిగులన్, చేకొని= గ్రహించి, తనదు పురికిన్= అయోధ్యకు, ఏఁగెన్.

తా. అగ్నిప్రవేశము కతమున సీత మనశ్శుద్ధిం గాంచి దేవతలు నుతించునా పొగడ్తల నందె రాముండయోధ్య కరిగెను.

**భారత.** విష్ణు ముఖ్యావతారమై, వెలయునట్టి = ప్రకాశించునట్టి, విశ్వవిభుఁడు = జగదీశ్వరుఁడగు శ్రీకృష్ణుఁడు, అనలస = అల్పుఁడుగాని, హర్షముయొక్కయు, ప్రవేశముయొక్కయు, మహిమకతనన్, తన చెల్వము=విలాసము, అతిశుద్ధిన్, కాంచి, అమరన్, వినుతి=ధర్మజాదుల పొగడ్తలను, మిగులన్, చేకొని, తనపురికిన్=ద్వారకకు, ఏఁగెన్.

వ. అట్లేఁగియుచితభంగి నంగీకృత సకలసామ్రాజ్య భోగవిలా విశేషుండయ్యె నప్పుడు 259

క. శాంతనవప్రోక్తవిలాసా
త్యంత సుశిక్షిత సమస్తధర్మతఁ జేసెన్
శాంతిఘనుఁడు వైవస్వత
సంతతినృపశేఖరుఁడు ప్రజాపాలనమున్. 260

**రామాయణ.** శాంతిచే ఘనుఁడైన, వైవస్వతసంతతి నృపశేఖరుఁడు = సూర్య వంశమునంబుట్టిన రాముఁడు, శాంత...ధర్మతన్; శాంతమైన, నవ=మనోజ్ఞములైన, ఉక్తివిలాస = అగస్త్యాది మహర్షుల వచోవిలాసములచే, అత్యంత శిక్షిత=లెస్సగాఁ దెలియఁబడిన, సమస్తధర్మతన్= సర్వధర్మములు గలవాఁడగుటతో, ప్రజాపాలనమున్, చేసెన్.

తాత్పర్యము సుగమము.

**భారత.** శాంతనవ=భీష్మని, ఉక్తి విలాసముచే, అత్యంత శిక్షిత మైన, సమస్త, ధర్మతః= ధర్మము గలవాఁడగుటచే, శాంతిఘనుఁడైన, వైవస్వతసంతతి=యమ నందనుఁడగు, నృపశేఖరుఁడు = ధర్మరాజు, ప్రజా పాలనముఁ, చేసెఁ.

తాత్పర్యము సుగమము.

వ. ఆసమయంబునందు. 261

ఆ. మానిపదవిసృష్ట మహితనయోత్పన్న
కుశలవసుసమృద్ధి వశతనొదవు
కొదవలెల్లఁ దీర్చుకొని యవ్విభుండు గా
వించె నశ్వమేధవిధులు వెలయ. 262

**రామాయణ.** మానిపద=వాల్మీకి యాశ్రమమున, విసృష్ట=విడువఁ బడిన, మహితనయా= సీతకు, ఉత్పన్న= కలిగిన, కుశలవులయొక్క సుస మృద్ధి వశతఁ, ఒదవుపట్టి, కొదవలెల్లఁ,తీర్చుకొని, అవ్విభుండు=ఆ రా ముఁడు, అశ్వమేధవిధులు, వెలయఁ=ప్రకాశింపఁగా, కావించెఁ.

తాత్పర్యము సుగమము.

**భారత.** మానిపదవిసృష్ట= వ్యాసుని వాక్యమున నీయఁబడిన, మహిత= శ్రేష్ఠమైన, నయ=నీతిచే, ఉత్పన్నమైన, కుశల= క్షేమకరమైన, వసు= ధనముయొక్క, సమృద్ధి వశతఁ, ఒదవు, కొదవలెల్లఁ, తీర్చు కొని, అవ్విభుండు=ధర్మజుఁడు, అశ్వమేధముయొక్క విధులు, వెలయఁ, కావించెఁ.

తాత్పర్యము సుగమము.

సీ. శ్రీ ధాన్యకటకమై చెలువొందె రాష్ట్రంబు
 నెలమూఁడువానలు నిండఁగురిసెఁ
బాఁడినిబంటలఁ బ్రజలు విజృంభించి
 రరిపదవ్యుత్పత్తి యస్తమించె
రోగాపమృత్యువార్తాగంధ మెడలెను
 జారచోరాదుల పేరునుడిగె
వర్ణాశ్రమాచార వర్తనల్గడు నొప్పె
 ధర్మంబు నాల్గుపాదముల నడచె
తే. రామభద్రుండు సన్మార్గరక్షణైక
పరుఁడు దిగవతంసితకీర్తి పాండుసూనుఁ
డుర్విపైఁ జతురాత్మానుజోపచరిత
చరణుఁడగుచు సామ్రాజ్యంబు సలుపునపుడు. 263

అవతారిక. ఈ పద్యమున సీసము నాల్గుపాదములను రామాయణ భారతార్థములు సమము. ఎత్తుగీతిని మాత్రము శ్లేషయగును.

అర్థము. రాష్ట్రంబు = రాజ్యము, శ్రీ = సంపదయొక్కయు, ధాన్యముయొక్కయు, కటకమై = ప్రోవులు గలదై, చెలువొందెన్, నెల మూఁడువానలు, నిండన్, కురిసెన్, ప్రజలు = జనులు, పాఁడిని = క్షీరసమృద్ధిచేతను, పంటలన్, విజృంభించిరి, అరిపదవి = శత్రుస్థానముల యొక్క ఉత్పత్తి, అస్తమించెన్, రోగ, అపమృత్యు = అకాలమరణముయొక్కయు, వార్తాగంధము, వార్తాలేశమైన ననుట; ఎడలెను = నశించెను, జారచోరాదులయొక్క పేరును, ఉడిగెన్ = నశించెను, వర్ణాశ్రమాచారవర్తనల్ = బ్రాహ్మణాదివర్ణములయొక్కయు, బ్రహ్మచర్యాద్యాశ్రమములయొక్కయు, నాచారవర్తనలు, కడున్ = మిక్కిలి, ఒప్పెన్, ధర్మంబు, నాల్గుపాదములన్, పూర్ణముగా ననుట; నడచెన్.

**రామాయణ.** సన్మార్గమును, రక్షణ = రక్షించుటయందు, ఏక
పరుఁడు = ముఖ్యాసక్తుఁడు, దిక్ అవతంసిత = దిక్కులచే, శిరో
భూషణముగా నొనర్పఁబడిన, కీర్తి పాండుసూనుఁడు = కీర్తియనెడి
తెల్లనిపువ్వుగలవాఁడు, రామభద్రుఁడు, ఉర్వీపయిన్, చతురులైన,
ఆత్మ = తనయొక్క, అనుజ = తమ్ములచే, ఉపచరిత = ఉపచరింపఁబడిన,
చరణుఁడు = పాదములుగలవాఁడు, అగుచున్, సామ్రాజ్యంబు సలుపు
నప్డు, రాష్ట్రంబు శ్రీ ధాన్య కటకమై చెలువొందెనను వానితో
నన్వయించును.

**భారత.** రామభద్రుండు = ఒప్పుచున్న శుభముగలవాఁడు, సన్మా
ర్గమునయొక్క, రక్షణమునందు, ఏకపరుఁడు, దిక్కులచే, అవతంసితమైన
కీర్తిగలవాఁడు, పాండుసూనుఁడు = పాండురాజు కుమారుఁడగు ధర్మ
జుఁడు, ఉర్వీపయిన్, చతుః = నాల్గైన, ఆత్మానుజ = తనతమ్ములచే,
ఉపచరిత = సేవింపఁబడిన, చరణుఁడు, అగుచున్, సామ్రాజ్యంబు సలుపు
నపుడు, రాష్ట్రము శ్రీ ధాన్య కటకమై చెలువొందెనను వానితో నన్వ
యించును.

తాత్పర్యము సుగమము.

శా. దేవా దేవర ప్రేరణంబునన యుద్దీపించువాగ్వైభవ
శ్రీవిస్ఫూర్తిని రామభారత కథాశ్లేష ప్రబంధోత్తమ
వ్యావిర్భావము నిట్లు సెందె నిది భవ్యాభవ్యతలూనెడ కిం
పై వర్తిల్లఁ బరిగ్రహింపుము విరూపాక్షా జగద్రక్షకా.

**అవతారిక.** కవి స్వరచిత గ్రంథమును కృతిపతియగు విరూపాక్ష
దేవుని, గ్రహింపుమని ప్రార్థించుచున్నాఁడు.

**అర్థము.** దేవా, జగద్రక్షకా, విరూపాక్షా, దేవర ప్రేరణంబునన్ =
మీ ప్రేరణచేత, ఉద్దీపించు = ప్రకాశించు, వాక్ వైభవ శ్రీ విస్ఫూ

_రికే = వైదుష్య విభవాతిశయమున, రామభారత కథాశ్లేష ప్రబంధో
త్తమ = రామాయణ భారతకథలయొక్క, జోడింపుగల కావ్యశ్రేష్ఠము
యొక్క, వి ఆవిర్భావము = విశేషమైన సంభవము, పుట్టుక యనుట;
[" ఇకో యణచి " అను సూత్రమున నిట " వ్యావిర్భావమని యయ్యె
ను.] ఇది = ఈ యావిర్భావము, ఇట్లు చెందెక = ఇట్లేర్పడెను, భవ్యా
భవ్యతల్ చూడక = దీనియందలి మంచిచెడుగుల భావింపక, ఇంపై
వర్తిల్లక, పరిగ్రహింపుము, నీ ప్రేరణచే నుత్పన్నమైనది కావున నీవే పరి
గ్రహింపఁదగియునని భావము.

తా. ఓ విరూపాక్ష దేవా మీ ప్రేరణచేఁ గల్గిన వైదుష్య విభవాతి
శయమున నేర్పడిన రామాయణ భారతకథల జోడింపుగల యీ గ్రంథము
నందలి మంచిచెడుగుల భావింపక దీనిం బ్రీతితో నీవు గ్రహింపుము.

శా. క్రీడామాత్రకృతత్రిమూర్తి భరణాంగీకార! చూడాపరి
భ్రాడాదిత్యధునీపృషత్పుషిత పంపాశైత్య! వేధోమరు
ద్రాడారాధితపాద! యంఘ్రినఖచంద్రద్యోతసిద్ధ్యత్పరి
వ్రాడాఖండల మండలీహృదయజీవంజీవసంజీవనా. 265

అవతారిక. ఈ పద్యమందును ముందుపద్యమునందును, గవి కృతి
పతి యగు విరూపాక్షదేవుని వర్ణించుచున్నాఁడు.

అర్థము. క్రీడామాత్రముచే, కృతమైన, బ్రహ్మ విష్ణు శివాత్మకమగు
మూర్తిత్రయముయొక్క, " మధ్యే విరించి గిరిశం ప్రథమావతారః "
అనులాగున భగవంతుని ప్రథమావతారముయొక్క యనుట; భరణ =
ధారణముయొక్క, అంగీకార = అంగీకారము గలవాఁడా, చూడా...
శైత్య; చూడా పరిభ్రాట్ = శిఖయం దొప్పుచున్న, ఆదిత్యధునీ
పృషత్ = దేవనదియగు గంగయొక్క బిందువులచే, పుషిత పంపాశైత్య=
పోషింపఁబడిన పంపానదియొక్క చల్లదనము గలవాఁడా, వేధః మరు

ద్రాట్ ఆరాధితపాద = బ్రహ్మచేతను, దేవేంద్రునిచేతను సేవింపఁబడిన పాదములు గలవాఁడా, అంఘ్రి...సంజీవనా; అంఘ్రి = పాదములయం దలి, నఖ = గోళ్లనెడి, చంద్ర = చంద్రుఁడను, ద్యోత = ప్రకాశముచే సిధ్యత్ = సిద్ధించుచున్న, పరివ్రాడాఖండల = యతీంద్రులగు బ్రహ్మర్షులయొక్క, మండలీహృదయ = సమూహముల మానసములనెడి, జీవంజీవ = వెన్నెల పులుఁగులకు, సంజీవనా, జీవనమగు వాఁడా.

తా. లీలామాత్రమున మూర్తిత్రయము ధరించువాఁడా, శిరస్స్నానం గల గంగా బిందు సంపృక్త పంపాశైత్యము గలవాఁడా, బ్రహ్మేంద్రవందిత పాదములు గలవాఁడా, పాదనఖములనెడి చంద్రకాంతిచే సిద్ధించుచున్న బ్రహ్మర్షులనెడి చకోరములకు సంజీవన మగువాఁడా.

"జీవం జీవ;" జీవనేన సహచరేణ క్రీడన్ జీవతి జీవం జీవః.

క. కారుణ్య విభవలక్ష్మీ
తారుణ్య సదోప భోగధన్య కటాక్షా
శారీరార్ధ సులాలిత
గౌరీ రారజ్యమాన కమ్రాపేక్షా. 266

అర్థము. కారుణ్య...కటాక్షా; కారుణ్యవిభవలక్ష్మీ = కరుణాతిశయ సంపదయనెడి, తారుణ్య సదోపభోగ = యౌవనముయొక్క నిత్యానుభవముచేత, ధన్యకటాక్షా = కృతార్థమైన కటాక్షము గలవాఁడా, కటాక్షమునకుఁ గారుణ్యమే తారుణ్యమగునని భావము; శారీరా... కమ్రాపేక్షా; శారీరార్ధ సులాలిత = అర్ధశరీరముచేఁ జక్కఁగా లాలింపఁబడిన, గౌరీ రారజ్యమాన = పార్వతిచే మిక్కిలి రంజింపఁబడువాఁడగుచు, కమ్రాపేక్షా = మనోజ్ఞమయిన యపేక్ష గలవాఁడా. కమ్రాపేక్షకు గౌరీరారజ్యమానత కారణమగునని భావము.

తా. కారుణ్య లక్ష్మియనెడి యానవోపభోగమున ధన్యమయిన కటాక్షము గలవాఁడా, అర్ధశరీరమగు గౌరిచే రంజింపఁ బడుమ మనో జ్ఞమగు నపేక్ష గలవాఁడా.

"రారజ్యమాన;" "రాజృదీప్తౌ" అను ధతువుపై యఙ్గుగంత ముసఁ గర్మార్థమున 'యిక్' శానచ్ ప్రత్యయమయ్యెను.

కలహంసవృత్తము. హిమనగాద్రి తన । యేక్షణ లక్ష్మీ
స్థిమిత పుణ్యఫల । దేహ విలాసా
విమలభ క్తి పెద । వేంకట ధాత్రీ
రమణమానస ని । రంతరవాసా. 267

గద్యము. ఇది నిఖిలసూరి లోకాంగీకార కవిత్వ వైభవ
యమరనార్య తనూభవ, సౌజన్యజేయ, సూరయ
నామధేయ ప్రణీతంబయిన, రాఘవ పాండవీయం
బునందు సర్వంబును జతుర్థాశ్వాసము.

అవతారిక. ఈ పద్యముచేఁ గవి ప్రత్యక్ష నియామకుఁడగు పెద వేంటాద్రి ప్రభువునుఁగూడఁ జేర్కొనుచు, విరూపాక్షస్వామిని వర్ణించు చున్నాఁడు.

అర్థము. హిమన...విలాసా; హిమనగాద్రి తనయా=హిమవంతుని తనయయగు పార్వతియొక్క, ఈక్షణలక్ష్మీ = చూపులనెడి లక్ష్మిచేత, స్థిమిత=కదలని, పుణ్యఫలమైన, దేహవిలాసా=శరీరవిలాసము గలవాఁడా, విమల...వాసా; విమలభక్తి=నిర్మలభక్తిగల, పెదవేంకట ధాత్రీరమణ= పెదవేంకటరాజుయొక్క, మానస = మనస్సునందు, నిరంతరవాసా = సదావాసము గలవాఁడా.

తా. పార్వతీచూపులకుఁ బుణ్యఫలమగు దేహవిలాసము గల వాఁడా, నిర్మలభక్తిగల పెదవెంకటరాజా మానసమున నిత్యవాసము సేయు వాఁడా.

పై మూఁడుపద్యములు నాశ్వాసాంతరూపములు. వీనికి గ్రంథముతో నెట్టి సంబంధమును లేదు.

గద్యము. ఇది శ్రీ హయగ్రీవ కరుణాలబ్ధ సారస్వతసారోభయ
భాషా కవిత్వతత్వజ్ఞ, చెన్నపురీ విశ్వవిద్యాలయ సమాసాదిత
విద్వద్బిరుదాంచిత, కవికులతిలక, భారద్వాజ
గోత్ర పవిత్ర, శ్రీ శ్రీనివాసార్యతనూజ,
మంగమాంబా గర్భశుక్తి ముక్తాఫల,
భాష్యకార కవి విరచితంబైన,
కవిభావ ప్రకాశికా సమా
ఖ్యంబగు రాఘవపాండ
వీయ వ్యాఖ్యయందు
సర్వంబును
జతుర్థాశ్వాసము,
సంపూర్ణము.



…d at the Ananda Press, Madras.